# ఉద్యమ దర్శనము

## (ఆధునికాంధ్ర కవిత్వముపై వివిధ ఉద్యమముల ప్రభావము)

డాక్టరేటు పట్టమునకై సమర్పించిన సిద్ధాంత గ్రంథము

**డాక్టర్ ముదిగొండ శివప్రసాద్**
ఎం.ఎ., పిహెచ్.డి



**రసగంగోత్రి**
**2-2-647/132.బి, సెంట్రల్ ఎక్సైజ్ కాలనీ,**
**హైదరాబాదు - 500 013 (ఆం. ప్ర.)**

**UDYAMA DARSANAMU**

**(A Doctoral Thesis)**

**Dr. MUDIGONDA SIVAPRASAD.**
M A , Ph.D.

ఉద్యమ దర్శనము

(డాక్టరేటు - సిద్ధాంత గ్రంథము)

**డాక్టర్ ముదిగొండ శివప్రసాద్**

రసగంగోత్రి ప్రచురణలు



ప్రథమ ముద్రణ

ప్రమోదూత - ఉగాది

**March – 1990**

1000 ప్రతులు :

**వెల : *150/-***

(నూట ఏబది రూపాయలు)

పుటలు : ఐదువందలు

ముద్రణ :

**శ్రీ లక్ష్మీ వేంకటేశ్వర పవర్ ప్రెస్**

హిమాయత్‌నగర్, హైదరాబాదు-29

ముఖచిత్రం డిజైన్,

**శ్రీ భాగవతుల ఉదయశంకర్**

చైతన్య ఫొటో గ్రాఫిక్స్,

హైదరాబాదు - 500 018

ప్రతులకు :

**శ్రీమతి యం. ఉమాదేవి**

2-2-647/132.B,

సెంట్రల్ ఎక్స్టెన్షన్ కాలనీ,

హైదరాబాదు - 500 013 (ఆం. ప్ర.)

---

తెలుగు విశ్వవిద్యాలయమువారి ఆర్థిక సహకారము (7500-00) తో ముద్రితము

# భూమిక

## I

సాహిత్యమును సమాజము ప్రభావితమొనర్చును. సమాజమును సాహిత్యము పరివర్తన మొనర్చును. ఈ రెండింటి సంబంధమును అన్యోన్యము, అవిభాజ్యము, సార్వదేశికము- సార్వకాలికము. వేయేండ్ల తెలుగు సాహిత్యమును ఇందులకు లక్ష్యప్రాయమే. తెలుగేమి, తమిళమేమి, కన్నడమేమి సమస్త ప్రాచ్య పాశ్చాత్య వాఙ్మయములన్నింటిని ఈ సిద్ధాంతముతో వింగడింపవచ్చును. జాతి పన్నిటికి కన్నిటికి కవి హృదయము స్పందించును. కవి భావ తీవ్రత ఉద్యమమై తరంగమత్తై పెనుతుఫానులై సమాజమును కదిలించివేయును. ఇద్ధాక నిత్యసత్యము.

## II

ఆంగ్ల భాషలోని ఛార్లెస్ డికెన్సు, అప్టన్‌సింక్లేర్, టి. ఎస్. ఇలియట్, బెర్నార్డ్‌షా వంటి రచయితలను, కవులను, నాటకకర్తలను ఎందరినో ఈ సిద్ధాంతమునకు ఉదాహరణ ప్రాయముగా చూపింపవచ్చును. ఆంగ్ల సాహిత్యములో స్వర్ణయుగమనియును **The nest of Singing birds** అనియును పేరొందిన ఎలిజబెత్ కాలములోని సామాజిక స్వేచ్ఛాప్రియత్వము, సాహస జీవనయానములు షేక్స్పియరుతోసహా ఏ తత్కాలీన సారస్వతమూర్తులందరి పైనను ప్రభావము చూపినదని ఆంగ్ల సాహిత్య విమర్శకు లనుచున్నారు.

అట్లే రాష్ట్రభాష హిందీ విషయములోను విశ్లేషణ చేయవచ్చును. తులసీ, కబీర్, ప్రేమచంద్ వంటి కవులు, రచయితలు, నవలాకారులు అందరును తమ తమ సమకాలీన సమాజములను ప్రతిబింబించినవారే! స్వాతంత్ర్యోద్యమ ప్రేరణతో మాఖన్‌లాల్ చతుర్వేది, బాలకృష్ణశర్మ నవీన్, దినకర్, మైథిలీశరణ్‌గుప్త ప్రభృతులు- అభ్యుదయ చేతనతో సుమిత్రానందన్ పంత్, విప్లవ ప్రేరణతో నిరాలా వంటివారు- సమాజమునకు అద్దము పట్టిరనుట సుస్పష్టమే!

## II

ఇట్లే సమస్త భారతీయ విదేశీయ భాషలన్నింటిని వ్యాఖ్యానింపవచ్చును. గద్యపద్య సమస్త సాహిత్య కావ్య ప్రక్రియలన్నింటిని అనుశీలనము చేయ వచ్చును.

తెలుగులో నవలలు, నాటకములు, వచనము, కథ, వ్యాసము వంటి వివిధ ప్రక్రియలన్నిటిని ఈ సిద్ధాంతముతో సమన్వయింపవచ్చును. నేను విషయ విస్తృతిని దృష్టిలో నుంచుకొని తెలుగు "కవిత్వము"నకు నా పరిశీలనను సీమి తము చేసితిని. ఐనను ఇది బృహద్గ్రంథమే అయినది.

## III

1964లో ఉస్మానియా విశ్వవిద్యాలయములో ఆచార్య దివాకర్ల వేంక టావధానిగారు సూచించిన "ఆధునికాంధ్ర కవిత్వముపై వివిధ ఉద్యమముల ప్రభావము" అను శీర్షికపై పిహెచ్.డి పట్టమునకై పరిశోధన ప్రారంభించితిని. నాకు పర్యవేక్షకునిగా ఆచార్య సి. నారాయణరెడ్డిగారు నియమింపబడినారు. 1970 వరకు నిరవధిక శ్రమతో ఈ సిద్ధాంత గ్రంథమును సిద్ధముచేసి విశ్వ విద్యాలయమునకు సమర్పించితిని. యు.జి.సి. వారు నాకు పరిశోధనా కాలములో ఉపకార వేతనమును ఇచ్చిరి. 1971లో నాకు పట్టము లభించినది. దానికి నిర్ణే తలుగా వచ్చినవారు ఆచార్య కె. వి. ఆర్. నరసింహముగారు, ఆచార్య ఎస్. వి. జోగారావుగార్లు. నాటినుండి నేటివరకు ప్రధానముగా ఆర్థిక కారణముచే గ్రంథ ముద్రణను నిర్లక్ష్యము చేసితిని. ఇట్లు ఇరువది సంవత్సరములు గడచిపోయి నవి. ఈలోపు నావద్ద ఐదుగురు ఎం ఫిల్ పట్టములను నలుగురు పిహెచ్.డి. పట్టములను పొంది తమ గ్రంథములను ముద్రించి తెచ్చి నాకు చూపిరి. అంతే కాదు నేను స్వీకరించిన సిద్ధాంత విషయములోని ఒక్కొక్క అంశమును- ఒక్కొక్క అధ్యాయమును స్వీకరించి, విస్తరించి, సిద్ధాంత గ్రంథములు రచించి వివిధ విశ్వవిద్యాలయములలో సమర్పించి కొందరు డాక్టరేటు పట్టము లను పొందుట ఈ విషయ ప్రాధాన్యమును వైశాల్యమును స్పష్టముగా చాటినది. ఈ గ్రంథ ముద్రణకు ఈ సంఘటనములు కొంత ప్రేరణమును కల్పించినవి.

ఇట్లుండగా తెలుగు విశ్వవిద్యాలయమువారు గ్రంథ ముద్రణకు ఆర్థిక సహాయము చేయుచున్నారని విని శిష్యుడు చిరంజీవి వెలుదండ నిత్యానందరావు ద్వారా దరఖాస్తు ఫారమును తెప్పించి నింపి అతనితోనే పంపితిని. 1989 జనవరి

18వ తేదీ టపాలో 7,500-00 రూ॥ల ఆర్థిక సహాయము అందజేయుచున్నట్లు వారు దయతో నాకొక లేఖను పంపిరి. దానిని సంక్రాంతి కానుకగా భావించి, ముద్రణ ప్రారంభించితిని. 1990 ఉగాదికి ఇది వెలుగు చూచినది.

సిద్ధాంత గ్రంథము రచించి రెండు దశాబ్దములు గడిచినవి. ఈ మధ్య కాలములో ఎంతో చరిత్ర- సాహిత్య చరిత్ర మలుపులు తిరిగినవి. ఉద్యమములు మరికొన్ని వచ్చినవి. వానిని కూడా "వర్తమాన ధోరణులు (1970-90) అనునొక నూతనాధ్యాయముగా చేర్చితిని. గ్రంథము విస్తరించినది. ఆర్థికభార మధికమైనది. గ్రంథమును సంగ్రహించి ముద్రణ చేయవలెనను భావమునకు ఆప్తులు ఇరివెంటి కృష్ణమూర్తిగారు వ్యతిరేకి. "మొత్తమును యథాతథముగా ముద్రించుటే సముచితము. భావితరముల వారికిది రికార్డుగా ఉపయోగపడును" అని సలహా ఇచ్చినారు, 1989 ఏప్రిల్‌లో ఆయన పరమపదమునందుట నన్ను ఎంతగానో క్రుంగదీసినది. నేడు గురువర్యులు దివాకర్లవారును, ప్రియమిత్రులు ఇరివెంటివారును ఉన్నచో ఈ ముద్రిత గ్రంథమును చూచి ఎంత ఆనందపడెడి వారో గదా!

'కృష్ణాపత్రిక' సంపాదకవర్గములో తోగడ నేను కొన్ని సంవత్సరములు పని చేసితిని. అప్పుడు తీరిక వేళలలో 1902 నుండి 1970 వరకు గల ఆ సంపుటములను చదివితిని. అదొక పత్రికగాకాక ఆంధ్రదేశ సాంఘిక, సాహిత్య సాంస్కృతిక రాజకీయ సమగ్ర చరిత్రకొక ప్రత్యక్ష దర్పణముగా కన్పించి నది. నా పరిశోధనాగ్రంథమునకీ పత్రికా సంపుటముల పఠనము ఎంతో సాయపడినది.

"పరిశోధనాంశము సరే! కాని వాక్య నిర్మాణములోను శైలీ విన్యాసము లోను కవితా ధోరణి ఎక్కువైనది" అని ఆచార్య ఎస్. వి. జోగారావుగారు మౌఖిక పరీక్షలో ప్రశ్నించినారు. ఇది విమర్శగా కాక ప్రశంసగానే నేను భావించితిని. సాహిత్య సంబంధమైన పరిశోధనా గ్రంథములలో వాక్యము నిర్జీవముగా కాక రసాత్మకముగా నున్నచో అది పఠితల నెక్కువగా ఆకర్షించునని భావించుచున్నాను.

# IV

ఈ గ్రంథమును నేను అంకితమిచ్చిన వ్యక్తి ఋషితుల్యులు ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు 26-6-1912 (అపరవ్యాసునివలె ఆషాఢ పూర్ణిమ నాడు) పశ్చిమగోదావరి జిల్లా ఎండగండి గ్రామములో జన్మించినారు. వీరిది ఆధునికాంధ్ర వాఙ్మయ నిర్మాతలైన అవధానశేఖరులు తిరుపతి వేంకటకవులలోని దివాకర్ల తిరుపతిశాస్త్రిగారి వంశము. అందుచేతనేమో అసాధారణ ధారణాశక్తితో సమస్త ఆంధ్ర కావ్యములను ప్రబంధములను వప్పచెప్పగలిగెడివారు. అన్ని శాస్త్రములును వారికి వాచోవిధేయము. 1920లో ఉండి, హైస్కూలు విద్య. 1931 బందరు, ఇంటరు. 1934లో వాల్తేరు నుండి ఆనర్సు ప్రథమ శ్రేణిలో ప్రథముడు. 1936 ఎం.ఏ. (ఆనర్సు), 1956లో పిహెచ్.డి (ఆంధ్ర వాఙ్మయ ప్రారంభదశ - నన్నయభట్టు). తొలుత విశాఖపట్టణము మిసెస్ ఎ. వి. ఎన్. కళాశాలలో లెక్చరర్‌గా పనిచేసి 1951 నుండి ఉస్మానియా విశ్వవిద్యాలయములో ఉపన్యాసకులుగా చేరి ఆచార్యులై, ఆంధ్ర శాఖాధ్యక్షులై, 1978లో పదవీ విరమణ చేసినారు. సచ్ఛీలము కల అసంఖ్యాక శిష్యగణమును సృష్టించినారు. "వారిని గురువంచు చెప్పుకొనగా, అది గొప్ప తెలుంగునాట". అపర వాణీధవులై శబ్దశాస్త్ర పారావార కుంభసంభవులై, శతాధికగ్రంథ, వ్యాస రచనలను చేసినారు. వేదభాష్య రచన నిర్వహించినారు. ఆంధ్రదేశములో ఈ మహావక్త ఉపన్యసించని వేదిక లేదు. వారి 'భువనవిజయము' సాహితీరూపకము ప్రదర్శింపని నగరము లేదు. 400 లకు పైగా భువనవిజయ ప్రదర్శనలను మాచే ఇప్పించి ప్రబంధసాహిత్య సాంస్కృతిక వైభవ ప్రచారమునకు తోడ్పడినారు. ఆంధ్ర విశ్వకళా పరిషత్ వీరిని కళాప్రపూర్ణ బిరుదముతో సత్కరించినది. వీరి సాహిత్య సోపానములకు ఎకాడమీ అవార్డు లభించినది. ఆంధ్ర వాఙ్మయ చరిత్రము అనేక భాషలలోకి అనువదింపబడినది. శ్రీ విద్యా సేవా సమితికి అధ్యక్షులై ధర్మమయ, కర్మమయ జీవనము సాగించుచు 20-9-86 లో తనువు చాలించినారు. ఈ పుణ్యపురుషుని 'రవితుల్యుడ'ని అంటిని. అది సార్థక శబ్దప్రయోగమే. తూర్పు సముద్రపుటొడ్డున గోదావరి జిల్లాలో జన్మించి

పశ్చిమ సాగర తీరమున బొంబాయిలో ఆయన అస్తమించినారు. వారి సంస్మరణము నాకు నిరంతరము స్ఫూర్తినిచ్చెడి చేతన నావంటి వారినెందరినో వారు తమ సాధుజీవనముతో ప్రభావితముచేసి పూర్తిగా మార్చివేసినారు. వారి అస్తమయముతో తెలుగునాట పాండిత్యము, పరోపకార పారీణత, సౌజన్యములే, ఊపిరిగా గల ఒక యుగమునకు తెర పడినది.

"ప్రదీపజ్వాలాభి ర్దివసకర నీరాజనవిధి
స్సుధా సూతేశ్చన్ద్రోపల జల లవై రర్ఘ్య రచనా
స్స్వకీయై రమ్యోభి స్సలిల నిధి సౌహిత్యకరణం
త్వదీయాభిర్వాగ్భి స్తవ జనని వాచాంస్తుతిరయం"

వారికి నేనీ గ్రంథము నంకితమిచ్చుట ఇట్టిదే !!

## V

ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారి సూచన మేరకు ఇందు సరళ గ్రాంథికము వాడబడినది.

ఈ గ్రంథ రచనకెన్నియో ప్రాచ్య పాశ్చాత్య గ్రంథములు ఉపకరించినవి. వారందరికిని నమోవాకములు. చిరంజీవి భాగవతుల ఉదయశంకర్ ప్రత్యేక శ్రద్ధ వహించి ముఖపత్ర రూపకల్పనము- ముద్రణముల బాధ్యతను వహించినాడు అట్లే చిరంజీవులు పద్మసుషమ, శ్రీలేఖలు ప్రెస్సు చుట్టును నెలల తరబడి తిరిగి ప్రూపులు తెచ్చుటలో, శుద్ధప్రతులను తయారుచేయుటలో మిక్కిలి సహాయపడినారు. వీరికి నా ఆశీస్సులు. పర్యవేక్షకులు ఆచార్య సి. నారాయణ రెడ్డిగారి అవ్యాజ ప్రేమకు ధన్యవాదములు. పరిశోధనా కాలములో ఉపకార వేతనము నిచ్చిన యు జి సి. అనంతరము ఉద్యోగము నిచ్చిన ఉస్మానియా విశ్వవిద్యాలయము వారికిని ఋణగ్రస్తుడను, గ్రంథముద్రణ వ్యయములో నాల్గవ వంతు ఆర్థిక సహాయమందించిన తెలుగు విశ్వవిద్యాలయమువారికి వందనములు. గ్రంథమును సకాలములో ముద్రించిన శ్రీ లక్ష్మీవేంకటేశ్వర పవర్ ప్రెస్

మేనేజరు శ్రీ పి. శ్రీనివాస్, వారి సిబ్బంది సర్వశ్రీ అమిరిశెట్టి ప్రభాకర్, పల్లాల తులసీదాసు (అక్షరశిల్పులు), యమ్ నరసింహం (మిషన్ ఆపరేటర్), కర్నాటి విఠల్ (బైండర్) ఇత్యాదులకు కృతజ్ఞతలు. ప్రత్యక్షముగా పరోక్షముగా నాకు ఇంకెందరో సహకరించిరి. వారందరికిని వందనములు.

## VI

విషయము మిక్కిలి సమకాలీనమైనదగుటతో అసిధారావ్రతముగా వైయక్తికమైన అభిమానములకును రాగద్వేషములకును ఎట్టి తావును లేకుండ సమదృష్టితోనే పరిశోధన గావించితిని. అందుకు సహృదయులే సాక్షులు.

షడ్దర్శనములవంటి మఱొక దర్శనమిది !

మా రసగంగోత్రి సంస్థ పక్షమున వెలువరించుచున్న గ్రంథ పరంపరలో మొదటిది శ్రీమతి ఎం ఉమాదేవి రచించిన ఆంగ్ల సిద్ధాంత గ్రంథము "పాల్కురికి సోమనాథుడు" కాగా, ఇది రెండవది. వీనిని పాఠకులు ఆదరించి, ఆమోదింతురని ఆశించుచున్నాను.

ఉగాది, ప్రమోదూత
మార్చి, 1990

ముదిగొండ శివప్రసాద్

# రచయిత పరిచయము

| | | |
|---|---|---|
| పేరు | : | డాక్టర్ ముదిగొండ శివప్రసాద్ |
| జననం | : | 23-12-1940 |
| విద్యాభ్యాసం | : | ఎం.ఏ. (ఆంధ్ర విశ్వకళా పరిషత్, వాల్తేరు. ప్రథమశ్రేణి)<br>పిహెచ్.డి. (ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాదు) |
| ఉద్యోగం | : | రీడర్, తెలుగు శాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాదు |
| బిరుదములు | : | చారిత్రక నవలా చక్రవర్తి |
| చిరునామా | : | 2-2-647/182, బి, సెంట్రల్ ఎక్సైజ్ కాలనీ, హైదరాబాదు-13. |
| ఫోన్ | : | 864668 |
| ముద్రితనవలలు | : | నగం విరిగిన చంద్రుడు, చిదంబర రహస్యం, స్వప్న శృంగం, అగ్నిగీతం, ఆవాహన, ఆషాఢ గౌతమి, అనుభవ మంటపం, నవకల్యాణము, అమృతవాహిని, అంబుధిలో అంగారం, ఆనందశిఖరం, అమలిన శృంగారం, దశాశ్వమేధ్, అనుపమకథ, శ్రీలేఖ, నాగానీక, తంజావూరు విజయము, రసమయి, అమృత సరోవరం, స్వప్నకిరీటం, ప్రతిభ, వసంత గౌతమి, నన్నయభట్టు మళ్లీ పుట్టాడు, హ్యూమానిటి ఫర్ సేల్, శ్రీపదార్చన. |
| ఇతర రచనలు | : | మహాసర్గ, బసవగీత, అమృతవృష్టి, సమ్రాట్ పుష్యమిత్ర, కల్యాణ విజయము, పాల్కురికి కవితా వైభవం, మన పురాణ సంకేతాలు, భారతీయ సాహిత్యంలో ఏకాత్మ దర్శనం, ఇత్యాదులు. |
| త్వరలో | : | వంశధార, మహోదయం. (నవలలు) |
| బహుమతులు | : | 1989 రాష్ట్ర ప్రభుత్వం పక్షాన తెలుగు విశ్వవిద్యాలయముచే "ఉత్తమ నవలా రచయిత" బహుమానం, 1990 న్యూఢిల్లీ ఆకాశవాణి వారిచే 'జాతీయ కవి'గా గుర్తింపు. |

# రసగంగోత్రి

"ఆనోభద్రాః క్రతవో యన్తు విశ్వతః" (ఋగ్వేదం) అన్ని దిక్కుల నుండి దివ్యభావములు మమ్ము చేరుగాక। అనేది అనాదిగా మన ప్రార్థన. 'కృణ్వంతో విశ్వమార్యమ్' (సమస్త మానవాళిని శ్రేష్ఠులను చేసెదము గాక।) అనునది మన ఆదర్శం.

దాదాపు ఐదువేల సంవత్సరాల క్రితంవరకు ఈ పరంపర అవిచ్ఛిన్నంగానే సాగుతూ వచ్చింది. మహాభారత సంగ్రామానంతరం క్రమంగా భారతీయులు ధర్మచ్యుతిని పొందడం ప్రారంభించారు. కుర్వన్నేవేహకర్మాణి జిజీవిషేత్ (సంపూర్ణ జీవనము కర్మమయముగా సాగించెదముగాక) అనే వేద ధర్మం స్థానే చార్వాకము, శూన్యవాదము, మాయావాదమువంటి అవైదిక సిద్ధాంతాలు ప్రవేశించాయి. నేటి వికృతికి ఇదొక మౌలికమైన కారణం. విదేశ దండయాత్రలు దీని పరిణామము, ప్రభావము మాత్రమే. పురుషార్థాల మధ్య సంతులనం నశించడం పంచకోశ సమాహార వికాసం లోపించడం ఇందువల్లనే జరిగింది. రాజకీయ స్వాతంత్ర్యం పొంది నాలుగు దశాబ్దాలైనా జాతి ఇంకా తన "స్వ" త్వాన్ని పొందలేకపోవడం విచారకరం ఈనాటి సమస్యలన్నింటికి ఏకైక పరిష్కారం వేదవాణిని బహుముఖీనంగా "సరియైన" అర్థంతో ప్రచారం చేయడమే.

"రసగంగోత్రి" ప్రచురించే వివిధ సాహిత్య ధార్మిక, తాత్విక గ్రంథాలూ, కథలూ, నవలలూ, అన్నీ ఈ ఆదర్శాన్ని ప్రత్యక్షంగానో పరోక్షంగానో ప్రతిపాదించేవే.

ఈ దృష్టితోనే 24 అక్టోబరు 1988 లో ఈ సంస్థను స్థాపించడం జరిగింది. ముందుగా శ్రీమతి యం. ఉమాదేవి రచించిన ఆంగ్ల సిద్ధాంత వ్యాసం "పాల్కురికి సోమనాథ" అన్న గ్రంథం ప్రచురించాము. "ఆధునికాంధ్ర కవిత్వముపై ఉద్యమముల ప్రభావము" అనే ఈ సిద్ధాంత గ్రంథము రెండవది. అతి త్వరలో "ఓంకారము-శివలింగము" అనే గ్రంథాన్ని మరికొన్ని అత్యుత్తమ సాహిత్య మూల్యాలు గల కృతులను వెలువరించాలని మా సంకల్పం. వదాన్యులు, సహృదయులు, పాఠకులూ అందరూ ఈ ప్రయత్నంలో మాతో సహకరింపగలరనే విశ్వాసముంది.

# విషయసూచిక

# అంకితం

గురువర్యులు రవితుల్యులు

## ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారి

దివ్య స్మృతికి

# ఉద్యమ దర్శనము

సాహిత్యమొక సజీవ స్రోతస్విని. ఈ జీవనగంగ చరిత్ర నిదమిత్థముగ
నిర్ణయించుట మిక్కిలి కష్టతరమైన కార్యము. ఏ భగీరథోద్యమ ఫలితముగ
నిదివియత్తలము నుండి హిమవత్తలమున కవతరించినదో ఏ పరమశివుండా
భాగీరథిని ప్రకృష్ట మార్గమున పయనింపజేసెనో, ఏయే తీర భూములను స్పృశిం
చుచు, నేయే మాగాణములను పండించుచు నేయే ప్రవాహగమనములతో పరిమా
ణములో పరిణామములో సరిక్రొత్త చెలువము లెప్పటికప్పుడు సంతరించుకొనుచు
నీ మహానది ముందునకు సాగినదో, ఏయే కొండల బండలపైనుండి జలపాతములై
పొంగి పొర్లినదో ఏయే కూలముల నొరసికొనుచు నేయే తీరములపై పరచికొనుచు
నేయే పవనములకు చలించుచు నేయే గానములకు నటించుచు నేయే మార్గముల
లోనిది గమించినదో ఏయే సాధనములచే నిది సాధ్యమైనదో యే గమ్యముల
కిది గమనమైనదో. ఏయే సంకల్పముచే నీ కల్పనములు నిష్పన్నమైనవో, ఏయే
యశస్వినులీ జీవన సుప్రభాతమున మంగళకైశికీ గీతములాలపించిరో
ఇదమిత్థముగ నెవరెట్లు నిర్ణయింపగలరు? ఎవరీ వాఙ్మయ మహాక్షీర సాగర
ములో యుగయుగమున నొక మథనమును కల్పించి మరలనందు విషమును
గళస్థము చేసికొని అమృతమును పంచిపెట్టిన యుద్యమకర్త? గంగోత్రినుండి
కాశి వరకును వారణాశి నుండి మరల వారిధి వరకును గల వివిధ గతులలోను
ఈ ప్రవాహ వేగమును పరిశీలించి అంతర్వాహినులను గుర్తించి, అట్టి కథానాయ
కులైన యుద్యమ నాయకులకు నివాళులర్పించి వారిని ప్రపంచమునకు చూప
గలిగిన కార్యమే ప్రస్తుత మే భాషలోనైనను అత్యావశ్యకమైన కృషి! అట్టి
పవిత్ర కార్యక్రమమునకు సవినయముగ దీపారాధనము చేయుటకు నేనీ పరిశోధనా
వ్యాస రూపమున ప్రయత్నించితిని! బుధ జన విధేయుడనైన నా యీ ప్రయ
త్నమును విజ్ఞులాశీర్వదించెదరు గాత!!

## ఏకతలో భిన్నత :

దూరమునుండి పరిశీలించినప్పుడంతయు నొకే జల సమూహముగ గోచ
రించినను నిశిత పరిశీలనమువలన నీ క్షణములోని జలబిందువను మనము మరు

క్షణములో దర్శించుటలేదని తెలిసికొందుము. ఇది బౌద్ధుల క్షణిక వాదమువంటిది. కాని దేనిని 'ప్రత్యభిజ్ఞ' చేతను నిత్యప్రవాహశీలత్వము చేతను క్షణికముకాక సత్యమే అని నిరూపించిన యౌదంబరాయణులుండనే యున్నారు. స్థూలముగ సాహిత్య మాలంకారిక నిర్వచనముల ననుసరించి 'బ్రహ్మానందసబ్రహ్మచారి యగు రసానంద హేతువు' గను ధ్వనించినదనియు, నిర్వృతికై కాంతా సమ్మితముగ నుపదేశమిచ్చు ననియు భావించుట బాహ్యదృష్టిలో సరియైనదే. కాని అంతరముగ మాత్రము దాని కల్పనములో కొంత వైశిష్ట్యమున్నది!

నన్నయగారి నాడు చంపువును చిన్నయనాడు వచనమును ఏల వికసించినవి?? రాయలనాటి ప్రబంధము నాయక రాజులనాడేల యక్షగాన ప్రబంధమైనది? ఇంద్రులనియు చంద్రులనియు 'భూకామందు'లను ప్రశంసించిన గత శతాబ్దపు కవిత్వమేల నేడు ప్రజలకొఱకు ప్రజలవలన రచింపబడుచున్నది?

కృష్ణశాస్త్రిగారి నాటి నవ్వుల పువ్వుల కవితాకన్యక శ్రీశ్రీ నాడేల పుడమి తల్లి పురింటి నొప్పులను ప్రతిధ్వనించినది? సూక్ష్మదర్శనముననే భిన్నత్వము గోచరించుచునే యున్నదికదా! తాత్పర్యమేమి? సాహిత్య స్ఫటిక మొక్కటే యయినను ఉద్యమ జపాకుసుమాదులు వివిధ వర్ణాకృతులతో నందు దృశ్యమానమగుచున్నవి! కావుననే దేశకాల పాత్రముల ననుసరించే సాహితీగమనము కూర్పునందుట- సహజమనియును 'ఉద్యమము'లే యీ మహత్తర పరిణామమున కాధారశిలలనియును స్పష్టమగును. ఉద్యమ మంత్రాధిష్ఠితమైన మూలాధార చక్రముపై పూజారులైన కవికుమారులు కవితాశక్తిని ప్రతిష్ఠించి కోవెలలు కట్టి కోటి గొంతులతో కర్పూర గీతాంజలులు సమర్పించుటే విశ్వసాహిత్యములోని మూలసూత్రమనియును. ప్రపంచములో నేసాహిత్యమైనను ఉద్యమ కూలముల నడుమ నభ్యుదయమందుటే సార్వకాలికమైన సత్యమనియును సిద్ధాంతము!!

## "ఉద్యమ" నిర్వచనము

సాహిత్య స్రవంతి ఉద్యమశీల యని సిద్ధాంతీకరించితిని! దానిని సోపపత్తికముగ దర్శించుటకు ముందు 'ఉద్యమ' శబ్దమును పరిశీలింపవలసియున్నది! 'ఉద్యమ' శబ్దమును విభజించినచో 'యమ్' ధాతువునకు 'ఉత్' ఉపసర్గ చేర్చినట్లు తెలియును. ఉత్ : పైకిలేచిన; ఉద్గీత, ఉద్ఘాత, ఉత్తమ, ఉత్పాత, ఉత్థిత శబ్దము

లే 'ఉత్' ఉపసర్గచే తోఁగూడిన రూపముతే! 'యమ్' : 'స్వాధీనములో నుంచు కొను' అని యర్థము. ఆంగ్లములో 'Movement' అను పదమునకు సమానార్థకములో 'ఉద్యమ' శబ్దము ప్రయోగింపఁబడుచున్నది 'Movement' పదమునకు నైఘంటికముగ ఇట్లు అర్థమున్నది.

**Movement: A series of concerted organised activities or related events working toward or shaping some objective.**[1]

దీనివలన కూడ 'తీవ్రమైన' ఏకోన్ముఖమైన ప్రయత్నము ఉద్యమమని అర్థమగుచున్నది.

హిందీలో కూడ యత్నము- కదఁక అను అర్థములలో ప్రయుక్తము [2]

## ప్రయోగములు :

'పునరవతారంబునకు నుద్యోగింపుమని'[3] 'సూత్రహస్తులై మునుకొని కోవిదస్థ పతిముఖ్యులు శిల్పము లుద్యమింప'[4]

కావున పూనికతో చేసిన తీవ్రయత్నము ఉద్యమము [5]

## ఉద్యమము - కావ్య ప్రయోజనము :

సాహిత్య పరమప్రయోజనము. ఆనందమా? ఉపదేశమా? అని ప్రాక్పశ్చిమ సాహితీవేత్తలు సుదీర్ఘముగ చర్చించిరి. 'ఆనందో బ్రహ్మ' అను ఉపనిషద్వాక్యము ననుసరించి, ఆనందమే బ్రహ్మస్వరూపమనియును, సామాన్యుల కది అలభ్యము కావున బ్రహ్మానంద సబ్రహ్మచారియగు రసానందమును ప్రసాదిం

---

1. **Webster's Third New International Dictionary 1480 Page.**
2. శబ్దసింధు (హిందీ) 176 పుట.
3. కుమార సంభవము నన్నిచోడుడు 5-102.
4. హరి ఉ. 2-150.
5. ఉద్యమి = గట్టిపూనిక గలవాడు. సూర్యరాయాంధ్ర నిఘంటువు, 637 పుట; యత్నము - కదఁక శబ్దరత్నా. 87 పు.

చుచే కవిత్వ పరమాశయమని యాలంకారికులు నిర్వచించిరి. మహర్షుల మత ములో రసముతోపాటు విశ్వశ్రేయోదాయకమైన సందేశౌషధమును కూడ లోక మున కొసంగుచే కవితాంధర్శము. అందువలననే 'కాంతాసమ్మితముగ నుప దేశము చేయునది కావ్యమని నిర్వచించిరి. రసానందముతోపాటు ఆత్మోన్నత్య మును శాంతిని ఈ బోధ యిచ్చి మనలను పరిశుద్ధులుగను విజ్ఞానవంతులుగను చేయు"[1]నని ఆధునిక సాహిత్య విమర్శకులును అభిప్రాయపడిరి. "ఏ విధమైన ధర్మప్రబోధము లేకున్నను ఆ కవిత్వమునకు కావ్యత్వలోపము కలుగదు. కాని ధర్మప్రతిపాదనము కల కావ్యమునకుఁగల యౌన్నత్యము దీనికి కలుగఁజాలదు .. విజ్ఞానాత్మకములైన యిట్టి మహాకావ్యములే జగత్కల్యాణమునకు తోడ్పడును"[2] సారాంశమేమనగా కావ్యమునకు రసమున కన్న భిన్నముగను ఆనుషంగికము గను 'జగత్కల్యాణార్థము' 'ధర్మ' ప్రచారము కూడ జరుగవలెనని నిర్ణయించినా రన్నమాట ! 'ధర్మ'మనగా నేమి ? 'ధారణముచేసి పోషించునది'ని యర్థము.[3] సమాజమే ధర్మరూపము కావున సమాజ కల్యాణమునకై 'ధరించి పోషింపవల సిన' కర్తవ్యము లవసరము ననుసరించి యేకోన్ముఖముగ జరుగుట 'ఉద్యమ' మగునని యీ విధముగ సమన్వయింపవచ్చును.

ఈ మతమును పాశ్చాత్యులు కొందఱు తీవ్రముగ బలపరచుట, తీవ్ర ముగ ఖండించుట రెండును జరిగినవి !

రాబర్ట్ బ్రౌనింగ్ : **'Philosophy first and Poetry next'** (ముందు తత్వము తరువాతే కవిత్వము)

లోవెల్ : **No Poem ever makes me respect its author which does not in some way convey a truth of philosophy"** (తాత్త్విక సత్యమును చాటని ఏ కవిత్వమైనను తత్కర్తను గౌరవించుటకు నన్నె న్నడును ప్రోత్సహింపదు.)

కోలరిడ్జి : **No man has ever been a great poet without being at the same time a profound philosopher"** (పరిపూర్ణ తాత్త్వికుడు కానట్టి మానవుడెవ్వరును ఇతఃపూర్వము మహాకవి కాలేదు.)

---

1. 2. పింగళి లక్ష్మీకాంతముగారు. "సాహిత్య విమర్శనము"
3. "ధ్రియతాఇతి ధర్మః" ఆర్షోక్తి.

హక్స్లే: Other things being equal the work of art which in its own way says about the universe will be better than the wo.k of art which says less.' (కళాప్రక్రియలో, తదితర విషయములలో, రెండును సమానములైనప్పుడు విశ్వమును గూర్చి మరింత చెప్పిన కృతి అది చెప్పబడని గ్రంథము కన్న ఉత్కృష్టమైనదే.)

ఈ రీతిగా పైని పేర్కొనిన ప్రముఖ పాశ్చాత్య విమర్శకులు 'బోధ'కు మిక్కిలి ప్రాధాన్యము నిచ్చుట గమనింపదగిన యంశము !

## నీతిబోధ :

ధర్మము తాత్త్వికమైనది ! నీతి సాంఘికమైనది, ధర్మబోధకు వలెనే నీతిబోధకును కవిత్వమును సాధనముగ నుపయోగించుకొనవలెనని కొందఱు సూచించిరి. ఈ అభిప్రాయమును వ్యతిరేకించినవారు కూడ లేకపోలేదు. కావ్యము శిల్పసృష్టి. శిల్పనీతి పరిపాలింపబడినచో దానికి సిద్ధి వచ్చినట్లే లెక్క. లౌకిక నీతికది భిన్నము. ఈ రెండింటిని జోడించుట కావ్యశిల్పమునకు కళంకమే కాని శోభ కాదనున దొకవాదము. దీనికే 'ఈస్థటిక్ స్కూల్' (Aesthetic school) యని పేరు. స్విన్‌బర్న్, రస్కినియన్ ప్రభృతులు దీనిని బలపరచిరి.

వీరిని సమూలముగ ఖండించినవారును లేకపోలేదు.

లియోటాల్‌స్టాయి : "Artistic beauty in not different from moral beauty" (కళాసౌందర్యము నైతిక సౌందర్యము కన్న భిన్నమైనది కాదు.)

మాథ్యూ ఆర్నాల్డ్ : "A poetry of revolt against moral ideas is a poetry of revolt against life" (నైతిక భావములపై విప్లవము ప్రకటించిన కవిత జీవనముపైనే తిరుగుబాటు ప్రకటించినట్లు లెక్క.)

ఎమర్సన్ : Great poets are judged by the frame of mind they include in us" (మహాకవులు మనలో చేర్చెడి భావముద్ర ననుసరించియే లెక్క కట్టబడెదరు.) అని ఘంటాపథముగ చెప్పిరి.

కావ్యప్రకాశికలో "అనౌచిత్య ప్రవృత్తత్వే ఆభాసోరసభావయోః" యని గలదు. అనౌచిత్యము కావ్యములో కన్పడినప్పుడా భాసము గోచరించును. కావున

బోధ నతిక్రమించి కావ్యమున కస్తిత్వము లేదని సిద్ధాంతము! 'కాంతా సమ్మిత తోపదేశ' తాత్పర్యమిదియే!

'ధర్మార్థ కామమోక్షేషు వైచక్షణ్యం కళాసుచ

కరోతికీర్తిం ప్రీతించ సాధు కావ్య నిషేవణ' అని 'కావ్యప్రకాశ' కర్త పేర్కొనెను. ధ్వన్యాలోక కర్తయు 'సదాచారోపదేశ రూపనిబంధనాహి నాటకాది గోష్ఠీవినేయ జనహితార్థమేవ మునిభిరవతారితా' యని ప్రవచించెను. భరతమహర్షి 'ఆనందము, ధర్మోపదేశము' రెండును ప్రధానములే యని వాక్రుచ్చెను! కావుననే ధర్మజ్ఞులకు కావ్యమొక ప్రచార సాధనము. ఉపదేశాత్మకమైన ఉత్తమ పురుష చరిత్రా స్వీకారమున కిదియే హేతువు! "యత్ర పునరుత్తమ పురుష చరితం ననిబధ్యతే తత్కావ్యం పరిత్యాజ్యమేవ తద్విషయాచస్మృతిః" 'కావ్యాలాపాంశ్చ వర్జయేత్'[1] అను ఆలంకారిక మతమీ భావముతోనే పుట్టినది!

ఈ రీతిగా రసముతోబాటుగ నానుషంగిక ప్రయోజనము కూడ కావ్యాదర్శమేనని గుర్తింపబడినది. ధర్మము సమాజ 'స్థితి'కి మూలము. జాతి క్లిష్ట స్థితిలో నున్నప్పుడీ వ్యక్తి- సమష్టి శ్రేయమును దృష్టిలో నుంచుకొని ధర్మోద్దీపనమునకై మహోద్యమములు నిర్వహింపబడును. ధర్మవిరుద్ధమైన యుద్యమములు కూడ సమాజములో విజృంభించుటయు సాహిత్యము నాక్రమించుకొనుటయు లేకపోలేదు కాని అవి ప్రపంచ క్షేమమునకు గాక పరిశోధకులకు మాత్రమే ఉపకరించును!

ఉద్యమము తీవ్రముగ నున్నప్పుడు సారససీరస కృతులు రెండును వాఙ్మయములో వెల్వడవచ్చును. కాని రసవంతములే శాశ్వతముగ నిలిచిపోవును మిగిలినవి బెర్నార్డుషా సమస్యాత్మక రచనములవలె తాత్కాలిక ప్రయోజనము సిద్ధించిన వెనుక వాఙ్మయ క్షేత్రమునుండి అంతరించెడి ప్రమాదము లేకపోలేదు.

## ఉద్యమము-తదంగములు :-

ప్రపంచములో జరిగిన యుద్యమములను పరిశీలించి చూచినప్పుడు అవి వ్యష్టి-సమష్టి ప్రాతిపదికలపై సాగునని కూడ తెలియును. వ్యక్తిగతమైన

---

1. 'ప్రతాపరుద్ర యశోభూషణము' విద్యానాథుఁడు.

ఒకానొక తీవ్ర సంకల్పము చైతన్యవాహినియై వేలమంది ఆమోదముపొంది అసంఖ్యాకమైన అనుయాయులతో ముందుకు సాగవచ్చును. అట్టిచో నది సాంఘిక చైతన్యము క్రిందికి పరిణమించును. కవిపుంస్కోకిల లప్పుడు కంఠ మెత్తి గానము చేయును. తమకు పూర్వమందును, వర్తమానమందును గోచరించెడి, ఒకానొక తత్వమును నిరోధించుట కుద్యమము రావచ్చును. లేదా తత్పూర్వతత్వ పునరుజ్జీవనము కూడ కవితలోనో-సంఘములోనో ప్రతిపాదించుటకును ఉద్యమము వ్యాపింపవచ్చును. నిర్మాణ, విధ్వంస దృక్పథములు రెండును ఉద్యమమునకు రెండు నేత్రములు. అనేకులేకతను ప్రదర్శించుటయును, ఏక భావ మనేకులపై ప్రసరించుటయును ఉద్యమ ధర్మములే. వ్యక్తి శక్తిగ పరిణమించినప్పు డుద్యమము సాగుచున్నట్లు గుర్తు ! !

## షడంగములు :

విశ్వములోని ఉద్యమములన్నింటిని విశ్లేషించి చూచినచో ఈ షడంగములు అన్నింటను సమానముగనున్నట్లు భావించితిని ! !

1) మొదటిది సిద్ధాంతము. దీనిని ప్రాతిపదికగ జేసికొనియే ఉద్యమించుట జరుగును. (ఉ॥ 'భారత స్వాతంత్ర్య సిద్ధి.' ఆశయము.)

2) సమీకృత శక్తి : అందు అర్థబలము, అంగబలము ఇత్యాదులు కేంద్రీకరించి సమాయుక్తమగుట గోచరించును. ఉద్యమమున కవి యుపకరణములు. వైయక్తిక నాయకత్వమో, సామూహిక నాయకత్వమో యీ దశలోనే నిర్ణయింపబడును (ఉ॥ ఆంగ్లేయులను పారద్రోలుటకై 'పైసాఫండు' సేకరించుట కార్యకర్తల దళములు - తిలక్-గాంధీల నాయకత్వము ఇత్యా.)

3) మూడవది ఆందోళనము : ఇది కార్యక్రమదశ. ప్రచారమునకిదీ 'స్థితి' ! (ఉ॥ సత్యాగ్రహములలో పాల్గొనుట, నిషేధమునుల్లంఘించి ఉప్పు చేయుట, సైమను కమీషనును నిషేధించుట, 'క్విట్ ఇండియా' నినాదములిచ్చుట ఇత్యాది )

4) నాల్గవది, వ్యతిరేక నిరోధము. ఉద్యమకారులు పూల పానుపులపైకి ఆహ్వానింపబడరు. తప్పక ప్రతిఘటననెదుర్కొనవలెను. ఐనను ఉద్యమము సాగుచున్నచో నది 'తీవ్ర' స్థాయికి చేరినట్లు లెక్క !

5) రససిద్ధి :- ఈ దశలోనే యుద్యమము కవిత్వము క్రిందికి మారును. అట్లు మారక పూప దశలోనే రాలిపోయినచో ఉద్యమమునకు తీవ్రత లేదని యర్థము. తీవ్రత పెరిగినకొలది సాహిత్యములో దానికి స్థానమును ప్రవర్ధ మాన మగును. లేనిచో 'మేధావులగుర్తింపు' దానికి లేదని యర్థము. (ఉ॥ జాతీయ గీతములు, కావ్యములు రచింపబడుట ఇత్యాది )

6) ఉపసంహారము : ప్రతి ఉద్యమమును ఫలావాప్తితో పర్యవసాన మును చెందును. ఈ ముగింపు కొన్నిటికి సహజముగను కొన్నిటికి కృత్రిమ ముగ కూడ సిద్ధించుట సంభవమే! ఈ షడంగములను కలిగినది పూర్ణోద్య మము - ఏదైనను లోపించినచో నది 'లుప్తోద్యమము'. (లుప్తోపమవలె.)

అట్లే యుద్యమములో 1) నిబద్ధోద్యమములు 2) అని బద్ధోద్యమములని రెండు తెఱంగులుండునని వింగడించితిని! నిబద్ధోద్యమములో కార్యకారణ సంబంధములు సక్రమముగ గోచరించును. అవి సువ్యవస్థితముగ నుండును. అని బద్ధోద్యమములలోని విశ్లేషణము క్లిష్టతరమగును. ఇది అవకాశము నాధా రము చేసికొని పురోగమించును లక్ష్యసిద్ధి లేకనే విరమణయును జరగ వచ్చును. (ఉ॥ ప్రథమ భారత స్వాతంత్ర సంగ్రామ మట్టిది. ఆంగ్లేయులపైన సంతృప్తియున్న మాట నిజమే! దాని ననేక కారణములు తోడైనవి. మంగళ పాండ్యా నియమ పాలన చేయలేదు. నాయకులలో ఏకైక లక్ష్యము లేదు. బహ దూర్‌షాకు సింహాసన మప్పగించుట ఉద్యమకారుల కిష్టముకాదు. కావుననే సంగ్రామము విఫలమైనది!) అట్లే అనిబద్ధోద్యమములలో ఉద్యమ మొక తీరు రససిద్ధి వేఱొక తీరుగ నుండును. (ఉ॥ రెండవ తెలంగాణా ఉద్యమము. ఆంధ్ర రాష్ట్రమును రెండు చేయవలెనని యుద్యమ కారులు కోరగా 'వేఱు తెలంగాణా కాదు-విర తెలంగాణా కావలె'నని మహాకవులందఱును కోరినారు. ఇది అనిబద్ధ గతికి నిదర్శనము )

## పరస్పర ప్రేరణ :

ఉద్యమముచే ప్రేరణ పొందిన కవి, రచనలు సాగించుట, కవి, సుసంకల్ప సూర్యోదయమో ప్రబోధ చంద్రోదయమో ఉద్యమమునకు కారణమగుట-అనెడి రెండు పద్ధతులలో ఉద్యమము - సాహిత్యమును ఉత్పన్నము లగుచున్నవి. ఇవి పరస్పర ప్రేరణముతో కూడ సాగుట కలదు!!

## ఒకే పుష్పము - అనేక వర్ణములు :

ఇంతేకాక మఱొక ప్రముఖ విషయమును కూడ మనవి చేసెదను. వాఙ్మయ యుగకర్తలవలె ఉద్యమ యుగకర్తలను నిర్ణయించుట, దుష్కరమైన కార్యము. కారణమేమనగా ఒకే కవి వివిధోద్యమముల ప్రభావముచే పరస్పర విరుద్ధమైన కవిత్వమును కూడ ఆయా కాలములతో వ్రాయుట పరిశీలనలో నిరూపితమైన అంశము! ఇది కవి శీలమునకు పరాజయము కాక ఉద్యమము ప్రభావమునకు విజయముగా చెప్పవలసి యున్నది! (ఉదా॥ గురుజాడ, దేశభక్తి గీతము వ్రాయుట - జార్జి ప్రభువును ప్రశంసించుట.)

## 'ప్రభావ'మన నేమి ?

'ప్ర' సంస్కృత ఉపసర్గ. ప్రకర్షార్థకము. ఇది సంస్కృత పదమునకు ముందు నిలిచి 'మిక్కిలి'యను అర్థము నిచ్చుచున్నది. ఉదా॥ ప్రోత్సాహము, ప్రోద్దామము, ప్రోద్ధతము మొ॥వి.

అట్లే 'భావ శబ్దము కూడ మనోవికారాది వివిధార్థములలో ప్రయోగింపబడుచుండును. వర్తమానములో 'ప్ర' యుక్తమైన విలక్షణార్థమును పొంది అయతి, అధిష్ఠానా'ర్థకమై ప్రయోగింపబడుచున్నది. ఒకానొక విషయము మఱొక విలక్షణార్థముచే పరివర్తనమును చెందుటను 'ప్రభావ' మందుము. అనగా రాజకీయ, సాంఘిక సారస్వతోద్యమ ఫలితముగ సాహితీ స్రవంతి తిరిగిన మలుపులన్నింటికి 'ప్రభావా'ర్థకములోనే నిర్వచింపవలసియున్నది!!

## జాతీయ జీవనము - వాఙ్మయము :

ఒకానొక భాషా వాఙ్మయ మా జాతి జీవనము నతిక్రమించి పోజాలదనున దొక విశ్వ సత్యము. కవి సమాజమునుండి జన్మించి తన సమాజమునకు ప్రతినిధియై సామాజిక కష్టసుఖములన్నింటిని తాను కూడ అనుభవించి తన యెదను జాతి యెదతో రాచి రాపాడి - వాగర్థములలో తన వేదనను నంపినప్పుడది మహోన్నతకృతిగ రూపొందును. అనగా ఒకానొక కవి కృతిని మనము పఠించినప్పుడా దేశకాల పాత్రములును సామాజిక రాజకీయాది జీవనములును దర్పణములోని మూర్తులవలె గోచరించునని తాత్పర్యము. ఒకవేళ నొక కాలమున నొక

రిద్దఱు మహామహులు దేశకాల వ్యవస్థల నధిగమించి సార్వజనీనంబులును పరమోత్కృష్టంబులు నగు భావములను, ఆదర్శములను తమ గ్రంథముల వెల యించినను అ కాలమున వాఙ్మయమంతయు నిట్టిదై యుండుటకాని, ఎంత గొప్ప కవులైనను తమ గ్రంథ రాజముల నెచ్చటనైన తమ చుట్టుప్రక్కల దేశముననో సంఘముననో యుద్రేకము పుట్టించి తన్మయము గావించుచుండిన తాత్కాలిక "మహోద్యమ" విషయములను స్వాభావిక మగు పొరపాటుననైన గనువఱుప కుండుటగాని తటస్థింపదు"[1] దీనినిబట్టి ఒక దేశములో నొకకాలములో నొక జాతి నడుమ వెలువడిన గ్రంథ రాజమా జాతీయ జీవన సారమును పుక్కిటఁబట్టి వారి సాంఘిక భావములనొక శాశ్వతత్వమును కల్పించుననుట నిస్సందేహము. దీనినే మనము 'ప్రభావ' మనిపిలుచుచున్నాము.

కొందఱుకవులు ఉద్యమార్థము వర్తమాన గాథలను స్వీకరించి విస్తరిం చుటను 'ఉద్యమ ప్రభావ'మనుటలో నెవరికిని సందేహముండదు. కాని తన సమా జములో సమకాలీనము కాని యేపౌరాణిక గాథనో స్వీకరించినప్పటికిని వర్తమాన ప్రభావము నుండి కవి తప్పించుకొనజాలఁడు. "గ్రంథములందు వర్ణింపబడిన వ్యక్తులు ప్రాయశః అలౌకికములైనను. అవి లౌకికములగు కవుల చేతిలోనే తయారైనవి కావున వీరిలోకపు గుర్తులను పూర్తిగా తప్పించుకొనలేక పోయినవి. కవులు కావ్యము నందలి వస్తువుల నెంత పైకెత్తినను భూలోకపుగాలిని దాటు నంత మీఁదికి ద్రోయజాలదు"[2] దీని కుప బలకమోయనునట్లు శ్రీ ముట్నూరి కృష్ణారావుగారు తమ సాహితీ సౌరభము గుభాళించెడి సంపాదకీయములలో నొక చోట "సారస్వత రూపం చాలవరకు సాంఘిక పరిస్థితులపై ఆధారపడి వుంటుంది ఒక్కొక్క కాలపు సారస్వతంలో ఆనాటి సాంఘిక పరిస్థితులు ఆకాలంలో ప్రబలి యున్న భావాలు అప్పటి యిష్టానిష్టతలు ప్రతిబింబిస్తూ వుంటాయి "[3] అని వక్కాణించుటకు హేతువిదియే ! అమర్త్య భూమికలను గూర్చియే విమర్శకులిట్టి యభిప్రాయములను వెలువరించుచుండగా 'ఉద్యమ' మేళ్లకూళ్ళను ఏకముచేసిన

---

1. 'జాతీయ జీవనము - వాఙ్మయము' రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారి వ్యాసము.
2. 'రాయల నాటి రసికత'
3. కృష్ణరాయ సంపాదక వ్యాసావళి.

వర్షాకాలపు నదిగా మారినపుడందెందఱు కవి తైర్థికులు స్నానమాడిరో, యెన్నెన్ని జీవన వనములు, సారస్వత మాగాణములు నీళ్ళు నింపుకొని సారవంతమైన యొంద్రుమట్టిచే ఫలోన్ముఖములైనవో వేఱుగా ప్రస్తావింప నక్కఱలేదు.

## శాశ్వతము - తాత్కాలికము

సాహిత్యమును స్థూలముగ నీ రెండు తరగతులుగ విభజింపవచ్చును. ఈ విభజనము 'ఉత్తమ గ్రంథముల' విషయముననే! ఇవికాక కాలక్షేపార్థము క్షణికముగ వచ్చు రచనల గూర్చి మనము ప్రస్తుతము పరిశీలింపవలసిన పని లేదు.

ఉత్తమ గ్రంథములలో కూడ కొన్ని తత్కాలీన ప్రయోజనములు, సమస్యలపై నాధారపడి యుండును. జాన్ రస్కిన్ 'తాత్కాలిక ప్రయోజనాత్మకమగు గ్రంథము మిత్రునివంటిది. అది మనోరంజకముగ నుండవచ్చును. కాని దానికి చిరకాల ప్రయోజనము సిద్ధింపద'ని చెప్పెను. "మూన్నాళ్ళ ముచ్చటలు కాక సర్వజనీనమైన యితివృత్తము కలిగి స్థలకాలావధులచే పరిమితముకాని నిత్యమైన మానవ మనోధర్మమును సహజముగను సరసముగను చిత్రించి పఠితల హృదయములో శాంతిని కాంతిని నింపఁగల కావ్యములు సర్వదా పఠనీయములై సాహిత్యలోకమున కలకాలము నిలిచియుండును"[1]ని వీరి యభిప్రాయము. "కవితను ఉద్యమాలకు విమర్శలకు వాడుకోవడం కామధేనువును కదనాశ్వంగా పందెపు గుఱ్ఱంగా వాడుకోవడం వంటిది."[2] కాని దీనిని మనము మఱియొక దృక్పథమున దర్శింపవలసి యున్నది. 'సాహిత్య'మను శబ్దములోనే 'సహిత' భావమున్నది. సమాజములో నెప్పుడెప్పుడెట్టి అవ్యవస్థలు - పరిణామములు సంభవించునో వానిని కవి పరిశీలించి తత్తదుచితమైన యితివృత్తముల నాతఁడు స్వీకరించును. కవి తన ప్రతిభావ్యుత్పత్తులచే నెట్టి వస్తువునకైనను కావ్యగౌరవము సమకూర్చగలఁడు. శారదరాత్రిలో శీతాంశుని వర్ణనమును పఠించుట ఆనందదాయకమే. కాని అగ్ని ప్రమాదములో హుతాశనుని అదుపులోనికి తెచ్చుకొనుట ముఖ్యముకాని ఆయనలోని పావనత్వ, ప్రాణతత్వములను నెమరువేసి

---

1. అ.రా.కృ. వి.స. VI. 165 పుట.
2. భీమన్న సన్మాన సంచిక తొలి పుట. ముద్రణ 21-8-60 సుఖేలా నికేతన్, హైదరాబాదు.

కొనుట ఔచిత్యమునకు భంగము! అనుభూతి యెట్టిదైనను ప్రతిభావంతుడైన మహాకవి దానిని మహాకావ్యముగ మార్చగలడు. కావున ఉద్యమ కవిత్వము సమాజ క్షేమమునకై 'విశ్వశ్రేయః కావ్యమ్' అను సూక్తిని ప్రత్యక్షముగ సార్థక పరచి చూపుచున్నదే కాని, ఎట్టి న్యూనత్వమును పొందుటలేదు. ఉద్యమ కవులు వసంతములో రసాల వృక్షమున కమర్చిన నిచ్చెన మెట్లవంటి వారు. వారి సహాయములేకయే సాహిత్య సహకారము నాస్వాదింపవలెననుట నేల విడిచిన సాము వంటిది! లోకజ్ఞుడైన రచయిత జీవితమును వర్ణించుచు అందలి భిన్న సంఘర్షణల కాధారమైన యంతర్వాహినులను పాఠకుల హృదయములో ప్రవహింపజేయును. అట్టి క్రాంత దర్శనులైన ద్రష్టలస్రష్టల కృతులు ఉద్యమ వాహినినుండి వెలికి వచ్చిన అనర్ఘ మౌక్తికములు!!

## విశ్వసాహిత్యములు - ఉద్యమములు

ఉద్యమము - సాహిత్యము - రెండంటికిని దేశకాలావధులు లేవు! మానవ జీవనమే తీర భూములలో మొలకెత్తినదో, అచ్చట మనకు మానవోద్యమములు- సాహిత్యములో వాని ప్రతిబింబములు మనకు గోచరించును. యూఫ్రటీస్ - టైగ్రెస్, గంగానదీ తీరములు, తీరములలోని నగరములు - నగరములలోని మానవులు, మానవులలోని మనసుల మమతలు, మమతల వెల్లువలు ఆదర తిరస్కారములు, సామ్రాజ్యములు, సంగ్రామములు, ప్రణయములు ప్రళయములు, భాషలు, లిపులు, అందలి యుద్యమములు, వాని ప్రభావములు - బాహిర దృష్టితో చూచినచో వీనిలో అంతరమున్నట్లు తోచును కాని వసుధైక భావముతో పునఃపరిశీలనము చేసినప్పుడీ 'విశ్వాత్మ'లో భేదములేదని స్పష్టమగును. మంచూరియా దండయాత్ర, మావో సామ్యవాదోద్యమము చైనాలో సాహిత్యముగ పరిణమింపగా క్రైస్తవ మతోద్యమము, కన్ఫ్యూషియస్ ప్రభావమును జపాను వాఙ్మయమునకు వన్నె పెట్టినవి. తాయ్ భాషలో 'ఇనాద్' (పంజియను జాతీయ వీరునిగాథ) సాహిత్యమైనచో తుర్కీలో సులేమాన్ చెలిబీ వ్రాసిన మహమ్మదు మతోద్యమ చరిత్రయే ప్రముఖ వాఙ్మయము. గ్రీసులో అడ్మాంటియస్ కోరెస్ పాడిన జాతీయ గీతమునకును ఆంధ్ర - వంగ సాహిత్యములలో చిలకమర్తి, రవీంద్రుల ఆలాపనమునకును భాషలోనే భేదమున్నది కాని తత్వములో, సాహిత్యములో, ఉద్యమ ప్రవణమైన రీతిలో భేదము శూన్యము. జర్మనీలో పదునెనిమిదవ శతాబ్దములోని 'డిరాఙర్' ప్రకృతి కృతులు వ్రాసిన షిల్లర్ కెట్లు సంఘము

స్ఫూర్తి కేంద్రమౌదచ్చి భాషలోని ఎడ్వర్డ్డలెస్ డెక్కర్ రచనలకును 'డచ్చి వారి జావా ద్వీపములోని అక్రమము' లట్టి యితివృత్తములే ! రష్యాలో విప్లవము ఫ్రాన్సులోని పారిశ్రామికవాదము వారివారి సాహిత్యగతులను సమూలములుగ మార్చివేసిన చైతన్య స్రవంతులు. అవి అక్షరముల ప్రజోద్యమములు. దేశములు దూరమైననేమి, మానవుడు, మానవత మారునవి కావు కదా !

## జాతీయ భాషలు :

అంతియకాదు, భిన్న భారతీయ భాషలన్నిటిని పరిశీలించినచో కొన్ని సామాన్య లక్షణము లాశ్చర్యకరముగ ద్యోతకమగును. తొలుతగా భక్త్యుద్యమ కర్తలచే సాహితీ క్షేత్రము సాగుచేయబడినది. కాశ్మీరములో, లల్ద్యద్ కన్నడములో బసవన్న. ఆంధ్రములో పాల్కురికి, అస్సామీలో మాధవ కందళి లేదా శంకరదేవుడు-దేశమెల్ల నొకే సమయమున నొకే కవితాప్రక్రియ గోచరించును. జాతీయ ఏకాత్మతకిది నిదర్శనము భక్తియుగము తర్వాతిది ప్రబంధయుగము. తెలుగులో ప్రబంధమనినాము, హిందీలో రీతి సాహిత్యమనినారు. తమిళములో మతాధిపతుల యుగమనినచో వంగములో వైష్ణవ సాహిత్యయుగమనిరి. విషయ మొక్కటే, భక్త్యుద్యమ సాహితీలత పల్లవమునుండి ఫలత్వమును చేరుట !

'అనంతరము క్షీణయుగము 'చెట్టుతుదిని కుక్కమూతి పిందెలు' పుట్టినవి ! అన్ని వాఙ్మయములలోను సమానలక్షణ మిది ! ఆపై అంధయుగము, అందుండి నవ్యయుగారంభము జరిగినది ఈ విభజనము భారతీయ సాహితీ వేత్తలందఱును ఆయా కాలములలో సమావేశమై తీసికొనిన నిర్ణయములు కావు. కాల ప్రవాహములో నుద్యమములే యిట్లు సొంపైన వంపులనుద్రిప్పి సాహిత్యము తనకు వచ్చిన రీతిగమలచినది ! !

## సంఘర్షణము - సాహిత్యోద్యమము :

'ఉద్యమము' లననేమి ? నాటి జాతీయ జీవనములో బుట్టిన సంఘర్షణమే గదా ! జాతికలదు దానినొక జీవితముకలదు ఆ జీవితమున కొక గతియున్నది. ఆ గతి చరిత్ర ననుసరించి నిర్మింపబడును. చలనాత్మకమైన యా చరిత్ర సాహిత్యముపై ముద్రమువేయును. ఆదెట్లనగా : ఆంధ్ర సాహిత్యమే యున్నది, షష్ఠియవ శతాబ్దములో జైనబౌద్ధుల ప్రాభవము నుండి హైందవము నుద్ధరించుటకు

ప్రయత్నములు జరిగించినవి. భారత మాసాటిది. దానితో తిరిగి యజ్ఞయాగాదులు ప్రారంభమైనవి.

పన్నెండవ శతాబ్దములో దేశముపై మహమ్మదీయుల దండయాత్రలు జరిగినవి. వారు కృపాణహస్తులు. కావుననే వారి యుద్ధృతము నాపుటకు కత్తిని దాల్చిన రుద్రమ్మ, కలమునే కత్తిగ మార్చిన పాల్కురికి జన్మించినారు. కర్ణాట కాంధ్ర సామ్రాజ్యము లీ ప్రయత్నములో కృతకృత్యములైనవి. తిక్కనగారు తిరిగి తరువాతి యుగములో భారతమును వ్రాయుట హరి-హర సమన్వయ సాధనమును జరిగినది. మతాదు లుద్యమాత్మకములై తమ పని నెరవేర్చిన పిమ్మట వికృతముగా మిగిలినప్పుడు వానిని తిరిగి యుపసంహరించుట కష్టతరమైన కార్యము. ప్రయోగమేకాదు ఉపసంహారము కూడ తెలిసిన అట్టి దక్షుడు తిక్కన్న.

రాయల కాలములో రాజ్యము సుఖశాంతులతో నిండినది. రాజే స్వయముగ రసపిపాసువైనాడు. సుకవియైనాఁడు. కాని దక్షిణాంధ్ర యుగమట్లు కాదు. నిర్వీర్యమైన జాతి, దక్షతలేని పాలన, సాహిత్యము కూడ అట్లే యున్నది. కాని సరిహద్దు కవతలి మహారాష్ట్రములో మాత్రము తుకారామ సమర్థ రామదాసులు తమ ప్రజలను భక్త్యుద్యమముతో కాపాడి శక్తి పుత్రుడైన శివాజీని సృజింపజేసినారు. జాతీయ జీవనము కవిత్వమును మార్చుటేకాదు. కవితోద్యమములే జాతీయ జీవనమును కూడ మార్చివేయును ! !

ఆంగ్లేయుల రాకతో ఆంధ్ర సాహిత్య మంధసాహిత్యమైనది. అందుండి ఉషఃకిరణము లుద్భవించినవి. నవ్య సాహిత్యభానుడు ప్రభవించినాఁడు సాహితీ వేత్తలు చరిత్రగతినే మార్చినారు. సమర్థుడైన యుద్యమ ప్రచారకుఁడు భాషను తన కనుగుణముగ వాడుకొనును. పాల్కురికి చేసినదదే. సర్వజ్ఞుఁడు చేసినదది సూర తులసీదాసులు చేసినదది. సంఘర్షణాత్మకమైన జాతీయ జీవనమునుండి సాహిత్యముద్భవించుట, సంకల్ప సిద్ధులైన రస బ్రహ్మలభావమే, ప్రభావముతో చరిత్ర గతిని మార్చుట-ఓతప్రోతముగ సాగెడి పరస్పరాపేక్షితమైన, తర్కబద్ధమైన యీ మహత్తర సమన్వయమునకొక కాలములేదు, దేశములేదు ! ! 'పరస్పరం సంఘర్షించిన శక్తులలో చరిత్రయే"[1] కాదు కవిత్వమును పుట్టిననుట, ఇందు నిరూపితమైన సిద్ధాంతము ! !

---

1. శ్రీ శ్రీ దేశచరిత్రలు మహాప్రస్థానం,

# నన్నయ నుండి చిన్నయ వఱకు

మధురమైన యాంధ్రభాష తొలిదశలో శిలలు కరిగి ప్రవహించిన జీవన సంగీతము. మహారాజులు దాన శాసన సందర్భములలో నాంధ్రమును వాడిరి. కావున భాషకూడ శాసనములకే పరిమితము ! నన్నయకు ముందు పదసాహిత్య మున్నది. విదేశములలోని డితరామ్స్, బాలడ్స్, లిరిక్స్ వలె 'అనియత గణ ములు. యతికాని ప్రాసయతికాని' కలిగిన నిబద్ధ గీతములే భక్తులు పాడుకొను చుండెడివారట ! ఇది మాత్రాచ్ఛందమునకు సంబంధించిన సూత్రము. దీనితో బాటుగ వెన్నెల పదములు ప్రభాత పదములు పర్వత పదములు గొబ్బి పద ములు ఆనంద పదములవంటి పదసాహిత్యమున్నట్లు స్పష్టము.

మనకు తెలిసినంతవఱకు మహాభారతమే లిఖితమైన తొలి తెనుఁగుకృతి. లిఖితమైన ఆమ్నాయమిది ! రాజరాజు క్రి. శ 1022లో 'నిత్యలక్ష్మి జయాభి రాముడై' పట్టాభిషిక్తు డయ్యెను. అప్పటివఱకును రాజరాజునకు సవతి తమ్ము డైన విజయాదిత్యు డాటంకములు కల్గించుచుండెను.[1] కావుననే సాహిత్యావ తర ణము జరుగలేదు. రాజకీయ సంఘర్షణములు వాఙ్మయముపై చూపెడి ప్రభావ మున కిది చిహ్నము

రాజరాజు 'రాజరాజన్య సేవ్యయైన పృథివీరాజ్యలక్ష్మి'ని[2] భుజబలముచే భరింపసాగినాఁడు. ఆయన వైదిక ధర్మమునందనురాగము కలవాఁడు. నన్నయ్య' పరమధర్మవిదుఁడు, నిత్యధర్మ ప్రారంభుఁడు, ధర్మనిరతుఁడు, ధర్మధురంధరుఁడు, ధర్మవిశారదుఁడు, ధర్మ నిత్యప్రారంభ విభాసి, ధర్మ విచారోద్దాముఁడ'ని రాజరాజుచే ప్రశంసల నందినాఁడు. రాజరాజు కూడ 'మను మార్గుడై మనునిభ శుభ చరిత్రుఁడై' యొప్పారెనట ! "రాజరాజు మనుమార్గమున క్షితితలమును సంరక్షించుచుండ ప్రీతులై ప్రజలు నిజచరిత్ర పవిత్రతోయము

---

1. The eastern Chalukyas of Vangi P. 218-219.
2. బేతనబట్లుకోరుమల్లి తామ్ర శాసనము.

లచే కలికాల కలంక పంకమును ప్రక్షాళించుచుండిరని వ్రాసియుండెను దీనివలన రాజరాజు కలియుగమునందే ప్రవర్తించినను అప్రతిమానమైన ధర్మాభిలాషచే లోకమున యుగాంతర ధర్మములఁ బ్రతిష్ఠించి కృతకృత్యుఁడయ్యెనని తెలియుచున్నది".[1]

చాళుక్యులు సింహాసనమునకు వచ్చునాటికి ప్రధాన మతములు హిందూ, జైన, బౌద్ధములు. స్వభావసిద్ధముగ జైన బౌద్ధములు హైందవములో నంతర్భాగమైనప్పటికిని, వైదిక-బౌద్ధ వ్యవస్థల మధ్య సంఘర్షణ మే కొనసాగుచుండెను. పరస్పరము గ్రంథములతో ప్రత్యక్ష యుద్ధములను గూడ జరుపుకొనుచునుండిరి[2] బౌద్ధమెట్లులైనను శంకరునితో వెనుక ముఖము పట్టినది. బుద్ధుఁడు దశావతారములలో నొకఁడైనాఁడు.

ఆంధ్రదేశములో మిక్కిలి వ్యాప్తిలోనున్న మతము జైనము. అర్హతులకు తీర్థంకరులకును సమాజములో పలుకుబడి కలదు. రాజరాజునకు ముందున్న చాళుక్యరాజులు జైనులకెన్నియో దానములు చేసిరి. రెండవ యమ్మరాజు విజయవాడలో రెండు జైన వసతులు నిర్మించి యుంపుడుగత్తెయగు చామకాంబ ప్రేరణమున యర్హమునియను జైనసన్యాసికి కలచుంబఱ్ఱు గ్రామమును దానము చేసెను.[3] ఈయనయే కటకాభరణ జినాలయమునకు మలియంపూడి గ్రామమును 'సర్వకరపరిహారము' గా దానమిచ్చినాఁడు.[4] విమలాదిత్యుని రాజ్యకాలమున కూడ జైనమభివృద్ధి నందినది. తొలుత నీతఁడు శైవుఁడు.[5] తరువాతనే శ్రావకుఁడైనాఁడు. దీనితో జైనము సర్వోచ్చ స్థితినందినది. శైవసన్యాసులగు గొరగలు మొదలగు వారొకవంక శైవోద్ధరణమునకు కృషి సాగించుచునే యున్నారు. తమ మతములను విద్యా వైద్య కేంద్రములుగ మార్చి బ్రహ్మాండమైన ప్రజోద్యమములను కొనసాగించినారు. ఎందరో బౌద్ధులను వైదికులను చేయుట నిది

---

1. నన్నయ భారతము - ఆచార్య దివాకర్ల వేంకటావధాని, 988 పుట.
2. 'నారాయణభట్టు' శ్రీ నోరి నరసింహశాస్త్రి.
3. Masulipatam Plates.
4. EI. XI P. 47-56.
5. రణస్థపూడి శాసనమ్ము.

తోడ్పడినది. కుమారిలుడు బౌద్ధుడే. తరువాత వైదికధర్మ మనుష్ఠించినాడు.[1]

చాళుక్య రాజ్యారంభము వైదిక ధర్మ పునరుద్ధరణమునకే జరిగినట్లు మనకు చారిత్రకాధారములు లభ్యమగుచున్నవి. 'అశ్వమేధావభృథస్నాన పవిత్రీకృత వపుషాం చాళుక్యానాం కులమలంకరి శ్లో॥ సత్యాశ్రయవల్లభేందస్య భ్రాతా కుబ్జవిష్ణువర్ధనః' అని దానశాసనములో నున్నది. అట్లే వజ్జియ ప్రగ్గడ గృహములో

'నిత్యాకర్ణనయా శశ్వద్వటుభిః పటుభిః కృతే
వేదశాస్త్రాణి యద్ధామ్ని పఠంతి శుకశారికాః' అని చెప్పబడినది[2]

ఆనాటి చీదమార్యుడు 'హోమధూమ వినిర్గతా మితకలంకుడు సప్తతంతుకృత యూపస్తంభ శోభితుడు'నై ఆయన గృహము సామగ్ర్య జుర్ఘోషములతోడను, ఉభయసంధ్యలయందు జరుగు యజ్ఞముల స్వాహానాదముతోడను ప్రతిధ్వనించు చుండెనట![3] నారాయణభట్టు ముత్తాత కంచన సోమయాజి 'సదాపురోడాశన పవిత్రవక్త్రుడు'[4] అట్లే విజయాదిత్యుని ర్యాలి శాసనములో వేదపండితుడు పంపనభట్టు ప్రశంసింపబడినాడు [5]

## మతోద్యమ ఫలితమే భారతావతరణము :

హిందూ ధర్మము వేదోపనిషత్తుల పైనను శాస్త్రములపైనను నిలిచిన సౌధము. వేదములను రచించిన వ్యాసుడే జయమను పంచమ వేదమును రచించెను. సర్వ వేదసారసంగ్రహము. ప్రస్థానత్రయములోని గీతకిదే నిలయము. కావున భారత వ్యాప్తియే వైదికధర్మ వ్యాప్తియని రాజరాజెఱుంగును. పంచమ వేదానువాదమున కిది మూలకారణము.

---

1. Elliot Hinduism and Buddhism Vol II P. 110-207.
2. (E. I. VI 347-361)
3. 28 1 A. XIV 48-59
4 నందంపూడి దానశాసనము (17-21)- E. I. 300-309;
5. G. A H. R. S. IX 24-30,

నాడు మిక్కిలి వ్యాప్తిలోనున్న ప్రక్రియ పురాణము. జైనుల కిది ఆయుధము. వైదిక నిష్ఠాగరిష్ఠుఁడైన నన్నయ దీనిని గమనించినాఁడు. వజ్రమును వజ్రముచేతనే ఛేదించినాఁడు తొలి వైదిక పురాణమున కాయన ఆంధ్రమున శ్రీకారము చుట్టినాఁడు. ఈ కారణముననే భారతములో వీలు లభించినప్పుడెల్ల వైదిక ధర్మోద్ధతిని ప్రశంసించుచు, అమూలకములైన వర్ణనలను పదప్రయోగములను, అసంఖ్యాకములు చేసినాఁడు[1] దీనినే కట్టమంచి రామలింగారెడ్డి, కోరాడ రామకృష్ణయ్యగార్లు బలపరచినారు.[2] "పవిత్రమైన యాతని యాశయమొకవంకఁ దెనుఁగు భాషకును వేఱొకవంక వైదిక మతమునకును సమానముగా దోహద మొసంగి యతని కీర్తి చిరస్థాయి గావించెను."[3]

## పాల్కురికి - వీరశైవోద్యమము :

నన్నయనాటి మతోద్యమము బౌద్ధజైనములను నిర్మూలించినది కాని యవనుల దండయాత్ర నాపలేకపోయినది. అరబ్బుల విజయముతో నుత్తరమున ప్రారంభమైన వైదేశిక శక్తుల పురోగమనము క్రమముగ భారతీయ సంస్కృతిని భూభాగములను కూడ పాదాక్రాంతము చేసికొని దక్షిణమునకును ప్రసరించినది శత్రుసేన త్రిలింగదేశపు తలుపుతట్టి పిలిచినది. దానితో జాతికి మతావలంబనము మనుగడయైనది. హింగుళేశ్వర భాగెవాడిలో జన్మించిన వీరశైవజ్యోతి బసవేశ్వరుడీ కొరతను తీర్చినాఁడు. భక్తితో దేశభక్తిని రగుల్కొల్పినాఁడు. ఆయన వెలిగించిన ధర్మజ్యోతికి కర్ణాటకాంధ్ర సామ్రాజ్యములు రెండును తల వంచక తప్పలేదు. నాడు తెనుఁగునాట జన్మించిన కవిశేఖరుఁడు పాలుకురికి సోమనాథుఁడు. మతోద్యమమునకు కవిత్వములో ప్రతినిధి. నిజమైన ప్రజాకవి పాల్కురికి! బసవని కాయన ఏకలవ్య శిష్యుఁడు.

పాల్కురికి రెండవ గురువు పండితారాధ్యుఁడు. వీరశైవమున కీయన వేదార్థము చెప్పి, శైవమునకు- బ్రాహ్మ్యమునకు, పొత్తు కుదిరించి చాతుర్వర్ణ్య

1. 'నన్నయ-భారతము' ఆచార్య దివాకర్ల
2. రాజరాజనరేంద్ర సంచిక అధ్యక్షవచనము; మహాభారత కవితా విమర్శనము (95-106);
3. 'నన్నయ-భారతము' ద్వితీయ పుట. 1044.

వ్యవస్థను, బసవని భక్తిని కలిపి సమన్వయించిన మహాత్ముడు ఆంధ్ర కవితోద్యమమునకు పండ్రెండవ శతాబ్దములోని చోదకశక్తులు వీరు!!

పాల్కురికి, బసవేశ్వర, పండితారాధ్యుల, జీవితచరిత్రములు పురాణములు రచించుటకు కారణమిది!! ఈయనది 'అక్షరముల' ప్రణోద్యమము! మతోద్యమము!! కాకతీయ సామ్రాజ్యము సాకారమైన రాజ(స) శక్తి అయినచో పాల్కురికి దానికి పునాదిరాయి వంటి మతశక్తి! ఈతఁడు తన కవితను సామాన్య మానవునికడకు తీసికొని పోవలెనను సంకల్పముతో దేశీయేతివృత్తము, దేశీయమైన ఛందము,[1] జానుతెనుఁగు, సమకాలీన సాంఘిక సాంస్కృతిక జీవన చిత్రణములు కవిత కాలంబనములుగ స్వీకరించినాఁడు కావుననే పాల్కురికి లేఖిని సద్యః ఫలముల ప్రసాదించినది. పాల్కురికి మతోద్యమకర్తగ, యుగకర్తగ నిలిచి ఎందఱో కవుల కన్నులముందఱ ఆదర్శజ్యోతి యైనాఁడు[2] తన యడుగుజాడలలో వారిని నడిపించినాఁడు.

## తిక్కన - సమన్వయోద్యమము :

ఉద్యమ మారంభింపండుట సులభము కావచ్చునేమో కాని ఉపసంహారము మిక్కిలి కష్టము ఉపసంహారము తెలియని మంత్రమును ప్రయోగింపరాదు. కాని ప్రయోక్త పోయిన పెనుక ఉపసంహారమెఱుఁగక జాతి తల్లడిల్లుట సహజమే! పాల్కురికి సృజించిన యుద్యమశక్తి యిట్లే రూపొందినది. పాల్కురికి సృజించిన యుద్యమ ఝుంఝు వైదేశికుల నెదుర్కొనినది. తరువాత దేశీయ జైనబౌద్ధుల నంతమొందించినది. ఆపై హైందవములోని భిన్న శాఖలను కూడ అణచివేయసాగినది. నృసింహుఁడు విరాట్ స్వరూపమును దాల్చినాఁడు. శివుఁడు వీరభద్రుడైనాఁడు. దీనిని శాంతింపజేయగల ప్రహ్లాదుఁడో, ప్రమథుఁడో ప్రార్థింపవలసిన గతి పట్టినది. తిక్కనగారు చేసిన పని యిది!!

'ధర్మాద్వైత స్థితికై లేఖ్యంబైన ఆమ్నాయమును తిక్కన పూరించు

---

1. "ఉరుతరగద్య పద్యోక్తులకంటె సరసమై పరగిన జాను దెనుంగు
   చర్చింపగా సర్వ సామాన్యమగుట గూర్చెద ద్విపదలు గోర్కిదైవార"
   (బసవ 1-165)
2. 'ప్రజలకోసం అతఁడు పుట్టాడు. ప్రజలే అతణ్ణి అమరకవిని చేశారు'
   స. ఆం. సాహిత్యం. 2. సం, 202 పు.

టకు సిద్ధపడినాఁడు. 'ఆంధ్రావళి మోదముంబరయ' భారత సంహితకు విరాట పర్వము నుండి ప్రారంభించినాఁడు. పాండవులే కాదు హరిహరతత్వము కూడ నా దజ్ఞాతవాసము చేయుచున్నది. దానిని వెలికితెచ్చి సంధిని సమరమును కూడ నడిపి సింహాసనమున సుప్రతిష్ఠము చేసిన యుగకర్త తిక్కన! మతసమన్వయోద్యమమున కాయన కేంద్రము. చుట్టును శతాబ్దము పరిధిలో రచింపఁబడిన వర్తులరేఖ హరిహరాద్వైతము.

## హరిహరాద్వైతము :

తిక్కన అద్వైతి. జీవేశ్వరాద్వైతముతోబాటు శివకేశవాభేదమును గూడ సాధించినారు హరిహరాద్వైతము తిక్కన నిర్మించిన తత్వము కాదు. వేదములలోనే హరిహరకల్పనమున్నది. దానికి పూజారియే తిక్కన.

"కిమస్థిమాలాం కిముకౌస్తుభం వా
పరిష్క్రియాయాంబహుమన్యసేత్వం
కిం కాలకూటః కిమువాయశోదా
స్తన్యం తవ స్వాదువదప్రభోమే" (1-11)

యని భారత విరాట పర్వావతారికలో మక్కువతో వర్ణించిన రూపమిది! భారతమును హరిహరాంకితము చేసినారు. వైదిక ధర్మములోని వివిధ మతముల నడుమ సమన్వయోద్యమమే వీరికి జీవనకార్యము. అంతియగాని బౌద్ధజైనాదుల విషయములో వారును సహనము చూపలేదు. నాటి బౌద్ధులు 'వాద సమృద్ధులు, వేదవిరుద్ధులు, మతప్రావీణ్య శాస్త్రవృద్ధులు.[1] తిక్కనగారు వారితో 'ఇతిహాస వరశాస్త్ర వేదసారముఖస్థ సిద్ధాంత ప్రయుక్తి'ని ఓడించి జైన బౌద్ధ వసతులను నిలమట్టము చేయించినారు. జైనుల కృతులు బహిష్కృతములైనవి.[2] తిక్కనగారి 'ప్రభారాశి'లో 'ప్రచ్ఛన్నము'[3] లైనవి. ముప్పదియారు ముని జైన వసతులను తిక్కనగారు కూలద్రోయించివారు. ఇట్లు సమరస, సమరోద్యమములు

1. కాసె వీరప్ప సిద్దేశ్వర శతకము;
2. ఆంధ్ర కవుల చరిత్రము - మధ్యమ యుగము
3. కవిత్వ వేది

సమముగ నిర్వహించి 'సురుచిరోద్దండ భౌమపరాక్రమ బిరుదాంకితులై'[1] యొప్పారినారు. తిక్కన గారాడినదే మాట, చూపినదే బాట. అయినది. తరువాతి నాచన సోమనాథాదు లీ హరిహరతత్వమును పూజించుటకి మతోద్యమమే కారణము. ఇట సంఘర్షణము నుండి సమన్వయము పుట్టినది. తరువాతి తరముల వారికిది కరదీపికయైనది !!

## ఎఱ్ఱాప్రెగ్గడ :

నన్నయ, పాల్కురికి, తిక్కనల తరువాతి యుగకర్త ఎఱ్ఱన రామాయణ, భారత, నృసింహ పురాణముల నేకహస్తముతో నిర్వహించిన ప్రబంధ పరమేశ్వరుఁడు. ఇట్టి వైదిక మతోద్ధరణా తత్పరమైన కృతులను రచియించుట లోని ఆంతర్యమేమి ??

## రాజకీయ పరిస్థితులు :

ఈయన క్రీ.శ. 1280లో జన్మించినవాఁడు. ఈయన గురువు శ్రీ శంకర స్వామి. ఆయన 'చరణ సరోరుహధ్యానానంద సౌందర్యధుర్యుఁడ'నని గద్యము లన్నిఁటను ఎఱ్ఱన చెప్పికొనినాఁడు. 'కర్ణాటక ప్రాంతములలో శ్రీ విద్యారణ్యులు చేసినట్టి యుద్ధరణ కార్యమును శ్రీ శంకరస్వామి శ్రీశైలభూమిలో చేసియుండు ననుటకు సందేహములేదు.'[2]

ఎఱ్ఱనకు రాజాశ్రయము లభించినది. విదేశీయుల బారినుండి దేశమును, ధర్మమును సముద్ధరించుటయే పరమార్థముగాగల రాజ్యమది. రాజైన వేమారెడ్డి తమ్ముఁడు మల్లారెడ్డి. ఈ 'మల్లరధినీనాథుఁడు'[3] హిందూ ధర్మోద్ధరణమునకు పట్టుగొమ్మ ! చెదలవాడలో రామాలయ ప్రతిష్ఠ జరిపి, ఎఱ్ఱనగారిని కూడ చెదలవాడకు తీసికొని వచ్చినాఁడు. శంభుదాసుని రామాయణ మట వ్రాయఁబడినదే ! పిమ్మట హరివంశమునుగూడ వేమారెడ్డిచే నిండు సభలో పూజలందుకొని 'భారత పరాంశ'మని పెద్దలచే చెప్పబడెడి 'రమ్యకథ' కావున నిర్వహించినాఁడు.[4]

---

1. సిద్ధేశ్వర చరితము
2. వి. సర్వ. తె-భా.స. శ్రీనోరి. 784 పుట.
3. హరి-వం 1-89
4. హరి వం. పీఠిక

భారతమును శ్రీశైలములో ఎఱ్ఱనగారు రచించినారు వేమారెడ్డిగారు మల్లికార్జున భక్తులు. 1335లో అహోబిల, శ్రీశైల క్షేత్రములలో సోపానపంక్తిని నిర్మించినాఁడు.[1] మల్లారెడ్డి రాజకీయ వైశారద్యమునకు గూడ శ్రీశైలమే 'శక్తి' కేంద్రము. మల్లారెడ్డి ప్రారంభించిన యుద్యమమే తరువాతి తరముల వారికి రాచబాటయైనది. బహిమినీసుల్తాను మొదటి అహమ్మదుషా కృష్ణ దాటి అనవోతారెడ్డి కాలమున పిల్లలమఱ్ఱి, అమరేశ్వరముల నపవిత్రముజేసి పురోగమించినప్పుడు ప్రధాని మల్లయవేముఁడు మహమ్మదీయాశ్వికదళము నెదుర్కొని భయంకర సంగ్రామములో వారి నోడించినాఁడు.

ఇట్టి పరవడి నాపిన పిమ్మట జాతికి ఒరవడిపెట్టవలెనని మల్లయ సంకల్పము. ఎఱ్ఱనగారీ మహాకార్యక్రమమునకు నాయకుఁడు. 'శ్రీ మల్లచమూపతి సేవామధురిమ నిత్యసుముఖి' ప్రేరణయే భారత హరివంశ రామాయణ కృతుల రచనమునకు కారణము.

విదేశీయులు గోబ్రాహ్మణులపై కత్తిగట్టినారు. వారిపై మల్లారెడ్డి ప్రభృతులు కత్తి గట్టినారు కావుననే ఎఱ్ఱనగారి రచనలలో గోబ్రాహ్మణ వర్ణనము అమూలకమైనది విపరీతముగ కన్పడును. భారతీయ ధర్మమునకు బాహ్యచిహ్నములవి. 'ఆ భక్తి ఆతని రచనలం దెల్లెడల ప్రత్యక్షముగ కన్పించును.'[2]

ఎఱ్ఱనగారి భారత పూరణము అలవోకగా సాహిత్యదృష్టితో జరిగిన సాధారణ కార్యముకాదు. రెండు జాతుల పరస్పర సంఘర్షణ ఫలితమది! జాతీయ పునరుజ్జీవన కార్యక్రమములో శంఖుదాసునిచే కల్గింపబడిన కరదీపికలే రామాయణ, మహాభారత, హరివంశములు!

## శ్రీనాథుఁడు పోతన :

15వ శతాబ్దమును ప్రధానముగ భారతీయ సాహిత్యములలో 'భక్తియుగము'గ భావింపవచ్చును శ్రీనాథ, పోతనలలో రచనామార్గము భేదించినను

1. ప్రోలయవేముని చీమకుర్తి శాసనము కాలము 1335
2. ఏ స.తె.భా.స శ్రీనోరి. 786 పుట.

కావ్యాదర్శమొక్కటే! భక్తి!! విచిత్రముగ ఇదే సమయమున భారతీయ భాష లన్నింటిలోను భక్తి గ్రంథములే వెలసినవి!

శ్రీనాథుని కృతులన్నియును శివపారమ్యమును బోధించెడివి. ఒక్క పల్నాటి వీరచరిత్ర మాత్రము తద్భిన్నము అన్నియును మార్గపద్ధతిలో సాగగా పలనాటి కథ మాత్రము ద్విపదలో నున్నది. కొందరీ యుగమును మార్గదేశి కవితల మధ్య జరుగుచున్న ప్రక్రియాపరమైన ఉద్యమ 'సంగ్రామోద్యమము'గ వర్ణించిరి. "ద్విపద కావ్యమును ప్రబంధీకరించి ఆ కథను నవీన మార్గకవితా మండలమునకు (నియోక్లాసికలో ఫీల్డ్) గొనిపోవలెనని ప్రబంధ కర్తలు ప్రయత్నింపగా ప్రబంధములను ద్విపదీకరించి, ఆ యితివృత్తములను దేశికవితా భూమికి (పాప్యులర్ ఫీల్డ్) కొని తేవలయునని ద్విపద కర్తలుద్యమించిరి"[1]

శ్రీనాథుని కృతులన్నియును శైవమత గ్రంథములు. నైషధము కూడ శ్రీ విద్యాపరమైన కుండలినీ యోగమును బోధించెడి కృతి.[2] పండితారాధ్య చరిత్ర పాల్కురికి ద్విపదకు మార్గకవితా శరీర మొసగిన కృతి. సూర్యుడు భారతీయుల ప్రత్యక్ష దైవము. కావుననే మయూరుని మహాస్రగ్ధరలతో పొదగబడిన కాశీ ఖండమాంధ్రములో నవతరించినది! ఇట్లే 'వీర చరిత్రా' వతరణములో కూడ నొక నిర్దిష్ట ప్రయోజనమున్నది! ఇది మత సంబంధియైన సంగరము. వైష్ణవులకు బ్రహ్మనాయకుడు బసవేశ్వరుని వంటివాడు. ఈతడు సంఘ సంస్కర్త. చాపకూడు పేరనంతశ్శాఖా భోజనములే కాదు బసవనివలె నీతడును వర్ణాంతర వివాహములను ప్రోత్సహించెను. స్వయముగ తాను చేసికొని తన పుత్ర మిత్రాదులకు జరిపించెను "దానితో నిదియపర భారతమయినది."[3] ఇతి వృత్తము పాల్కురికి నాటిది. ఛందము కూడ పాల్కురికి నాటిదే! భక్తి యన్ననో పాల్కురికి భక్తియే! కాలము మాత్రమే మారినది కాని భక్త్యుద్యమమే మఱల కాలవాహిని పై క్రమబద్ధమైన సేతువుగ నిలిచినది!!

పోతన్నగారు జన్మించినది కూడ పాలకుర్తికి చాపుననే. తమ కవిత్వ

1. శ్రీ పిం. లక్ష్మీకాంతము. పూర్వ ప్రబంధయుగము వి. స. 3 సం. 597 పు.
2. శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ 'స్వర్ణహంస'
3. ప. వీ. చరిత్ర పీఠిక, శ్రీ పింగళి లక్ష్మీకాంతము

ప్రయోజనము 'శ్రీకైవల్య పదము'నకు లోకులకు పథమును చూపుటయే! భాగవతమునకు 'హయగ్రీవ బ్రహ్మవిద్య' యను పేరునుఁ గలదు ఇట్టి కష్టమైన గ్రంథము కావుననే శ్రీధరుఁడు దీనికొక వ్యాఖ్య వ్రాసినాఁడు. పోతనది శ్రీధరీయ మార్గము. ఇట్లు 'భక్తిరస ప్రధానములగు సప్తమాష్టమ నవదశమ స్కంధముల దానే రచింపఁదలచి మధ్య స్కంధములు"[1] మాత్రము శిష్యాదుల కిచ్చెను.

పోతనది అచ్చముగా పాల్కురికి పలుకు. పాల్కురికి వర్ణనలు పాల్కురికి భక్త్యాత్మకముగ చేసిన వర్ణనలను యథాతథముగ కూడ స్వీకరించి విస్తరించుట కలదు![2] దీనికి కారణ మిర్వురునొకే 'యుద్యమము'నకు చెందిన కవులగుటయే!!

తొలుతగా సంస్కృత భాగవతావతరణమే భక్తి భావవ్యాప్తి కారణముగ గలది. పోతనగారి కృతి నెన్నుకొనుటలోని వైశిష్ట్యమిది! వేదవ్యాసుఁడు సరస్వతీ నదీ తీరమున శుచియై కూర్చుండ నారదుఁ డేతెంచి 'భక్తిహీనంబులైన జ్ఞానవాచాకర్మ కౌశలంబులు నిరర్థకంబులు'[3] గాన 'శ్రీవిభు కీర్తులను బొగడుమ'ని[4] వచించెనట! దానితో వ్యాసుఁడు 'భువనక్షేమకరంబైన భాగవతామ్నాయమును' గల్పించెనట! ఇట్లు భారత భాగవతములలోని తత్వముల నెల్ల విచారించి 'తత్సమన్వయముగ భక్తిమార్గ ప్రబోధముగ'[5] పోతన మూల భాగవతమును పదునైదవ శతాబ్దములో నాంధ్రీకరించి జగద్ధితంబగు కార్యమొనర్చి భక్త్యుద్యమములో ఆంధ్రతైర్థికులను సుస్నాతులను గావించెను!

## అన్నమయ్య - ప్రబోధ్యమము :

తెలుగులో నాలుగు కవిత్రయములు కలవు. మొదటిది సుప్రసిద్ధమైన మహాభారత కవిత్రయము. రెండవది శివకవిత్రయము. నన్నెచోడుడు దీనికి

---

1. శ్రీ నిడదవోలు వెంకటరావు భాగవతము వావిళ్ళ ప్రచురణ 1948 ముద్రణ. పీఠిక 83-84
2. భాగవతము 3-223; 441; 4-925; 7-150; 9-529; 10. I 989; 10 II 257
3-4. 2-భాగవతము
5. పోతన గ.వేం. చే.శా.వి.స. III 9 8 3 పు.

ఆద్యుడు. పాల్కురికి సోమనాథుడు పూజ్యుడు- యుగకర్త. మల్లికార్జున పండితుడు ఉద్యమస్వరూపి. ఇక మూడవది వైష్ణవ కవిత్రయము. అన్నమాచార్యుడు దీనికి ఆద్యుడు పూజ్యుడు. పెద తిరుమలాచార్యుడు అనుయాయి. చిన్నన్న వారికి వారసుడు. నాల్గవది ద్విపద భారత కవిత్రయము. "దైవచమత్కృతి యేమన ద్విపద భారతమునకు తిమ్మయ, బాలసరస్వతీశ్వర సోమనలు-(అను) కవిత్రయ మేర్పడినది."[1]

విచిత్రమేమనగా ఈ నాల్గు కవిత్రయములును నాల్గు ఉద్యమములను నిర్వహించినవి. చివరి మూడు కవిత్రయములకు స్ఫూర్తి "దేశి"యే. వీరిది అక్షరాలా ప్రజోద్యమము. అన్నమాచార్యుడు ముప్పదిరెండు వేల పదములను రచించి భాషలో, భావములో, అభివ్యక్తిలో, ఛందస్సులో- అన్నింటిలోను సాహిత్యమును సామాన్యునికి చేరువగా తీసికొని పోయినాడు. ప్రాచీనాంధ్ర సాహిత్యములోని ఉద్యమ నిర్మాతలలో పాల్కురికి సూర్యుడు, అన్నమయ్య చంద్రుడు. మిగిలిన వారు తారకలు.

ధవళములు శోభనములు మంగళహారతులు ఏలలు, జోలలు, చాంగుభళా, తందనానా, పదములు తుమ్మెద పదములు గొబ్బిపదములు చందమామ పదములు సువ్విపదములు ఒక్కటేమిటి అన్నమయ్యనోట ఒదగని తెలుగు పదమే లేదు అన్నమయ్య పాటను పాడుకొనని జానపదులు, జ్ఞానపధులు లేరు. పదిహేనవ శతాబ్దము మొత్తమును ఆక్రమించుకొనిన మహోద్యమమిది.[2]

## ప్రబంధ యుగము :

ఆంధ్ర వాఙ్మయములో స్వర్ణయుగమనబడు ~ పదునాఱవ శతాబ్దము మిక్కిలి విశిష్టమైన కాలము. ఈనాడు ప్రజోద్యమములు లేవు. సాంఘిక సంస్కరణములు లేవు. దేశము సుస్థిరమైన విజయనగరాధీశుని గొడుగు నీడలో కడుపులోని చల్ల కదలకుండ కాలము వెళ్లబుచ్చసాగినది. దానితో సాహిత్యములో త్రికాలాబాధితమగు ధర్మప్రబోధము పైని, రసానందముపైని కవులు దృష్టిని నిలుపసాగిరి. స్థూలముగ చెప్పవలెనన్నచో సాహిత్యమునాడు పరాకాష్ఠనందినది- పతనోన్ముఖమైనది కూడను !

---

1. ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ ప్రచురణ. కర్ణపర్వము అవతారిక
2. వివరములకు నేను రచించిన "శ్రీ పదార్చన" నవల చూడుడు.

## యుగధర్మము :

అష్టదిగ్గజముల ప్రముఖ కృతులు యుగధర్మమునకు దర్పణములు. మనుచరిత్రాదులు పరిశీలించితిమేని వానిలో భక్తి, రక్తి, సమప్రాధాన్యముతో సాగినట్లనిపించును రెండును ధర్మనిష్ఠములే మనువీ జాతికి మూలపురుషుఁడు. శ్రీకృష్ణుడు దైవము, లేదా జాతీయవీరుఁడు, విష్ణుచిత్తుఁడు మహాభక్తుఁడు, రాజశేఖరుఁడు, వసువు సుక్షత్రియులు. నిరంకుశ నిగమశర్మలు ధూర్తభక్తులు. వీరే రాయలకాలపు ప్రతినిధులు 'ఆనిష్ఠానిధిగేహ సీమనడురేయాలించినను.... కృపయా భోక్తవ్య'మను మాటలే విన్పడు కాలములో 'మాకొకటే నినాదం తిండిలేంది ఊరుకోం' అను 'అభ్యుదయ' కవిత్వమెట్లు వికసించును? శృంగార వీరములు వారి ప్రధాన రసములు. ప్రవృత్తియో, నివృత్తియో వారి ప్రధాన కర్తవ్యములు! కాలానుగుణమైన పరిణామమిది!

## సమాజ ప్రభావము :

ప్రబంధ కవులు సమకాలీన సమస్యలకును, సాంఘిక చైతన్యమునకును దూరముగ నుండి రాణులను, గంధర్వ కాంతలను సృజించి, తాము నిర్మించుకొనిన భర్మడోలికలలోను గగనహర్మ్యములలోను, విహరింప యత్నించినను సంఘమువారిని సుజ్ఞాతముగనో, అజ్ఞాతముగనో తన 'కబంధ హస్తము'లలోనికి తీసికొని పరిష్వంగ మొనర్చుకొనినది! ఈ బిగికౌగిలిలో నలిగిన పాత్రలే ప్రవర వరూధినులు. అదెట్లో వివరించెదను!

నాటి కవులందఱును పూనికతో నుద్యమించి గార్హస్థ్య ప్రచారమే తమ పరమ ప్రయోజనముగ నుంచుకొనిరి. 'కెలకులనున్న తంగేటి జున్ను గృహమేధి' యని వర్ణించెడివారే! ఇందులకొక ప్రబల హేతువున్నది! శంకరుల యనంతరము సన్యాసమునకు ప్రాధాన్యము హెచ్చినది! బౌద్ధయుగమున సామూహికముగ సంఘారామములలోనికి పోయినట్లే మఠములలోనికి మానవులు ప్రవేశించినారు. దీనిని ప్రబంధయుగ మరికట్టినది. జాతిని గార్హస్థ్యమువైపు త్రిప్పి శృంగారములోని చవిని చూపించినది. 'తుచ్ఛసుఖముల్ మీసాలపై తేనియల'ని వరూధినిని తిరస్కరించి 'అగ్నులేమయ్యె నొక్కొ' యని విలపించిన ప్రవరుఁడు కూడ సోమిదమ్మ కడకేగుటకు తొందరపడినవాఁడే! వరూధిని కాముక ప్రవణశీలురై 'ఆనందో బ్రహ్మ'మన్న వాక్యమున కపార్థములు చెప్పెడి నాటి యొక

వర్గమునకు ప్రతినిధి. ప్రవరుఁడాదర్శ గృహస్థాశ్రమవాద ప్రతిష్ఠాపనా చార్యుఁడు ఈ యిర్వురి సంఘర్షణమే మనుచరిత్రము కోరికలు గుఱ్ఱములు కాగా వానిని హద్దులోనుంచి ధర్మార్థ కామములను క్రమ సంఖ్యలోనే వారుంచినారు కాని తాత్త్వికము 'ధర్మావిరుద్ధకామము'నకు విరుద్ధము కాలేదు. దుష్టులైన నిరంకుశ నిగమశర్మలు కూడ పశ్చాత్తాపమందినట్లు చిత్రించుటలోని రహస్యమిది!!

## రుద్రకవి - ఒక పరిశీలన

ఉద్యమ దృష్టితో వాఙ్మయమునకు వ్యాఖ్యానము చెప్పెడి యీ వ్యాసములో రుద్రకవికొక విశిష్ట స్థానమున్నది. మిలిగిన వారి యితి వృత్తములకును రుద్రకవి కథకును భేదమున్నది. ఈయన సామాజికేతివృత్తమును స్వీకరించినాఁడు. సమకాలీన సమాజ కల్లోలము నుండి తన కావ్యకల్హారమును వికసింపజేసినాఁడు. నాడు గార్హస్థ్యమునకు పట్టిన దుర్గతికి వగచిన వాడీకవి. సమాజములో వర్ణాశ్రమ ధర్మములు పాటింపబడుటలేదు.' లంజతల్లుల చేతిమల్లటకు గాక[1] 'దుర్వృత్తులన్నియుఁ గడచిన వారే' నాడు ప్రముఖులు. 'మగడు సంసార నివర్తనచేసి యిట్టు తిరిగిన మనమున గోపింప కెట్టి మగనాలుండున్.[2] కావుననే రుద్రకవి గారి నిరంకుశ పత్ని అత్తగారిని నోరు తెరిచి 'యీయకృత్యమే'మని ప్రశ్నించినది ఇది నాటి సామాజిక మహత్తర పరిణామమున కెత్తిన నిలువుటద్దము !

రుద్రకవి ప్రాధాన్యమింతటితో తీరిపోలేదు. 'సుగ్రీవ విజయ' యక్షగాన కర్త యీతఁడు ! దీనితో రాబోవు తంజావూరు యుగములోని ప్రక్రియాపరమగు మహోద్యమమున కుత్తరమున శ్రీకారము చుట్టిన వాడయినాఁడు !

సుగ్రీవ విజయము దేశీయమైన ఛందముల పుట్ట ! త్రిపుట రాగములో అందలి రచనములన్నియును రాబోవు ముత్యాలసరములకు మాతృకలు.

"కపికులోత్తమ నాకు జూడగ గపటవేషము గానరాదిది విపులపుణ్యుల బాపమతులని, వెరవనేలా...." ఈ త్రిపుట రాగగతి, అప్పారావుగారి ఛందమున

1. నిరంకుశో 2-26.
2. నిరం. 2-60

కాధారము మూడు శతాబ్దముల తరువాత వచ్చిన ఛంధో పరివర్తనోద్యమమున కిది ప్రాతిపదిక ![1] ఇట్లు వర్తమానోద్యమములను సాంఘిక చైతన్యమును ప్రతి బింబించుటయే గాక తన కృతులలో తరువాతి తరముల యుద్యమముల కీయన అంకురార్పణమును చేసినాఁడు ! !

ప్రక్రియాపరముగ ప్రబంధము కూడ నొక యుద్యమమువలె నాటినుండి కొన్ని శతాబ్దములు వ్యాపించినది. వసుచరిత్రలు - పిల్ల వసు చరిత్రలు - హీన వసుచరిత్రలు కూడ తరువాతి కాలమున వెలసినవి. ప్రబంధము వ్రాయనిదే కవి కాడను భావము కలుగునంతటి తీవ్రమైన ప్రభావమిది ! చివరకు నవ్యులు, అతినవ్యులు కూడ అష్టాదశ వర్ణనములతో ప్రబంధమును నిర్మించినవారే ! ఇంతటి విస్తృత ప్రభావము కల ప్రక్రియ కాద్యుడై తెలుగువారి సొత్తుగ దానిని తీర్చిదిద్దినాఁడు రాయలనాటి కవి ! ! 'వైదిక మతమునందును వర్ణాశ్రమ ధర్మము లందును నాడు ప్రజలకు కొంత యశ్రద్ధ జనించినది. మాధవసాయణులు వేద భాష్యమును రచించియు రాజకీయ విషయములందుఁ బాల్గొనియు వైదికమతమును గొంతవరకుఁ బునరుద్ధరించిరి. కాని కాలక్రమమున ఆ'యుద్యమము' గూడ సన్నగిల్లినది."[2] అందుకు ప్రత్యామ్నాయముగ వెలువడినదే ప్రబంధోద్యమము.

## యక్షగానము-ఉద్యమము :

ఉద్యమము ద్విధావర్తించును. మొదటిది భావాత్మకము. రెండవది ప్రక్రియాత్మకము. సమకాలీన సాహితీ ప్రక్రియ లేవియున్నచో వాని నాలంబన ముగ చేసికొనియే భావాత్మకములు విస్తరించును. మతోద్యమములు. ఆధునిక మగు స్వాతంత్ర్యోద్యమములును ఇట్టివి ! రెండవది ప్రక్రియాపరమైన వింగ డింపు ! పూనికతో నొకానొక సాహిత్య ప్రక్రియను వ్యాపింపజేయవలెనని స్థిర సంకల్పులైన కొందఱు క్రాంతదర్శులైన కవులు సంసిద్ధపడి రచన కుపక్ర మింపగనే వారి తపఃఫలముగ నంతవరకును కారడవిగనున్న సాహిత్యారణ్య ములో కాలిబాట యేర్పడును. కారు చీఁకటి మధ్య కాంతిరేఖ పొడమును.

---

1. 'అప్పారావుగారు చేపట్టిన ఛందస్సు పునాదులు ఎంతలోతున ఉన్నాయో రుద్రకవి యక్షగానం తెలియజేస్తుంది.' ఆరుద్ర, స.ఆం.సా. 8 సం. 182 పు.

1. డు. రామిరెడ్డి కవికోకిల గ్రంథావళి 4. అల్లసాని పెద్దన. 121 పు.

ఇనుమువంటి ప్రక్రియకు కవిలేఖిని పరుసవేదివలె పనిచేయును. తెలుఁగులో ద్విపదోద్యమ మట్టిది, ప్రబంధోద్యమ మట్టిది, తక్కిన దండకములు శతకములు గతానుగతికముగ వచ్చినవేకాని 'యుద్యమ' దృష్టితో వీరోచితముగ నవతరించి నవి కావు.

## ద్విపదోద్యమము :

ప్రబంధము గూర్చి మనవి చేసితిని. యక్షగానము గూర్చి ప్రస్తావించుటకు ముందు ద్విపదనుకూడ ప్రసక్తము చేయుదును ప్రక్రియాపరమైన ప్రముఖోద్యమములలో ద్విపద ముఖ్యమైనది. పాల్కురికి సోమనాథుఁడు దీనికాద్యుఁడు. బౌద్ధులు సంస్కృతమును వదలి సామాన్య జనప్రాకృతములను స్వీకరించినట్లు పాల్కురికి మతోద్యమమున కనుగుణమగు భాషోద్యమముతోపాటు ద్విపదను కూడ స్వీకరించుటతో ఛందములో నొక మహత్తర పరివర్తనమును సాధించి నాఁడు. "తన లక్ష్యమును ప్రజాసామాన్యములో ప్రచారములోనికి తెచ్చుటకు ప్రజల భాషయగు జానుతెలుగును ప్రజాభిరుచి కనుకూలమగు ద్విపద కవితా రచనయు నావశ్యకములైనవి."[1] సోమన, బుద్ధారెడ్డి, సింగన, పిడుపర్తి, బసవన, అన్నమయ్య, చిన్నన్న, లింగకవి, మల్లన, తిమ్మన, రంగశాయి, సిద్ధేంద్ర యోగి, ప్రభృతులు శతాధికులకీ ప్రక్రియ గమ్యమైనది వీరందఱికిని పాల్కురికి పెట్టినదే భిక్ష !! యక్షగానము దేశీయమైన ద్విపదను, మార్గసంబంధియైన ప్రబంధమును కూడ తనలో లీనమొనరించుకొనినది.

## యక్షగానావతరణము :

యక్షగాన మాకస్మికముగ వచ్చిన మార్పుకాదు. కాలానుగుణ్యమైన క్రమ పరిణామమది ! ప్రామాణికములైన మన్నారుదాస విలాసాదులనుండి పతనశిఖర మధిష్ఠించిన సతిదాన శూరాదుల వఱకు వందలుకాదు వేలసంఖ్యలో నతివేలముగ వచ్చినవి యక్షగానములు. రాయల నిర్యాణముతో విజయనగర సామ్రాజ్య జ్యోతి దక్షిణమునకు వలస బోయినది. తమిళ కర్ణాటక భాషల నడుమ, ఆంధ్ర భాషా యోష కడు విచిత్రముగ తన యొయ్యారముల నొలికించినది. తంజావూరు,

1. ద్విపద వాఙ్మయము శ్రీ నిడదవోలు వెంకటరావు వి.స. IV సం. 2 పు. 846-47.

మధుర, మైసూరు, జింజి- పుదుక్కోటలను పంచముఖ బ్రహ్మమునుండి వెలువడిన సంగీత సాహిత్య నృత్యాది సర్వకళా సమన్వితమైన సమగ్ర సాహిత్య ప్రక్రియ యక్షగానము!!

జావాలోని వోయంగ్‌వోంగ్, జపానీయుల 'నో' రూపకము, బర్మాదేశపు యాగన్‌మౌసాలు, సింహళీయుల కోలమ్‌నాటియా టిబెట్ ప్రభృతి దేశముల మిస్టరీలు, వంగభూమిలోని 'యాత్ర'లు, మలయాళ కథాకళి, నేపాలగంధర్వ గానము, మార్వారుగంధర్వ నృత్యములలోని విశేషములన్నిటిని యక్షగానము తనలో లీనమొనరించుకొనుటయేగాక, పై ప్రక్రియలన్నిటికన్న తలమానికముగ తెనుగున రూపొందినది.

**కారణములు :**

ఏ యుద్యమము కూడ కార్యకారణ సంబంధము లేక, బీజప్రాదుర్భావము నుండి ప్రగతితో పరిణామావస్థను చేరనేరదు. అది ద్విపదకైనను యక్షగానములకైనను వర్తించెడి సూత్రమే!! సమకాలీన సాంఘిక చైతన్యము ఉద్యమాత్మకమైన వాఙ్మయ గమనము నిందులకు కారణములు. యక్షగాన వికాసము నాడు, హరికథలు, బొమ్మలాటలు, కొరవంజెలు, మహారాష్ట్రుల- అభంగ్‌ల, ఆంధ్రదేశములో వ్యాప్తిలో నుండినవి. మహారాష్ట్రమునకు చెందిన శాహాజీ ప్రభృతులీ యభంగములచే ప్రభావితులైనవారే! కావుననే చెవ్వప్ప నాయకుని సంతతివారితోబాటు శాహాజీ ప్రభృతులును తెలుగులో యక్షగానములు రచించిరి. పరప్రాంతీయులు, తెలుగు ప్రాంతము కానిచోట, తెలుగులో సాహిత్యసృష్టి చేయుట, వంటి సంఘటన మపూర్వము!

ప్రక్రియాపరముగ యక్షగాన మాధునిక నాటకమునకు మాతృకయైనను తదావిర్భావమునకు కారణము మాత్రము జాతిలోని నీరస స్థితియేనని చెప్పక తప్పదు. సౌలభ్యమును, శృంగారమును కోరిన జాతి, 'రీతి'ని వదిలి యక్షగానము నాశ్రయించినది 'నీతి'ని కూడ వదిలిన యక్షగానకర్తలు లేకపోలేదు. ఇది ఒకరిద్దఱిలో కలిగిన పరిణామము కాదు, జాతి మొత్తమును దక్షిణాంధ్ర యుగములోని సాహిత్యోద్యమములో పాల్గొనినది. యక్షగాన రచన కుపక్రమింపని అక్షరాస్యుఁడే లేడనినచో నతిశయోక్తి లేదని రచనా సంఖ్య సూచించుచున్నది. సుశిక్షితమైన సైన్యము పాలెగాండ్ర నాశ్రయించినది. కృష్ణరాయల రాజ్య

రమ విజయరాఘవు నాశ్రయించినది. నన్నయాదుల లంకరించిన సారస్వత పీఠము రంగాజమ్మ నాశ్రయించినది. కావుననే ప్రబంధోద్యమము నాయకరాజుల కాలమున యక్షగానోద్యమముగ పరివర్తన మందినది. భావ తీవ్రతకు జాతికి జాతి సంసిద్ధమైన యుద్యమ శీలతకు ఇది ప్రబల నిదర్శనము ! !

## ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామము

### పూర్వాపరములు :

సుదీర్ఘమైన వాఙ్మయ చరిత్రమును వివిధ సాహిత్య చరిత్రకారులు తమకు తోచిన రీతిని యుగ విభజనము చేసినారు. ప్రక్రియాపరముగను యుగకర్తలపై నాధారపడియును, పోషకుల ననుసరించియును, పురాణ యుగమనియును, నన్నయ యుగమనియును, చాళుక్య యుగమనియును ఈ రీతిగ సాగినది. వారి సంఖ్య కూడ ఎనిమిది నుండి పదివరకున్నది ! ఉద్యమ పరిశీలకమైన దృష్టితో గమనించినప్పుడు వాఙ్మయములో నాలుగు ప్రముఖమైన 'మైలురాళ్ళ' వంటి ఘట్టములు కలవు. 1) నన్నయ నుండి ప్రారంభము 2) ప్రబంధముల నాటి నుండి యారంభము 3) 1857-ఆ తర్వాత 4) స్వాతంత్ర్య సిద్ధి తరువాత ! నన్నయ నాటినుండి మతోద్యమములు భక్త్యుద్యమములు, ప్రబంధము నాటి నుండి ప్రక్రియకు పరిమితమైనవి. అట్టి నిస్తబ్ధ కవితావాహిని గుండెలలో నగ్ని పర్వతములు ప్రోగిన సంవత్సరము 1857 ! నాటితో తెలుగు కవిత్వమే కాదు భారతదేశ చరిత్రయే క్రొత్తమలుపు తిరిగినది. 1857-1947 ఈ తొంబది సంవత్సరముల కాలమును సంగ్రామాత్మకమైన యుద్యమములు ప్రముఖ స్థానమాక్రమించినవి. దేశభక్త్యుద్యమము, ఆంధ్రోద్యమము, తెలంగాణా యుద్యమము - మార్క్సు భౌతికోద్యమము - ఈ శాఖకు చెందినవే ! మొత్తము మీద 1857 అంకెలు కాక, అక్షరములుకాక అగ్ని స్రవంతులుగ జాతి యెదలో జరజర పారినట్లు భావింపవలెను ! దీనికి పూర్వాపరములు రెండింటిని పరిశీలింపనిదే రాబోవు యుద్యమముల 'కథ' అంతుపట్టదు !

సిపాయిల తిరుగుబాటు 1857 లో జరిగి విఫలమైనను దాని ప్రభావము మాత్రము సఫలమైనట్లే లెక్క ! భారత జాతీయ రంగములో నాటితో పునరుజ్జీవనము ప్రారంభమైనది. విప్లవానంతర ముత్తరమునవలె తీవ్రముగ తీవ్రతరముగ దక్షిణమున పరిణామము వెంటనే రాకున్నను ఉష:కిరణముల కిదియే

జాతీయమైన వేకువ ! దీనికి ముందు కొన్ని గణనీయమైన సంఘటనములు జరిగి నవి వానిని ప్రదర్శింతును !

## సాధువుల తిరుగుబాటు :

1767 నుండి 1775 వఱకును ఉత్తర భారతములో సాధువుల నాయకత్వములో ముందుగ తిరుగుబాటు ప్రారంభమైనది. 1857 పోరాటమునకును, ఆ తరువాత దేశవ్యాప్తముగ సాగిన స్వాతంత్ర్య సంగ్రామమున కివి బీజముల వంటివి. కావుననే వంగభూమిలో నీ పోరాటము జరిగినను అనంతర కాలమున నీ రంగస్థల మాంధ్రభూమి కొక శతాబ్దము తరువాత మారినది. సాధువుల పోరాటము వింతగ నుండవచ్చునుగాని అక్బరునాడు మధుసూదన సరస్వతీంద్రుని నాయకత్వమున జరిగిన సంగ్రామము కాని ఔరంగజేబునాడు సమర్థ రామదాసు చేయించిన పోరాటము కాని పరిశీలించినప్పుడిందలి సామంజస్యము అవగతమగును.

1771 నుండి 74 వఱకు గవర్నరు జనరల్‌గానున్న వారన్ హేస్టింగ్స్ ఈ తిరుగుబాటును గూర్చి ఆంగ్లేయులకొక సుదీర్ఘమైన రహస్య నివేదికను పంపినాఁడు.[1] 1767-75 'కంపెనీ రికార్డు'లలో నీ పోరాటము హోరాహోరీగా సాగినట్లు వర్ణింపబడినది 'సన్యాసులిట్లు యుద్ధములు చేయుచునే శత్రువుల మధ్య నున్న తీర్థములను సేవించుచు పుణ్యనదులందు స్నానములు చేయుచు తమ తమ ధర్మములను ఆచారములను యథావిధిగ జరుపుకొనుచునే యుండిరి ప్రజలు వారి కాతిథ్యమునిచ్చి గౌరవించుచునే యుండిరి.[2] బంకించంద్రుని 'ఆనంద మఠము'న కిదియె యితివృత్తము. ఈ నివురుగప్పిన నిప్పు 1857లో భగ్గుమన్నది !

## తెలుఁగునాడులో స్వాతంత్ర్యోద్యమము :

ఈ స్ఫూర్తి తెనుఁగు దేశమును కూడ క్రాంతిలో నింపినది. 1815 లో దోపిడీగాంద్ర నాయకత్వములో తొలిపితూరీ జరిగినది.[3] అది తెలంగాణము మీదుగా కృష్ణానదిని చేరి సర్కారు జిల్లాలన్నిఁటినీ దోచుకున్నది ! ఇంతకన్న

1. Secret consultations 21-1-1773 No. 5 & 6
2. Bleig's memoirs of Hastings letter Lated 9 3. 1773.
3. ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర, ఏటుకూరి బలరామమూర్తి 293, 86 పు.

పెద్ద తిరుగుబాటు 1833లో గోలుకొండ ఏజెన్సీలో జరిగినది! ప్రథమ భారత సంగ్రామ వార్తలు దేశమంతా వ్యాపించగానే 1857లో తిరిగి కొండ దొరలు సన్యాసి భూపతి అను వ్యక్తి నాయకత్వాన తిరుగుబాటు చేశారు. 1856 లో ఒకసారి 189. లో మరొకసారి కొండ దొరలు మరల పితూరీలు చేశారు[1]

## ఉద్యమము - అశాంతి :

దేశమంతయును తొలిసారిగ అశాంతియే యుద్యమమై వ్యాపించినది. రాబోవు నూతనయుగ కవిత్వమునకు అనుకూల వాయువులు వీచినవి. 1857 సంగ్రామ ప్రభావము ప్రత్యక్షముగ బళ్లారిలోని భీమారావు తిరుగుబాటులో ప్రతిఫలించినది మాజీ తాసిల్దారైన ఈయన తిరుగుబాటు ముఠాకు నాయకత్వము వహించి హోస్పేటకు 26 మైళ్ల దూరములోనున్న కొప్పాలును స్వాధీనపరచుకొనెను. తుంగభద్రా తీరమున పితూరీదారులకును బ్రిటిషు సేనకు తీవ్ర సంగ్రామము జరిగెను. అందు నాయకుడు భీమారావుతోబాటు నూరు మంది మరణించిరి. డెబ్బదియేడు మంది బంధింపబడి బ్రిటిషు నాయకులచే ఉరి తీయబడిరి.

## లక్ష్మీనరసుచెట్టి ప్రచారము :

మద్రాసులో లక్షాధికారులైన గాజుల లక్ష్మీనరసుచెట్టి యను వ్యాపారస్థుడు 'క్రిసెంటు'యను పత్రికను స్థాపించి, నిర్బంధ బైబిలు బోధనను, పాదరీల క్రైస్తవమత ప్రచారమును వ్యతిరేకించిరి. 1846లో పన్నెండువేల సంతకములతో నొక మహజరును చెట్టిగారు పార్లమెంటుకు పంపినారు కంపెనీ వారి నుండి పాలనను రాణిని హస్తగతము చేసికొనమని తీర్మానించినాడు. దీని వలన ప్రజలలో ఆందోళనకు అంకురార్పణ జరిగినది! ఉద్యమ ప్రవణమగు మరొక యుగపు ఉషస్సుషమ గోచరించినది.

## తీవ్రమైన శిక్షలు :

మహోద్యమములలో ప్రజలు వెల్లువవలె తిరుగబడుదురు. క్రియ-ప్రతిక్రియ యను సూత్రముతో వారంత ఉద్ధృతముగ తిరుగుబాటు చేయుటకు అంత

1. ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర ఏటుకూరి బలరామమూర్తి 283, 86 పు.

తీవ్రముగ అణచబడినట్లు అర్థము. భారతీయులను మానవులే కాదనినట్లు ఆంగ్లేయులు పాలించినారు భూమిశిస్తు అధికారి డాంచేసే మర్ 'కొందరిని తల క్రిందులుగా కోదండము వేసిరి. కొందరి రెక్కలు విడిచి కట్టిరి. కొందరి నెత్తిన బండలు పెట్టి కొరడాలతో బాదిరి' ఈ దారుణముల నమలు జరుపుటకు 'టార్చర్ కమీషన్' యను నొక సంస్థ కలదట ![1]

ఈ దారుణముల వలన ప్రజలు తిరుగుబాటు వైఖరి నవలంబించినారు. 1860 రాయలసీమ కరువు, 1877, 1878 లలోని క్షామము వారి యసంతృప్తిని ద్విగుణీకృతము చేసినది. ఒక్క మద్రాసులోనే కరువునకు మరణించిన వారి సంఖ్య 50 లక్షలు !

## అజ్ఞత – అనుభవము :

ఆంధ్రులకు నాడొక దురభిప్రాయ ముండెడిది. తమ బాధలకు కారణము ఆంగ్లేయులు కాక కంపెనీవారని, కావుననే తామాంగ్లేయుల పాలనలో సుఖించెద మని పొరపడినారు. అందువలననే లక్ష్మీనరసుచెట్టి కూడ సిపాయిల తిరుగుబాటుకు వ్యతిరేకముగ పని చేసినాడు. రాణిగారి పదవీ స్వీకారమున కాంధ్రులు నివాళులర్పించినారు. పరవస్తు వేంకటరంగాచార్యులు 'ఆంగ్లాధిరాజ్య స్వాగతము' పలికినారు. కొక్కొండ వేంకటరత్నశర్మ 'యువరాజు పర్యటనము. వోయం ఆఫ్ ది ప్రిన్స్ ఆఫ్ వేల్స్ (విజిట్ టు ఇండియా)' వ్రాసి తమ రాజభక్తిని చాటుకొనిరి, కందుకూరి వీరేశలింగము పంతులుగారు కూడ దేశభక్తి విషయములో 'విక్టోరియా రాణి చరితము'నే రచించిరి. కొచ్చెర్లకోట జమీందారు 'ప్రభు విశ్వాసము' ప్రకటించిరి. శ్రీ జార్జి పట్టాభిషేక సమయమున 'జార్జీశ్వర మా సరస్వతిని గాన్కం జేతు'మని 'కారనేషన్' సంచికలో కవితలల్లిరి. కాని అనుభవమందుకు భిన్నముగ పరిణమించినది.

## పరిణామము :

1857 విప్లవము విఫలమైనప్పటికిని దానివలన బ్రహ్మాండమగు మార్పులు సమాజములో కలిగినవి. అసంతృప్తి బీజము లొక వైపునను ఆంగ్ల విద్య మరొక

1. సామ్రాజ్యవాదుల దోపిడీ–ప్రజల ప్రతిఘటన 281 పుట. ప బ, సం చ

వైపునను భారతీయ సామాజిక జీవనముతోపాటు ఆంధ్రుల సాంస్కృతిక సాహిత్య రాజకీయ రంగములన్నింటిని కూడ మిక్కిలి ప్రభావితము చేసినవి భావికాలములో వివిధోద్యమముల కీ ప్రభావము ప్రబల కారణము వైదేశికమైన సంప్రదాయములు తెనుగున దిగి భావవిప్లవమునకు బాటలు వేసినవి !

ఆంగ్ల భాషాభ్యాసము క్రమక్రమముగ వాడుకలోనికి వచ్చినది. 1861 లో 155 మంది మెట్రికులో కృతార్థులు కాగా ఈ సంఖ్య 1871 నాటికి 1793 కు పెరిగినది. 1861లో ఇరువది నలుగురు పట్టభద్రులుండగా 1868 లో నలుబదియొక్క మంది, 187.లో నూటముప్పది మంది పట్టభద్రత్వము నందిరి. 1871లో తొలిసారిగ నర్గురికి ఎం ఏ పట్టము కూడ లభించినది [1] ఈ ప్రభావము ఆంధ్ర విద్యావంతుల 'భావాంబరములను కిమ్మీర'[2] మొనర్చినది. "సాంఘిక రంగమున సంస్కారణాభిలాష, సాహిత్య రంగమున నవ్యసృష్టి, భావనాంబరమున విశృంఖల విహారము, సంప్రదాయ రంగమున వ్యవస్థిత వస్తు ధిక్కారము అనునవి ఈ సంధియుగమున ధర్మపంచకము."[3]

నాటికి దేశీయ ప్రభువుల నిరంకుశాధికారములు నశించినవి. దాదాపుగ అందరును బ్రిటీషువారి సామంతులైనారు. ఆంగ్లము రాజభాష యగుటతో ప్రజలు జీవనోపాధికై తెల్లవారి విద్యలకెగబడినారు ఆంగ్ల విద్యాధికుల గౌరవము ప్రబలుట, దానితో భౌతిక విజ్ఞానాభివృద్ధి, హేతువాద పరిశీలనమును ఒకదానినొకటి ఆశ్రయించుకొని పురోగమించినవి !

వేద విద్యలెండిపోయి బ్రాహ్మణులకు పూర్వపు ప్రాముఖ్యము సమాజమున నశింపజొచ్చినది. ఫలితముగ వర్ణవ్యవస్థ, కులవ్యవస్థలు సడలిపోయినవి. "బ్రాహ్మణుల అగ్రహారాలూ ఇండ్రిగలూ దేవాలయ భూములూ క్రమక్రమంగా పాలకాపుల చేజిక్కి వారి స్వంత ఆస్తిగా పరిణమించి ఆ వర్గం రెడ్డిగం చేసే స్థితి"[4] ఏర్పడినది ఆర్థికమైన యీమహత్తర పరివర్తనము సమాజ జీవన పద్ధతినే మార్చి రాబోవు స్వాతంత్ర్యోద్యమమునకును, అభ్యుదయ కవితోద్యమాదులకును, మూలకందమై నిలచినది.

---

1 Ibidense Page 79.

2,3. శ్రీ కె. వీరభద్రరావు 'తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావం',

4. కె. వి. రమణారెడ్డి "కవికోకిల జీవితము"

'ఏనాఁటి యగ్రహారము
మానాటికి ఖండ్రికాయె మాపనిదీరన్
మీనాడు మాన్యమాయెను
నానాటికి తీసికట్టు నాగంభట్టూ'1 ఇట్టి ఆర్థిక స్థితిగతులలో నవీన పాశ్చాత్య విజ్ఞానమునకు, యుగయుగముల భారతీయ జీవనమునకు ఒక వైపునను, హేతువాదమునకు, మౌఢ్యవాదమునకును మఱొకవైపునను ప్రచండ సంఘర్షణ యేర్పడినది. ఈ సంఘర్షణము నుండి రాలిన విస్ఫులింగములే ఉద్యమ నాయకులైన వీరేశలింగము, గురజాడ, గిడుగులు!

## సంధి యుగము :

1857 తరువాతి కాలమును నవ్యయుగమనుట కన్న సంధియుగ మనుటయే సమంజసము ప్రాతయుగ మంతరించలేదు, క్రొత్తయుగ మవతరింప లేదు. కాని నవ్యయుగోదయమును సూచించెడి ఉషస్సునకు ముందటి ప్రభాత పవనములు మాత్రము ప్రసరించుట మొదలైనది. తొలి కోడి కూత ఒకటి తొలుతగా విన్పడినది. 'క్రొత్తపాతల మేలి కలయిక'తోపాటు గమనార్హమైన పరిణామములు సమాజములో సమ్యక్ క్రాంతికి మార్గము చూపినది. ఈ పరిణామ భానుడు తన గమనమును పడమటినుండి తూర్పునకు మరల్చుట ఈ సంక్రాంతి లోని విశేషము !!

## మార్పులు (Changes) :

1) అన్యమతావలంబికి కుటుంబమున వారసత్వపు హక్కు నిలిచినది.
2) సహగమనము నిషేధింపబడినది.
3) స్త్రీ పునర్వివాహము చట్టరీత్యా అంగీకరింపబడినది.
4) వానికి సమాజ గౌరవము కూడ లభించినది. శిష్టులు కొందరు వానికి వెళ్లి తాంబూలము లందుకొనుట జరిగినది.
5) బాల్యవివాహములు నేరముగా మారినవి. 12 సంవత్సరముల లోపలి చిన్నదానిని భర్త కలిసినను శిక్షార్హుడేనని చట్టము చేయబడినది.

1. చాటుపద్య మణిమంజరి.

6) సముద్రయానము అంగీకృతమైనది. అట్లు యానము చేసివచ్చిన వారితో శిష్టులు విందారగించినారు.
7) బ్రాహ్మణులు వేదము వదిలి హూణవిద్య కెగబడినారు.
8) బ్రాహ్మణులు సేవకవృత్తి నవలంభించినారు.
9) పురోహితులు తమ బిడ్డలకు వేదము, స్మార్తకర్మ నేర్పించక పోవుటతో భావితరములకు కష్టము కలిగినది.
10) బ్రాహ్మణేతరులు, అన్యమతస్థులు వేదాధ్యయనము చేసినారు.
11) మ్లేచ్ఛులను బ్రాహ్మణులు గురుభావముతో అంగీకరించినారు.
12) బ్రాహ్మణులు వైశ్యశూద్ర వృత్తులలో ప్రవేశించినారు.
13) భారతీయుల కట్టు, బొట్టు, కేశఖండనము విదేశీయుల పద్ధతిలో నుండుట [అనగా సాంస్కృతికముగ, ఆర్థికముగ, రాజకీయముగ, నాగరికముగ కూడ భారతీయులు విదేశీయుల ననుకరించి అని అర్థము.]
14) అన్యమతస్థులతో సహపంక్తిని ఉపాహారము స్వీకరించుట.
15) విదేశీయుల భోజనశాలలలో భుజించుట.
16) స్త్రీలు పాఠశాలలకు పోయి, హూణవిద్య నభ్యసించుట.
17) పురుషులతోపాటు వారును సభలలో సమావేశములలో పాల్గొనసాగినారు. పత్రికా రచనము సంపాదకత్వము నిర్వహించినారు.
18) సీమకు వెళ్ళిన అగ్రజాతులవారు మద్యమును సేవించుట- అట్టివారికి దేశములో గౌరవము లభించుటేకాక తమ పుత్రికలనిచ్చి వివాహము చేయుటకు కూడ సవర్ణులు పోటీ పడుట.
19) కన్యాశుల్కము, వరశుల్కము సమాజమును పీల్చి పిప్పి చేసినవి.
20) అగ్రజాతులు, హరిజనులు పొగబండి, పొగ ఓడలలో కలిసి పయనము చేయుట, కొందరు వారితో విందు నారగించుట కూడ జరిగినది.
21) రజస్వలానంతర వివాహములు చేయుటకు సాహసించినారు. అటనట అన్యదేశ వివాహములును జరిగినవి. ప్రేమ వివాహములలో వర్ణవ్యవస్థ పాటింపబడలేదు.
22) పసిపాపలను వృద్ధులకిచ్చి వివాహము చేయసాగినారు.
23) వితంతువులకు శరణాలయము లేర్పడినవి.

24) విగ్రహారాధన, ఏకేశ్వరారాధన వంటి మతపరమైన విషయములలో మహత్తర పరివర్తనములు జరిగినవి.[1]

## రాజకీయము - మతము :

ఇదిట్లుండగా జాతీయశక్తులు కూడ రాజకీయముగ నాధ్యాత్మికముగ తమ బలమును సమీకరించుకొన సాగినవి. 1885 డిసెంబరు 28 మధ్యాహ్నము 12 గంటలకు బొంబాయి గోకులదాస్ తేజపాల్ సంస్కృత కళాశాల భవనమున 'భారత జాతీయ మహాసభ' అవతరించినది. దీనికి అంతశ్చైతన్య వాహినియో అనునట్లు రామకృష్ణ, వివేకానంద దయానందుల శంఖారావము విన్పడినవి. పంచనదీ ప్రాంతములో వెల్గించిన ఆర్యసమాజ వైదికజ్యోతి జనమునకొక జాగరణమునకు ప్రభాతగీతిక పాడినది. ఆంగ్లేయుల శతాబ్దముల గుత్త ఆధిపత్యముపై గొడ్డలిపెట్టు పడినది దానితో వృక్షము కూకటివ్రేళ్ల నుండి కదిలినదే కాని నేలకూలలేదు! కొత్తపాతలు 'మేళికలయిక'తో సంధియుగము నావిష్కరించినవి కాని సంఘర్షణ కున్న మంత్రకవాటములను కూడ నీకుంచికలే తెరిచినవి! ఇదొక ఉషస్సమంతినీ పరిణామ దశ!

## చిన్నయసూరి :

నవ్యయుగమున కాయన వేగుచుక్క కాకున్నను, సంధి యుగమున నొక ప్రముఖ పాత్ర నిర్వహించిన కర్ణధారిగ చిన్నయసూరి వాఙ్మయ నౌకపై నిలిచి నాడు. ప్రధానముగ ఆయన పండితుడు, వ్యాకర్త. అయినను నీతిచంద్రికతో పరివర్తనాత్మకమైన కాలములో పద్యమునకును వ్యావహారిక గద్యమునకును నడుమ వ్యవస్థిత వచన సేతువును నిర్మించినాడు. ఈయనతో తెలుగునాట అవ్యవస్థ అంతరించినది. అంధయుగపు కోనలలోని భాషానాగముల మృతాస్థికలపై అమృతవర్షము కురిపించిన గరుడాళ్వారువలె ఈ వైష్ణవ శిఖామణి నీతి చంద్రికలో 'నన్నయ పద్యమునకు వలె తాను గద్యమున'కు[2] ఆద్యుడైనాడు.

---

1 శ్రీ కొండా వేంకటప్పయ్య, దాసు నారాయణరావులు కృ. ప. 1910. సెప్టెంబరు 1వ సంచిక (2 పు)లో వ్రాసిన రచన ఆధారము.

2. ఆచార్య దివాకర్ల వేంకటావధాని - వి. స. VI 383 పు.

## నవ్యయుగము :

తెలుఁగున నవ్యయుగమున కీనాడు 'ఆరంభ'మని ముహూర్తమును దైవజ్ఞులు నిర్ణయింపకున్నను, తిరుపతి వేంకటకవులు ప్రచండము కవిత్వము నొక ఉద్యమముగ ఇతఃపూర్వమెన్నడును లేని తీరున నడిపించుట కారంభించిన క్షణమే నూతన రాగోదయవేళయని స్థూలముగ చెప్పవచ్చును తిరుపతి కవులను మించిన ప్రబంధములు వ్రాసిన సమకాలీనులు లేకపోలేదు. గ్రంథ బాహుళ్యమును ప్రక్రియా వైవిధ్యమును వీరికన్న మిన్నగ ప్రదర్శించినవారును లేకపోలేదు కాని తిరుపతి కవులకు ఘనత దీనివలన లభించినది కాదు 'ప్రౌఢ శైలి పేర ఉపజ్ఞారహితులైన కవులు ప్రబంధ సరస్వతిని బంధించిన సంకెళ్లను విడగొట్టి, ఆమెకు స్వేచ్ఛావిహార సౌలభ్యము నొసగిన స్వతంత్రు'[1]లనియే వీరికి గౌరవము! ప్రబంధ శుద్ధాంత సుందరికి 'పరదా' తొలంగించి ప్రజాస్వామిక యుగమున నడిపించిన 'ఘనులు' వీరు![2] వేషభాషల జంజాటములేని 'అత్యాధునికాంధ్ర సరస్వతి' వీరి కుపాస్యదైవము. సాహిత్యమున కుద్యమత్వ 'మక్షరాలా' సిద్ధిపజేసినారు తిరుపతి కవులు.

## వివిధోద్యమముల బీజావస్థ :

ఆధునికాంధ్ర సాహిత్యములోని వివిధోద్యమముల కీనాడే బీజములు జ్ఞాతముగనో అజ్ఞాతముగనో నాటబడినవి సాంఘికేతి వృత్తములను స్వీకరించుట తత్పూర్వమరుదు. కాని 1875లో 'బ్రాహ్మణీయ'మను ఆధునిక సాంఘిక కథావస్తువుతో వావిలాల వాసుదేవశాస్త్రిగారు ప్రబంధము వ్రాయుట వర్తమాన సమస్యలతో కవి స్పష్టముగ తాదాత్మ్యము చెందెననుటకు చిహ్నము. వారు స్వీయచరిత్రమును పద్యములలో రచించిరి.

> "నానవేయి యెనిమిదగు నూటయేబది
> యొకటవ యేటిజూ నొకటినాడు

1. శ్రీ పింగళి లక్ష్మీకాంతము 'తెలుగు వాఙ్మయము' వ్యాసము వి స. II 620 పుట.
2. "వీరి కవిత్వము ప్రాచీన కవితకు భరతవాక్యము, నవీన కవిత్వమునకు నాంది" ముట్నూరి కృష్ణారావుగారు కృ. ప.

పుట్టి కార్మూరిలో మట్టెము వారింట
మేనమామల కోర్కె మీద నట్లు" ఈ తీరులో కవిత్వము వ్రాయట అపూర్వము పాశ్చాత్య ప్రభావము, తిరుపతి కవుల ఉద్యమము, సమకాలీన చైతన్యము దీనికి దోహదము చేసినవి!! వీరే ఆ గ్లములో కౌపర్ రచించిన **'On the receipt of my mother's picture out of Norfolk'** ను 'మాతృస్వరూప స్మృతి' పేర ఆంధ్రీకరించిరి. తదుపతర్పమలైన ఛాయలకు, అనువాదములకు, విదేశీయ వాఙ్మయపు దిగుమతికి ఇది 'పచ్చదీపము'. వడ్డాది సుబ్బారాయుడుగారు సుతస్మృతి, సతీస్మృతులు రచించి స్మృతికావ్యములకు పునాది వేసిరి. ఆదిభట్ల నారాయణదాసుగారు ఈ దశలోనే గోల్డ్‌స్మిత్ వ్రాసిన ట్రావెలర్‌ను 'బాటసారి'గ అనువదించిరి. యథేచ్ఛగ ఆంగ్లము ప్రయోగించుట వీరి వైశిష్ట్యము. 'రావు సూర్యారావు రాజాబహదూర్ల ఛాపెట బిల్లులాత్రైవెజన్లై రెవరి' 'బెస్టు టేనిన్గోదావరీ ఈస్ట్ దసీజె' ఇత్యాదులు. మతుకుమల్లి నృసింహ శాస్త్రిగారు తమ 'చెన్నపురి విలాసము'లో స్వేచ్ఛగా ఆంగ్ల పదములను ప్రయోగించెను. 'టెలిగ్రాపు నాదాన నిక్కముగా దూరపుదీపి' వార్త లెట్లెరుంగవచ్చునో 'వింత'గ వివరించిరి. రాబోవు భాషామహోద్యమమునకి ప్రయోగములు సింహ ద్వారమును తెరిచినవి!

చెన్నాప్రగడ భానుమూర్తిగారు టెన్నిసన్ 'లేడీక్లేర్'ను అనుసరించి 'మాలతీ రాజహంస'మను ఖండకావ్యము రచించెను. ఇదొక శాఖకు మార్గదర్శక మైనది అట్లే 'శైవ శ్మశానవిలాస'ములో ఎలిజీ రచనముచేసి రాబోవు భావ కవిత్వోద్యమములో వెల్వడిన స్మృతికావ్య ప్రక్రియకాద్యులలో చేరిరి. జాతీయ కవిత్వము మొదలైనది. ప్రజాందోళనమునకు ప్రతినిధులై మదింగంటి వేంకట రాఘవాచార్యులవంటి కవులు తమ కేశవస్వామి శతకములో (1868) దేశములో 'ఉరి కిరాతకవృత్తి తురక రాజుల మూకబెరికి చేతుల పెచ్చుపెరిగి లోకమున కధీశుల మంచుమూర్ఖ మదోద్రేక సంచారులై' సాగించెడి దుండగములను పరా త్పరునికి మనవి చేసికొన్నారు. ఈ కవి మహబూబ్‌నగరు జిల్లా కేశవపురము నకు చెందినవాడు. ఏతత్కాలములోని త్రిలింగాంధ్ర పరిస్థితుల నీవాక్యములు స్పష్టముగ చాటి చెప్పుచున్నవి. రాబోవు 'తెలంగాణా పోరాట'మను శాఖోపశాఖ లైన వటవృక్షమున కిది శతాబ్దము క్రితమే నాటబడిన అసంతృప్తి బీజము!!

ఒకవైపు మార్క్సు గ్రంథముల ప్రభావము దేశీయులపై క్రమపద్ధతిలో ప్రారంభమైది రాజకీయములకు మతమును ముడిపెట్టక మత సంపర్కములకు అతీతముగా ఆర్థిక రాజకీయ సంస్థలు వికాసము పొందవలెనని యొక తరగతి ప్రజలు[1] ఆందోళనము చేయసాగిరి. 1940 నుండి వికసించిన అభ్యుదయ కవిత్వమున కిది తొలిచైతన్యము. హేతువునకు (Reason) విశ్వాసము (Faith) నకు మధ్య నిరంతర సంఘర్షణ మొకటి ప్రారంభమైనది. దీని మీదనే ఆధునికాంధ్ర సాహిత్యమంతయును విస్తరించినది. దీనిని ముందు అధ్యాయములో వివరింతును. "19వ శతాబ్దిలో నూతనోద్యమము ప్రారంభమైనది. అది అన్ని ముఖములను చాల ఉధృతముగనే మొదలయినది.[2]

---

1. ఉషఃకిరణాలు : శ్రీ ఎండమూరి సత్యనారాయణ 334 పుట.
2. ,, ,, ,, 336 పుట.

## ద్వితీయాధ్యాయము

# రెండు మహా సిద్ధాంతములు

## (ఉద్యమ మాతృకలు)

"నవ్యాంధ్ర సాహిత్యకళ్లోలినిలో అంతర్వాహినిగా హేతువాదానికి (భౌతిక వాదానికీ) ఆధ్యాత్మిక వాదానికి జరుగుచున్న ఒక నిరంతర సంవాదం గోచరిస్తుంది."

(భారతి - ఆగస్టు, 1964)

**ఉపక్రమణిక :**

వ్యక్తియేకాదు సమష్టియును, ప్రాంతములు దేశములే కాదు, జాతులకు జాతులును, తమ జీవనగతికి హేతువులైన మూలసూత్రములను కొన్నిఁటిని నిర్ణయించుకొని ఆ తత్వప్రాతిపదికపై పురోగమన శీలము లగును. ఇది విశ్వ మానవ చరిత్రకే వర్తించును. కాలము ననుసరించి మూలసూత్రములు సరళ రేఖలుగనో, వలయ రేఖలుగనో లేక క్షితిజ రేఖలుగనో ఉండవచ్చును. కాని మానవ సమాజము మాత్రము కొన్ని నిర్దిష్టమైన, నిర్దుష్టమైన సిద్ధాంతముల నాలంబనముగ చేసికొనియే జీవించును. జీవనము, వికాసము, చివరకు ప్రళయము కూడ ఆ సమాజమునకా మూలసూత్రములే యగును సమాజమని నపుడు, దేశము, కాలము, చరిత్ర, సంస్కృతి, సాహిత్యము- అన్నియును తదంతర్గత తత్వములే యగును. ఒక మహాసూత్ర మొక సమాజమును వికసింపజేయుటో వికటింపజేయుటో జరిగినచో ఆ పురోగమన తిరోగమనములును, ప్రోజ్జ్వలన, ప్రళయములు రెండును ఆనాటి సాహిత్యమునకు కూడ వర్తించు ననుట సిద్ధాంతము !

**రెండు మహా సిద్ధాంతములు :**

1857 నుండి 1957 వరకు ఒక శతాబ్ది కాలావధికల తెలుఁగు నాటి సాహిత్యపు కలకండ యచ్చుల పరిశ్రమను పరిశీలించినచో ఈ శతాబ్దము

జాతీయ జీవనముతోపాటు పాలవంటి జాతి బ్రతుకులో రాశీభూతమైన మీగడ వంటి సారము- సారస్వతము- రెండు మహా సిద్ధాంతముల నాధారముగ చేసి కొని సాగినట్లు వ్యక్తమగును సాహిత్య క్షీరసాగర మథనములో హాలాహలము అమృతము రెండింటి ఉద్భవమునకును ఈ సిద్ధాంతములే ఆలంబనములు అవియే సాహిత్యోద్యమముల కన్నిటికిని మూలతత్వములు. భౌతిక, ఆధ్యాత్మిక సిద్ధాంతములను నవియే ఆ మూలతత్వములు. ఈ రెండను ఇరుకెలంకుల నిలువబడి సమన్వయమును సంఘర్షణమును సమయము ననుసరించి సాగించుచు దేవదానవులవలె పరస్పరము కలిసికొనుచు కలహించుకొనుచు చివరకు ఉత్తర దక్షిణ ధృవములవలె నిలుచుచు జరిపిన అమృతాన్వేషణమే యీ నూరేండ్ల సుందర మందర మథితమైన రసోదధి చరిత్ర! ఇందు పీయూషపానము చేసిన దేవతలె కాదు, తలలు తెగి తుండెములైన మొండెములు రాహుకేతువులు కూడ ఎందరో కలరు. వీరి అక్షర కథనమే ఈ మహాసిద్ధాంత గ్రథనము.

## పూర్వము - పరము :

ఆంధ్ర సాహిత్యము నాద్యంతము విహంగావలోకనముతో పరిశీలించి నచో తొలి ప్రకరణమునకన్న మలిప్రకరణము భిన్నముగ గోచరించును. నన్నయ నుండి చిన్నయ వరకు కవులను నడిపిన చోదకశక్తి మతము. సంఘర్షణములు సమన్వయములు మతపరముగనే సిద్ధించినవి. జైన బౌద్ధములను త్రోసి రాజనుటకు నన్నయగారు పాకశాసనివలె నారాయణ ద్వితీయుడై సాహిత్య సమరము సాగించి సనాతన వైదిక మతమును నిలుపగా, పాల్కురికి ప్రజా కవియై తెలుగువారి యెదలలో తెలుగునుడుల కడలులు పొంగించి జాతీయ కవియై, జానపద కవియై 'భక్తి'తో వీరశైవ జ్యోతిని 'కల్యాణము' నుండి తెలంగాణము వరకు గొనివచ్చినాడు. దీనితో 'తోటి బోయ'ల ఉధృతము తగ్గి కుహనా కిరాతకుడైన పశుపతి మతమువే రూని నిలిచినది. కర్మము తగ్గగా భక్తుల ధర్మము మొగ్గినది. ఏమైననేమి? రెండును మతపరములె కదా! సమతకు పరములే కదా! పూర్వము నవశతాబ్దముల చరిత్రమిట్లే ఇంచుమించు సాగినది. ఈ కాలములలోని యుగకర్తలైన కవితావిభులు, 'నచనాధు'ల నవనిధులు కూడ ఉద్యమ ప్రవణమైన వారి దృష్టినే సూచించును. పూర్వవాఙ్మయమంతయును ఇంతియ!

కాని తరువాతి కాలములో ధరిత్రి చరిత్ర మారినది చరిత్రతో సాగునదే

సాహిత్యము, సంస్కృతి నాటివరకును మతపరమైన సాహిత్యము పందొమ్మిదవ శతాబ్దారంభములో మతమునకు పరమైనది. ముక్తిని గూర్చి చింతించెడి పూర్వమానవు డీనాడు భుక్తికై యుక్తులు పన్నసాగినాడు. దేహమే దేవాలయమగుట ఎట్లున్నను కడుపే కైలాసమైనది దానితోడిదే సాహిత్యము, సర్వస్వమును.

## కారణములు :

ఇది ఆకస్మికముగ జరిగిన పరివర్తనము కాదు. సకారణమైన కార్యము. పరివర్తన మనుటకన్న దీనిని పరిణామమనుట మంచిది!

## భౌతికము ;

పంచభూతములు నాటివరకును ఆరాధ్య వస్తువులేకాని భూతముల 'మాయ' కు లోబడుట పూర్వీకుల మతము కాదు, సమ్మతము కాదు కాని 19వ శతాబ్దములో నా ధోరణి మారినది. ఆంగ్రేయుల ప్రకృతి పరిశీలనతో భూతములపై గల అంధ విశ్వాసములను భూతకాలములో పాతిపెట్టి, భయపడుట మాని బానిసలుగా చేసికొను ఉద్యమ మారంభమైనది ఈ దృష్టి ఇంతింతై వటుడింతయై చివరకు భూమిని సాంతముగ లంఘించి గగనసీమను ఆద్యంతము చుంబించి వేల్పుల తిండిపై వాసయోగ్యమైన గృహనిర్మాణ పథకము నాలోచించుటతో ప్రకృతి విజయము పరిపూర్ణమైనది. భూతకాలమును త్రోసిరాజనిన హేతువాద ధోరణికి ప్రకృతి విజయము ప్రథమ సోపానము వంటిది ![1]

---

1. విజ్ఞాన వ్యాప్తికి 19వ శతాబ్దము పర్వకాలము మానవుల గర్వకాలము. స్టీమరు (1807), రివాల్వరు (1887), విద్యుత్తంతి (1855), టెలిఫోను (1876), సినిమా యంత్రము (1898), సెల్యులాయిడ్ (18ı0), కుట్టు యంత్రము (1880), ఫొటోగ్రఫీ (1887), డైనమైటు (1867), వైర్‌లెస్ (1895) ఎక్సురే (1895), ఫొటోఫిల్ము (1888), రైల్వే యింజను (1829), మైక్రోఫోను (1877) రబ్బరు టైరు (1888), సైకిలు (1840), మోషను పిక్చరు ప్రొజెక్టరు (1805) లినోటైపు (1885), ఉక్కు ( 858), పెన్ (1884), టైపుమిషను (1878), స్టెతోస్కోపు (1819) వంటి వన్నియును ఒకే కాలములో వెలుగులోనికి వచ్చినవి.

## ఆర్థికము :

ఆబ్లే రాజుల 'రోజుల'లో కడుపులో చల్ల కదలకుండ కూర్చుండిన కవి పండితులు 'బొంగు బుజాన వేసికొని పోయెద మెక్కడికేని' యని సంస్థానముల నాశ్రయింపవలసి వచ్చినది జాతీయ సంపద మొత్తము తెల్లవారి హస్తగతము కాగా, జాతి తెల్లమొగము వేసికొని బ్రతుకును తెల్లవార్చుకొనసాగినది. ధన హీనమైన జాతి దివ్య తత్వమును గూర్చి చింతించుట కలలోని మాట. కాలెడి కడుపులకు మండెడి గంజియైనను సంపాదించుటే మతముల తొలి యభిమతము. వివేకానందు డందులకే 'ఆకటి కడుపులు ఆత్మచర్చ చేయజాల'వనినాడు

జాతి జీవనగళిలో ధనములేని లోపము తీవ్రమై మానవుని మనుగడకు చెందిన మూలసూత్రములనే మార్చివేసినది. ధర్మార్థ కామమోక్షములలో ద్వితీయ పురుషార్థపు ప్రాధాన్య మొక్కటియే అక్కజముగ ఎక్కువగుటతో, అర్థమే పరమార్థమై పదార్థ విశ్లేషణా సముపార్జనములే పరమేశ్వర ప్రాప్తిని బోలె ప్రాముఖ్యము నందినది.

## మతము :

మతము వానరుని నరునిగ నరుని నారాయణునిగ మార్చెడి మంత్ర దండము. కాని ఆధునిక కాలములో పోపు పాప పరిహార పత్రముల అమ్మకము పడమటి అంగడిలో సాగగా మంత్రవాదుల టక్కుటమారములు క్షుద్రోపాసనములు తూరుపుతీరమున స్వైరవిహారము సాగించినవి పాపములను ప్రక్షాళనము చేయవలసిన మతము మాలిన్యముపై మేలిముసుగుగ నిలువబడుటతో, క్రమముగ మతము పరిమితమై సీమితమై హేతువాద మంత్రరుద్ధ భుజంగమై నిలిచినది. మతముపై విశ్వాసము సన్నగిల్లిన కొలదియును మానవుడు భౌతికవాద శాఖల నాశ్రయించి తన కులాయమును నిర్మించుకొన సాగినాడు.

## సంస్కృతి :

మతము తోడిదే సంస్కృతి. మడికట్టుకొని నాటివరకును నిలచిన ప్రాచ్యసంస్కృతి పాశ్చాత్యుల స్పర్శచే మందిరములు గేహాంగణములు వదలి వీధిన పడినది. శకయవనరోమక సంస్కృతులు కూడ లోగడ భారతదేశముపై దండెత్తకపోలేదు కాని శక్తిమంతమైన హైందవుడు విదేశీయ స్రవంతులను

తన గంభీర సాంస్కృతిక సాగరములో లీనము చేసికొన గలిగినాడు కాని నేడట్లు కాదు. విధి నెదిరించి వీధినపడిన భారతీయ సంస్కృతి ఇతర సంస్కృతులను తనలో లీనము చేసికొనలేక పోవుటే కాదు వానితో సహజీవనము నెరపుట కూడ కష్టమైనది. సమన్వయము లేనిచోట సంఘర్షణము, సంఘర్షణము నుండి సమరము విస్తరించుట గతితార్కిక క్రమము ఈ సమరజ్వాలల నుండి జన్మించిన రెండు ఆగ్నేయ శిఖలే భౌతిక, ఆధ్యాత్మిక వాదములు. హేతువాద శిఖ సాగించెడి ఖాండవ దహనమునకు యాంత్రిక దృక్పథము వాయువై సహాయము చేసినది. వీని నెదిరింపలేక ఉపేక్షామాత్ర దండన విధింపవలెనని భావించుట ఆత్మహత్యా సదృశమైనది.[1]

## సాహిత్యము :

తెల్లవారి చదువుతో తెలివిమీరిన నల్లవారు వైదేశిక ధోరణులను దిగుమతి చేసికొనుటలో లేక ఉన్న వ్యవస్థపై ప్రయోగములు చేయుటలో సాగించినారు. ఈ పద్ధతికి సాహిత్యము కూడ అపవాదము కాదు. భాష భావము ఛందము మొదలగు సర్వవిధములైన సాహిత్య పరిధులలోను ఆంగ్లేయ సంప్రదాయములు ప్రవేశించుటలో, జాతీయమైన 'కావ్యం యశసే, అర్థకృతే' వంటి కరకట్టలు, సేతుబంధనము చేసెడి కవి పావనులకు ఐంధనములు కాలేకపోయినవి. దీనివలన ఆదర్శములలోనే పరిణామము పరిణామము. మౌలికతత్వములోనే మార్పు సిద్ధించినది. దానిని క్రమబద్ధముగ ప్రదర్శింతును.

## భౌతికవాద సిద్ధాంతము :

గత వందయేండ్ల తెనుగు కవిత్వములోను వికసించిన వివిధోద్యమ పారిజాతములను పరిశీలించినపుడు ఈ పాదపముల పాదములకడ ప్రవహించెడి అంతర్వాహినులలో నొకటి భౌతిక వాదమనెడి విషయము స్పష్టమగును. ఆర్థిక

1. 'శాస్త్రీయమైన సంస్కృతితో సంబంధం ఉన్నవారు తప్ప తక్కిన వారెవరూ పారిశ్రామిక విప్లవాన్ని అర్థం చేసుకోవాలని ప్రయత్నం చేయడం లేదు అర్థం చేసుకునే సామర్థ్యం వారికి లేదు. మేధావులు అందులో సాహిత్యకారులు సహజమయిన మొదటికే మోసం తెచ్చే విధ్వంసకులు (Luddests) సి పి స్నో, ఎన్‌కౌంటర్ వ్యాసం.

మైన భావాభ్యుదయ పారిశ్రామిక కవితలేమి, శాబ్దికమైన వ్యావహారికోద్యమాదులేమి, అన్నిటికిని ఈ యుగమున నిదియే చోదకశక్తి. ఈనాటి కవుల సైద్ధాంతికాదర్శములన్నింటికిని ఇది యే మూదల. ఆటు పడమట పొటమరించిన అంకురముల కెల్లను బీజావస్థలోని జీవశక్తి మార్క్సుతత్వమైనట్లే ఇటు తూరపు దిక్కున పొడిచిన ఉద్యమ కమలాప్తుని ప్రభాతారుణ ప్రభాతారుణ్య కాంతులు కూడ వస్తువాదమునుండి బహిర్గమించినవే దీనిని సమగ్రముగ పరిశీలించుటకు ముందు భౌతికవాద సిద్ధాంతమును-పూర్వాపరములను ప్రదర్శింతును.

## వైదేశిక భౌతికవాదము :

పాశ్చాత్య దేశములలో కూడ అనంత కాలమునుండి వివిధ తాత్విక చర్చలు సాగినవి. సోక్రటీసు ఆత్మవాదమునుండి బర్కిలీ ఆదర్శవాదము వరకును వివిధ దార్శనికులు తమ తమ సిద్ధాంతములను మానవాళి ముందుంచిరి వానిని పునాది శిలలుగ స్వీకరించి ఆయాకాలములలో లేచిన సాహితీ సౌధములే ఉద్యమ బోధనకు కేంద్ర కార్యాలయములైనవి

కాని మానవుడొక వంక ప్రకృతి విజయము సాధించుచుండగానే పారిశ్రామిక విప్లవ సిద్ధాంతమునకు మహాభాష్యము చెప్పిన కారల్‌మార్క్సు కూడ ప్రభవించుటతో అప్పటివరకును గల విశ్వాసముల (Faith) కంచుగోడలు సంప్రదాయ (Tradition) ల రాతిగోడలు కూలిపోయి ఆ భగవంతుడస్తినాస్తి విచికిత్సలో పడి ప్రత్యక్ష దర్శనమే పరమ ప్రమాణమనునట్టి పరిణామము సిద్ధించినది గత శతాబ్దములో జరిగిన మహత్తర పరివర్తనమిది! దీని నూతగ తీసికొనియే కవుల లేఖినలు పందెపు గుఱ్ఱములవలె పరుగలెత్తుటే కాదు ఆకలిగొనిన తోడేళ్ళవలె కూడ అద్యతన సమాజముపై దూకినవి.

## బీజము - అంకురము - ఫలావాప్తి :

భౌతికవాద మొక విధముగ భావవాదమునకు ప్రతిద్వంద్వి నటి వరకను ఆవాలు నెరుగక సాగెడి క్రైస్తవ మార్మికవాదమునకు ప్రతిపక్షముగ నిది నిలువబడి చర్చి సువర్ణ శృంఖలముల నుండి పాశ్చాత్య జనతా కపోతములను భౌతిక విహాయసముపై విహరించునట్లు చేసినది. జనతతోపాటే జనతకు ప్రతినిధులైన శాసకులు, శబ్దశాసకులును!

భారతదేశములోని లోకాయత వాదమును, బౌద్ధుల చతుర్వాదములను ఇది ఆధారము చేసికొనినది గ్రీకుల హితవాదము సంశయ వాదములు ప్రోది చేయగా గాసెండీ, హాబ్స్, హ్యూమ్‌కాంట్, హెల్వీషియస్, మిల్లులనెడి తోట మాలుల యుపచారములతో ఈ లత వేరూని నిలిచి హాక్సలీ, స్పెన్సర్, హెగెల్, మోల్‌షాట్ బుక్నర్‌ల దోహదక్రియలతో ప్రవర్ధమానమై దశదిశల వ్యాపించి నప్పుడు ఒక చిటారుకొమ్మలో చిగురుల నడుమ పూచిన పువ్వుమే డార్విను! జీవశాస్త్రము నాధారముగ చేసికొని ఈతడు సాధించిన నిర్వచనాత్మక పరాగమే ఫలదీకరణము చెంది మార్క్సు అనెడి పండు పండినది. మార్క్సు తత్వము ఆకస్మిక సంఘటనము కాక కాలములోని క్రమపరిణామమునకు వారసత్వమని చెప్పవలసి యున్నది సమకాలీన పరిస్థితులు సిద్ధాంతములు ప్రసవించిన శిశువు కారల్‌మార్క్సు!

## మూలసూత్రములు :

19వ శతాబ్దపు భౌతికవాదము అనాదినుండి సాగిన భౌతికత తత్వచింత నకు అద్యతన ఆర్థిక, రాజకీయ రూపమును ప్రసాదించుటలో మిక్కిలి గణనీయ మైన పాత్రను నిర్వహించినది. ఈ తత్వమునకు హేతుభూతమైన మూలసూత్ర పరిణామమును వివరింతును.

భౌతికవాదము 'భూతము' లేక 'పదార్థము' యొక్క స్థితిపై ఆధారపడి నది. భూతములు ఈశ్వరుని నుండి కాని 'ఆదర్శము' లేక 'భావము'ల నుండి కాని జన్మింపలేదని భౌతికవాదము ప్రతిపాదించును. 'పదార్థము బాహ్యసత్య మని, అంటే మన జ్ఞానంయొక్క బంధనానికి కాని అస్తిత్వానికి కాని అతీతమైన సత్యమని (పదార్థం యొక్క ఉనికియే భావానికి జ్ఞానానికి ఆధారమని)' నిర్వ చించును[1] ఈ పదార్థము కాలములోను స్థలములోను (శూన్యములోను) 'స్థితి'ని కలిగియుండును. ఈ పదార్థమే చలనమును కలిగించును దీనినే రాజకీయవేత్త లీ విధముగ వ్యాఖ్యానించినారు. "... కాబట్టి 'గతి' లేక చలనం, వస్తువు యొక్క స్థితి, లేక ఉనికి యొక్క అవస్థకు అనివార్యమైన ఆధారము. (ప్రపంచం గతి శీలమైనది కనుక) పదార్థంతో సమన్వయించని చలనమూ చలనంతో సమన్వ

1. తత్వశాస్త్ర ప్రాథమిక పాఠాలు. జార్జి పొలిట్జర్ 48వ పుట (అను వాదం ఫా. సదాశివరావు)

యించని పదార్థమూ కూడా అనూహ్యములు "[1] (ఎంగెల్స్). ఇది పదార్థము యొక్క స్థితి 'గతి' లేక 'చలనము'పై ఆధారపడి యున్నదని నిరూపించెడి విధానము దీనిని మనసులో నుంచుకొనియే వారు 'ఈ ప్రపంచంలో చలన రూపకమగు వస్తువు తప్ప మరేమీ ఉండదు. చలనాత్మక వస్తువు కాలము స్థలమూ లేకుండా చలింపజాలదు"[2] అని వ్యాఖ్యానించినారు.

ఈ సూత్రముల పర్యవసానముగ ఈశ్వరీయస్థితి పదార్థ స్థితి కలితముగ ఉన్నదనెడి మూలసూత్రము పరాస్తము చేయబడినది. అట్లే నిరాకారము నుండి సాకార ముద్భవింపదనియును, ఈశ్వరుడు జగత్తును సృజించెననగా సృష్టికి ముందు జగత్తు లేకుండుట సంభవింపవలెననియును, అనగా శూన్యము నుండి సృష్టి వచ్చుట కేవల భ్రాంతి మూలకమైన, అశాస్త్రీయమైన సిద్ధాంతమనియును నిరూపింపబడినది. భౌతికవాదము గతితర్కముపై నడుచుట కివి తొలి సోపానములు. మతము మన్నుగడన్ను నిర్మూలించుట కివి ప్రచండ పరశువులు.

## వాదప్రవృద్ధి :

ఈ వాదము గ్రీకులో థేన్సు అనగ్జిమిన్, హిరాక్లిటస్ ప్రభృతి భౌతికవాదాచార్యుల నుండి ప్రారంభమై ల్యూసిపస్, డెమోక్రిటస్‌ల నుండి ముందునకు సాగి ఎపిక్యురస్ నాటికి పరాకాష్టనందుకొనినది. ఈతఁడు నూటికి నూరుపాళ్ల మన చార్వాకుని వంటివాఁడు ఈయన శిష్యుఁడు ల్యూక్రిటస్ (1వ శతాబ్ది) ప్రకృతిపైని వ్రాసిన దీర్ఘకావ్యములో 'ఈ మానవ జీవనమును ధ్వంసము చేయునది మరణమేననియును ఆత్మ చావునకు పిమ్మట శాశ్వతకాల దుఃఖమును పొందునను పరలోక భయము దీనికి కారణమనియును[3] వ్రాసినాఁడు. "దీనివల్ల ప్రపంచంలో సుఖం లోపిస్తున్నది. ఈ భయాన్ని తొలిగించాలి. అందుకై ఎపిక్యురస్ సిద్ధాంతాలు రాచబాటలు."[4]

ఆంగ్లేయ దేశములోనిది బేకన్‌లాక్ పండితులచే ప్రోక్తమై క్రమముగ ఫ్రాన్సునకు వ్యాపించినది. డెస్కార్టెస్‌తో ప్రారంభమైన (1596-1850)

1, 2. తత్వశాస్త్ర ప్రాథమిక పాఠాలు. జార్జిపోలిట్జర్ 43వ పుట. (అనువాదం పా. సదాశివరావు)

3, 4. తత్వశాస్త్ర ప్రాథమిక పాఠాలు - 57, 61 పుటలు.

భౌతికవాద చర్చ లామెట్రీ వంటి పండితుల పరిశీలనలతో పురోగమించి డిడ్రాట్ (1713-1784) నాటికి మహోద్యమముగ రూపొందినది. లెనిన్ పరిభాషలో డిడ్రాట్ "ఆధునిక గతితార్కిక భౌతికవాద సూత్రాలకు సన్నిహితమైన నిష్కర్షలు చేసిన ... నూతన యుగానుసంధాత"[1] ఇదే రీతిగా జర్మనీలో ఫర్‌బాచ్ యను విద్వాంసుడు దీనినొక ప్రభంజనోద్యమముగ రూపొందించినాడు. 19వ శతాబ్దములోని భౌతికవాద మహోదయమున కితడు వేగుచుక్క!!

## 19వ శతాబ్దపు పరిస్థితులు

ఒకవైపు డార్విను సాగించిన జీవకణములపైని పరిశోధనలు, స్వరూప వికల్పములు, పరిణామవాదము, అను మూడు సూత్రములను, ఫర్‌బాచ్ సాగించిన నిరంతరోద్యమమును ప్రపంచ చరిత్రలో నొక నూతనాధ్యాయము నావిష్కరించినవి. మార్క్సు, ఎంగెల్సులను భౌతికవాద మహాప్రవక్తల యవతరణకు నాందీ వాక్యమిది! నాటి వరకును గల యాంత్రిక వాదము,[2] ఆది భౌతిక విధానములు సమగ్రముగ పరిశీలించి వానిని పునాదులుగ జేసికొని అందలి లోపములను సవరించి గతి తార్కిక భౌతిక వాదమను సిద్ధాంతమును రూపొందించి, దానిని ఆర్థిక, సాంఘిక, రాజకీయ శాస్త్రములతో సమన్వయము చేసిన ప్రముఖులు వీరు! సమకాలీన పరిస్థితుల పక్వరూపమే గతి తార్కిక భౌతిక వాద సిద్ధాంతావతరణము!

## మార్క్సు - హెగెల్ :

హెగెల్ గతి తర్కమును ప్రతిపాదించిన సిద్ధాంతి. కాని యితడు భావవాది. భావమే పదార్థములలోని మార్పులను సృజించు ననినాడు. దీనివలన హెగెల్ గతి తర్కమును, చలనమును, మార్పును, అంగీకరించినను, మనస్సునకు ప్రాధాన్యమిచ్చినాడు. మార్క్సు - హెగెల్‌కు గతి తర్కస్వీకృతిలో

---

1. తత్వశాస్త్ర ప్రాథమిక పాఠాలు - 57, 61 పుటలు.
2. యాంత్రికవాదము : ఆంగ్లములో మెకానిక్స్ అందురు. విశ్వమంతయును యాంత్రికమేనని దీని భావము. జంతువులు మనుష్యులు వారి భావములు అన్నియును యాంత్రికములేనని వారందురు. దీనినే 'యాంత్రిక భౌతిక వాద' మందురు.

ఋణపడియున్నను హెగెల్ వాదము తల్లక్రిందులు వాదమని అభివర్ణించి మనస్సు భావము. పదార్థ పరిణామమునకు కారణము కాక పదార్థ పరిణామమే మానసిక పరిణామమును - మార్పును, సృజించునని ప్రతిపాదించినారు. ఇట్లు మార్క్స తత్త్వము ముందునకు సాగి ప్రకృతి శాస్త్రముతోను వైజ్ఞానిక శాస్త్రముతోను పరిపుష్టమై, సామాజిక పరముగ నీ సూత్రములను అన్వయించి చూచినది.

## అన్వయించుట ఎట్లు ? ? :

గతి తర్కము మూడు సామ్యములలో సాగును. ఒకటి అనుక్రమము. మామిడి టెంకెనుండి అంకురము, అందుండి వృక్షము, అది పుష్పించి ఫలించి తిరిగి ఆమ్రఫలము సిద్ధించుట - ఇది స్వయం సిద్ధానుక్రమము. రెండవది చరిత్ర క్రమము. కఱ్ఱను బల్లగా మార్చినాము. బల్ల ఏమగును? ఎప్పుడో శిధిలమగును. అంతియకాని తొలినాటి దారువుగ మారలేదు. మూడవది చక్ర క్రమాభివృద్ధి. అనగా ఒక గ్రుడ్డు నుండి కోడి - కోడినుండి తిరిగి గ్రుడ్డు వచ్చుట. ఇట నొక పొరపాటు జరిగినది. కోడినుండి గ్రుడ్డు, గ్రుడ్డునుండి తిరల నదే కోడిరాదు. కోడి అనేకమైన గ్రుడ్లు పెట్టును. అందొక గ్రుడ్డునుండి వేరొక కోడివచ్చును. ఇటు అనుక్రమము చక్రమువలె సాగుచున్నను వలయము విస్తరించుట గమనార్హము !

దీనిని ఆర్థిక తత్త్వమునకు సమన్వయించుటెట్లు ? మనము పఠించినాము. పఠనమెక్కడిది ? గ్రంథములోనిది. గ్రంథమెక్కడిది ? సమాజములోనికి. సమాజమెక్కడిది ?.........ఇట్లు ప్రశ్నా పరంపర సాగినచో మనచేత పఠింప బడిన గ్రంథము మార్క్సిష్టు తత్త్వవేత్తచేత 'క్రామికగతి' వలన నేర్పడినట్లు వ్యాఖ్యానింపబడును !

ఇట్లే మరొక సిద్ధాంతము : గింజకలదు. ఇది స్థితి (Thesis) దీనిని భూమిలో వేయుటతో నది నశించి మొక్కగ బయలుదేరి ప్రవృద్ధమగును. ఇది పూర్వపక్షము, లేక, నాశము (Anti Thesis) కాని మొక్క మొక్కవలె నుండదు. తనను తానది తిరిగి నాశనము చేసికొని గింజలుగ పరిణమించును. ఇది పూర్వపక్షమును పూర్వపక్షము చేయుట - అందురు. ఇది గతి తార్కిక చలన పద్ధతి. దీనిని మరి సమాజమునకు, అర్థమునకు సమన్వయించుటెట్లు ?

1. బానిస విధానమును వ్యతిరేకించుటచే భూస్వామ్య వ్యవస్థ సిద్ధించినది.
2 భూస్వామ్య వ్యవస్థను కూడ వ్యతిరేకించుటతో ధనిక స్వాములు రూపొందినారు
3. ధనిక స్వామ్యమును సమాజము నాశ మొనర్చుటతో సామ్యవాద వ్యవస్థ సిద్ధించినది.

ఇట్లు స్వయం సిద్ధమైన, గతితార్కికమైన అనుక్రమమును సాధింప వలెను. మనమొక చీమను చంపినాము చంపకున్నచో అది జీవించి గ్రుడ్లుపెట్టి యుండెడిది. ఇటు చీమను సంహరించుట గతి తార్కికనాశము కాదు. యాంత్రిక నాశము సహజ స్థితికి చీమ చేరకముందే మనము దానిని నశింపజేసినాము. 'విప్లవము' లిట్లు రావచ్చును.

## వర్గ సంఘర్షణ :

మానవుని మెదడులో 'భావము'లున్నవి అవి 'నిశ్చయము'లుగ పరిణమించి వానిచే చర్యలు జరిపింతును. ఈ భావములు సమకాలీన భౌతిక సమాజ పరిస్థితులంపై ఆధారపడును. ఈ సామాజిక స్థితియే వర్గము. దీనికి ఆర్థికస్థితి ఆధారము. గతితర్కము. వస్తువుల ఉత్పత్తి వృద్ధి క్షయముల ద్వారమున లేదా వాని చరిత్ర ద్వారమున విశ్లేషణ సాగించును. ఈ దశలో ధన హీనులైన శ్రామికులు. వారి శ్రమ అధిక లాభములుగ ఉత్పత్తివారులకు మారుట - వచ్చును. సామ్యవాదమిట అవసరమైనది ధనికులు తమ అంతమును తామే కొని తెచ్చుకొందురని ఎంగెల్స్ జోస్యము చెప్పినారు. "ఈనాడు ఉత్పత్తి సాధనలు యంత్రాలూ శ్రమా సాంఘిక స్వరూపాన్ని చేకూర్చుకొని యున్నవి. కాని అవి వ్యక్తి యాజమాన్యమునకు లోబడియున్నవి. ఈ తీవ్ర వ్యతిరేకత ధనికస్వామ్య అంతానికి దారితీస్తున్న దృశ్యం స్పష్టంగా కనబడుతున్నది".[1] ఈ రీతిగా సామ్యవాదము మహా సిద్ధాంతమై ప్రాక్పశ్చిమములన్నిటిని ఆక్రమించి అన్ని రాజకీయ సాంఘిక ఆర్థిక రంగములలోను తమ ప్రభావమును ప్రసరింపజేసినది. ఇరువదవ శతాబ్దములోని వివిధ సారస్వత రంగములతో

1. జార్జిపొలిట్జర్.

పాటుగ నాంధ్ర సారస్వతము కూడనీ భౌతిక వాద ఝం ఝూ నిలముతో నిటు నటు యూగిపోయినది !

## ప్రాచీన భారతీయ భౌతిక వాదము :

భౌతిక వాదము భారతీయునకు క్రొత్తకాదు. కాని దానినొక ఆర్థిక సామాజికోద్యమముగ రూపొందించుట మాత్రమే వైదేశిక ప్రభావము వలన ఇరువదవ శతాబ్దములో జరిగినది. సాంఖ్య దర్శనకారుడు[1], చార్వాకుడు, మొదలైన వారీ నిరీశ్వర సిద్ధాంతమునకు చెందినవారేనని భౌతికవాదుల మతము. 'శూన్యంతత్త్వం భావోవినశ్యతి వస్తు ధర్మత్వాద్వినాశస్య.[2] అనగా సృష్టికి పూర్వమున అంతమందున శూన్యమేకలదు కావున మధ్యయందున్నది కూడ శూన్యమేనని ప్రతిపాదనము. ఇట్లే 'అభావాద్భావోత్పత్తిర్నాను సమృద్య ప్రాదుర్భావాత్'[3] అభావమునుండి భావోత్పత్తి జరుగుచున్నది. గింజ నశింపక దా యం దంకురము కలుగదు. దానిని బగులగొట్టి చూచితి మేని యంకుర ముండదు ప్రథమమున నంకురము లేదు. కాబట్టి యభావమునుంచి యుత్పత్తి జరిగినదని న్యాయ దర్శనకారుడు సిద్ధాంతీకరించినాడు.

---

1. సాంఖ్యదర్శనకర్త కపిలుడు నిరీశ్వరవాది కాదని కొందఱి మతము. "ఈశ్వరాసిద్ధేః" అను సూత్రమునకు ప్రత్యక్ష ప్రమాణముతో ఈశ్వరుడు సిద్ధింపడని అర్థము. కాని ఈశ్వరుడు లేడని అర్థము కాదు. ఏలననగా శబ్దానుమాన ప్రమాణములచే సిద్ధించు ఈశ్వరుని సాంఖ్యము నిరాకరింపదు. ఒకవేళ పరమేశ్వరుని అంగీకరింపని పక్షములో 'ఈశ్వరాసిద్ధేః' అని సూత్రింపక 'ఈశ్వరా భావాత్' అనియే కపిలమహర్షి సూత్రించే యుండెడివాడు....

   ప్రధానముగా ఈ దర్శనములో ప్రకృతి జీవులు అను వానినీ గూర్చి విశేషముగా వివరించుట జరిగినది. ఈశ్వర విషయమంతగా చర్చింపబడదు" శాస్త్రి వేంకట నరసింహారావు, సాంఖ్యదర్శనము (పీఠిక).
2. సాంఖ్యదర్శనము అ. 1. సూ. 44.
3. న్యాయ. ద. 4-1-14.

బృహస్పతి తన మతములో ప్రత్యక్షమును మాత్రమే ప్రమాణముగ నంగీకరించుచు 'తచ్చైతన్య విశిష్టదేహ ఏవ ఆత్మా దేహాతిరిక్త ఆత్మని ప్రమాణా భావాత్' అని సూత్రీకరించినాడు. భూత చతుష్టయ సంయోగము తోడనే దేహముపుట్టి జీవుడును పుట్టి ఏతద్వియోగముతోడనే నశించునని దీని తాత్పర్యము. దీనివలన వస్తువుల స్థితికన్న భిన్నమగు జీవుడు ఆత్మలు లేవని సారాంశము. ఆధునిక భౌతిక వాదము ననాదియైన మాతృకయిది !

## నలుగురు ప్రవక్తలు :

ఆధునిక వైదేశిక భౌతిక వాదమూల సిద్ధాంతము లించుమించుగ భారతీయ బౌద్ధములో నున్నవి. బుద్ధునికి అనంతరము ఆతని శిష్యులు నాలుగు సిద్ధాంతముల నాధారము చేసికొని విడిపోయిరి.

1) మొదటివారు మాధ్యమికులు : సర్వము శూన్యమేనని వీరి విశ్వాసము. ఘటము ప్రాగభావము, ప్రధ్వంసాభావమును కల్గియున్నప్పుడు మధ్య కాలమున ప్రతీతమగు దృశ్యమును ప్రతీత కాలమందు సత్యమేకాని నిత్యసత్యము కాదని సిద్ధాంతము.

2) రెండవవారు యోగాచార్యులు. ఆంగ్లేయులలో బర్క్లీ ప్రభృతుల వాదమిది. భౌతిక వాదులైన కారల్‌మార్క్స్ - ఎంగెల్స్ మొదలైన వారందరును దీని ఖండనమునకే తమ శక్తినంతయును కేంద్రీకరించిరి. 'బాహ్యశూన్యత' పై విశ్వాసము వీరి మతము. అనగా ఘటజ్ఞానమాత్మ నిష్ఠము కావున ఘటము శూన్యమని వీరి భావము 'శూన్యము' నొకతత్త్వముగ స్వీకరించినారు.

3) మూడవవారు సౌత్రాంతికులు. బాహ్యపదార్థమునను మానింతురు. ఏ పదార్థమును సాంగోపాంగముగ ప్రత్యక్షముగాక ఏకదేశ ప్రత్యక్షమై శేషమం దనుమానమున కాస్పదమగుచున్నదని వీరి భావము !

4) నాల్గవవారు వైభాషికులు. వీరును మాధ్యమికులనే బలపరచుచు పదార్థ ప్రత్యక్షము బాహిరమే కాని ఆంతరము కాదనుచున్నారు. నీల ఘటము బాహిరమైనదేనని, దీని ఆకృతీ గోచరము బయటనున్నదేనని వీరి సిద్ధాంతము ఇట్లు బౌద్ధచారువాకాదులు పదార్థ 'స్థితి' పై నిరీశ్వరతత్వ ప్రతిపాదన చేసినారు. అద్యతన విశ్వవ్యాప్త భౌతికవాద సౌధమున కవి ప్రాచీనమైన పునాదులు.

## భౌతికవాదము - సాహిత్య స్పర్శ :

సిద్ధాంతము బాగుగ పరిపక్వమైన ఆధునిక కాలములో భౌతిక వాదులు దీనిని రాజకీయార్థిక రంగములతోపాటు సాహిత్యమునకు కూడ సమన్వయింప వలెనని చెప్పినారు ఒక గ్రంథము చదివినప్పుడు 1) రచనలోని మూల విషయము సిద్ధాంతము. 2) రచనా కాలము - పాత్రలు. 3) వారి వర్గీకరణ. 4) దాని ననుసరించి పాఠకులపై గల ప్రభావము.

ఇట్లు ప్రతి రచనను మార్క్సిష్టు దృక్పథముతో పరిశీలింపవలెనని మార్క్సిష్టు తత్వవేత్తలు ప్రవచించినారు. "సారస్వత విమర్శయొక్క ఈ కొత్త విధానం గతి తర్కమునకు సంబంధించియున్నది ... ఇలా ప్రతిచోటా ప్రతి సమస్యకూ మార్క్సిజాన్ని సమన్వయించుటే ఈ తత్వశాస్త్ర ఆశయము."[1] సాహిత్య మీ తత్వమున కొక ప్రచార సాధనము.

## భౌతికవాద ప్రభాత కాంతులు :

ఉషః కిరణాలు : 19 వ శతాబ్దపు నడిమి భాగమునుంచి భౌతిక వాదపు ప్రభాత కాంతు లాంధ్రావనిపై ప్రసరించినవి. 1857 విప్లవము సాహిత్య విప్లవమునకు కూడ తొలిదశగ నుండెనని ప్రథమాధ్యాయములో విన్నవించితిని. ఈనాడు రాజుల, జమీందారుల దురాగతములు, శ్రుతిమించి రాగమున పడినవి. 'కూళలకు' కృతులిచ్చి ఆ పడుపు కూడు తినుటకన్న హాలికులై యుండుట మంచిదని ప్రాచీన మహాకవి వచించినాడే కాని హాలిక జీవనము కూడ 19 వ శతాబ్దారంభమునుండి దుర్భరమైనది. రైతులకు చెందిన భూములు, ధనవంతులు హస్తగతము చేసికొనినారు అట్టివారిలో కవులు కూడ నున్నారు. సామాన్య హాలికుల కన్నీరు మున్నీరుగ పారినను అది ఫునీ ఫలింపలేదు. కాని కవిశోకము శ్లోకము-పద్యముగ మారినగి. పుణ్య శ్లోకుడైన సూరకవి శోకము ఈ క్రింది సీసముగ రూపొందినది :

> "మాన్యంబులియ్య సమర్థుడొక్కడు లేడు
> మాన్యముల్ చెఱుప సామంతు లంద

1. తత్వశాస్త్ర ప్రాథమిక పాఠాలు 165 పుట.

పెండిన యూళ్ళ గోడెతిగింప డెవ్వడు
పండిన యూళ్ళన్న ప్రభువులంద
రితడు పేద యటంచు నెతిగింప డెవ్వడు
కలవారి నిది యెన్న గలరు దొరలు.......

విజయనగర వంశీయుడైన సీతారామరాజు రైతులయెడ కవులయెడ సాగించెడి అక్రమముల నెలుగెత్తి కవికంఠ మాక్రోశించుచు ఘోషించుట యిందు కన్పడును. ఈ మహాకవియే 'రేవ'యను గ్రామములో గుత్తకాడైన దంతులూరి యన్నమరాజు తన పొలమునకు నీరుపెట్టుకొనకుండ నిరోధించుట గని వగచి 'చిన్ని పొలములు బ్రాహ్మణ క్షేత్రమునకు ఘాతుకత్వంబు చేయ ముష్కరుల' నుద్దేశించి సీసపద్యములు చెప్పినాడు. ఇది వర్గ కలహమునకు ధనికులు పేద రైతులపై సాగించెడి దోపిడికి నాందీ ప్రస్తావనల వంటిది. ఇట్టి సంఘటన లెన్నియో జరిగి యుండవచ్చునని కవిత్వమువరకు కూడ నీ ఘటనములు వచ్చుటను బట్టి యూహింపవలసి యున్నది.

## సత్యాగ్రహము :

అట్టి రైతులలో నొక సాంఘిక చైతన్య మీ యుగములోనే ప్రారంభమైనట్లు మన మూహింపవచ్చును. "1894 - 95 లో కృష్ణాజిల్లాలో ఈ సత్యాగ్రహమొకటి జరిగెను. ఈ సంవత్సరవు నీటి తీరువా నాలుగు రూపాయలనుండి అయిదు రూపాయలవరకు అధికారులు పెంచిరి. దానిని నిరసించుటకు ఏలూరులో జిల్లా రైతులు సభ జరిపి నీటి తీరువను తగ్గించువరకు వ్యవసాయము చేయమని కట్టు కట్టిరి. ఆ సత్యాగ్రహములో గుడివాడి తాలూకాలోని కొందరు రైతులు జైళ్ళకు పోయిరి."[1] ఇట్టి సంఘటనను పూర్వము నూతన యుగములోని మహత్తర విక్రాంతికిది అరుణరేఖ !

## సంఘ సంస్కరణ :

విప్లవము క్రాంతిని శాంతిని సమాజముపై ప్రసరింపజేయును. సమకాలీన సమాజములో జరిగెడి లోటుపాట్లన్నిటిని క్షాళనము చేయును. పేరుపేరున విమ

---

1. 19వ శతాబ్ది తెలుగు సాహిత్య చరిత్ర - శ్రీ ఎండమూడి సత్యనారాయణరావు 48వ పుట.

ర్శించే ప్రగతికొఱకై పరితపించును. సంస్కరణాత్మకముగ భావికాలములో జరిగిన యీ ప్రబలమైన మార్పులకిటనే వేకువ కోడికూత విన్పడినది.

"నెలతలు చంటి బిడ్డలకు బాల్గుడు పుడే
ప్రకృతి ధర్మంబని పలుకరాదు
ప్రకృతశాస్త్రజ్ఞులే పండితుల్ డార్విను
మున్నగు వారలు కొన్నిచోట్ల
పురుషులు రొమ్మిమ్మనం బొడమిన పాలతో
శిశు పోషణంబని చెప్పినారు."

ఆచంట సాంఖ్యాయన శర్మగారు 1892 ప్రాంతములు రచించిన 'ఆంధ్ర పద్యావళిలో'నిదిది. భౌతిక రసాయనిక శాస్త్రములపై కవిత రచించుటేకాక 'డార్విను' పేరు కూడ నుదాహరించినచో సమకాలీన సాంఘిక సమస్యలను ప్రకృతి శాస్త్రాదులు ప్రమాణముగ - నవీన పాశ్చాత్య వ్యాఖ్యానములతో సరిజేసి చూచుచున్నారని తెలుచున్నది. ఇది ఆంధ్ర కవి లోకమున నొక విప్లవమని చెప్పవలసి యున్నది!

ఇట్లే సమకాలీన సాంఘిక సమస్యలపైకి కూడ కవులు తమ దృష్టిని మరలించినారు. వ్యంగ్యముగ ధ్వన్యాత్మకముగ వర్తమాన సాంఘిక దురన్యాయములు ఖండించుటలో కూడ కవులు ముందంజ వేసినారు.

'ఆట వెలదులన్న తేట గీతములన్న
మనసు కరిగిపోవు మంచు పగిది
ఆటలేక తేట పాటయు లేకున్న
వెలదులున్న జాలువే వరాలు.'

ఇదియును ఆచంటవారే సమకాలీనమైన 'వేశ్యా సమస్య'పై (Ante - nautch) 'ఆట వెలదులు - తేట గీతులు' అనిన శీర్షికతో 19 వ శతాబ్దము చివరి భాగములో రచించిన వ్యంగ్యోక్తి!!

విప్లవము తిరుగుబాటు ద్వారమున సిద్ధించును. రాజకీయముగనది ప్రజాశక్తి పైని సైనిక చర్యలపైని ఆధారపడి యుండును. వాఙ్మయ రంగమున

కన్వయించు సరికి పాత పద్ధతులపైని వ్యవస్థలపైని విరక్తిని సమాజములో వ్యాపింపజేసి నూతన రీతులకై ప్రజా చైతన్యమును నిర్మించుట జరుగును. దీనిని కవులు జ్ఞాతముగనో అజ్ఞాతముగనో చేయుదురు. ఎట్లైనను కారణములోని భేదమే కాని కార్యములోను ఫలావాప్తిలోను రెండింటి సిద్ధియు నొకటే!

## ఆలంకారిక మర్యాదలపై తిరుగుబాటు :

నాటి వఱకును 'మంగళా దీని మంగళ మధ్యాని కావ్యాని' అని సంప్రదాయము చెప్పుచున్నది. కట్టమంచి రామలింగారెడ్డిగారు 'ముసలమ్మ మరణము' రచించి ఇతివృత్తములోను కృత్యాద్యంతములలోను విప్లవము సాధించినారు. "విషాదాంతమైన ఈ కావ్యము సుఖాంతము చేయవలెనని ఆ కాలపు పండితులు హెచ్చరిక చేసిరట! కాని కవి దీనికి అంగీకరించలేదు." [1]

## పదప్రయోగములో తిరుగుబాటు :

సమాస రచన, నాటివఱకు సంప్రదాయికముగ సాగుచుండెడిది. పాణినీయము చింతామణి అథర్వణ కారికలు, అటుపై బాల వ్యాకరణము, ప్రామాణికములుగ తెలుగు వారికుండెడివి. కాని 18 వ శతాబ్దములోని రచన దేశీయ విదేశీయ భేదములను విస్మరించినది. దీనికి కారణము నాటివఱకు నున్న ఇనుప కచ్చడములను తెగ ద్రెంచుకొని 'కొత్తపిల్ల తెమ్మెరలు' పీల్చుటకై కవి కుమారులు ఆయము వదలి స్వతంత్రించి నిలచుటయే!

'తుమముగా వ్రాయు ఖాతుకలంబు చేపట్టి
నిండు షాయీబుడ్డి దండ నునిచి
చెలువొందు దాపుపై చిత్తాను లిఖియించి
ఖారాము సద్దీలు ప్రస్తుతింప
నాడెమై చెన్నొందు నగదు చిత్తా చూచి
కూరిమిరోజు మజ్కూరు వేసి." [2]

ఇట్టి కవితను ప్రాచీన కాలములో రచించినచో కవికులము నుండి ఆతనిని బహిష్కరించుట జరిగియుండెడిది. సమకాలీనమైన పరిస్థితులలోని పరిణామమున

---

1. పింగళి లక్ష్మీకాంతముగారు.
2. బేరీజు పద్యములు విస్సాప్రగడ కామరాజు (1850-60) ప్రాంతము.

కిది ప్రముఖోదాహరణము - కవి ఉర్దూ పదములను బాహుళ్యముగ, నిర్భయ ముగ ప్రయోగించినాఁడు.

## భాషోద్యమమునకుదయరేఖలు :

తరువాతి కాలములో వచ్చిన బ్రహ్మాండమైన భాషోద్యమమును భౌతిక వాదులే ఆదరించినారు. ఆధ్యాత్మిక ప్రియులు సంప్రదాయజ్ఞులు గ్రాంథికమును పోషించినారు. ఇది ప్రముఖముగ గమనింపవలసిన యొక చారిత్రక సత్యము. దానిని గూర్చి మఱికొంత విపులముగ ముందు ప్రస్తావింతును. కాని యిచ్చట పరిశీలింపవలసినదేమనగా రాబోవు భాషోద్యమమునకు ఉదయదీధితులో యనునట్లు వ్యావహారిక వచన రచన మీనవ్య యుగారంభములోనే విజృంభించినది. తమకు తెలియని కొన్ని అజ్ఞాత శక్తుల ప్రేరణ దేశ దేశాంతర సిద్ధాంత ప్రభావములు వాయు మండలములో సంచరించుచుండుటయే దీనికి కారణము !

'అసురాంశల బుట్టిన వారి లక్షణములు చెప్పేము....వారు చెప్పే శ్రుతి స్మృతీ తిహాస పురాణాల యొక్క విపరీతార్థాలు నీవు యెల్లకాలము దిద్దుకొనే సరిపొయ్యీని "ఇది నాటి వైష్ణవమత ప్రబోధకమైన వేదాంత గ్రంథ భాష ! ఇట్లే శైవ వాఙ్మయమును !! ఇఁట జ్ఞాతముగ పూనికతో నీ రీతిగా రచింపవలె నను సంకల్పము విద్వాంసులకు కలిగినట్లును స్పష్టము ! 'వ్యాకరణ శిక్షితముగా వ్రాసితే కొందరికి తాత్పర్యము భిన్నమగునని యెంచి యీ గ్రంథాభిప్రాయము అందరికి చక్కగా తెలియజేయవలెనని వాడుకగా నుండు మాటలలో వ్రాసినాడను."[1] ఇట మఱొక మూల సూత్రమును వివరింతును. ఎంగెల్స్ విప్లవమును నిర్వచించుచు 'ఈనాడు ఉత్పత్తి సాధనలు, యంత్రాలూ శ్రమా సాంఘిక స్వరూపాన్ని చేకూర్చుకొని యున్నవి. కాని అవి వ్యక్తి యాజమాన్యమునకు లోబడి యున్నవి. ఈ తీవ్ర వ్యతిరేకత ధనికస్వామ్య అంతానికి దారులు తీస్తున్న దృశ్యం స్పష్టంగా కనఁబడుతున్నది' అనును. దీని తాత్పర్యమేమి ? పూంజీవాదులు తమకొఱకై నిర్మించుకొనిన సుఖ మార్గములు సాధన సంపత్తులు తమ నాశనమునకే రాచ బాటలుగ కార్మికుల చేతిలో మారునని

1. వెంకటగిరి మహారాజా. వెలుగోటి సర్వజ్ఞకుమార యాచేంద్ర భూపాలుని 'మనస్సాక్ష్యము' నుండి !

ఇందులకు భాషాపరముగ నొక యుదాహరణము : క్రైస్తవమును వ్యాప్తిచేయు నుద్దేశముతో బైబిలు నాంధ్రీకరించుచు నొక విధమైన వ్యావహారికమును వారు నిర్మించినారు. "ఒకనికి యిద్దరు కుమాళ్ళు కలరు. వాండ్లలో చిన్నవాడు తండ్రిని చూచి వో తండ్రీ! నాకు వచ్చే వంతు యివ్వమని చెప్పినందున వాడు పుత్రులకు జీవనోపాధి పంచిపెట్టెను." [1] 'ఇందులో మాకు చూడగా అఱద్ధములే లేవనిన్నీ ఇది బాలులకు చదువ నుపయోగించుననిన్నీ తోచుచున్నది.'[2] ఈ రెండు విధములైన వాక్య నిర్మాణ పద్ధతులను మత ప్రచారకులు సౌలభ్యమునకు స్వప్రయోజనమునకు నిర్మించుకొనిరి. తరువాతి వ్యావహారిక భాషావాదు లీ పునాదుల నాధారముగ చేసికొని తూటాను త్రిప్పికొట్టినట్లు దీనిని స్వీయవాద ప్రతిష్ఠాపనార్థము స్వీకరించిరి! 'భౌతికవాద' ప్రచారము శబ్దపరముగ కూడ సాగుటకు ఈ పరిణామములు అంతస్సులవలె పని చేసినవి 20వ శతాబ్దములోని వ్యావహారికోద్యమ వటవృక్షమునకీ దశలో బీజము పడినది దానికి గాలి వెలుతురు, నీరు ప్రోది చేయుట వంటి సహకారములు 'భౌతిక' సూత్రములనుండి లభించినవి!!

## మతముపై తిరుగుబాటు :

జీవేశ్వరులకు జగత్తులో గల సంబంధమును వివరించునది మతము. కాని మార్క్సు, ఎంగెల్సులు మతము మానవాళిని నిర్వీర్యులను చేయుచున్నదని తీర్మానించినారు. 'పదార్థ కోటిలో మానవుని బుద్ధీంద్రియం అత్యున్నతమైనదని పదార్థ 'స్థితి' వినా వేఱొక సృష్టికర్త లేదనియును సిద్ధాంతీకరించినారు.

## మతాంతరీకరణము :

ఒక మతము నుండి వేఱొక మతములోనికి చేరుట నాస్తికత్వము కాదు. కేవలము జీవేశ్వర సంబంధములను మఱొక తీరులో అంగీకరించుటే! కాని మతమును మార్చుకొనుట అనగా సమకాలీన సమాజములో సనాతన కాలము నుండి వచ్చిన విశ్వాసములు సన్నగిల్లినవని మాత్రము నిరూపించును. జాతిలోని 'విశ్వాస' శైథిల్యమునకిది ప్రథమ సోపానము!

---

1. బైబిలు అనువాదం - ఆంధ్రపత్రిక 22-2-45.

2. 1827లో ఇంగ్లీషు పండితులవద్ద తయారైన వారి భాష.

18వ శతాబ్దము ఉత్తరార్థములో మంగళగిరి ఆనందకవి వేదాంత రసాయనము రచించెను. ఇది జీసుస్ క్రీస్తు జీవితగాథ. దీనిని బందరులో పనిచేసెడి దాసయ మంత్రి కంకితమిచ్చెలు. ఈతడు నియోగి బ్రాహ్మణుడై క్రైస్తవునిగ మారెను భూసురుడు క్రైస్తవుడగుటలో మతవిశ్వాసముపై చంచలత్వమును, అనిష్టతను స్పష్టమగును. ఈ దాసయ్య సోదరుడు రాజప్ప. ఈతడు 'మదిరాక్షీ, మదనుండు రాజప మహామంత్రీంద్రు డుద్యన్మహమ్మదలీ ఖానుకృపానులబ్ధ.... సామ్రాజ్య లక్ష్మీ వైభవము కలవాడు. ఈ మహమ్మదాలీఖాను 1750 లోని కర్ణాటక నవాబు! ఇట్లు జాతిలోని అగ్రశ్రేణికి చెందిన మేధావివర్గము విదేశీయులకు, వైదేశిక మతములకు లొంగిపోవుట, స్థానిక సిద్ధాంత శూన్యతకును జాతీయ భావతిరస్కారణమునకును సూచనలు! ఇవియే పరిపక్వమైనప్పుడు సర్వమత శూన్యమునకు కేవల పదార్థ విశ్వాసమునకు మార్గమును చూపును. భౌతికవాద మహోదయమున కిది వేగుచుక్క! ఆనందకవి వలెనే పింగళి సూరనార్యుడు 'తోభ్యచరిత్ర'మను పేర క్రైస్తవ పురాణము రచించెను. దీనికి 'సర్వేశ్వర మాహాత్మ్య'మని మరొక పేరు!!

## దుర్యోధన కల్యాణము :

మరింగంటి సింగరాచార్యులవా రనెడి దేవరకొండ వాస్తవ్యుడైన కవి 'చిలువపడిగరేని పేరణ'మని నాగకేతనుడైన దుర్యోధనుని వివాహమును మహాకావ్యముగ రచించెను. నాటివలకు శ్రీకృష్ణ కల్యాణమో ధర్మజ, భీమార్జున కల్యాణములో రచించినవారు కలరు కాని కౌరవాగ్రణిని కథానాయకునిగ స్వీకరించినవా రరుదు. ఈ అపూర్వ సంఘటన మైకేలుమదు సూదనదత్తు 'మేఘనాధ వధ' వ్రాయుటవంటిది మతవిశ్వాసములపై ఐచ్ఛికముగనో కాకతాళీయముగనో సాగించెడి తిరుగుబాటున కిదితార్కాణ!

## మతరహిత స్థితి :

గింజ మొక్కగ పరిణమించును. గ్రుడ్డునుండి కోడివచ్చును. ఇది గతి తార్కిక సూత్రము స్వయం సిద్ధమైన అనుక్రమము. అట్లే స్వమతనిరసన, మతరహిత స్థితికిని, అది శుద్ధభౌతిక 'స్థితి'కిని దారి తీయును. ఆనందకవి సూరనార్యులనాటి సమాజము 19వ శతాబ్దము చివరకు మతరహిత స్థాయిని

చేరుకొనినది. మతమును రక్షింపవలసిన బ్రాహ్మణులు అర్థజీవులైనారు. దాసు శ్రీరాములుగారి 'తెలుగునాడు'లో 'లేవరు రెండురెండనిన లేచినవారయినం చటాలునం బోవరు పోవుచున్నిలిచి పోదుము పోదుము త్రోయకుండటంచు' పెండిలిగేస్తు కడ సంభావనకై వచ్చిన బ్రాహ్మణుల వ్యవహరింపు చుండిరనుట అతిశయోక్తి కాదు. యక్షగానముల కాలములోనే రంగాజమ్మ ఇట్టి వర్ణనలు చేసినది. దీని తాత్పర్యము మతప్రవక్తలు పరిరక్షకులు ప్రథమ పురుషార్థమునుండి ద్వితీయము కడ నద్వితీయ ప్రజ్ఞతో నిలిచి పోయిరని!

> "సకలమ్ముం గొఱిగించుకొందురకటా! సన్యాసులా కారు బొ
> ట్టొత యింతేని మొగమ్ము నంది దరదేమో? ముండలా? కారు! వి
> ప్రకులోత్తంసుల కిట్టిపాటు గలిగెన్ బైవారి మాటేల? యెం
> దుకు లోకం బిట్లుమారె? నీకెఱుఁగరాదో దేవి! కామేశ్వరీ!"[1]

**అరాజకస్థితి :**

అరాజకము పరాకాష్ఠ! సామ్యవాద సమాజము దాని ఫలోదయము, "సాంఘిక పరిమాణాలపై చరిత్రలోని ప్రతి మార్పు అంతర్గతమైన నిరోధక పురోగామిక శక్తుల అన్యోన్య ఘర్షణ ద్వారా కొనసాగినది. ప్రతి ఘర్షణా పాత సమాజ స్వరూపాన్ని ధ్వంసంచేసి కొత్త సమాజాన్ని నిర్మాణం చేసినది."[2] రాజకీయమైన అవ్యవస్థ నుండి విప్లవము, విప్లవము నుండి భౌతికవాద సమాజము జన్మించుట సిద్ధాంతము! సిపాయిల విప్లవమునకు ముందును వెనుకను కూడ అరాజకమే! రాజకీయ లోకములోనే కాదు సాహిత్య లోకములో కూడను! "స్వాతంత్ర్య రహితములును ప్రాచీనైశ్వర్య శూన్యములును అయిన జమీనులు మిగిలినవి. జాతిముఖకళ క్షీణించినట్లే సారస్వత కళలును క్షీణించినవి. జాతి యొక్క దారిద్ర్య పరాధీనతలే కవితలోని భావదాస్య పరాధీనతలకు కారణమైనవి ... ఉన్నతాశయములు నశించి క్షుద్రభావములు పొడసూపెను."[3] '19వ శతాబ్ది యొక సంధియుగము. రాజకీయముగాను, ఆర్థికముగాను ఎన్నో సంక్షో

---

1. తిరుపతి కవులు - కామేశ్వరీ శతకము.
2. తత్వశాస్త్ర ప్రాథమిక పాఠాలు - 152 పుట.
3. ఖం. లక్ష్మీకాంతముగారు - తెలుగు వాఙ్మయము వి.స. 619 పుట.

భములు సంస్కరణములును వచ్చినది'[1] ఇవెల్ల కవితా కల్లోలమునకు దారి తీసినవి. శ్యామలాదేవి మీద దండకములు పోయి 'పోలేరమ్మ మీద పొగాకు మీద దండకములు[2] వచ్చినవి. ఇది అరాజకమునకు సూచన!

ఇందుండి మార్క్సు ప్రోక్తమైన గతితార్కిక భౌతికవాద ప్రాతిపదికపై ముందుకు సాగిన తత్త్వమొకటి భావికాలములో నంతర్వాహినివలె సర్వ సాహిత్యోద్యమములలోను ప్రతిఫలించినది. ప్రతిబింబించినది! "ప్రాచీనంలోనే యుగపరంపరగా విస్పష్టమైన మార్పులు కలుగుతూ వొచ్చినప్పుడు, ఈనాడు ప్రతి దేశములోని విజ్ఞానమూ ఇంత సులభంగా అందుబాటులోనికి వస్తూ వున్నప్పుడు ఆధునిక సారస్వతంలో కలిగిన మార్పుకన్న రాదగిందే యెక్కువగా ఉన్నదేమో అనిపిస్తూ వుంది."[3] అనిపించుటయే కాదు ఆ, రాదగినది రానే వచ్చినది! దానిని సిద్ధాంతముతో సమన్వయపూర్వకముగ నిక ప్రదర్శింతును!

## సిద్ధాంత సమన్వయము :

### భావ కవిత్వము :

వస్త్వాశ్రయ రీతి :- ఇందు 'మల్లికాంబ,' 'కడపటి వీడుకోలు', 'ఖలద మాలిక' వంటి ఖండకృతులు భావ కవిత్వపు తొలిపూవులై పూచినవి. ఇందొక్కటియును సుఖాంతము కాలేదు. కృతి మంగళాంతమగుట కావ్యలక్షణము. ఇది ఆధ్యాత్మిక పద్ధతి. కాని భౌతిక వాదము 'యదార్థ'ముపై నెక్కువగ నాధారపడును. జీవితములో దుఃఖాంతమున్నప్పుడు కావ్యములో కూడ అతత్త్వమే ప్రతిబింబింప వలయుననుట వీరి సిద్ధాంతము. ఇది 'ఆదర్శవాదము'నకు భిన్నము. కావుననే ఆర్తనాదములు, ఆత్మహత్యలతో కథలు ముగియుట జరిగినది!

భావాశ్రయము : 'నేనె నా దుఃఖభావ్య శోణితల హరుల
నే విసుగు వేసటలు లేక త్రావినాను'[4]

అని భావ కవులందఱును విలపించిన వారే! ఆ విలాపములో విషాద

---

1, 2. ఉషః కిరణాలు - శ్రీవాత్సవ 152, 168 పుటలు

3 ముద్దుకృష్ణ - వైతాళికులు (పీఠిక)

4. దీపావళి వేదుల.

ములో నితరుల శోకము కూడ అంగీకరింపలేదు. 'మీరు మనసారగా నేడ్వనీరు నన్ను' అని విలపించినారు. దుఃఖము త్రివిధము. ఆధ్యాత్మికము, అధిభౌతికము ఆధి దైవికము. దుఃఖితుడే విషాదుడు. అట్టివాడు 'క్లైబ్యు'[1]డని కృష్ణునిచేత గీతలో నిందింపబడినాడు. గుణత్రయ విభాగ యోగములో తామసిక ప్రవృత్తి దుఃఖ కారణమని నిర్వచింపబడినది. అది రజస్సునుండి జారినస్థితి సాత్వికుడు నిత్యసుఖి. నిత్యానందుడు. కావున భావ కవిత్వములోని దుఃఖము భౌతికమైనది. అంతేకాదు ఇది పాప ప్రాశనమునకై చిలకరించిన కన్నీటి పన్నీటి జల్లులు కావు 'యత్తు దుఃఖ సమాయుక్తము ప్రీతికరమాత్మానః' దుఃఖ సమాయుక్తుడైన దేహిలో రజస్సు రగులుచు సత్వమడుగంటినదని తెలియుచున్నది!

నిరాశ పలాయనములు కూడ భావకవిత్వ లక్షణములు. ఏ సంధ్యా సమీరణుడో నునులేత రెక్కలతో తన్నీ వర్తమాన దశనుండి సుఖ ప్రవర్తమాన దిశవైపునకు తీసికొని పోవలెనని భావించుట ఇట్టిదే! 'ధర్మ క్రియాత్మచింతాచ' అని మనువు చెప్పుటలో ధర్మము - స్వధర్మమనియును తన్నిష్ఠుడైన జీవుడే ఆనందుడనియును భావము కర్తవ్య వైముఖ్యము, పలాయనత్వము, నిజమైన ఆధ్యాత్మిక లక్షణములు కావు!

## ఇది 'విషాదయోగము' కాదు :

ఆంగ్లములో జీసను కంటకకిరీటధారణము, సిలువ నెక్కుట లోక కల్యాణార్థము జరిగిన సంఘటనములు. దీనిని పాప పశ్చాత్తాపుడైన భక్తుని సంకేతములుగ స్వీకరించెదరు 'Glorification of Sorrow' యని దీనినందురు. కేవల మాధ్యాత్మిక దృష్టి యిది. కాని మరణ వరణములో నిలిచిన భావకవులది భౌతిక విషాదమే కాని ఆధ్యాత్మిక యోగముకాదు. దుఃఖమునకాధ్యాత్మిక సంబంధమున్నప్పుడది యోగముగ మారును. లేనిచో అది పాంచభౌతిక స్థూలదేహగతమైన దృష్టి! జఘన్య శృంగార వృష్టి!! ఇది వైఫల్యము చెందినప్పుడు దీనుడై విలపించెడి వ్యష్టి మనకు గోచరించును. "ఋజు వర్తనమును హరి పరాయణత్వమును ఉన్నచోట విషాదము కూడ యోగమే యగును. దీనినే

---

1. క్లైబ్యం మాస్మగమః పార్థ (గీత 2,3)

హృదయ మథనమందును."[1] ఇందు హరి పరాయణత్వమను శబ్దము ఆధ్యాత్మిక సిద్ధాంతమునకు సంకేతముగ ప్రయోగింపబడినది.

ఒక విధముగ కృష్ణశాస్త్రికి రాయప్రోలు సైద్ధాంతికముగ ప్రతిద్వంద్వి యని చెప్పవలసి యున్నది. 'విషాదమాధురి'ని శాస్త్రిగారు ప్రతిపాదింపగా 'అమలిన ప్రేమ'ను రాయప్రోలు ప్రతిపాదించినారు. రాయప్రోలు ప్రాచీ ప్రాచీన వీచులకు ప్రతినిధియైనచో రెండవవారు ప్రతీచీ సంస్కార మూర్ధన్యులైనారు. రాయప్రోలు ఆధ్యాత్మిక శృంగాతమున కెత్తిన ఆకాశదీపమైనచో కృష్ణశాస్త్రి భౌతిక ప్రేమానుబంధములోని బంగారపు పంచ వన్నెల చిలుకవలె 'ఆకులో ఆకు'గ దాగినారు. కవిత్వములో నిర్వురును పుంభావ సరస్వతులే కాని ఉద్యమ దృష్టికల సిద్ధాంత చర్చలో మాత్ర మిర్వురును ఎదురుగ నిలిచినారు.

## అభ్యుదయ కవిత్వము :

కారలో మార్క్సు, ఎంగెల్సులు ప్రతిపాదించిన గతి తార్కిక భౌతికవాద ప్రోక్త వర్గ కలహము, అభ్యుదయ కవిత్వమున కాత్మవంటిది! భామహుడు 'ధర్మార్థ కామమోక్షేషు వైచక్షణ్యం కళాసుచ కరోతి కీర్తిం ప్రీతించ సాధు కావ్య నిషేవణం' అని చతుర్వర్గ వ్యుత్పత్తియే కావ్య ప్రయోజనముగ చెప్పిన లక్షణమిట వర్తింపదు. ఆధ్యాత్మికత్వమునకు బదులుగ, అతివాస్తవికమైన దృష్టి, రసానంద ప్రతిపాదనకు బదులు హేతువాద కఠోరకుఠార ప్రయోగము మనువు స్థానమున మార్క్సు, భరతుని స్థానమున ఫ్రాయిడ్‌లను ప్రతిష్ఠాపించిన సిద్ధాంతమిది! ఆధ్యాత్మిక కవిత్వమున కిది ఆజన్మ శత్రువు! అది - ఆత్మలోని 'ఆత్మ' శబ్దమునే వీ రంగికరింపలేదు. శ్రీ శ్రీ ఆత్మను పరిహసించుచు క్రిష్టోఫర్‌లోగ్ రచించిన వాక్యములను యథా మాత్రకముగ ననువదించుటకు కారణ మిదియే!

'అన్నట్లు అతని కొక ఆత్మ ఉండేదట
దానికి మరణం లేదట'[2]

---

1. గీతాప్రవచనములు. వినోబా భావే (అను) శ్రీవెంపటి 2 అధ్యా. 73 పుట.
2. ప్రొఫెసర్‌గారి రిపోర్టు. ఖడ్గసృష్టి 128 పుట.

దీనికి లక్షణమో అనునట్లు శ్రీశ్రీ టు హోల్‌స్కీ 'ఆత్మ'పై చేసిన వ్యాఖ్యానమును ఉదాహరించుట ఆధ్యాత్మికవాద తిరస్కారమున కీయన ఎత్తిన ధ్వజస్తంభమున వఱసి యున్నది !

"ఈ ఆత్మ అనే దానికోసం ఖగోళాంతర పరిశోధక సంఘాలు చాలా కృషి చేశాయి. సమస్త విశ్వాన్ని గాలించాయి. కొన్ని అర్బుదాల అనశ్వరాత్మల కోసం వెదికాయి. ఒక్కటీ కనిపించలేదు. అయితే ఏమాట కామాటే చెప్పుకోవాలి. మానవుడు తన గురించి అబద్ధాలు ప్రచారం చేసేవాడన్న సంగతి అందరికీ తెలుసు."[1]

భౌతికమైన ఉపాధి సౌకర్యములకై అభ్యుదయ కవిత్వము తన శంఖారావమును విన్పించినది సోషలిస్టు సమాజ స్థాపన కిది 'వర్ణ స్వప్నములు' కనును. 'ఆధ్యాత్మిక' శబ్దమును, జాతీయ వాదమును ఈ కవితా సిద్ధాంతములు తిరస్కరించును. శ్రీశ్రీ 'సద సత్సంశయం' అన్న గీతములో గజేంద్రమోక్షము నపహాస్యము చేయుటలోని భావమిదియే ! 'ఈ సరికీ వదిలిపోని మురికి మందు'[2] గ వీరికి మందుగ మతమును ఆధ్యాత్మిక భావములను వీరు తిరస్కరించుటలోని తాత్పర్యమిది ! ఆధ్యాత్మిక ప్రాతిపదికయే లేనప్పుడిక జాతీయ భావనకు చోటే లేదు. 'స్వాతంత్ర్య శత్రువుల గుండెల్లో బల్లమైన 'యునైటెడ్ సోవియట్ రాజ్యం'ను 'నవవిజయం' పొందిన ఒక చైనాను ప్రశంసించి సరిహద్దులను తిరస్కరించి, జాతీయ వాదమును పరాస్తము చేయుట అభ్యుదయ కవిత్వము వెనుకనున్న వెన్నెముకవంటి సిద్ధాంతము ! !

## అతినవ్య ధోరణులు :

అతినవ్య కవితా ధోరణులన్నియును భౌతికవాద మహోదయ సరిత్తు చేప్లావితమైన వనమున విరిసిన విరి కన్నెలు. ఒక్కొక్కరి దొక్కొక్క చోద్యము. ఒక్కొక్క మార్గము. కాని సైద్ధాంతికముగ మాత్రమాధునిక కవితా విధానములకు ప్రాణవాయువు భౌతిక సత్యమే ! జీం పాల్‌సార్త్రే 'నేను ఉన్నాను కాబట్టి జగత్తు ఉన్నది.' అన్నమాట కొందరికి వెలుగుబాట. ప్రాయిడ్

1. ప్రొఫెసర్‌గారి రిపోర్టు. ఖడ్గసృష్టి 61వ పుట
2. ఖడ్గసృష్టి (61వ పుట.

అంతశ్చైతన్య స్థితిలోని కాముక విశ్లేషణలు మఱికొందఱు కవులకు పూలతోట. వీరిలో మార్క్సును వదిలినవారు లేరు. మను మార్గమును వదలనివారు లేరు. భౌతికతను సమర్థించుట ఒక యెత్తైనచో ఆధ్యాత్మిక జాతీయవాదమును తిరస్కరించుట వేఱొకయెత్తు! అనుకూలత వ్యతిరేకత రెండును వేఱువేఱు దృక్పథములు. కాని అతి నవ్యులలో భౌతికాను కూలవాద మెంతయున్నదో ఆధ్యాత్మిక జాతీయ వ్యతిరేకతత్వము కూడా అంతగనే ప్రదర్శించిరి. 'సిగ్మండ్ ఫ్రాయిడ్ హెరాల్డ్‌లాయిడ్ మా ఇన్స్పిరేషన్'[1] అనుటలో తమకు పూజ్యులెవరో ప్రకటించుటతోపాటు జగద్గురు పీఠాధిపతుల నశ్లీల పదములతో విమర్శించుటలో నాధ్యాత్మికవాద తిరస్కారము గోచరించుచున్నది దేవుడిని భూస్వాముల కల్పన మనుటలో నాధ్యాత్మికత్వముపై విమర్శ, సరిహద్దులులేని జగత్తును గూర్చి కలలు కనుటలో జాతీయ కల్పనా వైరుధ్యమును ఉన్నది! అనంత లోకములును అలోకములును కూడ వీరి కల్పనములైనవి! 'యదార్థాన్ని గుర్తించము. కలలు మాకు యదార్థాలు. ఈ జగత్తుతో మాకు పనిలేదు. మాది స్వప్నజగత్తు. సంపన్నులు, భాషా సంపన్నులు మాకు విరోధు'లని ప్రకటించుటలోని అధివాస్తవిక ధోరణి స్పష్టముగ నిర్వచింపబడినది. బాహ్య జగత్తును కూడ తిరస్కరించిన వ్యక్తావ్యక్త స్థితి అధివాస్తవికతకు మాతృక!

ఇట్టి దశలో జాతీయత సహజముగనే మృగ్యమగును. 'కామాక్షి కట్టుకొనిన కోక' ఆమె శరీరము నెట్లు చుంబించుచున్నదో భావించు టేమి, నగరములోని వ్యభిచార గృహములోని కర్మకాండను యథావిధిగ వర్ణించి కవితా వస్తువు చేయుటేమి. భౌతికతత్వములోని ఇంద్రియ లౌల్యమున కెత్తిన ధ్వజస్తంభము! ఆర్థిక లోపమెట్లు మనిషిని పశుతుల్యునిగ మార్చునో వర్ణించుట[?]దీని పరమాశయము భౌతికవాద హలాయుధము ఆధ్యాత్మిక జాతీయవాద సస్యముల నామూలాగ్రముగ నిర్మూలించుటకై నిర్విరామముగ పరిశ్రమించినది.'

సిద్ధాంతము, ఆంతరము బహిరమని రెండు తెఱఁగులు. భావాత్మక కల్పనము ఆంతరము. దాని సాకార ప్రదర్శనము బాహిరము. ఆత్మను తిరస్కరించుట నిరాకార భావనను తిరస్కరించుట విగ్రహాదులను తిరస్కరించుట మతకర్తలను ప్రవక్తలను వ్యతిరేకించుట ఆచార కాండను త్రోసి రాజనుట!

1. ఖడ్గసృష్టి (61 పుట.)

అతినవ్యులీ రెండు దశలలోను ఆధ్యాత్మిక జాతీయవాదము నెదిరించినారు. సూత్రప్రాయమైన ఈ సిద్ధాంతమును రాబోవు అధ్యాయములో విపులముగ వ్యాఖ్యానించెదను.

## వ్యావహారిక భాషావాదము :

ఆర్థికమైన యుద్యమములతోపాటు, శాబ్దికోద్యమములు కూడ తెలుగు భాషలో విస్తరించినవి. ఆర్థికోద్యమములకు ఆర్థిక సంఘర్షణ ప్రాతిపదిక! కాని శాబ్దికోద్యమముల మాట? తెలుగులోని వ్యావహారిక భాషావాదమును ఛందః ప్రయోగములను పరిశీలించినచో అవి కూడ భౌతికవాదుల ప్రయోగములుగనే కన్పడుట విశేషము! దీనిలోగల మౌలికతత్వమును స్థూలముగ పరిశీలించుట సముచితము!

భాష సంకేతములపై నాధారపడినది. అవి దైవ దత్తములును సిద్ధములును (Natural) కాక నియమోపస్థితము, సామయికము (Conventional) లు అని ఆధునికు లంగీకరించిరి. భాష సామయికమైనప్పుడు శబ్దార్థముల సంబంధమును నిర్వచించుట భాషకు భాషకు మారును. అంతేకాదు వ్యాకర్త వాచ్యమును నియత స్థితిలోనుంచినాడేకాని వాచ్యము నెట్లు వ్యాకరింపగలడు? అది అనంతము శబ్దాతీతము కదా! కావున అవగాహనా సామర్థ్యము కల్గిన శబ్దములన్నియును విపులవాచ్య ప్రయోజనార్థము స్వీకార్యములేనని సైద్ధాంతికముగ నిర్ణయించుట జరిగినది!

వ్యాకరణము శాబ్దిక విధానమును విశ్లేషించి నియమించును. కాని వ్యాకరణమునకు వ్యష్టిగ అర్థావబోధనా సామర్థ్యములేదు ప్రకృతి ప్రత్యయ విభాగ విభాగములో నొక ప్రకృతినో, ప్రత్యయమునో స్వీకరించినచో నది భావ బోధకము కాజాలదు. కావుననే వాక్యమునకు కనిష్ఠ రూపము పదము. పదమునకు అర్థ గ్రాహక సామర్థ్యమున్నది. అట్టి పదములు కలిసినది వాక్యము. వాక్యము పరస్పరార్థావ బోధకమైనప్పుడు గ్రాంథికము వ్యావహారికమను సమస్యయే ఉదయింపదు. అంతేకాక జన సామాన్యములో వ్యావహారికము, వారికి నిత్య సన్నిహితము కావున సులభముగ అర్థావ బోధనకు సామాగ్రిగ స్వీకరించుటుచితమని కొందరు భావించిరి.

సారాంశ మేమనగా శబ్దార్థముల సంబంధము సామయికమనుటతో వ్యావహారికమునకు కూడ పదప్రయోగార్హతను గతిని కల్పింపవచ్చునని తేలినది. శబ్దము 'క్షణిక'మని కనుక సిద్ధాంతీకరించినచో మాండలికాదులన్నియును తాత్కాలికార్థావ బోధకములై నవన్నియును ప్రయోగార్హములే యగును. ఈ రీతిగ వ్యావహారికమునకు 'గతి' కల్పింపబడినది !

ముఖ్యముగ ఉద్యమశీలియైన కవికి సరళము, సలభమునైన 'ప్రజల భాష' కావలెను. కావుననే నన్నయగారు. భారతమును తెలుగులో-దేశిలో-రచించిరి. పాల్కురికి నాటికి నన్నయది మార్గమైపోయినది. కావున తెలుగులోనే మరల 'దేశి'ని ప్రోత్సహించి వీరశైవోద్యమమును నడిపినాఁడు పాల్కురికి. ఈ దృష్టితోనే ఉద్యమ ప్రవణమైన భౌతికవాదము వ్యావహారికము వైపునకు మొగ్గినది. ఆధ్యాత్మిక వాదులలో మాత్రము ప్రముఖులందఱును గ్రాంథికులుగనే నిలిచి పోయినారు

భాష ప్రవాహ శీలము. కాని ప్రవాహ పదమునకు బుద్ధుఁడు చేసిన వ్యాఖ్యానము వేఱు, వైదిక వ్యాఖ్యానము వేఱు. బుద్ధుఁడు క్షణికమని వాఁడు ఇది భౌతిక వాదమున కుప బలకము. కాని వేదము ప్రత్యభిజ్ఞతో క్షణికమును పరాస్త మొనరించినది. భౌతికులు వేదవాదులు కారు. కావుననే తద్విరుద్ధ సిద్ధాంతములనే వారాధారముగ స్వీకరించినారు.

"ప్రత్యేకం వ్యంజకా భిన్నావర్ణా వాక్యపదేషుయే
తేషామత్యంత భేదేఽపి సంకీర్ణా ఇవశక్తయః"

వర్ణపద వాక్యములు నిరవయవములైనవని అందలి మాత్రా విభాగము వర్ణ విభాగము పదవిభాగము కేవలము కాల్పనికములని సత్యము కాదని భర్తృహరి ప్రతిపాదించినాఁడు [1] ఇది వ్యావహారిక భాషావాదులకు అనుకూల మతము "ఈ ఉద్యమానికి (మార్క్సిష్టు ఉద్యమానికి) చెందినవారు భాష ఛందస్సువంటి విషయాల్లో గురజాడ వైపు మళ్ళడం గమనింప దగిన విషయం" [2]

1. వాక్యపదీయము 1.89 వ్యాఖ్య.
2. నవ్యాంధ్ర సాహిత్యంలో దృక్పథాలు. ఆర్. ఎస్. సుదర్శనం. భారతి ఆగస్టు 64, 45 పుట.

## ఛందః పరివర్తనము :

భాషతోడిదే ఛందము. భౌతికవాదము ప్రాచీన ఛందః శిల్పము నంగీకరింపదు. ఛందమునకు మూలము వేదము. అది అపౌరుషేయము. ఈశ్వర ప్రతిపాద్యము. దేవతలు మంత్రమయులు. 'దేవతాః మంత్రాం తద్యాభ్యాతాః అగ్న్యాది కాఃహావిద్యాభ్యజః స్తుతి భాజోవా'[1] యనుటలోని భావమిదే! మనన సాధనములు మంత్రములు. అవి ఛందోమయములు.

భౌతిక వాదములో నిరీశ్వర కల్పనముండుటతో శబ్దశక్తి ఈశ్వర ప్రణిధాన మనుట పొసగదు 'భాష శాస్త్ర సాహిత్యాలకు ఒక సాధనమే కాని తనకు తానుగా పరమార్థం కాదు. మంత్రోపాసకుల అధిక్షేపంతో మనకిక్కడ నిమిత్తం లేదు.'[2] అట్టిచో సంకేతార్థమైన శబ్దమును, దాని కాత్మయైన ఛందమును పరివర్తన శీలము గౌణమే కాని నిర్దిష్టము నిత్యము కాదనువాదము ప్రారంభమైనది! 'ఛందో బందోబస్తులను' ఛట్ ఫట్ మని తెంపి వేయుటలోని రహస్యమిది! 'ఆకలి యాత్ర' 'అను రచనలో' వరిపాతర కలవాళ్ళను నలుగురిలోకి పిలిపిద్దాం, అందరికీ తిండీ గుడ్డా అందిస్తారా లేదా ఒకటే మాకు నినాదం, తిండిలేంది ఊరుకోం' అను వాక్యములలో ఛందములేదు. 'మార్క్స్ సూత్రాలను తెలుగు వచనంలో కొన్ని పంక్తులు పొడుగ్గాను కొన్ని పొట్టిగానూ'[3] అందమైన పొందిక పరమార్థము కాకుండ రచించినారు. వీరికి ఛందముతో పనిలేదు. కొందరు కేవలము ఒక తూగును ఊగును ఆధారచేసికొనినారు మిలిగినవారు దానిని కూడ త్యజించినారు. 'శ్రీ శ్రీ ధ్వంసం చేసిన పాత ఛందస్సుల్లోంచి పాత మూలుగులూ Serenadings మూర్చలూ, వేదాంతాలూ మత్తులూ పోయి........ కొత్త రక్తాన్ని కదను తొక్కించే సంగీతం[4] వినబడుట ప్రారంభమైనది. 'పద్యాల నడుములు' విరుగగొట్టెదమని ప్రతిన బట్టిన పరాభివంటి వారికిని 'కవి హృదయంలోని రాగాలాపన ఎట్టి తీగెలు సాగితే అదే గీతానికి ఆకారం నిర్ణయించాలని'

---

1. యజుస్సర్వానుక్రమణిక - ప్రథమ. 9 పుట.
2. విద్యాసంస్థలలో వ్యావహారిక భాష జి. వి. కృష్ణారావు. భారతి ఆగస్టు 65.7 పుట.
3. జానకిజాని భారతి అక్టోబరు 63, 57 పుట.
4. చెలం. మహాప్రస్థాన పీఠిక 12 పుట.

'ఫిడేలు రాగాల డజను' 'ఇంట్రో' వ్రాసిన శ్రీశ్రీకిని ప్రేరణ భౌతిక తత్వము. 'కవిత్వంలోనూ జీవితంలోనూ **Economy of words and thoughts** లేక పోవడం దేశభక్తి కన్నా హీనమైన పాపం'[1] అని. 'మీ దేవుడు మీ డబ్బుకి దాసుడు మీనంగి పూజలకీ స్వార్థ ప్రార్థనలకూ వశ్యుడు'[2] అని మహాప్రస్థానము నకు 'చెలం' భాష్యప్రాయముగ పల్కుటలో దేశభక్తి, ఆత్మశక్తి రెండింటిని తిరస్కరించుట గోచరించుచున్నది! ఇట్లు ఛందఃపరివర్తనము ఆధ్యాత్మిక జాతీయవాద వ్యతిరేక సిద్ధాంతముతో భౌతిక వాదమునకు బాహిరమైన పరి వేషమై నిలచినది. సంప్రదాయానుసారులు నేటికి నివృత్తములను సలక్షణమైన ఛందమును ఆశ్రయించుట గమనార్హము!!

## పారిశ్రామిక విప్లవము :

యంత్రమునకు హేతువాదమునకు పరస్పర సంబంధము యాంత్రిక ప్రగతియే ఈశ్వర విశ్వాసమును తొలిసారిగ నిలదీసి ప్రశ్నింపగలిగినది. మానవుడు లోగడ తాను నమ్మినవి వమ్మగుటతో యంత్రమునకు పట్టాభిషేకము చేసినాడు. యాంత్రిక మహోద్యమము అలంకారములు, పారిభాషిక పదములు కూడ తన విరాట్స్వరూపముతో నిండునట్లు చేసినది దీనివలన అనేక సమస్య లుత్పన్నమైనవి! జీవనములో వస్తూత్పత్తి వినిమయము మొత్తమును యంత్ర ములపై నాధారపడినది 'సాంకేతిక విజ్ఞానము పెరుగుచున్న కొలదియు అధి కారము అత్యల్ప సంఖ్యాకులయిన వారి చేతులలో కేంద్రీకృత మగుచున్నది. ఇందువలన ఒక నిస్పృహ, ఏమియును చేయలేని తనము విస్తరించుచున్నది.[3] ఇది యాంత్రిక హేతువాదయుగ లక్షణము. "జనుల పారమార్థిక బుభుక్షను తీర్చవలసినవారు శాస్త్రవేత్తలే అయినారు.[4] నాగరిక యాంత్రిక జీవనములోని వైచిత్రి ఇది!

యాంత్రిక నాగరికతకును మానవ జననమునకు అవినాభావ - సంబంధ మున్నదో అనునట్లు జనాభా పెరిగినది. రోగములు యుద్ధములు తరిగినవి. క్రీస్తు పుట్టిననాడు 25 కోట్ల ప్రజలుండగా అంతకు రెట్టింపగుటకు 16 శతాబ్ది

1. చెలం. మహాప్రస్థాన పీఠిక. 7వ పుట.
2. చెలం. మహాప్రస్థాన పీఠిక. 13వ పుట.
3, 4. సాహిత్యము. అధునాతన జీవితము. ఆల్డస్ హక్స్లీ 68 పుట.

ములు పట్టినది. కాని నేటి జనాభా 300 కోట్లు! మఱొక అర్ధశతాబ్దములోనిది రెట్టింపగునని అంచనా! ఇట్టి మానవ లోకములో కర్మసిద్ధాంతము, పరమార్థముపై విశ్వాసము, ఆధ్యాత్మిక భావనము, శూన్యమై భౌతిక జీవనమే శరణ్యమైనది! 'మనము ఉదజని అస్త్రమునకు ప్రచ్ఛన్న యుద్ధమునకు సమకాలికులము. అందువలన చాలమంది ఒక విధమైన నిర్వేదమును నిరంతరమైన ఆందోళనను చెందుచున్నారు. మరియు బ్రతికి ఎందుకనిన భావము కూడ వారిలో కలుగుచున్నది. ఏ క్షణములోనయిన ఆ క్షణములో పడిపోగల ప్రపంచము ఉండి ఏమి లాభమన్న భావము కూడ పొడముచున్నది.[1] నిరీశ్వరత్వమునకు, మానవుని క్షణిక భోగలాలసతకు, మితిమీరిన హేతువాదమునకు, అర్థదృష్టికి, ఆంతరమైన యీ నిర్వేదము సంశయము కారణము. "ఉపభోగిత్వము" (కన్స్యూమరిజం) నేడొక ఉద్యమమైనది. ప్రమాణమైనది. ఇది అన్ని వాఙ్మయములలో వలె తెనుఁగునను తన ప్రభావమును చూపినది. ఆంగ్లములో సి.డి. లూయీస్ ప్రభృతులును తెలుగులో అతి నవ్యకవులును ఈ యంత్రోపగూహనమునకు లోనై లాలింపబడినారు.

1) యాంత్రిక పదములను పరిభాషను స్వీకరించుట.

2) యంత్రములను గూర్చి కవిత వ్రాయుట.

3) యాంత్రిక మానవ జీవనమును, అందలి నిస్సారమును వర్ణించుట!

4) పరమార్థమును తిరస్కరించి హేతువాదముతో పరిశీలన ప్రారంభించుట– అను నాలుగు దశలలో ఈ కవితోద్యమము ముందుకు సాగినది!

ఇట్లే మిగిలిన యుద్యమములును. అన్నిటిలోను అంశమొక్కటే! నవీన యుగములో విశ్వాసమునకును హేతువాద విశ్లేషణకును మధ్య భయంకర సంగ్రామము ప్రారంభమైనది! సనాతనత్వమునకు ఆధునికత్వమునకు సంధి దశ పొటమరించినది! కల్పనకు వాస్తవికతకును, మిధ్యకును (illution) యధార్థమునకును (Reality), సాహిత్యమునకు శాస్త్రీయ విజ్ఞానమునకు, అన్ని రంగములలోను స్పర్థ, సంఘర్షణ సాగుచున్నది. దీనికి ఆంధ్ర సాహిత్య మపవాదము కాలేకపోయినది. కవులందటు నటుహేతువాదమునో ఇటు గీతావాద

1. 67వ పుట. భారతి ఏప్రిల్ 62.

మునో స్వీకరించినారు. సాహిత్యము రెండు పాయలైనది. అంతర్వాహినియై 'సరస్వతి' మాత్రము ప్రవహించుచునే యున్నది !!

ఇది భౌతికవాద మహాసిద్ధాంతము ! ఇక ఆధ్యాత్మిక జాతీయవాదమును సిద్ధాంత, సమన్వయ, సమన్వితముగ ప్రదర్శింతును !!

## ఆధ్యాత్మికవాద సిద్ధాంతము :

ఆధ్యాత్మిక వాదమొక దేశమునకు ఒక కాలమునకు చెందినది కాదు. మానవుని మేధ ఆలోచించుట ప్రారంభించిన కాలమునుండి ప్రకృతిని చూచి పరవశించి పరమవినీతుడై నమస్కరించుట ప్రారంభించిన కాలము నుండి మానవాత్మ - విశ్వాత్మల మధ్య, సంధానము సంవాదము ప్రారంభమైనవి. భారతీయుల వేదములేమి మెసపొటామియాలోని మట్టి పలకల వ్రాతలేమి ఈ మహాతత్వావిష్కరణమునే ఆలంబనముగ స్వీకరించినవి !!

'హిరణ్యగర్భః సమవర్తతాగ్రేభూతస్య జాతః పతిరేక ఆసీత్ ! సదాధార పృథివీంద్యాముతే మాంకస్మై దేవాయహవిషావిధేమ[1] సృష్టి స్థితిలయ కారకుడైన బలవంతులకన్న బలవంతుడైన ఈశ్వరుని స్తుతించుటతో జీవేశ్వరుల సంబంధము స్థితమైనది. ఈశ్వర సాక్షాత్కారమే మానవ జీవన పరమలక్ష్యము, చరమలక్ష్యము నైనది !

## భౌతికవాదముపై తిరుగుబాటు :

ఆధ్యాత్మికవాదము, భౌతికవాదము, పరస్పరము సంఘర్షణాత్మకముగ సాగినవే కాని సయోధ్యతతో నెన్నడును జీవింపలేదు. రెండు వాదములును శక్తి కల్గినప్పుడెల్ల రెండవ వాదమును పరాస్తముచేసి పరాభూతముచేసి ప్రాణావశిష్టముగనో విగత ప్రాణముగనో విడుచుట మానవ చరిత్రలో నాటినుండి నేటి వఱకును సాగిన చారిత్రక సత్యము అందువలన ఆధ్యాత్మికవాద పురోగతి శుద్ధ భౌతికవాదముపై తిరుగుబాటుగ మాత్రమే సాగినది !

## భారతీయ ఆధ్యాత్మికవాద మూల సూత్రములు :

ఆధ్యాత్మిక వాదము శాస్త్రీయమైన కొన్ని మౌలిక సిద్ధాంతములను నిర్దిష్ట

1. యజుర్వేదము అ. 13 మం. 4.

ముగ నిర్దేశించుచు ముందుకు సాగినది! ఒక విధముగ చూచిననో భౌతిక వాదము ఆధ్యాత్మిక వాదముతో సంగరము సాగించినది కాని, ఆధ్యాత్మిక వాదమును మత్స్యన్యాయమున జీర్ణము చేసికొనినది! అదెట్లో సైద్ధాంతికముగ చూపెదను!

వైదేశిక భౌతిక వాదములన్నియును మానవుని 'అర్థజీవి'గ నిర్ధారించి ఆతని వాంఛల పరితృప్తినెట్లు సాధింపవలెనో వివిధోపాయములతో నిర్వచించినవి! "ఒక భౌతికవాది దృష్ట్యా" ప్రాథమిక భాగం లేక స్థితి (తాక భావపు స్వరూపాన్ని కల్గించేవి) ఆర్థిక జీవనం. ఇక రెండవ విషయం అనగా స్థితితో విడదీయ లేనట్టి దీ స్థితివల్ల సృష్టి-పబడినది ఐన రాజకీయ జీవనం (భావం)" దీని భావమేమి? భౌతికవాది దృష్టిలో మానవుడు అర్థజీవి అనియు, ఆర్థిక సమస్యా పరిష్కారమునకై రాజకీయ జీవనము కూడ స్థితిలోనికి వచ్చినదనియును సారాంశము! కాని భారతీ యాధ్యాత్మకవాది దీనిని ఖండించును!

## ఆధ్యాత్మికవాద మనగా ఆదర్శవాదము లేక భావవాదము కాదు :

భౌతికవాదులు తమ సర్వశక్తి నుపయోగించి భావవాదమును, ఆదర్శ వాదమును ఖండించిరి తద్వారమున ఆధ్యాత్మిక వాదమును నిర్మూలించినట్లు అభిప్రాయపడిరి! వాస్తవ స్థితిలో ఆధ్యాత్మిక వాదమునకు భావాదర్శవాదములకును మిక్కిలి అంతరమున్నది! ఒక విధముగ చెప్పవలెనన్నచో భావవాదము, ఆదర్శవాదము, చివరకు భౌతికవాదము కూడ ఏకదేశికమైన పాక్షిక సత్యములనే ప్రవచనంచును. ఆధ్యాత్మికవాదము మాత్రమీ సూత్రములను సిద్ధాంతములను అన్నింటిని తనలో లీనమొనర్చుకొనును. ఈ విషయమును సోదాహరణముగ వివరించెదను.

## భౌతికవాదము :

భూతముల 'స్థితి'పై ఇది ఆధారపడినది. మానవ జీవనము భూతముల గతితర్కముపైనా నాధారపడి యున్నదని సిద్ధాంతీకరించును. భూతముల కతీతమైన శక్తి జగత్తును సృజించుట, పోషించుట వంటి విశ్వవ్యాపార నిర్వహణా సామర్థ్యము కలదనుటను తిరస్కరించును. మానవుని సమస్త వాంఛలు ఆర్థిక తరతమ-స్థితులను చక్కజేసి వర్గకలహము విప్లవముల ద్వారమున సామ్యక్షము సాధించుటతో పరితృప్తిని పొందునని వ్యాఖ్యానించును!

## ఆదర్శవాదము :

ఈశ్వర ప్రతిపత్తి నంగీకరించునది ఆదర్శవాదము. సృష్టి స్థితిలయ ములకొక కర్త కలడని ఆదర్శవాదము ప్రతిపాదించును. భౌతికవాదులు దీనిని మతపరమైన సిద్ధాంతమని అభివర్ణించినారు. 'మతం యొక్క పరిష్కృతమైన లేక విలక్షకమైన తేలికైన రూపమే ఆదర్శవాదం' లెనిన్ !

## భావవాదము :

పాశ్చాత్య దేశములో బర్క్లీ, భారతదేశములో శంకరాచార్యులు ప్రభృతు లీ శాఖ క్రిందికి వచ్చెదరు. విదేశీయ భౌతిక శాస్త్రవేత్తలలో ప్రముఖులందఱును భావవాదమును ఆదర్శవాదముతో అనుసంధానించి ఏకీకృతమైన సిద్ధాంతముగా దానిపై ఖండనమండనలు చేయుట సాగించినారు. భావవాదము పదార్థముయొక్క స్థితినంగీకరింపదు దృశ్యమాన జగత్తు మనస్సు యొక్క భ్రాంతిమూలకమని ప్రతిపాదించును. అనగా దృశ్యస్పర్శన దర్శనాదులు బుద్ధీంద్రియము ద్వార మున సమష్టిగా నిర్వహించుటతో బాహ్యప్రపంచపు నామరూపము లేర్పడును. కాబట్టి ఈ నామరూప ప్రపంచమెల్లను మన భావనకు పరము (వలుపల)గా ఉన్న దనుకొనుట భ్రమ లేక మిథ్య మాత్రమేనని బర్క్లీ సిద్ధాంతము! "మనం చూసినప్పుడే వస్తువు కనపడటం మనం తాకినప్పుడే కదా తెలియటం.... కాబట్టి మన ఇంద్రియములు పొందుతున్న అనుభూతి వల్లనే బాహ్యప్రపంచం ఏర్పడు తుంది. అది ఉందని మనం అనుకుంటాము" బర్క్లీ దాదాపుగా పాశ్చాత్య భావవాదమీ సరళిలోనే నడచినది! భౌతికవాదము దీని నామూలాగ్రముగా ఖండించి వస్తువుల స్థితిని నిలబెట్టినది!

## వేదము - త్రిత్వవాదము :

సమస్త భారతీయ ధర్మమునకును మూలము వేదము. కావున వేద ప్రామాణ్యమే ఈ దేశములోని సర్వకాలములలోని జీవన విధానములకును పరమ సత్యము. వేదము నిర్ద్వంద్వంగా త్రిత్వవాదమును ప్రతిపాదించినది.

"ద్వాసుపర్ణా సయుజాసఖాయా
సమానం వృక్షం పరిష్వజాతే

తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి
అనశ్నన్నన్యో అభిచాకశీతి" ఋక్. 1-164-20

"యథా తథ్యతోర్థాన్ వ్యదధాత్
శాశ్వతీభ్యః సమాభ్యః" యజు - 40-8

"జాతః పరేణ ధర్మనాయత్ సమ్వృద్ధిః సహాభువః
పితా యద్‌కశ్యపస్యాగ్నిః శ్రద్ధామాతామనుః కవిః"

(సామవేదము - పూర్వార్చిక - ఆగ్నేయకాండ ప్రథమ ప్రపాఠకము ద్వితీయార్థము, నవమదశతి పదియవమంత్రము - శ్లేషాలంకారము)

ఇట్టి మంత్రములు ఖండితముగ జీవుని, జగత్తును (ప్రకృతి), పరమేశ్వరుని నిరూపించినవి.

## భారతీయాధ్యాత్మిక భావము :

ఈ విధముగా భారతీయుల తత్వచింతనలో 'జగన్మిథ్యా' సిద్ధాంతము మాత్రమే ఏకైక సత్యముకాదు. జీవజగదీశ్వరుల సంబంధమును గూర్చి వివిధ మతాచార్యులు భిన్నభిన్న మార్గములలో నిర్వచించిరి. సాలోక్య, సారూప్య, సామీప్య, సాయుజ్య, సానుజ్య సిద్ధాంతముల నుండి జగత్తు సత్యము బ్రహ్మ మిథ్య యనువారితోపాటు జగన్మిథ్యా బ్రహ్మ సత్యమను సిద్ధాంతము కూడ వికసించినది. తత్వజ్ఞులు తమలో తాము పరస్పరము జీవేశ్వర విషయములో కలహించికొనినను మౌలికమైన భారతీయ జీవన మూలసూత్రముల ప్రాతిపదికలో మాత్రమువై రుధ్యమును ప్రదర్శింపలేదు. కావున భారతీయాధ్యాత్మిక వాదము మరణానంతర జీవేశ్వర సంబంధ నిర్వచన ప్రాతిపదికపై గాక ప్రత్యక్షమైన జీవన విధాన నిర్వచనముపై ఆధారపడి యున్నది. మఱి ఆ విధానమేది ??

## భౌతికవాదము సమగ్రము కాదు :

ఆర్థిక రాజకీయములు అంగములుగ కలిగిన అంగి భౌతికవాదము సమగ్రము కాదని భారతీయ తాత్వికు లాలోచించిరి. మానవుడు కేవల మర్థజీవిగ మాత్రమే జీవింపలేడు. అతని శారీరక ప్రాథమికావసరముల సంతృప్తిని సాధింపపలెను. పిమ్మట మనస్సు గూర్చి బుద్ధిని గుఱించి (ఉన్నదని నమ్మి

నచో) ఆత్మను గూర్చియును ఆలోచన వచ్చును ఈ సర్వాంగీణ స్వయం సమృద్ధమైన సిద్ధాంతమే మానవ జీవన సంపూర్ణ వికాస దోహదకారి యగునని గుర్తించిరి !

పెట్టుబడిదారీ వ్యవస్థ 'లాభములకై ఉత్పత్తి' (Production for profit) సిద్ధాంతముపైన, సామ్యవాదము వినిమయము కొఱకు ఉత్పత్తి, (Production for consumption) పైన ఆధారపడి యున్నవి ఈ వాదములను త్రోసిరాజని, 'ఎక్కువ మంది అవసరములు తీర్చి ఎక్కువ సుఖములు కల్గి చు' సిద్ధాంతముకన్న (Maximum happines for maximum number of people) 'ప్రతి వ్యక్తి యొక్క సర్వాంగీణ వికాసము' ప్రాతిపదికగా నున్న సిద్ధాంతము సర్వకాలికము సార్వదేశికమని భావించిరి. (Plan for all round happiness to every individual).

## చతుర్విధ ప్రాతిపదిక :

దృశ్య మానసమాజము ఈశ్వరునితో నిండియున్నదనియును జగదారాధనమే ఈశ్వరోపాసన మనియును ఆధ్యాత్మికవాదము నిర్ణయించినది !

'ఈశా వాస్యమిదగ్ం సర్వం యత్కించ జగత్యాం జగత్
తేన త్యక్తేన భుంజీథా మాగృధః కస్యస్విద్ధనమ్'[1]

నరుని నారాయణుని ప్రతీకగా భావించుకొనినప్పుడు సమర్పణమే కాని సంఘర్షణ ముండదు. సంఘర్షణ పశున్యాయము 'జీవో జీవస్య జీవనమ్' (Struggle for existance and survival of the fittest) డార్విను సిద్ధాంతము, బుద్ధి, హృదయము, ఆత్మకల ఆధ్యాత్మికవాదులకు వర్తింపదని వారభిప్రాయపడిరి ! సామరస్య సమన్వితమైన సమాజ జీవనము లక్ష్యముగా చతుర్విధ ప్రాతిపదికపై చతురాశ్రమముల నేర్పరచి చతుర్విధ పురుషార్థ సాధనకై సువ్యవస్థితమైన రచన సాగించినారు భారతీయ మహర్షులు !

## ప్రవృత్తి - నివృత్తి :

భారతీయాధ్యాత్మిక వాదములో జటిలాతి జటిలమైన సమస్య యిది !

---

1 యజుర్వేదము - అ. 40. మం. 1

వేదాంతము ప్రవృత్త్యాత్మకమా, లేక నివృత్తిని బోధించునా? యని- ప్రముఖులైన తత్వవేత్తలందఱకు ఈ విషయములో భిన్నాభిప్రాయమునే ప్రకటించిరి! జగత్తు 'మాయమేయ' మనియును, బంధకారకములైన సంసార సుఖములను బాంధవ్యములను తొలగించుకొనవలెననియును. అప్పుడే ముక్తి సిద్ధమగునని యును వేదాంతులలో నొక ప్రముఖ వర్గము భావించుచున్నది! భౌతిక వాదుల కిది బలమైన ఆయుధము 'సంసార సాగరతరణైక సేతు'వని ఈశ్వరుని స్తుతించెడి వేదాంతము జగత్తు యెడల పలాయన వాదము (Escapism) ప్రదర్శించిన దని వారు విమర్శించిరి. మధ్యాత్మిక జగత్తుకో జీవుడు నిష్కర్ముడు, అకర్ముడు అగుననియును దానివలన సంసారములోని బరువు బాధ్యతల నుండి తప్పించుకొనుటకే అతడు ప్రయత్నించుననియును వారు విమర్శించిరి!

"అది (అధ్యాత్మిక తత్వశాస్త్రము) మానవునిలో ప్రవృత్తి శీలతను కోర్కెలను చంపి నివృత్తి శీలాన్ని నిష్కామాన్ని నిర్మాణంచేయ ప్రయత్నిస్తూ ఉన్నది."[1] ఇందు కొంత సత్యము లేకపోలేదు కాని వేదాంతము నివృత్త్యాత్మకమని చెప్పుట పాక్షిక సత్యమే!

## గీత ప్రవృత్తినే బోధించినది

క్లైబ్యముతో నున్న నరునికి శ్రీకృష్ణుడు శత్రు సంహార కారకమగు మూలతత్వము నుపదేశించుట గీతా రహస్యము. రాజస కర్మమును ప్రేరేపింప జేసిన గీత నిష్కామ్యము నైష్కర్మ్యము నివృత్తిని బోధించునని కొందఱు వ్యాఖ్యానించిన మాటనిజమే కాని, అది వ్యాఖ్యాన కర్తల పాండిత్యమును ప్రదర్శించినట్లు గీతలోని మూలతత్వమును నిరూపింపదని విజ్ఞులభిప్రాయపడినారు. ముఖ్యముగా లోకమాన్య బాలగంగాధర తిలకు, సమర్థ రామదాసకృత దాసబోధను దయానందకృత సత్యార్థ ప్రకాశికను వివిధ ప్రాచ్య పాశ్చాత్య తాత్విక సత్యములను జీర్ణించుకొని మాండలే నుండి వెలువరించిన తత్వ భాష్యము 'గీతా రహస్య' మీ పరమ సత్యమునే చాటుచున్నది. 'సన్యాసం కర్మయోగశ్చ నిశ్శ్రే

1. మార్క్సిస్టు పీఠిక. తత్వశాస్త్ర ప్రాథమిక పాఠాలు.

యనకరావు భౌత యోస్తు కర్మ సన్యాసాత్ కర్మయోగే విశిష్యతే'[1] యను గీతా వాక్యమును దాహరించి 'లోక సంగ్రహ దృష్టితోఁ గర్మాచరణము నుప దేశించు ప్రవృత్తి మార్గమే శ్రేష్ఠతరమనియు కావున జ్ఞానియైనవాఁడు కూడ దేహ పాత పర్యంతము కర్మవరి త్యాగము చేయుటకు వీలులేదనియు గీతా రహ స్యమును లోకమాన్యులు ప్రకటించిరి!"[2] "కర్మయోగము కర్మకొరకే కర్మ నాచరింపవలెనని చెప్పును కర్మను వెన్నఁటి ఫలితము సిద్ధింపవచ్చును. కాని అట్టి ఫలితము నుద్దేశించి కర్మ కుపక్రమింపరాదు. ఫలాభి సంధి రహిత కర్మ వలన మానవునకు సమబుద్ధితో వ్యవహరించుట సాధ్యమగును."[3] కావున సారాంశమేమనగా జీవజగదీశ్వరులు నిత్యులు. ప్రకృతి జగత్తునకు ఉపాదాన కారణము, ఈశ్వరుడు నిమిత్త కారణము అందు జీవుడు అనుక్షణమును చేయు కర్మమును 'ఈశ్వరార్పణము'గ సాగించుటే కర్మయోగమని సిద్ధాంతము!

## ధర్మరాజ్య స్థాపనకై కర్మయోగము :

సామ్యవాదము ఆర్థిక సిద్ధాంత ప్రాతిపదిక కలది. భారతీ యాధ్యాత్మిక వాదము మానవ జీవితము 'సర్వాంగీణ వికాసము' పొందవలెనను ప్రాతిపదికపై వ్యక్తికి సమష్టికి మధ్య సంఘర్షణము కాక సమన్వయమును ప్రేమను ప్రతిపా దించునది! అట్టి ధర్మరాజ్యమే రామ రాజ్యమని రాజకీయముగ సాంఘికముగ సాంస్కృతికముగ దానిని సాధించుటే మన కార్యక్రమమనియు తిలక్, గాంధీ, మాలవీయాదులు బహిరంగముగ ప్రకటించిరి. అందులకే సంకుల స్వాతంత్ర్య సమరమును సాగించిరి. మార్క్స్ సామ్యవాదమునకు ప్రతిద్వంద్విగ నిలిచి భౌతికవాద వ్యవస్థతో అనుక్షణమును సంఘర్షించిన సిద్ధాంతమీ 'ధర్మరాజ్య' కల్పన! ఇదియే భారతీయాధ్యాత్మిక వాదమున ంతకును అంతరాత్మవంటిది! తెలుఁగు సాహిత్యమేమి, సర్వ భారతీయ సాహిత్యములును అందలి వివిధోద్య మములును - సామ్యవాద ప్రాతిపదికను పొందనివెల్ల - నీ శక్తితో ముందుకు

---

1. భగవద్గీత - 5. 2.
2. లోకమాన్య గంగాధర తిలకు. శ్రీ పల్లా దుర్గయ్య. మహాపురుషులు 65వ పుట.
3. కర్మసిద్ధాంతము. 341 పుట దర్శనములు. మతములు. విజ్ఞానసర్వ స్వము VII

సాగినవే! కావున సాహిత్య సమన్వయమునకు ముందుగ ధర్మరాజ్య కల్పనమును వివరించెదను!

## సంపూర్ణ మానవతా కల్పనము (Integral Humanism) :

వ్యక్తిలోని తృష్ణలు కేవలము ఆర్థికమైనవిగనే భారతీయులు భావింపలేదు. ఆతని సుఖశాంతులు శారీరక మానసిక బౌద్ధిక ఆత్మీయ సంతృప్తులన్నిటిపై నాధారపడి యున్నవనియును అట్టి వ్యక్తుల యొక్క బహువచనమే సమాజమనియును ధర్మరాజ్య తత్వము సూత్రీకరించినది.

వ్యక్తి కెట్లు పంచవిధ ప్రధానాంశములు కలవో సమాజమునకు కూడ పంచవిధాశ్రితములైన ప్రధానాంశములు కలవు. ఈ రెండింటిని చతుర్విధ పురుషార్థములతో సాధించుటే ధర్మరాజ్య సమన్వయము.

**వ్యక్తి** ; శరీరము – భౌతికమైన సాధన సంపత్తి.
ప్రాణము – చైతన్యము
మనస్సు – శాంతి
బుద్ధి – వికాసము

ఆత్మ – తాదాత్మ్యత; సుఖ కారకములైన విషయములు. వ్యక్తికి ఐదు అంగములున్నట్లే సమాజమునకు కూడ పంచాంగ విభాగము కలదు.

**సమాజము** : దేశము – శరీరమువంటిది
విరాట్ – ప్రాణశక్తి వంటిది (సామూహిక చేతన)
సంస్కృతి – మనస్సు వంటిది.
ధర్మము – బుద్ధివంటిది
ఓదాత్మ – జీవాత్మ వంటిది

ఇట్టి సమగ్ర స్వరూపముతో కూడిన వ్యవస్థలో నేది లోపించినను దృశ్యమాన సమాజములో సుఖశాంతులు లుప్తమగుట భారతీయులు ప్రత్యక్షానుభవముచే యుగయుగముల నుండి పరిశీలించి నిర్ణయించినారు. అందువలననే వ్యక్తి – సమాజ – చతుర్విధ పురుషార్థములు భిన్నభిన్న ప్రాతిపదికలపై నాధారపడినవి

కాక పరస్పర పూరకములన్నియును పరస్పరా ధారితములనియును సమన్వయములో నిర్ధారితమగు చున్నది.

## ఆదాన ప్రదానములు - వింగడింపు :

వ్యక్తి సమాజములో జన్మించిన దాది, సమాజ మాతనికి విద్యను శిక్షణను ప్రసాదించును. తిరిగి వ్యక్తి కర్మచేసి సమాజ సేవలో ఋణ విముక్తుడగును. కర్మచేసిన వ్యక్తికి సమాజము ప్రతిఫలమును (భోగము) ప్రసాదించును. వ్యక్తి తన అవసరములు తీరిన పిమ్మట మిగిలిన దానిని త్యాగము లేక యజ్ఞము ద్వారమున తిరిగి సమాజ సమర్పణముచేసి ఋణ విముక్తుడగును. ఇది అనంతమైన పరస్పరాధారితమైన వలయము. ఇది అవిచ్ఛిన్నముగ సాగనిదే వ్యక్తికి గాని సమాజమునకు గాని సుఖశాంతులు లభింపవు.

౧) శరీరము దేశముల సుఖము శిక్ష కర్మముల ద్వారమున జరిగినచో అర్థ పురుషార్థము సిద్ధించును. 1) శరీర 2) దేశ 3) శిక్షా 4) కర్మములనెడి చతురస్రము అర్థ పురుషార్థమును సూచించును.

౨) మనస్సు, సంస్కృతుల వికాసము కర్మ ఫలముల ద్వారమున జరిగి కామ పురుషార్థము సూచించును. అనగా 1) మనస్సు, 2) సంస్కృతి 3) కర్మ, 4) ఫల(భోగ)ముల నెడి చతురస్రము కామ పురుషార్థమునకు ప్రతీక. 3) బుద్ధి, ధర్మముల పరిపూర్ణత, కర్మఫలము యజ్ఞములచే సిద్ధించును. 1) బుద్ధి, 2) ధర్మము, 3) కర్మఫలము, 4) యజ్ఞము లనెడి చతురస్రము ధర్మపురుషార్థమునకు చిహ్నము.

---

1) వ్యష్టి : ............ సమష్టి :

విద్య ←................................

└→................................→కర్మ

ఫలము (భోగము) ←................................←┘

└→................................ త్యాగము (లేక యజ్ఞము)

[సుందరసింగ్ భాండారీ సిద్ధాంతవ్యాసము ఆధారము.]

४) జీవాత్మ, చిత్‌ల (సమాజ - విశ్వాత్మలకు) తాదాత్మ్యము ఆనందము, జ్ఞానము (శిక్ష), యజ్ఞములచే లభించును. 1) ఆత్మ, 2) చిత్, 3) జ్ఞాన యజ్ఞములనెడి చతురస్రము మోక్ష పురుషార్థమునకు గుర్తు!

ఇట్లు పరస్పర సమన్వయ సాధకములు పూరకములును అయిన మూల తత్వములపై 'ధర్మరాజ్య'ము ప్రతిపాదింపబడినది.

## నిత్యజీవితములోనికి పరివర్తన :

తాత్వికమైన ఈ విషయమును అనుదిన జీవితములోనికి అనువదించి చూచినచో భౌతికవాదము నధిగమించిన భారతీయాధ్యాత్మిక వాద కల్పనమెట్లు సంపూర్ణ మానవ జీవితమునకు దోహదకారియగునో పరిశీలింపవచ్చును!

ప్రతివ్యక్తికిని ఉచిత నిర్బంధ విద్య నిచ్చుట సమాజ కర్తవ్యము. దానిని పొందిన ప్రతివ్యక్తియును. కర్మశీలి కావలెను అట్లు వ్యక్తి పనిచేయుటకు కావలసిన అవకాశమును తిరిగి కల్పింపవలసిన బాధ్యత పాలకులది! దీనివలన వ్యక్తి వేతనమును పొందును అది కర్మకు ఫలము. తిరిగి వ్యక్తి సమాజములో ధనమును సక్రమముగ వినియోగపరచవలెను. ఆత్మీయులను పోషించుట, పేదసాదల నాదరించుట, పన్నులు కట్టుట 'త్యాగ'మునకు చిహ్నములు.

ఈ రీతిగా ధర్మభావన ప్రాతిపదికగా మానవుని సంపూర్ణ సుఖమయ జీవనమునకు హేతుభూతమైన వ్యవస్థ రూపొందింపబడినది. కాశ్మీరములోని కల్లోలములకో కల్హారములకో కన్యాకుమారీ తీరములోని భారతీయుడేల స్పందింపవలెను? వ్యక్తి విరాట్స్వరూపుడైన సమాజ పురుషుని యెడల ప్రదర్శించెడి త్యాగమయ, ఏకాత్మ భావమునకిది సంకేతము!!

అట్లే మద్యము, మాంసము కూడ దండుము. ఆర్థికముగ మద్యమువలన ప్రభుత్వమునకు రాబడి వచ్చును. అయినను దానివలన సమష్టి సుఖశాంతులు భంగమగుటయే గాక 'ధర్మ' ప్రాతిపదికపై అది నీతి బాహ్యమైన విషయముగ నిర్ణయించుట జరిగినది! ఇట్లు అర్థమును కూడ ధర్మవలయములో బంధించుట భారతీయుల సువిశాల సువ్యవస్థిత సమాజ రచనకు జీవన విధారధారకు నిదర్శనము.

## జాతీయవాదము - ఆధ్యాత్మిక జాతీయవాదము :
## (Nationalism-Spiritual Nationalism)

ఒక జాతిని విశిష్టముగ నిర్ణయించుటకు కొన్ని ఆధారములున్నవి. భాష ప్రాంతము, మతము, సంస్కృతివంటి బాహ్య, అభ్యంతర అంశము లెన్నియో దీనికి సహకరించును. ఇది 'ఆంగ్ల' జాతి యనుటకు వారి భాష, బ్రిటను ప్రాంతము, క్రైస్తవమత సంబంధియైన జీవన విధానము ఆధారములుగ నున్నవి. అట్టిది భారతదేశములో లేదు. కావున ఇది నొక జాతియేలేదు-జాతీయే లేనప్పుడు జాతీయ జీవనమేలేదు - అను వాద మొకటి బయలుదేరినది ! ఆంగ్లేయ చరిత్ర కారులలో పెక్కురు దీనిని బలపరచినవారే !

ఈ వాదమునకుపబలకమైన సాక్ష్యములివి : ఇటు నొక జాతి లేదు. కారణమేమనగా మతమొక్కటే లేదు. బౌద్ధము, జైనము, శైవము, వైష్ణవము, శాక్తేయము మాత్రమే కాక మత రహితమైన చార్వాకము కూడ జీవించినది. ఈ మతములలో పరస్పరము ఉత్తర దక్షిణ ధ్రువములంత యంతరమున్నది ! ఇక భాషల విషయము పరిశీలించెదమనినచో ఏక కుటుంబమునకు చెందని భిన్న భిన్న భాషలు, వానిలో తిరిగి మాండలికములు ప్రాదేశిక భేదములు అనంతములు ! వీనికి సంబంధముకన్న సంవాదమే అధికము. ఇక సంస్కృతిని పరిశీలించినచో ఆర్యులు - ద్రావిడుల వంటి జాతుల వారెందరో ఇట జీవించిరి. కావున ఎవరెవరీ భూభాగముపై జీవించుచున్నారో వారెల్లరును 'జాతీయులే' నని సారాంశము. దీనినే 'ప్రాదేశిక జాతీయవాద' మందురు ! !

## ఖండనము :

ఇట్లు లౌకికమైన యుక్తులతో దీనిని నిలుపవచ్చును. కాని వాస్తవమున కిది భిన్నము. ఇందులకు కొన్ని విప్రతి పత్తులున్నవి ! ఇట నివసించెడి వారందఱును ఈ జాతీయులే ఐనచో ఎంతకాలము నివసించుట ? అను ప్రశ్నవచ్చును 'ఎంతకాలమేమి ! కొంతకాలముఱనను చాలను ద్రావిడులట్టివారే, వారిని జయించిన ఆర్యులు, తరువాత వచ్చిన శకులుహూణులు, అరబ్బులు మొగలులు ఆంగ్లేయులు నందఱును అట్టివారే'నని సమాధానము వచ్చును. ఇది ప్రాదేశిక జాతీయ వాదమునకు ప్రోది ! దీని నంగీకరించినచో విదేశ ప్రభు లీ దేశములో కొంతకాల మతిథిగనుండి పోయినప్పుడాతనికి పౌరసత్వము సిద్ధించునా ?

ఆతడును జాతీయుడే, అయినచో తిలకు, మాలవీయా, గాంధీ ప్రభృతులేల ఆంగ్లే యునకు వ్యతిరేకముగ పోరిరి? కావున కేవల మీ భూభాగముపై కొంతకాలము నివసించినంత మాత్రముననే ఆతడు జాతీయుఁడు కాడనుట స్పష్టము! కావున ప్రాదేశిక జాతీయవాదము పరాస్తముకాక తప్పదు. అయినచో జాతీయవాద మెట్టిది??

హిట్లరు జర్మనీలో ప్రబోధించినది జాతీయవాదము. అది 'ఫాసిస్టు' శక్తులకు చోదక శక్తిగ నిలిచినది. భారతదేశము కూడ జాతీయ వాదమునే ప్రతిపాదించినచో దానికి మూలాధారమేది? 'భౌతిక'వాదమున కిది ఎట్లు ప్రతి ద్వంద్వి యైనది? - పరిశీలింపవలసి యున్నది!!

## 'దైవీ రాష్ట్రవాద'' మూలసూత్రము :

భారతదేశము ప్రతిపాదించిన జాతీయవాదమును 'అధ్యాత్మిక జాతీయ వాద' మందురు! దీనికి మాతృదేశము ఆలంబనము! దేశమును దేవతా స్వరూపముగ నారాధించుట యిందలి మూల సూత్రము. అట్లారాధించిన వాఁడు అధ్యాత్మిక జాతీయవాది. ఈ తత్వము మీదనే మిగిలిన సిద్ధాంతమంతయును ముందునకు సాగినది!! దీనినే హిందీవంటి ఔత్తరాహ భాషలలో 'దైవీ రాష్ట్రవాద' మందురు.

పైని ప్రస్తావించిన వాదములో రెండు శబ్దములున్నవి. తొలుతనున్నది ఆధ్యాత్మికతత్వము, లేదా దైవీయము!! భౌతిక సిద్ధాంతము నతిక్రమించి ఆత్మ నాధారముగ చేసికొనిన తత్వమున కిది సూచన! అట్టి ఆత్మీయానుభూతి పొందిన వ్యక్తుల సముదాయమును సూచించునది 'జాతి'!!

'ప్రాదేశిక' జాతీయ వాదములో కొంత పరిమితికల భూభాగములో నివసించెడి ప్రజలనొక జాతిగ పరిగణించుట గోచరించును. మధ్యయుగములలో ఈ ప్రాదేశిక వాదము వెఱ్ఱితలలు వేసినది! వైజ్ఞానిక యుగములో కూడ ప్రాదేశిక వాదమే హిట్లరుచే ప్రోక్తమై విధ్వంసమునకు దారి తీసినది. దీనిని ప్రాదేశిక జాతీయవాద మనుటకన్న పాశవిక జాతీయ వాదమనుట సముచితము. సత్వ రజస్తమములలో తమస్సు నాశ్రయించిన వాదమిది!

దీనికి విరుద్ధమైన సాత్వికవాదమే 'దైవీరాష్ట్ర వాదము' జాతీయత సంకుచిత ప్రాదేశిక స్పర్థలకు దోహదము చేయకుండ ఉండవలెననుట సాత్వికార్ష జీవన పునరుద్ధానమునకు కృషి చేయవలెననుట-దీని సారాంశము. 'సర్వేజనాః సుఖినో భవంతు సర్వేసంతు నిరామయాః' అని విశ్వశ్రేయమును దృష్టిలో నుంచుకొని నదే దైవీ రాష్ట్రవాదము. ఈ గడ్డపై జన్మించిన వాదము కావున భారతభూమిని మాతృస్వరూపముగ పూజించుటతో ఈ వాదమును గౌరవించుటే పరమార్థము!

## ఒకే లక్ష్యము - రెండు లక్షణములు :

విచిత్ర మేమనగా భౌతికవాదము, ఆధ్యాత్మిక జాతీయవాదము, ప్రతిపాదించిన లక్ష్యమొక్కటే! కాని లక్షణములు వేఱు! ఆచరణ వేఱు! భౌతిక వాదమును ప్రవచించిన ప్రముఖులు తామూహించిన సమాజము సిద్ధించినచో అందు రాజు కాని, రాజ్యము కాని స్థితము కాదని ప్రవచింతురు. దీనినే రాజ్య రహితవాద మందురు (Ararchism – Whithering away of the state) కాని ఇది శుద్ధ దర్శమే తప్ప ఆచరణలో భౌతికవాద దేశములలో కూడ సిద్ధింప లేదు. అత్యంత కేంద్రీకృత ఉత్పత్తి వ్యవస్థ (Highly centralised system of production)లో వ్యక్తి సమాజమును కబళించుట గమనించి సామ్యవాదము (Communism) ప్రభవించి ఉత్పత్తి సాధనముల యాజమాన్యము లేదా స్వామ్యము వ్యక్తుల చేతిలో కాక సమాజము చేతిలో నుండవలెనన్నది! అనగా కేంద్రీకృతమైన ఉత్పత్తి వ్యవస్థ యథాతథముగానే ఉండగా పాలనాధికారము వ్యక్తినుండి సమాజమునకు సంక్రమించినది. ఫలితముగా వ్యక్తి సమాజ యంత్రాంగములో నొక మరమేకు (Nut) వలె మారిపోయినాడు. ఈ భౌతికవాద మూలసూత్రమును భారతీయాధ్యాత్మికవాదము సవాలు చేసి వ్యష్టి సమష్టులకు మధ్య సమన్వయమును సాధించినది! ఆర్థికముగ కేంద్రీకృత ఉత్పత్తి వ్యవస్థ (Decentralised Productive System) ప్రతిపాదించి సామ్యవాదులాశించెడి రాజు రాజ్యములేని స్థితిని వేలాది సంవత్సరములకు పూర్వమే యదార్థముచేసి చూపినది.

'నరాజ్యం నచరాజాసీత్
నదండోనచ దండక
ధర్మేణైవ ప్రజాః సర్వేవ
రక్షంతిస్మ పరస్పరమ్' ఇదియే ఆధ్యాత్మిక (దైవీ) జాతీయ

(భారతీయ) వాద పరమాదర్శము. ధర్మమును కేంద్ర బిందువుగ చేయుటతో ఈ రక్షణ వ్యవస్థ సాధింపబడినది. "ధర్మ యేణహతో హంతః ధర్మో రక్షతి రక్షితః" అనెడి సూక్తిలోని తాత్పర్యమిది !!

## పతనము - పునరుద్ధరణ :

వేల సంవత్సరముల దండయాత్రల ఫలితముగ జాతి జీవనగతి స్తంభించి పోవుటతో దాని మూలసూత్రములు కూడ మరుగునపడి పోయినవి ఫలితముగ దేశము తిరస్కరించిన పరాజిత వాదములును, విదేశములలో ప్రభవించిన ప్రతీప వాదములను జాతిని వశపరచుకొనినవి. వీనికి వ్యతిరేకముగ చరిత్రలో నిరంతర సంగ్రామము సాగుచునే వచ్చినది కాని రాయలు ఛత్రపతులవంటివారు కారుమేఘముతో నిండిన వర్షాకాశములో కాంతిరేఖలవలె క్షణకాలము తటిల్లతలుగ మెరిసినను 'కాల'గర్భములో ఈ 'ఘన' విజయము తిరిగి కలిసిపోవుట గమనార్హము ! ఈ భృగుపతనమును నిరోధించి పునరుద్ధానము సాగింపవలె ననెడి మహాప్రయత్నము తిరిగి విజృంభించిన కాలము పందొమ్మిదవ శతాబ్దము !

## ఉషఃకిరణములు :

విదేశీయ వాతీయ వాదములను, భౌతిక వాదమును జాతి ముఖాముఖీ, ఏకోన్ముఖమై నిలిచి ఎదుర్కొనుట ప్రారంభించిన పందొమ్మిదవ శతాబ్దమే ఉషోరాగమునకు ప్రతీక ! ఇరువదవ శతాబ్దములో స్వాతంత్ర్య సిద్ధి కొరకు పోరాడిన మహాకర్మయోగుల చరిత్రము పరిశీలించినచో వారెల్లరును ఈ శతాబ్దలోనే ప్రభవించినట్లు తేటతెల్లమగును. అనఁగా ఇరువదవ శతాబ్దములోని ఆంధ్ర సాహితీ లతాంత సౌరభముల కాద్యమైన కూకటివ్రేళ్లు ఈనాడే జాతీయ క్షేత్రములో బలముగ పాతుకొని పోయినవి ! విజృంభించెడి క్రైస్తవమునకు ప్రతిస్థిగ హిందూత్వమును నిలుపవలెనను కోరిక వంగభూమిలో ఈనాడే కలిగెను. 1828 లో రాజారామమోహనునిచే ప్రవచింపబడిన ఈ సంస్కరణోద్యమము కేశవచంద్ర, దేవేంద్రనాథ, బిపినచంద్ర, హేమచంద్ర సర్కారుల వంటివారికి జీవనకార్యమై పరిణమించినది ! 1875 నవంబరు 17వ తేదీ న్యూయార్కులో స్థాపింపబడిన దివ్యజ్ఞాన సమాజ ప్రధాన కార్యాలయము భారతదేశమునకొక నాలుగేండ్లలోనే వచ్చుట విధివైచిత్రి ! ఇదే కాలమున అటు ఆర్యసమాజ ద్రష్ట దయానందుని శంఖారావము పంచనదీ తీరస్థ భూమిలో ప్రణవమై, ప్రతి పక్షులకు

ప్రళయమై మార్మోగినది 1836 ఫిబ్రవరి 18లో రామకృష్ణుఁడు 1863 జనవరి 12 వివేకానందుఁడు జన్మించుట కూడ కాకతాళీయ మనలేము. యుగయుగముల జాతీయ తపస్సు పక్వమైనప్పుడు ప్రభవించిన ఆధ్యాత్మిక ఫలములు వారు! భారత రాజకీయ రంగములోని ప్రచండార్కులు, తిలకు, మాలవీయా, గాంధీ, గోఖలేలు జన్మించి తమ జీవన కార్యక్రమమటు ప్రారంభింపగా దగ్గిరాల కందుకూరి పానుగంటి, రఘుపతి వేంకట రత్నము నాయుడు, గిడుగు గురజాడల వంటి కర్మయోగు లిటు తెలుగునాట బంగరు పంటలు పండించెడి వ్యవసాయమున కాద్యులై వెలుగుబాటలను వెన్నెల తోటలను వెలయించి చీఁకటిలో చెదిరిన ఆంధ్రులపై చిద్రుపలుగ ఉషఃకాంతులను ప్రసరింపజేసిరి! కావుననే దీనిని సంధికాలము, సమన్వయ సమయము, సంగమస్థలముగ అభివర్ణించుట.

## కవిత్వ ముద్యమముగ పరివర్తనము చెందుట:

19వ శతాబ్దము విమర్శకుల దృష్టిలో క్షీణయుగమని అంధమని ఆక్షేపింపబడుట కలదు. కవిత్వములోని స్థాయి ననుసరించి వారట్లు నిర్ణయించిరేమో కాని ఉద్యమ పరిశీలకులకు మాత్రమిది పరుసవేది వంటి కాలము. నాటివఱకును ధర్మము తదాశ్రితమైన కవిత్వము రాజాంతఃపురములలోనే ఉండెనది. అట్టిది మంత్రశక్తి, యంత్రశక్తుల వలన సామాన్యజనమున కందుబాటులోనికి వచ్చినది! నన్నయ తిక్కనల కాలమునాటి మహత్తర పరివర్తనముకన్న నిది పరమమైనది! 'తిరుపతి వేంకటకవులు కవిత్వాన్ని ఒక్క ఉద్యమం చేశారు.'[1] వీరేశలింగం పంతులుగారు' భాషలో భావములో విప్లవము తెచ్చిన ఉద్యమ నాయకుడు'[2] అట్లే గురజాడవారును. 'నవ్యాంధ్ర సాహిత్య ప్రవర్తకుఁడుగా గురజాడ రచనలలో గోచరించు యుగప్రభావము దేశభక్తి'[3] ఆధ్యాత్మిక గ్రంథములు జాతిలో చైతన్యమును సృజించినవి. కవిత్రయము భారతము వలెనే వావికొలను సుబ్బారావుగారు యథామాతృకముగా రామాయణము ననువదించిరి. ఇఁట రామాయణానువాదము కాకతాళీయము కాదు. దీని వెనుక ఆధ్యాత్మికోద్యమ ప్రేరణ మున్నది. సమర్థ రామదాసు మొగలులకు వ్యతిరేకముగా ఉద్యమము నడుపుటకు వేలకొలది హనుమానుని మందిరములను రంగస్థలములు చేయుట, తులసీ

1, 2, 3. 19వ శతాబ్దపు తెలుగు సాహిత్య చరిత్ర. శ్రీవాత్సవ. ఉపసంహారము 343, 345, 346 పుటలు.

దాసును ఈ ఉద్యమమున కాలంబనముగా రామాయణము వ్రాయుట ఇట్టివే! ఈ వావికొలను బీజములే తరువాతి కాలములో దుగ్గిరాలవంటి శ్రీరామ భక్తులైన జాతీయ వీరులను నిర్మించినవి. "స్వరాజ్య ఉద్యమములో.... ఇతనికి తోడ్పడిన భటవర్గము రామదండు. ఈ యుద్యమ ఫలితముగ"[1] గోపాలకృష్ణుడు రామ భక్తిని జాతీయ భావనను సమముగా మేల్కొల్పెను. జనమంచి, శ్రీపాద ప్రభృతులకు వావికొలను వారిదే స్ఫూర్తి! పరశురామ పంతుల లింగమూర్తిగారి సీతారామాంజనేయ సంవాదము కూడ ఇదే తరుణము, వరణ కారణమును! ఇట్టివే వేగినాటి కొండనార్యుని వివేకసింధువు, వాసుదేవయోగి జీవన ప్రబోధము, కానాల నరసింహ కవిగారి శేషధర్మములు, శ్రీధరమల్లె వేంకటస్వామిగారి బ్రహ్మోత్తర ఖండమును! వేల్పూరి వేంకటేశ్వర్లుగారి విచిత్ర రామాయణము కూడ జాతీయ జాగరణమే ప్రముఖోద్దేశముగా కలది. గోపీనాథము వేంకటకవి (1920-90) ఈ కవుల వరుసలో చివరివాడైనను శ్రేష్ఠుడైనవాఁడు!

**మరొక పాల్కురికి:** ఉద్యమ సమయములోనే కవుల ప్రతిభా వ్యుత్పత్తులు సమపాళములో మేళవించి విజృంభించును. అట్టి కవులకు అనువాదమైనను స్వతంత్రముగా భాసింపజేయగల శక్తి కాలమే ప్రసాదించును. పాల్కురికి నాడు జరిగినదది. ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామము నాడును జరిగినదది! నడకుదుటి రామనకవి (1821-1887) మఱొక పాల్కురికియై ఆయన ద్విపదకు పద్యరూపమిచ్చినారు కేవలము కాలపు అవసరములను తీర్చుటయే కవి చేసిన పని!

## పోరాటమునకు పూర్వరంగము:

క్రీ. శ. 1948 లో సాగిన తెలంగాణా పోరాటము రాజకీయ సంబంధిగా గోచరించినను దీనికి బీజములొండు రెండు శతాబ్దముల ముందు నుండియే ప్రారంభమైనట్లు సుస్పష్టము! అది మతప్రాతిపదికపై నిలిచినది. 19వ శతాబ్దములోని శతకములీ విషయమునకు సాక్ష్యములు గోగులపాటి కూర్మనాథుని సింహాద్రి నారసింహ శతకములో యవను లాలయమును ముట్టడించి సాగించిన దుండగములు హృదయవిదారకముగా వర్ణింపబడినవి. అట్లే భద్రగిరి శతకములో

1. గుమ్మడిదల వేంకట సుబ్బారావు. వ్యాసము. వి. స. III 791 పుట.

పేరయ్య కవి భద్రాచల రాముని విగ్రహములను యవను లపహరింప యత్నిం చుట పూజారులు వానిని పోలవరమునకు పడవలపై తరలించుట వర్ణించినారు. ఇటు సమకాలీన రాజకీయ సాంఘిక సమస్యలు కవితలో ప్రతిబింబించుట రాబోవు శతాబ్దములలోని, సంకుల సాహిత్య సమరమునకు గణేశ్వర పూజ వంటిది !

## పరమార్థమే పరమలక్ష్యము :

త్రిలింగ దేశములో సీతారామాంజనేయ సంవాదము విన్పించినది. ఉత్త రాంధ్రములో నారాయణదాసు యథార్థ రామాయణగానము మార్మోగినది. గోదా వరీ తీరమున 'గోవింద నామములు' స్వర్ణముఖి యొడ్డున సుబ్రహ్మణ్యకవి రామాయణము,- తీరములు మారినను దూరములు పెరిగినను ఆంధ్రదేశ మందం తటను ఆత్మ ఒక్కటే "సాహిత్యము కేవలము వినోదము కొఱకు వేడుకకొఱకు మాత్రమే కాదు. ఆత్మ తృప్తికొఱకు పరమాత్మ వివేచనకొఱకు పరమార్థ లక్ష్యసిద్ధి కొఱకు వినియోగించిన ముక్తి సాధనగా తెలుఁగువారానాడు ఉపయో గించిరి."[1]

## భక్తి - రాజకీయ ప్రయోజనము :

శ్రద్ధగా ఆలోచించి చూచినచో మధ్య యుగములలోని భక్తి కవిత్వము నకు నేపథ్యముగా జాతీయ సమైక్యత కన్పించును. విదేశీయ దండయాత్ర ఫలి తముగా జాతి స్వాతంత్ర్యమును కోల్పోవుటతో మఱల నొక్క అవతార పురు షుడే రక్షింపగలడన్న భావన, నిస్సహాయస్థితి, తులసీదాసు, పోతన్న, అన్న మయ్య వంటి కవులందరిలోను సమానముగానే స్పందించినది. ఇట్లు భక్తి కవి త్వమును సాంఘిక రాజకీయ ప్రయోజనములతో సమన్వయింపవచ్చును.

## సిద్ధాంత సమన్వయము :

**భావకవిత్వము :** ఆధునికాంధ్ర సాహిత్యోద్యమములలో అగ్రతాంబూ లము నందుకొనినది భావకవిత్వము. ఆంగ్ల దేశములో జన్మించిన ఒకానొక లత ప్రాకి ప్రాకి ఆంధ్రదేశములో కుసుమించినదని మనము భావించినను ఆధ్యాత్మిక

1. ఉషఃకిరణాలు ఉపసంహారము 337 పుట. యండమూరి సత్యనారాయణ రావు.

వాసనలే వెదజల్లుచున్నదేమి? కావున ఆంగ్ల దేశములోని వృక్షమును అంటుగట్టి తెలుగునాట నాటిరనియును, ఆధ్యాత్మిక క్షేత్రమునుండి వెల్వడిన యీ లత లాంధ్రత్వ భారతీయతలనే కుసుమించినదనియును వ్యక్తమగును. అందుల కీ క్రింది గుణములు హేతుభూతములు.

1. భావకవిత్వమున ప్రబంధముల నాటి అంగ ప్రత్యంగ శారీరిక సంభోగ శృంగారవాంఛ వర్ణనమున నశించి ఆత్మీయ సౌందర్యము గుణ సౌందర్యము అమలిన శృంగార సౌందర్యమును ఆదర్శములైనవి. "సురత సంస్పర్శలేని ఈ శుచిమదమల జీవితానురాగాదులన్"[1] చిలకరించెడి తత్వము 'విధి నియమములన్ విడబడేయును వారల పెంపుడు మైత్రీబంధములు'[2] తెగనట్టి స్థితియును ప్లేటో శృంగార భావనకన్న పరమమైన దశ.

2) స్త్రీ భోగ్యవస్తువను కల్పనము పాశ్చాత్యులది. వారి సమాజము భార్యానిష్ఠము. భారతీయ గృహములలో మాతృత్వమున కున్నతస్థానము. రాయ ప్రోలువారి స్వప్నకుమార మీ లక్షణమునకు లక్ష్యగ్రంథము వంటిది! కాముకు డైన ప్రియునికి ఆమెలో 'అభయ' హస్తము, పాలపాయలవలె పారెడి 'వత్సలత' 'భగవతీ ప్రకృతి' గోచరించినదట! ఆధ్యాత్మిక భావనమున కిది శిఖరాయమాన మైన కల్పనము.

3) 'ఇయంగేహే లక్ష్మీ' అన్న భవభూతి భావనమువలె ఆదర్శ స్త్రీత్వమే భావకవులకు పాదేయమైనది చివరకు భార్యను, ప్రేయసిని 'లోక రాజ్ఞి'గా భావించి తాను 'భక్తుఁడై' ఆరాధించుట ఆధ్యాత్మిక జాతీయ వాదము నకు జీవగఱ్ఱ, రామకృష్ణ పరమహంస చేసినదిదియే!

4) ఉపనిషత్తులచే ప్రబోధింపబడిన సహన సూత్రమును క్రియలోనికి పరివర్తనముచేసి సహనశీలమైన ఆర్షజీవనము వీరిచే ప్రతిపాదింపబడినది. నిర్భర శోకములో కూడ పూజారివలెనే జీవికను నడుపుటకి తత్వచింతనమే హేతు భూతము. ఇది కేవల మీ గడ్డమీదనే యుగయుగములుగా వికసించిన భావము.

---

1, 2. తృణకంకణము.

## ప్రకృతి కవిత్వము :

భావకవిత్వాంతర్భాగమగు ప్రకృతి కవిత కేవల మాధ్యాత్మిక ప్రాతి పదికపైని మాత్రమే ప్రవర్ధమానమైనది అనంతమైన చరాచర ప్రకృతిలో సృజనకు తొలిదశలో మూలప్రకృతి ఉపాదాన కారణము, ఈశ్వరుడు నిమిత్త కారణముగ వేదాంతులు నిర్వచించిరి ప్రకృతికన్న భిన్నుడైనను ఈశ్వరుడు విశ్వాంతర్యామి కావున నిరాకారుని సాకారముగా జగద్రూపమున ఉపాసించుట ఇందలి ఆదర్శము. ఆంగ్లేయుల భావకవిత్వము రాకముందు కూడ వేదోపని షత్తులనాటి నుండియును ఈ పూజ గౌణముగా సాగినది. భావకవిత్వములో ఇది ఒక ప్రత్యేక శాఖకు అధిష్ఠాన సూత్రమైనది. 'ఆకులో ఆకుగ'[1] 'జలధ రార్భ కునిగ[2] తన్ను భావించుకొనుట ప్రకృతిలో అద్వైతసిద్ధి నొందు మహత్తర తత్వమును ప్రదర్శించును. అద్వైత వేదాంత కేసరి రామతీర్థస్వామిగారి అంతిమ గీతమంతయును ఇట్లు ప్రకృతితో తాదాత్మ్యము చెందుదునన్న భావము తోనే సాగినది. రవీంద్రుని ఉపాసనా పద్ధతి యిది. ఆంధ్రులపై నున్న వంగీయ ప్రభావమును మఱల నిట ప్రసక్తము చేయనక్కఱలేదు కదా !

## దేశభక్తి కవిత్వము :

ఆంగ్లేయులను పారద్రోలవలెనను కాంక్ష జాతీయులలో కల్గినది. దీనికి ధర్మస్థాపనము లక్ష్యము! స్వాతంత్ర్యోద్యమము లక్షణము. తిలకు,[3] మాల వీయా, గాంధీలు కూడ ధర్మరక్షణమునకు హిందూత్వ జీవనమునకు, సత్య ప్రయోగమునకు, (**An experiment with truth**). స్వాతంత్ర్యోద్యమమును సాధనముగా స్వీకరించిరి. 'నికరముగా దేశభక్తులుగా నుండి పనులు చేయవలె

---

1. కృష్ణశాస్త్రి.
2. దువ్వూరి రామిరెడ్డి.
3. "రాజ్యాంగము నా స్వరూపము కాదు. వేదవేదాంగాది దర్శనముల అధ్యయనమే నా పరమావధి కాని భారతవర్షము ప్రస్తుతము అస్వా భావికావస్థ యందుండుటచే నేను రాజకీయ క్షేత్రమున పని చేయుట ఆపద్ధర్మముగా నెంచి కార్యాసక్తుడనై యుంటిని" తిలక్. లండన్ ప్రసంగం. కృష్ణరాయ సంపాదక వ్యాసావళి (౧) 218 పుట.

నన్న స్వదేశస్థులనందరను పరమేశ్వర సంతానముగానే భావించి వారికి తాము ఉత్తరవాదుల మనుమాట మరువకయుండవలెన'సి[1] గా ధీమహాత్ము డనుటలోని అంతర్యమిదియే! భౌతికవాదమును ప్రాతిపదిగా చేసికొనిన సామ్యవాదులు కూడ దేశీయ సంగ్రామములో పాల్గొనిన మాట నిజమేకాని వారిది కేవలము సామ్రాజ్యవాద వ్యతిరేక ధోరణి' కాని ఆధ్యాత్మిక వాదము ప్రాతిపదికగా గల జాతీయ ఉద్యమము కాక స్వరాజ్యము. స్వధర్మము నొకే యుద్యమమునకు రెండు ముఖములుగా భావించిరి. "నీవు తీసుకునే చర్యవల్ల ... ఆధ్యాత్మిక చింతనం కొరవడియున్న ప్రజలకు ... 'స్వరాజ్యం' సిద్ధిస్తుందా? అప్పుడు నీకుశ్శంక లన్నీ కరిగిపోతాయి. భిన్న సంశయుడవు కాగలవు"[2] ఇదియే తెలుగులో దేశభక్తి కవులను రగిలింపజేసిన అంగారవల్లరియై 'ఏ పూర్వపుణ్యమో ఏయోగ బలమో జనియించి నాడవీ స్వర్గఖండమున' అని మాతృగీతాలాపనముతో ప్రభాత మంగళ తోరణమై నిలిచినది!

## ఆంధ్రోద్యమము :

ప్రత్యేకాంధ్ర రాష్ట్రము ఆధ్యాత్మిక జాతీయవాదమున కెదురుగా నిలిచిన ధృవము. కాని విచిత్రమేమనగా ఆంధ్రోద్యమ మాధ్యాత్మిక జాతీయ తత్వ జాగరణమునే అంతః రణములో నిలుపుకొనినది. కావుననే జాతీయవాదులంద ఱును ఆంధ్రోద్యమమును అభినివేశముతో ఈశ్వరార్పణ బుద్ధితో సమర్థించి తను మన ధనములు సమర్పించినారు. భారతదేశమును భాషా ప్రాతిపదికపై విభజించి అంతఃకలహములను పెంచి తమ రాజ్యమును సుస్థిరముగా నుంచుకొన వలెనని యోచించిన మొదటి రాజనీతిజ్ఞుడు హార్డింజి ప్రభువు![3] నాడు నాటిన బీజములు 1956లో ఫలించి దేశవ్యాప్తముగా భాషల పేరున వేర్పాటు ధోరణి

---

1. గాంధీ ప్రవచనములు. అనువాదం వైద్యుల నారాయణదాసు. గాంధీ సందేశ ప్రచార పీఠమ్ 20వ పుట.
2. మహాత్మాగాంధీ బెంగాలులోని ఒక సహచరునికి వ్రాసిన లేఖలోని భాగము.
3. 1911లో ఈయన ప్రకటించిన అధికార పత్రములో బెంగాలును బీహారును భాషల ప్రాతిపదికపై విభజింపవలెనని ప్రతిపాదించెను. ఇది ఆంధ్రోద్యమమునకు మూలస్తంభమై నిలిచెను.

పెరిగినది. కాని ఆంధ్రోద్యమము ఆదిలో అట్టిది కాదు. భారత మహాస్వాతంత్ర్య సంగ్రామములో ఇది అంతర్భాగము. అందుకు తొలి దినములలోని ఆంధ్రోద్యమ కవిత్వమే ప్రబల నిదర్శనము. 1914 లో ఉగాది సంచికలో జావా సుమత్రాలను పాలించి 'యవన సైన్యాటవీ దాహ హవ్యవాహకి'తో చెన్నొందిన ఆంధ్రుల వర్తమాన దుస్థితి గూర్చి విలపించుటలోని ఆంతర్యమిదియే! ఆంధ్రత్వమఖండ భారతీయతకు అలంకారప్రాయముగా ఉండునని ఉద్యమనాయకులు భావించినారు; నామము మాత్ర మాంధ్రోద్యమమే కాని జరిగినదంతయును విదేశీయ విశృంఖలముల నుండి జాతిని విముక్తము చేయుటకై సాగించిన భారతీయ సాంస్కృతిక, మత, రాజకీయ, సారస్వత సంగ్రామము. పరమ వైభవమునకై ప్రాకులాట శ్రీ కొండా, పట్టాభి, కాశీనాధుని వంటివారి వ్యాసము లీ విషయమునే నిరూపించును. "ఈ అసహాయోద్యమము కేవల రాజకీయాందోళనము కాదు. భరతవర్షము తన సనాతన ధర్మమును తిరిగి ప్రతిష్ఠాపించుకొనుటకై ఈ యోగసాధనయందు బయలుదేరినది" అని దుగ్గిరాలవారు ధీరోదాత్తులై ప్రవచించినారు[2] "ఆంధ్రోద్యమము జాతీయాదర్శముచేతనే ప్రేరితమగుచున్నదనుట నిశ్చయము"[3]

## తెలంగాణా ఉద్యమము :

త్రిలింగ ప్రాంతములో జరిగినది కూడ ఇట్టి ఆధ్యాత్మిక, జాతీయవాద సంగ్రామమే! కాశింరజ్వి ప్రజాకంటకుడైన విదేశీయుడు. అతని బారినుండి దేశ అఖండతను కాపాడుటకై తీవ్రమైన పోరాటము జరిగినది త్రిలింగ హిందువులకు- వైదేశిక శక్తులకు మధ్య స్పష్టముగా సాగిన పోరాటమిది! దీనిని హిందూ చరిత్రకారులే కాదు, నిజాం వారసులును అంగీకరించిరి. "హైదరాబాదు రెండవ స్టాలిన్‌గ్రాడ్ కాగలదన్నారు.... ఇటువంటి దేశభక్తితోనే ప్రతివారూ

---

1. "ఇది సంకుచిత రాష్ట్రీయ దురభిమానం నుండి ఉద్భవించిన వాంఛ కానేరదు. విశాల జాతీయతా దృక్పథంలో ప్రారంభం నుండి ఆంధ్రోద్యమం వృద్ధి అయింది" శ్రీ మాదల వీరభద్రరావు. దేశభక్త జీవిత చరిత్ర. ఆంధ్రోద్యమ బీజాలు 49వ పుట.
2. దుగ్గిరాలవారి ప్రసంగం. కృష్ణరాయ సంపాదక వ్యాసావళి 157 పుట.
3. ముట్నూరి కృష్ణారావుగారు, కృష్ణా పత్రిక సంపాదకీయం.

తోపిడీలు సాగించారు.... అప్పటి విద్యామంత్రియగు కీ॥ శే॥ బి, ఎస్. వెంకట రావు అండ చూచుకొని హరిజనులు రజాకార్లకు తోడయి సవర్ణ హిందువులను హింసించడం ప్రారంభించారు."[1] ఈ హింసాకాండలో అంతిమ విజయము భార తీయులనే వరించినది ఇది ఆకస్మిక సంఘటనము కాదు ఆధ్యాత్మిక జాతీయ వాదమునకు లభించిన ధర్మవిజయము, త్రిలింగ సామ్రాజ్యలక్ష్మి సత్యభామ యైనది. సంకుచిత వైదేశిక ప్రాదేశిక వాదమును బలపరచిన నరకుని నరికి నరకమున కంపినది. మన ప్రస్తుత సిద్ధాంతమున కిది ప్రముఖ విజయము.

## చైనా - పాక్ దండయాత్రలు :

తెలుఁగునాట కవితాకన్యక అరుణారుణ రత్నదీపము లెత్తినది వైదేశిక దండయాత్రల సందర్భమున స్వీయమైన భూమిని శత్రువుల నుండి రక్షించు కొనవలెనను భావన జాతీయవాదమునకుపబలకము. జాతీయవాది కాళిదాసు నుండి కాటూరి వఱకును భారతమును హిమమకుట ధారణిగానే భావించినాడు కాని ఎల్లలులేని దేశమును కల్పనము చేయలేదు. భౌగోళికమైన సరిహద్దులు దేశ మును కల్పించును. అందలి జాతికి అవి ప్రియతమమైన అంశములగును. ఆర్ష జాతీయులు తమ హద్దులను రక్షించుకొనుటకు వానికి పావనత్వ దివ్యత్వ కల్ప నము చేయుటయు సహజమే! హిమాలయము శివధామముగా ప్రమథ నిలయ ముగా గంగామాయికి జన్మస్థలముగా భావించుటలో ఆధ్యాత్మికత్వము జాతీయత పెనవేసికొని పోయినవి, కావుననే వైదేశిక శక్తులీ హద్దుల నతిక్రమింపగనే జాతి మొత్తమును కదలిపోయినది. 'ఎవడురా, నా తల్లి హిమకిరీటమ్ముపై సేయిసాచ నుంకించె'[2]నని చైనీయు లీ భూమి నాక్రమించినప్పుడు దేశమునకు మాతృకల్ప నము నొసంగి శత్రువులపై హుంకరించినారు. చైనా గతితార్కిక భౌతిక వాద ముపై నిర్మించిన మార్క్సిజమును యథాతథముగా అనుసరించెడి రాజ్యము. మహిమాలయములపై సాగిన ఈ దురాక్రమణము భౌతికత్వము ఆధ్యాత్మికత్వ మును అణచివేయవలెనని జరిపిన చర్య! 'హద్దుల కొఱకగు యుద్ధముకాదిది సిద్ధాంతపు సంగ్రామమోయ్'[3] అనుటలో మార్క్సిజమునకు- మను ధర్మమునకు

---

1. 'నలభై ఏళ్లనా అనుభవాలు.' సాదత్అలీఖాన్ 68వ పుట.
2. సి. నారాయణరెడ్డి - సమరగీతి.
3. ముదిగొండ శివప్రసాద్ - ఆకాశవాణి గీతము,

హిమాలయ పాద సానువులలో జరిగిన సంఘర్షణము సూచించును. 'ఇచట పార్వతీదేవి పుట్టింటిపైన ఇచ్చట శ్రీ మహాదేవు నత్తింటిపైన మతి యదేమిటిరా యెటులుంటలు మియ'[1] అనుటలో ఆధ్యాత్మిక పావిత్ర్యము జన్మభూమిలోని ప్రత్యంగుళము ఈశ్వర స్వరూపమనెడి భావన (Sentiment) ఎటు మంటలను టలో సామ్యవాదాగ్నియను స్ఫురించుచున్నవి. ఈ రెండు పరస్పర విరుద్ధ శక్తులు. వీని మధ్య జరిగిన కఠోర సంఘర్షణమునుండి ఉద్యమము ప్రభవించి నది.

పాకిస్తానము కేవలము మత ప్రాతిపదికపై నిలిచిన రాజ్యము. భారతము మతాతీతము (మతరహితము కాదు). మతాతీత కల్పనము ఎంత అత్యాధునికమో అంత ప్రాచీనమును. "అన్ని నదులును సముద్రమునే చేరునట్లు అన్ని ఆరాధనా మార్గములును ఓ పరమేశ్వరా! నిన్నే చేరు"[2] నను పుష్పదంతుని స్తవము కన్న మతాతీత సర్వమత సమానకల్పనము వేఱేమున్నది? అట్టి ధార్మిక రాజ్యముపై శత్రువు భూగ్రహణశీలియై దురాక్రమణము సాగించినాడు. రెండు దేశముల మధ్య, రెండు సిద్ధాంతముల మధ్య రెండు జీవన విధానముల నడుమ సంకుల సమరము జరిగినది అందు ఆధ్యాత్మిక జాతీయత విజయపతాక నెగురవేసినది. ఆ సందేశమే ఉద్యమాత్మకమైన తెలుగు కవితలో కలకండలచ్చులు పోసినట్లు ప్రస్తారము చేయబడినది.

**సిద్ధాంతము :** మార్క్సుతత్వములో హద్దుల కొఱకు పోరుట ప్రాదేశిక సంకుచిత చర్య. హద్దుల నతిక్రమించిన విశ్వకార్మిక సామ్యవాదము ఆ తత్వ కల్పనము. కాని ఆధ్యాత్మిక జాతీయవాదము భారతభూమి నాలంబనముగా చేసి కొని విస్తరిల్లినది. దేశమే దైవమను కల్పనమును, మార్క్సునకు నవ ప్రతినిధి భాష్యకారుడు నగు మావోయొక్క భావములు ఎదుర్కొనినవి. పరస్పరము సైద్ధాంతికముగా ఇట్లు పోరాడుటలో ఉదయించిన ఉద్యమము మొదటిది. గత పదిరెండు శతాబ్దముల వైదేశిక దండయాత్రలలో నంతర్భాగముగనే పాకిస్తానము మతపరముగా దాడిచేసినదని భావించుట రెండవది. ఈ రెండు ఉద్యమ కవితా

1. నాయని సుబ్బారావు (డ్రాగన్ గీత).
2. శివమహిమ్న స్తవము.

వాహినులును ఆధ్యాత్మిక జాతీయవాద సహస్రముఖ కల్హారమును ప్రోజ్జ్వలముగా వికసింప జేయుటలో వేయి విధములుగా సహాయపడినవి: ఇది సిద్ధాంతము ! !

## సంఘ సంస్కరణములు :

వేదోక్తమయిన హిందూ సమాజము చలన రూపమయి, అనంతకాలము నుండి ముందునకు సాగుటచే పెక్కు మార్పులకు గురికాక తప్పలేదు. అందు పురోగమనాత్మకమైన పరిణామములతోపాటు కేవలము వేద విరుద్ధమైన దురాచార ములు కూడ సమాజ రచనలో ప్రవేశించి జాతిని శిథిలము జర్జరితము చేసినవి. వానిని సరిచేసి సమాజ పురుషని తిరిగి సర్వశక్తి సంపన్నునిగా చేయుటకు వచ్చిన భిషగ్వరులైన ద్రష్టలే సంఘసంస్కర్తలు ! సంఘ సంస్కరణము సమాజముపై ద్వేషముతో కాక ప్రేమతో ఆత్మీయతతో నిర్విరామముగా జరుగ వలసిన యొక కార్యము. చిరంతన నిరంతర విచారధార యిది ! దీని కావాహన పల్కినవారే మహర్షులు - మహాపురుషులు !

## హరిజన సమస్య :

అధునికాంధ్ర సాహిత్యములో తీవ్రముగా ప్రతిబింబించిన సమస్య యిది ! మహాత్ముడు స్వాతంత్ర్య సమరముతోపాటు సత్యాన్వేషణకు దీనిని కూడ నొక సాధనముగా స్వీకరించినారు. నిజమునకు వైదికమైన భారతీయ సమాజములో అంటరాని తనములేదు. 'నన్ను ముట్టుకొనకు నామాలకా' కీయను దురాచారము వైదేశిక దండయాత్రల ప్రభావమున ప్రారంభమైనది. 'మ్లేచ్ఛ శబ్దమునేనాడు కల్పించి ఇతరులతోడి సాంగత్యమునేనాడు మానుకొనినారో ఆనాడే హిందూదేశపు గతి మూడినది.'[1] హరిజనుడు అస్పృశ్యుడని నిరసింప బడుటతో క్రైస్తవుడై తిరిగి పదవిలోనికి వచ్చుసరికి అగ్రకులజు లనబడువారే గౌరవించుట ప్రారంభించినారు. ఇట్టి అవైదిక రీతికి వ్యతిరేకముగా సాగిన జాతీయ పునరుద్ధరణమే ఈ ఉద్యమమునకు మూలాధారము.[2] ఇందు జాతీయ తతోపాటు ఆత్మీయత ఆధ్యాత్మికత్వము కూడా కలదు మానవులు కేవల పదార్థ జన్యులై కొలదికాలము జీవించి నశింతురని భావించినచో తోటి మానవుని ఏల

1. స్వామి వివేకానంద. శంఖారావము 46 పుట.
2. గీత.

గౌరవింపవలెనన్న ప్రశ్నకు భౌతిక వాదములో సమాధానములేదు. కాని ఆధ్యాత్మిక జాతీయవాద ప్రవక్తలు మాత్రము ఏకాత్మతను ప్రతిపాదించిరి. నాలో గల 'నేను' నీలోగల 'నీవు' మౌలికముగా ఒక్కటేనను ఆత్మతత్వము నుపదేశించిరి. ఇట్లే విశ్వము నావరించిన మానవాతీత మహాతత్వమునకే బ్రహ్మమనియో ఈశ్వరుడనియో, శివమనియో నామకరణము చేసికొని సమస్త విశ్వమును ప్రేమించి గౌరవింపవలెనని చెప్పి 'శునిచైవ శ్వపాకేచ పండితాః సమదర్శనః'[1] అని ప్రతిపాదించిరి. అస్పృశ్యతా నివారణమునకీ ఆధ్యాత్మిక దృక్పథము మూలము. కేవలమిది భారతదేశములోనే మొగ్గ తొడిగిన భావమగుటచే దీనికిని జాతీయతకును అవినాభావ సంబంధమున్నది రెక్కలు విప్పిన ఈ శాంతి విహంగమును ఎగురవేసిన మహితాత్ముడు మహాత్ముడు. ఆయన దక్షిణాఫ్రికా ఉద్యమమేమి, రంగు భేదముపై పోరాటమేమి అస్పృశ్యతా నివారణకై జరిపిన సత్యాగ్రహమేమి ఈ భావమునకు సాకార ప్రదర్శనములే! ఈ మహిమాలయము నుండి జన్మించిన పావనజాహ్నవి యే ఆధునికాంధ్ర హరిజనోద్యమ కవిత్వము.

## స్త్రీ జనోద్ధరణము :

స్త్రీ జన స్వాతంత్ర్యమను భావన ఆధునిక కాలములో పాశ్చాత్య దేశములలో ప్రవర్ధమానమైనది. ఆంగ్లేయులీ గడ్డపై అడుగిడు నాటికి 'సతి'వంటి దురాచారములతో భారతదేశము క్రుమ్మగిపోవుచున్న మాట నిజమే! కాని భారత జాతి నిజస్వరూపము మాత్రమట్టిది కాదు. వేద విహిత ధర్మము చ్యుతమగుటతో ఇట్టి వ్యాధిగ్రస్త సమాజము సౌందర్య రహితమై అస్థిపంజరమట్లు మిగిలినది. శివమునకు మఱొక ముఖము శక్తి అనియు, ఆమెయే సాకారముగా స్త్రీ మూర్తి ఐనదనియును వేదాత్మ ఘోషించినది. వేదవనిత యజ్ఞములు చేసినది. ఋక్కులు పఠించినది.[2] ఉపనిషత్తులు వెలయించినది శాస్త్రార్థము చేసినది : సామ్రాజ్యములు

---

1. "నన్ను తాకవలదు నేను పవిత్రుడ ననునదియే మన మతము. ఇట్లే మఱి యొక శతాబ్దము జరిగెనేని మనలో ప్రతివాడు పిచ్చి ఆసుపత్రిలో నుండును." స్వామి వివేకానంద

2. 'యథేమాంవాచం కల్యాణీ మావదా నిజనేభ్యః బ్రహ్మరాజన్యాభ్యాగ్ం శూద్రాయ చర్యాయ చ స్వాయచారణాయ' యజు. అ. ౨౬ మం. ౨ ॥ 'ఇమం మంత్రం పత్నీపఠేత్' అనగా ఈ మంత్రములో యజ్ఞములో స్త్రీ చెప్పవలెనని అర్థము. (శ్రౌతసూత్రము).

కూడ పాలించిన ఆమె ధర్మమునకు లోబడిన సర్వతంత్ర స్వతంత్రురాలు.

కాని సుదీర్ఘమైన వైదేశిక పాలన ఫలితముగా సమాజము ఛిన్నభిన్నమై వికృతములైన దురాచారము లెన్నియో ప్రవేశించినవి. బాల్య వివాహములు, వర శుల్కము, కన్యాశుల్కము, వేశ్య వ్యవస్థ (స్త్రీ అవిద్య, వృద్ధ పురుష) వివాహము, ఇత్యాదులన్నియును ఆధ్యాత్మికమైన ఈ జాతిని పీల్చి పిప్పి చేసినవి. ఈ సమస్యలను ద్వైపీ రాష్ట్రవాదముతో విశ్లేషించెదను.

## శుల్కములు :

కన్యాశుల్కము లేక వరశుల్కము రెండును ఆర్థిక ప్రాతిపదికపై జరిగెడి రెండు దారుణమైన నేరములు. ఇట మానవత కన్న, మాధవుని భావ్యకే ప్రాముఖ్యము. ఆర్థిక కాంక్ష ధర్మము నతిక్రమించినది. ఫలితముగా సమాజములో సంక్షోభము అశాంతి తాండవించినది. వేలకొలది స్నేహలతలు పూర్ణమ్మలు ఆత్మాహుతి చేసికొనినారు. ఇది ద్వైపీ రాష్ట్రవాదము ప్రతిపాదించిన జీవన విధానమునకు భిన్నము. వాణిజ్యము వణిజుల ధర్మముకాని కన్యాదాతల, వరుల తంత్రుల ధర్మముకాదు. వేదము, శాస్త్రవాదము దీనిని నిషేధించినది. దానిని ముందు అధ్యాయములలో ప్రదర్శించెదను.

## వేశ్యా వ్యవస్థ :

సనాతన హిందూ వ్యవస్థలో దేవదాసీమణుల స్థానమున్నతము. వేశ్యలు కూడ రాజ గౌరవము నందినట్లు మనకు మృచ్ఛకటికాదులు నిరూపించుచున్నవి. కాళిదాస వాఙ్మయములో శృంగార రసాధి దేవతలయిన అభిసారికలను పరకీయలను వర్ణించిన తీరు ఒకనాటి సమాజమునకు ప్రతిబింబమనుటలో అసహజమేమియును లేదు ఈ కులమెట్లు నిర్మింపబడినదో పరిశోధకులు తీవ్రముగా పరిశీలించుచున్నారు. 'వ్యభిచారం వేశ్యలకు దైహిక ధర్మమే కాని కులధర్మం కాదు'[1] అని తీర్మానించినవారును కలరు 'ముఖ్యంగా వేశ్యసభలో ఒక నృత్య భంగిమ చూపిస్తోందంటే.... అప్పుడామె వేశ్యకాదు. మానవే కాదు, సాక్షాత్తుగా

---

1. వేశ్యాకులం ఎందుకు పుట్టింది? వ్యాసము శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారు. భారతి ఆగస్టు 19౬9. 8౩, 8౬ పుటలు.

సరస్వతే ఆమె! బుద్ధి ఉన్నవాడి కెవడికీ మనిషి అయినవాడి కెవడికీ, మరో భావన కలుగదామె యెడల, వేశ్య నిజస్వరూపం అదిగో అది'[1] అని ఆమెలోని దైవీయతత్వమును దర్శించి వారు పరవశించినారు. సమాజములోని కామ ప్రవృత్తిలో కల హెచ్చుతగ్గులు సరిచేయుటకీ కులము కదనియును దీనిని నిషేధించుటతో 'సానుల సంఖ్య తగ్గిపోయింది. మగనాళ్ళ సంఖ్య బాగా పెరిగిపోయింది చాలా సంతోషమే కాని సంసారిణుల్లో అతి దారుణంగా పెరిగిపోయిందే వ్యభిచారం, దీనికేమి విరుగుళ్ళు కల్పించారూ యీ సంస్కర్తలు?'[2] అని నవీన సంస్కర్తల నపహాస్యము చేసినవారును కలరు. కాని వర్తమాన వేశ్యకులము కళామూర్తుల నిలయముకాక సమాజమునకు కళంకప్రాయమై నిలిచినది. పరమార్థము నశించి అర్థ సముపార్జనమునకు భౌతికమైన- ఈశ్వర ప్రసాదిత పవిత్రోపాధిని విపణిలో నుంచుట హేయమైన సంగతి! మానవుని మానవునిగా గౌరవింపలేని సమాజములో మాత్రమే వ్యాపింపవలసిన అంటు రోగమిది! కావుననే నవీనమత ప్రవక్తలందఱును దీనిని ఖండించినారు. వేశ్యావృత్తిని తిరస్కరించి స్కందులకే దయానందుని హత్యచేసినారు. వివేకానందుడు తన శీలమును న్యూనపఱుపవచ్చిన వేశ్యలో మాత భువనేశ్వరిని జగన్మాత కాళీమాయిని దర్శించినాడు. ఆధ్యాత్మిక జాతీయపు విలువల కిది శిఖరాయమానమైన తార్కాణము. శీలము అశ్లీలముపై సాగించిన సంగ్రామమిది!! దీనికొఱకు వందలకొలది బ్రహ్మర్షి తఘుపతి వేంకటరత్నము నాయుడుగార్లు, వీరేశలింగము పంతులుగార్లు తెలుగునాట తీవ్రోద్యమము నడిపినారు.

## మతోద్యమములు :

మతము ఆధ్యాత్మిక ప్రేరణకు సాధనము. ఇహపర జీవనములను సువ్యవస్థితముగా రూపొందించెడి మూలసిద్ధాంతములు మతకర్తలచే ప్రోక్తములు మతములన్నియును భౌతికవాదమును తిరస్కరించినవే. జీవ జగదీశ్వరుల సంబంధమును నిర్వచించునది మతము. కేవలపదార్థ విజ్ఞానముపై ఆధారపడిన భౌతికతత్వమునకు మతమునకు ఎప్పుడును చుక్కఎదురే! కావుననే మతము

---

1. వేశ్యాకులం ఎందుకు పుట్టింది? వ్యాసము శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారు. భారతి ఆగస్టు 1959. 86, 85 పుటలు.
2. వేశ్యాకులం ఎందుకు పుట్టింది - 87వ పుట.

వల్ల మందని భౌతికులు. భౌతికులు పశుతుల్యులని మతకర్తలున్న నిందించుకొన్నారు!

వర్తమాన భారతదేశ దుర్గతికి ఆధ్యాత్మిక జాతీయత నశించుట కారణమని వివిధ మతకర్తలును అభిప్రాయపడినారు. బ్రహ్మసమాజము ఆర్యసమాజము. సనాతన ధర్మము దివ్యజ్ఞాన సమాజము, మఱల సనాతన మతములోని శైవవైష్ణవములు గాణాపత్యశాక్తములు ఎన్ని నామములు, నీమములు ఉన్నను మతములన్నియును సామూహికముగా భౌతికవాదమును నిశ్శేష మొనరించుటకే యత్నించినవి. తమలో తాము కలహించుకొను చున్నను భౌతిక చిత్రసేనుని కథ 'వయం పంచాధికంశతం' అనునట్లు మతములు వ్యవహరించినవి!

మతములలో బౌద్ధము జైనము వేద విరుద్ధముగ నుద్యమించినవి. ఈశ్వర అస్తిత్వమును గూర్చి మౌనము వహించినవి లేదా శంకించినవి. కాని భౌతిక వాదముతో ఇవి కూడ సమర్థించుటలో వెనుకంజ వేయలేదు. జగత్తు క్షణికమనియును మనస్సును నివృత్తిలో నుంచుకొని సంసారమునుండి దూరమగుటయే 'నిర్వాణ' మార్గమనియు చెప్పి భౌతిక సుఖముల విషయము వచ్చుసరికి జగమునుండి పలాయనమునే ప్రదర్శించిరి. "సామాన్యులకు సంసారము దుఃఖరూపమై కన్పట్టుచున్నది. వాస్తవమున కీ సంసారము అనిత్యము. అనిత్యమగు దీనిని నిత్యమని ఎవడు భావించునో వాడు దుఃఖితుడగుచున్నాడు.[1]" ఇట్లు దృశ్యమాన జగత్తు -విద్యమానమైన జ్ఞానము నశ్యమనుటతో పదార్థస్థితికి ఆలంబన లేకపోయినది.

ఈ రీతిగా మత ప్రవక్తలందరును శారీరిక భోగములను, భూతముల ఆధిక్యమును, తిరస్కరించిరి. మతోద్యమములు ఆధ్యాత్మిక ప్రాతిపదికపై నిలబడి మోక్షాకాశమును చుంబించుచున్న భవనములు. "ఆధ్యాత్మిక జీవనమున కానందము లభింపదేని ఇంద్రియ జీవనసుఖముకై ప్రాకులాడుదువా? అమృతము లభింపదేని తొచ్చుకాలువ నీటికైనను ప్రాల్మాలవలసినదేనా?[2] ఈభావ స్రవంతి

1. బౌద్ధమతము - దార్శనిక సంప్రదాయములు వి. స. VII 563 పుట.
2. స్వామి వివేకానంద. శంఖారావం. ఆత్మనిగ్రహము అనువాదం శ్రీ కందుకూరి మల్లికార్జునం.

నుండియే తెలుగులో కూడ ఉద్యమ కవిత్వము పాయలుపాయలుగా ప్రవహించి నది!

ఇతరములు :

మతోద్యమములు కాకున్నను మత తుల్యమై ఆధ్యాత్మిక సిద్ధాంతముల ప్రాతిపదికతోనే నడచిన ఉద్యమములు వ ఱికొన్ని కలవు. వినోబా సామ్యయోగ మట్టిది. ఆంధ్ర కవిత్వము నిదియును బాగుగా ప్రభావితము చేసినది. భౌతిక వాదముపై జరిపిన భీకరమగు తిరుగుబాటే సామ్యయోగము. సామ్యవాదము భారత దేశములో పురోగమించుచుండగా దాని నెదుర్కొనుటకు వచ్చిన వానిలో సామ్యయోగ మొకటి! సర్వోదయము దీని సిద్ధాంతము. భూమి కేంద్రీకరింప బడియున్న తెలంగాణములో సామ్యవాదము పెచ్చు పెరిగెను. కమ్యూనిస్టుల పోరాటధికముగా నుండెను. గ్రామమునకు గ్రామము వారి గుప్పిళ్ళలో గుడిపడి యుండెను. అట్టి గ్రామములకు స్వేచ్ఛ ప్రసాదింపబడెనో[1] యనునట్లు దౌర్జన్యముతో విప్లవకారులు చేయలేని పనిని ఆధ్యాత్మిక ప్రాతిపదికపై సామ్య యోగముతో వినోబా సాధించెను. త్రిలింగ ప్రాంతమును ఆయన ప్రత్యేకముగా ఎన్నుకొనుట కిదియే కారణము. శివరాంపల్లె శివ మయమైనది. నాటి నుండియే భూదానమునకై నడక ప్రారంభము తుమ్మల సీతారామమూర్తిచౌదరి వంటి సుకవుల లేఖినుల కీ ఉద్యమమే స్ఫూర్తి కేంద్రము!!

గాంధేయ దర్శనము కూడ ఆధ్యాత్మిక జాతీయవాదముపైని ముందుకు సాగిన మహాదర్శమే! 'పరమగహనమైన వేదాంత సూత్రముల కాయన రాజ కీయ స్వరూపమిచ్చినారు. బౌద్ధములోని అహింసా, కారుణ్య భావములను, హైందవములోని సత్యమును ఆధునికముగా ఆవిష్కరించిన మహాత్ముడాయన. గాంధియే జీసను. గాంధియే బుద్ధుడు ఇట్లీయన అవతారపురుషునిగా ఆరాధింప బడినాడు. భారత జాతీయాత్మ ఆధ్యాత్మికత్వముతో కూడినదనియును దానిని జాగృతపరచుటే తన మతమనియును ఆయన చాటినారు. వర్గ సంఘర్షణము నిది పరాస్తముచేయును. "అన్యోన్య విరోధముచే గాక అన్యోన్యానురాగము

1. శ్రీ వినోబా భావే. వావిలాల సూర్యనారాయణశాస్త్రి.

చేతనే అత్యధిక భౌతిక సంపద నుత్పన్నము చేయపీలగునని" ఆయన విశ్వాసము.[2]

రాష్ట్రీయ స్వయంసేవక సంఘము నడిపిన మహోద్యమ మంతయును భౌతిక సామ్యవాదములకు వ్యతిరేకముగను. దైవీరాష్ట్రీ వాద ప్రతిష్ఠాపనము కొఱకును సాగినది. ఆధ్యాత్మిక జాతీయవాదమే వారి సాధనము, సాధ్యము, కారణము కార్యమును. ఇందులకా సంఘ స్థాపకుల వాక్యములే తార్కాణములు "నేను తిరిగి డాక్టర్ జీని ఈ వైజ్ఞానిక యుగంలో దైవీరాష్ట్రీ వాదాన్ని స్థాపించడం సాధ్యమా? అని అడిగాను. డాక్టర్ జీగంభీరులయారు.... వారిలా అన్నారు "దైవీరాష్ట్రీ వాదాన్ని నేటి విద్వాంసులు అగ్రనాయకులు సైతం కల్పన చేయలేదు వారెన్నడూ దీని అధ్యయనమే చేయలేదు. కాని మన పూర్వజులు పరిపూర్ణంగా రూపొందించిన (ఈ) రాష్ట్రీవాదాన్ని వారు అభ్యసించే పక్షంలో ప్రపంచమంతటిలో శాంతి సౌఖ్యాలను పునర్నిర్మించే శక్తి కేవలం ఈ దైవీ రాష్ట్రీవాదానికే ఉన్నదనే విశ్వాసం వారికి కలుగుతుంది. కనుకనే సంఘం ఈ దైవీ రాష్ట్రీ వాదాన్ని సాకారం చేస్తోంది."[2]

కైతలలో గణనీయముగా కాకున్నను గౌణముగానైనను ప్రతిబింబించిన ఉద్యమములు గోహత్యా నిరోధాదులు. జాతీయ జాగరణమునకును ఆధ్యాత్మిక జాతీయవాద పునరుద్ధరణమునకు మహర్షులు చూసిన కార్యవేదిక లివి! కవులు వారి వెనువెనుకనే నడిచి కరుణామయ కావ్యములల్లినారు. గోరక్షణమున కొక అద్భుతమైన విశ్వకారుణ్య వ్యాఖ్యానము చేసినారు మహాత్ములు. "మానవుడు గోవుద్వారా సకల జీవకోటితోనూ సమత్వస్థితిని భావించేందుకు ఉద్దిష్టుడౌతున్నాడు. గోరక్షణ అంటే మానవ-జంతు జీవులకు మధ్య సోదర భావనను ప్రతిపాదించుకోటం - మరో మాటల్లో చెప్తే అన్ని జీవులూఉచ్చమైనా నీచమైనా ఆంతరిక ఆత్మకు సంబంధించి నంతవరకూ మౌలికంగా సమమైనవే"!![3]

ఆధ్యాత్మిక జాతీయ వాదమనునది సార్వకాలికమైన నిత్య సత్యము. మానవమేధతో అది వికసించును కాని మానవుని అనుపస్థితిలో అది నశింపదు.

---

1. గాంధేయ దర్శనము దర్శనములు-మతములు వి.స. VII 376 పుట
2. శ్రీ భావూరావు అభ్యంకర్ వ్యాసము. 'దైవీరాష్ట్రీ వాదద్రష్ట' జ్యోతి ఏప్రిల్ 1962. ప్రత్యేక సంచిక.
3. మహాత్మాగాంధీ.

భావము శాశ్వతము పదార్థము పరిణామ శీలము ప్రకృతి జగమునకు పాదాన కారణము ఈశ్వరుడు నిమిత్తము జీవుడు జగత్తులో ప్రకృతితో పోరాడుటలోనే ప్రగతి సాధించినాఁడు భూతము ను భౌతికవాదమును జయించుటలోనే నిత్య శాంతి పొందినాడు. "ప్రకృతికో అనుకూలముగా నుండుట అనగా అభివృద్ధి హీనత .. మరణము. మానవుని అభివృద్ధి యంతయును ప్రకృతితోడి నిరంతర సంఘర్షణము వలన సాధింపబడినది కాని దాని కనుకూలముగా ప్రవర్తించుట వలన కాదు."[1] కావుననే భౌతికవాదముతో సంఘర్షించుచు ఆధ్యాత్మిక జాతీయవాద మెల్లప్పుడును ఇట్లే ఉండును. మహాకవులు మార్గీయములేమి, దేశీయములేమి, అవాంతర భేదముల నిట పాటింపక ఆధ్యాత్మిక జాతీయ వాదమును బలపరచినారు. వారి మాటలే మనకు మంత్రములు. వారు మెట్టినచోటే మనకు ప్రయాగ. వారి పాదాంభోశీకరములే మనకు జీవనగంగ. తెలుగులో నాడేమి, నేడేమి, ఏనాడును నడచెడి తత్వచింతన మిది !!

మిగిలిన అధ్యాయములలో ప్రపంచించిన ఉద్యమాత్మక సిద్ధాంత వ్యాస చిత్రమున కంతకును ఇది మూల భిత్తిక !!

1. స్వామి వివేకానంద 'ఆత్మనిగ్రహము' శంఖారావము ౬౮వ పుట.

తృతీయాధ్యాయము

# సాహిత్యోద్యమములు

## భావకవితోద్యమము

ఆంధ్ర భావకవిత్వమునకు తత్వదృష్టిలో మాతృకయైన 'కాల్పనిక కవిత్వము' (Romantic Poetry) కొన్ని విశిష్ట లక్షణములతో శోభిల్లుచున్నది. ప్రణయము దీని ప్రధాన లక్షణమైనను ఇందు అవాంతర భేదములు మఱికొన్ని కలవు.

1) ప్రకృతి ప్రేమ
2) గత వైభవ పునరుద్ధరణము
3) ప్రణయ తత్వము
4) ఆత్మాశ్రయత్వము
5) అద్భుతతత్వము
6) సాహస ప్రియత్వము - అను షడ్విధ శాఖలతో కూడిన కాల్పనిక కవిత్వమునకు మాతృస్థానములు ఫ్రాన్సు, ఇంగ్లండులు. 'రొమాంటిక్' శబ్దము (Romantic) రోమాన్జ్ యను ఫ్రెంచి శబ్దమునుండి వచ్చినది. తొలి దశలో, 17వ శతాబ్దమున 'రోమన్' పదము జనసమ్మతము. సాహసోపేతము, రూపరహితము, అనెడి అర్థములలో ప్రయుక్తమైనది. 'రొమాంటిక్' అనగా కోమలము, లలితము రసాత్మకము, శోకపూరితమని నైఘంటుకార్థము. థామ్సన్ సీజన్స్, (1726-30), యంగు-నైటు-థాట్సు (1742-45) గ్రే-ఎలిజాన్, రిచర్డుసన్ ప్రభృతులీ కాల్పనికోద్యమ పితామహులు !

ఆంధ్ర దేశములో 20వ శతాబ్దపు ప్రథమ భాగములో కాని ఈ ఉద్యమము రాలేదు. ఆంగ్ల విద్యావ్యాప్తి నాటినుండి తెలుగునాట దీని ప్రభావము ప్రసరించుట ప్రారంభమైనది. భావకవిత్వమును ఆంగ్లములో 'లిరికల్' పొయిట్రీ అనినారు. 'లైర్' అను వాద్యవిశేషముతో పాడెడి కవిత ఇది. 'The

Lyric has the function of revealing in terms of pure art, the secrets of the inmer life its hopes its fantastic joys its sorrows delirium' అని ఎన్‌సైక్లోపేడియా ఆఫ్ బ్రిటానికా వర్ణించినది. దీనికి 'భావ' కవిత్వమని హాస్యమునకో- అపహాస్యమునకో, ఎవరు పేరిడినారో కాని నాటినుండి ఆ పేరే స్థిరపడి పోయినది.[1] మృదునామాక్షరమునతో 'భావ' కవిత్వము క్రమక్రమముగా మహాసరత్తుగా మారిన దశదశల ప్రవహించి ఎన్నియో మాగాణములను ఆర్ద్రీమొనరించి వివిధోద్యమ సస్యములను పండించినది. వానిని స్థూలముగా ఉదాహరింతును.

## గత వైభవ పునరుద్ధరణము :

భూతములోని వైభవమును వర్తమానములోని నైరాశ్యమును స్మరించి కవి విషాదుడగుట గత వైభవ పునరుద్ధరణమునకు బీజము ఇది ఆంగ్ల భావ కవిత్వములోని ఒక ప్రముఖాంశము. దేశభక్తి కిది మూలము. తెలుగులోకూడ ఈ గత వైభవ పునరుద్ధరణ కాంక్షయే జాతీయోద్యమమునకును, ఆంధ్రోద్యమమునకును ప్రాణవాయువు వలె నిండినది! 'ఈశ్వరేచ్ఛమన జీవితము నందిట్టి **మహోద్యమ** వాయువులు వీచుచున్నవి. ఇవియే ఆధునిక కవిత్వ సౌరభమును మనకు గొనివచ్చుచున్నవి. నేటి కవులయందు ప్రథమ స్మరణీయమైనది వారి నిశ్చల దేశభక్తి'[2] అనువాక్య మీ సిద్ధాంతమునకు కొంతంత అందను చేకూర్చుచున్నది! దువ్వూరి రామిరెడ్డిగారు కాల్పనికోద్యమ ప్రభాతముతోనే :

"అంబుదంబులు నమృతపూరంబు లొలుక, నింద్ర చాపంపుతోరణ మింప గొలుక కాఱుమెఱుఁగులు నెల్లడగడలు కొనఁగ, వెడలె స్వాతంత్ర్య రథము వినీర్వీథియందు',[3] అని గొంతెత్తి పాడుట కిదియే హేతువు. జాతీయోద్యమమునకిది ఆవాహనముకాగా ఆంధ్రోద్యమమునకు హారతివలె రాయప్రోలు వారు 'క్రమ్మియున్నది కొత్త రాగమ్ము భువిని ......చూడబోవుచునున్నారు తోడి

---

1. గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి 'భావ' శబ్దము తొలుత వాడినట్లు కీ॥ శే॥ గిడుగు సీతాపతి గారనినారు.
2. లక్ష్మీరంజన వ్యాసావళి. భావకవిత్వము 211 పుట.
3. 'స్వాతంత్ర్యరథము'.

చెలులు లేచి రావమ్మ మా తల్లి లేచిరమ్మ'[1] అని ఆంధ్రమాతకు మ గళ నీరా జన మెత్తుట తరువాత మహోద్యమముకు నడిపించినది! వేగి క్షేత్రము ముఖ లింగము ఆంధ్రపౌరుష ము ఇట్టు గత వైభవ పునరుద్ధరణ భావముతో ఆవిర్భ వించినవే![2] దీనిని రాజకీయోద్యమాధ్యాయములో విపులముగా చర్చింతును. ఈ గత వైభవ పునరుద్ధరణ భావమునకు ఆధ్యాత్మిక జాతీయతత్త్వము అంతర మైన చోదకశక్తియని మరువరాదు!

## ప్రకృతి కవిత్వము :

ప్రకృతి కవిత్వమొక ఉద్యమమువలె ఏకదేశియై స్వీయముగా స్వయం సమృద్ధమైన శాఖగా సాగకున్నను భావ కవిత్వ రసాలమునకు కట్టిన మేలి యంటువలె వికసించి రసవంతములైన ప్రాకృతిక ఫలముల నొసంగినది.

ప్రకృతి వర్ణనము రెండు విధములు. మొదటిది కవిప్రకృతి కన్న భిన్నుడై పాత్రల ముఖమున ఆనుషంగికముగా వర్ణించుట. ఇది ప్రాచీన మార్గము దీనిని Objective View అందురు. అట్లుకాక కవి తల్లీనుడై, అంతర్ముఖుడై ప్రకృతితో తాదాత్మ్యము చెంది సాగించెడి వర్ణనము నవ్యుల మార్గము. దీనిని Subjective Veiw అని పిలిచెదరు. భావుకవు లీ మార్గము ననుసరించిరి 'ఆకులో ఆకునై' కవి పరవశింప కోరుటలో అంతర్నిహితమైన భావమిదియే! 'సాంధ్యకిమ్మీర వర్ణవస్త్రములు దాల్చి గిరితట విహార శృంగార కేళి సొలసి రమణ జరియించు జలధరార్భకునిగా గ నేల సృజియింపడో నన్న'[3] ని ఈశ్వరుని కవి, స్వామి రామతీర్థుడు తన 'మృత గీతము'లో ప్రార్థించినట్లు ప్రశ్నించుటలోని భావమిదియే!

---

1. 'తెనుగుతోట'.

2. 'హైందవజాతీయోద్యమం మన తెలుగునాటిలో కృష్ణా, గుంటూరు మండలాలలో ఆంధ్రోద్యమ రూపాన ఎక్కువగా విజృంభించింది' శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి 25 సంవత్సరాల తెలుగు కవిత్వము 'తెలుగు వ్యాసములు' 85వ పుట.

3. నక్షత్రమాల. దువ్వూరి.

'కవి కుమారులు భావగీతా
రవళిలో మగ్నంబు నొందుంచు
భువి మరచి తన్మయత జెందగ
పొంది'[1] పోవుట భావ కవిత్వ లక్షణము.

## గాంధీ ఉద్యమము - ప్రకృతి కవిత :

ప్రకృతి కవిత్వము ఆంధ్రదేశములో బలముగా వేరూని నిలుచుటకు గాంధేయమైన జాతీయోద్యమమును ఒక ప్రముఖ కారణమని చెప్పక తప్పదు. గాంధీ ప్రకృత్యుపాసకుడు. థోరో ఆయన కిష్టుడు. పల్లీయ ప్రకృతి ఆయన దైవము. నగరములనుండి గ్రామములకు పొమ్మనియును గ్రామీణ వృత్తులను చరఖాను స్వీకరించి మాంచెస్టరును స్తంభింపజేయు మనియును చెప్పుటలోని రహస్యమిదియే! వారు తమ ఆంధ్రదేశ పర్యటన సందర్భములో కృష్ణానదిపై ప్రయాణము చేయుచు సుప్రభాతమున ప్రకృతిని చూచి పులకించుటకై రైలు నుండి తూరుపును దర్శించినారు వారి కట, నదిని అపవిత్రము చేయు దృశ్యము కన్పడినది. దీనికి వారు మిక్కిలి దుఃఖించినారు [2]

ప్రకృతి వారి సాకార దైవము. "మానిషి సృష్టి సమస్తముకూ ప్రభువూ అధికారీకాక ఆ సృష్టికి సేవకుడే అవుతాడు"[3] అనివారి నిశ్చితాభిప్రాయము. ఇది ప్రకృతి పూజకు చిహ్నము వారు వేపకొమ్మను అవసరమైన దానికన్న ఎక్కువ కోసినందులకు కార్యకర్తపై ప్రేమతో కోపగించుకొనిన దృశ్యము వినోబా భావే జీవితమున కొక మహత్తరాదర్శమైనది.[4] గాంధీజీ ఆంధ్రదేశ పర్యటనము - తెనుగునాట పల్లీయ కవితా ప్రాదుర్భావము కాకతాళీయము కాదు పుంఖాను పుంఖముగా వెల్వడిన ప్రకృతి కవిత్వము జాతీయోద్యములో అంతర్వాహినిగా సాగిన అంతర్భాగమే నన వచ్చును.

---

1. పెనుమర్తి వేంకటరత్నముగారు.
2. గాంధీజీ ఆత్మకథ.
3. ఎ. ఎమ్. బొంత్రే వ్యాసము. జాగృతి 3 ౪ ౯౯ (౧౨).
4. 'సామ్యయోగము'లో బాపూ మార్గముపై వినోబా వ్యాఖ్య.

## మహాయుద్ధములే ప్రకృతి కవితకు మూలము :

ప్రకృతి కవిత్వావతరణము గతానుగతికము కాక హేతువాదమునకు నిలిచెడి సకారణమైన సహజావతరణమని చెప్పనగును.

మహాత్మునితోపాటు, మహా సంగ్రామ ప్రభావము కూడ ప్రకృతి కవిత్వమునకు నిమిత్త కారణమనవచ్చును. ప్రథమ ప్రపంచ సంగ్రామ ఫలితముగా దేశము రణచండిక పదాహతికి దాసోహమనినది. దెబ్బమీద దెబ్బగా విప్లవవాదులు నగర వీధులను శ్మశాన వాటికలుగా మార్చసాగినారు. దేశముతో భీతాహముతో కూడిన వాతావరణ మేర్పడినది. దీనినుండి విశ్రాంతి లేకుండ ద్వితీయ ప్రపంచ సంగ్రామము విశ్వమునొక శవాలయము క్రిందికి మార్చినది. అశోకుఁడు చూచిన కళింగ రంగమే త్రికళింగము నుండి త్రిలింగము వఱకు పూర్తి తెనుఁగు నాట తాండవమాడినది. ఫలితముగా కవులలో శృంగార వీరములనుండి తాత్కాలిక వైముఖ్యము, ప్రకృతితో అభేద్యావసాయము పొందవలెనను భావము ప్రబలమైనది. కర్షకులు కిసలయములు కావ్యవస్తువులైనవి. ప్రకృతి కవితాగురువు వర్డ్సువర్తు కూడ ఫ్రెంచి యుద్ధము విప్లవములలోని దారుణములు చూచి మనసుచెడి ప్రకృతి చాటున దాగి మానవులకు దూరముగా మసలుట మనమిట మరువరాదు !

## గగన హర్మ్యములనుండి కోరుకొండకు :

ఇట్లు ప్రకృతి నుపాసనామూర్తిగా ప్రతిష్ఠించిన కవులు వేఱు దైవమునకై వెను వీధి చూడరు కేవల వర్ణనాత్మక దృష్టికలవారు మాత్రమే మలయ మారుతముతో మహిమాలయ సానువులతో చుంబించెదరు. కాని ప్రకృతి పూజారికి ప్రత్యణువు పూజనీయమే కావుననే అట్టి తెలుగుకవి గగనహర్మ్యములను వదిలి కోరుకొండను సుందరముగా వర్ణించి ఆనందించినాడు.

> "చిటి పొటి కొండలు చిన్నవి పెద్దవి
> ఇండ్లు మిద్దెలు దాచె కిరుకెలకుల
> నారుపోసిన యట్లు వారక యెన్నేని
> పూర్వాచరణముల పోల్కి దనర"[1] కోవిదా వాసమైకోరు కొండ

1. కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు.

యున్నదట! అట్లే ప్రబంధకాంతల ప్రత్యంగ వర్ణనముతో అలసిపోయిన కావ్యదేవతకు పల్లెటూరి, పరమ సాత్త్వికమైన సహజ సౌందర్య సంపన్నమైన వర్ణనము వి జామర విసురుట వంటిది.

'లేగయై నాకుచు లీలమై మెకమలం
చినగోవు బి డెడు వనరుహాక్షి
బొండుమల్లెల తోట బువ్వుల గోయుచు
వనలక్ష్మి యననొప్పు వనజ గంధి,"[1] కణ్వాశ్రమ పవిత్రార్ష సౌందర్యమును మూర్తీభవింప జేసిన కాళిదాసు కల్పనమున కేమి తీసిపోయినదిది?

## అద్భుతత్వము :

భావకవిత్వములో ఇది మఱొక ప్రధానాంగము. పాశ్చాత్య కాల్పనిక కవులు నిత్య జీవితమునుండి రెక్కలు ధరించి ఆకాశయానము చేయవలెననియు, బంధనములు త్రెంపుకొని స్వేచ్ఛగా సాగిపోవలెననియు భావించిరి. అందు కడ్డంకులు వచ్చినప్పుడు దుఃఖించిరి. "పక్షినవలె నాకాశనిర్మల పథవిహార స్వేచ్ఛ కోరితి పక్షములు లేవంచెదుంగక ప్రాకులాడుచు పొగలితిన్" అని భావ కవులు విలపించుట కిదియే హేతువు.

## సాహసము :

స్వేచ్ఛ సాహస ప్రవృత్తికి దారి తీయును. గత గాథాసంస్మరణము వీరత్వమును ప్రసాదించును. కాకతీయుల నాడును తరువాతను విక్రమార్క చరిత్రాదులైన వీరగాథా గ్రంథములు వచ్చుట కిదియే హేతువు. వీరగాథలు స్వాతంత్ర్య భావమును ప్రదీప్త మొనరించును. పెర్సీ, బైరన్, షెల్లీ, ప్రభృతు లిట్టి భావుకతకే ఆరాధించిరి. అదియే ఆంధ్ర సాహిత్యమున ప్రవేశించినది!

నవీన మాత్రాచ్ఛందమునకు సన్నిహితమైన గేయములో వీరగాథలు కాల్పనికోద్యమమునకు కొంచెము ముందుగానే వచ్చినవి. బొబ్బిలి రాజుకథ, దాసింగు రాజుకథ, బంగారు తిమ్మరాజు కథ, సర్వాయిపాపని కథ మొదలైన

1. కట్టమంచి రామలింగారెడ్డిగారు.

వస్తు కవిత లెన్నియో రాకపోలేదు వాని ప్రభావము కూడ నవ్యకవితోద్య మముపై లేకపోలేదు. గత కాలములోని వీరగాథలలోని సాహస ప్రియత్వము, ఆంగ్లేయ కాల్పనికోద్యమ స్ఫూర్తి, సమ్మిశ్రితమై సాహసోపేతమైన కాల్పనిక శాఖ ముందునకు సాగినది "భూకంపమున కులాచలములు ఘూర్ణిల్లనీ, అగ్ని పర్వతములు పగిలిపోనీ ఆ భీకర సమయములోనే నొంటిగ 'ప్రపంచము వెలుపల కూర్చుండి ఆడుకొందు'[1] నన్నాడొక కవిశేఖరుడు.

## ప్రణయము :

**(౧) వియోగము - విప్రలంభము :-** ప్రబంధములతో సంభోగముపై పాఠకులకు రోత జనించినది. కాళిదాసు రతీవిలాపమేమి, అజవిలాపమేమి, మేఘ సందేశమేమి, సంభోగ శృంగారాశ్రితములు కావు. వియోగము వ్యథకు మాతృక. 'మానిషాద' శ్లోకమెట్లు, విశ్వకవిత్వ మాతృకయో అట్లే వియోగ విప్రలంభ ములే భావకవిత్వమునకు మాతృకలు. భావకవులేల ప్రేమించుచున్నారను ప్రశ్నకు కృష్ణశాస్త్రిగారు సమాధానమిచ్చినారు పూలు సౌరభమును చిమ్ముట. చంద్రికలను చందమామ వెదజల్లుట, సలిలములు పారుట, మందమలయానిలము వీసుకుట, ఎట్లు సహజములో తన హృదయము కూడ ప్రేమించుట అంత సహ జమే !

'ఎద మెత్తనగుటకై సొదగుందరా అంత
మదిగల యహమ్మంత వదలిపోవునురా'[2] అనునది భావ కవిత్వము లోని విలాపమునకు సూత్రము. రోదనము, నిరాశ, విచారము, ఈ సహస్రదళ కమలములోని రేకులు.

'హృదయశోణిత ధారనెదుగు జీవితవల్లి
మొదలంట దూల్చినారే భయదాగ్ని కీలలను వ్రేల్చినారే[3]

"నేనొకండనె ఈశాన్య గృహమునందు । అదురు వడిపోయి మరణ వాద్యము లట్లు గుండియలు కొట్టుకొన నేడ్చుచుంటి."[4]

---

1 మునిమాణిక్యం నరసింహారావు.
2, 3. కృష్ణపక్షము.
4. దీపావళి.

**(౨) మాతృపూజ :-** భావకవిత్వములో, ప్రకృతిని, స్త్రీని, దేశమును- లైంగికమైన జఘన్య శృంగారయోగ్యమైన భార్యవలె ప్రేయసివలె కాక, మాతవలె, పూజనీయయైన దివ్యమూర్తివలె జగజ్జనని వలె భావించి ఉపాసించుట ప్రముఖ తత్వము. 'స్వప్న కుమారము'లో ఈ కవితాసూత్రము భాష్యసహితముగా వ్యాఖ్యానింపబడినది

'కాంత రూపమె రసపదాకర్షణంబు
అందు సంవృత శృంగారముం దొలంకు
ముద్దువేన మత్యంత సమ్మోహనంబు
కృష్ణ నిశల సాంగత్య మింకేమి చెప్పన'ని కవి కుమారుడు తన మనోవీధిలో నడయాడిన సుందరిని చూచి మోహించినాడు. 'నను జూచి ప్రేమింపు మిందువదన' అనినాడు. కాని ప్రకృతికాంత సతికాదు- మాత !!

'క్షీణ చంద్రికలను ప్రకాశించు రేయి
నాకు కాటుక పూసెనో నాగదోచె
మెరుపు మెరసినట్లైన వెల్తురున గంటి
నడుగులుగ దిల్చిపోవుచున్నట్లు నతిని !' మాతృకంఠా లింగనముతో ప్రకృతితో వత్సలమైన కవికుమారుని తాదాత్మ్యము హృద్యముగా వర్ణింపబడినది. ప్రాచీన కవిత్వములోని క్రమబద్ధము కాని శృంగార కవిత్వమునకు ఇది సమాధానము వంటిది. యోగదృష్టితో దర్శింపవలసిన ప్రకృతిని భోగ దృష్టితో చూచిన మధ్యయుగములలోని కవులపై నవ్యులు సాగించిన తిరుగుబాటు ఫలితముగా వెల్వడిన భావవాహిని యిది ! మాతృపూజ, అమలిన శృంగారము భావకవిత్వ రథమునకు రెండు చక్రములు.

## స్త్రీ వివిధమూర్తులు :

ప్రేమ సంయోగములో కన్న వియోగములోనే శతాధికముగ విజృంభించును. జీవుని వేదన మొత్తమునకు కారణము ఈశ్వరుని నుండి విడివడుటయే అని వేదాంతుల మతము. కావున జీవేశ్వర ఐక్యమే ప్రేమకు పరమావధి యని నిర్ణయించినారు. ప్లేటో స్త్రీ, పురుషుల ఆదియే 'అఖండాత్మ' అని వీరి దివ్య ప్రణయమే సమైక్య సూత్రమని నిర్వచించెను. అనగా స్త్రీ కేవల శృంగార

మూర్తిగా కాక ఉపాసనాతత్వముగా మారినదని తాత్పర్యము ! రసపరిణాహము లోని పరమస్థితి !!

దీనినే భావకవు లతిమనోహరముగా భావించినారు. వర్ణించినారు. ఆమె నవ నిత్య యౌవనానందప్రాణి (మల్లవరపు) కవిభావనా విలాసిని నిత్యసైరంధ్రి (వేదుల) తపః ఫలసిద్ధిమూర్తి దైవతము తాను భక్తుడు (నాయని) దుగ్ధాబ్ధిలో నుండితో తెంచు ఇందిరాదేవి (శివశంకరులు) తల్లి, ధాత్రి, దేవతామతల్లి (రాయప్రోలు) అచ్చమైన ప్రకృతి (విశ్వనాథ) అంతేకాదు ఆమె శర్వరీ వియోగక పోలపాశిక నిట్టూర్పు, కన్నీరు, విశ్వవేదనా మూల్యభాగ్యము' ఆమె నవనీత హృదయ, యుర్విపై జాలువారిన సుధామయూఖరేఖ, చివరకు వికృత క్రూర క్షుధాక్షుభిత మృత్యుకఠోర వికటపాండుర శుష్కవదన దంష్ట్రాగ్నిలోని నవ్వు, ఆమె 'పాషాణి'యును !!

**బాహిరము :**

**అంతరము :-** ఇట్లు స్త్రీకి మహోన్నత స్వర్ణాసనము నిచ్చుట భావకవితోద్యమముతో ప్రధాన సూత్రమైనది. సంఘ సంస్కరణోద్యమము స్త్రీ బాహిర పరిస్థితులలోని అవ్యవస్థను సరిచేయుటకు వచ్చినది. భావకవిత్వము స్త్రీకి అంతరముగా, హృదయములో మహోన్నత స్థానమును నెలకొల్పుటకు వచ్చినది. కావుననే కృష్ణశాస్త్రి వంటి భావకవితోద్యమ నాయకులు కాకినాడ వంటి ప్రాంతములలో సంఘ సంస్కరణోద్యమములో ప్రముఖ పాత్ర వహించుటయు, వెంకటరత్నం నాయుడుగారి గురుత్వములో స్త్రీ జనోద్ధరణమునకు బాహిరముగ సమాజములో పూనుకొనుటయు గమనార్హములు !![1]

## మహోద్యమ విజృంభణము :

స్పష్టముగా భావకవిత్వము మహోద్యమముగా విజృంభించుట ప్రారంభించినది. 1928 నుండి దానికి రెండు దశాబ్దముల పూర్వరంగమున్నది.

---

1. "వెంకటరత్నం నాయుడుగారి ద్వారా (వారిని భక్తిశ్రద్ధలతో స్మరిస్తూ శిరస్సు వంచుకుంటున్నాను) మానవోద్యమమూ, దానికి సంబంధించిన ఉజ్వలములైన లక్ష్యాలు.... పరిచయమైంది" 25 సం||ల తెలుగు కవిత్వము. వ్యాసము దేవులపల్లి 84వ పుట.

ఈ కాలములో ఉద్యమాగ్నికి ఎంతో ఇంధనము సమకూర్చినది. దానిని మన్నవి చేసెదను!

కాల్పనికోద్యమము నిద్రించెడి తెలుగుజాతిని సాహిత్యమును వెన్ను చరిచి ఆకస్మికముగా లేపినది. నాటివఱకు సాహిత్యమనగా 'నన్నయ నియోగియా? వైదీకియా' 'బాలవ్యాకరణము స్వీయమా, అనువాదమా?' 'ఆముక్తమాల్యద బ్రాహ్మణ కవిత్వమా? క్షత్రియ కవిత్వమా' వంటి చర్చలతో నిండి నడేనని కవి పండితులు భావించినారు. భావ మధుబాలను కాల్పనిక ఉషాయోషను కవులముందు నిలిచి వస్త్ర సౌందర్యము కాదు వపువును చూడుమని హసంతియై చెప్పుసరికి రసజ్ఞులు తెల్లబోయినారు. శరీరము కూడ కాదు, శుద్ధాంతఃకరణమునే చూడుమనినారు రాయప్రోలువారు! కాల్పనికోద్యమము వెనుకనున్న సిద్ధాంతచేతనత్వమున కిది మూలతంతువు!

తిరుపతి కవులు, గురజాడలే భావకవితోద్యమమున కొక విధముగా ఆద్యులని చెప్పవలసియున్నది. వారు మార్గమును నిర్మించిన కార్మిక వీరులు, కృష్ణశాస్త్రి రాయప్రోలు ప్రభృతులు మార్గదర్శకులు. మిగిలిన వారందరును పథికులు!!

'భారతి' 'సాహితి' రాక పూర్వము, కృష్ణాపత్రిక, ఆంధ్రభారతి గ్రంథాలయ సర్వస్వము, అనసూయ, శారద మొదలైన పత్రికలే భావకవుల కాలంబనములై యుండెడివి. గురజాడ రచనలు కూడ కొన్ని వీనిలోనే ప్రచురింపబడినవి. నాటి యువతరమువారు ముఖ్యముగా గురజాడ వారి రచనలు చదువుచుండెడివారు. నండూరి సుబ్బారావు, బసవరాజు అప్పారావులు కూడ అందు కలరు. వారితో కృష్ణశాస్త్రి, చింతాదీక్షితులు, వేదుల, ప్రభృతులు కలసినారు. రాయప్రోలువారు వేదులకు కవితాగురువు. వారు, రాయప్రోలు ముందుగా గ్రంథాలయ సర్వస్వములో ప్రచురించిన తొలి రచనలను కంఠస్థము చేసి మిత్రులకు విన్పించెడి వారు. ఇది సంఘటనమునకు సాహిత్య సంరంభమునకు తొలిదశ! గ్రంథ రూపములో 1922 లో వచ్చినను వేంకట పార్వతీశ కవుల' 'ఏకాంత సేవ' ఈ తొలిదశలోనే వెలుగుచూచి, వంగ దేశీయ వైష్ణవ భక్తి భావముతో రసోపాసకులను సమ్మోహన పరచినది.

## అంకెలు, అక్షరములు కాదు :

కాల్పనికోద్యమమునకు 1923 వ సంవత్సరము తీవ్ర దశయని చెప్పితిని. నిజమునకు 1900 నుండి 1910 వఱకును జ్ఞాతమై అజ్ఞాత కర్తృకమ్యమై కొన్ని ఖండికలు వచ్చినవి. ముఖ్యముగా 1909, 1910 సంవత్సరములలో భావ కవిత్వము గణనీయమైన దశలో వికసించుట కూడ యదార్థమే! కాని ఉద్యమ పరిశీలనములో ఇవి తొలి ప్రయోగములు ప్రయత్నములుగనే పరిశీలింప వలెను కాని అంకెలను బట్టి, అక్షర ప్రాశస్త్యము నెన్నుట సాధ్యపడదు. అక్షర ప్రాశస్త్యమును బట్టి ఉద్యమ వేగమును నిర్ణయించుట కూడ వీలుపడదు.

## 'సాహితీ సమితి' స్థాపనము :

1917 లో సాహితీ సమితిని స్థాపించుటతో భావకవుల కొక గూడు దొరికినది. అప్పటివఱకును భావకవులు పరస్పర మటనట కలసికొనుట ఖండికలు ప్రచురించుట తప్ప దానికొక ఉద్యమ రూపము రా లేదు. తిరుపతి కవులు, గురజాడలు ప్రారంభించిన చైతన్యమే 20 వ శతాబ్దము ద్వితీయ దశాబ్దము వఱకును భావుకులను ముందునకు నడిపినది. తరువాత స్వీయమైన ప్రేరణతో ముందుకు సాగినారు. అట్లు సాగిన దినము నుండియే యదార్థముగా కాల్పనికోద్యమము ప్రారంభమైనట్లు గుర్తు ఈ దృష్టితో 1917 నుండియే ఉద్యమ చరిత్ర ప్రారంభమైనట్లు చెప్పనగును. ఉద్యమమునకు ప్రచారము లక్షణము. ప్రచారమునకు పత్రిక సాధనము కావుననే 'సాహితి'ని స్వయముగా 1922 లో భావ కవులు స్థాపించినారు. దీనితో భావకవిత్వమునకు 'పరాశ్రయము' పత్రికాముఖమున నశింప స్వీయనే పొందినది. తరువాత భారతి, శారదలు నవ్యకవులకు వెన్నంటి నిలిచినవి. సుజాత గోలకొండలు ఈ దశలో వచ్చినవే. ఉదయిని ప్రతిభ, త్రివేణి ఎనలేని సాయమును చేసినవి!

## నవ్యసాహిత్య పరిషత్తు :

కవిత్వముద్యమముగా మారిన కొలదియు సంస్థలు సమావేశములు పెరిగినవి. కవితా సమితి, ఆంధ్రసాహిత్య పరిషత్తు మొదలైనవి స్థాపింపబడినవి. కొంచెము ఆలస్యముగా వచ్చినను ఉద్యమము నక్షరాలా నడిపిన సంస్థ నవ్యసాహిత్య పరిషత్తు. ఊరూరా రాజకీయ సభలు కూడ జరుపబడనంతటి అభిని

వేశముతో ఈ పరిషత్తు కార్యకర్తలైన కవులు సభలుపెట్టి సమావేశములు జరిపి కవిత్వము నింటింటికి ప్రాకించినారు.

నవ్యసాహిత్య పరిషత్తు తొలినామము అభినవాంధ్ర కవి పండిత సభ. తరువాత పంచాగ్నుల వారి పౌరోహిత్యముతో ఇది పరిషత్తుగా మారినది. చిలుకూరి వారు దీనికి ప్రథమ సభాధ్యక్షులు. బరంపురం వాస్తవ్యులైన భాగవతుల ధర్మారావుగారు కూడ దీనిమూల స్తంభములలో ఒకరని స్పష్టమగుచున్నది. (ప్రతిభలోని వ్యాసము.) నాడు ప్రాచీనకవిత్వమునకు ఆంధ్ర సాహిత్య పరిషత్తు ఆధార స్తంభమై నిలిచినది. దానికిది ప్రతి స్పర్ధియని చెప్పవలసి యున్నది. 'ఆంధ్ర వాఙ్మయాభివృద్ధి కోసము ఆంధ్రదేశమున మంచి సంస్థ ఒక్కటి అయిననూ లేదు. ఆంధ్ర సాహిత్య పరిషత్తు ఉండియు పరిమిత ప్రయోజన కారి అయిపోయినది.' అని వీరనుట అందులకు ప్రత్యక్ష నిదర్శనము. వీరు తమ పరిషదాశయముల నీ రీతిగా నిర్వచించినారు. "నవ్య సాహిత్యరచన చేయడము నవ్యసాహిత్యము దేశములో యే విధముగా ఉత్పత్తి అవుతున్నదో పరిశీలించి అందులోని బాగోగులు విమర్శించడము. నవ్యవాఙ్మయమును గురించిన అపోహలు తొలగించుటకూ నవ్యసాహిత్య వ్యాపనము కోసమూ ప్రచారము చేయడమూ, వచన వాఙ్మయమూ, సాధ్యమైనంతవరకు పద్యవాఙ్మయమున్నూ ప్రజలకు సుపరిచితమైన వ్యావహారిక భాషలో నిర్మించి అంతుమూలముగా ప్రజలలో విజ్ఞానము వ్యాపింప జేయడమూ ఇవీ పరిషదుద్దేశములు." వీనిని వింగడించినచో మన కీలక్షణములు కన్పించును.

౧) నవ్య కవిత్వమును రచించుట, ప్రోత్సహించుట.

౨) నవ్య కవిత్వాభివృద్ధిని పరిశీలించుట, పరిశోధించుట.

౩) నవ్య కవిత్వమునకు గౌరవము కల్పించుట.

౪) ప్రజలలో విజ్ఞానము వ్యాపింపజేయుట

దీనివలన ఉద్యమము ప్రగతి పథమున ఉన్నట్లు వ్యక్తమగును. సాహిత్యోత్పత్తి లేనిదే బాగోగులు నిర్ణయింపవలసిన అవసరములేదు. ప్రతి ఘటనలేనిదే 'గౌరవము కల్పింపవలసిన' పూనికకు అవసరములేదు. ప్రతిఘటనము పొందుట, దానిని నిరోధించుట ఉద్యమశీలమున కొక లక్షణము కదా! అట్లే వ్యావహారికము వైపునకు మొగ్గుట కూడ భాష భావము, ఛందములన్నిటి

లోనూ ప్రజోద్యమముగా ప్రజా సామాన్యమునకు చేరువగా పోవలెనను కోరిక వ్యక్తమగుచున్నది ! !

తమ ఉద్యమము తీవ్రముగా సాగుటకై వారు ఈ క్రింది సూచనలు చేసినారు :

1) పలుతావులలో ఉన్న కవులు తరుచు కలిసి సంప్రదించుకోడానికి ఒక ప్రణాళిక ననుసరించి, గ్రంథరచనకూ అవకాశము కొరకూ సభలూ చర్చలూ సల్పడము.

2) పరిషదుద్దేశ ప్రచారానికి సమావేశాలు ఉత్సవములు ఏర్పాటు చెయ్యడము.

3) పరిషత్తు తరఫున ఒక పత్రిక ప్రచురించడము

4) నవ్యసాహిత్య పుస్తక భాండాగారము నెలకొల్పి అచట నవ్య గ్రంథ విక్రయశాల ఏర్పాటు చేయడము.

ఈ ఆశయములు క్రమముగా సిద్ధించినవి 1936 లో 'ప్రతిభ' స్థాపింపబడినది. 'నవ్య సాహిత్య పరిషత్తు' సంస్థస్థాపనము దానికొక నిర్దిష్టమైన నామకరణము - లక్ష్యశుద్ధి - సిద్ధి-జరిగినది. ఇక సమావేశములు, సభలు అట్టహాసముతో ప్రారంభమైనవి ! 1932 లో బరంపురములో చిలుకూరి వారి అధ్యక్షతన, 1933 లో రాయప్రోలు వారి అధ్యక్షతన, రాజమండ్రిలోను 1934 లో సభాపతి గారి అధ్యక్షతన అనంతపురములోను, 1936లో పంచాగ్నుల వారి అధ్యక్షతన అనంతపురములోను 1937 లో గిడుగు వారి అధ్యక్షతన గుంటూరులోను 1938 లో బుర్రావారి అధ్యక్షతన బందరులోను 1940 లో విశ్వనాథ సత్యనారాయణగారి అధ్యక్షతన బందరులోను 1941 లో అడవి బాపిరాజుగారి అధ్యక్షతన మద్రాసులోను, 1942 కృష్ణశాస్త్రిగారి అధ్యక్షతన ఏలూరులోను, 1944 కాటూరి వేంకటేశ్వరరావు గారి అధ్యక్షతన తెనాలిలోను, 1946 లో మల్లంపల్లి వారి అధ్యక్షతన ముక్త్యాలలోను పరిషత్తు సమావేశములు ఘనముగా జరిగినవి. సాహిత్యము సమాజమును ఉర్రూత లూపించినది !

1923 లో కృష్ణశాస్త్రిగారు ఉద్యోగము వదిలి కవిత్వోద్యమమే ఉద్యోగముగా స్వీకరించినారు పిఠాపురమునుంచి బయలుదేరి నూజివీడులో నండూరి

వారిని పలుకరించి తెనాలిలో వజ్ఝ బాబూరావు, వీరరాఘవ స్వాముల సహాయముతో ముందునకు సాగి గుంటూరులో శివ శంకరులను దర్శించినారు. వారప్పుడు 'హృదయేశ్వరి' నిర్మించుచున్నారు. అచ్చటే నోరి వారితో భావి కార్యక్రమము చర్చించి, విజయవాడ కేగి కొడాలిని పలుకరించి 'సాహితి'ని సందర్శించినారు. రామకోటేశ్వరరావు గారితో ముచ్చటించినారు.

తూర్పు దిగ్విజయము ముగించి, ఉత్తరాంధ్ర చరమసీమ కేగి విజయనగరము, బరంపురము పర్లాకిమిడిలో సభలు సమావేశములు జరిపినారు. గిడుగు వారి అండదండలు పొందినారు. ఆ ధైర్యమే 'కృష్ణపక్ష' ప్రచురణమునకు ఆలంబన! ఆ వెంటనే 'ఎంకిపాటలు' కూడా ముద్రణము పొంది వచ్చినవి!

1925 తరువాత కృష్ణశాస్త్రిగారు రవీంద్రనాథునితో పరిచయము పొంది బెంగళూరు వెళ్ళి నవ్యకవిత్వమున కట జయస్తంభము నాటి వచ్చినారు. సఖి జయంతి, ఉదయిని, వీణ, జ్వాలలు ఈ కాలములో పుట్టిన పత్రికలే! "బొత్తిగా ఇదంతా (కృష్ణశాస్త్రి) స్వంత మోషగా కనపడ్డా నిజానికి అలాగ కాదు. ఒక సంఘంగా ఏర్పడటం, దానికోసం పత్రికలు ప్రచురించడం, సమావేశాలు కావడం పర్యటన చేస్తూ ప్రచారం - ఇవన్నీ కలిసి నవ్యకవిత్వాన్ని నవ్య సాహిత్యాన్ని, ఒక ఉద్యమంగా ఎలా చేశాయో తెలియజేస్తాయి.[1] అప్పుడు కృష్ణశాస్త్రి గారికి 'నిత్యమూ కవితోత్సవమూ కావాలిట'[2] "ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే నవ్య కవిత్వం ఒక తీవ్రోద్యమమయి నిలువడానికి ఈ నా కృషి"[3] కూడా కారణమని చెప్పుటకే!

## ప్రతిఘటనము - పురోగమనము :

ప్రతిఘటనము ఉద్యమ షడంగములలో ఒకటి! ప్రతిఘటనముతో బాటు పురోగమనము కూడ తీవ్రతరమగుట సజీవమైన ఉద్యమమునకు చిహ్నము, ప్రముఖులు, దిగ్దంతులవంటి పండితులే ఈ ఉద్యమము నణచివేయవలెనని ధ్వజ

1. పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వము - దేవులపల్లి కృష్ణశాస్త్రి. తెలుగు వ్యాసములు 97వ పుట.

2, 3. 98వ పుట.

మెత్తినారు 'దుర్బలత్వము చేతనో చిత్తైకాగ్రరాహిత్యము చేతనో'[1] ఈ కవిత్వము వచ్చిన దనినారు. "ఈ కవి కుమారులు కొంతమంది ప్రేయసిని చూస్తే చాలనే వాళ్ళు కొందరు చూచి చేతకానితనం చేత ఆనందించుకోలేక వాపోయే వాళ్ళు మరికొందరు పై చేష్టలచేతనే తృప్తిపొందే వాళ్ళు ఇంకా కొందరు వచ్చిన అవకాశాన్ని పోగొట్టుకొని దుఃఖించేవాళ్ళు ఇట్లా పరిపరి విధాలుగా కనపడతారే కాని వచ్చిన అవకాశమును వశముచేసుకొని అనుభవించి 'తృప్తాస్మః' అనుకునే వాళ్ళొక్కళ్ళు కూడా కనపడటం లేదు.[2]" ఎంత తీవ్రమైన ఆరోపణ!! 'వీళ్ళల్లో కొందరిలో ప్రణయాన్ని త్రోసిపుచ్చి ప్రేయసి యితర స్థలాలకు వెళ్ళినా కొన్నాళ్ళుండి మళ్ళీ వచ్చినా క్షమింపగల మనశ్శాంతి వున్నది.[3]" విమర్శనము హద్దు తప్పినప్పుడు సభ్యతను కూడా పాటింపదు కదా!!

కేవలము విమర్శలే కాదు గ్రంథములకు గ్రంథములే వచ్చినవి. 'నేటి కాలపు కవిత్వము' అక్కిరాజు ఉమకాన్తము గారిది ఈ శ్రేణిలో అగ్రేసరము. 'అశనిపాత మంత తీవ్రఘాటితో వచ్చింది. రాకేం జేస్తుంది? ఎప్పుడయితే నిజమయిన ఒక ఉద్యమం బయలుదేరిందో అప్పుడే'[4] దానిపై విమర్శవచ్చును. దానితో కొందరు భావకవులు భయపడిపోయినారు. 'దానికి జవాబు వ్రాద్దామా అన్నారు కొందరు మిత్రులు ఏమి జవాబు మేము వ్రాయగలం? కొత్త పద్యాలు వ్రాయడమే జవాబనిపించింది.'[5] ఈ జవాబునే తీవ్రముగా ఇచ్చినారు. పుంఖాను పుంఖముగా రచనలు, గ్రంథములు వెలువడినవి. సభలు సమావేశములు సాగినవి!

భావకల, చాకిరేవు, శుక్లపక్షము మొదలైన గ్రంథములీ ఉద్యమమున కడ్డుకట్టలై నిలిచినవి కాని ప్రవాహ వేగమునకు కట్టలు కొట్టుకొనిపోయినవి. కొందరు ధనవంతులు పోటి సంస్థలను ఈ ఉద్యమమునకు వ్యతిరేకముగా నడిపినారు. దానితో భావకవుల పట్టుదల కూడ పెరిగినది భారతి, కిన్నెర, మహతి,

---

1. రాళ్లపల్లివారు.
2, 3. ఎవరో విమర్శకుల మాటలు "నవ్యాంధ్ర సాహిత్య వీధుల"లో ఉదాహృతము.
4, 5. పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వము - దేవులపల్లి తెలుగు వ్యాసములు 95వ పుట.

వీణ - ఊరికొక పత్రిక పుట్టినది. కౌముదీ సమితి, అనంతపురముకోను, సాధన సమితి సికింద్రాబాదులోను, వ్యాస సారస్వత సమితి విజయవాడలోను, నవ్య కళా పరిషత్తు నరసరావుపేటలోను, సాహిత్యమండలి ఏలూరులోను, కాకతీయ కళాసమితి వరంగల్లులోను, సాహిత్య పరిషత్తు రాయలసీమలోను, విజ్ఞానవర్ధనీ పరిషత్తు హైదరాబాదులోను మధుసాలు వాత్రేయలోను దేశికవితా మండలి ఘంటసాలలోను, కవితా సమితి విశాఖపట్నముకోను, యువకవి మండలి తెనాలిలోను, ఏర్పడినవి. ఉద్యమము పెరిగినది - ఆవేశము అవధులు దాటినది తెలుగునాడు మొత్తముకు రసవాహినిలో తీర్థము లాడినది. భాషాయోషనప్యతలో ప్లావిత మైనది.

## ఉప సంహారము :

భావకవిత్వోద్యమము సహజమైన రీతిలో పెరిగి విరిగినది. ద్వితీయ ప్రపంచ యుద్ధాంతరము దేశమునకు భావ కవిత్వపు అవసరము లేక పోయినది. కవులకు కూడ భావకవిత్వము స్ఫూర్తి నిచ్చెడి మార్గము కాలేక పోయినది. కావుననే కవి కుమారులు కొత్త ప్రపంచమునకై ఎదురుచూడ సాగినారు. యుద్ధ రాక్షసి కరాళ దంష్ట్రలచే నలిగిపోయిన మానవాళి, అన్నము - నీరు - శాంతి, సౌభ్రాతృత్వము, సమానత్వము, స్వేచ్ఛ (Equality, liberty, and freternity) లను ప్రసాదింపగల కవిత కావలసివచ్చినది. చీనీ చీనాంబరమువంటి భావ కవిత్వ మీ నిత్యావసరములను తీర్చువలిపముగా నిలువలేక పోయినది.

సాహిత్య పరిషత్తుతోపాటే సాహితీ సమితి కూడ సమావేశములను జరుపుచున్నది. 1946 లో గుంటూరులో ముక్కపాటి అధ్యక్షతన రజతోత్సవము వైభవముగా జరుపుకొన్నది. అదే సంవత్సరము తెనాలిలో కురుగంటి వారి అధ్యక్షతన జరిగినది. 1947 లో వల్లభజోస్యుల వారి అధ్యక్షతన గుంటూరు లోను, అదే సంవత్సరము తల్లావఝ్ఝల వారి అగ్రాసనత్వము క్రింది అమరావతిలోను, 1948 లో అడవి బాపిరాజుగారి అధ్యక్షతన ఒంగోలులోను, 1949 నండూరి వారి అధ్యక్షతన ఏలూరులోను 1951 లో గుంటూరులోను సమావేశములు జరిగినవి. కాని విచిత్రమేమనగా 1940 నుండియే భావకవిత్వోద్యమము లోని ప్రముఖులు కొందఱు 'మరో ప్రపంచ'మును గూర్చి పలవరించుటతో

తనకు తెలియకుండగనే భావకవిత్వ సంచికలలో కూడ సరికొత్త పదజాలములు కన్పింప సాగినవి. అవి ఇంతకుముందు దేశము విన్నవి కన్నవి కావు. మరి ఎక్కడినుండి వచ్చినవి?- భావకవిత్వము పరాకాష్ఠనందుకొని పతనోన్ముఖమైన వెంటనే తనకు తెలియకుండ తానొక కొత్త ప్రభావమునకు ఉద్యమమునకు లోబడి పోయినది! 1940 లో కొలవెన్ను రామకోటేశ్వరరావుగా రిట్లు వ్రాసినారు. "ప్రజాసామాన్యానికి సంబంధించిన యితివృత్తాలనే తీసికొని వారి నిత్య జీవితాల్లో సారస్వతములో, కళలో, ప్రతిఫలించేటట్లు చేయాలని యిప్పటికి అభిప్రాయము. దీనికి ప్రొలిటేరియన్ కళ అని పేరు. దీనిని ప్రజాసామాన్యములో నుంచి బయలుదేరిన చిత్రకారులు సృష్టించవచ్చు."[1] ఇందు ప్రజాకవిత్వమునకు ప్రజాకళలకు నిర్వచన మొసంగబడినది. 'ప్రొలిటేరియన్' శబ్దము ప్రయోగింపబడినది. నిర్ధనులకు సామ్యవాదులీ శబ్దమును వాడుదురు. దీనివలన అభ్యుదయ కవితోద్యమము రెక్కలు తొడిగికొని రిక్కలనంటెడి ప్రయత్నము ప్రారంభించినదని అర్థము. 1940 ప్రాంతములో అభ్యుదయ కవులు భావకవిత్వపు వేదికనే తమకై వాడుకొనినారు. కాని తరువాత అభ్యుదయ రచయితల సంఘము 1943 లో స్థాపింపబడుటతో శ్రీ శ్రీ ప్రభృతులు దానికి నాయకత్వము వహించినారు. 1933 నుండియే వీరికి భావకవిత్వముపై అసంతృప్తి బయలుదేరినది.[2] కాని అది కార్యరూపము దాల్చుటకు కొంత కాలము పట్టినది. 'తారకారసిక విలాస వీణకొసరన్' పరవశించిన శ్రీ శ్రీ 'నేను సైతం ప్రపంచాగ్ని'కి సమిధ నొక్కటి ఆహుతిచ్చినానని ఈ దశాబ్దములోనే కొత్త గొంతుక విప్పినాడు. భావకవితోద్యమము క్షీణింపగనే కృష్ణశాస్త్రి ప్రభృతులు అభ్యుదయ రచయితల సమావేశములలో తొలివత్సరములలో అధ్యక్ష స్థానము కూడ వహించుట గమనార్హము! 1943 లో ఈ ఉద్యమము ముగిసి కొత్తనీటికి చోటిచ్చినది.

## భావకవిత్వ ప్రభావము :

క్రీ.శ. 1900 నుండి 1940 వఱకు సుమారు నాలుగు దశాబ్దములు ఆంధ్ర సాహిత్యముపై తన ప్రభావమును ప్రసరింపజేసి సామాన్యుని నుండి

---

1. ఆంధ్రపత్రిక - 12-11-1940.
2. 'జ్వాల'లో (1933) వ్యాసము. శ్రీశ్రీ.

సర్వజ్ఞుని వలెకు సాహితీవేత్తలయిన వారిని కాని వారిని కూడ ఉర్రూతలూపిం చిన మహోద్యమము భావకవిత్వము. భావకవివలె గిరజాలు పెంచుట భావ కవితో మాట్లాడుట, భావకవితా గోష్ఠులలో పాల్గొనుట, భావకవిత్వము వ్రాయుట- ఇవెల్లను సామాన్య మానవునికి జీవితాదర్శములైన వనినచో ఈ మహోద్యమ ప్రభావమెంత అనల్పమో వేఱుగా వివరింప నక్కఱలేదు.

**లక్షణము :**

భావకవిత్వమును ఉద్యమముగా నడిపిన ఖ్యాతి కృష్ణశాస్త్రికి లభించినచో, దానికి లక్ష్యలక్షణముల నొసంగిన కీర్తి రాయప్రోలుది 1908 లోనే రాయ ప్రోలువారు భావకవిత్వము ప్రారంభించినారు. వీరి కృతులు కష్టకమల, తృణ కంకణము, స్నేహలతాదేవి, తెలుగుతోట, ఆంధ్రావళి స్వప్నకుమారము, మధు కలశము, మాధురీ దర్శనము, రమ్యాలోకము, జడకుచ్చులు, వనమాలి, లలిత మొదలైనవి అన్నియును నవ్యకవితా సౌరభము వెదజల్లెడి మల్లెపూవులే. ఇందు రమ్యాలోకనము, మాధురీ దర్శనము, కాల్పనిక కవిత్వ తత్వ ప్రతిపాదకమైన కృతులు. "పూర్వలక్షణాలను దిద్దడం నా లక్ష్యం కాదు. అతి నవీన విధానా లను శాసిద్దామనే ఆహం నాకు లేదు. నవ్యకావ్య దృష్టిని చూపడమే నాలక్ష్యం. అని 'రమ్యాలోకము'లో తమ కవితా మార్గమేమో స్పష్టపరచినారు "చవికి చక్కెరపాటులై చవికి చెలిమి మురిపముల మూటయై చిత్తమునకు ముదిత, ముద్దు లాటయై లాలించి పొత్తుగొను ప్రసన్నకావ్యమానందాబి సారికవలె" అని చెప్పుట దాదాపుగా 'భావకవిత్వ' నిర్వచనమని భావింపవచ్చును.

"ప్రాత వయినంతనే త్యజింపరు నవీన
మయిన మాత్ర వరింప"రనినారు.

స్వప్నకుమారము కూడ, అమలిన ప్రేమను ప్రతిపాదించెడి భావకవిత్వాశయే ప్రబోధ కావ్యము. కవి అజ్ఞానాంధకారములో ఉన్నప్పుడొక స్వప్నము వచ్చును. అందొక సుందరి సాక్షాత్కరించి విశుద్ధ ప్రణయతత్వమును బోధించును.

'పొదుగు నొవ్వంగ బాధించు ముద్దులేగ
ఒడలు నానెడి గోసాధ్వియోర్పు వెంతో
బాధ సహపరించిన గాని స్వాదువయిన
ప్రేమమాధుర్యము రుచింపదేమొ పుత్ర !' అని 'వాత్సల్యము'లో

మోహపరవశుడైన కవిని 'పుత్రా'యని సంబోధించుట భావకవిత్వాదర్శమునకు రత్నకిరీటము వంటిది. కోమలప్రేమ సంపూర్ణ కుసుమ దళలలో ఉన్నప్పుడే దుఃఖ రజస్సుస్లవిత మగుననియును, వర్షధారల కడుగబడిన పొలమె, ఆర్ద్రమయి పచ్చబడును కదా! అనియును అర్థాంతరములో ఆమె విశదీకరించినది.

"ఎంతకామింతొ దుఃఖింతువంత చేటు
ఎంత దీపమొసీడయు నంతకాదె
పరిమితియు ననుబంధమున్ సరిసమం బె

ప్రేమ పెనుచు నేడుపు నింక విడువ నేల" అని ప్రబోధించి ఆమె అదృశ్యమైనవి. కవికి మెలకువ వచ్చినది! ఈ రీతిగా కవి అమలిన ప్రేమతత్వమును ప్రబోధించినారు.

'స్వప్న కుమారము' లక్షణమైనచో 'తృణకంకణము' దీనికి లక్ష్యము వంటిది. కామ విరహితమైన ప్రేమకు చిహ్నముగా పట్టు దారమును విప్ర నాయకుడు నాయికకు విసర్గ సుందరమైన 'తృణకంకణము' నమర్చుట ఇందలి ఇతివృత్తము. ఈ దశలో నాయకు డామెను భౌతికముగా కామించుట లేదు. జఘన్య శృంగారమున కతీతమైన ప్రేమయిది. 'పొదుగునొ వ్యంగ బాధించు' లేగపై గోసాధ్వికి కల ప్రేమ ఆమెది! కథ, కథనము, భావము, భాష అన్నింటి లోను నవీనమైన కృతులు రాయప్రోలు వారివి. విశేషమేమనగా భావకవిత్వారంభములోనే లక్షణము ఉదయించినది. ఏ భాషలోనైనను సాహిత్యము దాని వెను వెంటనే లక్షణమును వచ్చును. భావ కవిత్వమునకు కూడ అది వర్తించినది. గురజాడ వెదజల్లిన భావసస్యములు రాయప్రోలు నాడే ఫలించి, నిర్వచింపబడి నవి " ఏ భాషలోనైనను మహాకవులు ఆదిలోనే జన్మింతురు. సంస్కృతమున వాల్మీకియు, తెలుగున నన్నయయు అట్టివారు తిరిగి అంతటి వారునభూతో న భవిష్యతి" అని విశ్వనాథ సత్యనారాయణగారు వ్రాకుచ్చిన పలుకులు భావ కవితోద్యమమునకు కూడ వర్తించును కదా!!

## దుఃఖమునకై ఆవేదనము :

భావ కవిత్వమును అక్షరాలా ఉద్యమముగా మార్చిన మనీషి కృష్ణశాస్త్రి 1920 లో నల్లమల కొండల సౌందర్యమునకు ముగ్ధుడై

'ఆకులో ఆకునై పూవులో పూవునై
కొమ్మలో కొమ్మనై నునులేత రెమ్మనై
ఈ యడవి దాగిపోనా ఎట్లైన
నిచటనే దాగిపోనా' అని పలికిన నాడే భావ కవిత్వము ఉద్యమ ముగా మారిన తొలిదినము. వీరు 1922 లో భార్యా వియోగానంతరము 'కన్నీరు'ను 1926 లో 'ప్రవాసము'ను తరువాత ఊర్వశిని ప్రచురించినారు. కృష్ణశాస్త్రికి వెన్నెల కన్నను చీకటియే ప్రియమైనది. వీరి కిష్టమైనది. కృష్ణ పక్షము. శుక్లపక్షము విపక్షమంది. కావుననే తమ కృతికిని 'కృష్ణ పక్షమ'ని నామకరణ మొనరించినారు.

వీరి కవిత్వములో పాశ్చాత్య కాల్పనికోద్యమ లక్షణములన్నిటిని యథా తథముగా సమన్వయింపవచ్చును. రాయప్రోలు నాటినుండి శాస్త్రిగారి నాటికొక దశాబ్దము గడచినది. ఈ నడుమ కవిత్వ ముద్యమముగా పరివర్తనము చెందు టతోబాటు తొలినాటి సిద్ధాంతములు, ఆదర్శములలో కూడ గణనీయమైన మార్పు వచ్చినది.

**స్వేచ్ఛ :** కృష్ణశాస్త్రిలోని ముఖ్య లక్షణమిది. 'జగమునిండ స్వేచ్ఛా గానమురుల నింతు'నని 'గగనతలము మార్మ్రోగగ గంఠమెత్తి' గానము చేసిన గాయకు డీయన.

**దుఃఖము :** విషాదవరణము వీరి రెండవ లక్షణము. 'హృదయనాళము తెగిపోయె నా హృదయధనము తొలగిపోయెను. జీవిత ఫలము ప్రుక్కినేల బడెనింక జీవింపనేల'యని మృత్యువరణము వరకును కవి మనము పరుగెత్తి నది. 'నన్ను మనసారగా ఏడ్వనీరు మీర'ని తన దుఃఖమున కభ్యంతరము చెప్పెడి వారిపై నిరసన సూచకముగా విలపించినారు. 'అమల మోహన సంగీత' మందు కూడ 'దారుణ రోదన ధ్వనులే' వినినారు వీరు.

**ప్రేమ :** కాని వీరి దుఃఖములో నొక విశేషమున్నది. ఇది నిరవధిక శాశ్వతశోకము కాదు. సంయోగమునకై తహ తహ! ఈ ప్రేమలో అమలిన తత్వము లేకున్నను న్యూనత్వము మాత్రము లేదు. పరమోదాత్తమైన ప్రణయ తపన యిది :

హేమమణి రత్నగణమేల లేమమనకు
సాంధ్య సమయ సువర్ణితచ్ఛాయ లరసి
తారకాశోభితాంతర తలము గాంచి
చింతలను బాయుదము చేయి జేయిగలిపి'

అనుటలో ధన కనకములపై తిరస్కారము 'సంధ్యారజనీ సముత్పన్న దివ్య ప్రణయాంకురములపై రక్తి గోచరించును. 'చింతలము బాయుదము' అన్న వాక్యములో వీరు దుఃఖము తొలగిపోవలెననియే కోరుకొనుచున్నారనియును అందులకు 'చేయి చేయి కలిపిన' కాని ఆనందసిద్ధి కలుగదనియును స్పష్టము. ఈ కలయిక సంభావింపని కారణముచేతనే వారు నిరంతర దుఃఖితులైనారు. కలయిక సంగతి దేవుడెఱుగును వారు విరులతోటతో పెంచుకొనిన ఒక్క పవ డపు గులాబి మొక్కను క్రూరార్క కిరణము వాడునట్లు చేసినది. ఇదియే కవిని బ్రతుకులో ఓడునట్లు చేసినది. ఈ దుఃఖవరణ సిద్ధాంతము మిక్కిలి సున్నిత ముగా పరిశీలింపవలసిన అంశము!

విషాదము పరిణామములో ఈశ్వరార్పణ బుద్ధికి ఆస్తికునిలో దారి తీయును. 'భగవంతుని పాదములపై ఆత్మ సమర్పణము' బ్రహ్మ సమాజ తత్వము. ఇచ్చట మతోద్యమము శాస్త్రిగారి హృదయములో జీవతంత్రులను మీటి 'ప్రభూ అని ఏకేశ్వరుని ఉద్దేశించి రోదించునట్లు చేసినది. భౌతికమైన భావనకు కామనకు ఇది చరమదశ. మఱొక అమలిన సీమకిది ఆద్య ప్రకృతి! చలంగారి మాటలలో 'తన బాధను కృష్ణశాస్త్రి ప్రపంచం బాధగా' మార్చినా డనుటకు కాల్పనికోద్యమమును విశ్వవ్యాప్తము చేసినాడని మనము వ్యాఖ్యానింప వచ్చును!

## భార్యా విధేయత :

కవుల ఆంతర ప్రకృతి ఎట్లున్నను అందఱును ఒకే మూసలో పోసిన మట్టిముద్దలు కారు, మృణ్మయులు కారు, చిన్మయులు, రసమూర్తులు వారు. కావుననే కాల్పనికోద్యమము సైద్ధాంతికముగా ఒక్కటే అయినను అందు పాల్గొనిన నాయకులలో - కవినాయకులలో - నాయిక యెడల గల దృక్ప థము మాత్రము భిన్నమైనది. రాయప్రోలు అమలిన ప్రేమ, కృష్ణ శాస్త్రిలో విషాదముగా పరిణమించినట్లే స్త్రీని 'అచ్ఛమైన ప్రకృతి'గా విశ్వ

నాథ, లోకరాజ్ఞిగా భావించిన వేదుల, తత్వములు, శివశంకరులలో పరాకాష్ఠ నంది స్త్రీని 'హృదయేశ్వరి'గను తాను 'భార్యావిధేయత' ప్రదర్శించు వానిగను ప్రకటనము చేయించినవి. ఇవి అసమర్థతకాక అసమాన కాల్పనిక ప్రేమకు నిదర్శనము!!

1926 లో హృదయేశ్వరి' వెలువడుటతో కాల్పనికోద్యమములో వ త్రొక అధ్యాయము ప్రారంభమైనది. స్వామి శివశంకరులు సృజించిన ఈ పవిత్ర మూర్తి 'సరస్వతి', 'రమాదేవి', 'మహాదేవి' అని పిలువబడుటలో ఆమెకు దివ్యత్వమే కాదు, త్రిలోకాధి పత్యమే సిద్ధించినది. ఆమెకు కవిభక్తుడు ఆమె చివరకు 'ముక్తి కాంత' కూడను-

"వివిధ భంగుల నిన్ను భావించు కొలది
పొడముచుండు నమస్కార బుద్ధి నాకు
జాలువారిన నీ పాదాంభోజ యుగళి
ప్రాలుభక్తుని కరుణను నేలుకొమ్మ" అనుటలో ఆరాధనమున్నది

అంకితమైపోవుట ఉన్నది. ఇట్లు ప్రియావధూచరణ చారణ చక్రవర్తియైన కాల్పనికోద్యమ కవిశేఖరులు 'నీ ప్రేమచేతన్ కవి వరుండనైతి' ననియు 'నా మతమునందు భార్య మాన్యురాలసి'యు 'భార్యవిధేయుడనై యుండెదన'నియు ప్రవచించుటలో ఆధ్యాత్మికతత్వమున్నది. శివశంకరశాస్త్రిగారు ప్రాచీనానికి అర్వాచీనానికి లంకె అని చెప్పవచ్చు. ప్రాచీనాన్ని తెంచుదామన్న వాళ్ళను కూడగట్టుకుంటూ నవీనాన్ని ప్రోత్సహించి ఉభయులకూ సమ్మేళన స్థానమైనాడు."[1] శివశంకరులీ భావ కవితోద్యమమునకు వటవృక్షము వంటివారు. తక్కిన కవులెందరో ఈ వృక్షమునకు ఊడలవంటి వారు. కాల్పనికోద్యమమున కాధ్యాత్మిక సంస్కారమును ఈశ్వర హృదయము'ను ప్రసాదించిన మహామహులు హృదయేశ్వరీ కర్తలు!

"దేవి! ఈ భక్తునకు నింక ధ్యేయ మొకటె
స్థలకమల రమ్యమైన నీ చరణ యుగళి"!!

కాల్పని కోద్యమములో ఇదొక ప్రముఖ ఘట్టము!! మహత్తరమైన మలుపు!!

---

1. నవ్యాంధ్ర సాహిత్యవీధులు (2వ భాగము) శ్రీ కురుగంటి. 302 పుట.

## మార్గమునుండి భావ మార్గమునకు :

ఉద్యమ తీవ్రతకు కొన్ని నిదర్శనములున్నవి అది సర్వులను ఆకర్షింప వలెను. ఆ సిద్ధాంతముకు జ్ఞాతముగనో అజ్ఞాతముగనో అందరి యెదలలోను తంతరమట్లు రొద పెట్టవలెను. కాల్పనికోద్యమ మట్టిది. కావుననే మార్గకవుత్తై, మడికట్టుకొన్న భారతుల మార్కండేయ శర్మగారి వంటి వారెందరో ఈ మహో ద్యమ ప్రభావమునకు లోబడక తప్పలేదు నేమిధ్వని, కాలస్మృతి, వల్లకి, రవి బాబు హతాశ, బ్రహ్మాంజలి మొదలైన ఖండికలెన్నో ఇందులకు నిదర్శనములు 'కులాయ సుస్తోత్థిత కలకంఠీకుల కాక లీ కలకల ధ్వనితము'-[1] మార్గముద్ర-ప్రాచీన శైలి-కాని కవిత్వమా భావ ప్రధానము-ఉద్యమ మాహాత్మ్యమిది!!

విశ్వనాధ సత్యనారాయణ గారును అట్టివారే! వారు ప్రాచీనకవితా మార్గమునకు వారసులు. భావకవిత్వమును తరువాతి కాలములో వ్యతిరేకించిన వారే![2] కాని ఉద్యమమేళ్ళు కూళ్ళను కలిపివేసి ఉధృతముగా ప్రవహించు చున్నప్పటి మహిజము కూడ అందు మునకలు వేయకతప్పలేదు. వీరి కిన్నెర సాని పాటలు, కోకిలమ్మ పెళ్ళి, భావ కవిత్వమునకు తురాయివంటివి. అంత సరళాతి సరళముగా మాత్రాచ్ఛందములో ఇతరులెవ్వరును వ్రాయలేరన్నచో అతిశయోక్తి కాదు. ఇతరులే కాదు వారు కూడ మరలనట్టివి వ్రాయలేదు. కేవలము ఉద్యమము, కాలములో కవుల నెట్లు కదను త్రొక్కించునో కాంచుట కిది కమనీయమైన ఉదాహరణము!!

'చిటి తరంగాలతో పొటి తరంగాలతో నటనములు సలిపిన' కిన్నెర గతిని వర్ణించుట కాల్పనికోద్యమములో నొక శాఖకు మకుటాయనమానమైనచో ఆంధ్ర పశస్తిని వర్ణించుట, విక్టోరియా రాణి కాలమునాటి దుండగములు హృదయ విదారముగా చెప్పుట ఆంధ్ర జాతీయ కవితాశాఖలకు ఎనలేని అలంకా రములైనవి. వానిని వేఱు అధ్యాయములో వివరింతును. కాని ఇట, ఉద్యమము

---

1. 'హతాశ' ఖండిక నుండి.
2. "నా జీవితంలో చూస్తున్నాను-పాతికేళ్లకొక ఉద్యమము- ఒక తరహా కవి త్వం- కాని ఏదీ నిలువలేదు" భావకవిత్వమును విమర్శించుచు కృష్ణా పత్రికలో ఇంటర్వ్యూ వ్యాసము దీపావళి ప్రత్యేక సంచిక. 1966 అక్టోబరు.

మార్గ కవిత్వము నాశ్రయించిన వారిని కూడ మహా అనుభవజ్ఞులైన భావులకును ఎట్లు మార్చినదో చూపుటే తాత్పర్యము!! వీరి గిరికుమారుని ప్రేమగీతములా నాటి భావుకులకు, మరులు కల్పించినవి. శశిదూతము, అనార్కలి ఈనాటివే!! వీరి వరలక్ష్మి త్రిశతి 'స్మృతి కావ్యరచనా పద్ధతి అనెడి కాల్పనిక కవిత్వ శాఖికకు నాయకమణి. నూరు మహాస్రగ్ధరలతోనే మయూరుడు మహాకవి యైనట్లే ఈ మూడువందల సీసములే చాలును విశ్వనాథను మహాకవిగా శాశ్వతుని చేయుటకు!

"నీవు వేలుపుటూరివే వెల్గురేకవు
కేవలము మృదాకృతిని నేను
నీవు సదాచార నిష్ఠాయ తాత్మవు
కడు దురాచార నిష్ఠుడను నేను
నీవు నిశ్చల మనోభావాభిరామవు
కడు చంచలాతి చంచలుడ నేను
నీవు స్త్రీరూప మదిన గేహధర్మవు
శ్లాకశీతి కొదగని యతిలిపి నేను
ప్రకృతి వచ్చముగా నీవు వికృతి నేను...."

స్త్రీకి అమృతత్వసిద్ధి నిచ్చిన కవిత్వమిది. భావకవితోద్యమమున స్రవంతిలోని పంట కాలువ జాలు యిది!! విశ్వనాథవారి శృంగార వీథిలోని రాధా కృష్ణుల ప్రేమతత్త్వము కూడ ఈ మహోద్యమ ఫలితముగనే వెల్వడినది!

## ఎందరో మహానుభావులు :

ఈ కవితోద్యమ మొక యేటితో, ఒకనాటితో ముగిసిన కథ కాదు. కావుననే ఇందు క్రుంకులిడని కవితా తైర్థికుడీ శతాబ్దపు తొలి భాగములో లేనే లేడు. అందరును మహానుభావులే; అందరిని వందనములు సమర్పింపవలసియే యున్నది!

ప్రాచీనత జీర్ణించుకొని సంప్రదాయ ముద్ర బలముగా ఉండగా నవ్య కవితోద్యమములో పురోగమించిన పథికులలోని అగ్రగాములలో వేదుల సత్యనారాయణ శాస్త్రిగారొకరు. వీరి 'దీపావళి' తుదిలేని ఇక్షుఖండము. రేయికాటుక కనుల జారిన విషాదబాష్ప వారి నొకేసారి పారబోసి మధుపాత్ర రావ్వైన

సామగానమంచుమోయ జీవనపాత్ర' నింపుకొనుమనుచున్నాడు. పూవు పూవున గుబులొక్కనిన తావి, రెక్కలు విదిల్చిన పులుగుగొంతుల పాట (పాటకు రెక్కలు విదిల్చుట విశేషణము) ఆర్ద్రపురుగు పూవుల శాద్వలాంబరమ్ముపై తొలకరి యిడినసారి, కోడెత్రాచుల పరగించుకొనగజాలు ప్రకృతి, మింటి నీలిముసుగులు, ఈ మహాకవితోద్వేదయములో వెల్వడిన నవ్యాభరణములు! హేమంత కాల రాత్రిలో విరహ బాష్పతుషారమ్ము గురిసి కురికను మొగడ్చగా, రోదసిమూల మూలలలో జీవచైత్ర ప్రభావంశీరవమ్ము త్రోతల నీకవి విన్పించినాడు!

భావకవిత్వము వ్రాయుచునే పరమలలితముగా పసిపాపల బాసలో గేయము లల్లుట గారడీ వంటిది. చింతాదీక్షితులవారు ధగధగ మెరిసే నెమలి కండ్ల కాంతికిరణములను పరిశీలించుట ఇట్టిదే! పసుపు కుంకుమంతో పూలరేకు లతో పువ్వొడులతో ఉదయలక్ష్మిని కొల్వనూహించుచు, మంచి మంచి రకాల మంచు బిందువులు ధరణిపై రత్నకంబళులు పరచినట్లున్న తీరును, వింటిపై మేఘకన్యకలు హారతి శ్వేతపట్టుకొని నిలిచిన విధమును మనోహరముగా వర్ణించిరి.

కవికొండల వెంకటరావుగారు నందనోద్యానములను గాక ఆంగ్లములోని ఏ డెఫడిల్స్, లిల్లీ పుష్పములనో వర్ణించినట్లు 'తలపగరాని, పిలువగబోని, నిలుపగలేని' దారి పక్కన 'దాక్కున్న' 'ఇరుక్కున్న' పూవులను వర్ణించినారు. మాధవపెద్ది బుచ్చి సుందరరామశాస్త్రిగారు 'హాయిగ పండియేటి యధరాంచల మందున యిప్పుడిడ్డె కన్మూయుచు నన్నదీలవలి ముద్దుల యీ లతకూన'ను ఏ క్రియను శయ్యగా చేయవలెనా యని విషాదించినారు. త్రిపురారి భట్ల వీర రాఘవస్వామిగారు పికముపై అన్యాపదేశముగా తీయపండ్లు రుచించును తిన్న కొలది తృప్తి చెందదు. మనసెంత తినినకాని' యని లోగిని సూచించినారు.

బసవరాజు అప్పారావుగారి గేయములు భావకవితోద్యమములో స్మృతి శాఖ మొదలుకొని అన్నింటిని వెలుగుపూలు పూయించినవి. చలిపిడుగు వంటి వీరి ఖండికలు ఆంగ్లములోని 'ఎలిజీ'ల కన్న హృదయవిదారకమైనవి. తొలి దశలో కృష్ణశాస్త్రిగారితోపాటు ఉద్యమముగా నవ్యకవిత్వమును మార్చిన మూల స్తంభములలో వీరొకరు నండూరి వారి ఎంకి 'నీలలో మునిగి వెలుగులో తేలి మబ్బుసెందురుడల్లె మనిషిలో మనసల్లె' నిలిచిన తీరు ఈ మహోద్యమములో

ఒక తుఫాను రేపినది. ఎంకి పల్లెటూరి పిల్ల. ఆంగ్లేయ పల్లీయ ప్రకృతి, భారతీయ కాళిదాస ఆధ్యాత్మిక ప్రవృత్తి కలబోసిన కలకంఠముక్క ఆమె కావుననే నాయుడు బావతో 'ఎనకజనమము' గూర్చి వెలుగునీడలను గూర్చి చర్చలు సాగించినది. వీరి భాషను, అది సృజించిన విప్లవమును మఱొక అధ్యాయమ్ములో వివరింతును.

బసవరాజు అప్పారావుగారు ప్రణయ కవిత్వ సారమును తమ కృతులను పాత్రలుగా చేసి నింపినారు. 'మగని రొమ్మున కుంపటి రగులబెట్టి కాయము త్యజించిన మొగలాయి రాణి' గాథ తాజమహల్‌ను ఈ దినములలోనే రచించి పాఠకులకే కాదు విరహ కవులకు, కవితలకు కూడ విరహము నేర్పించినారు. అట్లే బాపిరాజుగారు ప్రసిద్ధముగా నవలాకారులైనను భావకవితోద్యమములో పర్వులిడి 'కౌగిలికందని భావం తలచీ తెరవైన నా చేతులు చాచీ అరమూతలు నా తీరని కలలే చీల్చిన చిగురని తెర ఇవతల' తన ప్రియా బాల స్థితిని తనివిదీర వర్ణించినారు. అబ్బూరి రామకృష్ణరావుగారు ఊగెడు పారిజాతముల నుయ్యేల లూగెడి ప్రభాతవాలమును భావకవిత్వపు తొలి దినములలోనే వర్ణించినారు. అట్లే దువ్వూరి రామిరెడ్డిగారు కూడ చదలు పందిట వెన్నలజాజి తీవ చుక్కలను పూలు పూచిన తీరును వర్ణించినారు. ముఖ్యముగా వీరి కర్షక కవిత్వము పల్లీయ కవితా శాఖకు శిరోభూషణము. కొడాలి ఆంజనేయులుగారు 'ప్రణయ పరిమళ శారదా రాత్రులెన్నొ నిరుపయోగమ్ము'లైన తీరును 'లేడి కాటుక కన్నీట వాడువడిన అడవి పువ్వుల సజ్జలను' వర్ణించి 'ప్రేమలేఖతో భావ కవిత్వము 'మాగ్నాకార్టా' ప్రకటించినారు. చామర్తి రాజశేఖరరావుగారి 'బృందావనము' ఇటు ప్రణయ కవిత్వమునకు అటు దేశభక్తి కవిత్వమునకు సంధిస్థలము.' క్రేవలనున్న చెంగలువ రేకులు కోమల కాంతులీన పూదీవెల తూగుటుయ్యాల తేటలు తేలియ సోనలాన క్రొందావులు చూరలాడు యమునా సికతామయ పుణ్యసీమను వర్ణించుటలో భక్తి- రక్తి దేశభక్తులను త్రివేణీ సంగమమును మనసులో భావించినట్లు ఊహింపవచ్చును! అధికార్ల సూర్యనారాయణరావు, పెద్దిభట్ల రామచంద్రరావు, పూర్ణశర్మ, కోపల్లె శివకామేశ్వరరావు, ముద్దుకృష్ణ, పింగళి, వేటూరి, నాయని సుబ్బారావు, నోరి నరసింహశాస్త్రి, కందకూరి రామభద్రరావు, మల్లవరపు విశ్వేశ్వరరావు, కొంపెల్ల జనార్ధనరావు, వింజమూరి శివరామారావు, పిఠాపురము

మహారాజా, పిలకా గణపతిశాస్త్రి, శ్రీరంగం శ్రీనివాసరావు, జంధ్యాల పాపయ్య శాస్త్రి, కృత్తివాస తీర్థులు, పాటిబండ మాధవశర్మ, దేశిరాజు కృష్ణశర్మ, పాలగుమ్మి పద్మరాజు సంపత్, జనమంచి రామకృష్ణ, పోతుకూచి సుబ్రహ్మణ్య శాస్త్రి, రజని, చెరుకుమల్లి జమదగ్నిశర్మగారు, బొడ్డు బాపిరాజు గార్లవంటి శతాధికులనీ సందర్భములో సంస్మరింపక తప్పదు. పేర్లను పట్టికగా నిచ్చుట కేవలము ఉద్యమ తీవ్రతను సూచించుటకేనని మనవి చేయుచున్నాను. నిజముగ ఉదాహరించిన పేర్లకన్న ఉదాహరింపని వే శతాధికములు. 'ఒక్కమాటలో నాడు భావ కవిత్వము వ్రాయని, అక్షరాస్యుడు లేడనినచో ఉద్యమశక్తిని యథార్థముగా అంచనావేసినట్లగును.

## అనువాదములు - ఆధారములు :

ఉద్యమము తీవ్రతరమైనప్పుడు వస్తువుపై, భావముపై అనురాగము పెరిగినప్పుడు ఆకర్షణ రగిలినప్పుడు స్వతంత్రములే కాదు. అనువాదములు కూడ తామర తంపరలుగా వచ్చును. అవి స్వభాషకు అలంకారములు కాకున్నను, పరభాషా సంస్కృతీ సంప్రదాయములకు ప్రతిబింబములైనను ఉద్యమ స్వభావము ప్రతిఫలించుటకు మేలి బంతులై నిలుచును. భావ కవితోద్యమము తెనుగునాట తేనెవాకలను పారించినప్పుడు, మౌలికమైన విరుల సరములు ఆంగ్ల సీమనుండి అరమరికలు లేకుండ వచ్చినవి. కీట్సు - షెల్లీ, వర్డ్సువర్తు ప్రభృతుల ఖండికలను ముందు అనువదించి, అటనట ప్రచురించినారు. వారిలో పెక్కురు ఆంగ్లభాషా విద్యార్థులు. తమతమ పాఠ్యగ్రంథములలోని ఈ నవీన ఖండికలు వారిని విపరీతముగా ఆకర్షించినవి ! తె. కృష్ణమూర్తిగారు ప్రేమతత్వము శీర్షికతో షెల్లీ రచించిన **'Philosophy of Love'** ను అనువదించి ప్రచురించినారు అట్లే నేలటూరి అనంతాచార్యుల వారు హౌరిల్ రచించిన **'So the rimroses filled with morning dew'** అను రచనమును యథాతథముగా 'తుషార పరిషిప్త సుమము' అనుపేర తెనుగు గడ్డపైకి దింపినారు. ఇట్టివి అసంఖ్యాకములు ఉద్యమ వేగములో ఎట్లు స్వపర భేదములేకుండ సాహిత్య సృష్టి జరుగునో ప్రదర్శించుటకే ఈరెండు రెండు ఉదాహరణములు.

ఇట్లుకాక ఆధారములు కొన్నిటిని స్వీకరించుట కూడ జరిగినది. అవి అనువాదములో తత్ సదృశ్యములో అనునట్లున్నవి. జాన్‌కీట్స్ నైటింగేలును

వర్ణించును. 'My heart Aches and a breway numbness Pains my heart' అనినారు. బసవరాజు అప్పారావుగారు ఈ వాక్యములను యధాతథముగా అనువదించుకొనినారు. 'నైటింగ్‌లు'ను 'కోకిల'గా మార్చినారు.

"కోకిలా కోకిలా కూయబోకే
గుండెలూ బద్దలూ చేయబోకే !"

జాన్‌కీట్సు తన ఎదుట ఒక పావురము రాతిని అందుకొనబోగా తాను కూడ ఆ పావురముతో ఏకమైపోయి రాతిని అందుకొన వెడలినట్లు ఊహించినాడు. కృష్ణశాస్త్రిగారి 'ఆకులో ఆకునై పూవులో పూవునై
ఈ అడవి సాగిపోనా......ఇచటనే దాగిపోనా' అనుపంక్తులలో పై కీట్సు ఛాయలున్నవి కదా! కోలరిడ్జి పున్నమిరేయిలో చందమామను చూచుచు. చేతులు చాచుచు క్రమముగా తానే చంద్రుడై పోయినట్లూహించినాడు. దువ్వూరి రామిరెడ్డిగారు గరికపై వ్రాసిన ఈ పంక్తులు చూడుడు:

"నీ అందచందంబు నీ వసంతంబు
నందు జాల్గొన నాదు డెందముప్పొంగు
పంచవన్నె ముసుంగు వలిపంబు క్రింద
నొకవేళ మిరుపుర మొకరమో ఏమొ'

అట్లే మరొక ఉదాహరణము: కోలరిడ్జి వ్రాసిన ఈ క్రింది పంక్తులు చూడుడు.

"He Prayeth well who loveth well
Both man and bird and beast
He prayeth best who loveth best
All trings both great and small"

వీనిని వెంకట పార్వతీశ్వరకవులు యథాతథముగా స్వీకరించినారు.

'ఈ సుఖంబును గష్టంబు నెందుకొఱకు
ఈ భవంబును నాశంబు నెందుకొఱకు
ఈ జగంబున నన్నియు నెందుకొఱకు
ప్రేమ కొఱకు ప్రేమ కొఱకు ప్రేమ కొఱకు' కోలరిడ్జిని గుర

వాడవారు జీర్ణించుకొనినారో యనునట్లు "ప్రేమనిచ్చిన ప్రేమవచ్చును ప్రేమ నిలిపిన ప్రేమ నిలచును" అని ప్రవచించినారు.

షెల్లీ స్కైలార్కులో 'We look before and after
And pine for what is not' అనుభవమే రహస్య మార్గములలో" అను పద్యములో అనూదితమైనది.

## గుత్తునాముత్యాల సరములు :

కాల్పనికోద్యమమున కాద్యులైన వారిలో గిడుగు, గురజాడలు ప్రముఖులు. వీరు ఒకే నాణెమునకు రెండు ముఖములు. గిడుగు భాషను, గురజాడ భాషను ఛందమును కూడ ప్రజాసామాన్యము వద్దకు తీసికొని వచ్చినారు. ఇట్లు కవిత్వమును ప్రజలకు సన్నిహితము చేయవలెనను భావము కూడ కాల్పనికోద్యమ లక్షణములలో నొకటి! అందులకు వర్డ్స్‌వర్థు వ్రాసిన ఈ మాటలు చూడుడు : "Written chiefly with a veew to ascertain how for the language of conversation in the middle and lower class of society is adapted to the purpose of poetic measure" "గుత్తునా ముత్యాల సరములు కూర్చుకొని తేటైన మాటల" అను మహోద్యమమునకు ఈ వాక్యములే ఆధారమనిపించును. వ్యావహారిక భాషోద్యమము ప్రత్యేకముగా అభివృద్ధి చెందినను వర్డ్‌వర్త్సు, గురజాడల వాక్యముల ననుసరించి కాల్పనికోద్యమమున కదియును శాఖయే ననిపించునట్లు తోచుట గమనింపదగిన విశేషము !

ఇంతటి బ్రహ్మాండమైన ఉద్యమము అత్యంత సహజముగా, నిశ్శబ్దముగా 1943 నుండి అదృశ్యమగుట వింత! ఆ తరువాత కూడ కాల్పనిక కృతులు రాకపోలేదు కాని అందు ఉద్యమత్వము మృగ్యము. తన పని ముగిసిపోగానే తనకన్న మిక్కిలి వేగముతో వచ్చిన అభ్యుదయ కవితోద్యమమునకు తగిన రంగస్థలమును తానే సృజించిన దానిని స్వాధీనమొనర్చి కాలగర్భములోనికి భావకవితోద్యమము నిష్క్రమించినది !!

## ఉద్యమము - శిల్పము :

భావకవితోద్యమ కాలములోని రచనలలో వ్రేళ్లపై లెక్కింపదగినవి

మాత్రమే నేడు (అనగా ఏబది సంవత్సరముల తర్వాత) మిగిలినవి. అందుల కొక కారణమున్నది.

కవికి సమాజమో, ఒక సంఘటనమో స్ఫూర్తినిచ్చును. ఆ ప్రేరణతో రచన సాగును. వాల్మీకికి క్రౌంచ మిధున సంఘటన మట్టిదే !!

ఉద్యమ స్ఫూర్తితో కవి రచనలను చేయును. అతడు ప్రతిభాహీను డైనచో రచనలో "నినాదములు" చోటు చేసికొనును. ప్రతిభావంతుడైనచో రచన శిల్పగరిమతో పరిమళించి పది కాలములపాటు బ్రతికి బట్టకట్టును. రచన త్రికాలాబాధితమగును ఇదియే సామాన్య రచయితలకును, మహాకవులకును గల ప్రధాన భేదము సమకాలీనమైన సాంఘిక సమస్యలను స్వీకరించినప్పటికిని వానికి విశ్వజనీన దృక్పథమును కవి సంతరింపగలడు.

ఆధునికాంధ్ర సాహిత్యమునే కాదు విశ్వసాహిత్యమును ఈ తీరుగా అంచనా వేయవలసి యున్నది

భావకవితోద్యమములోను, వెంటనే వచ్చిన అభ్యుదయ కవితోద్య మములోను, నేటికిని మిగిలిన రచనలు ఈ శిల్పప్రౌఢితో కూడినవే! ఇది అత్యంత ముఖ్యమైన సిద్ధాంతము ! *

## అభ్యుదయ కవితోద్యమము :

కాల్పనికోద్యమ సహజ మరణానంతరము సమాజమున అభ్యుదయ కవి త్వమును వరించినది. అభ్యుదయ కవిత్వమునే ప్రగతి కవిత్వమనియు పిలు చుట కలదు. సైద్ధాంతికముగానేమి, రూపశిల్పములోనేమి ఇది వరించిన ప్రగతి యెట్టిదో వివరించుటకు ముందుగా, అభ్యుదయ కవిత్వమునకు ఆత్మప్రాయమైన సామ్యవాద రాజకీయ సిద్ధాంతమును వివరింతును. నిజమునకు దీనిని రాజకీయో ద్యమముల క్రిందనో, ఆర్థికోద్యమముల క్రిందనో వింగడింపవలసి యున్నది. కాని ఆంధ్ర దేశములో భావకవిత్వము- అభ్యుదయ కవిత్వము రెండును పరస్పర సంబంధము కల్గియుండి, కాల్పనికోద్యమము వచ్చిన వెంటనే దానిపై తిరుగుబాటుగ వచ్చిన ఉద్యమమగుటచే ఇచ్చటనే చర్చించితిని !!

### మార్క్సుకు పూర్వము :

తెలుగుదేశములోని అభ్యుదయ కవిత్వము సమకాలీనమైన ఒకానొక

సాంఘిక చైతన్యమును, రాజకీయోద్యమమును ఆధారముగా చేసికొని ప్రవర్థమానమైనది దీనికి వర్గసంఘర్షణ సిద్ధాంతము మూలము. దీని ప్రయోక్త విదేశీయుడైన కారల్‌మార్క్సు మార్క్సు నాటివఱకును పరంపరాగతముగా వచ్చుచుండిన సామాజిక జీవనమునకు వర్గ సంఘర్షణము ప్రాతిపదికగా ఆర్థికపరముగా భాష్యము చెప్పుటతో ప్రపంచ చరిత్రలోనే గణనీయమైన మార్పు వచ్చినది. ఈ సిద్ధాంత దృష్టితోనే మార్క్సుకు ముందు కూడ ఆలోచించినవారు లేకపోలేదు. అట్టి వ్యక్తుల శతాబ్దముల తపఃఫలమే కారల్‌మార్క్సు !!

1) ఆమోసు : ప్రపంచములో ఆర్థికమైన అసమానత్వమున్నది. దానిని అంతమొందింపవలెనను ఆలోచన బైబిలు కాలమునుండియే ప్రారంభమైనట్లు గ్రంథస్థమైన ఆధారములున్నవి. ఆమోసు క్రీ పూ. 500 నాటి లేకోవా గొల్ల కులమునకు చెందిన వ్యక్తి ! నాటి యూదులు విజయగర్వముతో ప్రజాపీడనలో నిమగ్నులై యుండగా 'దేశమును కొల్లగొట్టుచు ప్రజాసొమ్ముతో, భోగవిలాసములతో నానందముగా గడుపుచున్న మీరు సర్వనాశనమగు కాలము ఆసన్నమయ్యె' ననెను. తరువాత అట్టి వారు పతనమైరి. ఆర్థిక వికేంద్రీకరణకై కృషి చేసిన వారిలో ఈతడు మూలపురుషులలో నొకడని మార్క్సిస్టు తత్వవేత్త లభిప్రాయపడినారు.

2) హోషియా : ఈతడును ఆమోసువలెనే ప్రచారము చేసెను.

3) ఇజయా : ఈతడు శాసకుడు ప్రవక్త కూడ అగుటతో అత్యాచారములను నిరసించి దోషులను గద్దించి శిక్షించెను.

"వెండి బంగారపు పాత్రలందు ఈశ్వరునకు ధూపదీపము లిచ్చుటయు, పశుబలి నిచ్చుటయు, నిజమైన ఈశ్వరపూజ కాజాలదు. భిన్నప్రజలొకరి రక్తము నొకరు పీల్చుటకు బదులు పరస్పర ప్రేమతో మెలంగుచు కత్తులను ఖడ్గములను చెడగొట్టి నాగళ్లు చేయించినపుడే నిజమైన ఈశ్వర ప్రభుత్వ మేర్పడును."

4) జెరమియా, ఇజకాయల్ : క్రీ. పూ. 700 నాడు వీరు సామ్యతత్త్వమును ప్రచారము చేసిరి.

5) క్రీస్తు: ఈతడును గొప్ప సంఘసంస్కర్తయే! 'ధనికుడు మోక్షమును జేరుటకంటె సూది బెజ్జమునందొంటె దూరుట సులభమని' ప్రవచించెను. విప్లవమును కూడ సమాజములో ప్రచారము చేసెను.[1]

6) సెంటు ఔగస్టాయిన్: క్రి శ. 400లో జన్మించిన ఔగస్టాయిన్ 'ఈశ్వర నగర'మను గ్రంథమును వ్రాసెను. ఇందాతడు విప్లవము, కల్లోలము వంటి పదజాలమును ప్రయోగింపకున్నను ఆదర్శ సమాజ చిత్రణమును కావించెను. ఇది మార్క్సు ఊహలకు చేరువలో నున్నది

7) సావొనరోలా: క్రి. శ 15వ శతాబ్దములో ఇటలీ దేశపు ఫ్లారెన్సులో ఈతడు జన్మించెను. నాటి సామాజిక అక్రమములను అసమానత్వమును తీవ్రముగా ఖండించెను. స్త్రీలు, వర్తకులు, తమ ధనమును బంగారమును రోలాకు సమర్పించిరి ఫ్లారెన్సు ఆదర్శ నగరము కాగలదని పెక్కురు భావించుచుండగనే క్రైస్తవ మతాధిపతి పోపుసావన్ రోలాను పట్టి ఉరి తీయించెను.

8) ప్లేటో: ఈయన సృజించిన ఆదర్శరాజ్యము మిక్కిలి సంచలనమును కలిగించిన గ్రంథము ప్లేటో, సోక్రటీసు, అరిస్టాటల్ అను ముగ్గురు దార్శనికవేత్తలును నాడు సమాజమును నూతన దృక్పథముతో చూడసాగిరి. ప్లేటో తానూహించిన ఆదర్శ రాజ్యము నిట్లు చిత్రించెను. "ఇందు ధనికులు కాని దరిద్రులు కాని, కానివారు కొన్ని వేల మనుష్యులుందురు.... వారు అన్నము, సారా, వస్త్రములు, చెప్పులను నిర్మింతురు.... శాసకులకు స్వభార్య లుండరాదు. స్త్రీ లందరిపైనను వారి కధికారముండును. వీడు నా పుత్రుడు, ఈయన నా తండ్రియను మమత కించిత్తైనను ఉండుటకు వీలులేదు. ఏ స్త్రీ పురుషుల వలన మంచి సంతానము కలుగగలదో వారు విచారించుదురు. వాని ప్రయోజనము విషయాసక్తి కాదు, మంచి మానవుని నిర్మించుటయే. స్త్రీలు పురుషులకు దాసీలుగ నుండకూడదు. స్వతంత్రులై యుందురు సంతాన పరిపాలనా భారము

1. "నేను భూమి మీదికి సమాధానము కొఱకు వచ్చితినని తలంచకుడి. ఖడ్గమునే కాని నేను సమాధానమును గొని రాలేదు" (మత్తయి. అ. ౧౦ వా. ౩౪, ౩౫). నేను భూమిపై అగ్ని దరిగొల్ప వచ్చితిని...." (లూకా. అ. ౧౨. వా. ౪౯, ౫౧).

వారిపై నుండదు. రాష్ట్రమే పిల్లలందఱిని సమానముగా పోషించుట కుచిత వ్యవస్థ నేర్పరచును."[1]

9) వర్జిల్ : ఇటలీ దేశస్థుడైన ఈ మహాకవి తానూహించిన ఆదర్శ సమాజము నిట్లు సృజించెను. "పొలము మధ్య కాడిగట్లు కంచెలు లేకుండెను. పొలమంతయును ఉమ్మడిగ నుండెను."

10) సినేకా : ఈతఁడు క్రీ.పూ. 3 నుండి క్రీ.శ. 65 వఱకు జీవించెను. 'నాది' అని ఏ వస్తువును లేని సమాజమును ఈయన ఊహించెను. "వస్తువులన్నియు సమష్టిగా నున్నంతవరకు నెట్టి దరిద్రమును లేకుండెను" అనెను !

11) జాన్‌విక్లిఫ్ : ఈయన పదునాల్గవ శతాబ్దములో జన్మించిన ఒక సంస్కర్త. "ఆదాము నేల దున్నగా, అవ్వ నూలు వడుకగా ఆనాడు మరి శిష్టులెవ్వర"ని ఈయన ప్రశ్నించెను.

12) తామస్‌మోర్ : క్రీ. శ. 1474-1535 నాటివాడు. సమాజమును గూర్చి ఈయన 'ఉటోపియా' అను గ్రంథమును వ్రాసెను. వ్యక్తికి ఆస్తిలేని సమాజ కల్పనమది. విమర్శకులు దీనిని అభూతకల్పన మనిరి !

13) ఫ్రాంసిస్ బేకన్ : తామస్‌మోరు వ్రాసిన 'ఉటోపియా'ను సాకారముగా మార్చుటకై పోరాడిన వీరులలో బేకన్ ప్రభృతులెందఱో ఉండిరి. బేకన్ 'న్యూ ఎట్‌లాంటిస్' అనునొక గ్రంథమును రచించెను. నాడు సమాజములో కూడ ఈ రచనల స్ఫూర్తితో రైతు విప్లవములు చాల సాగినవి.

14) అట్లే రోములో కూడ కొందఱు సంస్కర్తలు మార్క్సుకు పూర్వమిట్టి యలజడి చేసిరి. "ఈశ్వరుడు గాలిని జలమును అందఱకు సమముగ నిచ్చెను. వీనిపై అందఱకు సమాన హక్కు కలదు. మానవుడు స్వసంపత్తి నియమమును ప్రవేశపెట్టి నరులలో భేదభావమును కలుగజేసెనని వీరి భావము!

ఇవన్నియును మార్క్సు సిద్ధాంతమునకు తొలి తలపుల వంటివి. నిరీశ్వర

1. ప్లేటో రిపబ్లిక్.

ప్రాతిపదికపై భారతదేశములో సాగిన తత్వచింతనను గూర్చి ద్వితీయాధ్యాయములో వివరించితిని !!

## కారల్‌మార్క్స్ - అంతర్జాతీయ సిద్ధాంతము :

కారల్‌మార్క్స్ తనకు ముందున్న సిద్ధాంతములనెల్ల పరిశీలించి ఆర్థికమైన ఒకానొక మౌలికతత్వ కల్పనముచేసి దానికి అంతర్జాతీయ స్వరూపము నిచ్చుటలో కృతకృత్యు డయ్యెను ! సమకాలీన సామాజిక దుఃఖముల కిది రాజౌషధమని పెట్టుబడిదారీ వ్యవస్థను వ్యతిరేకించెడి అన్ని దేశముల నాయకులును ప్రచారమొనర్చి, హృదయపూర్వకముగా దీని ననుసరించుటతో ఇది అంతర్జాతీయ సిద్ధాంతమయ్యెను. ఇట్లనుసరించిన వారిలో రష్యావంటి అన్ని దేశములకును చెందినవారును కలరు. ఈ సిద్ధాంతవ్యాప్తికి వారు పత్రికలను, సాహిత్యమును, గోడ పత్రికలను వార్తాపత్రికలను సాధనములుగా ఉపయోగించుకొనిరి. "ఒక బలీయమైన రాజకీయ సంస్థకు చక్కటి రాజకీయ శిక్షణ గరపాలంటే విరివిగా వెలువడే నిర్మాణయుక్తంగా పంచబడే మంచి పత్రిక ద్వారా తప్ప వేరుమార్గం లేదు."[1]

## విజయములు :

సామ్యవాదమొక మహోద్యమమై అంతర్జాతీయముగా కొన్ని పూర్వ విజయములను పొందెను. 1864 లో ఒక అంతర్జాతీయ సామ్యవాద సంస్థ స్థాపింపబడెను. ఫ్రాన్సు - ప్రష్యాల మధ్య యుద్ధమువలన అది విఫలమైనది. అందుచేత 1889 లో మఱల నొక ప్రయత్నము జరిగెను. కాని అది కూడ విఫలమయ్యెను. తరువాత లెనిను మూడవ అంతర్జాతీయ సామ్యవాద సంస్థను స్థాపించెను. అది క్రమముగా రష్యాలో తన తొలి విజయమును సాధించెను. 1917 లోని అక్టోబరు విప్లవ ఫలితముగా జారుశాసన మంతరించి కమ్యూనిజము స్థాపింపబడెను !

సామ్యవాద సిద్ధాంతము నాధారముగా చేసికొని ఈ విజయములను సాధించుటకు కార్యకర్తలకొక శతాబ్దపు నిరంతర సంగ్రామము అవసరమయ్యెను. 1875 లో ఒడేసాలో దక్షిణ రష్యా మజదూరు సంఘము స్థాపింప

---

1. లెనిన్.

బడెను. 1878 లో రష్యా కూలీల ఉత్తర సంఘము స్థాపింపబడెను దీని బౌబ్నొస్కీ ప్రారంభించెను. క్రమముగా 1881 నుండి 86 మధ్య కాలములో 48 సమ్మెలు జరిగెను. 1885 లో మోరోజోవు కర్మాగారములో అన్నిటి కన్న మిక్కిలి పెద్ద సమ్మె జరిగెను!

1898 లో మింస్క నగరములో రష్యా సమాజ జనతంత్ర మజదూరు సంఘ సభ యొకటి జరిగెను కాని ఆ సభ త్వరలోనే అంతరింపజేయబడెను. 1900 లో లెనిను 'ఇస్క్రా' (అగ్నికణము) అను పత్రికను స్థాపించెను. 1886 లో మూడవ జారును కొందరు ప్రభుత్వాధికారులును హత్య చేయబడిరి. కాని లెనిను కొందరు వ్యక్తులను హత్యచేసి లాభము లేదని, విప్లవము దేశవ్యాప్తముగా రావలెనని చెప్పెను. ఇరువదవ శతాబ్దము తొలి దినములలో జరిగిన రష్యా - జపాను యుద్ధములో రష్యా రాజనీతి పరాజయము పొందెను. ఇది లెనినుకు లాభదాయకమయ్యెను. 1904 లో బాకా నూనె యంత్రాగారములోను 1905 జనవరి 89 సెంటు పీటర్సుబర్గు పూటీలోవు కర్మాగారములోను సమ్మెలు జరిగెను. 1905 జనవరి 9 నాడు లక్షాయేబది వేల మంది 'మాకు తిండిలేదు. బట్టలు లేవు మాపై అత్యాచారములు జరుగుచున్నవి, రక్షింపుమని' జారును ప్రార్థింపగా ప్రభుత్వము తుపాకీలను ప్రయోగించినది దానితో జారు ప్రభుత్వము ప్రజల సానుభూతిని పూర్తిగా కోల్పోయెను.

1912 ఏప్రిల్ 4న సైబీరియా-లానా బంగారు గనిలో కలహము సంభవించెను. అప్పుడు ఏబది మంది కూలీలను ప్రభుత్వము కాల్చి చంపినది. ఈ వార్త రష్యాను ఉద్రూతలూగించెను. లెనిను కిది మిక్కిలి సహాయము చేసెను. వారి పత్రిక 'ప్రావదా'కు నలుబదివేల మంది చందాదారులు చేరిరి.

1914 ఆగస్టులో రష్యా-జర్మనీల మధ్య జరిగిన యుద్ధములో రష్యా పూర్తిగా పరాజితమయ్యెను. లెనినుకు సమయము దొరికెను. ప్రజల అసంతృప్తిని విప్లవమును వినియోగించుకొని లెనిను రంగములోనికి దిగెను. 1917 అక్టోబరులో హత్యలు విప్లవములు సాగెను. జారునికోలస్ సపరివారముగా చంప

బడెను.[1] రష్యా సామ్యవాదుల హస్తగతమయ్యెను ప్రపంచములో సామ్యవాదము వారనుకొనినట్లు ఇంగ్లండులో కాక రష్యాలో విజయము పొందెను. అందులకే ప్రపంచములోని వివిధ దేశములలోని సామ్యవాద మహోద్యమముల కన్నిటికిని రష్యా స్ఫూర్తిదాయకమైనది.

భారతదేశములో కూడ అత్యంత శీఘ్రముగనే రష్యా విప్లవానంతరము సామ్యవాద బీజములు చల్లబడెను. తొలుతగా అవి వంగభూమివంటి చోట్ల విప్లవకారులలో నాటబడెను. బ్రిటీషు సామ్రాజ్యవాద విధానము, వలసతత్వమే జాతి బానిసతనమునకు మూలకారణమని వారు నమ్మిరి. వారు మితవాద- అతివాద పక్షములతో కూడిన కాంగ్రెసు సంస్థవలన లాభము లేదని నిశ్చయించిరి. మీదు మిక్కిలి గోఖలే, తిలకు, మాలవీయా, గాంధీజీ వంటి ఆధ్యాత్మిక తత్వపరుల నాయకత్వము వారిని ఆకర్షింపలేదు.[2] దానితో అనేక ప్రాంతములలో రైతు కూలీ సంఘములు స్థాపింపబడెను. మే దినోత్సవమును జరుపసాగిరి. 1929 జనవరిలో ఇర్విన్ చేసిన ప్రసంగములో సామ్యవాదము నిరోధింపవలసిన అవసరమును గూర్చి నొక్కి వక్కాణించెను. 1934 లోపల చెరసాలలో జాతీయోద్యమ కార్యకర్తలకు మార్క్సిస్టులు తత్వశాస్త్ర తరగతులు నిర్వహించిరి. ఫలిత

1. జారు సైనికులకు ఓటమిపై ఓటమి సంభవించెను. జర్మనీ సైనికులు రష్యా సైనికులపై గుండ్ల వర్షమును కురిపించిరి. జారు సైనికులకు తుపాకులు కూడ లేవు. ముగ్గురికొక రైఫిలు చొప్పున ఉండెనని చెప్పబడుచున్నది ... జారురాణి, కొందరు పెద్ద అధికారులు కూడ రష్యా రహస్యములను ఎప్పటికప్పుడు శత్రువులకు చేర్చుచుండిరి. అయినపుడు జారు ఓడిపోవుటలో సంశయమేమి? 1916లో జర్మనీ జారు నుండి పోలెండు బాల్టిక్ ప్రాంతమునం దధికభాగము తీసికొనెను' (Vide short History of the communist party of the Soviet Union P. 173)

2. "గాంధీజీ మితవాద నాయకత్వంతో అశాస్త్రీయ సిద్ధాంతాలతో విసుగు చెందిన యువకు లనేకులు శాస్త్రీయమైన అభ్యుదయకరమైన సిద్ధాంతాల కొఱకు విప్లవ నాయకత్వం కొరకు వెతకనారంభించారు." "కమ్యూనిస్టు పార్టీ స్థాపన : ఏటుకూరి బలరామమూర్తి. "ఆంధ్రుల చరిత్ర."

ముగా వారిలో అత్యధికులు విప్లవకారులైరి. 1934లో మార్క్సిజము ప్రాతిపదికగా కల 'కాంగ్రెసు సోషలిస్టు' సంస్థ స్థాపింపబడినది. దీని సభ్యుల సంఖ్య దినదిన ప్రవర్ధమానమైనది. 1939 అక్టోబరులో బొంబాయిలో కరిగిన కూలీల సమ్మెలో లక్షకు పైగా కార్మికులు పాల్గొనినట్లు అంచనా వేయబడినది. జాతీయ కాంగ్రెసులోని జవహర్‌లాల్ నెహ్రూ ప్రభృతులు కూడ 'సోషలిస్టు' భావములచే ప్రభావితులైరి! హిందూస్తాన్ రిపబ్లిక్ ఆర్మీ వంటి విప్లవ సంఘములు తలఎత్తినవి. భగత్‌సింగు, పృథ్వీసింగు మొదలైన విప్లవవీరులు పంచనదీ తీరములోను వంగభూమిలోను ప్రభవించిరి. అతి త్వరితముగా ఆంధ్రభూమికి వెచ్చని సెగలు తగిలి పొగలు రగిలినవి !!

## రససిద్ధి :

కార్మికోద్యమము తీవ్రతరమైన కొలదియును దేశవ్యాప్తముగా కవులనది ఆకర్షింపసాగినది. నజురుల్ ఇస్లాం తొలిసారిగా వంగభూమిలో శ్రామిక కంఠమును విప్పినాడు. ఈతని కృతి 'బిద్రోహి'. దీనితో సరికొత్త అధ్యాయము ప్రారంభమై సామ్యవాద రచయితల పరంపర మొదలైనది. జీవ నానంద గోకులనాగ, బుద్ధదేవబోసు, ప్రేమేంద్ర మిత్రులు వంగభాషలో సామ్యవాదముచే ప్రభావితులై రచనా వ్యాసంగమును స్వీకరించినారు. మైకేలు మధుసూదనదత్తు ప్రేల్చిన అగ్నిపర్వతము సంప్రదాయముపైని, రామాయణాది పురాణ విశ్వాసములపైని జాతికి కల ప్రపత్తిని సమూలముగా పెకలించివేసినది. ఉర్దూలో జోష్, ఫైజ్, జాఫ్రీ, ముక్దుం మొహద్దీనులు, హిందీలో యశపాల్, నాగార్జున్, అంచల్ రాహుల్ సాంకృత్యాయన్‌లు, ఒరియాలో సచీరౌత్రే, అనంత పాట్నాయక్‌లు, బేంద్రీ ఇత్యాదులు. కన్నడములోను, శంకరకురుప్ కృష్ణవారియర్ అక్కిట్టం, భాస్కరన్‌లు మలయాళములోను ఒకేసారి వెలుగులోనికి వచ్చిరి. వెలుగులతో వచ్చిరి- ఈ వెలిగిన అరుణతారలన్నిటికిని రష్యా విహాయసమే నేపథ్యము. ఫలితముగా నాజిం హిక్మత్, మైకోవస్కి ప్రభృతులు వ్యాసవాల్మీకులవలె ఆధునిక కవుల కాదర్శ స్రష్టలైనారు. దేశవ్యాప్తముగా సాగిన ఈ ఉద్యమ శంఖారావమే ఆంధ్రదేశములో కూడ అందరితోపాటుగానో లేక అందరికన్న మిన్నగానో తన ధ్వనిని దిగంతము చేసినది. స్థానిక రచనలు రష్యా యోగ్యతాపత్రమును కూడ తరువాతి కాలములో పొందినవి. ఈ ఉద్యమ నిర్వా

పాకత్వమునకు నిలిచిన తెలుగు సారస్వత సంస్థ 'అభ్యుదయ రచయితల సంఘము.'

## రచయితల సంఘ స్థాపనము :

సాహిత్యము సామ్యవాదోద్యమమునకు సాధనము కావలెనన్న తలంపుతో 1936 ఏప్రిల్ 10 లక్నోలో, అఖిల భారత అభ్యుదయ రచయితల ప్రథమ సమావేశము జరిగినది. దాని శాఖయే 1943 లో ఆంధ్ర ప్రాంతమునకు వ్యాపించినది !

అభ్యుదయ రచయితల సంఘ స్థాపనమునకు కొంతకాలము ముందుగా సమకాలీన సాహిత్య సంస్థలనే అభ్యుదయ ద్వృక్పథము కలవారు ఆక్రమించు కొనిరి. 1942 లో డిసెంబరు 24 నుండి 28 వ తేదీ వఱకు నవ్య సాహిత్య పరిషత్తు నవమ వార్షికోత్సవము జరిగినది. ఏలూరులో ఈ సమావేశములను నాగభూషణం చౌదరి, సోమంచి లింగయ్య, భోగరాజు బుచ్చిరామయ్య గార్లే ర్పరచినారు సమావేశకుడు తెలికిచర్ల వెంకటరత్నం అందరును అభ్యుదయ దృక్పథము కలవారే. ఆ సందర్భములో 'ప్రతిభ' సప్తమ సంపుటము ప్రచు రించినారు. అందు XVI పుటలో ఒక ధ్వజము కలదు : అందు నక్షత్రముతో కూడిన స్వాతంత్ర్యము, శాంతి, అభ్యుదయము అను నినాదములు కలవు.

### దీని క్రింద ఒక యువ గీతము :

"ఆకాశము నొసట పొడుచు అరుణారుణ తార
ఏకాకి ని శీధినొడుచు తరుణకాంతి ధార
జయపతాక యువపతాక, వియదాపగ వెడలునౌక
యుగయుగాల పీడ కలలు సొగయబోని సంకెలలు
తెగనివి కావోయి, మ్రోల ధగధగా స్వతంత్ర
విభుతాకాశము నొసట పొడుచు అరుణారుణ తార....
ముందు గలదు జాతికిముక్తి. అమరజీవ రక్తి
క్రిందు వెనుక గనుక నడువుడందరు, అభ్యుదయ
విభుతాకాశము నొసట పొడుచు అరుణారుణ తార."

ఈ ధ్వజమును, గీతమును సామ్యవాదులు ఇతర సాహిత్య సంస్థల నాక్రమించి

ఉద్యమించుటకు స్పష్టమైన ఉదాహరణములు. ఈ సభలోనే వడ్డాది బాబూరావు గారు వేసిన గురజాడ చిత్రపటమును భమిడిపాటి వారు ఆవిష్కరించినారు. ఈ సందర్భములో సామ్యవాద సిద్ధాంతము గుబాళించెడి ప్రసంగములు కూడ జరిగినవి. కాని స్వతంత్రమైన అభ్యుదయ రచయితల సంఘమును స్థాపింప వలెనను నిర్ణయమును తీసికొనుటతో సాహిత్య పరిషత్తు వంటివి శోభావిహీనము లైనవి. భావ కవితోద్యమము స్తంభించిపోయి అభ్యుదయ వాహిని ఆరంభ మైనది !

ఆంధ్ర ప్రాంతములో అభ్యుదయ రచయితల సంఘమువారు తమ ప్రణాళిక నిట్లు ప్రకటించినారు :

"రచయిత నిజంగా తన ఆశయాలకు తాను కట్టుబడి వుంటే ప్రజలలో మిళితం కావాలి. పాత కవిత్వం, సంప్రదాయాలు, విచ్ఛిన్నమై పోతున్నప్పుడు నూతనతత్వంతో వాటిని పునరుద్ధరించాలి. దీని అర్థం : రచన ప్రత్యేక సంప్ర దాయాలతో పోషింపబడ్డ కళ అని గుర్తించకపోవడం కాదు. సమగ్రమైన నూతన విజ్ఞానం మాటల్తో ఒక్కసారిగ పుట్టివస్తుందనే భ్రమలో పడటమూకాదు; కాని సంఘం ప్రమాదంలో ఉన్నప్పుడు తన కోసమే తాను తన ఊహా సౌధాల నుండి దిగి రావాలి. ఏ కొద్ది మందినో మన వైజ్ఞానిక సంప్రదాయ రక్షకులుగా భావించి ఊరుకుంటే క్రూరమైన ఫాసిష్టు దాస్యానికి లోబడ్డ దేశాలలోవలె వారు దుష్టశక్తులకు లోబడిపోతారు. ఉదాహరణకు సోవియట్ మనకు ఎలా విప్లవం ద్వారా విజ్ఞానాన్ని నాగరికతను అందరి వశం అవుతుందో స్పష్ట పరుస్తుంది...."

ఈ ప్రకటనను విశ్లేషించినచో కొన్ని అంశములు సుబోధకములగును :

1) భావ కవిత్వముపై తిరుగుబాటు. 'ఊహా సౌధాలనుండి దిగిరావాలి' అనుట అందులకు సూచన.

2) సంప్రదాయజ్ఞులపై నిరసన : కవిత్వమును కొలదిమంది చేతిలో ఉంచి 'సంప్రదాయ రక్షకులు'గా భావింపరాదనుట కిది అర్థము.

3) హిట్లరు క్రూరశక్తితో సంప్రదాయ కవితావాదమును పోల్చుట. 'ఫాసిష్టు దాస్యానికి లోబడ్డ దేశాలలోవలె వారు దుష్టశక్తులకు లోబడిపోతారు.'

4) రష్యా విప్లవమను అయస్కాంతము వైపునకు కవుల గుండెలను ఇనుప ముక్కలు త్రిప్పుట - రష్యా అనెడి దిక్సూచితో కావ్యనౌ కలను నడిపించుట కా వాహనము - 'ఉదాహరణకు సోవియట్ మనకు ఎలా విప్లవం ద్వారా విజ్ఞానాన్ని నాగరికతను అందరివశం అవుతుందో స్పష్టపరుస్తుంది....' అను వాక్యము ! !

ఇంకను వారు తమ మానిఫెస్టోలో ఇట్లు ప్రకటించినారు : "It is the object of our Association to rescue literature from the conservative classes....... to Bring arts into closest Lonch with the people." ఈ వాక్యములో సంప్రదాయ తిరస్కారము 'ప్రజా కవిత్వ' నినాదము గోచరించును.

We believe that the new literature of India must deal with the basic problems of our existence to day .. ... the problems of hunger and poverty social backwardness and political subjection........"1

దీనితోపాటుగ తమ ఆదర్శములనీ క్రింది మాటలలో స్పష్టముగా వ్యక్తము చేసినారు :

1) మనదేశం సామ్రాజ్యవాద బానిసత్వం నుంచి విముక్తి పొందాలన్నా, జపాను దండయాత్రనుంచి ఆత్మరక్షణ చేసుకోవాలన్నా, జాతీయైక్యత ఎంత అవసరమో ఉద్ఘాటిస్తూ నాటికలు, కథలు పద్యాలు, గేయాలు, పదాలు వ్రాయడం-

2) ఇతర దేశాల అభ్యుదయ రచనలను ముఖ్యంగా ఈ మధ్య వెలువడ్డ సోవియట్ చైనా సారస్వతాన్ని అనువదించి ప్రచురించడం.

3) వివిధ భారతీయి భాషలలోని ప్రముఖ రచనలను సకాలానికి ఇంగ్లీషులో సంపుటాలుగా ప్రకటించడం-

4) పత్రికలను అభ్యుదయ సారస్వత సంపుటాలను వివిధ భారతీయ భాషల్లో ప్రకటించడం.

---

1. Progressive writers Association's Manifesto.

5) కార్మిక కర్షకులలో సాహిత్య వైజ్ఞానిక గ్రూపుల నేర్పరచి అభ్యుదయ రచయితల సంఘాన్ని ప్రజా సాహిత్యంతోటి కళలతోటి సన్నిహిత సంబంధ మేర్పర్చుట.

6) ప్రజానాట్య మండలితో సహకారం చేయడం. నాటకాలను వ్రాసి వారి చేతనే ప్రదర్శింపజేసి సహాయపడట-

దీనినిబట్టి రాజకీయ సిద్ధాంతము లెట్లి కవిత్వమునకు చోదకశక్తులుగా నున్నవో సుస్పష్టము ! !

దీనితో అభ్యుదయ రచయితల సంఘము ప్రారంభము ! తమ ఆదర్శములు దేశవ్యాప్తముగ ప్రజలకు చేరువ చేయవలెనను చొరవతో వివిధ ప్రాంతములతో పెద్దపెద్ద సభలను, వార్షికోత్సవ సమావేశములను నిర్వహించి, సాహిత్యము నొక తీవ్రమైన ఉద్యమము క్రిందికి పరివర్తనము చేసినారు. ఈ యీ క్రింది ప్రదేశములలో స్వాతంత్ర్య సిద్ధి వరకును వీరి మహాసభలు జరిగినవి :

| నగరము : | సంవత్సరము : | అధ్యక్షులు : |
|---|---|---|
| తెనాలి | 1943 | తాపీ ధర్మారావు |
| విజయవాడ | 1945 | తెలికిచర్ల వేంకటరత్నం |
| సికిందరాబాదు | 1945 | పిల్లలమర్రి వేంకట హనుమంతరావు |
| రాజమండ్రి | 1946 | దేవులపల్లి కృష్ణశాస్త్రి |
| మద్రాసు | 1947 | పి. వి. రాజమన్నారు |

ఈ కాలములోనే రచయితల సంఘము వేయి ముఖములతో విస్తరించినది. ఈ విస్తరణము, ఉద్యమము జ్ఞాతముగనే సాగినట్లు ఈ క్రింది వాక్యములు నిరూపించును. "అభ్యుదయ రచన అనేది ఒక పద్ధతికాదు - ఒక ఉద్యమం. కొన్ని కొన్ని విశేష పరిస్థితులలో ఇటువంటి ఉద్యమాలు బయలుదేరుతాయి ముఖ్యంగా నిన్న మొన్నటివరకు గాఢ నిద్రలోనో, వేళ్ళూనివున్నా మధురమైన స్వప్నాల మైకంవల్లనో ఒళ్ళు తెలియక వున్న మన సాహిత్య జీవనంలో ఒక గొప్ప మేలుకువ కలిగి వున్నాయి ఈ ఉద్యమాలు ..." ఈ ఉద్వేగము, ఉద్రేకముతోనే స్వాతంత్ర్య సిద్ధి తరువాత కూడ ఈ సంఘము పురోగమించినది కాని 1955 ఎన్నికలలో ఆంధ్ర ప్రాంతములో కమ్యూనిష్టు పార్టీ సమూలముగా తుడిచివేయబడినది. దానితో అభ్యుదయ కవితోద్యమమునకు స్వస్తి ! ! ఇదే వారికి

"చార్టర్ లైన్" ఆ తరువాత కామెందుకు కమ్యూనిస్టు అభ్యుదయ రచయిత కాలేదో 'సంజాయిషీ ఇచ్చుకుంటూ' ప్రముఖులు ప్రకటనలు చేసినారు.

## ప్రతిఘటనము - పురోగమనము :

అభ్యుదయ కవిత్వమునకు సామాజిక చైతన్యము ప్రాణవాయువు వంటిది. కావుననే సమాజముతో వీరికి గల సంబంధమును, సామాజిక చైతన్యము కవిత్వముగా మార్పిడి చెందుటయును వీరిలో ఉన్నంత మిగిలినవారిలో తక్కువ. కావుననే ప్రశంసలు, ప్రోత్సాహముతోపాటు ప్రతిఘటనము కూడ సమాజము నుండి వీరికి తీవ్రవస్థాయిలోనే వచ్చినది.

రచయితల సంఘము తొలి దినములలోనే తీవ్రమైన విమర్శల నెదుర్కొనినది. "శ్రీ చదలవాడ పిచ్చయ్యగారు ఆంధ్ర కమ్యూనిస్టులలో అగ్రగణ్యులలో నొకరు. కమ్యూనిస్టులచే స్థాపింపబడిన అభ్యుదయ రచయితల సంఘమునకు ఆంధ్రదేశంలో కొంచెము స్థావరము దొరుకుటకు వీరి కృషియే కారణమని చెప్పక తప్పదు. అభ్యుదయ రచయితల సంఘము కమ్యూనిస్టు సంస్థ కాదని చెప్పి రచయితలను భ్రమపెట్టి ఆ సంఘములో జేర్పించి దానికి కృత్రిమ ప్రాబల్యమును ఈయన సాధించినాడు. కాని అభ్యుదయ రచయితల సంఘము ఈ విధముగా అభివృద్ధిని చెందుట కమ్యూనిస్టు కమిటీకి ఇష్టము లేదని ఇప్పుడు చదలవాడ పిచ్చయ్యగారు ప్రచురించిన 'ఆంధ్ర కమ్యూనిస్టు పార్టీ అగ్ర నాయకుల నగ్నసత్యాలు వలన రుజువగుచున్నది. అనేక ప్రముఖ రచయితలను అభ్యుదయ సంఘము పేరుతో ఉపయోగించుకొనుచు అదే సమయములో వారిని ఎంత న్యూనపరచినది ఈ లేఖల వలన తెలియుచున్నది."[1] చదలవాడ పిచ్చయ్యగారు కమ్యూనిస్టు పార్టీని వదిలిన తరువాత ఈ పరిణామము జరిగినది. ఏ సంస్థయైనను వ్యక్తినిష్ఠమైనచో అది ఆ వ్యక్తి తొలగినచో నశింపక తప్పదు. కాని సిద్ధాంతములను ప్రాతిపదికగా చేసికొనిన సంస్థ, వ్యక్తి సహాయ నిరపేక్షమై ముందుకు సాగును. ఆ సిద్ధాంతముల జీవన్మరణములే సంస్థకును వెలుగుచీకట్లు! అభ్యుదయ రచయితల సంఘ మట్టిది. కావుననే ఈ విమర్శలను లెక్క చేయక అభ్యుదయ మందినది. అభ్యుదయ సంఘము 'కమ్యూనిజాన్ని

---

1. 31-3-1948 ఆంధ్ర వారపత్రిక.

ప్రచారం చేసేందుకిలా బురఖా వేసుకొని'[1] వచ్చినదనియు, ఇదొక 'డిప్లొమాటిక్ స్టంట్' అనియు ప్రతిపక్షులు అపహాస్యము చేయుటే కాదు అవరోధములను కూడ కల్పించినారు. అయినను రచయితల సంఘ ప్రగతిని, ఉధృతమును అరి కట్టుట ఎవ్వరికిని సాధ్యముకాని పనియైనది. వ్యతిరేకశక్తుల నుండియును, ఆధ్యాత్మికవాదుల నుండియును ఇట్టి విమర్శలకు రచయితల సంఘము ముందే సంసిద్ధపడినది. "ఆధ్యాత్మికవాదం భౌతికవాదం మధ్య అనాదినుండి సంఘర్షణ జరుగుతూనే వుంది ఒకప్పుడు ఈ సంఘర్షణ మందంగానూ మరొకప్పుడు తీవ్రతరముగానూ ఉండవచ్చు అది వేరే సంగతి. అయితే ఈ సంఘర్షణ ఇంత వరకు సంపూర్ణ పరిష్కారము పొందలేదని"[2] రచయితల సంఘ ప్రముఖులెరుగుదురు. కావుననే ఆంధ్రప్రభ తన సంపాదకీయముతో ప్రోత్సాహము నిచ్చినను[3] అన్యులు తీవ్రముగా **'With regard to progressive literature. my own impression is that it occasionelly errs against good taste (Not morality'**[4] అని వ్యాఖ్యానించినను రచయితల సంఘము 1955 నాటి 'బార్డర్ లైను' వరకును నిరాఘాటముగానే సాగినది. 1955 లో రాజకీయముగా కమ్యూనిస్టు పార్టీ పరాజయము పొందినను 1962 అక్టోబరులో చైనా భారత దేశముపై దండయాత్ర చేయుటతో అవి సిద్ధాంతరంగములో కూడ అప్రతిష్ఠపాలైనది. అభ్యుదయ రచయితల సంఘమునకు ఈనాటితో స్వస్తి ! ! నామమాత్రముగా తరువాత కూడ సంఘము లేకపోలేదు కాని దానిలోని ఉద్యమత్వము సంపూర్ణముగా అంతరించి 'నేడును అభ్యుదయ కవిత్వము వచ్చు చున్నదని' నిరూపించుటకు 'అభ్యుదయ' విమర్శకులు మిక్కిలి కష్టపడవలసిన స్థితి వచ్చినది ![5] "సంకెళ్లు వద్దంటారు ఈ పరిషత్తువారు. పాత సంకెళ్లు వారు వదల్చుకొని కొత్త కొత్త సంకెళ్లతో ఇరుక్కుంటున్నారు. ఈ పరిషత్తువారి

---

1. కురుగంటి 'నవ్యాంధ్ర సాహిత్యవీధులు' ర. 763 పుట.
2. బెరిన్ 'చెక్' రచయితల సభలో ఇచ్చిన ఉపన్యాస భాగం 'విజయప్రభ' 1950 జూన్ 4.
3. శ్రీ నార్ల వెంకటేశ్వరరావు 21-1-1947.
4. ప్రొ మహమ్మద్ సాదిక్ '20వ శతాబ్దపు ఉర్దూ సాహితి.'
5. కె వి. రమణారెడ్డి 'అభ్యుదయ యుగం తర్వాత' సౌమ్య, ఆంధ్ర పత్రిక ఉగాది సంచిక.

సంకెళ్లు మనకెందుకంటున్నారు నవ్యులలో నవ్యులు"[1] 'మనకెందుకని' మిన్న కుండ లేదు, నవ్యులలో నవ్యులు అభ్యుదయ కవిత్వముకన్న భిన్నముగా ఒక్కొక్క రొక్కొక్క ఉద్యమము నడిపినారు ఒక్కొక్క వైచిత్రిని కోరి నారు. ఒక్కొక్క ప్రయోగమును చేసినారు. శ్రీశ్రీ వంటి ప్రముఖ అభ్యుదయ కవులు కూడ అధివాస్తవిక కవిత్వము వ్రాయుటతో, ఈ ఉద్యమము వెనుక బట్టినట్లుగా చెప్పక తప్పదు కాని నడిచినంత కాలము పత్రికలను, గ్రంథము లను సంపూర్ణముగా తన విరాట్స్వరూపముతో ఆక్రమించి[2] ఆంధ్రదేశమున కొక దిగ్భ్రమను కల్గించిన దీ ఉద్యమము !!

## శ్రీరంగం శ్రీనివాసరావు :

ఆధునికాంధ్ర కవిత్వములో అభ్యుదయ కవి తారీతి నొక ఉద్యమము క్రిందికి మార్చినవాడు శ్రీరంగం శ్రీనివాసరావు. తొలుతగా తాను కూడ కాల్పనికోద్యమమునకు లోనై భావాంబరములలో విహరించినవాడు. 'ప్రభవ'ను సాహిత్యమునకు నాత్రు కానుకగా సమర్పించినాడు.

'వివిధ సూనవితాన శోభితకుజ ప్ర
శస్త సుప్రమదావన స్థలము సాంద్ర
చంద్రికా సముజ్జ్వల దివ్యశర్వరీ ప్ర
శాంతవేళ సముచిత సౌఖ్యమొసగె'

'ముసురు నిశాంధకారముల ప్రోతలలో ఒక మూల తారకారసిక విలాసవీణ' కొసరగా తలపోసెడు మూగపాటకై దెసలలో చెవులు నిగిడ్చి 'నిశ్వసనములు' ఆగుచుండగా 'హృదయ వాద్యరుచులు' 'బిగియించి వేగుచుండగా' గడిపిన కాలము లేకపోలేదు. కాని 1930 నుండి క్రమముగా భావకవి వేషమును చాలించి శ్రీశ్రీ సరికొత్త ఊపిరిని పీల్చుకొనినాడు. గతితార్కిక భౌతికవాద సిద్ధాంత తత్వముతో సాహిత్యమును దర్శింపసాగినాడు. వర్గ సంఘర్షణము మానవాభ్యుదయమునకు అనివార్యమైనదని విశ్వసించినాడు. ఈ దశలోనే వీరి మహాప్రస్థాన గీతములు వెల్వడినవి. తరువాత 1940లో వీనిని గ్రంథముగా

1. కె. వి. గోపాలస్వామి ప్రసంగం (1942 ఏలూరు పరిషత్తు సభలు).
2. చూ. అనుబంధము.

ముద్రించుట జరిగినది. 'మరో ప్రపంచం పిలిచిందని' ఆవాహన నిచ్చి నయాగరా, శివసముద్రములను తెలుగువారికి చూపించినాడు.

'పదండి ముందుకు పదండి త్రోసుకు
పోదాం పోదాం పైపైకి....' అని ప్రగతిశీలమైన దృక్పథమును అక్షర నిక్షిప్తముచేసి నూతన చైతన్యమున కాద్యుడైనాడు.

## శ్రీశ్రీ - కవితోద్యమము :

సామాజిక చైతన్యమును సాహిత్యములో నింపి కవిత్వమును ఉద్యమముగా మార్చినవాడు శ్రీశ్రీ. అట్లు కాదని భావించుట అవిచార మూలకము విమర్శకులొకరు శ్రీశ్రీ ఉద్యమ ప్రయోజనార్థము కవిత్వము వ్రాయలేదనేయును కేవలము సామ్యవాదముచే ప్రభావితుడైన కవిమాత్రుడేననీ అంచనా వేసినారు. "ఆ ఉద్యమ ప్రయోజనం కోసం శ్రీశ్రీ కవిత్వం వ్రాయలేదంటే అది అసత్యం కాదేమో"[1] ననుట శ్రీశ్రీ స్థాయిని కించపరచినట్లగును శ్రీశ్రీ కవిత్వమును రాజకీయ ఉద్యమమైన 'మార్క్సిజము' ఉపయోగించుకొనినదన్న వ్యర్థ వాదము !!

ఇందలి సత్యాసత్యములను పరిశీలింపవలయుననగా ఉద్యమమునకుం కవికి గల సంబంధమును నిర్ధారణ చేసికొనవలసి యున్నది. కవి సామాజిక చైతన్యముతో ప్రభావితుడగుటయే కాదు, కవి వలన సమాజము మొత్తమును ప్రభావితమై ముందుకు సాగుట కూడ కలదని ముందే మనవి చేసితిని. అప్పుడు ఉద్యమము బాహిరముగా కాక, కవి అంతరంగము నుండియే బహిర్గమించును. అట్లుకాక కేవలము ఇతరులచే ప్రేరణ పొంది కవిత్వము వ్రాయుననుట- ఉద్యమ కర్తృత్వము కవికి అంగీకరింపకుండుట అతనిని న్యూనపరచినట్లు లెక్క ! 'సిద్ధాంతాలకుగాని, దాని తాలూకు రాజకీయాలకుగాని కవిత్వాన్ని తాకట్టు పెట్టడము'[2] కాదిది ! సామ్యవాద స్ఫూర్తి మాత్రమే శ్రీశ్రీ కవనమునకు కారణము కాదు- ఉద్యమ వ్యాప్తికి తాను నాయకుడు కావలయునను జ్ఞాతమైన (Conscious) చైతన్య ఫలితమిది. అందుకు బాహ్యాంతస్సాక్షములు రెండును కలవు.

---

1 2. తెలుగు సాహిత్యంలో సామాజిక చైతన్యం. ఆర్. ఎస్. సుదర్శనం. సౌమ్య ఉగాది సంచిక (ఆంధ్ర పత్రిక) 126 పుట.

పతితులు, భ్రష్టులు, బాధాసర్పదష్టులనైన పీడిత ప్రజావళికి తాను నాయకత్వము వహించి 'మీ కోసం కలంబట్టి' వ్రాయుచున్నానని చెప్పి "ఈ కవితోద్యమానికి ప్రతినిధిగా నిలబడ్డాడు."[1] ప్రతినిధియే కాదు నాయకుడై నిలిచినాడు. కావుననే 'ఇతని అనుయాయులు అనేకులు.'[2] అనుయాయులను కలిగి యుండుట నేతకు లక్షణము. 'సామాజిక విప్లవానికి సాహిత్య విప్లవం చాలన్న' దృఢాభిప్రాయము వారు 'కృత్యాద్యవస్థ'లో స్వయముగా ప్రకటించినారు. శ్రీశ్రీది జ్ఞాతమైన ఉద్యమము! వీరు సామ్యవాదోద్యమమునకు రససిద్ధిని కల్పించుట 'కేవల ప్రభావ' ఫలితముకాదు- బుద్ధిపూర్వకమైన పని!

## మహాప్రస్థానము :

అభ్యుదయ కవితోద్యమమునకు 'మహాప్రస్థానము' పతాక వంటిది! గతితార్కిక భౌతికవాదమునకు తెలుగులో కవితాపరమైన భాష్యమిది. మార్క్సు లెనినుల కలలకిది దర్పణము వంటిది! దాదాపు మూడు దశాబ్దముల కాలము తెలుగు కవులలో గణనీయమైన వర్గమునకు నాయకత్వము వహించిన కృతి యిది. దీనిలో శ్రీశ్రీ ఈ క్రింది అంశములను ప్రముఖముగా దృష్టిలో నుంచుకొనుట గోచరించును :

**1) పేదలపై జాలి :** సమాజములో పతితులు భ్రష్టులు బాధాసర్పదష్టులనైన ఆర్థిక స్వాతంత్ర్యములేని దీనులకొఱకు శ్రీశ్రీ దుఃఖించినాడు. వారిని 'ఏడవకం డేడవకండి' అని ఓదార్చినాడు. 'మీ బాధలు నేనెరుగుదు'నని బంధువై నిలిచినాడు. దారి పక్క 'తనకన్నా శవం' నయమనిపించు ముసలి దానిని అప్పుల బాధతో ఉరిపోసుకొని చనిపోవలెనో, సముద్రములో పడిపోవలెనో, 'తీరని సంధ్యా సమస్య'గా పరిణమించిన సంసారిని వర్ణించినాడు. దీనికి కారణము 'యుగయుగాల దోపిడిలో నరనరాల రాపిడిలో వగదూరిన పొగచూరిన శాసనాల జాడలు జాలిజార్చు గోడలు!' 'అభాగ్యులం మేము'ని వారితోబాటు తాదాత్మ్యము పొందినాడు.

**2) ధనవంతులపై నింద :** ఈ సమాజములోని అవ్యవస్థకు కార

---

1, 2. షాతిక సంవత్సరాల తెలుగు కవిత్వము. 'తెలుగు వ్యాసములు' శ్రీ దేవులపల్లి 109 పుట.

ణము ధనవంతులు! వారు పేదవారిని పిల్చి పిప్పి చేయుచున్నారు.' 'వడ్డించిన విస్తరి' వారి జీవితము. ఈ బలవంతుల దౌర్జన్యాలూ ధనవంతుల పన్నాగాలూ ఇంకానా ఇకపై సాగవని బెదిరించినాడు. 'అటు చూస్తే బాదంహల్వా ఇటు చూస్తే సేమ్యా ఇడ్లీ-ఎంచుకునే సమస్య' కలిగిన వారు వీరు! వీరి కన్నుల చూపులు సరళరేఖలో' నుండును 'రేఖ చెదిరితే గొల్లుమని పోతారు.'

**3) సామ్రాజ్యవాద తిరస్కారము :** వ్యక్తి ధనికుడగుటవలె దేశము పెట్టుబడి దారులకు వశమగుట సామ్రాజ్యవాదమున కారంభము. ప్రపంచము లోని బాధల గాధలకు వ్యధలకు ఇదియే కారణము. శ్రీశ్రీయే కాదు ఏ సామ్య వాదియైనను దీనిని వ్యతిరేకించును. 'నరహంతలు ధరాధిపతులై చరిత్రమున ప్రసిద్ధి కెక్కిరి' 'గతమంతా తడిసె రక్తమున కాకుంటే కన్నీళులతో' జెంఘిజ్ ఖాన్, తామర్లేను, నాదిర్షా ఘజ్నీ ఘోరీ సికిందరో ఎవడైతేనేం? ఒక్కొక్కడూ మహాహంతకుడు 'ఈ పెట్టుబడి కూటాలు కట్టుకదుతున్నాయి- కుట్రలూ కూహ కం చెలరేగుతున్నాయి.'

**4) ఈశ్వరనింద - సంప్రదాయ తిరస్కారము :** ఈశ్వరుడు ధన వంతులు తమకు రక్షకులుగా సృజించుకొనిన అభూతకల్పనము. చట్టములు, శాసనములు, నీతి, సంప్రదాయము ఇట్టివేనని సామ్యవాదుల మతము. 'దేవుడు అధికారులు పాతర్లు సౌఖ్యాలు నీతులు స్వర్గం మర్యాదలు మూట కట్టుకొని కులికే'[1] స్వార్థపరులు ధనవంతులు. వీరు మాయా సిద్ధాంతమును సృజించినారు.

'జమీందారు రోల్సురాయ్‌' 'మహారాజు మనీపర్సు' మాయ అందురు. 'పాలికాపు నుదుటి చెమట, కూలివాని గుండె చెరువు బిచ్చగాని కడుపు కరువు' మాయ అందురని శ్రీశ్రీ నిరసించినాడు. 'ఖడ్గసృష్టి'లో కూడ

'మంచి చెడ్డలను కొలిచే మానదండమటదైవం
ఈశ్వరు డొకడే సత్యం ఇతర సమస్తం మిధ్యట' అని పరిహసించి అనాత్మతత్వము ప్రతిపాదించినాడు.

'నిప్పు దాన్ని కాల్చలేదు ఛిందించగలేదు కత్తి
నీరు దాన్ని ముంచలేదు గాలి దాన్ని చెనకదంట' అని 'నైనంఛిన్దన్తి

1. చెలం - మహాప్రస్థాన పీఠిక.

శస్త్రాణినైనం దహతి పావకః' అను గీతా ప్రవచనమును ఎగతాళి చేసినారు.

'అరవిందఘోష్ట ఆశీర్వదించాడు కదా
ముమ్మిడివరం బాలయోగి ఏమంటాడో
ఆంజనేయ దండకం వల్లిస్తేనో
అన్నట్లు సాయిబాబాకి మొక్కుకోకూడదూ' అను 'దైవచింతనా' భావము 'విషాదాంధ్ర'లో కాలూని నిలిచినది.

'కొంగల్లారా జపం చేయండి - పిల్లి పఠించు మంత్రాలు' అని భారతీయుల మంత్ర తంత్ర జపము ను వెకిలి పనుల క్రింద జమ కట్టినారు.

'ఔను మరి బూర్జువా వర్గానన్నా
పోలీసు రాజ్యం
పూజారి రాజ్యం అన్నా, నాకు విపరీతమైన ద్వేషం' అను పాల్ ఎ ర్ట్ 'ద్వేషగీతము'ను 'ఖడ్గసృష్టి'లో శ్రీశ్రీ అనువదించుటకు కారణమిది. 'మీకు కవిత్వం కావాలా....' 'రామాయణాలూ శర్మిష్టలూ వృద్ధమునులు వ్రాసి అర్పిస్తున్నారు'[1] అటువైపు ! శ్రీశ్రీలో ఇవి కన్పడవు రాబందుల రెక్కల చప్పుడు తప్ప.

**5) జాతీయ తిరస్కారము - అంతర్జాతీయతా ప్రతిపాదనము :-** సామ్యవాదములో దేశభక్తి పాపము. అంతర్జాతీయ కార్మిక రాజ్యమే సత్యము. హద్దులు, సరిహద్దులులేని 'కార్మిక ప్రపంచము రష్యావంటి రాజ్యముల పాలనలో ఉన్నను దోషములేదు. దేశభక్తి దేశములో పెరుగుచున్నదని సామ్యవాద విమర్శకులు బాధపడుట కిదియే కారణము[2] మహాప్రస్థానములో రష్యాను శ్రీశ్రీ ఆహ్వానించినాడు :

"యునైటెడ్ సోషలిష్టు సోవియట్ రాజ్యం
స్వాతంత్ర్య శత్రువుల గుండెల్లో బల్లెం....

1. చెలం. యోగ్యతాపత్రం. మహాప్రస్థాన పీఠిక.
2. అభ్యుదయ యుగం అనంతరం. కె వి. రమణారెడ్డి. సౌమ్య ఉగాది సంచిక. ఆంధ్రపత్రిక.

అనంత ప్రపంచం అంతటా నీవై
నీ గొడగు నీడల్ని సాగించు రష్యా !!"

అట్లే వ్యాసవాల్మీకి కాళిదాసులను కాక అంతర్జాతీయ సామ్యవాద కవులనే స్మరించినాడు.

'పుష్కిన్ గొగోల్ షెకోల్ టాల్‌స్టాయ్
డోస్టోవిస్కీ, గోర్కీ, కూప్రిన్ శిల్పసమ్రాట్టులు'

స్విన్‌బర్న్ కవికి నీరాజనమర్పించినాడు. తరువాత 'ఖడ్గసృష్టి'లో కూడ పాల్ ఎలార్ట్, సాల్వడార్ డాలి, జేమ్స్‌జాయిస్ లూయీమేక్‌నీస్, ఆంద్రీబ్రెటన్, అస్రీమీగో, క్రిస్టఫర్‌లోగ్, డిలాన్‌థామస్, నికోలాయ్ నెక్రాసోవ్, వ్లాడిమర్‌మయకొవస్కీ ప్రభృతుల రచనలను నన్నయగారు వ్యాసుని అనువదించినట్లు అనువదించినాడు. దీనికి అంతర్జాతీయ సామ్యవాద దృక్పథమే కారణము 'ఆంధ్రత్వం శాపా'మని హృదయపూర్వకముగా ప్రవచించుటలో భారతీయునిగా జన్మించుట, ఆంధ్ర రాష్ట్రములో నివసించుట ఎంత బాధాకరములో స్పష్టము చేసినాడు 'చీనీతో చీనాతో స్నేహ'మని 'ఆఖరిమాట మొదటి మాట' ఖండికలో వ్రాసినారు.

**6) సిద్ధాంత ప్రతిపాదనము :** మహాప్రస్థానములోను, ఖడ్గసృష్టిలోను శ్రీశ్రీ సామ్యవాద సిద్ధాంతములను విస్తృతముగా ప్రతిపాదించినాడు. 'నరజాతి చరిత్ర సమస్తము దరిద్రులను కాల్చుకు తినడ'మనుటలోను 'ధనికస్వామికి దాస్యంచేసే' కార్మికుని 'ఘర్మజలమనకు' ఖరీదు కట్టెడి షరాబు లేడనుటలోను వర్గసంఘర్షణ సూచింపబడినది. 'పరస్పరం సంఘర్షించిన శక్తులలో చరిత్ర పుట్టెననుట' సామ్యవాద సిద్ధాంతమును యథాతథముగా ప్రతిపాదించుటయే.

'ఏ యుద్ధం ఎందుకు జరిగెనో
ఏ రాజ్యం ఎన్నాళ్లుందో
తారీఖులు దస్తావేజులు
ఇవి కావోయ్ చరిత్రకర్థం
ఈ రాణీ ప్రేమపురాణం
ఆ ముట్టడికైన ఖర్చులూ

మతలబులూ కైఫీయతులూ
ఇవి కావోయ్ చరిత్రసారం-
.... .... .... .... ....
తాజమహల్ నిర్మాణానికి
రాళ్లెత్తిన కూలీలెవ్వరు?' అను ప్రశ్నలో రసము, అలంకారములు, మాటల మేలిముసుగులు, వ్యంగ్యము, ధ్వని ఏమియును లేకుండ సామ్యవాద సిద్ధాంతమును కుండబద్దలు కొట్టినట్లు చాటినాడు. అట్లే ఖడ్గసృష్టిలో కూడ 'ఆశయం సాధించాలంటే ఆయుధం అవసరమని' రక్త (ఖడ్గ) విప్లవమును ప్రతిపాదించి 'ఆశయాలు సంఘర్షించే వేళ ఆయుధం అలీనం కాద'ని చాటినారు. 'ఒక వ్యక్తికి మరొక వ్యక్తి ఒక జాతిని వేరొక్క జాతి పీడించే సాంఘిక ధర్మం ఇంకానా ఇకపై సాగదు.'

**7) ఉద్యమమునకై ఆరాటము :** ప్రగతిశీలమైన శ్రీశ్రీ ఉద్యమము వ్యక్తులను శక్తులనుగా మార్చునది. దారి పొడుగునను గుండె నెత్తురులు తర్పణ చేయుచు ముందుకు, పైపైకి మరో ప్రపంచపు పిలుపునందుకొని సమష్టిగా సాగిపోవునది. 'బాటలు నడిచే పేటలు కడచే కోటలన్నిటిని దాటండి! నదీనదాలూ అడవులు కొండలు ఎడారులా మనకడ్డంకి' అనుటలో ఉద్యమశీలమైన ప్రగతి వాంఛ గోచరించును. 'భూకంపాలు ప్రభుత్వ పతనాలూ విప్లవం యుద్ధం అన్నీ నీ చైతన్యం' అని 'కవిత'ను ప్రశంసించుటలో సామాజిక చైతన్యము శ్రీశ్రీ కవితా వస్తువుగా ఎట్లు చెరగని ముద్ర నద్దినదో వ్యక్తమగును. 'ప్రపంచం బాధ శ్రీశ్రీ బాధ' అని చెలం 'యోగ్యతాపత్రములో' వ్యక్తీకరించుటలో కూడ ఇది స్పష్టమగును. 'శ్రీశ్రీతో ప్రారంభమైన ఉద్యమం అభ్యుదయ రచయితల ఉద్యమంగా దేశంలో 1945 ప్రాంతాలని పెరిగింది. ఈ ఉద్యమావేశంలో బుర్రకథలూ పాటలూ వ్రాసేవా రనేకులు'[1] వచ్చినారు. వారు కాక శ్రీశ్రీ కి అనుయాయులై కావ్యనిర్మాణ కౌశలులైన కవులను గూర్చి ప్రస్తావింతును!

**ఇతరులు :-** శ్రీశ్రీ తో కావ్యవస్తువులలోను అలంకారములలోను కవిత్వాదర్శములోను మహత్తర పరివర్తనము సిద్ధించినది. కుక్కపిల్ల, సబ్బుబిళ్ల,

1. '25 సంవత్సరాల తెలుగు కవిత్వము' 'తెలుగు వ్యాసములు' శ్రీ దేవులపల్లి. పుట. 110.

అగ్గిపుల్లలు కూడ కవితా వస్తువులుగా నుండవచ్చునని శ్రీశ్రీ నుండి నవకవులకు 'హామీ' లభించినది. వర్గసంఘర్షణమును సూచించెడి భాష అలంకారములు. సలసల మసిలే ఉష్ణరక్త కాసారములు కవిత్వములో ప్రవహింపజేయుటే కావ్య శిల్పమను భావన ప్రబలినది. 'పులి చంపిన లేడినెత్తురు'ను గరిష్ఠ స్వరూపములో సమాజమునకు ప్రదర్శించుటయే కవిత్వాశయము 'శ్రామిక జీవులకు నిత్య మంగళము' నిర్దేశించుటే పరమాదర్శము !

కావుననే ఈ పథములో తదనంతరము పుంఖానుపుంఖముగా రచనలు వెలువడినవి. పఠాభి 'భోగంచాన'పై సానుభూతి చూపి నూతన కవితా వస్తువు ప్రసాదించినాడు. 'పరపురుషుని జూచి తల వ్రాల్చే పతివ్రత సతీత్వమబద్ధం, యోగులబద్ధం అందరూ అబద్ధం, సర్వమబద్ధం, కానీ నీవుమటుకు ఓ భోగంచానా ముసుగులేని నిష్ఠురమగు నిజానివి' అట్లే నవసమాజములోని 'నటర్షి చూడామణి' ప్రశాంత ముఖముతో 'బల్బుహారన్ల తాళంతోటే యలక్ట్రిక్ హారన్ల రాగానికిన్నీ మోటారు సయికెళ్ల మృదంగానికి నీ అనుగుణంగా 'భరతనాట్యం బాడుతున్న' 'పోలీసు భటుడు' మరొక ఇతివృత్తము. ఏల్చూరి సుబ్రహ్మణ్యము 'చిల్లి రాగి డబ్బునకై; చించిన; కంటిచేతి నీడలోన; ఆడుతు కురుపుకు మూగిన; ఈగకన్న; హీనంగా; ధనికుని; గడపముందు; పెరిగే తిరిగే మొరిగే; నరాధముని; గ్రుడ్ల ఎరుపు మ డుబెండ"ను వర్ణించినారు కొనకళ్ల వేంకటరత్నం 'సిపాయి' అను గేయములో

'నీచిందిన నెత్తురుబాట । రారాజుల నవ్వులతోట
నీ త్రెళ్లిన గ్రుక్కెడు ప్రాణం । రాజ్యాంగపు తొలిసోపానం
నీఅస్థులు విస్మృతి పాలై । యుగసంధుల వంతెనలైనై' అని విల పించినారు !

"నీవలెనే ఆకలి వ్యథతో । తనువమ్మిన తమ్ముని యెదలో
నీదూసిన నెత్తురుబాకే । వినివచ్చిన కథ విన నీకే
రణభేరికలో ఉద్రేకం । రణగీతికలో ఉత్తేజం...."

మల్లాది సాంబశివరావు కార్మిక కర్షకులకు న్యాయము జరుపలేని దేవునిని నిరసించు చు

"నుసిగా కడుపుకేని సరిపడన్ తిననీక
పిసినిగొట్టుల యింట పసిడి నిలవుంచడమ్
గోడుగోడున యేడ్చి కూడుగుడ్డలు లేక
మాడిపోయెడి జనుల మచ్చ మాయించడమ్....
ఇట్టి బుద్ధులు దేవ! ఎటు పట్టుబడెనోయి
వట్టి పుణ్యానికే ప్రజల నేడ్పించడమ్...." అనుటలో నిరీశ్వర ప్రతిపాదనమే కవి హృదయాంతరములలోని భావము. అట్లే 'బాలీసునానుకొని' ఊరేగవచ్చిన దేవుని 'కూలి డబ్బులు చాలవని' అడుగమని మఱొక కవి అనుటలో కూడ ఇదే భావమున్నది!

ఉద్యమము తీవ్రమైన కాలదియును కళాకారులందరును ఆ ప్రభావమునకు లోనై ప్రవాహగమన వేగముతో ముందుకు కొట్టుకొనిపోయెదరు! అడవి బాపిరాజుగారు 'మీజాన్' పత్రికలో ప్రవేశించి అభ్యుదయ రచనలు ప్రోత్సహించినారు. నవసమాజమునకై 'మరో ప్రపంచము'నకై అందరును కలలు కనినారు. "ఈ కాలములో ప్రచార వాఙ్మయం చాలా అవసరం. దీనికోసం అందరూ ప్రయత్నించాలి. పాత ప్రపంచం శిధిలమై ఆ స్థానంలో కొత్త ప్రపంచం ఉద్భవిస్తున్నది ... పీడింపబడేవాళ్లూ పీడించేవాళ్లూ ఉన్న ఈ సమాజం ఇలాగే ఉండాలని ఎవరూ కోరరు."[1] కావుననే నాడు కవులందరును పీడిత ప్రజావాణికి 'మైక్' అమర్చి నిలబడినారు.

ఆరుద్ర 'మొయ్యోయ్ మొయ్యోయ్' వంటి గీతములు రచించినారు. సామ్రాజ్యవాదియైన నిజాం పాలనకు వ్యతిరేకముగా కావ్యము వెలయించినాడు. నగరములోని క్లార్కు సూర్యారావు పేదరికమును హృదయ విదారకముగా చిత్రించినాడు. ఇతివృత్త సహితమైన అతి నవ్యకావ్యమిది! రమణారెడ్డి 'అడవి', 'భువనఘోష' అను రెండు కృతులలోను సామ్యవాదము, అందునను 'చైనామార్క్స్' వాదమే దేశమునకు శరణ్యమని చాటినారు. 'పాడుతా శ్రీశ్రీ గురించి మీటుతా వందన విపంచి' అని తన కవితా గురువును సంస్మరించినాడు. దాశరథి 'అన్నార్తులు అనాథులుండని ఆ నవయుగ మదెంత దూరమో' నని శోకించినారు.

1. దేవులపల్లి రామానుజరావు.

'గదులు గదులయి అరలయి ప్రిదిలి చిదిపి
బ్రతుకు విలువయి నశియించి పాడువడిన
నేటి స్వార్థ ప్రపంచము నిండ విష్ణ
వాగ్నుల తుఫానులేపి శూన్యమొనరింతు'నని తన ప్రళయభావమును వ్యక్తీకరించినాడు. 'భూపావళి బుగ్గిచేసి కోపావళి నగ్గి ద్రోసి దీపావళి జరపండో' యని కంఠమెత్తి అరచినాడు. 'స్వకుక్షింభర రక్ష స్తతిపక్షాలను విరగ్గొట్టి సమిధలుగా లేతెండోయ్' అని పొలికేకపెట్టి 'నా గీతావళి ఎంతదూరము ప్రయాణంబౌనో అందాక యీ భూగోళమ్మున కగ్గిపెట్టి దనుద్యోమణ్యుష్ణ గోళమ్ముపై ప్రాణాకాశ నవారుణా స్రజల ధారల్‌చల్లి చల్లార్చెదన్' అని జగమును మండించుటకు సిద్ధపడినాడు! 'అగ్నిధార', 'రుద్రవీణ' వంటి కృతుల అవతరణ కిది హేతువు! అట్లే నాటి సి. నారాయణరెడ్డిగారి గీతములును అభ్యుదయ చైతన్యముతోనే పెల్లుబికినవి!

అనిసెట్టి 'వ్యాససంతతివాణ్ణి' అను గీతములో :

'వచ్చాను వచ్చాను వ్యాససంతతివాణ్ణి। వెళ్లిపోయిన కోటికోట్ల జీవుల విడిచి కుళ్లిపోయే కోటికోట్ల జీవుల కొరకు। పొర్లివచ్చే కోటికోట్ల జీవుల కొరకు' అనుటలో సామాజిక భావన సువ్యక్తము! 'ఓ వత్సరాంతవ్యథాకృతీ, ఉరి త్రాడు పీసి బిగించి మా కొనప్రాణమే గుంజుకోదలచితివా' యని తమ 'వ్యథా కవిత' గీతము నాలాపించినారు.

నాడీ మహోద్యమమునకు నడుము బిగించి నిలిచిన వారిలో తాపీ, అనిసెట్టి, సోమసుందర్, కుందుర్తి, రెంటాల, ఆరుద్ర, రమణారెడ్డి, పఠాభి, చదలవాడ పిచ్చయ్య ప్రభృతు లెందరో కలరు. వీరి స్ఫూర్తి నామకులను ఆచామకులను కూడ ఉడుకులెత్తించినది. ఉద్రూతలూగించినది. ఉద్యమ లక్షణమది!!

వాసిరెడ్డి నాగేశ్వరరావు అను రైల్వే కార్మికుడు వ్రాసిన 'కూలోడు' అన్న గేయము అందరిని ఆకర్షించినది. అట్లే సెట్టిపల్లి వేంకటరత్నముగారు 'అగనా జీవాలు, సాగునా లోకాలు' అను గీతమును లోకనాథం గారు 'రైతు కూలీ' అను రచనమును, గరిమెళ్ళ సత్యనారాయణగారి 'అన్యాయకాలంబు దాపురించిందిపుడు అందరము మేలుకోవాలండీ' అను ప్రజాగీతమును జనుల యెదలలో ఎఱ్ఱని సెగలను రగిలించినవి. 'నడి గూడెపు నరకాసురు వెంకటగిరి సంకటాలు

చల్లపల్లి దోపిళ్లా భూస్వాముల పరపళ్లా' అని అరుణకుమార్ ప్రజాశక్తిలో 1948 లోనే జమీందార్లపై తిరుగుబాటు సాగించినాడు. నారపరెడ్డి 'ఓ చైనా లా చైనా నవచైనా, ఈ విజయం నీదేనా' అని పొరుగున కల చైనాలో సామ్య వాద ప్రభుత్వ మేర్పడుటను చూచి అరుణ నీరాజనముల నర్పించినాడు! 'మా భూమి'యను సామ్యవాద నాటకము గ్రామ గ్రామమునను వీధివీధిని ప్రద ర్శింప బడినదన్నచో ఉద్యమమెంత తీవ్రముగా సాహిత్య రూపమున ప్రచారము నందినదో సుస్పష్టము.

ఈ దశలోనే తెక్కలేలన్ని ప్రజాగీతములు ఇంటింటను పాడబడినవి. 'జీవకళ లేదాయె కేరళా రాష్ట్రంలో చిన్నబోతూ వుందిరా సోదరా చిన్నబోతూ వుంది రా.' అని ఒక సామ్యవాద నాయకుని అస్తమయ సమయమున వ్రాసిన ప్రజాగీతము 1947 లో కుగ్రామములో సామ్యవాదుల భార్యలు హార్మో నియం'పై వాయించుటను నేనెఱుగుదును. ఇట్లే పెనుమర్తి 'కబేళా' సూరిసెట్టి 'రైతోడా' బాలాజీ 'ముద్దరాలు' యర్రోజు మాధవాచారులవారి 'అద్వైతం' ధవళా శ్రీనివాసరావు 'మతమౌఢ్యం' శ్రీకృష్ణ 'తెలుగోడా', తుమ్మల 'లంగరెత్తు' అంజనేయ ప్రసాద్ 'కదలండి' ధనకుధరం 'ప్రజా సముద్రం పొంగింది' 'పిడుగుదెబ్బ' బాగి నారాయణమూర్తి 'స్వాహా' పొట్లపల్లి 'జీవితము' ఏల్చూరి (ఏ. సు.) 'ప్రజాశక్తి' ఓగేటి శివరామకృష్ణ ముత్తేదోయ్' గడియారం రామ కృష్ణశర్మ 'అగమ్యాశ్రమం' 'చిరంజీవి' 'దేశం మాట్లాడింది' కొనకళ్ళ గేయాలు. క్రాంతి పదాలూ వందలుకాదు వేల సంఖ్యలో అభ్యుదయ కవులచే ఉత్పత్తి చేయ బడినట్లుగా వచ్చి తెలుగునాట వెచ్చని లావాలను ప్రవహింప జేసినవి!

## కథా కావ్యములు :

అభ్యుదయ కవితోద్యమ మెంత తీవ్రముగా నున్నను కథా కావ్యములు మాత్రము తక్కువగానే వచ్చినవి. గంగుల సాయిరెడ్డి వ్రాసిన 'కాపుబిడ్డ', నాగభైరవ శివరామకృష్ణ వ్రాసిన 'విద్యుల్లత' ఈ కోవకే చెందినవి. తరువాతి కాలములో విద్వాన్ విశ్వంగారు మానవతా దృక్పథముతో వ్రాసిన 'పెన్నేటి పాట' కూడ కష్టజీవియైన రాయలసీమ రంగయ్య జీవిత కథ కావున అభ్యుదయ వస్తు కావ్యములలోనే చేర్చ వచ్చును. అట్లే ఆరుద్ర 'త్వమేవాహమ్' తెలంగాణా పోరాటమునకు సంబంధించిన దైనను సామ్రాజ్యవాద వ్యతిరేక ధోరణియే ఆరుద్ర

దృక్పథము కావున ఇది కూడ అభ్యుదయ వస్తు కావ్యము క్రిందనే లెక్క! ఇట్టింకను ఎన్నియో అనంతర కాలములో వచ్చినవి!

## విమర్శలు - పురోగమనము :

అభ్యుదయ కవిత్వమెంత తీవ్రముగా వచ్చినదో ప్రతిఘటనము కూడ అంతే తీవ్రముగా అన్ని వైపుల నుండియు నొకేసారి వచ్చినది[1] భావకవిత్వమును ఉమాకాన్త విద్యాశేఖరాదులు 'బావ' కవిత్వమని అభావ కవిత్వమని పరిహాసమాడిన దానికన్నను తీవ్రముగా అభ్యుదయ కవిత్వములో కవిత్వమే లేదని నిందించినారు. వీరి వాదమేమనగా W.H. Auden, C Daylewis, Stephen Spender ప్రభృతులు సామ్యవాదమును బలపరచుచు కవిత్వ మారంభించి రెండవ ప్రపంచ యుద్ధముతో వారి కలలు మరుమరీచికలుగా మారగా సామ్యవాదమును త్రోసిపుచ్చినారు.[2] అట్లే "దాశరధి. నారాయణరెడ్డి, పిలకా గణపతి శాస్త్రి, సింగరాచార్య, కరుణశ్రీగార్లు అప్పట్లో అభ్యుదయ కవుల జాబితాలో చేర్చబడ్డారు. వీరు కమ్యూనిష్టులని కాని వీరికి మార్క్సిజంలో నమ్మకముందని గాని అనుకోవడం వంటి అసత్యం ఇంకొకటి ఉండదు"[3] అని వ్యాఖ్యానించినారు. కాని హేతువాదమునకీ విమర్శ నిలువదు. ఒక కవి అనంతర కాలములో తన కవిత్వాశయములను, నమ్మకములను మార్చుకొనినంత మాత్రమున ఇతః పూర్వము వ్రాసినది కవిత కాకపోదు. అట్లే ఉద్యమముచేత ప్రభావితుడైన ఒక కవి ఒకానొక సిద్ధాంతమునకుపబలకముగా నుండెడి ఒక రచనము చేసినంత మాత్రమున జీవితాంతమును అదే సిద్ధాంతము నంటిపెట్టుకొని ఉండవలెననుట పొసగదు. సి. నారాయణరెడ్డిగారు 'వెన్నెలవాడ'లో భావకవిత్వమును గేయములలో అభ్యుదయ కవిత్వమును అనంతరము శృంగార కవిత్వమును,

---

1. "ఒక నూతన సృష్టి ఎంత చేవగలిగినదైతే దానికి అంత ఎక్కువగా వ్యతిరేకత వస్తుంది" వర్తమాన సాహిత్యం-పోకడలు కుందుర్తి. సౌమ్య ఆంధ్రపత్రిక ఉగాది సంచిక పుట. 151.
2. స్టీఫెన్ స్పెండర్ 'The God that failed' అనెడి గ్రంథముతో తానేల సామ్యవాదమును తిరస్కరించినారో వివరించినారు.
3. అభ్యుదయ కవిత్వములో కవిత్వ పరిశీలన అక్టోబరు 68. భారతి 56 పుట. (జానకిజాని),

ఆపై దేశభక్తి కవిత్వమును, అత్యాధునికముగా రెండవ తెలంగాణా సంఘర్షణలో గేయములను రచించినారు. ఇట్లే విశ్వనాథ సత్యనారాయణ వంటి వారి రచనలను ఉన్నవి కావున సాధారణ నిర్వచనముతో కవులకొక లక్ష్మణరేఖ గీచి 'వీరు కేవలము ఈ వర్గమునకు చెందిన కవుల'ని ఉద్యమ పరిశీలకుడు నిర్ణయింపలేడు !

'కాటూరు యలమర్రు కడలూరు' అన్న మరొక గేయములో 'ఎర్రజెండా ఎగరేస్తూ కొడవలి ఝుళిపిస్తూ, సందులను గొందులను చవిటి సంస్థలను, అవిటి గోడలను అనేకం, శతఘ్నితో పేలుస్తూ, రాలుస్తూ' సాగెదమని నాదొక కవి, ఇందేమి కవిత్వమున్నదని ప్రశ్నించినారు. 'సమగ్రమైన ఆంధ్ర సాహిత్య చరిత్ర రచింపబడితే అభ్యుదయ కవితోద్యమానికి చారిత్రక ప్రాధాన్యం (Historical Importance) మాత్రమే' కలదని విమర్శించినారు. కాని విమర్శలు అభ్యుదయ కవితోద్యమము నాపక పోగా, పురోగమనమునే ఇనుమడింపజేసినవి. ఏ ఉద్యమమునకైనను చారిత్రక ప్రాధాన్యము తదనంతర కాలములో ఉండుట సహజమే కాని అది అవలక్షణము కాదు !!

## విదేశీయ ప్రభావములు :

అభ్యుదయ కవితోద్యమ మూలసూత్రములు వైదేశికములని ముందే మనవి చేసితిని. కావుననే అభ్యుదయ కవిశేఖరులు వైదేశిక గీతములను యథా మాతృకముగనో యథేచ్ఛగనో అనువదించిరి లేదా అనుసరించిరి ఇట్టివి 'మహాప్రస్థానము'లో ఎన్నియో కలవు 'పేదలు' అను గేయము (Emile Verbearen వ్రాసిన Les pauvres అను గేయమునకు యథా మాతృకమైన అనువాదము. 'అద్వైతము' అను గీతము ఏ. సి. స్విన్‌బర్న్ 'A Match' అను గీతముతో చూపిన మార్గము ననుసరించి వ్రాయబడినది ! ఇట్లే మూలకర్తల పేర్లు చెప్పకుండగనే చేసిన అనువాదము లెన్నో కలవు. 'ఖడ్గసృష్టి'లో అధిక భాగము అనువాదములే. మూలకర్తల నామములు దాహృతములు ! కొందఱు సామ్యవాద సూత్రములనే కవిత్వములోనికి పరివర్తనము చేసిరి.[1]

---

1. 'నిరుపేదవు నీకు పోయే పోయేదేమీ లేదు నిగళాలు తప్ప' అను ఒక కవి వాక్యము 'You have nothiug to loose but your fetters' అను పంక్తికి అనువాదము. (అభ్యుదయ యుగానంతరం. కె.వి. రమణా రెడ్డి. సౌమ్య ఉగాది సంచిక.)

ఇట్లుగాక విదేశీయ గీతములలోని ఛాయలను స్వీకరించి తెలుగులో కవితను వినిర్మించినారు. ఆడెన్, డేలూయిూస్, మాక్‌నీస్ స్పెండర్ ప్రభృతుల ప్రభావము అభ్యుదయ కవులపై విపరీతము! నారాయణబాబు తన గేయములో చుట్టునున్న సమకాలీన సమాజమును, దాని దుర్గతిని చూడమని ప్రబోధించినాఁడు భావ కవులను విమర్శించినాడు! 'కొమ్మలు తలలూపగ కమ్మని కోకిలకూజితాలకు. వెన్నెల విహారములకు కన్నెగాలికౌగిళ్ళకు' ఇది కాలం కాదండి' స్టీఫెన్ స్పెండర్ చెప్పిన ఈ క్రింది వాక్యములకు పూర్తిగా వచన పద్యరూపమే పై పంక్తులు : **They had cartain idias incomm on. The conciously attempted to be modien cheesing in Their poems imagery Selected frem machinery slums end to the social conditions which surrounded Them'**

కుందుర్తి 'గట్టిగా నువ్వు రమ్మంటే రేపే వస్తుంది కాంతి' అను మాటల కర్థమేమి? మానవుడు అనేక కారణములవలన 'గట్టిగా' రమ్మని పిలువలేకపోవుచున్నాడు. శ్రీశ్రీ కూడ అట్టి సోమరిని 'చావు'మని శపించినాడు దీనికి **Auden** వ్రాసిన యీ పంక్తులు మూలము: **'These moode give ne permission to be idle for me are changed by what they do'**

శత్రువులను పేరుపేరున తిట్టవలయునని లెనిన్, స్టాలిన్‌లవద్ద నుండి చంద్ర రాజేశ్వరరావు ('పార్టీ నిర్మాణం') వరకు బోధించినారు. **'The eraterea'** లో **Auden** ఇట్లనినాడు : **'Beware of those with no obvious vices of the chaste the non smoker and drinker, the vegitarian. Be-ware of those who show no inclination towards making money'.** కుందుర్తి 'వ్యత్యాసాలు' అను గేయములో దేవునికి ఉత్తరము వ్రాయుచు : 'తను తప్పు చేస్తూ శివశివా అని నా కండ్లు మూసే యోగి - నీకు వాడు మహాభక్తుడు నేను వాణ్ణి సహించను తిండిలేని వాళ్ళకు తృప్తి విషం పెట్టడానికి ఒకపూట ఉపవాసం చేసే భోగి - నీకు వాడు మహాభక్తుడు - నేను వాణ్ణి సహించను' అని తీవ్రముగా నిందించుటకు హేతువిది!

సామాన్యుని జీవన చిత్రణమే అభ్యుదయ కవిత్వమునకు వెన్నెముక. ఇది రష్యానుండి ప్రసరించిన భావము! టాల్‌స్టాయి షేక్స్పియరు గూర్చి అనిన మాటలివి : **"The content of Shakespear's plays in the lowest most vulgar view of life which regards the external elevation of the great ones of the earth as a genuine superiority. Despises the crowd that is to say the working classes"** అభ్యుదయ కవితోద్యమమున కివి వేదవాక్యములు ! లెనిన్ **'Down with supermenliteratures - literature must come a component past of work'** అను వాక్యము సోమసుందర్ 'బానిసల దండయాత్ర'లో ఇట్లు పరివర్తనము చేసినారు. "రెండు ప్రపంచాల మధ్య రెరిడే లోకాల మధ్య సాగుతున్న సంఘర్షణ। యుగధర్మం గుర్తించని ప్రజాకాంక్ష చూడలేని అధికారపు దివాంధాలు తమ స్వారీ సాగించగ సడలుతున్న సంకెళ్లను విడిపోయే కర్ణెములను సవరించే యత్నమొకటి॥ యువశంఖం పూరిస్తూ భవిష్యత్తు నాశిస్తూ, సమధర్మం స్థాపింపగ పరపీడన మంతరింప నరులంతా సౌఖ్యాలను పంచుకొనే వ్యవస్థకై సాగించే యత్నమొకటి॥" శ్రీశ్రీ 'స్వాతంత్ర్యం సమభావం సౌభ్రాత్రం సౌహార్దం పునాదులై ఇళ్లులేచి జనావళికి శుభం పూచి కాంతి కాంతి కాంతి కాంతి జగమంతా జయిస్తుంది' అనిన వాక్యములకిదియే స్ఫూర్తి !! ఉద్యమము లొక దేశమునుండి మరొక దేశమునకు పయనించుచుండును. వానికి దూరతీరములు లేవు ! కాల యవనిక వానిగతి నొక ప్రాంతమునకే సీమితము చేయజాలదు !

## ఉపసంహారము :

పుట్టుట యున్నచో గిట్టుట సహజమని యర్థము. మానవునికే కాదు ఉద్యమములకైనను అంతియ ! అంతర్జాతీయ రంగములో సామ్యవాదపు వేడివాడి, వాడిపోసాగినది. నెహ్రూ ప్రతిపాదించిన 'ప్రజాస్వామ్య సమాజవాదము' రష్యా నమూనా సమాజము భారతదేశమునకు తగదని చెప్పినది. 1955 ఎన్నికలలో ఆంధ్రదేశములో కమ్యూనిస్టు పార్టీ పొందిన పరాజయము అభ్యుదయ కవితోద్యమమునకు గొడ్డలి పెట్టువలె పరిణమించినది. 1962లో చైనా దండయాత్రతో సామ్యవాదముపై భారతీయులకు అసహ్యము వేసినది. తోటి సామ్యవాద దేశ

మైన జెకొస్లొవేకియాపై రష్యా దురాక్రమణ చేయుటతో దేశములోని సామ్య వాదులే తమ ఉనికిని తాము సమర్థించుకొనుట మానివేసినారు ! ఉద్యమ మెప్పుడును సిద్ధాంతము యొక్క జీవన్మరణములపైనే ఆధారపడి యుండును. అభ్యుదయ కవిత్వోద్యమము ఇందుల కపవాదము కాజాలదు. "పితూరీదారుల్లో కూడా అభ్యుదయాంశ అజ్ఞాతవాసం చేస్తున్నది అరణ్య అజ్ఞాతవాస పర్వాలు యుద్ధ పర్వాలకు తావీయక తప్పనిరోజు ముందుంది"-1 ఉదా: భవిష్యత్తులో యుద్ధ పర్వము దీర్ఘదర్శులకు కన్పడినదేమో కాని, ప్రస్తుతమునకు మాత్రమీ యుద్యమమున శోకసహజమైన ముగింపే వచ్చినది.

# అతినవ్య కవిత్వోద్యమములు

అభ్యుదయ కవితా యుగము తర్వాత ప్రారంభమైన యుగమునకు నేటి వరకును తత్వనిర్దేశము, నామకరణము చేయుటలో విమర్శకులు వైవిధ్యము ప్రదర్శించినను అతి నవ్యకవిత్వోద్యమములు ప్రారంభమైనవని నిర్ణయించుటలో మాత్రము పెక్కురిలో ఏకీభావము కుదిరినది. ఒక విధముగా, భావకవిత్వముపై అభ్యుదయ కవిత్వము తిరుగుబాటు కాగా, ఉద్యమ శీలముతో అతినవ్యధోరణులు అభ్యుదయ కవిత్వముపై కూడ తిరుగుబాటును ప్రకటించినవి. వాని క్రమ వికాసమును పరిశీలించుటకు ముందుగా అతినవ్య కవిత్వోద్యమముల వెనుకనున్న విప్లవ కారణములను స్ఫూర్తిదాతలను ప్రస్తావించి తత్వనిర్దేశము చేసెదను !

**కారణములు :** కాల్పనిక కవిత్వము మానవుని నిత్యజీవిత సమస్యలను పరిశీలించుట లేదనియును వర్గకలహ సిద్ధాంతమే ముక్తి నొసంగగలదనియును భావించి ఆధునిక యుగములోని రెండవ తరము మేధావులు అభ్యుదయ కవిత్వోద్యమము నాలంబనముగా చేసికొనిరి. కాని వారి కందును శాంతి కాంతి లభింపలేదు. అందువలన అన్వేషణ మంతటితో ఆగలేదు. ఇది ప్రపంచవ్యాప్తముగా జరిగిన పరిణామము, సైద్ధాంతికముగానేమి స్వరూపములోనేమి వైచిత్రీ ప్రయోగములో నేమి అభ్యుదయ కవితా 'జగన్నాథ రథచక్రాల్' అతి నవ్యుల ఊహల ఉడ్డీనముతో రెక్కలు కట్టుకొని రిక్కలలోనికి ఎగురలేకపోయినది.

---

1. భవిష్యత్తులో కవి. అభ్యుదయముగానంతరం. కె. వి. రమణారెడ్డి సౌమ్య ఉగాది సంచిక. 163 పుట.

కావుననే నూతన కవితాశ్రయములు, కవితోద్యమములు, కవితా స్వరూపములు, స్వీయమైన అలంకారములు, వర్ణనలు తమకై తామే అతినవ్యులు సృజించుకొని నారు !

**విశ్లేషణ :** అతినవ్య కవితా ధోరణులను ఆర్థికముగ, శాబ్దికముగ విశ్లేషించి చూచినప్పు డీ క్రింది తత్వములు గోచరించును.

1) మానవుని వైయక్తిక జీవితమునకు విశేష ప్రాముఖ్యమిచ్చుట.[1] అతనినే సాక్షాత్తు దైవముగా భావించుట. ఆతనిని కేవల భౌతిక (ఆర్థిక) రాజకీయ జీవిగానే కాక మానసిక జీవిగా భావించుట సిగ్మండ్ ఫ్రాయిడ్, యుంగ్ ఆడ్లర్, పావ్లావ్ మొదలగువారి ప్రభావమిందులకు కారణము.

2) సాంఘిక జీవనమునకు ఆర్థిక వికాసమునకును ప్రాధాన్యమిచ్చుట వికసించిన సాంఘిక ఆర్థిక శాస్త్రములు శాస్త్రవేత్తలు ఇందుకు కారణము.

3) జంతుశాస్త్రము, వృక్షశాస్త్రము భౌతిక రసాయనిక శాస్త్రములలోని పరిశోధనలతో మానవ జీవితమును పోల్చిచూచుట.

4) మానవుని దేశకాలముల కతీతముగా చిత్రించుట. ఇందుకు ఐన్‌స్టీన్ ప్రభృతుల ప్రభావము కారణము.

5) లలిత కళాతత్వముల నన్నిటిని (చిత్రకళాదులను) సాహిత్యమునకు సమన్వయించి చూచుట.

6) అస్తిత్వవాదమును ప్రధానముగా స్వీకరించుట. సార్త్రే ఇందుకు మూల కారణము. ఇట్లే శాబ్దికముగా అతి నవ్యధోరణులివి :

1) శబ్ద ప్రయోగములో అనూహ్యమైన పరిణామములు సాధించుట. అ) సమాస కల్పనము, ఆ) వాక్య నిర్మాణము, ఇ) అలంకారము, ఈ) ఛందము. వీనిని సోదాహరణముగా వివరించుటకు ముందు అతి నవ్య కవిత్వమునకు జీవనాడులవంటి మౌలికమైన తత్వములను వివరింతును.

---

1. "మనోవైజ్ఞానం వైయక్తిక పరివేషములకు ప్రాముఖ్యము, భర్త్యనము, అవసానము, కుంఠ, అతృప్తి మొదలైన లక్షణాలు ప్రయోగ వాదులలో వ్యక్తమవుతవి" డా. సుప్రసన్న చేతనావర్తం. భూమిక.

**మానవతా వాద ప్రభావము :** అత్యాధునికముగా మార్క్సును కూడ అధిగమించి మానవతా వాదము వృద్ధి పొందినది పూర్వము మానవుడు దేవతల సహాయముతో ఐహిలోక కార్యములు సాధించెడివాడని, తాను చేయలేనివి దేవతలు చేసెడివారని నమ్మెడివాడు. కాని పశ్చిమ ఖండములో ఈశ్వరునిపైన క్రైస్తవ పాప సిద్ధాంతము పైన నమ్మకము క్షీణించిన కొలదియును మానవత్వముపై తీపి పెరిగినది. "ఆశ్చర్యకరములు అనేకములు కాని ఏదియును మానవ శిశువుకన్న అపూర్వతరము దారుణతరము కాద"[1]ను అలనాటి గ్రీకుల భావము ఆధునికముగా సింగారించుకొని అతి నవ్యకవితా ధోరణులలో ప్రతిబింబించినది. "దేవతల విషయమై వారన్నారని కాని లేరని కాని చెప్పలేను. వారి విషయమైన మన అజ్ఞానమునకు అనేక హేతువులున్నవి. విషయమా దుర్బోధము, జీవితమా సంక్షిప్తము."[2] కావున ఈజీవితములోనే స్వేచ్ఛ, శాంతి, ఉన్నంతలోనే నింపుకొని అనంతర జీవితమును గూర్చి ఆలోచించుట మానివేయుమన్నది మానవతా వాదమునకు ప్రాతిపదికయైనది. బ్లెయిజ్‌పాస్కల్, కీర్క్‌గార్డ్ ఫ్రెడరిక్ నీత్చే, కారల్ జీస్పరులనుండి ప్రారంభమైన ఈ అస్తిత్వ వాదము (Existantialism) క్రమముగా మానవతా వాదమునకు తానే ప్రతినిధియై నిలిచినది. అంతర్జాతీయముగా అతి నవ్యకవులలోని మానసిక పరిణామమునకు విచారధార మిక్కిలి దోహదము చేసినది. కావుననే మార్టిన్ హైడిగర్ నుండి సార్త్రెవరకు గల అస్తిత్వవాదులు అతి నవ్యులకు ఆరాధ్యులైనారు !

**మార్క్సిజము వైఫల్యము :** అతినవ్య కవితోద్యమములపై ప్రభావము చూపిన మానవతావాదమునకు మరొక ముఖము, ఎం. ఎన్. రాయ్ అంతర్జాతీయముగా మార్క్సుతత్వ వైఫల్యమును సూచించుచు ప్రతిపాదించిన 'మానవతావాదము' అభ్యుదయ కవితోద్యమ వైఫల్యమునకు సైద్ధాంతిక పరాజయమే కారణమని మనవి చేసితిని. కావుననే శ్రీశ్రీ, ఆరుద్రవంటి ఒకనాటి అభ్యుదయ కవులే తరువాతి దశలో అధివాస్తవికులుగా మారిపోయారు. "కారుణ్య దృష్టి ఒక్కటే మానవతా వాదముకాదు. మానవ ప్రయత్నం సాఫల్యం పొందేటట్లుగా మానవశక్తి విస్తృతమయ్యేటట్లుగా హేతువాదానికి నిలిచి పార లౌకికాన్ని నిరాక

---

1. సోఫోక్లిజ్.
2. నిరీశ్వర వాదియని నిందింపబడిన ప్రోటాగోరస్ వచనము.

రించి ప్రాపంచిక వ్యవహారం మానవ ప్రమేయం మాత్రమే అయ్యేటట్లు స్వతం త్రాలోచననూ అనుభూతినీ కార్యకరణనూ ప్రోత్సహించే తాత్విక వైఖరి"[1] ఈ మానవతావాదములో కన్పడుచున్నది. ఇట్టి స్థితికై మార్క్సు తత్వమును కూడ తిరస్కరింపవలెనని ఎం. ఎన్. రాయ్ ప్రతిపాదించినాడు. "అధికారమును చేజిక్కించుకొనుట యందు పాక్షిక పరిభాషయందు దానికి (మార్క్సిజముకు) గల అంధాభి నివేశమునందు మానవత్వ స్వభావమును ప్రయోజనమును కూడ మార్క్సువాదము మరచినది"[2] కావున దానికి ప్రతివిధానమే తన మానవతావాద మని రాయ్ అంతర్జాతీయమైన ప్రతిపాదన చేసినారు. రాయ్ ప్రభావము తెలుగు నవలలపై ఉన్నది కాని కవిత్వముపై తక్కువ. ఐనను అభ్యుదయ కవితోద్య మమునకు వారధులై నిలిచి నవ్యభావములు వికసించుటకు కారణభూతులైన వారిలో రాయ్ కూడ ఒకడు. కావున తాత్విక చర్చలో, అతి నవ్యకవితోద్య మముల పూర్వరంగములో వారిని కూడ ప్రసక్తము చేయవలసి యున్నది.

ఇట్లు మానవోద్యమము వికసించినది "ఇది ప్రతి మానవుని శిరస్సుమీదా మకుటం పెడతానంటుంది. మానవులందరికీ కూడా సామ్యం ఉండాలంటుందీ ఉద్యమం."[3] దీనితో మానవుని వైయక్తిక జీవితముపై మేధావులకు ఆసక్తి పెరిగినది. సుఖమును నిర్వచించుటలో వైరుధ్య మున్నప్పటికిని అటు ఆధ్యా త్మిక తత్వవేత్తలతోబాటు భౌతికవాదులు కూడ మానవసేవయే పరమావధియని ప్రకటించినారు. వీరికి "రష్యా గురుధూప వాసన" "చీనా చీనాంబరధారణ" లక్కరలేదు. ఇదొక స్వతంత్ర తత్వము. స్వతంత్రోద్యమము. అతి నవ్య కవులు పురోభాగుల విమర్శల నతిక్రమించి పురోగమనము చెందుటకి సిద్ధాంత మొక ఆంతరమైన ప్రేరణ.

**మనస్తత్వశాస్త్ర ప్రభావము :** అతి నవ్య కవితోద్యమములకి ప్రభా వము వెన్నెముక వంటిది. సిగ్మండ్ ఫ్రాయిడ్ చేసిన పరిశోధనలపై, మానసిక

1. అభ్యుదయ యుగానంతరం- కె. వి. రమణారెడ్డి వ్యాసం. సౌమ్య ఉగాది సంచిక. 159 పుట.
2. 'హ్యూమనిస్టు రాజకీయాలు' ఎం. ఎన్. రాయ్
3. పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వం. దేవులపల్లి 'తెలుగు వ్యాసములు' 79 వ పుట.

విశ్లేషణలపై ఈ ఉద్యమములు తమ సిద్ధాంత భాగమనేకిరులాయము నల్లినవి. అంతశ్చైతన్య విశ్లేషణలో ఫ్రాయిడ్ సాధించిన విజయములు శాస్త్రరంగములో నూతన మంత్ర కవాటములను తెరిచినవి అతినవ్యులు మంత్రముగ్ధులై ఈ సిద్ధాంత ప్రభావమునకు లోబడి పోయినారు. రచనలో పంక్తి పంక్తికి పదము పదముకు మధ్య అంతశ్చేతనలో జరిగెడి పరిణామముల ఛాయలకు ప్రదర్శింప సాగినారు. "అంటే బాహిరమైన తర్కానికి అతీతమైన అంతర సంబంధము"[1] ఉండును ఇదియే అధివాస్తవిక కవితోద్యమమునకు ప్రాదుర్భావ దశ !

**యుద్ధానంతర ప్రభావములు :** ఇరువదవ శతాబ్దపు పూర్వార్థములో రెండు మహాయుద్ధములు జరిగినవి. ఇవి ప్రపంచ వ్యాప్తముగా అనేక వికృత పరిణామములకు దోహదము చేసినవి. ముందుగా చిత్రకళారంగము నవి ప్రభావితము చేసినవి. క్యూబిజము, ఇంప్రెషనిజము, ఎక్స్ప్రెషనిజము, సింబాలిజము, ఫ్యూచరిజము, డాడాయిజము, స్రరియలిజము, ఇమేజిజము, ఎగ్జిస్టెన్షియలిజము మొదలైన అసంఖ్యాక ధోరణులు ప్రబలినవి. సర్వదేశములలోని కవితా కన్య కలను ఈ సిద్ధాంత పురుషులు ఆకర్షించుకొన ప్రయత్నించి నప్పటికిని ఆంధ్ర సుందరి అధవాస్తవిక, అరాజక పురుషులకు మాత్రమే లొంగినది. మిగిలినవారు కవితా కల్యాణ మంటపములో కాలిడి స్వయంవరములో పాల్గొనినారు కాని వర ణము మాత్రము జరుగలేదు. అందుచే వారీ రంగస్థలమున నామమాత్రావశిష్టులైనారు.

**ఐన్‌స్టీన్ ప్రభావము :** అతి నవ్య కవిత్వముపై ముఖ్యముగా అధివాస్తవిక కవిత్వముపై "ఐన్‌స్టీన్ రిలెటివిటీ సిద్ధాంతము (సాపేక్ష సిద్ధాంతము) కూడ.... ప్రభావిము వేసినది."[2] "ఈ శతాబ్దిలో మారిన దృక్పథాన్ని అవగాహన చేసుకోవాలంటే స్పృశింపవలసిన కీలకమైన విషయాల్లో కాలం ఒకటి."[3]

---

1. అద్దేపల్లి రామమోహనరావు 'ఆధునికాంధ్ర సాహిత్యముపై పాశ్చాత్య కవితా ప్రభావము' వ్యాసము. ఆంధ్రప్రభ. కీలక వైశాఖ బహుళ సప్తమి. ఆది.
2. డా॥ సి. నారాయణరెడ్డి. పరిశోధనా వ్యాసము. 518 వ పుట.
3. ఆధునిక సాహిత్యంలో కాలం. ఆర్. ఎస్. సుదర్శనం వ్యాసం. క్రోధి ఉగాది సంచిక. 3 పుట.

ఐన్‌స్టీన్ సాపేక్ష సిద్ధాంతముతో దేశకాలావధులు చెదిరిపోయినవి. మానవుడు బానిసగా మారుటకు కాలమే కారణము కావున అతడి నాల్గవ కొలతను (Fourth dimension) జయింపవలెను ఈ వాంఛను ఐన్‌స్టీన్‌చే ప్రభావితులైన రస్సెల్ ప్రభృతులు వ్యక్తీకరించినారు "For each body there is a definite time - Order for the events in its neighbourhood, This may be called the proper time by that body. Our own experience is governed by the proper time for our own body"[1] కాలము మానవ సాపేక్షమనుట దీని తాత్పర్యము ఈ ధోరణికి ఆంగ్లములో ఆల్డస్ హక్స్‌లే, జె. బి. ప్రీస్ట్లీ ప్రభృతులు పునాదులు వేసినారు. టి. ఎస్ ఇలియట్ నోబుల్ బహుమతికి కారణమైన రచన 'ఫోర్‌క్వార్టర్స్'కు ఈ కాలాతీత తత్వమే మూల సిద్ధాంతము. "కాలాన్ని అధిగమించాలనే ఆకాంక్ష. హేతువాదాన్ని తర్కాన్ని దాటిన మానవత్వపు విలువలను అందుకోవాలనే ఆశయం"[2] అతి నవ్య కవితా ధోరణులలో ప్రతిబింబించినవి.

---

1. 'A. B. C. of relativety' By B. Russel ఈ సందర్భములోనే బ్లెయిజ్‌పాస్కల్ వాక్యముల నుదాహరింపవలసి యున్నది. "జీవితానికి ముందు వెనుకల నడుస్తున్న అనంతకాలంలో మ్రింగబడి వున్న నా యీ జీవితపు అల్పకాలాన్ని గురించి ఆలోచించినపుడూ నేను ఎరుగనట్టి నన్ను ఎరుగనట్టి అనంత ప్రదేశంలో మునిగిపోయిన నేను, ఆక్రమించుకొని చూస్తున్న యీ అల్ప ప్రదేశాన్ని గురించి నేను ఆలోచించినపుడూ భయ పడుతూ ఆశ్చర్యపోతూ వుంటాను, ఎందుకు నేను 'అక్కడ'కాక 'ఇక్కడ' ఉన్నవారిని 'అక్కడ' అనే దానికంటే 'ఇక్కడ' అనేదీ, 'అప్పుడు' అనే దానికంటే 'ఇప్పుడు' అనేదీ ఉండడానికి కారణం ఏమిటా అని" (అనువాదం సంజీవదేవ్) (భారతి. పరాభవ సంవత్సరాది సంచిక) పాస్కల్ అస్తిత్వవాది. ఈ వాక్యములను బట్టి అస్తిత్వవాదము, సాపేక్షము ఎట్లు సామ్యదృక్పథముతో ఆలోచించినవో వ్యక్తమగును. అధివాస్తవిక కవిత్వాదులపై ఇవన్నియును ఏక కాలములోనే ప్రభావమును ప్రసరించినవి ! !

1. ఆధునిక సాహిత్యంలో కాలం. ఆర్. ఎస్. సుదర్శనం. క్రోధి ఉగాది సంచిక.

**మార్మిక ప్రభావము :** అతినవ్య కవిత్వముపై ముఖ్యముగా అధివాస్తవికతా కవిత్వముపై మార్మికుల ప్రభావము అధికముగా నున్నది. ఆంగ్లములో వీరిని 'Mystics' అందురు. వీరు అంతశ్చైతన్య స్థితితో కవిత్వము వ్రాయుట వలన అధివాస్తవికుల కంగభూతులు. అధివాస్తవికులలో భౌతికులెక్కువ. కాని మార్మికులు ఆధ్యాత్మికవాదులు. ఇదొక్కటే భేదము. 'మార్మికవాదుల ఈశ్వరుడు సద్గుణుడేకాక మానవ సాహచర్యం వినా తానుగా అతీతంగా జీవించలేడు. ఒకరికొకరు లోపపూరకులు ఒకరికొకరు అక్కర.'[1] కవి తాను ఈశ్వరునితో ప్రసంగించుట ఈశ్వరుడు తన యెదనో వెన్ననో స్పృశించుట. 'రత్నకంకణ హస్తం దిగ్గ్రేఖ కావలినుండి పిలవడం' తన వెనుక ఎవరో నీళ్లు కలిపిన ధ్వని (బాలగంగాధర తిలక్) ఈ మార్మిక ప్రయోగములే. 'ప్రణయ సంబంధమైన మార్మికవాదం యోగులకూ రసయోగులకూ సామాన్యమైన సాధన. జ్ఞానసంబంధమైనది.... ఇది ఆనందయోగం'[2] ఇట్లు అతినవ్య కవిత్వముపై మార్మికుల ప్రభావమును దర్శింపవచ్చును. 'యథార్థాన్ని గుర్తించము. కలలు మాకు యథార్థాలు. ఈ జగత్తులో మాకు పనిలేదు. మాది స్వప్న జగత్తు' అని నారాయణబాబు సంఘర్షణ 'ప్రవర'లో ప్రవచించిన దానినిబట్టి అధివాస్తవికులు మార్మికులని సన్నిహితులనుట స్పష్టము. మార్మిక కవితకు ప్రాచీన మధుర భక్తికి దగ్గర సంబంధమున్నది. అందువలననే భావకవిత్వములో కూడ ఇది చోటు చేసికొనినది. అధివాస్తవికతతో అంటకాగినది. లేడీ బార్ ఎర్రైన్‌మ్యాలర్మీ ఫ్రాన్సులోను, డెమ్మెల్ జర్మనీలోను, ఈట్సుజేమ్సు హెచ్, ఓజిన్సు ప్రభృతులు ఐర్లాండులోను, ఈ సంప్రదాయమునకు చెందినవారు. తెలుగులో తిలక్ వచన గేయములలో ఈ మార్మికత్వము మొగ్గలు విప్పినది!

**డాడాయిజము ప్రభావము :** అధివాస్తవిక కవుల నుండి దిగంబరుల వరకు డాడా ప్రభావమునకు లోనుకానివారు లేదు. 1916లో ట్రిస్టజారా నాయకత్వమున డాడాయిజము జన్మింపగా 1919లో ఆంద్రే బ్రిటన్ నాయకత్వమున అధివాస్తవికోద్యమము ప్రారంభమైనది. కాని అధివాస్తవికత పోనుపోను డాడాయిజమునకే దారి తీసినది. అందువలన అధివాస్తవిక కవులు అరాజక స్థితిలోనే విధ్వంసాత్మక దృష్టితో కవిత్వములో మధ్యలోనే మానివేసినారు.

---

1. ఆధునికాంధ్ర కవిత్వంలో సామాజిక చైతన్యం. సౌమ్య ఉగాది సంచిక.
2. Mysticism. F. C. Happold Pelican 1963.

భౌతికవాద సంబంధిమైన అనుక్రమ సిద్ధాంతములో గ్రుడ్డునుండి కోడి, కోడి నుండి గ్రుడ్డు వచ్చినట్లు అరాజకత్వమునుండి దిగంబరత్వము వచ్చినది. సాన్ ఫ్రాన్సిస్కోలోని బీట్నిక్కులు, డాన్‌జార్జి స్ ప్రాంతములోని 'గూండా'యిజము' నకు చెందిన గ్రేనరేషన్, బ్రిటన్‌లోని యాంగ్రీ యంగ్‌మెన్, హంగెరీలో గాయ పడిన యువకులు, రష్యాలో ఎతుషెంకో అనుయాయులు, హాలెండులోని ప్రోవో ఉద్యమము, కలకత్తాలోని ఆకలితరము కవులు ఉత్తరప్రదేశ్‌లోని అనామా కవి తోద్యమకారులు, మహారాష్ట్రలోని అన్‌వర్గము, హిందీలోని ఛాయావాదులు తెలుగులోని దిగంబర కవులు ఈ కోవకు చెందినవారే.

బాహిరమైన సూక్ష్మమైన శాస్త్రీయ విశ్లేషణలో, మార్మికత్వము, సాంకేతికత్వము, అధివాస్తవికత్వము, డాడాయిజము, అరాజకత్వము, అస్తిత్వవాదము (సార్త్రే) దిగంబరోద్యమము వేలువేలు పేరులతో కన్పడినను ప్రత్యక్ష దర్శనములో ఇవన్నియు నొకే వస్త్రమునకు పడుగుపేకలు. ఒకే వస్త్రమున కద్దిన రకరకముల రంగులు. పరస్పర పూరకములు - పరస్పర సంజనితములు !

బీట్నిక్కులు అధివాస్తవిక ధోరణిలో ఆలోచించుట తమకిష్టమని చెప్పిరి. యాంగ్రీ యంగ్‌మెన్, సార్త్రే, తమకు స్ఫూర్తిదాత యనినారు. కలకత్తాలోని ఆకలి తరము కవులు 'అశ్లీలమనునది బూర్జువాలు సృజించిన పదమని సెక్సు మాత్రమే హద్దులు లేనిదీ సంకుచితము కానిదీ' అని వాదించుటలో ఫ్రాయిడ్ ప్రభావమును 'అసలు మా వినోద గృహాలు జైలు, ఆసుపత్రి, స్మశానం, పిచ్చాసుపత్రి' అని మానిఫెస్టో ప్రకటించి కలకత్తాలో ట్రాఫిక్ నాపుటలో, డాడాయిష్టులు సమావేశము నేర్పరచి కోడిగుడ్లతో కొట్టి సభను రసాభాస పాలుజేసి విజయవంతమైనట్లుగా భావించిన అవ్యవస్థ కన్పడుచున్నది. కావుననే క్రిష్టఫర్ కాడ్వెల్ తన **Illusion and reality** లో అధివాస్తవిక సిద్ధాంతమును విమర్శించినట్లే ఆంధ్రములో కూడ అధివాస్తవికులను దిగంబరులను తీవ్రముగా విమర్శించినవారు లేకపోలేదు కాని ఉద్యమమునకు విమర్శలు ప్రతిఘటనములు బలమునే చేకూర్చునను ప్రాథమిక సూత్రము ఇచ్చట కూడ వర్తించినది. అతి నవ్యులైన ఆంధ్రకవులీ వివిధ ప్రయోగములను చేసి వైచిత్రులను సాధించినను ఉద్యమత్వమును పొందినవి కేవలము 1) అధివాస్తవిక కవిత్వము, 2) దిగంబర కవిత్వములు మాత్రమే ! కావున ఈ రెండింటిని ప్రముఖముగా వివరింతును !

## అధివాస్తవికతా కవితోద్యమము :

నైఘంటకమైన నిర్వచనము ననుసరించి మానవునిలోని అంతశ్చేతనలు శబ్దములను తొడుగుకొని బాహిరమైన సాకార దర్శనము నిచ్చుటయని చెప్ప వచ్చును.

**Surrealism: (1) A Spiritual trend of art. (2) A recent artistic school representing dreams interpreted according to frend's theories. L. V. 'Artistic movement which maintains that there exists and seaks access to, a 'real' world that lies behind the artificial world of ordinary objects given in normal awareness. Argues that what is found on the conscious level in an arbitrary construct of mind determined by habit and custom and that the function of art is to recover and report the world as originally experienced and felt. Seeks to disintegrate the clear logical life of intellect so as to search for its materials on the sub conscious level and discover there the true and premitive meanings that things have for us prior to the forms that we impose on them.[1]**

మానవుడు సామాజికమైన నీతి నియమములకు మర్యాదలకు సంస్కారములకు లోబడి తనలోని భావములను అణచుకొని కొన్నిటిని మాత్రమే వెలి బుచ్చుచున్నాడు. ఇట్టి నిర్బంధముల ఫలితముగా అట్టడుగున పడిపోయిన ఊహలు స్వప్నలోకములో స్వేచ్ఛగా సాక్షాత్కరించుచున్నవని ఫ్రాయిడ్ విశ్లేషణ చేసినాడు. "సర్రియలిజము ఒక వ్యక్తియొక్క బహిరంతర తత్వాల మేళనము నుంచి ప్రత్యేక పరిస్థితిలో కారణమాత్రమైన యత్నమువల్ల బయ ల్వెడలిన అభిప్రాయాలా- భావాలా- మాటలా- పొగ. వెలిగే హారతి కర్పూరపు బిళ్లనుంచి వివిధ వక్రవ్యంజితముగా వచ్చే ధూమ లతలవలె కవి మనస్సునుంచి నైసర్గికముగా వచ్చేది సర్రియలిజపు రచన."[2] డిలాన్‌థామస్ గ్యాస్కాయిన్,

---

1. **The Dictionary of Philosophy (by Dagobert. D. Runes) Iredell Jenkins, and Lionello Venturi P. 307.**
2. అని బద్ధ కవిత్వము. వ్యాసము. శ్రీపాద గోపాలకృష్ణమూర్తి. క్రోధ ఉగాది సంచిక. 10-11 పుటలు;

ఆంద్రేబ్రిటన్, పాల్ ఎడ్వర్డులు, ఆంగ్లములో దీనినొక ఉద్యమముగా మార్చిన స్రష్టలు. సమకాలీనమైన యుద్ధములలోని దారుణములు భీభత్సము, రక్తపాతములు చూచిన మీదట, వారి అంతశ్చేతనలో అపూర్వమైన పరిణామము లేర్పడినవి. ఆ కలల నుండి కరిగి జారిన భావములు ఘనీభవించి అధివాస్తవిక కవిత్వమైనది ప్రపంచ యుద్ధానంతర మీ ధోరణులు తెలుగులో కూడ తలఎత్తినవి. కలలు, కామము, జుగుప్స, అవ్యవస్థ వీరికి ఋక్కులు కాగా, నిరాశారస హవిస్సుతో ఆంధ్రాధివాస్తవిక కవి హోతలు ఫ్రాయిడ్ బ్రహ్మత్వము క్రింద ఈ కావ్యయజ్ఞము జరిపినారు ఇటలీ ఫ్రాన్సు దేశములు జన్మదాతలై చిత్రకళావేత్తలు పితృపాదులై, యుద్ధములు నారుపోసి, నీరుపోసి పెంచినప్పుడు, నిరాశా, అసంతృప్తులనెడి పండ్లపై పూచిన అధివాస్తవిక కవితాలత అరాజక కుసుమముల యొక్క జుగుప్సా గంధమును వెదజల్లుటలో వింత యేమున్నది? "ఈ పద్ధతిలో ఉద్దేశం తిరుగుబాటే కాని ఆ చెప్పింది నిజమా అర్థమా, పిచ్చా ఊహో కలా అనే సంగతి అనవసరం."[1] ఇది కేవలము అవ్యక్తుల ఉన్మాదమో ఉన్మోదమో మాత్రమే కాదు. బలవత్తరమైన ఉద్యమము. ఆర్థిక, సాంఘిక రాజకీయ శక్తుల చోదనతో సాగిన ఆంతరమైన ఉద్యమము భావాత్మక విప్లవము- యుద్ధమునే జర్జరితమైన శిధిల సమాజము పాడిన శివరంజనీ రాగము!

**ఉద్యమము - తిరుగుబాటు :** అధివాస్తవిక కవులు సాగించిన ఉద్యమమును కొందరు చిన్న తిరుగుబాటుగాను అవ్యవస్థగాను మాత్రమే వర్ణించుట కొక ప్రముఖ కారణమున్నది. ఇది ఏకనాయకత్వముతో ఏకోన్ముఖముగా జరిగిన ఉద్యమము కాదు. సిద్ధాంతమా సంకీర్ణము, లక్ష్యమా అగమ్యము, కర్తృత్వ శక్తియా విధ్వంసాత్మకము, పయనమేమో కలలలోనికి- ఇందువలన బహునాయకత్వము, సిద్ధాంత బాహుళ్యము, సంయమన రాహిత్యము, ప్రాచీన, భావాభ్యుదయ, కవితారీతు లన్నింటిపైని తిరుగుబాటు- గోచరిందుటచే దీనిని ఉద్యమమనవచ్చునా? అవి ప్రశ్న! "మేధావి అయినవాడికి లేక నాయకుడైన వాడికీ మొదట తన మాటమీద తనకే నమ్మకం ఉండాలి. తర్వాత తనచేతల ద్వారా ఆ నమ్మకాన్ని నిరూపించాలి. అదే ఉద్యమానికి నాంది అవుతుంది."[2] అధి

---

1. నవ్యాంధ్ర సాహిత్య వీధులు. శ్రీకురుగంటి సీతారామయ్య 4వ భాగము 722 పు.
2. ఆధునికాంధ్ర సాహిత్యంలో సామాజిక చైతన్యం-ఆర్. ఎస్. సుదర్శనం సౌమ్య ఉగాది సంచిక 128 పుట.

వాస్తవిక కవులలో ఆత్మవిశ్వాసము కన్నను ఆందోళనమే తీవ్రముగా నున్నది. కావున దీనిని తిరుగుబాటుగాను ప్రయోగముగాను కొందరు వర్ణించుట సహజమే. కాని అధివాస్తవికతా కవిత్వము, దిగంబర కవిత్వము ఉద్యమ లక్షణములను సంతరించుకొనినట్లే విశ్లేషణాత్మక పరిశీలనలో వ్యక్తమగును. బహునాయకత్వము ఉద్యమమున కవలక్షణముకాదు సలక్షణమే! రాజకీయమైన ఆంధ్రోద్యమమున కిట్టి బహునాయకత్వమే సారథ్యము వహించినది. ఇక ఆదర్శమా– 'నిన్న'ను ధ్వంసముచేసి నేటి నుండి రేపటిలోనికి చూచుట వీరి తత్త్వము. నిన్నటిది ప్రాచీన మార్గమో, అభ్యుదయోద్యమమో ఏదైనను వారికి త్యాజ్యములే. ఇట్లు విధ్వంసాత్మక ధోరణియే ఆదర్శముగా కల అధివాస్తవిక కవిత్వము లక్ష్యశుద్ధిని, సిద్ధిని కల్గింపదనుటలో వింత ఏమున్నది? వీరు మేధావులే. అంతర్జాతీయ దృక్పథమును కూడ జీర్ణము చేసికొనినవారు. శ్రీశ్రీ 1969 ఫిబ్రవరి భారతిలో కవితారంగములో అధివాస్తవిక కవిత్వము రాజకీయ రంగములో నానా రాజ్య సమితి వంటిదనుట వీరి విశ్వాసమునకెత్తిన విప్లవధ్వజము.

ఈ ఉద్యమమేల అంతరించిపోయినదని ప్రశ్న! నిజమునకు ఏ యుద్యమ మంతరించిపోలేదు?? తన పని తీరగానే ప్రక్కకు తప్పుకొనుటయే ఉద్యమ లక్షణము ఉద్యమము దీర్ఘకాలము సాగుట, స్వల్పకాలము నడుచుటను బట్టి దాని ఆదర్శమును, ఆవశ్యకమును నిరూపింపగలమే కాని ఉద్యమ ప్రమాణము (Quality) నకు కాలావధి పరిమాణము కాజాలదు. అట్లే అధివాస్తవికులు నేడు లేరను ప్రశ్నకును ఇట్టి సమాధానమే లోగడ చెప్పబడినది. ఒక కవి భావ, అభ్యుదయ, అధివాస్తవిక, దేశభక్తి కవితలు భిన్న కాలములలో వ్రాయుట కవిగా ఆతని శీలమువకు కళంకముకాక ఉద్యమ ప్రభావమునకు ప్రతీక యని మనవి చేసితిని. 'వెనుకటి పోరాటము నేటి.... ఆరాటము'[1] రెండును ఉద్యమాంగములే! ఆరాటము ఇచ్ఛ! పోరాటము క్రియ!!

---

1. "షాజహాన్ అంతఃపురంలో షట్పదిశింజాన మెక్కడ' అని యొకనాడు పలికిన శ్రీశ్రీ (ఖడ్గసృష్టి 40 వ పుట. "ఏవి తల్లీ" ఖండిక.) మఱొక కాలములో తాజమహల్ నిర్మాణానికి రాళ్లెత్తిన కూలీలెవ్వరని"ని ప్రశ్నించినారు (మహా ప్రస్థానం.)

## ఉద్యమ స్వరూపము :

అధివాస్తవిక కవిత్వము 1932లో ముద్దుకృష్ణ 'జ్వాల' అను సాహితీ పత్రికను స్థాపించుటతో ఉద్యమస్థాయి నందుకున్నది. నాటినుండి పుంఖాను పుంఖములుగా అధివాస్తవిక ఖండికలు వెలువడి తరువాత వానిలో కొన్ని గ్రంథ రూపము నందినవి శ్రీశ్రీ మహాప్రస్థాన గీతము లీ దశలోనే పలికినాడు. అభ్యుదయ కవితామార్గమునవి తరువాతి కాలములో మూలస్తంభములుగా నిలిచినను తొలిదశలో కేవలము భావకవిత్వపు శృంఖలము నుండి బయటపడి సంప్రదాయపు తెరలను చీల్చుకొని నూతనత్వము నన్వేషింపవలెనను దృష్టితోనే సాగినవి. 1937లో పఠాభి ఫిడేలు రాగాల డజన్ ప్రకటించి ఆంధ్ర సాహితీలోకము దృష్టి నాకర్షించినాడు. వెనువెంటనే 1938లో శిష్ట్లా ఉమామహేశ్వరరావుగారి నవమి చిలుక వెలువడినది. నారాయణబాబుగారి రుధిరజ్యోతిని రచనాకాల మిదే!! నాటివరకును ప్రేమకవిత్వమున కలవాటుపడిన పాఠకుల కిది దిగ్భ్రాంతిని కలిగించినది. కవి లోకములో, మేఘములు లేక పిడుగులు రాలినిట్లనిపించినది. ఉద్యమము తీవ్రమైన కొలది పాఠకులు విస్తుబోయి చూచుట తప్ప మరేమియును చేయలేని నిస్సహాయ స్థితిలో నిలబడినారు. అధివాస్తవికతా కవితోద్యమ వైశిష్ట్యమది !!

మొదటిసారిగా సంప్రదాయ కవితామార్గము హేతువాద న్యాయస్థానములో దోషివలె నిలిచి తన్నుతాను సమర్థించుకొనవలసిన దశను అధివాస్తవికోద్యమము కల్పించినది. శబ్దార్థములను, ఇతివృత్తమును ఇహలోకములోని సాంఘిక వ్యవస్థను పరలోకమునకు చెందిన నమ్మకములను వీరు ప్రశ్నించినారు :

1) శాబ్దికముగా వీరు 'నిస్సారమైన మాటలను పునస్సృష్టి' చేయుటకు యత్నించినారు.[1] సంప్రదాయసిద్ధమైన ఛందమును వ్యాకరణమును 'నడుము విరుగగొట్టి'[2]నారు.

---

1 'సంఘర్షణ'లో నారాయణబాబు ప్రవర.

2. పఠాభి. ఫిడేలు రాగాలు డజన్,

2) ఆత్మికముగా, సభ్యసమాజములో బహిరంగముగా చెప్పబడని విషయము లకు కావ్యత్వము కల్పించినారు. జగన్మాత పార్వతిని చూచినప్పుడు అధివాస్తవిక కవికి కామభావన విజృంభించినది.[1]

3) అట్లే ఇతివృత్త స్వీకారములో కూడ సంప్రదాయమును తిరస్కరించి 'చాకలాడు సంతబయలు కుక్క గాడిద కుళ్లు కాలువ'[2] మొదలైనవెల్ల కవితావస్తువులేనని చాటి కావేవీ కవిత కనర్హ[3]మనినారు.

4) కావ్యాదర్శములో కూడ వీరు 'శ్రీకైవల్య పదంబు' చేరుటో లేక బ్రహ్మా నంద సబ్రహ్మచారియైన రసానందమును దృష్టిలో నుంచుకొనుటో చేయ లేదు. తమది 'ప్రాహ్లాద కవిత్వము'[4] (వి)చిత్ర కవిత్వమే తమకు సౌందర్యమయమైనది[5] సౌందర్యమే విచిత్రము.

5) క్రాంతదర్శి, ఋషి అయినవాడే కవిత్వము వ్రాయవలెననుట తమ కడ పొసగదు. తాము విద్రోహఋషులు[6]

దీనివలన భాషలోను భావములోను సంఘ వ్యవస్థలోను మతవిశ్వాసముల లోను ఒకేసారి విప్లవము ప్రారంభమైనది.

## ప్రతిఘటనము - పురోగమనము :

ఉద్యమము, అందునను అపురూపమైనది, అపరూపమైనది విజృంభించు చుండగా ప్రాతికూల్యము తీవ్రతరమగుట సహజము. దువ్వూరి రామిరెడ్డిగారు వీనిని యుద్ధకాలపు వికృత ధోరణులతో పోల్చి 'అస్టిగ్మాటిజం' అను కంటి

1. నారాయణబాబు, మౌనశంఖం గేయము. కల్పన (కవితా సంపుటము) 69 పుట.
2. సంఘర్షలో ప్రవర -
3. శ్రీశ్రీ మహాప్రస్థానం.
4. నవమి చిలుక మున్నుడి
5. శ్రీశ్రీ ఇంట్రో ఫిడేలు రాగాల డజను
6. నారాయణబాబు రుధిరజ్యోతిలో 'కదన కుతూహల రాగం' గేయము.

జబ్బునకు తుల్యమైన దృక్పథమని[1] విమర్శించినారు. 'ఇది చిరస్థాయిగా ఉండ దగిన సారస్వతమునకు చెందినది కాదని గిడుగు సీతాపతిగారు దీనిలో శిల్పమే లేదని రామానుజరావుగారు వీరి ఉపమానములు హేయముగ నున్నవని సభాపతి గారు విమర్శించినారు.[2] శ్రీ శ్రీనివాస సోదరులు 'వింత బేరము' అను ఖండి కలో అధివాస్తవికుల ధోరణిని వ్యంగ్యముగా చిత్రించినారు.[3] ఆధునిక కవి తాను కష్టించి ఖండాంతరముల నుండి తెచ్చిన సరుకులను వీధిలో అమ్మకమునకు పెట్టినాడట. రసికుడు వానిని పరిశీలింపగా రియలిజము, సర్రియలిజము మొద లైనవి కన్పడినవి దానితో బేరగాడు 'కొత్త సమాసాలు, కొత్త పదాలు, కొత్త రైమ్సును సరికొత్త మీటర్సు.... రంపపు కోతవలెనున్న దాస్యవృత్తికే ఉదు కెత్తుచుండ'గా ఈ ఇంగ్లీషు తెలుగులు బెంగాలీ తెలుగులు వలదని 'నా దేశ నిసర్గ సౌందర్యమును చిందు చక్కని రచన కావలెనని' కోరుటతో ఖండిక ముగియును. ఇందు రెండు ప్రముఖ విషయములు ద్యోతకమైనవి. ఒకటి, రచనాకాలములోనే అధివాస్తవిక కవులు తీవ్ర ప్రతిఘటన నెదుర్కొనవలసి వచ్చినది. అయినను విమర్శకులకు సమాధానముగా మరికొన్ని ఖండికలను వెలువరించుచు వీరు ముందుకు సాగినారు, ఇంతకన్నను ముఖ్యమైన రెండవ యంశమేమనగా వైదే శికమైన కవితారీతులను అధివాస్తవికులు ఆంధ్ర సాహిత్యములోనికి తెచ్చునప్పుడు వానిని దేశీయపు మూసలో తీర్చిదిద్దలేదు. అభ్యుదయ కవిత్వములో శ్రీశ్రీ భారతీ యమైన సంప్రదాయమును పదజాలమును స్వీకరించినాడు కాని తిరిగి అధివాస్తవిక కవిత్వము కడకు వచ్చుసరికి మిగిలినవారి వలెనే 'ఈ దేశ నిసర్గ సౌందర్యమును చిందించ'లేక పోయినాడు. కావుననే అభ్యుదయ కవిత్వమువలె పరిణతి నంది ప్రయోజనము సాధించకముందే తిరుగుముఖము పట్టినది.

ఉద్యమమునకు తొలిదశలో కాళూరి నరసింగరావు వడ్డాది సీతారామాంజ నేయులు ప్రభృతులు నారాయణబాబును శ్రీశ్రీని వెన్నుదట్టి ముందుకు సాగునట్లు

---

1. కవికోకిల గ్రంథావళి (ఆ)లో తెలుగు కవితతో క్రొత్త తెన్నులు వ్యాసము 161 పుట.
2. నవ్యాంధ్ర సాహిత్య వీధులు (4 సం) శ్రీ కురుగంటి.
3. దివ్యవాణి. స్వభాను విజయదశమి సంచిక.

చేసిరి. క్రమముగా నారాయణబాబు ప్రభృతులు తమ కాళ్లపై తాము నిలువగల శక్తిని పుంజుకొని నూతన మార్గమునకు ప్రవక్తలు ప్రయోక్తలై, పిఠాపురము రాజావంటి వారిని కూడ ప్రభావితము చేసినారు. సింగరాచార్య, పూషా, బైరాగి, దేశిరాజు కృష్ణశర్మ, పాప, ఏసు మొదలైనవారెందరో ఈ మార్గములో పయనించినారు. ఆరుద్ర కూడ రంగములోనికి దిగి రంగుల కలలు కనుటతో ఉద్యమమునకు పూర్ణత్వము సిద్ధించినది. ఈ యుద్యమ వాహినిలో వెలసిన ముఖ్యమైన కావ్యఘట్టముల నిక పేర్కొందును.

1) **విష్ణుధనువు :** అధివాస్తవికోద్యమ ప్రభాత సంధ్యలో వికసించిన మార్మిక కమలమిది. ఇలియట్ వెలుగులో మల్లారెడ్డికు శిష్టా తీసిన తెలుగు ఛాయాచిత్ర మిది. సంకేతము దీనికి జీవము. సనాతన సిద్ధాంతములకు పాత్రలకు అధివాస్తవీకరణ స్వరూప మిచ్చుట దీనికి దోహదక్రియ. చమత్కారము దీని పరాగము వైచిత్రియే బాకువంటి రేకు. ఆధ్యాత్మికత్వము ఇందలి మకరందము పరాశక్తి భావనమే సూర్యకిరణ సంస్పర్శ శిష్టా ఉమామహేశ్వరరావు పౌరాణికమైన సీతారాములను శివపార్వతులను స్వీకరించి ఆత్మపరముగా వానికి అన్వయము చెప్పినారు. సంస్కృతములోని సంకల్ప సూర్యోదయము ప్రబోధ చంద్రోదయముల ప్రభావము సూరన్నగారి కళాపూర్ణోదయములోని మణిస్తంభాదుల వృత్తాంతములు కూడ శిష్టాను ప్రభావితము చేసియే యుండును. కాని సంకేతములను గ్రహించుట శాబ్దికమైన చమత్కృతులను సాధించుట మొదలైన వానిలో వీరు ఇ. ఇ కమింగ్స్‌నే ఆశ్రయించిరని భావింపవచ్చును.

**ఫిడేలు రాగాల డజన్ :** అధివాస్తవికోద్యమమునకు బలము చేకూర్చిన గ్రంథమిది. ఫ్రాయిడ్ సిద్ధాంతములకు ఆంధ్రానువాదమన్నను దోషము లేదు. పద చిత్రముల కిది పర్యాయ పదము. గద్యమునకు పద్యమునకే కాదు ఆంధ్రాంగ్లములకు కూడ పఠాభి ఇందు పెండ్లి జరిపించినాడు. శ్రీశ్రీ దీనికి వ్రాసిన పీఠిక (ఇంట్రో) అధివాస్తవికోద్యమమునకు భాష్యమని చెప్పవచ్చును. ఆత్మకథ, జాబిల్లి, పోలీసు భటుడు, మున్నగు పన్నెండు శీర్షికలలోను లక్ష్యమును లక్షణమును కూడ పఠాభి నిర్వచించినారు.

**నవమి చిలుక :** శిష్లా ప్రచురించిన మరొక వచన గేయముల సంపుటి యిది. విష్ణుధనువులోని బీజ ప్రాయములైన అధి వాస్తవిక భావములిందు రెక్కలు విప్పనవి రేకులు తొడిగినవి. ఇలియట్ రచించిన మరుభూమి (Waste Land) చదివిన ముహూర్తములోనే దీనిని రచించెనా అనునట్లుండును. ఇందును పౌరాణిక పాత్రలనే స్వీకరించి ఆధునిక భావములకు సంకేతముగా ఉపయోగించుకొనెను. మానవుని అనుమానములు అసమర్థతలు ఆసురీ శక్తికి సంబంధించినవి. అర్థమీ అనర్థములన్నింటిని మూలము. మనస్సుతో దీనిని ఛేదింపవలెను. నాడు ఆహ్లాదము కల్హారమువలె వికసించును. ఈ తత్వమును ప్రతిపాదించుచు కవి 'హిరణ్య' కశ్య ప శబ్దమును బూర్జువాలకు సంకేతముగా స్వీకరించినాడు. నరసింహుడు మానవునిలోనే నిద్రించెడి సాహస ప్రవృత్తి. అది జాగ్రుతమై స్తంభమును భంగము చేసినప్పుడు ప్రహ్లాద సిద్ధికలుగును. ఈ రీతిగా గ్రంథము నడిచినది. వర్గ సంఘర్షణ సిద్ధాంతమును అధివాస్తవికోద్యమమునకు ఫెన్నెముకగా నిలుపుటలోనిది మార్గదర్శకమైనది.

**రుధిర జ్యోతి :** శ్రీరంగం నారాయణబాబు గారి అముద్రిత గేయ సంపుటి. మండెడి చితులు మూగిన రాబందులు ఇరులలో ఇరుకు సందులలో కరుకుగా చెలరేగి రగిలిన కామపరీత ప్రవృత్తి ఇందలి వర్ణనీయాంశము. దీనిపై ముఖ్యముగా మల్కారే. ఫ్రాయిడ్‌ల ప్రభావమున్నది. సమకాలీకుడైన చలం కూడ నారాయణబాబు యెదలో సెగలు పొగలు రగిలించె ననుటకును అవకాశమున్నది. రుధిరజ్యోతి లక్ష్యమైనచో రెంటాలవారి 'సంఘర్షణ' కీయన వ్రాసిన ప్రవర లక్షణమన నొప్పును.

**అంతర్గోళాలు :** దుర్గానంద్ రచనమిది. ఇ ఇ. కమింగ్స్ ప్రభావమునకు లోనై శాబ్దికమైన వైచిత్రిని ప్రదర్శించి, భూగోళం, జూవాలజీ మొదలైన ఖండికలిందు రచించినారు. తాత్వికముగా వీరు మార్క్సునే విశ్వసించినారు. స్వక్రియాశక్తి లేని మానవుడు తన అశక్తతకు దేవుని నిందించుచున్నాడని యును విధి వానిని కాపాడుట అసంభవమనియును దుర్గానంద్ అభిప్రాయపడినారు. బాధామయ విశ్వమునకు కవి హృదయానంతర్గోళములు స్పదించి 'అంతర్గోళాలు' కృతిగా రూపొందుట స్పష్టము.

**త్వమేవాహమ్ :** ఆరుద్ర రచనమిది. ఆధునికముగా హెచ్ జి వెల్స్ ఆల్డస్‌హక్స్‌లే - ఐన్‌స్టీనులు ప్రతిపాదించిన కాల నిర్వచనమును ప్రపంచించుటే ఈ కావ్య పరమాశయము. ఇందు తెలంగాణా పోరాటము ప్రస్తావింపబడినది. కవిలోని అంతరమైన స్పందనలకది బాహిరమైన ప్రేరణ. వర్తమాన వ్యవస్థను నిర్మూలించి వామపక్ష విధానమేదో పచరింపనిదే ఈ గాయము మానదని వెతల బ్రతుకులతో గానిగెద్దువలె 'తొయ్యోయ్ తొయ్' అని జీవితములు సాగించెడి వారికి కవి సందేశ మొసంగినాడు.

**సినీవాలి :** త్వమే వాహమ్‌లో చెప్పిన సిద్ధాంతముల కిది పస్త్వాశ్రయమైన కల్పనము. మధ్యతరగతి జీవితము గడిపెడి క్లార్కు సూర్యారావు ఇందు నాయకుడు. విలాసములతో విలాసినులతో నిండిన నగరములలో ఎస్. జి. వో. సూర్యుడు పడు బాధలు హృదయ విదారకముగా వర్ణింపబడినవి. ఇలియట్ - ఎజ్రాపౌండ్‌ల ముద్ర స్పష్టముగా దీనిపై కనిపించుచు. 'అయ్యా మృత్యువు గారూ-కనికరించి కనికరించండ'ని చివరకు సామాన్యుడు మృత్యువరణమును ప్రకటించుటతో కవి నిరాశావాదమును ప్రతిపాదించినారు. మృత్యువుకు సామాన్యునికి అభేదము చెప్పుట కూడ ఆధ్యాత్మికత్వమునకు కాక ఆధునిక మానవుని అసమర్థతకే నిదర్శనము.

**ఖడ్గసృష్టి :** కాలక్రమములో ఇది అత్యాధునికమైనను ఇందలి ఖండికలను పెక్కింటిని శ్రీశ్రీ ముందుగా కొన్ని దశాబ్దముల క్రితమే ప్రకటించి అధివాస్తవికోద్యమమున కొరవడి పెట్టినారు. హిందీ ఇంగ్లీషు తెలుగుఖండికలే కాక ఫ్రెంచి, రష్యను భాషలనుండి అనూదితములైన ఖండికలను కలవు. అధివాస్తవికుల ప్రవేశము,[1] నగరంలో వృషభం, రుబాయితో మొదలైనవి ఉద్యమమునకు

---

1. 9 పద్యముల ఖండిక యిది రచనాకాలము 1940 ప్రాంతము అనగా నారాయణబాబు 'మౌనశంఖం' రచించిన కాలము నాటిది కావుననే మౌనము శంఖమై' అని ఒక పద్యమునకు ఎత్తుగడ కలదు. 'ఉద్యమ నాయకా' అని మరొక పద్యములో తన ఉద్యమము సూచించినారు. ఉదాహరణ కొక పదము : "నిచ్చెన పిచ్చినెత్తురులు నింపి నిలింపుల దుంప త్రెంపికార్చిచ్చులు త్రచ్చుకొన్నది శచీపతి పీచు మిఠాయి వేటలో పచ్చిక మచ్చికైన దిక్షపాకర భీకర సూకరాకృతుల్ పిచ్చిదనాలు పోయిరి కభీరును త్రాగిన రోషనారలై" ఖడ్గసృష్టి 78 పుట

లక్షణ ప్రాయములు ఛార్లిచాప్లిన్, స్టాలిన్, వాల్ట్‌డిస్నీ, జార్జెన్‌హన్‌గ్నేట్ గ్రేటా గార్బో, సిగ్మండ్ ఫ్రాయిడ్, హెరాల్డ్ లాయిడ్, ఐన్‌స్టీన్ ప్రభృతులు తనకు ఇటీవలి స్ఫూర్తి కేంద్రములని Inspirations) రుబాయత్‌లలో చెప్పుట సిద్ధాంత నిర్వచనమునకు సంబంధించిన విషయమే !

**పిఠాపురం రాజావారి కృతులు :** తీరని కోరిక తరువాత 'నామ - రహితం' 'ఆ లోకమునుండి ఆహ్వానము' మొదలైన రాజావారి కృతులన్నియును శాబ్దికముగా కమింగ్స్‌కు వారసత్వమును పొందినవే. పుటకొకే పంక్తి[1] పంక్తికి నాలుగైదక్షరములు వ్రాయుటవంటి చమత్కృతులెన్నియో ఇందు ప్రదర్శింప బడినవి, 'నామ-రహితం' నామకరణమే లేని గ్రంథము. ఇట్లే కవికొండల వెంకటరావు, పూడిపెద్ది వెంకటరమణయ్య, మల్లవరపు విశ్వేశ్వరరావు ప్రభృతు లెందరో ఉద్యమ ప్రేరణతో వివిధ ఖండికల నా కాలములో పుంఖాను పుంఖ ముగా ప్రచురించిరి.

**తత్వ పరిశీలనము ;** భావకవిత్వములోని ప్రణయశాఖీయులు ప్రయో గోప్త సంహారములు రెండును తెలిసిన మంత్రద్రష్టలుకారు. కావుననే వారి సాహిత్య వ్యవసాయము సద్యోజాతములైన ఫలితములను కొన్నింటిని ప్రసాదించి నను చిరకాలము నడువలేదు సరికదా చివరకు వారి చికిత్స విచికిత్సకులోనై వికటించి విషమించినది. కావుననే ప్రణయ కవిత్వములోని చివరి దశనుండియే అధివాస్తవికోద్యమపు తొలిపొడుపు కన్పడినది. గతానుగతమైన సాహిత్య మార్గమునుండి వక్రించుటకు వీరికి వైదేశికమైన 'ఇజము'లు, సామ్యవాదము పొందిన విజయములు, ఖండితముగా కవితాంకురమునకు గాలి-నీళ్ళవలె తోడ్పడి నవి. అధివాస్తవిక కవులందరును తొలిదశలో భావకవిత్వమే వ్రాసిరనియును అభ్యుదయ కవిత్వముతో అంట కాగిరనియును కనమిట మననము చేయవలసి యున్నది.

**అంతశ్చేతనము :** అధివాస్తవిక కవిత్వమునకు భావములు సరళ ముగా నియమ బద్ధముగా సంయమన పూర్వకముగా సమాధి స్థితినుండి వెలువ

---

1. శాంతం పాపం (ఒకే వాక్యము) నామరహితం 12 వ పుట; నిజమేన, నిజమేన 1 నిజము కావాలి (రెండు వాక్యములు) 15 వ పుట; హో ! !- (ఒకే అక్షరము, రెండు ఆశ్చర్యార్థకములు) 122 వ పుట;

రించుట లక్షణముకాదు. ఒకానొక భావము మనసులో ప్రవేశించినపుడు దానితో సందర్భ శుద్ధియున్నను లేకున్నను మరికొన్ని భావములు, పదములు దృశ్యములు వ్యక్తావ్యక్త స్థితినుండి పైకి ఉబుకును. సామాన్యార్థములో వానికి పొందిక లేకపోవచ్చును. అపరూపముగానో అపురూపముగానో ఎట్లో చిత్రము వచ్చినట్లు వెల్వడవచ్చును. కాని వానిని నిరాటంకముగా వడకట్టకుండ (Filtering) మడికట్టకుండ (Purity) సభ్య ప్రపంచములోనికి అనాచ్ఛాదితముగా ప్రసరింపజేయుటే అధివాస్తవిక కవిత్వము. కావుననే క్రిస్టఫర్ కాడ్వెల్ అభ్యుదయ కవిత్వమునకు శిల్ప సౌందర్యముండవచ్చునని చెప్పిన నిర్వచనము¹ వీరికడ మూగవోయినది. దీని కుదాహరణముగా శ్రీశ్రీ వ్రాసిన 'మహాకవి ఆశ్చర్యం'² ఖండికను వ్యాఖ్యానింతును.

> సూసూది కొసపతె సూక్ష్మమైన ఒక లోకం
> నా ఆలోచన అయస్కాంతం అణువులో ఆలాపన
> కలంలో కలకలం అజాలో ఆల్కెమీ
> ఆరాధనలో ఆముదం జింటాన్ నన్ను తింటానంది.
> రత్నాలు 9, రసాలు 9, ఆకాశ నేత్రంలో అష్టాదశపురాణాలు

ఇందు 'సూ' యను అక్షరము సూదికొస వాడిని స్ఫురింపజేయును. సూదిని కవి స్మరించగానే అయస్కాంతము జ్ఞప్తికి వచ్చినది. అయస్కాంతముచే అణువులాకర్షింపబడును కదా! అణువనగానే ఆద్యక్షరసామ్యము కల 'అలాపన' శబ్దము స్ఫురించినది. కలకు కలకలకును ఇట్టి శబ్దసామ్యమే కలదు ఆముదము ప్రమిదలలో వేసి దైవారాధనకు వాడుట సుప్రసిద్ధము. కావుననే ఆముదమను మాట రాగానే ఆరాధనము వ్యక్తావ్యక్త దశనుండి వెలికి వచ్చినది. ఆముదమునకు లక్షణము జిగట. జిగటకు జింటాన్‌కు శబ్ద సామ్యమున్నది. పైగా జింటాన్ గూర్చిన ప్రకటన లీ గేయ రచనా కాలములో పెద్దపెద్దవి వివిధ పత్రికలలో ప్రచురింపబడినవి నేను చూచినాను. జింటాన్‌కు భోక్తృత్వము క్రియ కావుననే గణ సామ్యమును శబ్ద సామ్యమును కల 'తింటాన్' వెంటనే ప్రయోగింపబడినది. రచన మొత్తము ఇట్లు సాగినది. ఇంతకుమించి అనుహ్యాతముగాను ఓతప్రోత

1. (The Illusion and reality P. 290 - 91.
2 ఖడ్గసృష్టి 80 వ పుట.

ముగాను సాగెడి భావము వేఱొకటి అధివాస్తవిక ఖండికలలో మనమాశింప కూడదు.[1] 'శ్రీశ్రీ వ్రాసిన 'మాటల మూట'యను ఖండిక ఇట్టి రచనల కాద్యమని ఖడ్గసృష్టి సంపాదకు లభిప్రాయపడినారు.[2]

**ఫ్రాయిడ్ ప్రభావము :** జాగృత దశలో మానవునికి సమాజము సంస్కృతి కొన్ని నియమములు విధించుటచే పాశవికమైన, ఆటవికమైన, కామ వాంఛలు దమితమై సంస్కారవంతమైన భావములే బహిర్గతమగును. కాని వ్యక్తావ్యక్త స్థితినుండి అధివాస్తవిక రచన ప్రారంభించినప్పుడు కవిలోని కామ వాంఛలు కలలు కలలుగా జారి కలకలముతో కలమునుండి కవితగా రూపొందును. ఈ దశలో తన భావమును లౌకిక సమాజము మన్నించునా లేదా యను ప్రశ్న కవిలో లుప్తమగును. ఫ్రాయిడ్ ప్రతిపాదించిన యీ '(Libido)' తత్వము నాధారముగా చేసికొని పఠాభి ఫిడేలు రాగాలడజన్‌లో సీత అను గేయములో తన్ను రావణునితో పోల్చుకొని సీతను భావవీథలో తన కామపు కక్కుర్తికి ఎరజేసినాడు. అట్లే శ్రీశ్రీ ఖడ్గసృష్టి[3]లో 'ఏమిటి దంతపు చర్మంమీద ఎర్రటి, పచ్చటిదేదో మచ్చ లోతు లోయలో భూతాలు కొలిమినిప్పులో గుర్రాలు' అను టలో సుఖవ్యాధి పీడితురాలైన వేశ్య పథికుని ఉద్దేశించి తన మర్మాంగమెట్లు న్నదో వర్ణించుట సువ్యక్తము ఇట్లే నారాయణబాబు వితంతువులు తమ కామ వాంఛను 'ఉద్ధరైణ'తో తీర్చుకొందురని అసభ్యముగా వర్ణించినాడు.[4] సమాజము గర్హించెడి భావములను గర్వించుచు ప్రకటించుట అధివాస్తవికుల విశేషము!

**కమింగ్స్ ప్రభావము :** గణిత శాస్త్రాది సంకేతములను ప్రయోగించి శాబ్దికమైన చమత్కృతులు సాధించుటలో ఇ.ఇ కమింగ్స్ ఆంగ్లములో ప్రసిద్ధుడు. అధివాస్తవిక కవులు ప్రాచీనమైన శబ్దార్థాలంకారములను తిరస్కరించి నారు. కావున వైదేశిక రీతుల నాశ్రయించక తప్పలేదు. శ్రీశ్రీ ఖడ్గసృష్టిలో

---

1. ఈ అధివాస్తవిక గ్రంథిని విప్పుటకు శ్రీ అద్దేపల్లి రామమోహనరావుగారి వ్యాసము (ఆంధ్రప్రభ. దిన, కీలక వైశాఖ బహుళ సప్తమి. ఆది) సహాయపడినది.
2. ఖడ్గసృష్టి 84 పు.
3. 70 పుట. అభిసారిక కడసారి గీతము.
4. నారాయణబాబు తెండొయ్ బుుషులు గేయము.

మో/హం/దం/సం అనుటలో ఈ శబ్ద చమత్కారమే గోచరించును.[1] 'అంతాగ జీతగాళ్లే'[2] అనుటలో గజిటెడ్ ఆఫీసర్ (జీతగాడు) గజ-ఈతగాడు అను శబ్ద చమత్కృతి కలదు. ఆరుద్ర + – { వంటి సంకేతములతో చమత్కృతి సాధించినారు. పఠాభి తన కృతి ముఖచిత్రముపై ఫిడేలు అని వ్రాయుటకు బదులు ఫిడేలు బొమ్మను ముద్రించి నూతనత్వమును ప్రదర్శించినాడు 'మూడు' 'ఏడుస్తున్న' అనుటకు 8, 7స్తున్న అనుట **Thank you** అనుటకుగాను **'Thank U'**, **'Thankq'** అని వ్రాయుట ఇట్టి చమత్కారమే. కేవలమిది వైదేశిక ధోరణి. రుక్మిణీనాథశాస్త్రిగారు పేరడీలతో ఈ శబ్ద చమత్కృతికి ధ్వజమెత్తినారు.

**ఇలియట్-ఐన్‌స్టీన్‌ల ప్రభావము:** కృత్రిమమైన కాగితపు పూవు వంటి నగర జీవితములో గానుగెద్దువలె తిరిగెడి ఆధునిక మానవుని విషాద స్థితియే ఇలియట్ రచించిన 'మరుభూమి'కి (Waste Land) ఇతివృత్తము. అధివాస్తవిక కవులీ నగర జీవన చిత్రణములో ముందంజవేసినారు. ఆరుద్ర సినీవాలిలో 'పాడుతాను నాకు తెలిసిన నగరం గురించి। నగరంలోని నాతి గురించి నీతి గురించి। రకరకాల సన్నివేశాలలో ప్రకటించుతాను మనలాంటి మనుష్యుల గురించి అని నగర జీవనమును చిత్రించెడి కథాకావ్యము నల్లినాడు. నగరములోని వేశ్యను ఇతివృత్తముగా స్వీకరించి శ్రీశ్రీ పఠాభి నారాయణబాబులు ఖండికలు ప్రచురించినారు. అట్లే ఆరుద్ర త్వమేవాహమ్‌లో కాలస్వరూపమునకు గడియారమును దానిలోని ముళ్లను సంకేతముగా స్వీకరించి ఐన్‌స్టీన్ చెప్పిన నాల్గవ పరిమాణమును ప్రదర్శించినాడు ఈ విషయమును నవమాధ్యాయములో విస్తరించి మనవి చేసెదను. ఇట గమనింపవలసిన అంశము మాత్ర మొక్కటి కలదు. ఇలియట్ వ్యర్థనగర జీవితమునకు పరిష్కారముగా ఆధ్యాత్మిక వాదమును ప్రతిపాదించినాడు. అట్లే ఐన్‌స్టీన్ కూడ కాలమును ఈశ్వరునికి సంకేతముగా స్వీకరించినాడు. అధివాస్తవిక కవులీ ప్రతీకలను స్వీకరించి ప్రభావములకు లోనైనను ఆధ్యాత్మికత్వమునకు బదులు మార్క్స్ ప్రతిపాదించిన వర్గకలహమునే తమ ఆదర్శముగా గ్రహించినారు.

---

1. ఖడ్గసృష్టి 80వ పుట
2. విషాదాంధ్ర (ఖడ్గసృష్టి) 14వ పుట.

**ఉద్యమ పరిసమాప్తి:** మొదట అధివాస్తవికోద్యమ గీతములను ప్రకటించిన డేవిడ్‌గ్యాస్కాయిన్ 1942లో బుద్ధిపూర్వకముగా తన మార్గమును వదులుకొనుటతో పశ్చిమ దేశములలో ఇది అస్తమించినట్లే తెలుగులో పఠాభి నారాయణబాబుల అస్తమయముతో అధివాస్తవిక కవిత్వము తన ఉద్యమ స్థాయిని కోల్పోయినది. అట్లని తన ప్రభావము నిది తరువాతి కాలములో ప్రసరింపకుండ పూర్తిగా విడిచిపెట్టలేదు. కావుననే సి. నారాయణరెడ్డిగారు 'పఠాభితోనే ఈ ధోరణి అస్తమించినదను'[1] సహృదయముతో కూడిన వారి మాటలలో సంకల్పశుద్ధి కన్పడినంతగా సిద్ధి కన్పడలేదు. కావుననే వారు తమ పరిశోధనా వ్యాసమును ప్రకటించిన పిమ్మట తెలుగులో దిగంబరోద్యమము అధివాస్తవిక ధోరణిని, అరాజకవాదము డాడాయిజములను జత చేసికొని బీటల్స్, యాంగ్రీ యుగ్‌మెన్‌ల ఉద్యమమునకు సన్నిహితముగా బయలుదేరినది. ఇందలి ప్రధాన తత్వమును కూడ వివరించెదను.

## దిగంబర కవితోద్యమము :

తెలుగులో దిగంబర కవులు తమ ఉద్యమారంభించుటకు పూర్వరంగమును కొంత వివరింపవలసి యున్నది. అధివాస్తవికోద్యమము దొండపాదు వంటిది. తీగెను నిర్మూలించినను తిరిగి అవ్యవస్థితమైన సామాజిక పరిస్థితు లేర్పడినప్పుడది జీవశక్తితో మరల చిగురించును. దిగంబర కవులావిర్భవించిన నాటికి తెలుగుదేశములోని స్థితి అస్థిమితముగానే యున్నది. 1962 లో చైనా దురాక్రమణము జరిగిన నాటినుండి సమాజముతో ప్రకటితముగనో అప్రకటితముగనో అత్యవసర పరిస్థితి సాగుచునే యున్నది. నిరుద్యోగము పెచ్చు పెరిగినది. జాతినేత నెహ్రూ అస్తమించుట, పాకిస్తాన్ యుద్ధసన్నాహములు ప్రజలలో భీతావహమును కలుగజేసినవి సమాజములో ఒక విధమైన అరాజకత్వము ప్రబలినది. ఇట్టి స్థితిలో దిగంబర కవితోద్యమము అధివాస్తవికపు చెట్టునకంటు కట్టిన కొమ్మవలె పెరిగినది.

**ప్రభావ తత్వము :** డాడాతత్వము 1921 కి తరువాత నశించినదని బాహ్యదృష్టికి గోచరించినను 1950లో అమెరికాలోని బీట్ జెనరేషనును బ్రిటన్

1. ఆధునికాంధ్ర కవిత్వము. సంప్రదాయము- ప్రయోగములు 627 పుట.

లోని యాంగ్రీ యంగ్‌మెన్‌ను చూచినప్పుడీ అరాజక ధోరణి మృతినొందలేదని తెలియును దీనిని ఉద్యమ పరిశీలకుడు తప్ప సాహిత్య చరిత్రకారుడు నిర్వ చింపలేడు. ఒకానొక భావమును, ఒక వ్యక్తి లేదా శక్తి (ఉద్యమము), అనంత విశ్వములోనికి ప్రసారము చేసినప్పుడది నిత్యమై వాయుమండలములో కారణా వస్థలో నిలిచిపోవును. తిరిగి తదనుగుణమైన వాతావరణము అనంత కాలములో ఎప్పుడేర్పడినను గ్రాహకశక్తిగల మనస్సులు కొన్ని వానిని స్వీకరించి రేడియో వలె ప్రసారము చేయును. ఇది దేశ కాలావధులులేని ప్రభావము. నాడు తిరిగి భావము కార్యావస్థలోనికి పరివర్తనమందును. నేను ప్రతిపాదించిన యీ సిద్ధాం తమును దిగంబర కవిత్వమున కన్వయించి చూపెదను.

**ఉద్యమ స్వరూపము :** కేశవరావు, యాదవరెడ్డి, కమ్మిశెట్టి వెంకటే శ్వరరావు, వీరరాఘవాచారి, బద్దెం భాస్కరరెడ్డి, మనమోహన సహాయ్ అను నామములు గల వ్యక్తులు గుప్తముగా నగ్నముని, నిఖిలేశ్వర్, మహాస్వప్న, జ్వాలాముఖి, చెరబండరాజు, భైరవయ్యలను పేర్లతో దిగంబర కవిత్వము వ్రాయుట కారంభించుటతో ఉద్యమము ప్రారంభమైనది. వీరి కవితా ఖండికలకు 'దిక్కు'లని పేర్లు తమ తొలి సంచికను హైదరాబాదు ఆబిడ్స్‌లో నాంపల్లి పాండు అను రిక్షావానిచే ఆవిష్కరించుటతో దిగంబరోద్యమ స్వరూపము లోకమునకు తెలిసినది. గ్రంథావిష్కరణమునకు ముందు ముసుగుపీరుని బొమ్మతో కర పత్రములు పంచిపెట్టినారు. దానిపై కాలితో తన్నిన (అరికాలి) ముద్ర నద్దినారు. ముసుగుపీరుడు తమ ప్రచ్ఛన్న నామములకు ప్రతీక. కాలితో తన్నుట వర్త మాన సాహిత్యముపై తమకు గల జుగుప్సకు సంకేతము. గ్రంథావిష్కరణ ములు నాంపల్లి పాండు, కోటేశు విశాఖపట్టణము యశోదలను పీడితులైన భిక్షుకులచే అర్థరాత్రి చేయించుటతో గ్రంథావిష్కరణ మహాసభలపై తమ అసహ్యమును ప్రకటించిచారు. 1965 అక్టోబరు 31వ తేదీ ధర్మయుగ్ పత్రి కలో దిగంబర కవులు తమ ఆశయములను తెలుపుచు ఒక వ్యాసము ప్రకటించు టతో ఇది పెద్దల దృష్టి నాకర్షించినది. ఉద్యమము తీవ్రతరమైన కొలది చంద్ర మొదలైన యువకులెందరో వీరి ప్రభావమునకు లోబడినారు. ఇస్మాయిల్ అను మరొక కవి వీరితో కలియకుండ సన్నిహితముగా వచ్చినాడు. సాహిత్య ఎకా డమీ సభలు హైదరాబాదు సారస్వత పరిషత్తుకడ జరుగునప్పుడు వీరు సభలోని

పెద్దలను వారి బుద్ధులను నగ్నముగా విమర్శించుచు కరపత్రము లచ్చుకొట్టి,[1] తామే స్వయముగా పంచిపెట్టినారు ఉద్యమ కార్యక్రమముల కిది పరాకాష్ఠయని చెప్పవచ్చును. తమ మూడవ సంపుటి ముఖచిత్రముపై ఎరుపు రంగులో కాలి ముద్రను ముద్రించి తెలుగు పాఠకుల మనస్సులపై విద్యుత్తును ప్రసరింపజేసి చికిత్స (Shock Treatment) కున్ముఖులైనారు.

**ప్రతిఘటనము - పురోగమనము :** దిగంబర కవుల చర్యలను చూచి విమర్శకలు దుయ్యపట్టనారంభించినారు. విశ్వనాథ సత్యనారాయణగారు 'వీరె వరో నాకు తెలియద'[2] ఉపేక్షామాత్ర దండన విధించినారు. కె వి. రమణా రెడ్డిగారు దీనిని 'సాహిత్య స్టంట్'[3]గా అభివర్ణించినారు ఆరుద్ర 'ఈ కవులు వాల్మీకిలాగా కాక కూచిమంచి జగ్గకవిలాగా తిటుతున్నారు. అందుకే కవిత్వం తగ్గి కసిత్వం పెరుగుతోం'[4]దని వీరిని తిట్టుకవుల జాబితాలో చేర్చినారు. కాని వీరు విమర్శల నధిగమించి పురోగమించినారు. జ్యోతి, ఆంధ్రజ్యోతి, భారతి వంటి పత్రికలు వీరి ఉద్యమమునకు చేయూతనిచ్చి నిలిచినవి. జయభేరీ పత్రిక వీరికి నీరాజనము సమర్పించినది. వీరి సామ్యవాద చింతనమును చూచి 'జ్వాల' తనలో కలుపుకొనవలెనని ఆరాటము కనబరచినది.[5] శ్రీశ్రీ వీరిని చూచి సంతోషించి వీరినుండి 'కొత్త ఉద్యమం బయలుదేరి అది ప్రజాఉద్యమానికి పురోగామిగా ఉండవచ్చు'[6]ననుట వీరి తలకొక తురాయివలె భాసించినది. ఈగుర్తింపు

1. డాడాయిష్టుల ప్రదర్శనములో స్త్రీ వేదికపై అశ్లీల గీతములు పాడుట మలమూత్ర విసర్జనశాల నుండి స్వాగత ద్వారము నేర్పరచుట ప్రేక్షకులను కోడిగుడ్లతో కొట్టుట మన మీ సందర్భములో స్మరింపవలసి యున్నది. ప్రపంచ యుద్ధ వికృతులవి. చైనా-పాక్ దండయాత్రల వికృతులివి !
2. 1965 దీపావళి కృష్ణాపత్రికలో ఇంటర్వ్యూ.
3. కిలక. ఉగాది సంచికలో నిఖిలేశ్వర్ సృజన (నయాకవిత - ఆ తర్వాత నవం. 68) వ్యాసాన్ని విమర్శిస్తూ 162 పుటలో
4. ఆంధ్రప్రభ 16-4-69. (వార)లో సమీక్ష 71 వ పుట
5. 1969 మార్చి 28 సంచిక.
6. ఆదే

ఉద్యమ ప్రగతికొక స్పష్టమైన చిహ్నము. 'తెలుగు కవిత్వంలో కూడా విప్లవం రాబోతోంది అందుకు మహాకవి (శ్రీశ్రీ) తరువాత ... సూత్రధారులు దిగంబర కవులం'ని జ్యోతి సంపాదకులు వీరికి వెన్నుదట్టి నిలిచినారు.[1] ఇట్లే హిందీ ఇంగ్లీషు రచయితలును వీరికి గుర్తింపు నిచ్చినారు.[2]

**తత్వ పరిశీలనము :** దిగంబర కవులపై అధివాస్తవికోద్యమము, డాడాయిజము, అరాజకవాదము, బీటల్స్, యాంగ్రీయంగ్‌మెన్‌ల ఉద్యమములు తమ ప్రభావమును చూపినవి. అట్లీనివీరు పై ఉద్యమకారులతో తాదాత్మ్య మందుట కంగీకరించలేదు. మార్క్సువర్గ కలహతత్వమును వెన్నెముకగా చేసి కొని తామొక స్వీయమైన ఉద్యమమును కల్పించుకొన సాగినారు. అందువలననే డి. అంజనేయులుగారు 'వీరుగతి తార్కిక భౌతికవాదము కన్నా పురోగమించిన వ్యవస్థను కోరుతున్నా'రని వ్యాఖ్యానించినారు.[3] వీరిలో పరిమితి లేకున్నను నిజాయితీ కలదనినారు '(They don't lack sincerity, maturity is another matter)'[4] 'నేటి చెత్త వ్యవస్థని సమూలంగా తొలిగించి నిత్య నూతన మహత్తర వ్యవస్థకోసం తపన పడుతున్నా'[5]మని దిగంబర కవులు ప్రకటించుకొనినారు. ఈ భూగోళంపై దారిద్ర్యం ఆకలి అలుముకొని వున్నంత వరకూ మార్క్సిస్టు దృక్పథాన్ని సవాలుచేసే అధికారం ఎవరికీ లేద'[6]నుటలో వారు సైద్ధాంతికముగా వర్గకలహము నాశ్రయించిరనుట స్పష్టము. 'మనిషి

---

1. 1968 దీపావళి సంచిక - తొలిమాట.
2. ప్రభాకర్ మాచ్వే 'ఏకాక్' బెంగాలీ పత్రికలో (1968 ఏప్రిల్) సమ కాలీన భారతీయ సాహిత్యమను వ్యాసములో వీరికి బీటల్స్‌తో పోల్చి పర్ణించినారు- అట్లే డి అంజనేయులు 1967 July - Sep. Indian writings Today' లో వీరిని 'Literature of protest' గా అభి వర్ణించినారు (68 పుట)
3. 1967 July 'Indian writings today' trends in Telugu writings 69 p.
4. అదే.
5. దిక్‌లు 80 సంపుటి 2. లో 'మేం ఏం కోరుతున్నాం.'
6. 8 వ పుట.

భౌతికవాంఛ నిజం. కర్మసిద్ధాంత భయంతో రాళ్ళకు మొక్కేవాడు నిజమైన నాస్తికుడనుట'[1]లో వారు సంప్రదాయమును పరాభి, నారాయణబాబులవలె తీవ్రముగా ద్వేషించుచున్నారని అర్థమగును. 'కుళ్ళి గబ్బుగొడుతున్న కులమత వర్ణ వర్గపు బురదగుంట[2]'ను నిందించుటలో వీరు నూతన వ్యవస్థకై పురిటి నొప్పులు పడుచున్నట్లూహింపవచ్చును. 'ఆంధ్రుడు రోజురోజుకీ మరింతగా నపుంసకుడగుట'కు వీరు ఆఱు కారణములు చెప్పినారు.[3] 1) ఉపన్యాసాల నంగి వెధవలు 2) కోడె విధవల్ని మరిగిన బాబాలు 3) తోలు వ్యాపారం సాగించే.... సినీ హీరోలనే మదత కొజ్జాలు 4) యింత చెత్తదేశం మీద పోస్తున్న వారపత్రికలూ పత్రికాధిపతులూ 5) రాజకీయ నంగి వెధవలకీ సినీ మదత కొజ్జా కన్నా గిట్లకీ సాహిత్య అనాధ మీల్బహుమతులకీ చొంగ కార్చుకుంటూ వారపత్రికల్లో వాంతులు చేసుకుంటున్న రచయిత పందులు (అందులో మళ్ళీ రెండు. ఆడపందీ, మగపందీ. ఇదిగాక జిల్లా) 6) మన విశ్వవిద్యాలయాలు- దీనినిబట్టి దిగంబర చింతనము వ్యాఖ్యాన నిరపేక్షముగా తెలియగలదు.

**ప్రభావము :** దిగంబర కవులపై వివిధోద్యమముల ప్రభావమున్నదని చెప్పితిని గీతమునకు 'దిక్'అని డిసెంబరు నెలను మదిర రుతువుగాను పిలుచుటలో వీరు ప్రతీకలను అధవాస్తవికులవలెనే స్వీకరించిరని బోధపడును మదిర = రాజకీయాలమత్తులో వున్న యీ కాలానికి సంకేతమ[4]ని వారే వ్యాఖ్యానించుట అందులకు స్పష్టమైన వివరణము. దిగంబరవి కాకముందే కేశవరావు లాండ్ స్కేప్[5] అను గీతములో 'బం। టరితుం। టరిరా। త్రిక। న్నుగిబే చు। క్కుచ। క్కులిగింత కాం తికిం। దఇసుకతి। న్నెపిదను। ........ సముద్రం!!' అని రచించుట కమింగ్స్ ప్రభావముతో పిఠాపురం రాజాప్రభృతులు చేసిన వైచిత్రికన్నను భిన్నముకాదు. 'కవిపందుల్ని అగాధమీలనే అనాధ శరణాలయాలనీ ఏ దేశమేగినా ఎందు కాలిడినా కారంతో పౌర్లించిన రోకళ్ళతో పట్టపగలు విషయిం

1. 10వ పు.
2. మేం ఏం కోరుతున్నాం
3. 3 సంపుటిలో
4. 2వ సంపుటి
5. ఉదయించని ఉదయాలు 64వ పుట.

చాల'[1] నుట 'మౌన శంఖం' కెందులోను తీసిపోదుకదా!' 'నావీర్యం నిండా రేడియో ధార్మిక కిరణాలు'[2] 'సుబ్బులక్ష్మి సిగ్గు గగనానికి నా పాంటు గుండీలకి నడుమ పొద్దు పొడవదు'[3] 'తృష్ణ తొండ లా సాగింది'[4] 'పాంటులోనే పూజా ద్రవ్యాల్ని ఒలక బోసుకోవడం'[5] వంటి వాక్యములు చూచినప్పుడు నారాయణ బాబు మృతి చెందెనని ఎవరు చెప్పినను నమ్మబుద్ధి పుట్టదు. నీ మెదడు పురుగు తినేసింది.... నీ అవయవం పుచ్చిపోయింది.... నీ మనసు కక్కసుగా మారింది.[6] అనుటలో యాంగ్రీ యంగ్‌మెన్‌ల ద్వేషము కన్పించును. 'మానవత్వాన్ని తప్ప మరో మతాన్ని'[7] అంగీకరించనని దిగంబర కవి చెప్పినను ఆతని ధోరణి మాత్రము మానవతపై అవిశ్వాసమును భవిష్యత్తులో కవితను గూర్చి భయము కలిగింపక తప్పదు.

**ఉపసంహారము :** మిగిలిన ఉద్యమముల వలెనే ఇదియును 1970 తర్వాత కాలగర్భములో కలిసిపోయినది. కమ్మిశెట్టి వెంకటేశ్వరరావు సాయి బాబా భక్తుడైనాడు చెరబండరాజు అస్తమించినాడు మిలిగినవారు తీవ్రవాద మార్క్సిష్టు దృక్పథముతో తాదాత్మ్యము చెంది తమకొక సిద్ధాంత బలమును సంతరించుకొన్నారు. ఇట్లు ఈ ఉద్యమము తర్వాతికాలములో విప్లవ కవిత్వములో భాగమైపోయినది.

---

1. కాస్మిక్ జాతికోసం. నగ్నముని 13 వ పుట
2 హృదిక్ - నగ్నముని 38 వ పుట
3 మొహమ్మిద చంద్రుడు నగ్నముని 46 వ పుట
4 పునర్ యోనీ ప్రకాశం - జ్వాలాముఖి 50 పుట
5. దిక్ 16 నగ్నముని 62 పుట
6. కొజ్జాల కామకేళి చూస్తున్నాను. నగ్నముని 18 వ పుట
7. భైరవయ్య 3. సం 116 వ పుట

## చతుర్థాధ్యాయము

# రూపవిప్లవములు

### వ్యావహారిక భాషోద్యమము :

"నాది ప్రజోద్యమం. ఎవరినీ సంతృప్తిపరచడానికి దాన్ని వదులుకోలేను"

—గురజాడ

ఉద్యమము ఆర్థికముగనే కాక శాబ్దికముగా కూడ సాగును. భావమును వ్యక్తీకరించునది భాష. శబ్దార్థములకు గల ఈ సంబంధము పార్వతీ పరమేశ్వర తత్వముల వంటిదని కాళిదాసు వర్ణించినారు. వ్యాకరణము అసాధువులైన శబ్దములకు గతి కల్పించును. కవులు దానిని ప్రయోగించి ప్రచార మొనర్చెదరు. ఇది అనాదిగా వచ్చెడి సంప్రదాయము. కాని వ్యాకరణ ప్రయోజనము భాషాసంస్కారమా లేదా సంహారమా, యను చింతన ఆంగ్లేయ ప్రభావముతో పందొమ్మిదవ శతాబ్దము నుండి ఆంధ్రదేశములో ప్రారంభమైనది. ఇరువదవ శతాబ్దపు పూర్వార్థమంతయును కవిపండితుల కాలమునకీ చర్చయే గ్రహణమైనది! కురుక్షేత్ర సంగ్రామములోవలె తాత తండ్రులు, అన్నదమ్ములు నయిన కవిపండితులు ఇరువంకలను వేఱువేఱు శిబిరములలో నుండి సాగించిన ఈ భాషాపరమైన మహోద్యమ సంగ్రామ చరిత్ర యేనాడును ఆంధ్రులు కని విని యెఱుగరు. దాని చరిత్ర, స్వభావముల నీ ప్రకరణమున వివరింతును.

**వ్యావహారికము - ఉత్పత్తి విచారము :** ప్రజల వ్యవహారమందున్న భాష వ్యావహారికము. ఇది లక్షణ విరుద్ధమైనది. సూరిగారు దీనిని 'గ్రామ్య' మని బాలవ్యాకరణములో నిరూపించి ప్రయోగానర్హమనినారు. సమకాలీన భారతీయ భాషలలో కూడ 'చల్‌తీ భాష'ను శిష్టులు అంగీకరింపలేదు. ఈ సందర్భములో ఇతఃపూర్వమందున్న సంస్కృతాంధ్ర వైయాకరణుల అభిప్రాయము కూడ పరిశీలింతము!

పాణిని ఇత్యాదులు అపభ్రంశములను అపశబ్ద పర్యాయముగ జెప్పిరి.

ఆచార్య దండి 'శాస్త్రేషు సంస్కృతా దన్యదపభ్రంశత యేరితం' అనినాడు. శౌరసేని, మాగధి ఇత్యాదులిట్టి సంస్కృతభాషా పరిణామ భాషలే. అనఁగా తెలుఁగు కూడ అట్టిదేనని భావము.

'సకల జగజ్జంతూనాం వ్యాకరణాదిభి నాహిత సంస్కారస్సహజో వచనం వ్యాపారః ప్రకృతిః తత్ర భవంతత ఆగతం వా ప్రాకృతం' అనగా సకల జంతువులకు వ్యాకరణాదులచే అసంస్కృతమై, సహజమైన వచన వ్యాపారమే ప్రకృతి. తద్భవమైనది ప్రాకృతము. దీనినిబట్టి ప్రాకృతములకు తొలిదశలో వ్యాకరణములక్కఱ లేకుండెననియును తరువాత తరువాత సూత్రబద్ధమైనవనియును శాస్త్రకారుల మతము. 'ఆభీరాదిగిరః కావ్యేష్వపభ్రంశతయే రితం' అని దండి వచనము. అనగా యాదవులు మొదలైన వారి పలుకులు అపభ్రంశములనినాడు. వారు 'అట్టా, ఇట్టా, ఏట్టా'వంటి పదములు ప్రయోగింపరాదని శాసించినారు 'అపభ్రంశం ప్రయుంజానా నరకం యాంతిమానవాః' అనుటలో సంస్కృత విరుద్ధమైన దేశ భాషల స్థితికూడా పూర్వమిట్లే యుండెడి దని తాత్పర్యము. కర్పూర మంజరిలో రాజశేఖరకవి 'సంస్కృత భాష పురుషుని వలె మోటుగ నుండును ప్రాకృతమైనచో సుందరివలెనే సుకుమారమైనది.' అని ప్రాకృతమును గౌరవించినాడు. అందువలననే వ్యాకర్తలు మ్లేచ్ఛమని దీనిని నిందించినను లెక్కింపక ప్రయోగించినారు.[1] అట్టి శాసనస్థమైన కొన్ని ప్రయోగములివి :

1) ఎ. పి. IV 1108 పిఠాపురంకులోత్తుంగ మన్మగొంక రాజుల మహాదేవులు ఉ॥ అఖండమున్నూ, ఉత్సవార్ధమున్ను.

2) హైదరాబాదు III 1157. ఓరుగంటి దరి. ఉపర్పల్లి. కాకతి గణపతి దేవుని ప్రధాని ఉ॥ వనమునూ సర్వమునూ.

3) ఎ. పి. XII 1168 మోటుపల్లి కాకతి గణపతి దేవుని అభయ శాసనము ఉ॥ ఎల్లవారికిన్ని, ముత్యాలకూ.

4) త్రిలి. III 40. 1281 నందలూరు. కాకతి ప్రతాపరుద్రదేవ మహారాజు ఉ॥ ఇస్తిమి

---

1. 'క్షితి మ్లేచ్ఛ వ్యవహార హాని సంధిలు కతనన్ విడువకూడదు' అప్పక. 1-169.

5) ఎ. పి IV 1259 దోనెంపూడి. ఆంధ్రఖండ మండలాధిపతి నామ నాయకుడు. ఉ॥ పెట్టింది.

6) ఎ. పి IV 313. పిఠాపురం. కాటమరెడ్డిం గారికిన్ని.

7) లోకల్. శృంగా. 1330 కొమరగిరి ముక్కంటిరాజు ఉ॥ రాజుగారి కిన్ని-;

8) డిటో. 1330 - పొన్నుపల్లి వేమారెడ్డింగారు ఉ॥ వచ్చేవాఁగున్ను.

9 ఎ పి IV 1336 ద్రాక్షారామం. వేమారెడ్డిగారి భృత్యుడు ఉ॥ దేవుం కున్ను.

10) లోకల్. శృంగా. 1336 కల్వపాముల వేమారెడ్డిగారు ఉ॥ అట్టికనూ యిన్నీ,

11) డిటో - 1336 పొన్నుపల్లి డిటో ది॥ రెండున్నూ

12) ఎ పి 1350 తక్కెళ్ళపాడు రెండవ దేవరాయలు ఉ॥ సంధుకు

13) ఎ.పి XIII 1356 వేమవరం. అల్లయ వేమారెడ్డింగారు ఉ॥ పొదలున్ను

14) త్రిలి. III 40-1428 నందలూరు సాళువ నరసింగరాయల సేనాపతి ఉ॥ చేస్తుండే.

15) సా. ప. (ఆనంద) 1434 తిరుపతి. కృష్ణరాయలు ఉ॥ యింతవట్టునూ

16) కవి జీవితములు. 1440. కోట కాగ్రహారం. అల్లసాని పెద్దన. ఉ॥ ఇస్తిమి.

17) డిటో. 1.441 సింహాచలం కృష్ణదేవరాయలు ఉ॥ నడిచేటందుకు కూడా - పోతారు.

18) త్రి లి. III 40. 1541 నందలూరు, సదాశివరాయలు ఉ॥ నంభై ఒకటి

19) ఎ. పి. ఇండోమోస్లా 1587. గోల్కొండ సుల్తాను అబ్దుల్లాకుతుబ్‌శాహి. ఉ॥ పుచ్చుకుంటున్నాము-చాలా.

20) ఎ పి XVI 1630. తిరిచినాపల్లి. విజయరంగ చొక్కనాధ నాయనిం గారు. ఉ॥ వుండేటందున - చేసుకొను.

21) నెల్లూరు పు 436 - 1718. ముత్యాలపాడు. కలిగిరి సుందరయ్య ఉ॥ నడిపిస్తూ, రెండో

ఈ తీరుగ "వ్యావహారిక భాషా ప్రయోజనములతో శిష్ట సంప్రదాయ సిద్ధమైనది ఒకటి, వ్రాతలయందు కూడా తెలుగుదేశ మంతటా 700 సంవత్సర ములు శిలాక్షరమై ఉన్నట్లు రుజువు చేసినారు "[1]

నన్నయ భట్టారకులు భారతముతో పాటు ఆంధ్రశబ్ద చింతామణిని కూడ రచించినారు. కాని ఆ లక్షణము వారి భాషా ప్రపంచములో శతాంశమయినను సంస్కరింపలేదని కొందఱు వాదించినారు. 'కాబట్టి అసంస్కృతము, గ్రామ్యము (అపభ్రంశము) అనినచో భాగ్వతాదులకే ఆ దుర్గతి పట్టును'[2]

కోటి వెంగనార్యుడు ఆంధ్ర భాషార్ణవములో 'దేవతల భాష గావున దెలుగు కన్న సంస్కృతము మిన్న' యని కూడ

'కాన నీ యాంధ్ర కృతులందు గలుగునట్టి
పదములకు నెల్ల నర్థమేర్పడెడు రీతి
నద్భుతంబుగ గృతిని జేయంగ వలయు
నర్థమైన రసన్ఫూర్తియగుట యరుదె' అనినాడు. విదేశములలో

గ్రీకు-లాటిను భాషలకిట్టి స్థితియే యుండెడిది విద్వాంసులు వాని నభ్యసించి జన సామాన్యమునకు అందలి భాగము వివరించెడి వారు మత గ్రంథములు, తర్క, జ్యోతిశ్శాస్త్రములు బైబిలుఁను దేశభాషలలో వ్రాసినచో వెలివేసి కఠిన ముగా శిక్షించెడివారు. అట్టి స్థితియే సంస్కృతాంధ్రముల సంబంధములో నేర్ప డినది.

తిక్కనగారు 'ప్రాత తెలుగు'ను సహింపలేదని, 'పలుకుల పొందులేక రసభంగము సేయుచుఁ బ్రాతవడ్డ మాటలఁ దమనేర్పు చూపి యొకటన్ హృద యం బలరింపలేక'పోవు వారిని నిరసించుటనుబట్టి సువ్యక్తము. 'అపశబ్దంబుల గూడియున్ హరిచరిత్రాలాపముల్ సర్వపాప పరిత్యాగము సేయు'ననుటలో అపశబ్దసహితమైనను సువ్యక్తమైన భావమైనచో చాలునని పోతనగారి మతము. అబ్బయామాత్యుడు లాక్షణికులనే నిరసించినారు "చెల్లునటంచు నొక్క కవి

1. వ్యావహారిక భాషా బహిష్కార నిరసనము వ్యాసావళి గిడుగు. 16వ పుట.

2. వాసా సూర్యనారాయణశాస్త్రి. గిడుగువారి సప్తతితమ జన్మదినోత్సవ సంచిక -

చేసిన లక్షణ మొక్కరివ్వలన్। జిల్లమిఁజేసి తారొకటి చెప్పగ ఛాందస విస్త రంబు సంధిల్లుటఁగా వ్యళం కలవ నిందఋ చయ్యెరసజ్ఞులార" (కవిరాజ మనో రంజనము).

ఆధునిక కాలమునకు- ముఖ్యముగా సంధి యుగమునకు వచ్చుసరికి భాషపై కవులకున్న భావములు మారినవి సంకెలలు విడివడసాగినవి. తిరుపతి వేంకటేశ్వర కవులు 'కాలముబట్టి.... నన్యదేశ్యలును' ప్రయోగించుట సత్కవి సమ్మతమేననినారు. ఈ దశలో జన్మించినారు గిడుగు పిడుగు !!

**రామమూర్తిగారి వాద సారాంశము :** గిడుగు రామమూర్తిగారీ కాలములో వ్యావహారిక భాషోద్యమమును నిర్వహించుట ఆకస్మికము కాని కాక తాళీయము కాని కాదు కాలానుగుణ్యమైన సహజ పరిణామమది. రామమూర్తి గారు దానికి నాయకత్వము వహించుట మాత్రమే కాకతాళీయము. దీనికి అంతర మైన బాహిరమైన కారణములెన్నో దోహదము చేసినవి. కాల్డ్వెల్, గుడ్విన్‌లు నాటిన ద్రావిడ భాషావాద బీజములు పక్వమునకు రాసాగినవి. సామ్యవాదపు సమీరములు నలుదెసల వ్యాపింప దొడగినవి గ్రౌసు, బట్స్, కూర్టెస్ దొరల వంటివారు తెలుగులో తెలియకుండ నొక అంతరమైన పరిణామమునకు దోహ దము చేసినారు. ప్రజల భాష, ప్రజాకవిత్వము, కళలు ప్రజలకొరకు అనెడి నినాదములతో వాయుమండలము నిండినది. తదనుగుణముగా సాహిత్యములో ధృవతారవలె గురజాడ నిలుచుట- ఈ అండదండలన్నియును గిడుగు రామ మూర్తిగారి నొక ఉద్యమ పురుషునిగా మార్చినవి. రామమూర్తిగారు వాడుక భాషను ప్రవేశపెట్టుట వేడుకకై చేసిన పనికాదు. జీవితము దానికంకితమొనర్చి సాగించిన వీరవ్రతమది !

రామమూర్తిగారు తమ వాదమునకుపబలకముగా పాణిని నుండి ప్రమా ణమును స్వీకరించిరి వైదిక భాష వ్యవహార భ్రష్టమగుటచేతనే వారు సంస్కృ తమను నిర్మించిరి. అట్లే నన్నయాదుల భాష నేడు ప్రజలనుండి దూరమైనది. నన్నయగారు కూడ తన సమకాలీనమైన సుబన్తతిఙన్త రూపములనన్నిటిని కృతిలో ప్రవేశపెట్టలేదు అందుకు కారణమవి మరుగున పడిపోవుచుండుటయే ! నేడు నన్నయగారి భాషకే ఆ గతి పట్టినది !

ఇస్తివి, చేస్తివి, ధారపోస్తివి, ఇచ్చేవారు, హెచ్చేది, అయితే ఎలా, అంతా, అనిన్నీ, వాళ్లు, వాటికి ఇత్యాది పదములు అసంఖ్యాకములు తెలుగు వ్యాకర్తలచే గ్రామ్యములని నిషేధింపబడినవి. "ఈ పదములు రామస్తవ రాజీయము, పట్టాభి రామాయణము, శతకములు శాసనములు, ధర్మశాస్త్రాది గ్రంథముల వ్యాఖ్యానములు మొదలగువాటి యందున్నూ శిష్టవ్యవహారమందున్నూ అనేక శతాబ్దముల నుండి అఖండవ్యాప్తి కలిగియున్నవి ఇట్టి ప్రయోగమహితములయిన పదములను గ్రామ్యములని నిరాకరించుట భాషాసంప్రదాయ విరుద్ధము. వలయుచో వాటిని సంగ్రహించి సంస్కరించుటయే వ్యాకర్తల ధర్మము. జీవద్భాషలు నిత్యము పరిణమించే స్వభావము కలవి. వాని పరిణామమును అభివృద్ధిని నిర్బంధించుట కెవ్వరికిని ఎన్నడును శక్యముకాదు."[1]

రామమూర్తి పంతులు గారొక ప్రశ్నను వేసినారు. గ్రాంథిక భాష అనగానేమి? గ్రంథస్థమయినది కదా! గ్రంథములనగా కేవల ప్రబంధము లేనా? శతకములు, ద్విపదలు కళికలు జావళీలు పాటలు పదములు, కృతులు, కీర్తనలు, దండకములు. కృతక గ్రాంథికములేని ఈ కృతులన్నియును త్యాజ్యము లేనా? వానిని గ్రంథములనరాదా? అని ప్రశ్నించినారు. తాళ్లపాక అన్నమాచార్యులవారి శ్రుతి, శాస్త్ర పురాణ సదృశమైన పదరచనలో వారు గ్రామ్యోక్తులను బహిష్కరింపలేదు సరికదా అవి ఎట్లు ప్రయోగింపవలెనో విశేషించి విధించినారు అంతేకాదు త్యాగయ్యగారు "ఉపచారము చేసేవారున్నారని మరువకురా, ఉండేది రాముడొకడు, చేడేబుద్ధి మానురా, ఎవరని నిర్ణయించేదిరా, రాజువెడలె జూతామురావె, చింతిస్తున్నాడే యముడు, ఇంకా దయరాకుంటే ఎంతనిసైరింతునురా' మొదలైన ప్రయోగములు సహజమైనవి చేసినాడే. ఇవి కూడ గ్రాంథికులకు అస్పృశ్యములేనా? అని ప్రశ్నించినారు. వ్యావహారికము సహజ భాష కావుననే శహాజీ, విజయరాఘవాదులు తమ యక్షగానములలో వ్యావహారికముచే ప్రవేశపెట్టి ప్రజల మన్ననలను చూరగొనినారు :

'పార్వతీ పరిణయ' యక్షగానములో శహాజీ వాడిన వ్యావహారికము :
సూత్రధారవచనం :- యవరోయి భాగవతుల్లారా ! విఘ్నేశ్వరుండు వచ్చినాడే

---

1. వ్యాస సంగ్రహము - పుటలు 233-34.

పూజ సేసేటందుకు పూజారి వాణ్ణి పిలవవోయ్- పూజారి వచనం: నేనైతే వచ్చి నాను, పరిచారకుణ్ణి పిలిపించండా-; అట్లే పారిజాతాపహరణములో:

'పలుమారు నాకొంగు పట్టేవదేమిరా
మా అత్త వింటేను మాటవచ్చు' అను ప్రయోగమున్నది కదా! అంతేకాదు ఈ క్రింది వాక్యము చూడుడు: "రామాయణార్థంబు అందరికీ తెలియడానికి వచన రూపంబుగా మార్కండేయ మహాముని పాండునందనులకు చెప్పిన ప్రకారం సింగరాజు దత్తాత్రేయులు చేసుకొన్న పుణ్యకథ సంపూర్ణం" అని రచయిత వ్రాసికొనినాడు. ఇది ప్రజల భాష. కృతక భాషకాదు. ఈ జీవ ద్భాషనే ప్రయోగింపవలెను. "పండితులున్ను వారి నిరంతర బోధచేత మూఢులై ఉన్న వారి శిష్యులున్ను.... సభ్యమని మెచ్చుకునే గ్రాంధికాంధ్రము ఎవరి నోటనూ వెల్వడదు. ఎవరి చెవినా పడదు. ఇకనైనా పెద్దలు మేల్కొంటారా" ఇదియే గిడుగువారి రూపవిప్లవ శంఖారావము!

**ఉద్యమ స్వరూపము:** క్రీ. శ. 1906 వ సంవత్సరములో 'ఏట్సు' అను విదేశీయుడు విద్యాధికారిగా వచ్చినాడు. ఆయన తన సౌకర్యార్థము భాష నేర్చుకొనినాడు. గ్రాంథికము వచ్చినది. కాని మాటలాడునది వ్యావహారికము- గ్రామ్యము; దీనితో ఆయన అయోమయములో పడిపోయినాడు. పాఠశాలలో భాషాబోధన పద్ధతిని గమనించినాడు. ఉపాధ్యాయులను ప్రశ్నించి చూచినాడు. ఎన్ని నెలలు జరిగినను అదే పాఠము,- ముందుకు సాగదు. పండితులు 'సమాస దండాన్వయ శబ్దక్రమమును బోధింపనిదే పాఠము ముందుకు సాగదనినారు. దీనితో ఏట్సుదొర విద్యాబోధనములోని లోపమును స్పష్టముగా గ్రహించి పరి ష్కార మార్గము నన్వేషింప సాగినాడు. ఈ దశలో ఆయనకు చేయూతగా దొరికినవాడే రామమూర్తి పంతులుగారు.[1]

ఏట్సుదొర 1907 లో విశాఖపట్టణములో ఉపాధ్యాయ పరిషత్తు సమా వేశము నేర్పాటుచేసి అందు రామమూర్తి పంతులుగారిని ప్రసంగింపుమని కోరి

---

1. "నోటి మాటకు చేతివ్రాతకు సన్నిహిత సంబంధమున్నచో నేర్చుకొనుట మిక్కిలి సులభము. కాని తెలుగు స్థితి అట్లులేదు నాగరికులే స్వదేశ భాష మాట్లాడలేరనగా యూరపులో నవ్వుతారు" అనినారు గిడుగువారు. అందులకు ఏట్సు సహవాసమే కారణము.

నాడు. గిడుగు వ్యావహారిక భాషా సిద్ధాంతమును తొలిసారిగా ఆ సమావేశములో ప్రవేశపెట్టినారు. గ్రాంథిక భాషా తిరస్కారము, వ్యావహారిక భాషా ప్రతిపాదనము జరిగినప్పుడు పండితులంతగా పట్టించుకొనలేదు. ఏదో వ్యాకరణము-భాషాశాస్త్రము గూర్చి ప్రసంగించినాడనియే భావించినారు మఱల రెండవ ప్రసంగము 1908లో చేసినారు ఇది కొందఱి కర్థమయినది. భిన్నాభిప్రాయములు ప్రారంభమైనవి. తదనంతరము మూడవ ప్రసంగము 1910లో మూడవ మహాసభలో చేసినారు ఇది కల్లోలమునకు కారణమయినది. ప్రేక్షకుల నుండి, వేదికపై నుండి కూడ అనుకూల ప్రతికూల వాదము లప్పటికప్పుడే ప్రారంభమైనవి. సభాధ్యక్షులు కళాశాల ప్రిన్స్‌పాల్ శ్రీ కిళాంబి రామానుజాచార్యులవారక్కడే గిడుగు వాదమును ఖండించి "మీరు తెలుగు భాషా మాధుర్యమును చెడగొట్ట దలచినారా ?" యని ప్రశ్నించినాడు[1] ఈ తీరుగా ప్రజోద్యమమున కిచ్చట బీజములు పడినవి ! వ్యావహారిక భాషోద్యమము విశ్వరూపమెత్తి విజృంభింపసాగినది ! !

1911వ సంవత్సరములో గిడుగువారు ఉపాధ్యాయ పదవినుండి విశ్రాంతి పొందినారు దానితో 1911 నుంచి 1912వ వఱకును లేయింబవళ్లొక పరిశోధ విద్యార్థివలె శ్రమచేసి ప్రయోగములు సాధించి వ్రాసి పెట్టుకొనినారు. 1912 డిసెంబరు 21వ తెదీని కృష్ణా పత్రికలో ఒక లేఖ ప్రచురింపబడినది. మదరాసు గవర్నరుగారికి కందుకూరి వీరేశలింగం పంతులుగారు గ్రాంథిక వాదుల పక్షమున ఒక విజ్ఞాపన పత్రమును సమర్పింపగా దానిని వ్యావహారిక వాదులు గిడుగువారి పక్షమున విమర్శించినారు. "ఈ చిన్నియర్జీ యందించుమించుగా నెనుబదిచోట్ల నియమ భంగములు కలవని" పర్యుం చిన సీతారామశాస్త్రి గారు ఎత్తిచూపినారు. సంయమముకల గురజాడ కూడ ఉద్యమము తీవ్రమగుటతో గిడుగు పక్షమున నిలబడి "(ఈ) మనుష్యులకు బుద్ధులులేవా ? ... కళ్లు లేవా ?.... వగలు బొగులుతారేమి ? ఎన్నడూ ఏ దేశం యెరుగని దౌర్భాగ్యపు భాషను రాస్తూ అది తలుచుకు ఆనందిస్తున్నారు"[2] అని తీవ్రముగా విమర్శింపక తప్పలేదు.

---

1. సాహిత్యోపవ్యాసములు - సాహిత్య ఎకాడమీ ప్రచురణ.
2. గురజాడ వ్యాసావళి - 48వ పుట.

1914లో ఆంధ్ర సాహిత్య పరిషత్తు సభలు జరిగినప్పుడు వీరిరువురికి ప్రసంగార్హతను జయంతి రామయ్య పంతులుగారు తిరస్కరించినారు. కాని గిడుగువారికి పోలవరము జమీందారుగారు సహాయముచేసి సాహిత్య పరిషత్ సభలవంటి వానినే తిరిగి అచ్చట గ్రామ్యవాదులకై పెద్ద పెట్టున జరిపించినారు.

**గురజాడ అండదండలు :** 'వ్యావహారిక భాషాభిమానం మొట్టమొదట పుట్టింది గురజాడ అప్పారావు తలలోనే కాని గిడుగు రామమూర్తి తలలో కాదు.'[1] కావుననే గురజాడ, గిడుగు ఉద్యమమునకు వెన్నెముకయై నిలిచినాడు. నాడు మద్రాసు విశ్వవిద్యాలయము ప్రముఖ స్థానమాక్రమించి 'ఏకైక రాజ్ఞి'[2]గా వెలుగుచుండెడిది. ఆమెచేత వ్యావహారిక భాషను ఒప్పింపజేయవలెనని గురజాడ (అభి) మతము. 1912 నుండి 1915 వఱకు వీరందు సభ్యులుగా నియమింపబడినారు. తెలుగు పరిశోధనా శాఖకు పర్యవేక్షకునిగా గిడుగు పేరును గురజాడ సూచించినారు కాని కట్టమంచి రామలింగారెడ్డిగారు వ్యతిరేకించి బుఱ్ఱా శేషగిరి రావుగారిని ప్రతిపాదించినారు. ఈ ప్రయత్నములో ఓటమి పొందుటతో గురజాడ పట్టుదల ఇతోధికమైనది. 'నిర్బంధ దేశ భాషావ్యాస రచనము'ను వ్యావహారికములో వ్రాయవచ్చునని గురజాడ ప్రతిపాదించినారు. జయంతి రామయ్య పంతులుగారి వర్గము దానిని వ్యతిరేకించినది. థామ్సన్ కమిటీలో అధ్యక్షుడైన రంగాచారి మటుకు 'దక్షిణ భాషల్లో ప్రధానమైన వాటన్నింటిలోనూ గ్రంథ రచన కుపయోగించే భాష శైలీ మున్నగునవి వాడుక భాషకు సుదూరం పైదొలిగినట్లు విశ్వవిద్యాలయమువారు భావిస్తున్నారు. అందుచేత వీటిని దగ్గఱగా కొనిరావడానికి ప్రయత్నం చెయ్యాలని, ఆ ప్రయత్నములో సాధ్యమైనంత వఱకు, వ్యావహారిక స్వరూపమును గ్రాంథిక ప్రమాణానికి తీసుకురావడం వాంఛనీయమని యూనివర్సిటీ వారి తలంపు' అని తీర్మానించి 'వస్తాడు' మొదలైన రూపములు నిర్బాధకములని అంగీకరించినారు. ఇది గురజాడకు విజయమే!

రంగాచారిగారి తీర్మానములో "విద్యార్థులు దేశభాషా వ్యాసరచనలో

1. వెలుగుజాడ - గురజాడ కె వి. రమణారెడ్డి 51వ పుట.
2. విశ్వవిద్యాలయంలో గురజాడ కృషి. శ్రీ లక్ష్మీరంజనంగారు. లక్ష్మీరంజన వ్యాసావళి 284 పుట.

పూర్వగ్రాంథిక రూపములను కాని వర్తమాన శిష్టవ్యవహారమందలి రూపములను కాని వాడవచ్చునని" యున్నది. దానితో తిరిగి పోరాటము ప్రారంభమైనది. "పూర్వరూపాలకు అవిరుద్ధమైన వ్యావహారిక రూపాలనే వాడవలెనని గ్రాంథికవాదులు వ్యాఖ్యానము చేసినారు. దీని పరిష్కారమునకై ఒక కమిటీ! అందు కొమర్రాజు, వేదము, గురజాడ సభ్యులు. గురజాడకు మిగిలిన కర్తరి వాదము నచ్చలేదు అది సహజము కూడను. దానితో వారొక అసమ్మతి నివేదికను సమర్పించినారు. దీనికే 'డిసెంట్ పత్ర'మని పేరు దానితో వారు గ్రాంథికాంధ్రము మృతభాషయని అది ప్రయోగానర్హమని నిరూపించుటకు పోరాడినారు. కాని యత్నము విఫలమైనది. 'ప్రస్తుత పరిస్థితులలో వ్యావహారికాంధ్రము అను దానిని మద్రాసు యూనివర్సిటీ సిండికేటువారు ఆమోదింపలేకున్నా'రని విశ్వవిద్యాలయమువారు 1914లో తీర్మానించినారు.

విశ్వవిద్యాలయము విద్యార్థుల ప్రగతికై కొన్ని పఠనయోగ్య గ్రంథములను 'సిఫార్సు' చేయమని కోరినది. అందులకై కమిటీవారు :

1) చిలకమర్తివారి రచనములు.
2) గాడిచర్లవారి 'అబ్రహామ్ లింకన్'
3) ఏనుగుల వీరాస్వామయ్యగారి కాశీయాత్ర చరిత్ర.
4) దక్కను చరిత్ర కథలు.
5) సి. సి. బ్రౌను తంజావూరు చరిత్ర.
6) కొమర్రాజుగారి శివాజీ చరిత్ర.
7) విజ్ఞానచంద్రికా గ్రంథ మండలివారి ఇతర ప్రచురణములు.

ఇందెక్కువ భాగము గ్రాంథిక రచనములే కలవనియు ఒక్క కాశీ యాత్రయే వ్యావహారికమనియు, గురజాడ వాదించినారు. కాని వారి వాదము నెవ్వరును వినలేదు. సరికదా పై గ్రంథముల పట్టిక నుండి దానిని కూడ తొలగించివేసినారు. ఈ రీతిగా గురజాడ ప్రయత్నములు విశ్వవిద్యాలయములో విఫలమైనవే కాని దేశములో వారు విజయమే పొందినారు.

**నూతన ద్వవికల్పనము :** గిడుగువారు భాషాప్రచారము నొక ఉద్యమముగా మార్చినారు. గురజాడవారు దానిని పరిశోధనాత్మక దృష్టితో విశ్లేషించి

నూతన ధ్వనులు సృజించి వ్యావహారికవాదులను పుష్టివంతము చేసినారు. ఉదా॥ చీము, దోమ, మామలకు చేవఁ, దోవఁ, ఇత్యాదులు.

'హాస్పింగర్లు క్రింద ఖర్చుపెట్టాను; యుద్ధమైఁ పోయింది; మధురవాణిని వదఃదవంటే; యెవికలు; యేమ్‌వాయ్; కొట్టాలు; తాటాకు ఇత్యాదులు. 'గ్రాంథిక భాషా సముద్రము చుట్టూ ఆవరించి ఎండగా ఆ సముద్రము మధ్యాన కన్యాశుల్కముతో అప్పారావుగారు ఒకే ఒక దీవివలె దివ్వెవలె వెలుగొందినారు.'[1]

**కందుకూరి సమర్థనము :** గిడుగువారి వాదమునకు ప్రచారము కల్పించు నిమిత్తము ఊరూరు తిరిగి సభలు పెట్టించి ప్రసంగింపసాగినారు. 1916లో కొవ్వూరు సభలో గిడుగు ప్రసంగించునప్పుడు వీరగ్రాంథికవాది అయిన కందుకూరి చాటునుండి వినినారు ప్రసంగమంతయును విని 'రామమూర్తి చెప్పిన దానిలో మనము ఒప్పుకోక తప్పని అంశములున్నవి. అతని వాదము నేడు కాకపోయినా కొలది కాలములో జనసమ్మతము కాకమానదు'[2] అనినారు. అంతేకాక తాము కొద్ది కాలమునకు మరణింతుకనగా గిడుగువారి ఉద్యమమునకు చేయూత నిచ్చెదమని లేఖ వ్రాసినారు. గిడుగువారితో విద్వత్ సభకు వచ్చి అధ్యక్షత కూడ వహించినారు గిడుగు కిది ఘనవిజయము. కాని 22-5-1919 లో కందుకూరి, 1916 లోనే గురజాడలు అస్తమించుటతో గిడుగుకు అఘాత మేర్పడినది.

**ఆనందోద్యాన తీర్మానములు :** గిడుగువారి భాషోద్యమములో ప్రముఖ ఘట్టము 28-2-1919 లో ఆనందోద్యానము (ఆనందాశ్రమము) లో జరిపిన మహాసభ. దానికి కందుకూరివారు అధ్యక్షులు. గిడుగు, గురజాడ గంగన్నలు కార్యదర్శులు. 'వర్తమానాంధ్ర భాషాప్రవర్తక సమాజ'మని దానికి నామకరణము చేసినారు. వారి ఆదర్శములివి : 1) వ్యావహారిక భాషకున్ను గ్రాంథిక భాషకున్ను ఇప్పుడున్న వ్యత్యాసము సాధ్యమైనంతవరకు తగ్గించి భాష సులభము చేయుట. 2) జ్ఞానాభివృద్ధికై వ్రాయు గ్రంథములలో సాధ్యమైనంత వరకు వ్యవహారములో నున్న రూపములే ఉపయోగించి వ్యవహారములో లేనివి విడిచి

1. గురజాడ - వ్యావహారిక భాష. వ్యాసము శ్రీ తెలికిచర్ల వేంకటరత్నము.
2. సాహిత్యోపన్యాసములు. ఎకాడమీ ప్రచురణ 41వ పుట.

పెట్టుట. 3) వ్యవహారములో ఆవశ్యకము కాకుండ ఉపయోగించుచున్న అన్యదేశ్య పదములను విడిచిపెట్టి ఆవశ్యకములైన పదములనే చేర్చుకొనుట. 4) పై ఉద్దేశముల ననుసరించి గ్రంథములు వ్రాయుట. ఈ మహోద్యమమును పూనికతో నిర్వహించు తెలుగు పత్రికకు సంపాదకత్వము వహించి ఉద్యమ రథ సారథియై పురోగమించినారు. కందుకూరి వ్యావహారిక భాషా వ్యాకరణము రచింతునని మాట యిచ్చినారు గిడుగు వారానందించినారు. కాని ఇంతలో కందుకూరి మరణము– ఆ ప్రయత్నమట్లే ఆగిపోవుట– జరిగినది.

గిడుగువారు క్రమముగా 'ఆంధ్ర పండిత భిషక్కుల భాషాభేషజము'ను తదితర రచనలను ప్రకటించినారు. 1920 నుండి 25 వరకు మద్రాసు విశ్వవిద్యాలయములో బోర్డు ఆఫ్ స్టడీస్ సభ్యులుగా నుండి, వచ్చునప్పుడు, వెళ్లనప్పుడు త్రోవలో వ్యావహారిక తత్వమును గూర్చి ప్రసంగము లిచ్చుచు ఉద్యమ ప్రచారము చేయసాగినారు !

1925లో నొక అసాధారణ సంఘటనము జరిగినది. తణుకు ఆంధ్ర సాహిత్య పరిషత్ వార్షికోత్సవమున ఆచంట సాంఖ్యాయనశర్మగారి అధ్యక్షతన జరిగిన సమావేశములో గిడుగువారు ఏకధాటిగా ఆరుగంటల సేపు వ్యావహారిక భాషావాదము గూర్చి ప్రసంగించి, సభను స్తంభింపజేసి చివరకు అలసిపోయి మూర్ఛపోయినారు. వారి పట్టుదల అట్టిది ! ఉద్యమ తీవ్రత అట్టిది !

**పండితామోదము :** గిడుగువారి వాదము సర్వతోముఖముగ విజృంభించి అధిక జనామోదమును బడయసాగినది. మహావిద్వాంసులు శ్రీ పేరి కాశీనాథశాస్త్రిగారు శిష్టవ్యవహారమునందున్న తెలుగు భాష సంస్కారార్హమని ప్రసంగించిరి. మహామహోపాధ్యాయ తాతా సుబ్బారాయశాస్త్రిగారు ఆంధ్రభాషా సంస్కరణమనెడి వ్యాసములో ఈ యభిప్రాయమునే వెల్లడించిరి 1914 లో ఎలమంచిలిలో జరిగిన సభలో వఝ్ఝలవారు శిష్ట వ్యవహారమందున్న భాష గ్రాహ్యమనుట శాస్త్రవిరుద్ధమను ప్రతిపాదనమును సభలోని పండితులందరు నామోదించిరి. 1915లో బందరులో చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు ఇట్లే ప్రసంగించిరి. అంతే కాదు తాము స్వయము వ్యావహారికముగా వ్రాసిరి. "వీరిద్దరినీ తప్ప నేనెరిగినంతలో మఱొకరిని శ్రీనాథునితో పోల్చడానికి నా మనస్సు వొప్పుకోదు.... కాని ఆయనకున్న పాండిత్యంలో యెన్నో వంతున్నూ సంస్కృతంలో ఈయనకు

రాలేదు అంటే యేమన్నమాట?"..... ఈ రీతిగా నున్నది. శెట్టి లక్ష్మీనరసింహముగారి 'గ్రీకు పురాణ కథలు' అను వ్యావహారిక భాషాగ్రంథము తాత్కాలికముగా స్కూలు ఫైనలు పరీక్షకు పాఠ్యగ్రంథముగా నిర్ణయించుట జరిగినది. 1916 కొవ్వూరి సభలో దివాకర్ల తిరుపతిశాస్త్రిగారు, రాజా కొచ్చర్లకోట వేంకట కృష్ణారావుగారు, శ్రీ కందుకూరి, తల్లావఝల సూర్యనారాయణ, చిలుకూరి వీరభద్రరావుగారలు చేసిన తీర్మానములో 'నేటి వాడుకలోనున్న పదములు నూరు సంవత్సరముల నుండి పెద్దల వాడుక చొప్పున ఉన్నట్లు నిదర్శనము లున్నప్పుడు అవి నిర్దుష్టములుగా ఎన్నవలెన"ని ప్రకటించిరి. 1919 మద్రాసు సభలో పండితులైన దంటిగంటి సూర్యనారాయణశాస్త్రి, నరసింహం పంతులు గార్లు 'అర్వాచీన కవిప్రయోగము లనేకములు సాధువులు, గ్రామ్యములు' అనిరి. ఈ రీతిగా గిడుగువారి ఉద్యమము దశదిశలకు విజృంభించినది తమ విజయమును తమ జీవిత కాలములోనే ఆయన చూచి కన్ను మూసినారు. పత్రికలు, ప్రచురణ సంస్థలు, రచయితలు గ్రాంథికమును వదిలి వ్యావహారికమునే స్వీకరించినారు. గిడుగు వ్రాసిన ప్రాదెనుగుకొమ్మ, భాషాభేషజము, ఇతర రచనములు అన్నియును ముద్రింపబడినవి. గురజాడ రచనములు కూడ వెలుగులోనికి వచ్చినవి. "నాన్నగారి మృతి అనంతరం ఒక్కనాడు గిడుగు రామమూర్తి పంతులుగారు నాకు సలహా ఇస్తూ నాన్నగారి కృతులను యథాతథంగా ప్రచురించమనీ అన్నారు. మన దేశంలో కమ్యూనిజం ప్రవేశించినప్పుడు నాన్నగారి కృతులలో వారి కుపయోగపడినవన్నీ వారు వినియోగించుకొని అచ్చువేశారు."[1] "ఈ భారత వర్షములోనూ యితర దేశములలోనూ వాడుక భాషలలో రసవంతములైన కావ్యములు పుట్టియుండలేదా? బర్న్సు అను మహాకవి మాట శతావధానులు వినలేదో"[2] అని గురజాడవారు శతావధానులకు సమాధానమిచ్చుచు అనినారు. శతావధానులేమో కాని నేడు యావదాంధ్ర దేశము వినినది. వ్యావహారికోద్యమము విజయము నందినది. నిజమునకిది గిడుగు విజయము, గురజాడ విజయము, ఏట్సు దొరకు విజయము !!

## ప్రతిఘటనము - పురోగమనము :

వ్యావహారిక భాషోద్యమమెంత తీవ్రముగా నడిచినదో గ్రాంథిక భాషో

1. గురజాడ రామదాసు. శతజయంతి సంచిక, 114వ పుట

ద్యమము కూడ అంతే తీవ్రముగా సాగినది. గ్రాంథికము గతానుగతికముగా వచ్చేడి భాష. దానిపై వ్యావహారికోద్యమము దాడి చేసినది. ఫలితముగా గ్రాంథికము ఎదురొడ్డి నిలుచుటకు బదులు (Affence) స్వరక్షణములోనే ఉండిపోయినది (Defence). ఆంగ్లములో టి. ఎస్. ఇలియట్, డిలాన్ థామస్ రచనలు విశ్వనాథవారి రచనములకన్న కష్టముగా నుండును. అయినను అక్కడ తిరుగుబాటు రాలేదేమని వీరు ప్రశ్నించినారు అమెరికాలో ఫాక్నర్ వాక్యములు సామాన్యునికి అందుబాటులో ఉండవు. అయినను 'రాజకీయ దుర్జాతుల ఒత్తిడింబడి' మనకు వచ్చిన పరిస్థితి వారి దేశములలో రాలేదని విమర్శించినారు! "ఈ తెలిక ఉద్యమం వారు నిఘంటు నిరసనవాదులుగా రూపు దాల్చారు.... మన తెలుగు దేశములో కూడ ఇంగ్లీషును అభ్యసించే సందర్భములో డిక్షనరీలను ఉపయోగిస్తూనే వున్నారు.... ఒక్క తెలుగుకే ఈ నిఘంటు అభ్యాస నిషేధాన్ని విధిస్తున్నారు"[1] అని నిరసించినారు. "కమ్యూనిస్టు దేశాలలో తప్ప ఇట్టా భాషను ఆ భాషలో వ్రాస్తున్న దానిని శాసిద్దామనే అభినివేశం గల రాజకీయవేత్తలు ఇతర దేశాలలో అరుదు. అసలు కన్పించరు"[2] "వడిఁజడి గ్రామ్యభూతమును.... పండిత మాంత్రికవర్యు లిత్తఱిన్"[3] పారద్రోలవలెనని పండితులు పట్టుబట్టినారు. రాజులు, జమీందారులు ధనమునిచ్చి పండితులను నియోగించి వ్యావహారికవాదమును ఓడింపవలెనని పూనిక వహించినారు. "విశాఖలో ప్రసంగించమని పిఠాపురం రాజావారు నన్ను పురాణపండ మల్లయ్యశాస్త్రిగారిని, కూచి నరసింహం గారిని పంపిరి. (ఖర్చులిచ్చిరి)"[4] నాటి సభలన్నియును గ్రాంథిక వ్యావహారిక వాదములను ఉపదేశించుటకే జరిగినవి. పత్రికలన్నింటి నిండ ఈ వార్తలే !! "24వ తేదీ పచ్చయప్పహాలు కందుకూరి వీరేశలింగం గారి అధ్యక్షతన గొప్ప సభ జరిగెను ... గ్రామ్య భాషను నిరాకరించుటకై ఈ సభ చేయబడినది.... జయంతి రామయ్య పంతులుగారును చె. భానుమూర్తిగారును వేమూరి విశ్వనాథ శర్మగారును, అక్కిరాజు ఉమాకాంతంగారును గద్దె రంగయ్యనాయుడు గారును

---

1, 2. ఈనాటి సాహిత్యంలో స్థితిగతులు. తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు భారతి - మే 66.

3. చివుకుల అప్పయ్యశాస్త్రిగారు. గ్రామ్య పిశాచము. శిల్పిక 23-12-1912 కృ. ప.

4 శ్రీ చిలకమర్తి స్వీయచరిత్ర.

ఉపన్యసించిరి.... ఒక్క ఉమాకాంతముగారు తప్ప తక్కినవారు గ్రామ్యము లోనే మాట్లాడిరి....."[1] నుచ్చున కిది ఒక పత్రికా సమాచారము. అన్ని పత్రికల లోను ఇట్టి వాదోపవాదములే ప్రచురింపబడినవి. కాని "కాలముబట్టి దేశమును గాంచి ప్రభుత్వము నెంపి"యే ఉద్యమమును ఉచితజ్ఞులై సాగింపవలసి యున్నది. ప్రజాభిప్రాయము గిడుగు గురజాడలనే వరించినది. విమర్శలు ప్రతిఘటనములు వారి పూనికను శతాధికముగా బలపరచుటకే సాయపడినవి. వ్యావహారిక భాషోద్యమము విజయమునంది తన పని తీరగనే ఉద్యమ కవచ మును విసర్జించినది. వచనములోను, వచన కవిత్వములోను వ్యావహారికము స్థిరపడిపోయినది !! ఇది జ్ఞాతముగా అర్ధశతాబ్దము సాగిన విప్లవము !!

## ఉద్యమ ప్రభావము :

వ్యావహారిక భాషోద్యమము విజయవంతమైన పిమ్మట దాని ననుసరించు టలో వింతలేదు. లోకము గతానుగతికము కదా ! కాని ముందుగా మూర్ధన్యులై నిలిచినవారే మహామహులు ! గురజాడ, గిడుగులట్టివారు. కాని వారికి వేగు చుక్కలుగా నిలిచిన కవులు కొందఱు లేకపోలేదు. ఉద్యమ ప్రభావము పీరిపై పడిన దనుటకన్న ఉద్యమమునకు వీరు తూరుపు రేఖలనుటయే సమంజసము. చంద్రశేఖర శతకకర్త అట్టివాడు.

> "సీ ! దగడీక ! బాపల వసిద్ధిపరే పోగ నిప్పుకంట పో
> మాదుగులింటి పోయి బతిమాలితి మూడునెగళ్ల మందులై
> లేదని తిట్టె పాపపు కలిగ్గము యింత పరాక దాంట్లొ యీ
> రాదట యంద్రు-"

ఇది మంగళగిరి తిరునాళ్ల సందర్భమున ప్రసంగమున కనుకరణము. తెలుగులో నొక నుడిగారమున్నది. 'నీవు పాడినందులకు నేను విన్నందుకు సరి పోయినది, నేను తల నూపినందులకు పీతంబురానట పెట్టి పొమ్మ'ని శ్రోతయే గాయకుని పారితోషికమడుగుట. ఈ హాస్యోక్తి నీ శతకకర్త: 'సంగితకాడ పాడకికత సాలిచు నీవది పాడినందుకున్। ఇంగిత మెర్గి నేను మరి యున్నదుకున్ సరిపోయె యింటివా। అంగుననే తలూపిన టియప్పుకు తమ్మర యీాడమెట్టిపో'

2. ఒక విమర్శకుడు జాబులు శీర్షికలో 6 వ పుట. 30-12-1912. కృ.ప.

యని పల్కినాడట ! ఇందలి వ్యావహారికము రంగాజమ్మ మన్నారు దాసవిలాస ములో వలె అనుకరణమే అయినను వృత్తబద్ధమై, సహజ సుందరముగ నున్న యీ రచన ఇరువదవ శతాబ్దపు భాషోద్యమమునకు మేలుకొలుపని చెప్పవచ్చును!

**తిరుపతి కవుల వ్యావహారికము :** తిరుపతి కవులు వ్యావహారిక పద ములను ఔచిత్యము ననుసరించి స్వీకరించిరి. 'మముగెల్చుడు గెల్చరేని' వంటి ప్రయోగములకు సమకాలీన ప్రభావమే కారణము. ఇంతేకాక మాండలిక వ్యవ హార పదములను వైయక్తికమైన వ్యావహారికమును వారు పద్యబద్ధము చేసి నారు :

> "అప్పో చూస్సి వషేవాషే చెవుడషే అష్లాగషే యేమిషే
> విస్సావర్ఘుం వారి బుఱ్ఱినష ఆవిప్పాయ కిస్సారుషే
> విస్సందెంతటివాడె ? యేళ్ల పడిషే"....

ఉత్తరాంధ్రములోని వైదిక కుటుంబస్త్రీల వ్యవహారమిది !

**గురజాడ వ్యావహారికము :** వచనములో నేమి గేయములో నేమి వ్యావహారికమునకు గతి కల్పించిన వారిలో అగ్రగణ్యుడు గురజాడ- కన్యా శుల్కములోని వ్యావహారికము గిడుగు ఉద్యమమునకు లక్ష్యప్రాయమైనది. అంతేకాక గేయములలో కూడ గురజాడ స్వేచ్ఛగా వ్యావహారిక ప్రయోగము చేసినాడు. 'చేసి', 'వేసి' వంటి రూపములను కూడ వాడుటకు పలుకబడియే ప్రమాణము 'దేశమంటే మట్టికాదోయ్ దేశమంటే మనుషులోయ్' 'వొట్టిగొప్పలు చెప్పుకోకోయ్' మెచ్చకుంటే మించిపాయెను' 'పట్టము', 'ఇస్త్రి', 'వుండడా', 'మొక్కుతు', 'మనిషి మాతృడియందు', 'వాడయి (వాడిగా)' మొదలైన ప్రయోగములను చేసినారు. తరువాతి తరము కవులకొక నైతికమైన ధైర్యము దీనితో లభించినది.

**ఎంకి పాటలు :** వ్యావహారికము ప్రధానముగా వచనమునను సంబం ధించిన ఉద్యమము. అయినను అది తన పరిధి నతిక్రమించి పద్యమును, గేయ మును, వచన గేయమును కూడ స్వాధీనములోనికి తీసికొనినది. వచన గేయము గ్రాంథికములో నేటివఱకును వ్రాయబడనే లేదు !!

గిడుగు, గురజాడ ప్రభావమునకు 'ఎంకి పాటలు' సద్యఃఫలితమని చెప్పవలసి యున్నది నండూరి సుబ్బారావుగారు ఐచ్ఛికముగా ఈ భావను స్వీకరించినారు గిడుగు రామమూర్తి పంతులుగారు కూడ వీనిని చూచి సంతోషించి గ్రంథములో ప్రక్కన సిరాతో 'Gem' అని ప్రశంసా వాక్యము వ్రాసి పెట్టుకొనినారు.

ఎంకి, నాయుడుబావలిందు నాయికా నాయకులు. ఎంకి 'నీతోనే వుంటాను నాయుడుబావా నీ మాటె యింటాను నాయుడుబావా' అనును 'ఆమె సెక్కిట సిన్నిమచ్చ- సెపితే సాలదుల్చ ఒక్క నవ్వేచాలు నజ్జిగ వైడూర్యాలు' నాయుడు బావను 'కంటెదుర నాకాడ కంపాపలో సీడ సూసుకుంటా నొసట సుక్కెట్టుకుంటా' నను 'పిచ్చినై నేనటో కొట్టాడుతుంటే యిరుగమ్మ లక్కలతో నీవా నా యెంకి యెకసక్కమాడుతున్నావా' అని నాయుడు బావ ఎంకిని ప్రశ్నించును.

'ఎంకి కోపాలొచ్చియే దేశమో పోయి
కల్లోనా కాపడితె కల్ల తెలిసే తల్లికి
తళుకుమని నాయెంకి దరికి రావాలి'-

ఇది అనూచానమైన కావ్యభాష కాదు. కావున రచనమును మిక్కిలి కష్టమే!

వీని ప్రభావము ఆంధ్రదేశముపై విస్తృతముగా ప్రసరించినది. దువ్వూరి, తురకా వెంకట్రామయ్య కొడవటిగంటి వెంకటసుబ్బయ్యగార్ల కొత్త కంఠములు పలుకసాగినవి. లచ్చిపాటలు, మల్లిపాటలు, జాజిపాటలు, సుబ్బిపాటలు పుంఖానుపుంఖముగా వచ్చినవి. "దీనితో పాటలకు మాట్లాడే భాష స్థిరపడిపోయింది. సాహిత్యంలో అని మొన, అనేటట్లుగా ఎంకిపాటలు కర్షకుల పచ్చి భాషలో రచింపబడి వ్యావహారిక భాషోద్యమమునకు లక్ష్యగ్రంథమైనవి."[1]

**కృతక వ్యావహారికము:** వ్యావహారికములో నున్న పదములు గ్రంథస్థము చేయుట వేఱు గ్రంథస్థ పదములకు వ్యావహారికత్వమును కల్పిం

1. 'ఎంకి పాటల'పై వ్యాసము శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి, భారతి 1963 మార్చి.

చుట వేలు మొదటిది సహజము. రెండవది కృతకము. ఉద్యమ తీవ్రతలో నండూరి రెండు విధముల్తైన ప్రయోగములను చేసినాడు. 'వౌనలచ్చిమి (వన లక్ష్మి) యీశ్నరుదు (ఈశ్వరుడు) కనకాభిసేకాలు (కనకాభిషేకాలు) అందాల బిటెకె దైభము (దైవము) ఇత్యాదులిందుల కుదాహరణములు. కర్షకు లుచ్చరిం పని సాంస్కృతిక పదములకు వ్యావహారిక కల్పనము చేయబడినది!

నండూరి వారెంత ప్రశంసను పొందినారో అంత విమర్శను కూడ ఎదుర్కొనవలసి వచ్చినది. సాహసోపేతమైనవారి వ్యావహారిక ప్రయోగమును నిరోధించినవా రనేకులు. పండితుల తాకిడికి నండూరివారు తట్టుకొనలేకపోయి సహజమైన వ్యావహారికమును చివరి దశలో వదలివేసినారు. "బసవరాజుగారి శాపము నిజము చేశారా అనిపించేటట్టుగా పచ్చి కర్షక భాషతో ప్రారంభించిన ఎంకి పాటల్ని గ్రాంథిక భాషతో పూర్తి చేశారు."[1] ఉద్యమమునాటి ఒడుదుడు కుల కిది ప్రముఖోదాహరణము.

**కిన్నెరసాని పాటలు:** ఈ దశలోనే విశ్వనాథవారి కిన్నెరసాని పాటలు, కోకిలమ్మ పదములు, వచ్చినవి. కావేరి సస్యలక్ష్మికి సాయముగా దేవేరి అయి 'వచ్చింది' అని కిన్నెరను కవి వర్ణించినారు. అట్లే కోకిలమ్మ పెళ్లిలోను తాతలనాటి కథలన్నింటిని 'త్రవ్విపోస్తావోయ్' అని విశ్వనాథవా రనినారు. వ్యావహారిక పదములు, క్రియారూపములు ఇట్లు వారి రచనలలో చోటు చేసికొను టకు గిడుగు ఉద్యమమే కారణమని చెప్పవలసి యున్నది!

**అభ్యుదయ కవిత్వము:** అభ్యుదయ గీతములు గేయములన్నియును వ్యావహారికములోనే సాగినవి శ్రీశ్రీ 'మరో ప్రపంచం పిలిచింది' 'పదండి త్రోసుకు పోదాం పోదాం', 'ధారపోశాను', 'ఆకలేసీ కేకలేశానే', 'భగ్న, మౌతాయి', 'నగ్నంగా నర్తిస్తున్నారు', 'పోసీ పోతేపోసీ', 'రానీ వస్తే రానీ', 'నీవేపే చూస్తూ ఉంటాయ్', 'తమలోతు కనుక్కోమంటాయ్', 'విన్నానమ్మా విన్నా నెనొన్ని విన్నాను', 'మదం పట్టిన మాతంగాలో కపీ నీ పాటల్', 'పట్టి స్తాను', 'పుట్టిస్తాను' వంటి ప్రయోగములతోనే రచనను సాగించినాడు. రమణా

1. 'ఎంకి పాటలు' వ్యాసము శ్రీ శ్రీపాద, భారతి 1963 మార్చి

రెడ్డి, రెంటాల, సోమసుందర్, అనిసెట్టి ప్రభృతులందరును భావముననే కాదు, వ్యావహారిక భాషకును శ్రీశ్రీ వారసులే!

**వచన కవిత్వము:** ఆధునికమైన వచన కవిత్వమంతయును వ్యావహారికములోనే సాగుచున్నది. 'జూకామల్లె తీగల్లోంచి' తిలక్; 'అబ్బా, చీకటీ విప్పుకో, నీలో ఎన్నెన్ని రహస్యాలు' సోమసుందర్; 'పోయింది- పత్తా లేకుండా పోయింది. పోయింది చెప్పి మరీ పోలేదు పోవికి చెప్పిపోలేదు- పోతే పోయింది లెమ్మనుకునేంత పనికిమాలింది కాదు, పదస్తుగా ఎన్నోళ్లనుంచో ఎత్తి పెట్టి వుంచింది' రమణారెడ్డి; 'నిశ్శబ్దం నాకిష్టం నాదంలో ఎంత మధురిమ వున్నా నిశ్శబ్దంలో గాంభీర్యం వుంది' పరిగి రాధాకృష్ణ; 'గతాన్ని తలబోసుకుంటూ గుర్తు తెలియని విషాదంలో నిట్టూర్చుతూ భవిష్యత్తంధకారమని విచారిస్తే ప్రయోజనమేమిటి' యం.కె. సుగమ్‌బాబు; 'మధ్య జీవితాన్నే మహాప్రసాదంగా స్వీకరించే మానవుడా నాగరికతని నిర్వచించే తాహతెక్కడిదోయ్ నీకు' శ్రీమతి ఇవటూరి రమలత; 'తన గుండెల్లో చిందులాడే మెత్తని నీ నవ్వు వెలుగుల గిలిగింతలు ఆ కలానికి ఊపిరిపోశాయి' శ్రీ ఇంద్రగంటి భానుమూర్తి ఇత్యాదులు. ఈ ఉదాహరణములన్నియును 'భారతి' 'సాహితి' పత్రికల నుండి స్వీకరింపబడినవి. వచన కవిత్వములో వ్యావహారికము ప్రామాణీకరణము నందినదనుట కిది సంకేతము.

**వ్యావహారిక పద్యములు:** గ్రాంథికమైన భాషలో వ్రాయబడిన పద్యములలో అటనట వ్యావహారిక రూపములు గోచరించినవి. 'దానికి కారణము ఐచ్ఛికమో అజ్ఞతమోకాని వ్యావహారిక భాషా ప్రభావము కాదని'[1] వారన్నారు. అట్లుకాక కొందఱు పూనికతోనే వ్యావహారిక పద్యములను రచించినారు. నెల్లూరులోని శివారెడ్డి ఈ కోవకే చెందినవాడు. అన్ని సాంఘిక రాజకీయ సమస్యలను ఆయన తేటగీతి ఆటవెలదులలో రచింపసాగినాడు. అందనను నెల్లూరు మాండలికము ప్రయోగింపబడినది. అట్లే గుంటూరు వాస్తవ్యులు కీ॥ శే॥ కారుమంచి వేంకటేశ్వరరావుగారు పిడికిగుద్దు గీతాలు, పాంచజన్యం, దేవదత్తం, ఉదయతారలు, రచించినారు. వీరి వ్యావహారిక పద్యమిట్లున్నది.

---

1. ఆచార్య దివాకర్ల వేంకటావధాని.

"ఏందితె కూడుగుడ్డలను ఇంతిని సేద్దెము దేముడిచ్చెమా
కెందుకు లోకులాసు మరి యెవ్వఁడొ 'గంధి' సరాద్దెమంట
ఏమందును కుర్ర కుంకలు గుబాలున ఎల్దురు జెళ్లలోకి యీ
శ్లందరు కాళ్లబట్టి మనరా రాద్దెము యిప్పుడు దెత్తురంటయా"

'మనం మాత్రం వ్యావహారిక భాషలో రచనలెందుకు చేయకూడదా'[1] అని ప్రారంభించినట్లు కవి చెప్పుకొనినారు. అట్లే పట్లమూడి గోపాలకృష్ణయ్యగారు తమ వ్యాకరణమును నార్లకంకిత మిచ్చుచు 'నార్ల నభినందిస్తా'నని వ్యావహారిక పద్యములోనే తమ భావము వెల్లడించినారు. గిడుగు సీతాపతిగారు తండ్రిగారి ఉద్యమమునకు లక్ష్యగ్రంథమో అనునట్లు 'భారతీ శతకమును' వ్యావహారికము లోనే రచించినారు.

**నవీన మణిప్రవాళము:** మళయాళములో సంస్కృత సమ్మిశ్రిత మైన మణిప్రవాళశైలి ప్రచారమైనది. విబ్‌గ్యార్‌వంటి ఈ రచనను ఆ ప్రాంత ములోని కవులు విరివిగా ప్రయోగింతురు వ్యావహారిక భాష తెలుగులో సరి క్రొత్త మణిప్రవాళమును సృజించినది వ్యవహారములో నున్న అన్య దేశ్యము లను యథేచ్ఛగా ప్రయోగించుట దీని తత్త్వము. గ్రాంథికమైన వృత్తములలో కూడ ఇది ప్రయోగింపబడుట విశేషము. పూర్వమెక్కడనో క్వాచిత్కముగా అరబ్బీ శబ్దములు దొర్లెడివి. కాని నేడు, సంస్కృతమువలె వీరు ఆంగ్ల పదము లనే ప్రయోగించినారు:

'<u>ప్లీడరు</u> న్యాయవాది యని పెద్దతికంబున పేరుగాంచుటన్
లీడ రనంబడున్' విశ్వేశ్వర శతకము వెంకటరత్నం పంతులు.
'<u>కాఫీ</u> త్రాగి' శివశంకరులు
'<u>రిక్షా</u>పై కవిరాజు' బోయిభీమన్న
'షోడా వాటరులు' రామాపధూటి తారావళి. అభినవ పండితరాయలు.
'<u>ప్రోగ్రాం</u> కాగితములోన పొరిజేర్చితివా' పానుగంటి
'రూళ్ళ కాగితములు' సీతాపతిగారి భారతీ శతకము

---

2. 'ప్రసంగ' వ్యాసావళి.'

'ఉన్న హక్కుల గూడ నూడగొట్టెదరు బ్లాకు
బిల్సును రూల్సు గావించునపుడు' పురాణం సూర్యనారాయణతీర్థులు. ఇట్లు కవులు సాహసించి ఆంగ్ల పదములను ప్రయోగించుటకు వ్యావహారిక భాషోద్యమమిచ్చిన చేయూతయే కారణము. 'రామః' రాముడుగా మారినప్పుడు 'రాస్కెల్' రాస్కెలుడు ఏలకాదని ఆరుద్ర ప్రశ్నించినారు !

**ఉపసంహారము :** నేడు వ్యావహారికము విశ్వవిద్యాలయములో సహా అన్నిచోట్లను ప్రచురముగా నున్నది. ఇది ఉద్యమ సాఫల్యమునకు చిహ్నము. 'సంస్కరింపబడిన శబ్దాను శాసనాన్ని నిఘంటువును మున్నిడుకొని వ్యావహారిక భాషను విద్యా సంస్థలలోను విశ్వవిద్యాలయంలోను ప్రవేశపెట్టడం సముచిత'[1] మని కొందఱి అభిప్రాయము. ఈ దృష్టితోనే వాఙ్మయ మహోధ్యక్ష వఠ్లమూడి గోపాలకృష్ణయ్యగారు వ్యావహారిక భాషకు వ్యాకరణము రచించినారు. 'గ్రాంథిక వ్యావహారిక భాషలకు ఏకశబ్దాను శాసనం, కోశము ఆవశ్యకాలు'[2] అని నేడు భావించుచున్నారు. ముఖ్యముగా మాండలికములు వ్యావహారిక రచనములోని అవగాహనమును తగ్గించుచున్నవి. ఈ పదములు చూడుడు :

| తూ. గో. జిల్లా | గుంటూరు | కృష్ణా | నైజాం |
|---|---|---|---|
| 1) బగ్గో | పడుకో | బగ్గో | |
| 2) పాప (గుంట శ్రీకాకుళం) | పిల్ల | పిల్ల | పోరి |
| 3) వాళ్ళొచ్చెను | వచ్చెను | వచ్చాడు | వచ్చిండు |

ఇంతేకాక నంగిరి, శకాశి, జడ్డి. జంక మొదలైన నిందార్థక పదములు నైఘంటిక ములు కానందున శ్రీకాకుళము జిల్లాలో తప్ప ఇతర ప్రాంతములలో అవగాహ నకు తోడ్పడవు. అట్లే 'జులూసు నికలాయించిండు' అను హైదరాబాదులోని వాక్యమున కర్థము ఊరేగింపు బయలుదేరదీసినాడని విశాఖపట్టణములోని వాని కర్థమగుట కష్టము. ఇట్టి హేతువులు ప్రతిపక్షులకు మిక్కిలి సాయపడుచున్నవి. వీని విషయములో భావిలో ఉద్యమకర్తలు శ్రద్ధ వహింపవలసి యున్నది ఏమై

1, 2. విద్యాసంస్థలలో వ్యావహారిక భాష. జి వి. కృష్ణారావు ఆగస్టు 65, భారతి.

నను వ్యావహారిక భాషోద్యమము గద్యపద్యములను రెండింటిని తన ప్రవాహ ములో ప్లావితము చేసినది. ఉద్యమము రససిద్ధిని పొందుటకిది చిహ్నము !

## ఛందః పరివర్తనము :

ఉద్యమములు జ్ఞాతముగను అజ్ఞాతముగను కూడ ప్రవర్తించుచుండును. అజ్ఞాతమైన ఉద్యమము అంతర్వాహిని వంటిది. ఇది ప్రశాంత విప్లవమును సాధించును. కాలగతిలో నిశ్శబ్దముగా నొక మహత్తర పరిణామమును రూపొం దించును. శబ్దము జ్ఞాతమైన విప్లవమై తెలుగులో సాగగా, ఛందము అజ్ఞాతమైన రూపవిప్లవమై, అర్ధశతాబ్దము కాలములో వృత్తముల నుండి వచన గీతములలోనికి మారిపోయినది. ఈ క్రమపరిణామమును, ఉద్యమ ప్రభావమును వివరింతును.

**ఛందో దర్శనము :** 'ఛందః పాదేతువేదస్య' అని పాణినీయ శిక్ష (41) లో పేర్కొనబడినది. అనగా 'వేదము యొక్క ప్రతిష్ఠకు ప్రచారమునకు ఛందము సాధనము'. 'మంత్రమయీ దేవతా' అను వాక్యము ననుసరించి దేవత లంతయును మంత్రమయులు. అనగా మహర్షులచే మననము చేయబడువారు. ఆ మంత్రములు ఛందోమయములు. దేవతాత్మకమైన మంత్రము దేవతార్చనా రూపమైన వాక్కు. అట్టి వాక్కు అచ్ఛందమున చరింపదు. అభిమత దేవతాస్తవ నాత్మకమైన వాక్కు స్వయముగనే ఛందోమయమై యుండును.

ఆర్షేయమైన వైదిక వాఙ్మయమువలెనే పౌరుషేయములైన లౌకిక వాఙ్మ యమును కూడ క్రాంతదర్శనులైన కవులు ఛందోబద్ధ మొనరించినారు. 'నాచ్ఛం ద సివాగుచ్చరతి' అను ఆగమ వాక్యమున కర్థమిదియే ! అంతేకాదు వాల్మీకి క్రౌంచ మిధున శ్లోకానుభవము ననుసరించి రసాత్మక శబ్ద విస్తరణమంతయును ఛందోమయమే అగును. ప్రాచ్య పాశ్చాత్య తత్వవేత్త లీ విషయములో విభి న్నాభిప్రాయముల నెన్నడును ప్రకటింపలేదు.

'ఛందోభూత మిదం సర్వం వాఙ్మయం స్యాద్విజానతః
నాచ్ఛంద సినచా పృష్ఠోశబ్దశ్చ రతి కశ్చన'[2] యని ప్రాచ్యులు ప్రకటిం

---

1. 'ఛందః ప్రశస్తి' (పరిశోధనా వ్యాసము) శ్రీ పాటిబండ్ల మాధవశర్మ.
2. వైదిక ఛ్చందో మీమాంస. ౯వ పుట.

పగా, పాశ్చాత్యులను 'Metre is a body of Verse as emotional thought is the soul',[1] అని ప్రకటించి భారతీయులతో ఏకీభవించినారు. తెలుగులో అనంతామాత్యుడు 'విద్యలోపల నుత్తమ విద్య కవిత్వంబు మఱి కవిత్వము ఛందోవేద్యము' అని ప్రాచ్య పాశ్చాత్యుల భావములనే స్పష్టముగా ప్రకటించినాడు. ఛందోవిహీనమైనది కళయే కాదు, వాఙ్మయమే కాదనెడి ప్రాచీన దృక్పథముపై ఆధునికముగ ప్రాచ్య పాశ్చాత్య దేశములలో జరిగిన తిరుగుబాటు ఫలితముగా అవతరించినదే ముక్తచ్ఛందము.

**వచన గీతము :** ఫ్రెంచి భాషలో జూలిస్ లాఫోర్గ్ ప్రభృతుల నుండి బయలుదేరి ఆంగ్లములోనికి ఆరాల్డ్, వాల్ట్‌మన్ మొదలైనవారిచే దిగుమతి చేయబడి అందుండి స్వాతంత్ర్యసిద్ధికి ముందే భారతమున ప్రవేశించిన వానిలో నొకటి ఛందస్సంబంధి. ముఖ్యముగా సంప్రదాయముపై తిరుగుబాటు వైఖరి చూపినవారు తొలి దశలోనే ఛందమునకు చెందిన నియమములను కొన్నింటిని ఉపేక్ష చేయనారంభించినారు. "ఇంగ్లీషులో అంత్య నియమం వర్డ్స్‌వర్త్ విడనాడాడు ... బెంగాలీ అంత్య నియమం మైకేలు మధుసూదనదత్తు కాదన్నాడు."[2] క్రమముగా పద్యము గద్యముగా ఎండిపోయినది. గద్యమే పద్యమయి ప్రవహించినది. 1914లో ప్రారంభమై 1928 నాటికి ఛందోల్లంఘనము ఆంగ్లములో వ్రేళ్లు తన్నుకొని నిలిచినది. కవులు పదముల గారడీకి అలవాటు పడిరి.

**తెలుగులో తొలిదశ :** తెలుగులో దాదాపు 1930 ప్రాంతములోనే వచనగీతము దిగుమతి అయినది. నాటి స్వామి శ్రీ ఆనంద ఆచార్య రచించిన ఒక గేయము ఇట్లున్నది :[3]

1) భయగర్జితము
2) వినవచ్చుచున్నవి
3) ఆకాశ మందహాసములు

---

1. T. S. Omond.
2. శతావధానులకు సమాధానముగా 'భారతమాత'లో ప్రచురించిన రచన నుండి.
3. నవ్యాంధ్ర సాహిత్య వీధులు - కురుగంటి.

4) కనవచ్చుచున్నవి
5) నా హృదయ వీణకు
6) ఒక్కటియె తీగ
7) ఓ సఖీ!
8) నా కవితాదేవికి
9) ఒక్కటియె పాట
10) ఓ సఖీ
11) నాకు
12) ఒక్కటియె వస్త్రము
13) ఓ సఖీ
14) నాకు
15) ఒక్కడే శ్రోత
16) ఓ సఖీ!!

ఇట్లు ఇరువది తొమ్మిది పంక్తులు సాగినదీ గేయము. ఇది మూడు మూర్తులలోను వచన గేయమే! కాని నాటికి ప్రక్రియ స్థిరముకాక పోవుటచే దానికి స్థితి 'గతి' లేకపోయినది.

**శ్రీశ్రీ ప్రయోగము:** కాల్పనికోద్యమము నుండి అభ్యుదయోద్యమమున కడుగుపెట్టెడి నడిమి కాలములో శ్రీశ్రీ కొన్ని గీతములను మరికొన్ని వచన గేయములను రచించినారు. నేటివరకును గ్రంథస్థము కాని ఒక ప్రయోగాత్మకమైన వచన గేయమును ఉదాహరింతును:

"పగలు రెక్కలు ముడిచి ఎగురుటాపగానే రాత్రి రాక్షసిలాగు ధాత్రిని పూనుతుంది- రాత్రి కొలిమి నుండి రాలిన నిప్పుకణాలు రేగిన దట్టపు పొగలు ఆకసపు చుక్కల్లా అల్లాడు మబ్బులూ- రాత్రి కృష్ణసర్పం పూత్కరిస్తూ ఉంటే వేదోండ కటాహంతో రోదో తరాన చీకట్లు- రాత్రి రాక్షసికన్య కాలంతో వ్యభిచరిస్తే ధాత్రికి భూకంపాలు, భూమికి మహామారి- పిశాచి మశూచికాలు."[1]

**ఉద్యమ స్వరూపము:** గురజాడ నూతనముగా ముత్యాల సరమును

1. పిశాచి - శ్రీశ్రీ "జ్వాల" 16-12-1934.

కల్పించి వ్యాప్తిలోనికి తెచ్చుటతో నవ్యకవులకొక నైతికమైన అండ లభించి నట్లయినది ఈ దశలోనే దేశీయమైన ఛందములు గ్రహించి వానికి నూతన స్వరూపమిచ్చుట. చెరకుగడ వంటి గేయముఁను గ్రహించి చిన్నచిన్న ముక్కలుగా నరుకుకొని వాడుకొనుట ప్రారంభమైనది. శివశంకరులు 'కోకిలా కాకం' వంటి పద్య కథానికలు పద్య సంభాషణలు వ్రాసినారు ధనుర్దాస కథ, దివ్య లోచనములను పద్యకథా రచనము- వృత్తములు పాతవే అయినను రచనలో ఏదో నూతనత్వము! ఇది పద్మావతీచరణ చారణ చక్రవర్తి నాటికి భాగుగా పరిపక్వమయినది. దేశీయమైన ఛందములలో కూడిన నాటిక యిది! సాహితీ సమితి సభ్యులు ఈ క్రొత్తదనమునకు యోగ్యతాపత్రము నిచ్చినారు. స్వామి శివశంకరులు 'గేయ కవిత్వమైన వ్యావహారిక భాష' వాడవచ్చునని నారు.[1] దీనితో చింతాదీక్షితులవారి చంద్రదార్పణములో ఛందము ఇంకను శైథిల్యము నందినది. ఇంతలో అభ్యుదయ రచయితల సంఘ స్థాపనము జరిగినది. 'ఛందస్సుల సర్ప పరిష్వంగం వదిలి వడిగా వడివడిగా' కవిత పరుగెత్తవలెనని శ్రీశ్రీ 1987లో పిలుపు నిచ్చినాడు. దానితో 'గద్యానికి పద్యానికి పెండ్లి చేయుట ప్రారంభమైనది. పఠాభి ఛందమును సూరిని 'వచన పద్యముల దుడ్డుకర్ర తో మోద' నారంభించినాడు. ఈ నవత రెండున్నర దశాబ్దములు ప్రయాణముచేసి నేటికి 'వెర్రియలిజం తలకెక్కిన విచిత్రకారుడి పిచ్చిగీత కళాయింపులా.... వండర్‌ఫూల్ ప్రయోగించిన స్ఫురిటిక్కు నిర్లక్ష్యశుద్ధి.... కీలర్ నటించబోతున్న సెక్సు పిక్చర్ తాలూకు వాల్‌పోస్టర్‌లా'[2] పరివర్తనమంది 'వచన కవిత్వం ఒక ఉద్యమమని' అఁపిరాల విశ్వం వంటివారి[3]చే ఘంటాపథముగా చెప్పబడినది.

**ప్రతిఘటనము - పురోగమనము :** అమెరికాలో **Walt whitman** అనునతడు **'Leaves of grass'** అను గ్రంథమును అనిబద్ధ కవిత్వములో రచించి ప్రజాకర్షణను సంపాదించిన మాట వాస్తవమే కాని శాస్త్రజ్ఞులు దీనిని

---

1. ఆంధ్రపత్రిక 30-7-1940.
2. కె. వి. రమణారెడ్డి 'నవత'పై అభిప్రాయము 1966. 'ఉత్తరమీమాంస' లో.
3. అభ్యుదయ యుగానంతరం. కె. వి. రమణారెడ్డి వ్యాసము. సౌమ్య ఉగాది సంచిక. 162 పుట.

తిరస్కరించినారు. విశ్వమంతయును లయాత్మకముగా సాగుచున్నది, దృశ్యమాన జగత్తు మొత్తము 'Bottled up radiations'తో నున్నది కావున ఈ Radiations కాలావకాశ బద్ధములైన తరంగములుగా ప్రసరించుచు లయాన్వితమైన అసలుగ కెరటములుగా ప్రవహించును కావున జీవితములో నేమి కవిత్వములో నేమి ఛందస్సు అపరిత్యాజ్యము అను వాదమును పదార్థ విజ్ఞాన శాస్త్రముతో సమన్వయించి చెప్పినారు.[1] 'Poetry is the rythamic creation of beauty' అని ఆన్‌పో అభిప్రాయపడినారు. 'Poetry is a musical thought' అని కార్లయిలు పండితులు నిర్వచించినారు. 'There is something magical in rythem. It even makes us believe that the sublime lies within our reach' అని గెతే మహాశయుడు వ్యాఖ్యానించినాడు. న్యూమన్ పండితుడు కూడ 'A matrical garb has in all languages been appropriated to poetry. It is but the out ward development of the music and hormony within. The verse far from being a restraint on the true poet is the suitable index of his sense and is adopted by his free and delibarate choise' అని అనిబద్ధ కవిత్వమునకు వ్యతిరేకముగా తీర్పు నిచ్చినారు. ఈ వాక్యములు వచన కవిత్వ విరోధుల చేతిలో వజ్రాయుధతుల్యముగా పనిచేసినవి. కాని వ్యావహారిక భాషోద్యమములోని వ్యాకరణ ధిక్కారము ఛందమునకు కూడ పాకినది. ఛందము వ్యాకరణము తోబుట్టువుల వంటివి. ఇంకను చెప్పవలెనన్న కవలలవంటివి. కావుననే విమర్శకుల హేతువాదముల హేతి ప్రహారములు ఛందము పొందెడి శైథిల్యము నాపజాలక పోయినవి. ఇది సంప్రదాయ కవిత్వమునుండి వచన గీతముల పలుకును సాగినది. ఈ నియమోల్లంఘన పరిణామమును వివరింతును.

**పాద సంఖ్యాభంగము :** సంప్రదాయికముగా నాలుగు పాదముల రచనలు చేయుట నియతి. నాలుగు పాదములను మించి మాలికలుండవచ్చును. కాని తక్కువ లేవు. భావకవులీ ఆచారమును కాదని భావమాగగనే పాదములాగవలెననినారు. ఈ ఛందస్సంబంధియైన విశృంఖలత్వము అనియతికి దారి తీసినది :

1. తెలుగు కవితలో క్రొత్తతెన్నులు. దువ్వూరి రామిరెడ్డి. కవికోకిల గ్రంథావళి (4) 166 పుట.

త్రిపాది : నా విరుఁతోటఁ బెంచి కొన్నాడ నొక్క
పవడపు గులాబి మొక్క నా ప్రణయ జీవ
నమ్ము వర్షమ్ముగా నయనమ్ము గురిసి - కృష్ణపక్షము

ద్విపాది : అసలు మ్రోగునో మ్రోగదో ఆ విపంచి
ఏం మ్రోగదు నా దురదృష్ట మనుము' గిరి. ప్రేమ గీతాలు

ఏకపాది : 'నీ ప్రణయ లీలలతి విచిత్రములు దేవి' ఫల్శ్రుతి. ఇట్లే శివశంకరుడు ఆవేదనలో ప్రయోగములు చేసినారు. అత్యాధునికులు త్రిపదలలో కృతులనే రచించినారు (ఉదా॥ బోయిభీమన్న.)

**పాద భంగము :** మఱొకరు ఒకే పాదములో భావ మాగగనే అగిపో వలెననినాడు :

'ఓ ప్రణయ లోకవాసిని'. ఫల్శ్రుతి

'ఉగ్ర రాహుసంద్రార్థ బింబగ్రసనము
పోలె నున్నది నా స్థితి' గిరి. ప్రేమగీతాలు

'మరల గుడ్డిరాతిరి వడుమరల నోరు
కాని శ్రుతులులేని చీకటులు మరల
మరల పాడిల్లు'. కృష్ణ పక్షము

పై రచనములలో 1, 2, 3 పాదములు మాత్రమే రచింపబడి విరమింప బడినవి !

ఇలతేకాక పాద మధ్యములో పద్యమారంభించుటకు మఱొక క్రొత్త పోకడ'................................నేను నిదుర

వెన్నెలల దారి నొక రేయి వెడలి పోతి
నొక విపంచీ కంఠ మొరసి యెగసి' కృష్ణ పక్షము

ఈ త్రిపాదిలో తొలి మూడు గణములు వదలివేయ బడినవి.

**యతి :** కొందరు యతిపై తిరుగబడినారు. అభ్యుదయ కవులు సరేసరి. సరూపాక్షరయతి వ్యర్థమని భావకవులలో పెక్కురు భావించినారు.

'దయ దలిర్ప నా చరిత్ర తొలుత వినుము
పిదప మత్ప్రార్థనము నివేదించు దాన' మల్లవరపు యతి లేకున్నను విరామమున్నది. వంగీయమైన ప్రభావమే కారణమని కర్త వివరించినారు. 1

**మఱికొన్ని శైథిల్యములు :** ప్రాచీనమైన ఛందములలో ఆధునికులు కనపరచిన మఱికొన్ని శైథిల్యములను చూపుదును :

ద్విపద : 'పూజాతి సాంద్ర కర్పూరమ్ములందు
ప్రాజ్ఞదీ పాథోలవమ్ములయందు
మడుగు సన్ననిపాట
పొడుచు వెన్నెలతేట
కలవు తిక్కన పల్కు తెలుగు పల్కులకు' ఆబ్బూరి.

ఇందు 1) మంజరీ ద్విపద, 2) గేయసదృశ్యమైన పాదభంగము పాటింపబడినది. ఇట్లే మఱొక వైచిత్రి :

ఇరన్మదాల చౌకళింపులో
దరస్మితాల సంచలింపులో.... ఊహేళ

ఇది పంచచామరము ఇందు ర. జ ర లు వదలివేయబడినవి.

'దురాత్త ప్రమాద ప్రదోషాల నీల్గి
తరిస్తే ఇదా జీవితం- పిప్పృచ్ఛ' ఇది భుజంగ ప్రయాతము. అసంపూర్ణము- ఇట్లే దువ్వూరి రామిరెడ్డిగారు ద్విపదలో చంద్ర గణములు ప్రయోగించినారు.

'వాల్మీకి కవిచక్రవర్తి నీవెవరు ?
సరస కవితాలతా శాఖ లందుండి
యామని కోయిలయట్లు కూసెదవు ?
ఎచ్చోట పుట్టితివేద పెరిగితివి ?'

ఇందు రెండవ పంక్తిలో నలల- నాల్గవ పంక్తిలో భలములు ప్రయోగింపబడినవి. అట్లే విద్వాన్ విశ్వం పెన్నేటి పాటలో,

1. రవీంద్రుని 'చిత్ర'కు 'చిత్రాంగద' అను, అనువాదము.

'ఇది విడిది ఆలమందలకు
నిదియే గొఱ్ఱెలకు తావు నింక మేకలన్' అని కందములో నడక చూచుకొని కందమునకు చెందని గణములు ప్రయోగించినారు. (2వ పాదము చివర ర-లగ) మఱికొందరు ప్రాచీనమైన ఛందములను విరూపముచేసి నూతన నామము లిచ్చినారు. శ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారు కందములో సరి పాదముల చివరి గురువు నెత్తివేసి 'భ్రమర'మనినారు. కొక్కొండ వారు బిల్వే శ్వరీయములో కొత్త నామములెన్నో ప్రయోగించినారు. గురజాడ ముత్యాల సరములిట్టి నూతన కల్పనమే! "అలక్ష్య ఫలితమూ ప్రమాద పతితములూ అయిన అనేక వ్యాకరణదోషాలు, నిర్వహణ వైవిధ్యం లేకపోవడమే కాక ఎటూ కాని చోట, విరుపబడి పాడయిన పాదాలూ (ఉదా. కాసులు) అప్పారావుగారి ఛందోవ్యవస్థకు బలహీనత ఆపాదిస్తున్నవి. హెచ్చైన అవలక్షణాలవల్ల లక్ష ణానికే విరూపత తటస్థిస్తుంది"[1] అని శ్రీశ్రీ ప్రవచించుట సత్యము. కాని ఇది గురజాడ దోషము కాదు. ఉద్యమ ప్రభావమట్టిదే !!

గురజాడపై పై విధముగా వ్యాఖ్యానించిన శ్రీశ్రీ ప్రయోగములు చూడుడు :

నేను సైతం 3 + 4
ప్రపంచాగ్నికి 3 + 4
సమిధ నొక్కటి 3 + 4
ఆహుతిచ్చాను 3 + 4 + 1

ఇట్లే శ్రీశ్రీ శరషట్పదిని వికృతముచేసి వాడుకొనినాడు.

ఇరవై కోరలు 4 + 4
అరవై కొమ్ముల 4 + 4
క్రూరఘోర కర్కోటకులో 8 + 4 + 2

మూడవ పాదములో 4 + 4 + 4 + 2 కాక 3 + 3 + 2 = 8 + 4 + 2 లో నడకసాగినది. శ్రీశ్రీ నడక చూచుకొనినారే కాని గణనియతి

1. 'గురజాడ' వ్యాససంకలనం. శ్రీశ్రీ వ్యాసము 24వ పుట.

పట్టించుకొనలేదు ఇట్లే అనేకములు! సి. నారాయణరెడ్డిగారు గేయములో మకుట లక్షణములేని శతకమునే (సమదర్శనము) వ్రాసినారు !!

**మాత్రాచ్ఛందములో కావ్యరచన :** పూర్వము పద్యములోను గద్యములోను కావ్యరచనము సాగినది. ద్విపదలో కూడ పాల్కురికి నిర్వహించినారు కాని ఆధునికులు మాత్రాచ్ఛందములలోనే కథాత్మక కావ్యములను రచించినారు సి నారాయణరెడ్డిగారి నాగార్జున సాగరము, కర్పూర వసంత రాయలు, విశ్వనాథ నాయకుడు, మొదలైన విట్టివె గేయములు పద్యములు రసానుగుణముగా మిశ్రమముచేసి విద్వాన్ విశ్వం 'పెన్నేటి పాట'ను రచించినారు. వఝల వేంకటేశ్వర్లు 'అమరవీణ'ను రచించినారు, పుట్టపర్తి నారాయణాచార్యుల వారు సామ్యవాద సిద్ధాంతమును ప్రతిపాదించుచు 'మేఘదూత'మను గేయ కావ్యమును రచించినారు. ఇవన్నియును ఛందః పరివర్తనములోని ప్రముఖ ఘట్టములు !

**వచనగేయ విజృంభణము :** ఈ పరిణామములన్నిటి ఫలితమే వచనగేయావతరణము. వచనగేయము, ముక్తచ్ఛందము, వృత్తగంధి వచనములని దీనినే అందురు ఇందు "కవియొక్క శక్తివలన సామాన్యమయిన వాక్యసమూహమునందే పూర్వచ్ఛందోరీతి కన్న భిన్న పద్ధతులలో చ్ఛందోవిచ్ఛిత్తి విశేషము కల్పితమయి చమత్కృతిమంతమగు రచనా విశేషము"[1] మఱొక విమర్శకులిట్లు నిర్వచించినారు "వచనమే ఒక విలక్షణమైన వేగంతో నడుస్తుందన్న మాట. మామూలు వచనవాక్యంలో ఉండేటట్లు కర్తా కర్మా క్రియలు క్రమంగాగాని అసలు ఉండనక్కరలేదు"[2] మఱికొందరు దీనిని విషమగతి రగడలో చేర్చెదమందురు. వచన కవితకు పాద నియమముకాని మాత్రానియమము కాని లేనందువలన ఇది ఎట్టి దేశీయమైన ఛందములలోను చేరదు. కాని అనేక వచన గీతములను పరిశీలించి కొందరు వీనిలో కొన్ని సామాన్య లక్షణములున్నట్లు గమనించినారు [3]

---

1. తెలుగు ఛందోవికాసము సంపత్కుమారాచార్య.
2. ఈనాటి సాహిత్యంలో స్థితిగతులు. భారతి 1966 జూన్ 52 పుట.
3. తెలుగు ఛందోవికాసము, సంపత్కుమారాచార్య.

1) భావము నాశ్రయించి పాదములను విభజించుట.
2) వైకల్పికముగా, అంత్యప్రాసలను అనుప్రాసలను ఆశ్రయించుట.
3) వాక్యము నసంపూర్ణముగా వదులుట.
4) క్రియా పదములతోనే పాదములను ప్రారంభించుట.
5) సమాన క్రియా పదములతో పాదపూర్వోత్తరార్థముల చివళ్లను గ్రథించుట.
6) దీర్ఘతర పాదముల వెంటనే హ్రస్వతర పాదములు, అసమాన పాదముల నడుమ సమ హ్రస్వపాదములు కుదించుట
7) పాదాంతమందు క్రియా విశేషణముల నుపయోగించి వాక్యమును సంపూర్ణముగా భాసింపజేయుట.
8) గణవిభజనము లేకున్నను రచనా శక్తితో లయనాధారముగా చేసికొని ఊపును తూపును కల్పించుట

ఈ నియమములైనను వ్యావహారిక ప్రయోజనార్థము కల్పించినవే కాని ఇదమిత్థమని నిర్ణయింపబడినవి కావు !!

**ఉదాహరణములు :-**

'చరమసంధ్యకు విడాకులిచ్చిరవి చేసిన చీకటి తప్పు
చరిత్ర నిర్మించిన ధరిత్రి కమలవనానికి ముప్పు'

—కుందుర్తి

చరిత్ర, ధరిత్రి శబ్దాలంకారము. తప్పు, ముప్పు అంత్యానుప్రాస- ఒకానొక లయ ఆద్యంతము సాగినది.

'నాకాలి సవ్వడి నాకే భయంగా
నా ఊహ పడగవిప్పిన పాములా
నగ్నంగా వాంఛా సహితంగా కన్పించి
నా ఆకృతి నాకే రెండు రంగులుగా'

—మాదిరాజు రంగారావు

ఇందు క్రియలేదు 'నగ్నంగా', 'రంగులుగా' అనుటలో నొక శబ్దాలంకారము. మొత్తము రచనలో నొక ఊపు !

'ఈ లోకం నుండి శోకంబానిష్ చేసే $\frac{\text{అనిమిషుడు}}{\text{అజరామరుడు}}$ వొస్తున్నాడు అతని కిదే నా స్వాగతం' గోపాల చక్రవర్తి. లోకం - శోకం శబ్దాలంకారము; $\frac{\text{అనిమిషుడు}}{\text{అజరామరుడు}}$ గా మరొక వైచిత్రి-

'మూడు ఇంటూ ఏడూ శతాబ్దంలో' గణితశాస్త్ర పరిభాష.

'అదే కనిపిస్తున్నది మనస్ టెలివిజను'లో ఆంగ్ల శబ్దప్రయోగముతో సొగసును సాధించుట-

అక్షరములనుబట్టి కాక అర్థమునుబట్టి గణవిభజన :

'ప్రతి మాటకీ శక్తి వుంది పదును ఉంది
ప్రతి మాటకీ అర్థం ఉంది ఔచిత్యం ఉంది' —తిలక్, నవత

భావమునుబట్టి, వేగము, ఆ వేగమునుబట్టి మొదటి పాదము రెండవ పాదముపై బరువు నిలుపుట.

'చెంగలువలు - గన్నేరులు - ఉన్మాద పలాశలు
పలలపు ప్రసనాలు, బైరాగి - పుడమికి కన్నెరికం,
క్రియా పదములతో పాదములు ప్రారంభించుట.
'క్రమ్ముకుంది నాలో భయంతో కలిసిన ధైర్యం
ప్రవహించింది నాలో తీరంలేని రజతనదం'

—గుండె కింద నవ్వు, తిలక్

**అధోజ్ఞాపికలు :** ప్రతి పంక్తికిని, ప్రత్యక్షరమునకును తామే భాష్యము వలె అధోజ్ఞాపికలు ఉల్లేఖించుట.

"కపాలం నవ్వితేనేం కంపింపించించింపిస్తా[1]....
యదార్థం నా తురుపు[2]....

పరమాణువు నా ప్రపంచం3....
వికృతం ఖండాయమానంగా4 ...
స్వప్నంలో స్వర్గం5
హతాశయాలకి పొటాసియాలు6"  —శ్రీశ్రీ ఖడ్గసృష్టి

**[Notes: 1) Double Verb telescopy, 2) Aspects of reality as laboratory data, 3) Micremacrosmology, 4) Grammarian's funeral, 5) Oneiric dominion status, 6) Suiside is no solution.]**

ఇట్లు బహుభంగులతో వచనగీతము విస్తరించుచున్నది !

**కథా కావ్యములు :** వచన కవితోద్యమమున కొకస్థాయిని తెచ్చిపెట్ట వలెనను కోరికతో కొందరు కథాకావ్యములు వెలువరించినారు. ఆర్ద్ర 'సినీవాలి' ఈ కోవకే చెందినది. నగరములోని క్లార్కు సూర్యారావు ఇందలి కథానాయకుడు అతడు 'ఎన్ జి,వో' సూర్యుడు. అధునికేతి వృత్తమునకు తగినట్లు అత్యాధునికమైన ఛందము. అట్లే శీలా వీర్రాజు 'కొడిగట్టిన సూర్యుడు' ఇత్యాదు లీ కోవకే చెందినవి.

**ఆంగ్ల పదప్రయోగములు :** ఆంగ్ల శబ్దములను సంస్కృత పదముల వలె ప్రయోగించుట సమాస నిర్మాణము చేయుట కూడ వచన కవిత్వములోని విశేషము. తిలక్ 88 పంక్తుల 'నవత - కవిత' అనెడి చిన్న గేయములో మోడరన్, ఇమేజరీ, డిలాన్‌థామస్, సల్ఫ్యూరిక్ ఆసిడ్, నాన్సెన్సు, ప్లస్, ఇంటూ, డికెడెన్సు, Obscurity, Tranaparent, ప్రొజైన్, పొయిట్రీ, Alchemy మొదలైన మాటలెన్నియో ప్రయోగించినారు[1] అట్లే కేశవరావ్ రచించిన చిన్న గేయములో టెలిప్రింటర్, టైపు, టెలిస్కోప్, టెలిగ్రామ్మ్య, టెలిఫోన్, సస్పెన్సు, మిస్, కోంస్, మినిట్స్, బయొనెట్స్, ఆర్కెస్ట్రా, ఆర్ టి.సి., ఆర్ఫనేజ్, బోల్డ్ లెటర్సు, బాటిల్, టాక్సీ ప్రెజెంటు ఇత్యాది శబ్దములు వాడినారు.[2]

---

1. నవత. ద్వితీయ సంచిక 59వ పుట.
2. నవత. ద్వితీయ సంచిక 'పుట్టినరోజ్' ఖండికలో 60 పుట.

**నూతన చమత్కారములు :** సంప్రదాయికమైన శబ్దార్థాలంకారములు కారదపులని వీరు భావించుటచే సరిక్రొత్త చమత్కృతులను వీరు సృజించుకొనినారు. కవిత్వాన్ని, అవ్‌బోసన రాత్‌రి, నగరమ్, కలల్, ఇట్లు ప్రయోగించి వైచిత్రి సాధించినారు 'గుండెమీద సల్ఫ్యూరిక్ ఆసిడ్ పోసుకున్నాను.' 'నా పెదవుల్ని కత్తిరించి నీ వీపున అతికాను' 'ఈ నిముషంలో విషంలో నా నేత్రాలు సువర్ణ ఝషాలు' మొదలైన చమత్కారములు కూడ వచన కవితా లక్షణములే!

ఏ వంగఃబ విశేష విశిష్టమైన వచన కవిత్వము "భారత కవుల ధర్మదీక్ష, శివకవుల ఆవేశం, కాల్పనికోద్యమపు ఆత్మాశ్రయ పద్ధతి కలిసి"[1] నేడు రూపొందినది. "ఇది అభ్యుదయ కవిత్వోద్యమంలో రెండో దశ. మొదటి దశలో ఆవేశం పాలు ఎక్కువ వున్నట్లు అనిపించింది. ఇప్పుడు ఆలోచనకు ప్రాధాన్యం హెచ్చింది."[2]

**పద్య వచనము :** వచనమును పద్యమువలె వ్రాయవలెనన్న తలంపుతోబాటు అధునికులకు పద్యమును వచనప్రాయముగా మార్చవలెనను ప్రయోగాత్మక దృష్టి కూడ ప్రబలినది. పాండవోద్యోగవిజయాది నాటకములలో కొందఱు నటులు పద్యములను వచనమువలె పొడిపొడిగా చదివెదరు. తిక్కనగారు విరాట పర్వాదులలో కందములను నాటకీయతకై విడివిడి పదముల పొందికతో వచనమువలె నడిపించిరి. భావకవులు ఈ ధోరణికి నారువేసి నీరు పోసిరి!

వెంకట పార్వతీశ్వర కవులు 'భావసంకీర్తనము'లో 'సీసము'ను 'సీస పదము'గా మార్చిరి :

> 'నా మనవి వినుము
> నాకున్న భయ మెడలింపుము
> నన్ను చాలింపుము
> మునుపెన్ని జన్మంబుల నెత్తితినో
> యిప్పుడే నిన్నుఁ దెలిసియైనఁ దెలిసికొనకైన

---

1. కుందుర్తి ఆంజనేయులుగారు.

భజియించుకొంటినో లేదొ యెఱుంగ
నా భాగ్య నిరూఢినేమొ
యీ పుట్టువున భవతాపహరమగు
నీ శ్రీ చరణాబ్జ సంసేవయు భక్తి కలిగినది
మఱిన్ని భవములైన నిది విడకయుండ
నొక వరమిమ్ము నాకు
ఎపుడు నీ చిత్తమెఱింగి నీ కృపకు మరగి
ఇందునెందును సేవించుకొందును ప్రభు' (64)

దాదాపుగా నూటరెండు పద్యములు కల శతక సదృశమైన రచనమును వేంకట పార్వతీశ్వర కవులిట్లే రచించినారు.

శ్రీశ్రీ, భావసమాప్తినిబట్టి పాదములను విరిచి తేటగీతిని వచన గేయముగా మార్చినారు.

'ఆవి ధరాగర్భమున
మానవాస్థికా పరంపరలు
సుప్త నిశ్శబ్ద సంపుటములు
అటనొకే దీర్ఘయామిని
ఆ నిశాశ్మశాన శయ్యకు
ప్రాతః ప్రసక్తిలేదు-'[1]

**పదచిత్రములు :** వచన కవిత కన్నను మఱికొంత ప్రగతిని పద చిత్రకారులు సాధించినారు. ఇందు కవిత్వము ముఖ్యము. ఛందము నిషిద్ధము. ఇది ఆధునికమైన గద్యమే. అంతర్లీనముగా ఒకానొక లయమాత్రము ఆద్యంతము ప్రవహించుచుండును.

'దోషినిగాక దోషాన్ని శిక్షతో కక్షతో కాక నయంతో అనునయంతో శాస్త్రంతో శస్త్రికతోగాక శాంతంతో హృదయంతో తొలగించేది, మనస్సును వెలిగించేది'[2] ఇది శబ్దాలంకారముతో సాగిన వచనము ! దీనిని భావానుగుణముగా

---

1. సుప్రాస్థికలు
2. కె. వి రమణారెడ్డి. భారతి జూన్ 65. (9వ పుట) 'గవేషణ'

ఇట్లు వచనగేయ పాదముల క్రిందికి మార్చవచ్చును.

దోషినిగాక దోషాన్ని
శిక్షతో కక్షతో కాక
నయంతో అనునయంతో
శాస్త్రంతో శస్త్రికతో గాక,
శాంతంతో, హృదయంతో, తొలిగించేది, మనస్సును వెలిగించేది.

శ్రీ సంజీవదేవ్ రచించిన తేజోరేఖలు, పొట్లపల్లి రామారావుగారి చుక్కలు ఈ కోవకు చెందిన గ్రంథములే.

'ప్రతిమనిషి ఒక దీవి దీవిదీవికి సంబంధం కలిపేది
హృదయం అనే సముద్రం' (౧౪)

పదచిత్రముల పేరున 'అభ్యుదయ' మాసపత్రికలో కొన్ని రచనలు వచ్చినవి. ఇందు పదములతో చిత్రనిర్మాణము చేయుట, కవి దృక్పథము. 'పదచిత్రము'లనెడి శబ్దమున కిది సార్థక్యము నాపాదించిన విధానము. కాని అందు ఇతివృత్తము లేకుండుట చేతను, గ్రంథరూపములో, సంకలనమై రాకుండుట చేతను శాశ్వతత్వము నందలేదు. మొత్తము మీద 'నిస్సందేహముగా ఇకముందు పది సంవత్సరాలూ వచన గమకాలలో కొత్త పరిశోధనలకు వినియుక్తం కాబోతున్న'వని శ్రీశ్రీ 1939లో చెప్పిన మాట యథార్థమై ఒక దశాబ్దము కాక మూడు దశాబ్దములు కొత్త గమకములు, నూతన పరిశోధనలు సాగినవి.

**సామాజిక చైతన్యము కారణము :** ఛందమిట్లు పరిణామము చెందుట యాదృచ్ఛిక ఘటనముకాదు. అంతర్జాతీయముగా జరిగిన చారిత్రక సంఘటనము. వివిధ, ఆర్థిక, రాజకీయ శక్తుల ప్రభావ ఫలితము. కావుననే వేదకాలము నుండియును వాదమెరుగక సాగిన నిబద్ధగతిని ఆధునికులు నిలదీసి ప్రశ్నించినారు. "ఛందస్సు చిరకాలంగా కవిత్వానికి బురఖాగా పనికి వచ్చింది, కషాయవస్త్రము యాచనకు"లె.... మాటల్ని గణాలుగా బిగించగల గణాచారి కవియా ?- ఎన్ని పుస్తకములు రచిస్తేనేమి తలగడలుగా ఉపయోగించగలట్టివి ? పద్యశాస్త్రులు కావ్యములా ! కావే"[1] ఔను. కాని వాక్యము పద్యమో గద్యమో

1. అనిబద్ధ కవిత్వము. శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారు. క్రోధి ఉగాది సంచిక 10వ పుట.

ఏదైనను రసాత్మకమైనప్పుడు లయాత్మకముగా కూడ జ్ఞాతముగనో అజ్ఞాతముగనో సాగి తీరును ఇది విశ్వమందలి మహారహస్యము !!

విశ్వమునకు వలెనే జీవితమును లయాన్వితము; శ్రుతి (శృతి) బద్ధము. ఈ నిబద్ధ తత్వము బంధనమునకు కాక ఆనందమునకే దోహదము చేయును. ఆధునిక జీవితములో ఈ లయ తప్పినది. ఆర్థిక రాజకీయ రంగములలోని సంక్షోభము, సాంస్కృతిక రంగమును కలగుండు పరచినది. విధ్వంసాత్మకమైన విప్లవమున కిది దారి తీసినది. ఆత్మీయమైన లయ తప్పిన జగత్తులో విశృంఖలత్వము పెరుగుట సహజము. జీవితమిట్లుండగా జీవితమునకు ప్రతిబింబమైన సాహిత్యమును దానిని ప్రతిఫలింపజేయుట సహజమే ! జీవన విప్లవముతోడిదే రూపవిప్లవమును !

శబ్దము, అర్థము, ఇట్లా అనూహ్యమైన పరిణామమునకు లోనగుట కిదియే కారణము. మీరు మిక్కిలి ఇది యాంత్రిక యుగము. కావుననే అంతరిక్ష నౌకల వేగముతో ఈ రూప విప్లవములు సాగుచున్నవి. విశ్వము తన నాల్గవ కొలతయైన కాలము నాశ్రయించినచో, కాలము వేగము నాధారముగా చేసికొన్నది. ఈ వేగము, ఆవేగము, బ్రతుకుకు కవితకు చోదక శక్తులైనవి !!

పద్యమేమి, గద్యమేమి, ఛందము, లయ, లేకుండ ఉపస్థితమే కావు చివరకు అనిబద్ధ కవిత్వము కూడ లయను త్రోసిరాజనలేదు. లయ 'తప్పినదే' కాని నిర్మూలించుట ఎవరి తరము?? ఏమైనను, నేటి మానవుని మనస్సులో స్వేచ్ఛ పేరిట చెలరేగిన విశృంఖలత్వము ప్రపంచగతిలో ఈ పరివర్తనమును సాధించినది. ఇందలి మంచి చెడుగులు నిర్ణయించుట, ఫలితము ననుభవించుట, భవిష్యత్కాలము పని ! రూపవిప్లవములను ప్రదర్శించుట మాత్రమే 'ఉద్యమ పరిశీలనాత్మకమైన ఈ వ్యాసము యొక్క పరిధి !!

పంచమాధ్యాయము

# రాజకీయోద్యమములు

## జాతీయ మహోద్యమము :

స్వాతంత్ర్యోద్యమ మొకనాటిది కాదు; ఒకచోటున వికసించినది కాదు; నరుడు కిన్నరుడు కాక వానరుడో దానవుడో అవతారమెత్తినట్లు పరివర్తనము చెంది తోటి నరుని బానిసగా మార్చినప్పుడు జరిగిన సంఘర్షణములో స్వాతంత్ర్య పిపాస రగుల్కొనును. వ్యక్తి శక్తిగా మారినట్లు వ్యష్టిలోని ఆకాంక్ష సమష్టికి తీగలల్లి ప్రాకినపుడు సంఘర్షణ సంగ్రామము క్రిందికి మారును అప్పుడు క్రుద్ధమైన అగ్నిపర్వతముల నుండి బహిర్గమించిన లావాలు జాతులకు జాతులనే సలసల కాగించును, కరిగించును అప్పుడు జన్మించెడిది చరిత్ర కాదు, పవిత్ర ధరిత్రి నవసృష్టికై పడుచున్న పురిటి నొప్పులు; అంకెలను అక్షరములును కావవి, మానవ అగ్నిపర్వతములు పెటీలుమని క్రుద్ధమై ప్రవహించిన ప్రళయ వాహిని. విధిచేకాక మానవుని చేతనే వంచితుడైన మానవుడు తన కష్టము, కన్నీరు, రక్తము కలిపి మరిగించి నిర్మించిన సరికొత్త రసాయనమది. (టానిక్) భారత జాతీయ స్వాతంత్ర్య మహాసంగ్రామోద్యమమట్టి దివ్యౌషధము. దానిని చవిచూచిన వా రమృతులే !!

**దివ్యభూమి :** పృథ్వియే ఈశ్వరుడు,[1] భూమి హిరణ్యగర్భ ఈశ్వరుడు హిరణ్యగర్భుడు[2] పృథ్వి జీవసృష్టికి రంగస్థలము, ఈశ్వరుడు సృష్టి

---

1. యః పృథతే సర్వజగద్విస్తృణాతి సపృథివీ - సమస్తమగు విస్తృత జగత్తును విస్తారము చేయువాడు కాబట్టి ఈశ్వరునకు పృథివియని నామము.

2. హిరణ్య గర్భః సమవర్తతాగ్రే భూతస్యజాతః పతిరేక ఆసీత్ సదా ధార పృథివీంద్యాముతే మాంకస్మైదేవాయహవిషా విధేమ-

యజుర్వేదము అ. ౧౩. మం. ౪.

కర్త. ఈశ్వరుడు మణియైనచో పృథ్వీతత్వమాతని ఒకనొక గుణము. ఈశ్వరుడు శివుడు పృథ్వి శక్తి. స అంబుడైన ఈ సదాశివుని పృథ్వీరూపమున అర్చించుటే వేదమతము పృథ్వీ సూక్తములోని రహస్యమిది !

**మాతృ సంకీర్తనము :** ఇట్లు దేశమునకు దివ్యత్వము నాపాదించి మాతృభూమిని ప్రత్యక్షమైన సాకార దేవతగా ఉపాసించుట యుగయుగముల నుండి అనూచానముగా వచ్చుచున్న భారతీయార్ష సంప్రదాయము.

"సముద్ర వసనే దేవీ పర్వత స్తన మండలే
విష్ణుపత్ని నమస్తుభ్యం పాద స్పర్శం క్షమస్వమే"[1]

అని ప్రభాతగాన మాలాపించి కాని భారతీయుడు పృథ్వీపై కాలిడడు. వేదోపనిషత్తులలోను పురాణములలోను భారతదేశము దేవతాత్మగా వర్ణింపబడినది. అందలి నదీనదములను స్థావర జంగమములను వైదిక మహర్షులు పరవశముతో వర్ణించినారు. భగవాన్ వ్యాసుడు శ్రీమద్భాగవతములో మలయ మంగళప్రస్థ, మైనాక, త్రికూటాది పర్వతములను, చంద్రవస, తామ్రవల్లి అవతోద, కృతమాల వైహాయసి కావేరి, వేణి, పయస్విని ఇత్యాది అసంఖ్యాక నదీ నదములను పేరు పేరున స్మరించి తన భక్తి ప్రపత్తులు ప్రదర్శించుకొనినాడు. ఇది ధర్మభూమి, కర్మభూమి దేవతలకు కూడ ఇందు జన్మ మలభ్యము.

## దేవాగాయన్తి:

"అహో అమీషాం కిమకారి శంభనం
ప్రసన్న ఏషాం స్విపుత్ర స్వయంహరిం
మైర్జన్మ లబ్ధం నృషు భారతాజిరే
ముకుందసేవౌ పయికం స్పృహాహినః"[2]

[దేవతలిట్లు భారత వర్షమును ప్రశంసించుచున్నారు. భారతవర్షములో జన్మనందిన మహాపురుషుల దివ్యకార్యము లెట్టివో కదా ! ముక్తికిది సోపానము. భగవంతుడు కూడ ఆనందించెడి విషయమిది ]

---

1. ప్రాత స్తవము.
2. మహా భాగవతము

ఇట్టి పవిత్ర ధరిత్రికి తాము పుత్రులమని భావించి మాతాపుత్ర సంబంధముతో ఈ జాతీయులు జీవించినారు.

"మాతాభూమిః పుత్రోహం పృధివ్యాః"

ఈమె భువన మనమోహిని[1] దశ ప్రహరణధారిణియైన దుర్గ[2] ఈ దేశమే 'ఆది శక్తి, మహామాయ, జగన్మాత'[3] ఈమెను స్తుతించి దేవతతే చరితార్థులగుచున్నారు.

"గాయంతి దేవాః ఖలు గీతకాని
దివ్యాస్తుమే భారతభూమి భాగే
స్వర్గాపి వర్గాస్పద హేతుభూతే
భవన్తి భూయః పురుషాః సురత్వాత్"[4]

ఇందు జన్మించిన ప్రతి నరుడును నారాయణుని సాకారమేనని భావించి వారిని స్మరించుట దేశభక్తుని కర్తవ్యము.

"అశ్వత్థామా బలిర్వ్యాసో హనుమాంశ్చ విభీషణః
కృపః పరశురామశ్చ సప్తైతే చిరజీవినః
పుణ్యశ్లోకోనలో రాజాపుణ్యశ్లోకో యుధిష్ఠిరః
పుణ్యశ్లోకాచవై దేహి పుణ్యశ్లోకో జనార్ధనః"[5] ఇట్లు ప్రాతస్తవనీయులను స్మరించి కాని భారతీయుడు తన అనుదిన కార్యక్రమము నారంభింపడు. పరమపునీతమైన ధార్మిక జీవనమునకు భారతాలయము మూలకందము. ముక్తి సాధనకిది మహత్తరమైన ఆలంబనము. "బాల్యములో మాతృమధుర పర్యంకము. యవ్వనమున సుందరనందనవని. వార్ధక్యములో వారణాశి.[6] ఇందలి

---

1. రవీంద్రుడు
2. బంకించందుడు
3. అరవింద యోగి
4. ఋషి వాక్యము
5. ప్రాతస్తవము
6. స్వామి వివేకానందుడు

ప్రత్యంగుళమును పుణ్యస్థలమే ! ప్రతి జలబిందువును పవిత్రతీర్థమే ! యుగయుగముల భారతీయుల దివ్యసంకల్పమిది !! సుసంకల్పసంకీర్తనమిది !!

## స్వాతంత్ర్యము నా జన్మహక్కు :

స్వాతంత్ర్యమొకరు ప్రసాదింపవలసినది, మఱొకరు నిరోధింప గలిగినది కాదు. జీవునికి జన్మతః సంక్రమించిన సహజ లక్షణమిది !! స్వాతంత్ర్యము జీవధర్మము. అది విస్మరించిన జీవుని వేదన మొత్తమును ఈ ముక్తస్థితి నపేక్షించియే సాగును. అన్ని మతములు, దర్శనములు, దార్శనికులు జీవునికి చేయు సహాయ కార్యక్రమ మిదియే !! 'ముక్తి'కి నిర్వచనములో భేదముండవచ్చును కాని అది స్వతంత్రమైన ఆనంద స్థితిని జీవునకు ప్రసాదించుననుటలో దార్శనికు లంగీకారము వ్యక్తపరచినారు మానవునికి ఆర్థిక, సామాజిక, రాజకీయ, మానసిక, ఆత్మీయ స్వాతంత్ర్యములవసరము. ఈ భౌతిక ఆధ్యాత్మిక స్వాతంత్ర్యముల నెవరపహరింప యత్నించినను సుప్తమైన కుండలినీ ఫణియై జాతి వేయి ముఖములతో విజృంభించి జాగృతమై కాటు వేయును. 'స్వాతంత్ర్యము నా జన్మహక్కు'ని తిలకు మహాశయుడు గర్జించుటలోని అంతరార్థమిదియే !!

## అరవిందుని నిర్వచనము :

అరవిందుని దృష్టిలో దేశభక్తి ఇట్లు నిర్వచింపబడినది. "భారతమాత కేవలమొక మృణ్మయ పాత్రకాదు. కవికల్పయును కాదు. ఆమె సజీవ దివ్యశక్తి స్వరూపిణి, ఆధ్యాత్మిక భావనాశక్తి తత్వమామె. విశ్వచేతన ఈమె ఉనికికి ప్రధాన ఆలంబన. సౌశీల్యమే ఈమె అద్భుత నిగ్రహశక్తి యొక్క పరమ రహస్యము. ఈమె పునరుత్థానము శాశ్వతతత్వములలోని అమోఘశక్తి ఇదే ! భారతీయులు గొప్ప నాగరికత గల జాతివారు. బహుముఖ ఫలప్రదమైన చరిత్ర గల జాతి ఇది. ఈ భూమి శాశ్వతమయినది. ఈ జాతి సనాతనమయినది. మతము అనాది అయినది. ఈ శక్తి అపారమయినది. తాత్కాలికముగా మన గొప్పతనము, పవిత్రతా శక్తి, మబ్బుపట్టి ఉండవచ్చునేమో కాని, ఎట్టి పరిస్థితుల లోను ఇది ఒక్క క్షణము కూడా అంతరించి ఉండలేదు. వీరులూ యోగులూ ఋషులూ ఈ భారతభూమికి సహజ ఫలములు. ఇట్టి యోగపురుషులు జన్మించని కాలము ఈ దేశములో లేనేలేదు. భారతదేశమునకు నేడు గొప్ప పరీక్షా సమ

యము. ఆత్మ విస్మృతిలో, సంపదలూ వ్యాపారములూ సాంఘిక రాజకీయ సైనిక వ్యవహారములు, ఆదాయములు, వాంఛలు, (కు)తంత్రములు- అశాశ్వత మైన వీటినే పెంచుకొనుచు పోవుట స్వధర్మమునకు మహాపరాధమగును మిగి లిన భూమండల మంతయును ఆశగా భారతదేశము వైపు దృష్టిని సారించుచున్న ప్పుడు ఈ దేశము తన పిత్రార్జితమైన ఆధ్యాత్మిక మూల్యములను వదులుకొనుట పరిహాసాస్పదము."

## ఆంధ్ర ప్రాంతము - స్వాతంత్ర్యోద్యమము :

ఈ జాతి జీవనగతిని అస్తవ్యస్తముచేసి దీనిపై సర్వసర్వంసహాధి కారము స్థాపించుకొనవలెనని యుగయుగముల నుండియును వైదేశిక శక్తుల పోరాటము సాగుచునే వచ్చినది. భారతీయులు అన్ని యుగములలోను తమ అంతిమ విజయమును సాధించుకొనుచునే వచ్చినారు. గత వేయేండ్లలో అర బ్బులు, మొగలులు, ఆంగ్లేయులు, ఒుడతకీచులు, పరాసులు- వీరు వారననేల సామ్రాజ్యదాహము ధనకాంక్ష కలిగిన వైదేశికులందరి దృష్టిలోను తొలిసారిగా మెరిసినదీ రత్నగర్భయే. వారు దండయాత్రలు చేయుటేమి వానిని విజయ వంతముగా దేశీయులు మరలించుటేమి అనాదిగా సాగుచున్న చరిత్రమిదియే. కాని ఇతరుల దండయాత్రలకును ఆంగ్లేయుల విజయమునకును కొంత భేదము కలదు. ఇతరులు హైందవులను రాజకీయముగా మాత్రమే జయించిరి, అట్టి విజయము శాశ్వతము కాదని ఆంగ్లేయులు గ్రహించి ఆర్థికముగా, సాంస్కృతిక ముగా, భాషాపరముగా, మతవిషయికముగా సర్వరంగములలోను జాతీయులను వారు బానిసలను చేసిరి. సంస్కృతి, జాతీయ వృక్షమునకు కూకటివ్రేళ్ల వంటిది. దానితో సంబంధము నశించిన వృక్షము జీవించుట దుర్లభము. కావుననే దేశీయులు ఆంగ్లేయులకు వ్యతిరేకముగా పోరాటమును ఈ రంగములన్నింటికిని విస్తరించిరి.

**తొలిరేఖలు :** 1857లో పగిలిన అగ్నిపర్వతపు ప్రభలు తెలుగు నాడును కూడ ముంచెత్తినట్లు లోగడ మనవి చేసితిని. తెలుగు దేశములోనే కాక దేశాంతరమున నున్న ఆంధ్రులు కూడ సమధికోత్సాహముతో స్వాతంత్ర్యోద్య మమున పాల్గొనిరి. 1858 జనవరిలో చాందా జిల్లాలోని మోలంపల్లి జమీందారు బాబూరావ్‌గారు, ఆరేపల్లి జమీందారు వెంకట్రావు గారలు విదేశీయ పాలనము

సాయుధముగా ప్రతిఘటించిరి. కాని అహీరా, జమీందారిణి చేసిన దేశద్రోహము ఫలితముగా వారిని ఆంగ్లేయులు బంధించిరి. బాపూరామ్‌గారిని ఉరి తీసిరి. వెంకట్రావుగారిని ద్వీపాంతరమున కంపిరి. నేటికిని ఈ జాతీయ వీరులను గూర్చిన వీరగాథలు, పాటలు తెలుగులో, చాందా జిల్లాలో ప్రచారములో ఉన్నవి!

తెలుగుదేశము వీరగడ్డ! ఆవేశమే రాజలెను కాని ఇంటింటను ఒక బాలచంద్రుడు వెలయగలడు. 1857 ఆగస్టులో గోదావరి జిల్లా ఎర్నగూడెము, తడిమెళ్ల తాలూకాల ఉత్తర భాగములో కొరటూరు గ్రామ మునసబు కోరుకొండ సుబ్బారెడ్డి నాయకత్వమున తిరుగుబాటు జరిగినది నానా సాహెబు విజయగాథలు విని పరవశించి సుబ్బారెడ్డి చుట్టుపట్ల నున్న కోయలు మొదలైన గిరిజనులను వనచరులను సమీకరించి అభినవ శ్రీరాముడై ఆంగ్లేయ రావణునిపై విప్లవము నడిపెను. భయంకరమైన గెరిల్లా యుద్ధము జరిగెను. విజయము అనుమానాస్పదమే అయినను కర్తవ్య నిర్వహణమునకై సాగిన ధర్మయుద్ధమిది. కావుననే విజయమునకు బదులు సుబ్బారెడ్డి వీరస్వర్గమునే అలంకరించెను. ఇట్టి సంఘటనము లానాడు కోకొల్లలు!

**జాతీయ కాంగ్రెసు స్థాపనము:** 1857 పరాజయమునకు కారణములను సునిశితముగా విశ్లేషించి పరిశీలించిన పిమ్మట దేశవ్యాప్తముగా స్వాతంత్ర్య చైతన్యమొక్కసారే పెల్లుబుకవలెననియు సామాన్యుడు కూడ జాతీయ భావముతో స్పందింపవలెననియును నాయకులు నిశ్చయించిరి. తత్ఫలితముగా నేర్పడినదే 1885 లోని జాతీయ కాంగ్రెసు స్థాపన. ఆంధ్రులీ ఉద్యమమునకు అధినేతలు, సారథులునైరి. న్యాపతి సుబ్బారావుగారు అఖిల భారత జాతీయ నాయకులు.[1] రంగయ్యనాయుడు, కేశవపిళ్లె, గంజాం వెంకటరత్నం, కృత్తి కంటి పేరిరాజు, వరాహగిరి జోగయ్య మొదలగు ప్రముఖులు జాతీయోద్యమ బీజము ఆంధ్ర క్షేత్రములో నలుమూలల వెదజల్లిన జాతీయ కర్షకులు. పన ప్పాకం ఆనందాచార్యుల వారు నాగపూరు సమావేశములకు స్వయముగ అధ్య

1. "ఆంధ్ర రాజకీయాలలో వీరిది గురుస్థానము. 'ఆంధ్ర భీష్మ' అని వీరికి బిరుద మొసగి ఆంధ్రదేశము తన్ను తాను గౌరవించుకొన్నది." వి స. III 1205. కీ॥ శే॥ భోగరాజు పట్టాభి సీతారామయ్య.

తుకు. వీరి తోడ్పాటుతో భారత జాతీయ కాంగ్రెసు కనుబంధ శాఖలు ఆంధ్ర ప్రాంతములో తాలూకా తాలూకాలో నెలకొల్పబడెను. దీనితో వెచ్చని ప్రభాతారుణ కాంతులు జాతి యెదలలో తెలియకుండగనే అంగారవల్లరులను రగిలింప సాగినవి !

**కర్షక చైతన్యము :** 18౫౯వ సంవత్సరములో కృష్ణాజిల్లాలో ఒక అపూర్వ సంఘటనము జరిగినది. నాటికింకను గాంధీజీ సత్యాగ్రహోద్యమము ప్రారంభింపనే లేదు. జాతీయ కాంగ్రెసు సహాయ నిరాకరణ మంత్రమును పఠింపనే లేదు. కాని నాటికే ప్రజాచైతన్యము పెల్లుబికినది. నిప్పురవ్వ పడుటకు సిద్ధముగా నున్న ఎండిన కారడవి అది ! కృష్ణా జిల్లా ఏలూరులోని కర్షకులు ఆంగ్లేయులకు వ్యతిరేకముగా బ్రహ్మాండమైన సత్యాగ్రహ సమరమును సాగించినారు. ఆంగ్లేయులు రైతులపై నీటి తీరువకు నాలుగు రూపాయల నుండి ఐదు రూపాయలకు పన్ను పెంచినారు. ఇది కర్షక చైతన్యమునకు సత్య ఆగ్రహమునకు కారణమైనది. రైతులు పన్నులు చెల్లింపరాదని నిశ్చయించుకొనినారు. వ్యవసాయమునే చేయకూడదని తీర్మానించుకొనినారు. దానితో ప్రభుత్వము వారిని కారాగృహములలో తొక్కినది. ఫలితముగా కార్మిక కర్షకుల అసంతృప్తి ఏలూరు నుండి గుడివాడ కంటుకొనినదే కాని ఆరలేదు. ఆరుటయేమి దశాబ్దము తిరుగకముందే 'వందేమాతరం' నినాదము నిప్పు రవ్వవలె కారడవిలో పడినది ! దావానలము భగ్గున రగుల్కొన్నది !

**ఉద్యమ స్వరూపము :** ఆంధ్రదేశములోని అఖిల భారత స్థాయిలో నేమి దాదాపుగా అర్ధశతాబ్దము నిర్విరామముగా సాగిన మహోద్యమ మిది. పందొమ్మిదవ శతాబ్దము ఉత్తరార్థపు చివరి కాలములో ప్రారంభమై ఇరువదవ శతాబ్దపు పూర్వార్థమంతయును సమగ్రముగ ఆక్రమించుకొనిన చరిత్రమిది ! కవులు, గాయకులు, నాయకులు, మేధావులు, తపస్వులు, అక్షరాస్యులు నిరక్షరులు వారు వీరననేల జాతి మొత్తమును తను మన ధనములు సర్వసమర్పణ చేసి ఈ జాతీయోద్యమ యజ్ఞములో తమ్ము తాము సమిధలవలె సమర్పించుకొనినారు.

1887 లో మూడవ జాతీయ కాంగ్రెసు మహాసభ మద్రాసులో జరిగినది. సురేంద్రనాథ బెనర్జీ, గోపాలకృష్ణ గోఖలే, పండిత మాలవ్యా ప్రభృతులిందు

ప్రసంగించినారు. బిపినచంద్రపాల్ కూడ ఈ సభలకు విచ్చేసినారు. ఆంధ్ర దేశము నుండి పలువురు మేధావు లీ సభలకు వెళ్ళి జాతీయోద్యమ బీజములను తీసికొని వచ్చి తమ తమ క్షేత్రములలో చల్లినారు. దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారీ సభలలో స్వచ్ఛంద సేవకునిగా పని చేసినారు అది వారి విద్యార్థిదశ. నాటినుండి, ముందుగా సంఘ సంస్కరణ రూపములో కొంత కాలమీ జాతీయోద్యమము ప్రభుత్వము గుర్తించలేని పద్ధతిలో ముందునకు సాగినది. సంఘ సంస్కరణమనునది ఏదో ప్రజల వైయక్తిక విషయమని నిర్లక్ష్యము చేసినారే కాని జాతిలోని బలహీనతలను రూపుమాపి ఆరోగ్యము, పుష్టికల సుసంఘటితమైన శక్తిని ఈ సంస్కర్తలు తమకు వ్యతిరేకముగా నిర్మించుచున్నారని పాలకు లెరుగరు !!

**పత్రికలు - ప్రచారము :** జాతీయోద్యమ ప్రచారమునకు పత్రిక చక్కని సాధనము. కావుననే తిలకు మహాశయుడు కేసరి, మరాఠాల నుపయోగించి మహారాష్ట్రములో అపూర్వమైన ప్రజాచైతన్యమును నిర్మించెను. ఆంధ్ర ప్రాంతములో 1902 లో ఈ యుద్దేశముతోనే బందరులో దాసు నారాయణరావు గారు, కొండా వేంకటప్పయ్య పంతులుగారును కలిసి 'కృష్ణా పత్రిక'ను స్థాపించిరి. "పువ్వు పుట్టగానే పరిమళిస్తుందన్నట్లు ముఖ్య సంపాదకులుగా వెంకటప్పయ్యగారు పత్రిక ద్వారా దేశభక్తినీ స్వదేశాభిమానాన్ని కల్గించేవారు"[1] స్వదేశారాధన అను తమ తొలి దినములలోని సంపాదకీయములలో "హిందూ దేశమున జన్మించిన ప్రతివాడును తన శక్తివంచన లేకుండ పాటుపడినచో మన దేశ శిల్పములు వృద్ధియగును. స్వదేశ వస్తునిర్మాణము వృద్ధి పొందును. తిరిగి ఎప్పటివలె కృషి వాణిజ్యాదులందు నాగరిక దేశాలలో ఒకటిగా భారతదేశం అభివృద్ధి గాంచును" అని వ్రాసినారు స్వదేశ ఉద్యమము గాంధీజీ ప్రారంభింపక ముందే ఆంధ్ర దేశములో 'స్వదేశ వస్తునిర్మాణ' భావమున్నట్లు పై సంపాదకీయము సాక్ష్యమిచ్చుచున్నది. ఇట్టి ప్రచారములే పత్రికా ముఖమున సాగించుటకు నాటి జాతీయ నాయకులు నిశ్చయించుకొనిరి !!

## పోరాటము - వింగడింపు :

ఆంధ్ర దేశములో సాగిన జాతీయోద్యమ చరిత్రమును శాస్త్రీయ పరిశోధ

1. దేశభక్త జీవితము, శ్రీ మాదల వీరభద్రరావు 12 వ పుట

నముతో విమర్శించినచో అందు కొన్ని విభాగములు కనవ్పట్టును. లక్ష్యము స్వాతంత్ర్య సిద్ధియే ఐనను అందుకు ప్రముఖులు భిన్న భిన్న మార్గములను తమ తమ అభిరుచుల కనుగుణముగా అనుసరించిరి వానిని ఈ క్రింద ఉదహరింతను.

ప్రత్యక్ష సంగ్రామము :-

1) మితవాద వర్గము
2) అతివాద వర్గము
3) మధ్యేమార్గము
4) విప్లవ మార్గము

పరోక్ష సంగ్రామము :-

1) జాతీయ శక్తిని రగుల్కొల్పుట.
2) మతముపై సంస్కృతిపై ప్రేమను నెలకొల్పుట.
3) సాంఘిక సంస్కరణములు. మహిళోద్యమము, హరిజనోద్యమము ఇత్యాదులు.
4) సారస్వత సేవ.

మితవాదులు అహింసా పద్ధతి నవలంభించి ఆంగ్లేయులు స్వాతంత్ర్యమొసంగినచో గ్రహింపవలెనను సంకల్పముతో నున్నవారు. న్యాపతి సుబ్బారావు, మోచర్ల రామచంద్రరావు, బి. ఎన్ శర్మ, ఆమంచర్ల కృష్ణారావు, భూపతిరాజు వేంకటపతిరాజు ప్రభృతు లీ కోవకు చెందిన నాయకులు. అతివాదులు తిలక్, మాలవీయా అనుయాయులు. ఆంగ్లేయులను మెడపట్టి గెంటవలెనే కాని స్వరాజ్యము యాచింపదగినది కాదని వారి మతము. పింగళి లక్ష్మీనారాయణ ఉన్నవ లక్ష్మీనారాయణ, అయ్యదేవర కాళేశ్వరరావు ప్రభృతు లీ వర్గమునకు నాయకులు. దేశభక్త కొండా రెండు వర్గములను సమన్వయపరచి మధ్యేమార్గము నవలంభించిన నాయకుడు. అల్లూరి సీతారామరాజు ప్రభృతులు సాయుధ విప్లవమును సాగించినవారు !! రాజకీయములకు సహాయకారియో యనునట్లు ఉన్నవ కొండా, రఘుపతి వేంకటరత్నం నాయుడు వీరేశలింగం పంతులుగారు, హరిజనోద్యమ, మహిళోద్యమాదులను నిర్వహించుటయును వ్యసనముల నుండి సమాజమును దూరముచేసి జాతీయ శక్తిని సుసంఘటిత పరచుటయును

సాగించినారు. ఈ సంఘహిత కార్యక్రమములన్నియును జాతీయోద్యమములోని భాగములే !! ఇదిట్లుండగా ఆంధ్ర సాహిత్యము నుద్ధరించుట, ప్రాచీన అముద్రిత గ్రంథములను సేకరించి పరిష్కరించుట వేఱొక వంక సాగించినారు. ఇది భాషాపరముగా వైదేశిక శక్తిపై జాతీయులెత్తిన విప్లవధ్వజము. అటు ఆంధ్ర దేశములోను ఇటు ముఖ్యముగా తెలంగాణములోను జాతీయోద్యమము గ్రంథాలయముల సహాయమున పురోగమించుటలోని రహస్యమిదియే! అయ్యంకి వేంకటరమణయ్య ప్రభృతు లీ మహోద్యమమునకు సారధులు !!

**వందేమాతరం :** 1905 ఆంధ్రదేశ చరిత్రలో నొక స్వర్ణఘట్టము. బంకించందుని వందేమాతరం గేయము జాతీయోద్యమమునకు తారకమంత్రమైనది. ఈ గేయమే ఉద్యమమును నడిపినది 1907 లో బిపినచంద్రపాల్ ఆంధ్రదేశమును పర్యటించినారు. దానితో శాసనధిక్కారమునకు తెలుగు జోదులు ముందంజవేసినారు. గాడిచర్ల హరి సర్వోత్తమరావు ప్రభృతులిందుకు నాయకులు. "మహారాష్ట్రంలో తిలక్ మహాశయుడు అరెస్టు చేయబడిన 1908 జులై 15వ తేదీననే ఆంధ్రలో శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు అరెస్టు చేయబడినారు. వీరు రాజద్రోహానికి మూడేండ్లు కారాగార శిక్షల ననుభవించారు. రాజమండ్రి, కాకినాడ విద్యార్థులు ఈ మహోద్యమంలో అగ్రగాములుగా నిలిచి చరితార్థులైనారు."[1] విద్యార్థులు పాఠశాలలు కళాశాలలు వదలుట కిదే మొదలు.

**స్వదేశీ :** వస్తు వినియోగములో నేమి విద్యలోనేమి స్వదేశీభావము ప్రవేశించినది. 'మీరు నాకు ఖద్దరు నిండు మీకు నేను స్వరాజ్యమిచ్చెదనని'నారు గాంధీజీ. దీనిని ముందుగా సాకారముగా ప్రదర్శించినవారు ఆంధ్రులు. 1906 డిసెంబరులో జరిగిన కలకత్తా జాతీయ మహాసభలకు వెళ్ళివచ్చిన ఆంధ్ర ప్రతినిధులీ భావమును కార్యరూపమునకు తెచ్చినారు. 1907 లో బందరులో జాతీయ విద్యాలయ నిర్మాణమునకు తీర్మానించినారు. 1910 లో దీనికి ప్రారంభోత్సవము జరిగినది.

"వాలాయంబు స్వదేశవృద్ధి మదిలో వాంఛించి కష్టంబులే
వేళన్పొందుచు సౌఖ్యము న్విడిచి విద్యన్శిష్య వర్గంబు స

1. దేశభక్త జీవిత చరిత్ర, శ్రీ మాదల వీరభద్రరావు 82 వ పుట

చ్చీలుఁరాగ నొసంగ జాలియశము న్జేకొన్న మానేష న
ల్కాలే జన్గల దేశికోత్తములనే శ్లాఘింతు నిప్పట్టునన్"

అని కవివృషభులు గొంతెత్తి గానము చేసినారు [1] అట్లే ఉన్నవవారి ఆధ్వర్యమున శారదా నికేతనము కూడ స్థాపింపబడినది. తిలకుగారి ఫెర్గూసన్ కళాశాలయే వీరికి స్ఫూర్తి పూనాలోని మహిళా విద్యాలయము నిర్వహించుచున్న కార్వే పండితునితోను ఫెర్గూసన్ కళాశాలకు చెందిన డాక్టరు పరంజపే, మహాదేవ గోవింద రానెడే పండిత భండార్కరులతో దేశభక్త కొండా ఈ సందర్భములో చర్చలు సాగించి వచ్చుట గమనార్హము!!

విద్యలలోను వృత్తి విద్యలలోను ఆంధ్రులు 'స్వదేశీ' తత్వమును జాగృతముచేసి స్వయం సమృద్ధికై పరప్రాంతములకేగి అగ్గిపెట్టెలు మైనపు వత్తుల వంటి నిత్యజీవితావసర వస్తు పరిశ్రమలనెన్నిటినో చూచి నేర్చుకొని తిరిగివచ్చి స్వదేశీ దుకాణములను స్థాపించిరి.

**ప్రగతి పథము :** దినదినమునకు జాతీయోద్యమము ప్రవర్ధమానమగుటతో ఆంధ్ర దేశములోని చైతన్యము కూడ ప్రగతిపథములో సాగుచు హోమ్ రూల్, పుల్లరి సత్యాగ్రహముల వంటి సంఘటనములు కుతప కాలమును సూచింపగా, మహాత్ముని అసహాయోద్యమ శంఖారావముతో మధ్యందిన మార్తాండుని వలె నుండినది. రౌలట్ చట్టమునకు వ్యతిరేకముగా పిలుపులు, డయ్యర్ దారుణ మారణ కృత్యమునకు నిరసన, వేల్సు యువరాజుకు వ్యతిరేక ప్రదర్శనలు, తిలక్ స్వరాజ్యనిధి సేకరణ, ఇరువదివేల చరఖాల గూర్చి తీర్మానము- సంఘటన వెంట సంఘటనము వచ్చి ఆంధ్రదేశమొక సలసల కాగెడి తైలఖాండమో భగభగ మండెడి నిప్పుల కుంపటియో అనునట్లు మారినది. విద్యార్థులు వీధులలో పడినారు. "విద్యార్థులారా! పరాధీనత, స్వార్థ పరత్వము, బోధించెడి మీ విద్యల నిక వదిలిపెట్టుడు. మాతృదేవి నర్చింపుడు. నాడే మీరు కళాశాలల కివతల నిజమైన విద్యను నేర్చుకొనగలరు నాడే దేశమునకు విముక్తి" [2] అని ద్రష్టలు

---

1. శ్రీ బందా సూర్యనారాయణకవి. (31-8-1912 కృష్ణాపత్రికలో ప్రచురితము)
2. ముట్నూరి కృష్ణారావు సంపాదకీయం. కృష్ణాపత్రిక, 29 జనవరి 1921.

వాఙ్మయ స్రష్టలు పిలుపు నిచ్చిరి. విద్యార్థులతోపాటుగనే ఉద్యోగస్థులును జాతీయ సంగ్రామములోనికి నడిచిరి. "గుంటూరు 1921 స్వాతంత్ర్యోద్యమమునకు ప్రముఖ కేంద్రమయ్యెను. స్వాతంత్ర్యమొక సంవత్సరములో రాగలదని భావించి న్యాయవాదులు తమ పనులను మానివేయవలెనని పిలుపు నీయగా 21 మంది వెంటనే వృత్తిని విరమించిరి."[1] స్వాతంత్ర్య సంగ్రామమనగా ఆధ్యాత్మిక సాధనమనియే వారి దృఢ విశ్వాసము. దుగ్గిరాల గోపాలకృష్ణయ్య గారి 'రామదండు' అందుల కుదాహరణము 'Religion was the Inspiration of Duggirala's Life.'[2] చీరాల - పేరాల సత్యాగ్రహముతో వీరు సృష్టించిన చరిత్ర ఆంగ్లేయుల గుండెలలో బల్లెమైనది. దాదాపుగా పెదనందిపాడు పన్నుల నిరాకరణ పోరాటము కూడ ఇట్టిదే !!

గుజరాతులోని సబర్మతీ ఆశ్రమములవంటి వానిని ఆంధ్రలో సీతానగరము, చాగల్లు, పల్లిపాడు మొదలైనచోట్ల స్థాపించిరి. గాంధీతత్వ ప్రచార కేంద్రములివి. 'కల్లు మానండోయ్ బాబూ కళ్లు తెరవండోయ్' అని గాంధీ సైనికులు పాటలు పాడుచు తిరుగుచు సామాన్య జనతను జాగృతము చేయుటతో ఆంగ్లేయుల ఆదాయము హఠాత్తుగా పడిపోయినది. ఆంధ్రుల కీర్తిప్రతిష్ఠలు ఇనుమడించినవి.

**ధ్వజనిర్మాణము :** జాతీయోద్యమమున కొక నికేతన మేర్పడినది. దానితో ఒక కేతనము కూడ కావలసి వచ్చినది. ఆంధ్రులే ఆ బాధ్యత కూడ స్వీకరించిరి. బందరు జాతీయ కళాశాలలో పని చేయుచుండిన పింగళి వెంకయ్య గారను ప్రముఖులు నాటి జాతీయోద్యమ స్వరూపమున కనుగుణముగా వివిధ జాతుల మధ్య సమైక్యతను దృష్టిలో నుంచుకొని కాషాయ శ్వేతహరిత వర్ణములతో కూడిన పతాకము నొకదానిని నిర్మించెను. హిందువులకు, ముస్లిములకు అన్యులకు ప్రాతినిధ్యము వహించు పతాకమిది. అగ్రనాయకులు స్వల్పముగా దానిని మార్చి జాతీయ కాంగ్రెసు పతాకముగా ఆమోదించిరి. పతాక నిర్మాణ ప్రతిష్ఠ కూడ ఆంధ్రులకే దక్కినది

---

1. 'హిందూ' దినపత్రిక. 31 జనవరి 1921 వార్త.
2. Sri G. V. Subba Rao. Gopalakrishnayya's essays and Addresses.

**ప్రతిఘటనము - పురోగమనము :** అన్ని ఉద్యమములకు వలెనే జాతీయోద్యమమునకు కూడ ప్రతిఘటనము తప్పలేదు. సత్యాగ్రహోద్యమము వేగమునందుకొనచుండగా జస్టిస్ పార్టీ దానికి ఎదురొడ్డి నిలిచినది. శ్రీ త్యాగరాజచెట్టి, పానగల్‌రాజా, కె. వి రెడ్డి నాయుడు, ఎ పి. పాత్రోలు దీనికి నాయకులు. ఆంగ్లేయు లీ అవకాశమును సద్వినియోగపరచుకొనినారు. జస్టిస్ పక్షము వారికి ప్రభుత్వపు బలము లభించినది. ఆంగ్లేయులే ఈ దేశమును పాలింపవలె నని వీరు ప్రచారము ప్రారంభించినారు. సత్యాగ్రహోద్యమమును విఫలము చేయుటకై కులము పేరిట కూడ వీరు ప్రజలను రెచ్చకొట్టినారు. కాని కొండా వెంకటప్పయ్య పంతులు, శనగపల్లి రామస్వామిగుప్త, శరణు రామస్వామి చౌదరి, భూపతిరాజు వెంకటపతిరాజు ప్రభృతులు హరిజనులతో కలిసి సహపంక్తి భోజనము లారగించుచు నడిపిన మహోద్యమమును జస్టిస్ పార్టీ ఎట్లు నిర్మూలింప గలదు? ప్రతిఘటనము జాతీయ శక్తుల సంఘటనమునకే ఇతోధికముగా తోడ్పడినది. కావుననే ఆంధ్రదేశము 1921 మార్చి 31 ఏప్రిల్ 1వ తేదీ విజయవాడలోను 1923 కాకినాడలోను అఖిల భారత కాంగ్రెసు సభలకు వేదిక సిద్ధపరచి ఆతిథ్యమిచ్చి అభినందించినది! సైమను కమీషను బహిష్కారోద్యమములో ఆంధ్రులు ముందుకురికి 'కాల్చు'డని రొమ్ము నిచ్చినారు. ఉప్పు సత్యాగ్రహములో 'వీరగంధము తెచ్చినారము వీరులెవ్వరో తెల్పుడీ' అని ఉన్నవ లక్ష్మీబాయమ్మగారు గానము చేయుచుండగా 'తయారైన ఉప్పును పొట్లాలు కట్టుకొని నల్లజెండాలు చేతపట్టుకొని'[1] సింగపు కొదమలవలె బచ్చిక భటులు ముందు కురికినారు. గాంధీజీ పిలుపు నీయగనే హరిజనోద్యమమును నడిపినారు. క్విట్ ఇండియా ఉద్యమములో ఆంధ్రదేశము మొత్తమునొక అరుణగభస్తిబింబమై అగ్నులు విరజిమ్మినది.

**మహిళల ముందంజ :** కార్యకర్తలలో పురుషులే కాదు స్త్రీలు కూడ లక్షల సంఖ్యలో పాల్గొని రన్నచో ఆనాటి ప్రజాచైతన్యమెట్టిదో వేఱుగ వర్ణింప పనిలేదు. "ఉప్పు సత్యాగ్రహం రోజులు తలచుకుంటే ఒళ్లు జలదరిస్తున్నది. పులకాంకురితము అవుతున్నది. తర్వాత విదేశవస్త్ర దుకాణాలవద్ద పికెటింగు

---

1. దేశభక్త జీవిత చరిత్ర. ఉప్పు సత్యాగ్రహం. శ్రీ మాదల వీరభద్రరావు 184 వ పుట

ప్రారంభించడం. తెనాలి చీరాల కేంద్రములలో స్త్రీ వాలంటీర్లు పికెటింగు చేయడం జరిగింది. ఆ శిబిరాలలో భారతీదేవి రంగా, మంతెన వెంకట్రాజూ, భార్య అన్నపూర్ణమ్మ మరి అనేక మంది మహిళలూ పాల్గొన్నారు. శిబిరంలో బండారాలు నిండుకొన్నాయి. స్వామి సీతారాం (సీతారామశాస్త్రిగారు ఆనాడు) రాగానే అంతా శిబిరంలోని స్థితి చెప్పారు. స్వామికి తోచలేదు బైటికివెళ్లి చందా తెచ్చే సమయం కూడా లేదు అప్పుడు అన్నపూర్ణమ్మ వైపు చూచారు. మెళ్లో 20 సవర్ల హారం వుంది 'ఏం చేద్దాం' అన్నారు శాస్త్రిగారు, అన్నపూర్ణమ్మను చూచి- 'ఏమి చేయమంటావు నాయనా' అంది శ్రీ శాస్త్రిగారిని చూచి శ్రీ శాస్త్రి గారిని అన్నపూర్ణమ్మగారు 'నాయనా' అనడం మామూలు. శిబిర నిర్వహణకు నీ మెళ్లో హారం యివ్వమన్నారు. తీసుకోమని ఇచ్చింది- ఈ కథలు ఆనాడు వీరగాథలు"[1]

**గాంధీజీ ఆంధ్రదేశ సంచారము :** 1929 మార్చి, ఏప్రిల్ నెలలలో ఆరు వారములు మహాత్ముడు ఆంధ్రదేశమును పర్యటించెను. ఈ పర్యటనమే ఒక ఉద్యమమువలె సాగినది "ఈ సంచారము వలన ఆంధ్ర మండలము యందు మారుమూలల నున్న పల్లెటూళ్లలో సహితము మహాత్ముని దర్శనమును ప్రబోధమును ప్రజలకు లభ్యమయ్యెను. మహాత్ముడును ఆంధ్రుల నిజహృదయములు గుర్తింపగలిగెను. మహాత్ముని హితబోధలు ఆంధ్ర జనుల మానసము లందు నూతన వికాసము కల్పించి వారల నుత్తేజితులను కావించెను. ఖద్దరు నిధికి విరివిగా విరాళములొసంగి ఆంధ్రులు తమ త్యాగశీలమును ప్రకటించుటయే కాక మహాత్ముని సందేశమునందు వారికి గల పూర్ణవిశ్వాసమును వెల్లడించిరి."[2] రాతిని నాతినిగా రాముని పాదస్పర్శ మార్చినట్లు మొండిబండల వంటి మానవ హృదయములు కూడ మహాత్ముని పాదసంస్పర్శచే ఆంధ్ర దేశములో కరుణారసమును ప్రవహింపజేసినవి అందరును ఖద్దరు నదీస్నాతులే! జాతీయోద్యమ స్నాతకులే! 'నేను ఖద్దరు నదీస్నానము చేసి పవిత్రుడనైతివి. నాతో మీరు కూడ రండు. తరింతురుగాని' గోపాదక్షేత్రమున అఖండ గౌతమీ

---

1 వావిలాల గోపాల కృష్ణయ్య 'అతను మంతెన వెంకట్రాజు' వ్యాసము. 24 ఏప్రిల్ 1968. ఆంధ్రప్రభ (ఆది)

2. దేశభక్త జీవితచరిత్ర. 131 వ పుట.

స్నానము పరలోక సౌఖ్యావహమని విన్నవింపబడినప్పుడు మహాత్ముడన్నమాట"[1] తెలుగు మాగాణము మొత్తమును ఆయన 'రండని' పిలువగనే వెళ్లినది. తరించి నది !!

**క్విట్ ఇండియా :** 1942 ఆగస్టు 8వ తేదీని జరిగిన కాంగ్రెసు సమావేశములో 'క్విట్ ఇండియా' తీర్మానము ఆమోదింపబడెను. ఈ తీర్మానములు కార్యరూపములో నుంచుటకు ఆధారభూతమైన 'ఆంధ్రా సర్క్యులర్' తెలుగునాట విడుదల చేయబడెను. ఈ ఆగస్టు విప్లవము నిరాయుధమే కాదు, సాయుధము విధ్వంసాత్మకముగా కూడ సాగినది. అన్నాప్రగడ కామేశ్వరరావు ప్రభృతులు సుభాసుబోసుతో మంతనములు సాగించి వచ్చినారు.[2] రహస్య సమావేశములు జరిగినవి నాటి దహనకాండయును అటు పోలీసుల దమనకాండయును వర్ణించనలవి కానివి ! నాడు విప్లవములో పాల్గొనని తెలుగు గృహము లేదు !

**పూర్వోదయము :** ఆంగ్లేయు లతికష్టముమీద ఈ చైతన్యమును కాల రాచి నేలద్రొక్కుటకు యత్నించిరి, కాని ఇకమీద భారతీయులను పరిపాలించుట అసాధ్యమని మాత్రము తెలిసికొనినారు. 1948 లో ద్వితీయ ప్రపంచ సంగ్రామము ముగిసినది. ఆంగ్లేయుల విజయము నామమాత్రమే కాని పరాజయము పతనములే ఎక్కువ. ఇట్టి పరిస్థితులలో నిక భారతీయులకు స్వాతంత్ర్య మిచ్చుట తప్ప గత్యంతరము లేదని నిశ్చయించుకొనిరి. దీనికి తోడు బ్రిటనులో కన్సర్వేటివు పక్షము ఓడిపోయి, లేబరుపక్షము అధికారములోనికి వచ్చినది. వారు భారత జాతీయ నాయకులతో సంప్రదించి దేశవిభజన కంగీకరింప జేసి స్వాతంత్ర్య మొసంగుట కంగీకరించిరి. ఆంగ్లేయుల పాలన మంతమొందినది. 1847 అగస్టు 15న స్వతంత్ర భారత బాలభాను డుదయించినాడు. నాడు ఆంధ్రుల సంరంభము వర్ణింపనలవి కానిది. ప్రభాతభేరీలు, ఊరేగింపులు మహిళల మంగళ గీతములతో తెలుగునాట నవవసంతము వెల్లివిరిసినట్లయినది !! జాతీయ మహోద్యమ చరిత్రలో ఆంధ్రుల కర్తవ్యమునకు, నిరవధిక త్యాగమునకు మంగళాశాసనము పలికిన మధుముహూర్త మది !!

---

1. ముట్నూరు కృష్ణారావు సంపాదకీయము. 1929 మే 18. కృష్ణాపత్రిక.
2. 'గుంటూరు జిల్లా చరిత్ర' శ్రీ మంచళ్ల గోపాలరావు వ్యాసము .

**రచయితల కర్తవ్యము :** అర్ధశతాబ్ది మాంధ్రదేశము నుడికించి వేసిన మహోద్యమము- జాతీయాత్మకు సంబంధించిన విప్లవచైతన్యము పొంగిపొర్లు చుండగా కళాకారులెట్లు మిన్నకుందురు ?? రచయితలే నాయకులై రంగస్థల ములో ప్రవేశించినారు. నాయకులందరును రచయితలుగా కూడ మారినారు. ఉద్యమమున కవసరమైన చక్కని ప్రచార సాహిత్యమును సృజించినారు. కోలవెన్ను రామకోటేశ్వరరావు 'సహాయనిరాకరణ'మను గ్రంథమును ప్రచు రించినారు. ఎ. ఇ పటేల్ ఆంగ్లములో 'అసహాయోద్యమ విజయ'మను గ్రంథ మును రచింపగా శ్రీ మాడభూషి నరసింహాచారి దాని నాంధ్రీకరించినారు. ఈ సమయముననే వెలువడిన మఱొక గ్రంథము 'పంజాబు దురంతాలు'.

నాటి గాంధీజీ ప్రసంగములను క్రోడీకరించి డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు 'మహాత్ముని ఉపదేశములు' ప్రచురించినారు. చెరుకువాడ నరసింహముగారు 'స్వరాజ్య దర్పణము' 'శాసన సభలు' ప్రకటించినారు. స్వరాజ్య గ్రంథమాల పక్షమున పుంఖానుపుంఖముగా వెలువడిన వచన రచనలు ప్రజల నొక చైతన్యవాహిని క్రిందికి తీసుకొనివచ్చుటలో గణనీయమైన పాత్రను నిర్వహించినవి.

**తిలక్ నాటక సమాజము :** 1921 లో గుంటూరులో 'తిలక్ నాటక సమాజ'మేర్పడినది. ఇందలి నటులు కవులు గౌరవముకల జాతీయ నాయకులే. రామరాజు పుండరీకాక్షుడు 'స్వరాజ్య సోపానము' రచించి ప్రదర్శింప జేసినాడు. ప్రభుత్వము నిషేధించినది. క్రియాసిద్ధి స్సత్వేభవతి మహతాన్నోపకరణే కదా! ఒక నాటకమును నిషేధించెడి సమయములోనే వేఱొకటి రచింపబడి ప్రదర్శనము నకు వచ్చెడిది. 'పాంచాలీ పరాభవం', 'గాంధీ విజయం', 'స్వరాజ్య రథం' ఈనాడు వెలువడిన నాటకములే. జాతీయోద్యమమున కాంధ్రదేశములోని సోపాన పంక్తులివి !! అట్టి సందర్భమున కవులు తమ లేఖినులను జీవితములను ఈ ఉద్యమమున కంకితము చేసిరన్నచో అందాశ్చర్య మేమున్నది ??

"హిమశైలంబు కిరీటమై వెలయగా శ్వేతాభ్రమే ఛత్రమా
యమరున్ పార్శ్వములన్ మహోదధులె యారాధింప వింజామరల్

సమయోత్తుంగ తరంగ సుస్వనములే సన్మంగళా రావమౌ
అమరున్ భారతమాతకిక్ సహజ రాజాలంకృతుల్ నీ దయన్"[1]

## కవిత్వముపై ప్రభావము :

జాతీయోద్యమ ప్రభావముతో ఆంధ్ర సాహిత్య గతిలో మహత్తర పరి వర్తనము వచ్చినది. దేశభక్తి కవిత్వము కూడ కాల్పనిక కవితా శాఖయే అయి నను నాటివరకు తెలుగు కవులు విప్రలంభ శృంగార ప్రధానమైన గ్రంథములనే రచించుట గమనార్హము. జాతీయోద్యమాగ్ని కవుల యెదలను వెచ్చజేయు కొలది అవి నిప్పులో పెట్టిన బంగారముచలె మేలిమివన్నెలు వెలయించినవి! తత్ఫలితముగా తెలుగు కవిత స్వర్ణమయమైనది. రసయోగము నందినది!

జాతీయోద్యమములో, వర్తమాన స్వచ్ఛంద సేవకులకు స్ఫూర్తిని కల్గిం చుటకు భూతకాలికమైన మహావీరుల స్మృతులను నెమరువేసికొనుట సార్థకమైన కార్యము. ఈ రహస్యమును గమనించినారు కావుననే మహాకవులు వస్తు ప్రధాన మైన మహాకావ్యములను లఘుకావ్యములను చారిత్రికేతి వృత్తములతో రచించి నారు. ముందుగా వానిని వివరింతును.

**రాణాప్రతాప చరిత్రము :** దేశభక్తి కవిత్వములోనే కాదు నవ్యాంధ్ర కవిత్వములోనే శివభారతము, రాణాప్రతాప చరిత్ర, సూర్యచంద్రుల వంటివని తెలుగునాట వాడుక. ఒక విధముగా చూచినచో రాణాప్రతాప గాథయే సూర్య సదృశము. నాడును నేడును కూడ మొదటి రాణాగాథయే రెండవ ఉదాత్త శివ ప్రవృత్తికి ఆదర్శమైనది.

శ్రీ రాజశేఖర శతావధానిగారు తమ విద్యాభ్యాసానంతరము 1921 నుండి గాంధీజీ అనుయాయులై స్వయముగా స్వాతంత్ర్యోద్యమములో భాగ స్వాములైనారు. కావుననే ఉద్యమమునకు లక్ష్యప్రాయమైన రాణా జీవితమును రసపు మూసలో మహాకవి రంగరించి పోసినారు. ఈ మహాకృతి 'రామాయ ణమువలె'[2] వ్యాపింపవలెనని సమకాలికులా కాంక్షించినారు. అట్లే వ్యాపించినది.

---

1. భారతమాత స్తవము. దేశభక్త శ్రీ కొండా.
2. చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి

"అస్వతంత్ర జాతికొక స్మృతిగ్రంథము"[1] 'ఈ గ్రంథము చదువుతూ వుంటే భారతం చదువుతూ ఉన్నట్టుంటుంది'[2] కావుననే కవియును కృతియును ఆదర్శ ములై నిలిచినవి.[3]

రాణాప్రతాపుడు ఆజన్మాంతము స్వాతంత్ర్యమునకై పోరాడిన ధీరో దాత్త నాయకుడు. 'నీయంతటి పరమోత్తమ ధర్మవీర వరుడుండునె' యని భామాశాహి పలుకుటతో ధర్మవీరుని నాయకునిగా ధర్మవీరము అంగిరసముగా కల కావ్యమని తాత్పర్యము. శతావధానిగారి దృష్టిలో రాణా, గాంధీ భిన్న వ్యక్తులు కారు. ఒకే ఆదర్శము కొఱకు ఒకే వ్యక్తి భిన్న రూపములలో భిన్న కాలములలో పోరాడెనా యనునట్లు ఈ గ్రంథములో చిత్రణము సాగినది.

'ఇరువదేండ్లుగ నుత్తమ పరికరముల
శక్తిఁ గూర్చి నా పావన స్వాంతమందు
తల్లి! నేగట్టుకొనిన స్వాతంత్ర వజ్ర
భవన రాజంబు కన్నీటి వరదమునిఁగె' నని సమ్రాట్టు సాగించిన

విలాపము గాంధీజీ హిందూ - ముస్లిము సంఘర్షణమును చూచి చేసిన విలాపము కన్న భిన్నము కాదు. గాంధీజీ ఆదర్శము రామరాజ్య స్థాపనము. రాణా ఆద ర్శము కూడ అట్టి రామరాజ్యమే!!

"విశ్వపావనమైన వృత్తి వర్తించు గో
బ్రాహ్మణులకుఁ దగ్గుపాటు కలిగె
ధాత్రనిఖిల్ మనుల్ స్థాపించు వర్ణాశ్ర
మాచార విధు లడుగంటిపోయె
మంగళ లక్ష్మీసమానలౌ సాధ్వుల
సౌశీల్యగరిమ కార్శ్యంబునందె
పెట్టని కోటలై వెలసి నిన్గొల్చు వీ
రుల పౌరుషము గంగ గలిసిపోయె

1. విశ్వనాథ సత్యనారాయణ
2. కురుగంటి సీతారామాచార్యులు. (న. సా. వి. 641 వ పుట)
3. తరువాత వచ్చిన మద్దిపట్ల వెంకటరమణయ్యగారి 'ఝరీ తరణము' వంటి రచనలెన్నిటికో ఇది స్ఫూర్తి నిచ్చినది.

వేయియేండ్లుగ ప్రేటుపై ప్రేటుదగిలి
చిక్కనసిదక్కి స్రుక్కి కృశించినాదు
పాలనమున మంచము పట్టి డీలుపడగ
పాలు పడితివె తల్లి మేవాడ లక్ష్మి !!"

ఈ విలాపము 'వేయేండ్ల అస్వతంత్ర జాతిని' చూచి 'స్వాతంత్ర్యోద్యమములో పాల్గొనిన ప్రతి స్వచ్ఛంద సేవకుని హృదయ వినిర్గతమైనదే! 'నిత్యోత్సవ నిత్యమంగళ జయశ్రీ, నిత్యసౌభాగ్యరేఖా నిత్యప్రభలెల్ల నీకు కలుగుంగా కంచు కాంక్షించెదన్' ఇదియే భారతమాతను గూర్చిన స్వాతంత్ర్యోద్యమ నాయకుల ఆకాంక్ష! గాంధీజీ లక్ష్యము కెంత ప్రాముఖ్యము నిచ్చెనో సాధనము యెడ కూడ (Means) అంతే శ్రద్ధ వహించెను 'ధర్మనిర్వహణంబు కర్తవ్యమిపుడు' అని రాణా పల్కుటలో విజయము కన్న కర్తవ్య నిర్వహణమే జీవితాదర్శమను భావన గోచరించును.

భీమచంద్రు రాణాప్రతాపుని చూచి 'అకటా ముప్పదికోట్ల హిందువులు మోయన్‌దగ్గ భారంబు గొంకక నీవొక్కడవెత్తికో దలచితి' వనుట గాంధీజీని మనసులో నుంచుకొని కవి వచించిన పలుకులే. "నీ పతాకంబు క్రిందికి రానొల్లని వారలందఱును మాతృద్రోహులున్ వంచకుల్" నాడు గాంధీజీ ఉద్యమమునకు స్వార్థముతో వెన్నుపోటు పొడిచిన 'జస్టిసు' పార్టీ పెద్దలైన జమీందారులే ఈ మాతృద్రోహులు, వంచకులు. "దేశమాతకు వాటిల్లు విపత్తులై వగచి చింతన్ గ్రాగునీవగ్గి ప్రమింగక స్వాతంత్ర్యము దక్కుదాక నొకచోఁ గాలూని కూర్చుందుమే"- ఇదియే నాటి కాంగ్రెసు కార్యకర్తల ప్రతిజ్ఞయును. ఇట్టి కార్యకర్తల కలిమియే- బలిమియే రాణాకు- గాంధీకి ప్రాణవాయువు!

'త్యాగమూర్తులు వీర ధర్మైక నిరతు
లందఱుండఁగ జయసిద్ధికేమి కొరత'

యని పల్కినది ప్రతాపుడే కాదు, గాంధీజీయును. కాంగ్రెసు కార్యకర్తల నుద్దేశించి ఇట్లే భావించినారు పేరునకది రాణాప్రతాప చరిత్రమే కాని సమకాలీన జాతీయోద్యమ చరిత్రమునకు ప్రత్యక్ష దర్పణము నమర్చుటే కవిగారి పూనిక యని స్పష్టముగా గ్రహింపవచ్చును.

**శివభారతము :** మహారాష్ట్ర దేశములో జన్మించి ఔరంగజేబు నెదిరించి అఖండ భారత సంస్థాపనకై అహరహము కృషిచేసిన కర్మయోగి భూపభూష ణుడు అయిన శివుని పురాణమును గడియారము శేషశాస్త్రిగారు జాతీయోద్యమ స్ఫూర్తితో రసవత్తరముగా లిఖించినారు. రాణా సాధకుడు, కాని శివాజీ విజేత ! తాను ఆశించిన 'అఖండ హిందూ సామ్రాజ్య నిర్మాణ' మధుర స్వప్నమును సాక్షాత్కరించుకొనిన కార్యశూరుడైన తపస్వి. ఈతడు ధీరోదాత్తుడైన నాయ కుడు. ధర్మవీరము అంగిరసము.

'ఉదధియూర్ములఁ దేలు వాయువులఁ బోలె
జనుల పలుకుల హృదయ కోశము బలింప
డిటవుఁ బెంచి స్వతంత్ర జాతీయ రాష్ట్ర
నిర్మితిఁ బునాదివేయ యత్నించె శివుఁడు'

కావ్య నిర్మాణ కాలము గూడ అట్టిదే ! కావుననే 'జాతీయోద్యమ పూర్వ రంగ'మను భాగములో కవిగారు సమకాలీన సమాజ చిత్రణము గావించినారు. శివాజీకి శత్రువు ఔరంగజేబు స్వరాజ్య రథము నడ్డగించినవి ఆంగ్లేయులు. క్రూర ప్రవృత్తిలో శత్రువు లిర్వురును సములులే ! సమానాంతః కరణులే !

"ఆ ధృతిలేని మతాచారములఁ జూచి
యరయని దేవాలయములఁ జూచి
విఱిగెడు జాతీయ విద్యలగతిఁ జూచి
ఖిలమైన వృత్తి విద్యలను చూచి
పన్ను వసూలు దబాయింపులను జూచి
ఫలమీయగా లేని పొలము జూచి
కడుపోమగా లేని కాపురంబుల జూచి
మొఱలాలకింపని దొరలఁ జూచి
నిలువు మారిన వేష భాషల దలఁచి
పొదుగు జేసిన పరమతాభ్యుదయ మెంచి
కన్ను గూర్కెడు స్వమతంబు గాంచలేక
యుడికిపోయె" నట మహారాష్ట్రుల యెదదలు. ఇందలి జాతీయ

విద్య, వృత్తి విద్యల ప్రసక్తులు, పన్నుల దబాయింపులు, నిలువు మారిన వేష

ఖాషలు పొదుగు చేయుచున్న క్రైస్తవ మతాభ్యుదయము సమకాలీన పరిస్థితుల చిత్రణమే! కావుననే శివాజీ ముఖమున కవిగారు ఖండితముగా 'దాస్యమోక్ష ఫల కాంక్షులమై తెగిపోరగావలెన్' అని పలికించినారు.

'ఒక సులతానునో ప్రభుపృతో పదమంటి విభుత్వమందు కోరిక తగదట్టు రాజ్యము భరించుట బిచ్చపుకూడు స్వర్ణపాత్రిక నిడుకుంట'యనినాడు స్వాతంత్ర్య సంగ్రామములో పాల్గొనక ఆంగ్లేయుల సేవ చేసెడి భారతీయ శ్వానములపైని దెబ్బ యిది! 'బెదిరింపులంబోని స్వతస్స్వతంత్ర జీవిక మననైన నింద్రపద విన్ గొనుకంటె సమాళమే యగున్' అని ప్రబోధించుటలోని స్ఫూర్తి వర్తమాన పరిస్థితుల నుండి వచ్చినదే!

ఇట్లే స్వరాజ్యోద్యమములో జాతీయ నాయకులెందరో నేలకొరిగిన దృశ్యములు కవి యెదను కరిగించినవి. పత్రికలలో వచ్చెడి వార్తలు శోకసంభ్రమములతో దేశమును నింపెడివి. "24వ తేదీనాడు భగత్సింహుని, వాని సహచరులను ఉరి తీసిరను వార్త కాంగ్రెసు నగరునకు చేరి కలకలలాడుచున్న నగరునంతను ఒక్కసారి దుఃఖసముద్రమున ముంచివేసెను. జాతీయ పతాక వంచబడినది. వాలంటీరులు శిరోవేష్టనములు తీసివైచి భగత్సింగ్ జిందాబాద్ అని దుఃఖార్త నాదములు గావించుచు నగరు వీధులలో తిరిగిరి.... కాంగ్రెసు బజారులో నున్న దుకాణములన్నియును మూసివేయబడెను. ఆ సాయంకాలము పెద్ద దుఃఖపు టూరేగింపును బయలుదేరదీసిరి.... భగత్సింగు మరణవార్త వినుటతోడనే నిర్మాణము పూర్తిగాక మిగిలియున్న విజయతోరణములట్లే యుంచబడెను. యువకులలో క్రోధాగ్ని యుదయించినది" ఇట్టి సంఘటనము లీ కృతినిర్మాణ కాలమున అసంఖ్యాకములు సంభవించినవి. కావుననే శివాజీ, తానాజీ మరణవార్త విని విలపించెడి ఘట్టము నిట్లు కవి వర్ణించినారు :

"పరతంత్రతా భుగ్న భారతోద్ధరణోద్య
మమున నా నాయకత్వము వరించి
యొనలేని నీ సర్వధనజన బల జీవి
తముల సర్వార్పణ ధారవోసి
రణరంగముల నంగరక్షకతన్ బొంచి
తను తెప్పవోలె నన్ననుసరించి

దుస్సాధతరమైగి దుర్గ భేదన వజ్ర
పాతమై బహుళా హవములు గెలిచి....

నన్గొలుచు నిన్నుఁగోలు పోయిన యపుడ నేఁగోలు పోనిదొకటి యున్నదే". ఇది నేతాజీ, గాంధీజీల విలాపమే !!

శివాజీవలెనే గాంధీజీ ప్రభృతి నాయకులును 'భూతభవిష్య దర్థముల బోలిక లెత్తుచు వర్తమానమున్ జాతికి జాలిక ఫలసిద్ధికి దెచ్చిన వీనమార్గ నిర్మాతలు. 'వీరు సంఘబలంబు పెంచు' కార్యక్రమము స్వీకరించిరి. ఇవి పింగళే మంత్రి పలుకులే కావు స్వాతంత్ర్యోద్యమమునాటి ప్రతి భారతీయుని మాటలును !

శివాజీ బాల్యములోనే గోరక్షణా దీక్షను నిర్వహించినాడు.

'తలపులోనున్న గోమాతృ ధర్మదీక్ష
పలుకుతోడన చేసేతఁ గలుగఁజేసి
ప్రథమ విజయంబు గూర్చుభాంభవికి మ్రొక్కి
యావు నడిపించుకొని యింటి కరిగె శివుఁడు'

గాంధీజీ స్వాతంత్ర్యోద్యమ దీక్షకు మూలమీ గోరక్షణమే ! కావుననే సమకాలీన సమస్యలన్నిటిని ప్రతిబింబించునట్లు, స్వరాజ్య సంగ్రామమును గాంధీజీ జీవితమును, ఆశయములను ఆదర్శములను శివుని కథపేర మహాకావ్యముగా గడియారమువారు మనోహరముగా చిత్రించినారు.

**లఘుకావ్యములు :** ఉద్యమములో రక్తము నుడుకెత్తించుట రచనల లక్ష్యము. అందుల కర్హమైనవి వీరగాథలు. కావుననే మహాకావ్యములతోబాటు లఘుకావ్యములను కూడ మహాకవులు వీరుల జీవితములను వస్తువుగా స్వీకరించి నిర్మించినారు. వానివి పేర్కొందును.

1) అమరసింహ చరిత్రము - రాజశేఖర శతావధాని
2) అమరసింహ చరిత్రము - బాలకవి వేంకట సుబ్బారెడ్డి
3) అమరసింహ చరిత్రము - శ్రీధర తిరుపతిశాస్త్రి

4) షాజీ - పుట్టపర్తి నారాయణాచార్యులు
5) ఝాన్సీరాణి - విశ్వనాథ సత్యనారాయణ

'ఝాన్సీరాణి'లో కవి భారతీయుల శిల్పవైదుష్యమును ఆంగ్లేయుల పాశవిక మన స్తత్వమును ఒక్క చిన్ని ఆటవెలదిలో నిమిడ్చి అగ్ని పర్వతమువలె ప్రేల్చినారు.

'ఇంత బరిణలోన నిమిడెడు సన్నని । యారుబార చీరదారములను
బట్టి తీయునట్టి పనివాంద్ర బొట్టన । వ్రేళ్లు నరికినారు వీరజాతి'

కావుననే కవిహృదయము భగ్గుమని మండి 'వందయేండ్లు నా వసుధ నిండ నీ ఫరంగి జాతి కని అనిపించినారు. ఋషి మాట మంత్రమైనది. ఆంగ్లేయులు పతనమైనారు. స్వాతంత్ర్యోద్యమములోని భారతీయ పాంథులకి లఘుకృతి అనర్ఘ పాథేయము !

**విజయశ్రీ :** జాతీయోద్యమ ఫలితముగా వచ్చిన ధ్వన్యాత్మక లఘు కావ్యము జంధ్యాల పాపయ్యశాస్త్రిగారి 'విజయశ్రీ'. ఇందలి కథ భారత సంబంధి. కాని ఆద్యంతము నవభారత సంగ్రామము ధ్వనించుట దీనిలోని విశేషము. సంధి వైఫల్యము నుండి ప్రారంభమై, అర్జునుడు యుద్ధమునకు కటిబద్ధుడగు వఱకును కథ నడిచినది. అనగా గాంధీజీ ఆంగ్లేయులతో జరిపిన సంభాషణము విఫలమునందుటతో కృతి ఆరంభమైనదని భావము !!

'దొరల మటంచు రాజసముతో తెగనీల్గి పట్టు పాన్పులన్
బొరలు దినమ్ములన్నియును బోయె ప్రపంచము మారిపోయె ము
ష్కరులు కురూద్వహుల్ మనల గాదని కన్నులు మూసికొన్న యీ
నరుని కఠోరగాండివ నినాదము నిద్దురమేలు కొల్పెడిన్'

ఇందు కవి ఉద్దేశించిన కురూద్వహు లాంగ్లేయులు. ప్రతి భారతీయుడును నరుడే ! ధనుంజయుడే !

'దేశకల్యాణ దివ్యసందేశ దీక్ష
నందుకొని స్వేచ్ఛకొఱకు విల్లందుకొనుడు

భరత సంతతి భావిసౌభాగ్యమునకు
సాగు గావుత స్వాతంత్ర్య సమరరథము'

ఇది పాండవుల ప్రతిజ్ఞయేమో కాని నవభారత స్వాతంత్ర్య సమర రథము నడిపెడి ప్రతి స్వచ్ఛంద సేవకుడైన సారథి యొక్క ప్రతిజ్ఞయు నిదే! ఇట్టి లఘు కావ్యము జాతీయ స్ఫూర్తితో సాగినది. ఇట్టిదే విశ్వనాథవారి 'కుమారాభ్యుదయము'ను! అట్టి కృతులింకెన్నియో!!

**ఖండ కావ్యములు :** తక్కువ సమయములో సూటిగా సంగ్రహముగా పఠిత యెదలో ఈటెవలె నాటుకొని కాబోలు ఉద్యమములన్నిటిలోను కవులు ఖండ కావ్యములను పుంఖానుపుంఖముగా ప్రయోగించినారు. జాతీయోద్యమములో కూడ అట్లే జరిగినది. వానిలో స్థాలీపులాకముగా కొన్నిటి నుదాహరింతును.

**పతిగ పంట :** తుమ్మల సీతారామమూర్తిగారి మధురమైన రచనమిది. ఇందలి 'తేజబహదూర్' వంటి ఖండికలు చిరస్మరణీయములు. ఔరంగజేబు తేజబహదూర్‌ను మతము మార్చుటకై నిర్బంధించును. తేజబహదూర్ స్వమతాభిమానముతో పాదుషాను తిరస్కరించును. అందుల కాతడు కినిసి తేజబహదూర్‌ను సంహరించును. ఇందు తేజబహదూర్ భారత పౌరునికి ప్రతీక. ఔరంగజేబు ఆంగ్లేయ సామ్రాజ్యవాదమునకు సంకేతము.

**శిక్షాస్మృతి :** పండ్యారం వేంకటసుబ్బయ్యగారు వ్రాసిన యీ ఖండిక మిక్కిలి ప్రశస్తమైనది.[1] ఆనాడిట్టివి వందల సంఖ్యలో వచ్చినవి కావున నిది కేవలమొక ఉదాహరణమే. పండ్యారం వారి రచనకు పంజాబులో జరిగిన దుండగములు ప్రేరకములు. అచట సుందరసింగు అను బాలుని సైనికులు నిర్దాక్షిణ్యముగా కొరడాలతో మోదుటను చూచిన బుద్ధిదేవి సాక్ష్యము చెప్పెను. పత్రికలలో ఈ వార్త వచ్చినది. కవిగారి హృదయము నీ సంఘటనము కదిలించినది.

'ఏమియో కాని బుద్ధిదేవి మనోజ్ఞ
లోచనాంతములను తాప లోంకావ్వ

1. 5 జులై, 1924 కృష్ణా పత్రికలో ముద్రితము.

వారి రాజుచు దన మీఁదఁబడక మునుపె
మాతృదేహంబు గాయాలచేత నొవ్వ
వెనుక ప్రక్కకు రెక్కలు విరిచికట్టి
చిరుత బిడ్డను సుందరసింగు నదిగొ
మోదుచున్నారు- పాపమా ముద్దుబిడ్డ
దీనతాపూరితాక్రోశ మౌనాయేమొ
కారణము బుద్ధిదేవి దుఃఖమున కరయ
నే మహాభాగ్యశాలిని కితడు సుతుడొ.

**స్వదేశీ :** చెరుకువాడ నరసింహం పంతులుగారు వ్రాసిన రచనమిది.

'సకల దేశీయులాశ్చర్యంబు నొందు
ప్రకటితమగు చేతి పనులు నశించె
అనుదినావశ్యకంబైన వస్తువుల
మనకన్యదేశీయు లొనగూర్పవలసె
చదువంగ వ్రాయంగ సకల వస్తువుల
ఆస్ట్రియా జర్మనీ లంపంగ వలసె
పసిపాపలకుగాను పాలడబ్బాలు
భాగ్యవంతుల పాలపంచదారయును
ప్రొయిరాజుటకు నిప్పుపుల్ల సహితముగ
ఊరిపేదల గంజికుప్పు కష్టైన
పరు లనుగ్రహముచే పంపంగ వలసె'నని ద్విపదలో జాతీయ దుస్థితికై పరితపించినారు.

**రామచిలుక :** ఇది అన్యాపదేశమగు రచన. మంగిపూడి వెంకటశర్మ గారు తిలక్ నిర్యాణమునకు కొంచెము ముందుగా దీనిని వ్రాసిరి. స్వేచ్ఛకు, రామచిలుకకు మధ్య జరిగిన సంభాషణా క్రమమిది : స్వేచ్ఛ ఇట్లనినది :

"రెక్కలా యవి లేవు నీకు మరేమి సేయుదు కీరమా ?
యక్కయంచును రామయంచును నొరయెన్నియొ మాటలన్
టెక్కు నేర్పితి గన్నగానక ప్రేలె దేమికృత ఘ్నతన్
ధిక్కరించిన దల్పుడీ యను దీనియందునె యుండుమా"

దానికి రామచిలుక యిట్లు ప్రత్యుత్తర మిచ్చినది :

"వేట యాడియు నన్ను దెచ్చిన వేయుభంగులు దారయా
మాటపల్కియు మోసబుచ్చితి మానవా యిక పంజరా
లాటలన్నియు స్వేచ్ఛ ధర్మపులావు పెంపును హీనతన్
చోటు సేయకు నిన్ను మెచ్చరు బుద్ధిమంతుల్ మానవుల్"

ఇందు రామచిలుక అస్వతంత్ర భారతీయునికి సంకేతము. 'పాంచాలీ స్వాంత నము'లో చామర్తి రాజశేఖరరావుగారు ఇట్లే ద్రౌపదిని భారతమాతకు ప్రతీకగా చేసి ఆమె కురులు పట్టి లాగిన దుశ్శాసనుని ఆంగ్లేయ వర్గమునకు ప్రతినిధిని చేసి రసవత్తరముగా చిత్రించినారు.[1] అట్లే 'ఉదయశ్రీ'లో పాపయ్యశాస్త్రిగారు ధనుర్భంగ గాథను వర్ణించినారు. సీత భూజాత. కావున భారతమాతకు ప్రతీక. ఆమెను భారతీయుడైన నీలమేఘశ్యాముడు చెట్టబట్టినాడు దానితో.

'సిగ్గు సిగ్గంచు లేచి గర్జించినారు
కనులు గుట్టిన తెల్లమొగాలవారు'- పరాజితుని మొగము తెల్లనగుట సామాన్యార్థము. ఆంగ్లేయుని శ్వేతవర్ణము విశేషార్థము. చిలకమర్తివారు 1907 లోనే 'తెల్లవారను గడసరి గొల్లవారు పిదుకుచున్నారు మూతులు బిగియగట్టి' అనుట ఇట్టి చమత్కారమే !

**విశ్లేషణము :** ఖండికల నన్నిటిని పరిశీలించినచో మన కీ క్రింది విభాగములందు కన్పడును.

1) వస్త్వాశ్రయ పద్ధతి :- కథాత్మకమైన రచనములిందలి విశిష్టత.

---

1. ప్రసంగములలో కూడ మహానాయకు లిట్లుపమించుట నాడు పరిపాటి. విజయవాడ ప్రసంగములలో కిద్వానీ దేశమును పాంచాలితోను దయ్యె రును దుశ్శాసనునితోను పోల్చి ప్రసంగింపగా సభ మధ్యలోనే 144 సెక్షను ప్రవేశపెట్టబడినది. అట్లే మహాత్ముడు కాంగ్రెసును ప్రహ్లాదుని తోను సత్యాగ్రహము నాతని భక్తితోను బ్రిటీషువారిని హిరణ్యకశ్యపుని తోను స్వాతంత్ర్యసిద్ధి నృసింహావతరణముతోను పోల్చిరి. ప్రసంగాను వాదకులు : శ్రీ దుగ్గిరాల గోపాలకృష్ణయ్య.

ఇందు పౌరాణికములు, చారిత్రకములు, సమకాలీనములును కలవు. కాగా వీనిని తిరిగి త్రిధా విభజింపవచ్చును.

1) దేశీయములు
2) ప్రాంతీయములు
3) అన్యాపదేశములు

అఖిల భారతము నుండి సంఘటనములు గ్రహించి వర్ణించుట మొదటి పద్ధతి. కేవలమాంధ్ర ప్రాంతములోనివే వర్ణించుట రెండవ పద్ధతి. మూడవది రచనా సంబంధి. ప్రత్యక్షముగా కథాకథనము చేయుటొక విధము. కాక అన్యాప దేశముగా చెప్పుట రెండవ విధము.

2) వర్ణనా పద్ధతి :- వస్తువు నాశ్రయింపకుండ, పతాకమును, చరఖాను, గాంధీజీ, దుగ్గిరాలవంటి నాయకులను వర్ణించు పద్ధతి యిది. ఇక సైద్ధాంతికముగా కూడ ద్విధా విభజింపవలసి యున్నది.

1) మితవాద - అతివాద ధోరణి
2) సాయుధ విప్లవ ధోరణి

కాంగ్రెసులోని మితవాద- అతివాద వర్గములకు చెందిన కవితా మార్గమొకటి. అట్లుకాక గాంధీజీ తత్వమును నిరసించి ఏ సీతారామరాజు, భగత్‌సింగుల పద్ధతినో స్వాతంత్ర్యము సంపాదింపవలెనను ధోరణి రెండవది. దీనిని కూడ పలువురితోబాటు కమ్యూనిస్టు వర్గమునకు చెందినవారును బలపరచిరి. గాంధీజీ తత్వము 'పురుష ప్రవృత్తి' కాదని వీరి వాదము.

"గాంధీ తత్వమెల్ల గాజులూ గలవారి
మోజునందుచు నుండె రాజా- వారికి
గాంధీయే దైవంబు రాజ- వారు
తన్నారు కొట్టారు రాజ- ఈ
తత్వాన దాస్యంబు తరలు టెన్నడొ రాజ
అల్లూరి శ్రీరామరాజ" అని ఒక అతివాద గీతము. ఇట్టివి కూడ నాడు ప్రజాదరణమునే పొందినవి !!

శీర్షిక లన్నిటిని పరిశీలించినచో మఱల ఈ క్రింది విభాగము గోచరించును 1) మాతృదేశ వర్ణనము, 2) పుణ్యపురుషుల ప్రశంస, 3) శత్రునింద, 4) వర్తమాన దుస్థితికై విలాపము, 5) ప్రాచీన వైభవ సంస్మరణము, 6) కర్తవ్యబోధ, 7) ఉజ్జ్వల భావిపై ఆకాంక్ష. ఇచ్చటనే మఱొక్క విషయము చెప్పి ముందునకు సాగెదను. ఆంధ్ర పౌరుషమును ప్రశస్తిని పెక్కుఱు కవులు జాతీయోద్యమములోని భాగముగానే వర్ణించినారు. అనగా జాతీయోద్యమమున కన్న భిన్నముగా ఆంధ్రోద్యమమాదిలో సాగలేదని భావము. కాని తరువాత తరువాత దానికొక స్వయం ప్రతిపత్తి సిద్ధించినది కావున వేఱుగా దానిని వింగడింపక తప్పలేదు!!

పై వింగడింపున కుదాహరణము లిచ్చెదను.

1) జాషువా, భారతమాతను సాధ్విగా భక్తురాలు గా గేస్తురాలుగా బాలింతరాలుగా వర్ణింపబడినది.

'సగరమంధాత్రాది షట్చక్రవర్తుల
యంకసీమల నిల్చినట్టి సాధ్వి
బుద్ధాది మునిజనంబుల తపంబున మోద
బాష్పముల్విడిచిన భక్తురాలు
కాళిదాసాది సత్కవి కుమారుల గాంచి
కీర్తినందిన పెద్ద గేస్తురాలు
కమలనాభుని వేణుగాన సుధాంబోధి
మునిగితేలిన పరిపూత దేహ
సింధు గంగానదీ జలక్షీరములను
కురిసి బిడ్డల పోషించుకొనుచునున్న
పచ్చి బాలెంతరాలు మా భరతమాత
మాతలకు మాత సకల సంపత్సమేత'[1]

2) ఏటుకూరి రచించిన వీరభారతము, అలుగురాజు మొదలైన కావ్యములు, ఖండకావ్యములు, వీరపురుషుల ప్రశంసకు పేరొందినవి. ముందే ఉదాహ

1. ఖండకావ్యము 1 భా. 3వ పుట.

రించిన తేజబహదూర్ వంటి ఖండికలు, ఝాన్సీరాణి మొదలైన లఘుకావ్యములు ఈ జాతి రచనలే.

3) శత్రునింద కూడ పరాక్రమ స్ఫూర్తికొక సాధనము. వివిధ కావ్యములలో మాతృస్తుతితోబాటే శత్రునింద కూడ జరిగినవి. అట్లుకాక విడిగా ఆంగ్లేయుల అన్యాయములను హృదయ విదారకముగా వర్ణించెడి గీతములు గేయములు వచ్చినవి. "నూరుమంది మలబారు వాసులాను కూరినాడొక పెట్టెలోన, గాలి దూరనీయడు ఇంచుకైన నోటినీరు పోయడు దేవుననాన" వంటివి ఈ తీరు రచనలే. 'ఫిరంగీలకు' నూరేండ్లు నిండవను కవి శాపము ఈ శీర్షిక క్రిందికే వచ్చును.

4) సమకాలీన దుస్థితిని గాంచి విలపించి కవులు జాతీయాగ్నిని రగుల్కొల్పినారు. చెన్నాప్రగడ భానుమూర్తిగారు తమ 'భారత ధర్మదర్శనము' లో దేశములోని వర్తమాన దుస్థితిని గాంచి కన్నీరుమున్నీరై రోదించినారు.

ప్రొద్దున లేవంగ పోయిరాజవలెనన్న
నగ్నిహోత్రము స్వీడ నంప వలసె
నా బాలగోపాల మఖిలంబునకును మా
న్చెస్టరు పుట్టముల్నేయ వలసె
మునిమాపు వ్యాయామమునకు నై కందుక
ములు లండను బంపుచుండ వలసె
వ్రాతకు లేఖినీ పత్రము ల్వలయుచో
నాస్ట్రియా జర్మనీ లంపవలసె
చిన్న బిడ్డలు త్రావంగ క్షీరములును
భాగ్యవంతుల పాలకు పంచదార
యూరిపేదల గంజికి యుప్పుగల్లు
నన్యదేశంబు లంపగనయ్యె నకట !!'

స్వదేశీకై ప్రేరణమిది ! నాడు నాటకములలో రత్నములవంటి పద్యములిట్టివే కవులు రచించినారు. శ్రవ్యముకన్న దృశ్యము మిక్కిలి శక్తిమంతము కదా ! ఓలేటి నారాయణమూర్తిగారు వేదికపైకి దుర్గాదాసు వేషమున వచ్చి

'విశ్వవిఖ్యాతమా విశ్వేశ్వరుని గుడి
కటకటా తల్లిలో గలసిపోయె' యని పాడినప్పుడు ప్రేక్షకులు కల్లోలితులయ్యేడివారు. బలిజేపల్లివారి స్వరాజ్య రథము, స్వరాజ్య సమస్య దువ్వూరి రామిరెడ్డిగారి స్వాతంత్ర్య రథము. భారతమాత, ఈ దృష్టితో రచింపబడినవే!

5) ప్రాచీన భారతదేశ మెట్టిది?

'ఆర్ష సంతతి యుదాత్తానుదాత్తములైన
స్వరముల స్వస్తివాచనము లిడగ'[1] నిలిచిన భూమి. దాని పూర్వ వైభవమును తిరిగి పునరుద్ధరించుట కన్న కర్తవ్యమేమున్నది? పూర్వము ప్రతి గ్రామము కూడ నొక ఋష్యాశ్రమమువలె శోభిల్లినది. విశ్వనాథవారు పరవశముతో తమ జన్మస్థలమును అందు విశ్వేశ్వరునితో స్పర్ధకు దిగిన 'తంద్రి దాతృత్వము'ను వర్ణించుట కిదియే హేతువు. తుమ్మల సీతారామమూర్తిగారును తమ కావూరు నిట్లు వర్ణించినారు.

"ప్రచలిత స్వాతంత్ర్య రణవీర కాహళీ
రుతి రాజ్యమహర్మ్యహ ర్మ్యఖచితంబు
జాతీయ విద్యాప్రచార సంతోషిత
బ్రాహ్మీ చిరంతన భర్మపీఠి
సాబర్మతీ యోగి సమ్రాజ్మహోశాః ప
రం పరాదాన పాత్ర ప్రవృత్తి
సేవాతపః క్రియా జీవాతుమండలీ
విశ్రుత వినయాశ్ర మాశ్రయంబు....
మఱుపునకు రాదు 'కావూరు' మామకీన
గాఢతర పుణ్యరు క్ప్రాచి కాణయాచి"[2]

సాబర్మతీయోగి గాంధీజీ దీనిని ఆశీర్వదించినాడని చెప్పుట గమనార్హము!! ఇంతటి ఘనమైన చరిత్రకల ధరిత్రి కావుననే

1. బలిజేపల్లి, స్వరాజ్య సమస్య.
2. పఱిగపంట, 60వ పుట.

'ఏదేశమేగినా ఎందుకాలిడినా
ఏ పీఠమెక్కినా ఎవ్వరేమనినా
పొగడరా నీ తల్లి భూమి భారతిని
నిలుపరా నీ జాతి నిండు గౌరవము'[1] అని 'శ్రీలు పొంగెడి జీవగడ్డ'ను ప్రశంసించినారు కవులు. వేదగానము విన్పించిన, ఆదికావ్యము వెలసిన, బాదరాయణ ప్రముఖులకు పాదు కల్పించిన, భూమిని 'భక్తి బాదర తమ్ముడా'యని కవిసోదరులు ప్రోత్సహించినారు.

6) కవులు, మహర్షులు తత్తుల్యులు కావున ప్రభు సమ్మితముగా మిత్ర సమ్మితముగా కూడ కాంతాసమ్మితమైన కావ్యములతోనే ప్రబోధించుట స్వాతంత్ర్యోద్యమ వైశిష్ట్యము:

'దేవుడన మాతృదేశమ
దేవతలన ప్రజల - యజ్ఞదీక్షయనంగా
సేవావ్రత నిష్ఠయ'యివి
జీవనసూత్రము'లని తుమ్మలవారు వక్కాణించుట తిలక్ 'గీతా రహస్య' తాత్పర్యమే కదా! అట్టి మాతృసేవా తత్పరులై 'అసువులర్పణ చేసినవారి పార్థివ శ్రీ చెలువారు చోటదదస్ప్రగుచులన్ వికసించి వాసనల్ వీచుచు రాలిపోవలె'[2]నని పుష్పములే తలంచుచుండగా ఇక మానవుని సంగతి వేఱుగ చెప్పవలసిన దేమున్నది?

'తరిగాంధీయుగ మేగుదెంచె నికనే తద్భారతీయ స్వరా
జ్య రథంబాతని సారథిత్వమున వేసారింపు డంచున్ జగ
ద్గురు డేగెన్ దివిలోక మాన్యుడవె యుద్ఘోషించె తూర్యధ్వనుల్
ఉరుతద్దివ్య రథంబు లాగుటకు రండో భారతీయ ప్రజల్ !'

7) ఆశ - భవిష్యత్తు, పర్యాయపదము లనవచ్చును. కాలచక్ర మనంతమైనను మానవ విభజనము, దినమాస వత్సర నిర్ణయము సాపేక్షమైనను, గతము కన్న వర్తమానము మిన్నయని వర్తమానము కన్నను భావియే ఉజ్జ్వలముగా

1. ఆంధ్రావళి, రాయప్రోలు.
2. వేదుల - దీపావళి - కాంక్ష.

నున్నదని భావించుట మానవ స్వభావము. స్వాతంత్ర్య సిద్ధితో దేశము అష్టై శ్వర్యములతో తులతూగగలదని నాయకులు, కవి నాయకులు, ఆకాంక్షించిరి. స్వతంత్ర జీవనమే జాతిలోని సాంఘికార్థిక, రాజకీయాది సర్వవ్యాధులకును మూలబీజము. అది లభించినచో 'ఎల్ల శుభములు నిందు వర్ధిల్లుగాత'[1]యని భావింపవచ్చును.

అందులకు వేగలవంటి జాతీయులను సంఘటిత శక్తిగా రూపొందింప వలెను.

"దుడుకుఁదనము నదీరడీ గతుసుఁధనము
గావ తాపులు పోటులు గార్యమనక
లేఁగలన్నిటి నేకమౌలా గొనర్చి
నేర్పుతోఁ దల్లియెదఁ జేపనేరవలయు"[2]

## ఉద్యమ గీతములు :

కవిత్వము రసమును ఒప్పిల్లినట్లే గీతములు గేయములు కూడ రసవంతములై యున్నప్పు డింకను ద్విగుణీకృతమైన వేగముతో జనసామాన్యములో ప్రచారము నందును. కావుననే జాతీయోద్యమములో కవితామయములైన ప్రచార గీతములెన్నిటినో వాడుకొనిరి. ఉద్యమము దీర్ఘము తీవ్రమునైనది కావున గేయములు కూడ పుంఖానుపుంఖముగనే వచ్చినవి. వాని నీ క్రింది విధముగా వింగడింపవచ్చును.

1) ప్రబోధాత్మకములు
2) సంఘటనాత్మకములు
3) గాంధీజీ ప్రశంస
4) ఇతర నాయక ప్రశంస

---

1. మంగిపూడి వేంకటశర్మ, బాల వితంతు విలాపము
2. నక్షత్రమాల. చెన్నా ప్రగడ భానుమూర్తి

## 1) ప్రబోధాత్మకములు :

నాడెన్నియో సాంఘిక సమస్యలు కలవు. వ్యసనములు కలవు. ఈ సమస్యలకు పరిష్కార సూత్రములు, వ్యసనముల నుండి విముఖులను కమ్మని పిలుచుట మనకిందు కన్పించును. ఉదాహరణమునకు కొన్ని గీతములివి :

**అ) హరిజన సమస్య :** 'అంటరాని వారెవరౌకాదు మా వెంటరానివారె' అను మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రిగారి గేయమును నాడు పాడని ఆంధ్రుడు లేడు.

**ఆ) స్వదేశీ :** విదేశీ వస్త్రదహనము, స్వదేశ వేషభాషా ప్రోత్సాహము స్వాతంత్ర్యసిద్ధికి రాచబాటలు.

"దేశమాత సేవ చేయుండీ
జనులార మీరలు దేశదాస్యము తొలగద్రోయండీ
దేశవస్త్రంబులనె దాల్చండీ
జనులార మీరు విదేశవస్త్రము లంటబోకండీ
దేశనాశనకరములగు నీ వేషభాషలరోసి మోహా
వేశమును బరిమార్చి గాంధ్యుపదేశములు మీ మది దలంచుచు ॥

మనకు గౌరవ లేనెలేదండీ
పాశ్చాత్య మోహమ్ము నను మునిగియు తెలియరేమండీ !
కానడా మరి ఆఫ్రికాది ఖండములలో నుండువారలు
మనల బానిసలని తలంచుచు మదిని చాలగ నేవగింతురు ॥"

స్వదేశీ యోద్యమమునకు చరఖా ఆరాధ్యదేవత. 'కద్దరు నదీస్నాతు'డైన గాంధీజీ ఆదర్శమే జాతికి పరమపద సోపానము. కావుననే రాట్నమును ప్రశంసించు, కద్దరు ధారణమును ప్రోత్సహించుచు గీతములు వచ్చినవి : 'రాట్నపు పాట'లో దువ్వూరి రామిరెడ్డిగా రిట్లనినారు.

'పొద్దుపొడుపూ చుక్క పొడిచింది రాట్నమా
గూళ్లలో పక్షులూ కూసేను రాట్నమా
అరుణ కిరణాలతో ఆటలాడే నూలు

తమ్మికాడలలోని తంతులంటి నూలు
మంచినీళ్లల్లోన మఱగిపొయ్యే నూలు
పాలీడు పోగుతో సరసమాడే నూలు
గాలితరంగలలోన తేలిపొయ్యే నూలు
వడకవే రాట్నమా వస్త్రాలదూది
నడవవే రాట్నమా నక్షత్రవీధి' (నక్షత్రమాల)

'పాడవే రాట్నమా ప్రణయ భారతగీతి
ఆడవే కదురా, నీ ఆటలే మా కోట' యను జానపద గేయమునాడు వివాహములకు మంగళహారతులకు నుపయోగింపబడినది.

**ఇ) వ్యసనములు :** 'కల్లు మానండోయ్ బాబూ కళ్లు తెరవండోయ్' గీతము లీనాటివే. ఇట్లు దుర్వ్యసనముల నుండి ప్రజలను కవులు జాతీయోద్యమములోనికి మరలించినారు.

**కృత్యాది :** ప్రబోధాత్మక గేయములలో మాతృస్తవము కూడ ఒక భాగమే. పూర్వము కృత్యాదిలో ఈశ్వర ప్రార్థనముండెడిది. జాతీయోద్యమము నాడు భారతమాతయే సర్వదేవతా స్వరూపిణి కావుననే జాషువా వంటి కవులును 'మా భరతమాత మాతలకు మాత సకల సంపత్సమేత'యని కృత్యారంభము చేసినారు (ఖండకావ్యము). దువ్వూరి రామిరెడ్డిగారి మాతృవందన మిది :

"శారద శుభ్రవియత్తల పథమున సంచరించు నీ రథము
నీ మృదువీణాగాన ప్రబుద్ధము నిత్యము మా మనము
జోహార్! జోహార్! భారతమాతా! జోహార్! జోహార్! జోహార్!"

## 2) సంఘటనాత్మకములు :

స్వరాజ్య సంగ్రామములో అసంఖ్యాకమైన స్మృత్యర్హమైన సంఘటనములు జరిగినవి. ఒక్కొక్క సంఘటనమున కొక్కొక్క కవి రోమాంచము కల్గించెడి గీతములను వ్రాసి తాను ధన్యుడై ప్రజలను ధన్యులను చేసినాడు. అందు కొన్నిటి నుదాహరింతును.

విండర్సు ప్రభువు భారతదేశ సంచారమునకు వచ్చినాడు. ఆయన నప హాస్యము చేయుచు

'ఏమయ్యో - యువరాజ
ఎందుకొచ్చావయ్య - ఏమయ్యో' అను గీతము వెల్వడినది. అట్లే గాంధీ - రీడింగుల మధ్య సంభాషణల సమయమున

'రీడింగు గాంధీ ప్రభువు
మేడమీద కూరుచుండి
ఆడినట్టి మాటలకు
అర్థమేమి తెలుపరోరన్నా చిన్నన్నా' అను ప్రజాగేయము వచ్చినది. 'కైరా' సత్యాగ్రహము, చరిత్రలో విశిష్టమైనది.

'పంటలన్నీ మంటగలియగ
పన్నులియ్యగ లేని రైతుల
విన్నపమాలించి బ్రోచితివి
ఆ కైరా ప్రజల - విన్నపమాలించి బ్రోచితివి' ఆ బ్రోచినవాడు మహాత్ముడు. పాడినదెవరో అజ్ఞాతుడైన జానపద కవి !! ఉప్పు సత్యాగ్రహము భారతదేశము మరుకెత్తించిన స్నిగ్ధ సంఘటనము.

'దండాలందోయ్ మేముండ లేమందోయ్‌బాబు
దప్పులకును పన్ను, పప్పులకును పన్నుబాబు
కొప్పుకాస్తా దేవునికి వప్పుకుంటే పన్నుబాబు' అను గీతములో కవి పన్నుల భారమును సూచింపగా మరొక గీతములో ఉప్పుపై పన్ను విషయమే స్పష్టముగా ప్రసక్తము చేయబడినది.

'పన్నెండు దేశాలు పండుతున్నాగాని
పట్టెడన్నమె లోపమండీ
ఉప్పు ముట్టుకుంటే దోషమండీ.' ఇట్టివెన్నియో !

### 3) గాంధీజీ ప్రశంస :

జాతీయోద్యమ కురుక్షేత్రమునకు శ్రీకృష్ణుడు గాంధీజీ. కావుననే ఆయ

నపై అసంఖ్యాకములైన ప్రజాగీతములు వచ్చినవి. నోరార తమ తాతను- నేతను- పొగడి జనులు చరితార్థులైనారు.

'శ్రీ గాంధీనామం మరువాం మరువాం సిద్ధము జైలుకి వెరువాం వెరువాం
శ్రీ గాంధినే మేము నమ్మేం నమ్మేం - మరి ఇతరులను మేము నమ్మాం నమ్మాం'

ఇదొక భజన కీర్తన. (ఇట్టి వానితోపాటు కోలాటము కీర్తనలును, ఎన్నో వచ్చినవి.[1]) ఆయన మహర్షి కావుననే జడ చేతనములు కూడ జ్ఞానేశ్వరునికి లోబడినట్లు లోబడి స్వాగతమిచ్చినవి:

'సంగతో త్తుంగ తరంగ హస్తాం
నాకాశవీధుల నంటఁ జై కె త్తి
యమృత శీకరముల నౌదలఁజల్లి
విశ్వమం దెల్లెత విజయమొందంగ
శుభయోగ భోగముల్ చూరగొనంగ
దయనెప్డు దీవించు దండి సాగరుడు'[2] ఇది గాంధీజీ 'దండివీరు'డై

నప్పటి గేయము. ఆయనను చూచి 'సహజవైరి వర్గముతే చోద్యముగా' నాటి కణ్వాశ్రమములోవలె సఖ్యముతో నిలిచినవట! ఇంతకన్న ఈయన అవతార పురుషుడనుటకు వేఱు నిదర్శనమేమి కావలయును?

'ఆ మహాత్ముడు మెట్టిన యెడవు'లందు 'కలసి మెలఁగుచు నిజవైరములను మఱచు'నట!![3] అట్టివాడు "కొల్లాయి కట్టితేనేమీ మా గాంధి కోమటై పుట్టితేనేమీ (మాలడై తిరిగితేనేమీ అని వేరొక వరుస.)" గాంధీజీ జీవితమంతయును వానమామలై వరదాచార్యులవారు గీతములలో తరువాత రచించినారు.

ఈతడింతటి మహితాత్ముడు కావుననే సామ్యవాదులు కూడ గాంధీలో మార్క్సును దర్శించినట్లున్నది- ఈతడే నిజమైన సామ్యవాది యని ప్రకటించినారు.

---

1. చూ. అనుబంధము
2, 3. మహాత్మాగాంధీ, గాంధీ సందేశ ప్రచార పీఠమ్.

'కర్షకులకే కార్మికులకే
వర్తకులకే భూపతులకే
వర్గపతిగా వ్యవహరింపడు
వరుస ముప్పదియైదు కోటుల
భారతీయుల ప్రాణమాతడు

గాంధికంటెను సామ్యవాదులు కలరె లోకములో' అని కీర్తనము. లోకము విచిత్రమైన సద్గుణ సంపన్నునికి, కార్యశూరునికి సాధ్యమైనంత త్వరలో దివ్యత్వ మాపాదించి ప్రత్యక్ష దైవమనియే కీర్తించును. లోకమాన్య బాలగంగాధర తిలకునకు మహారాష్ట్రములో చతుర్భుజ హస్తసహితమైన ప్రతిమను నిర్మించి దేవాలయములు కట్టి నిత్యోత్సవములు ప్రారంభించినారు. గాంధీజీ కూడ అట్టి అవతార పురుషుడేనని ప్రజాభిప్రాయము. కావుననే ఆయనపై మంగళహారతులు సహస్ర నామములు వెల్వడినవి. శ్రీ కలవపూడి శ్రీశైలముగారు గాంధీ స్తవాష్టకము రచించినారు.[1] ఒక మంగళహారతిలో

'జయ గాంధిదేవా మంగళం జయ మంగళం నీకు
సత్యాగ్రహాశ్రమ తాపసా
శాంత స్వభావ మానసా
అరవింద సంస్తుతి పాత్రమా
వరషౌకతాలీ మిత్రమా!
పాంచాల పరిభవ ఖేదనా
నవ భారతీయ పాలనా
స్వారాజ్య మంత్ర వ్యాపనా
కస్తూరి సాధ్వీవల్లభా - జయగాంధి....'

ఇట్టి మహాత్ముడుండగా

'భారతమాతరో బాయుము నీ దుఃఖము
కొరతేమి కొరతేమి మనకింక గలుగు సౌఖ్యమూ'[2]

---

1. 15 జనవరి 1921 కృష్ణాపత్రికలో ప్రచురణ
2. 'భారత మాతృ సమాశ్వాసము'

## 4) ఇతర నాయక ప్రశంస :

గాంధీజీ వలెనే స్వాతంత్ర్య సిద్ధికై రక్తము ధారవోసిన నాయకు లిత రులు లేకపోలేదు వారును ప్రశంసాపాత్రులే కదా! భారతిలో జనవరాజు అప్పారావుగారు దుగ్గిరాల గోపాలకృష్ణయ్య నిట్లు ప్రశంసించినారు.

'కాలచక్రము గతి గడచి తెనుంగు
భావి భాగ్యమెల్ల పండిన వెనుక
ఆనాటి కెవరైన నడుగకపోరు
గోపాలకృష్ణుడే గోష్ఠివాడంచు
భాగ్యవశమ్మున భావి కాలాన
అమృత తుల్యములు నతి భావభరిత
ములునైన నా గీతముల వినినంత
గోపాలకృష్ణుని గొప్ప దీపించు'

అట్లే అడవి బాపిరాజుగారు 'ఆంధ్ర రిపబ్లిక్' లో 'గొంతూకెత్తి పాడే గీతం గోపాలకృష్ణయ్యా మధురం మధురాలన్నీ మాయం చేసే మాయాదారీ జాతుకూ రక్కసీ గంగాధారేకంత శృతులూ నింగినేలా కురిసే అమృతం నీ విచ్చిన మా చైతన్యానికి నీకే హంగూ మాకే పొంగూ' అని స్తుతించినారు. ఇట్లు గాన యోగ్య మైన బుఱ్ఱకథ లెన్నియో నాడు వచ్చినవి. ప్రత్తిగొడుపు రాఘవరాజుగారి బాపూజీ, బోసుబాబు హరికథలు, మునగపాటి విశ్వనాథశాస్త్రి, ప్రయాగ నర సింహశాస్త్రి ప్రభృతులు నేతాజీ బోసు, ఆచార్య రంగా, ఆంధ్రకేసరి, పటేల్, బోసు, పట్టాభి ప్రభృతులపైని రచించిన బుఱ్ఱకథలు నాడెంతో ప్రజాదరణమును పొందినవి. ఉద్యమము రెక్కలనంటి నప్పుడు రెక్కలతో ఎగిరెడి ప్రజాచైతన్య మునకు చిహ్నమిది !!

**ఉద్యమ పరిసమాప్తి :** 1947 ఆగస్టు 15వ తేదీన స్వాతంత్ర్యము సిద్ధించుటతో జాతీయోద్యమము, దాని ఆవేశము ముగింపునకు వచ్చినట్లే లెక్క. అనంతరము కూడ గాంధీజీపైని స్వాతంత్ర్య వీరులపైని రచనము లసంఖ్యాక ములు రాకపోలేదు. శ్రీ భాగవతుల పూర్ణయ్యవంటివారు నవకాశి దురంతరము లప్పై కవితలు వ్రాయకపోలేదు. అది సహజము- కాని జాతీయోద్యమము

స్వాతంత్ర్యసిద్ధితో ముగిసినది. ఇందులకొక చిన్న ఉదాహరణము నిచ్చెదను. స్వదేశ వేషభాషలు 'స్వదేశీ'యోద్యమమున కంగములు. కావుననే ఆంగ్లమును దూషించుట, ద్వేషించుటచేసి హిందీని పూనికతో 1920 నుండియే రాజాజీ ప్రభృతులు దక్షిణాపథమున వ్యాప్తినందజేసినారు. స్వాతంత్ర్యము వచ్చిన పిమ్మట ఉద్యమము ఉపసంహరింపబడినది. దానితో ఉద్యమము నాటి జాతీయావేశము కూడ చల్లారిపోయినది :

> "ఆర్య సంస్కృతికి మూలాధారమది కాన
> సంస్కృత భాషనేఁ జదువుకొందు
> విశ్వవేదికపైన విహరింపవలెఁ గాన
> నాంగ్లేయ భాషనే నభ్యసింతు
> దేశ సమైక్యత దృష్టియందిడుకొడి
> యితర భాషల గ్రహియించుకొందు
> బుట్టుటాదిగఁ దెల్వి పోషించినది కాన
> మాతృభాషను నేను మఱువఁబోను"[1] అని యొక కవిత.

ఇందు ఆంగ్లము పేరున్నది కాని హిందీ పేరు లేదు. హిందీ ఔత్తరాహుల భాష యని నిషేధింపబడినది. 'ఇతర భాషల గ్రహియింతు'నని తమిళ కన్నడాదు లన్నియును కలిసివచ్చునట్లు పలికినాడే కాని హిందీపేరు లేదు సరికదా హిందీకి వ్యతిరేకముగా బ్రహ్మాండమైన ప్రజోద్యమములు నడిచినవి. స్వరాజ్యోద్యమ సహజ పరిసమాప్తి కిది సూచిక !!

**ప్రభావములు :** కాల్పనిక కవిత్వములో భావశాఖపై ప్రముఖముగా ఆంగ్ల కవిత్వ ప్రభావమున్నట్లే జాతీయోద్యమ కవిత్వముపై హిందీ ప్రభావ ముండుట గమనార్హము. గాంధీజీ హిందీని కద్దరుతోబాటు పూనికతో ఈనాడు దేశవ్యాప్తముగా ప్రచారము చేసినారు కావుననే కొందరు తెలుగు కవులు హిందీ కృతులాధారము చేసికొనియును మఱికొందరు ఛాయలను గ్రహించియు రచించి నారు.

హిందీలో అయోధ్యాసింహ్ ఉపాధ్యాయ (హరిఔధ్) 'ప్రియప్రవాస్' అను చక్కని కావ్యమును వ్రాసెను. ఇందు భాగవతము జాతీయ గాథగా

---

1. భారత విద్యార్థి స్నేహలతా కవితా సంపుష్పము.

చిత్రింపబడినది. 'స్వజాతి ఉద్ధారమహాన ధర్మహై చలోకరే పావకమే ప్రవేశ ఔసధేను లేవే నిజజాతికో బచా' (జాతి రక్షణమే పరమధర్మము. ప్రచండాగ్నిలో ప్రవేశించి గోపబృందమును రక్షించుకొందము) చామర్తివారి 'బృందావనము'న కిది మూలము.

> 'గొల్లడు లేడు కాయుటకు గోవులు చిందరవందరయ్యె భీ
> తిల్లె మృగారవమ్ములకు దిక్కులు నాలుగు పిక్కటిల్లె మా
> యుల్లము తల్లడిల్లె నిదిగోయని కన్నులుగట్టి పోయె మా
> నల్లని సామిరాడె చిరునవ్వు మొగమ్మున తాండవింపగన్'

ఇందు గొల్లడు నాయకుడు. గోవులు భారతీయ ప్రజలు. మృగము బ్రిటీషు రాజ్యము (వారి సంకేతము సింహము). నల్లనిసామి కృష్ణుడు- నీలము భారతీయ వర్ణము! మైథిలీ శరణ్‌గుప్త సాకేత్‌లో రాముని దేశభక్తునిగా చిత్రించినాడు.

> 'రామచంద్ర భవభూమి అయోధ్యకా సదా
> ఔరా అయోధ్యా రామచంద్రకీ సర్వదా'

ఇదే తీరులో శ్యామనారాయణ పాండే రాణాప్రతాప గాథ 'హల్దీఘాటీ'. పేర రచించెను. రాజశేఖర శతావధానులు స్వతంత్రముగా రచించిన కావ్యమునకు పాండే రచనము, వ్రాయవలెనను సంకల్పము కలుగునంతవరకు స్ఫూర్తినిచ్చినది. మైథిలీ శరణ్‌గుప్త 'వంగమేభంగ్' సియారాంశరణ్ 'మౌర్యవిజయ్' వంటి చారిత్రక రచనలు ఏటుకూరివారి మగువ మాంచాల, జాషువావారి శివాజీ, గడియారమువారు శివభారతము వ్రాయుటకు ప్రేరణ నిచ్చినవి.

రామనరేశ్ త్రిపాఠీ, బాబూ హరిశ్చంద్రజీ రచనలు, మైథిలీ శరణ్ కృతులు హిందీ వాఙ్మయమున కాభూషలు. మైథిలీ శరణుని భారత భారతీ అద్భుతమైన కావ్యము. రాయప్రోలు విశ్వనాథుల ఆంధ్ర పౌరుషాదుల కిది స్ఫూర్తిదాయకము. మైథిలీ శరణుడు వ్రాసిన 'కిసాన్'కు దువ్వూరివారి కృషీవలునికి మిక్కిలి సామ్యములున్నవి. మాఖన్‌లాల్ చతుర్వేది 'ఏక్ భారతీయ ఆత్మా'లోని కొన్ని పుటలను వేదులవారు యథాతథముగ అనువదించిరి. 'కాంక్ష' 'ఫూల్‌కీ చాహ్' ఖండిక కనువాదము. హిందీలో ప్రముఖ కవయిత్రి సుభద్రా కుమారీ చౌహాన్ 'ఝాన్సీవాలీ రాణీ' రచించి ప్రఖ్యాతినందినది. తెలుగులో విశ్వ

నాథ, కొడాలి, వీరభద్రమూర్తిగార్ల 'ఝాన్సీరాణి' కథను రమణీయముగా తీర్చి దిద్దుటలో ఆ స్ఫూర్తి లేదనలేము. అట్లే అనేక జాతీయ గీతములు హిందీ కవితా ఛాయలో సాగినవి. సుమిత్రా నందన్‌పంత్ బాపూజీ పైని వ్రాసిన గీతములే బసవరాజుగారి 'కొల్లాయి కట్టితేనేమీ' 'పతాకోత్సవం చేయండి' వంటి వానికి ఆలంబనము. మైథిలీ శరణ్‌గుప్త 'స్వదేశ సంగీత్' యొక్క ప్రభావము బాపిరాజుగారి 'హిమాలయోత్తుంగ శృంగం స్త్రీబతుకంతా ఉమాపతి నృత్యరంగం' అను గేయముపై స్పష్టముగా నున్నది. అట్లే గయాప్రసాద్ 'కృషకక్రందన్' 'కరుణభారతీ', నిరాలా 'ఆవాహన్', 'శివాజీకా పత్ర', 'ఉనబిఖారీ' అనుపమశర్మ 'పానీపత్' ఉదయశంకర్ భట్టజీ 'తక్షశిల'లు తెలుగులో కరుణరసాత్మకమైన కృతులు శేషాద్రి రమణకవుల ఓరుగల్లు శిథిలములు, రాళ్ళపల్లివారి పెనుగొండ, శమీపూజ, మాధవశర్మగారి తల్లి కోటబొద్దు బాపిరాజుగారి దీపావళి, కుందుర్తి నరసింహారావుగారి పంప, కొసరాజువారి తెలుగుతల్లి వంటి గీతములకు స్ఫూర్తి నిచ్చినవి. ఉద్యమము తీవ్రముగా దశాబ్దముల తరబడి సాగుచున్నప్పుడిట్టి ఆ దాన ప్రదానములు సహజములే !!

**పత్రికలు :** వివిధ మార్గములకు చెందిన జాతీయ కవిత్వమును ఉద్యమ కాలములో ఆంధ్రపత్రిక, నవోదయ, ఆంధ్ర రిపబ్లిక్, ఆంధ్ర రాష్ట్రం, జైహింద్, జయ్‌భారత్, తెలుగుదేశం, మాతృసేవ, ప్రగతి, సారధి, ఆంధ్రశ్రీ, భారతి వంటి పత్రికలు పోషించినవి. కృష్ణాపత్రిక ఆధునిక కవిత్వమున కాభరణము లని చెప్పదగిన ఖండికలెన్నిటినో నాడు ప్రచురించి 'నాటి ఆంధ్రుల త్యాగములకు లక్షలాది ప్రజల చైతన్యమునకు, స్వాతంత్రోద్యమమునకు'[1] మూలకారణమై నిలిచినది.

**నమోరాష్ట్ర దేవాయ :** మొత్తము మీద జాతీయోద్యమ ఫలితముగా ఆంధ్ర సాహిత్యము సుసంపన్నమగుటయే కాదు, కవిత్వ పరమార్థమేమో తెలుగు కవులు మరల ఒకమాటు నిర్వచించినారు. ఆనందముతోబాటు ఆనుషంగికముగా ధర్మ ప్రతిపాదనమే కావ్యదర్శమని ప్రవచించినారు. మాతృభూమియే ధర్మ స్వరూపము. కావున పరమేశ్వర స్థానములో భూదేవత నుంచి 'నమోరాష్ట్ర

---

1. వి. వి. గిరి భారతదేశ అధ్యక్షులు.

దేవాయ'యని నమస్కరించి దైవీ రాష్ట్రవాదమును ప్రతిష్ఠాపించుటే కర్తవ్య మని క్రియతో చాటి చెప్పినారు. ఏబదియేండ్ల ఉద్యమ చరిత్రలోని మహాకవుల సాధనా రహస్యమిది !!

**ఆనందమయకోశము :** మానవుని పంచకోశములకును, ఈ ఉద్యమములకును సన్నిహిత సంబంధమున్నది. అన్నమయకోశము, భౌతిక వాంఛలకు సంబంధించినది, అభ్యుదయ కవిత్వమును ఈ వర్గములోనికి చేర్పవచ్చును. మనోమయకోశము స్వేచ్ఛ సంస్కృతులకు కోరును. భావ కవిత్వమును దీని క్రింద వర్గీకరింపవచ్చును. ఆనందమయకోశము జీవాత్మల సంబంధమునకు సంబంధించినది. ఆధ్యాత్మిక కవితలు, దేశభక్తి ఉద్యమములు ఈ వర్గీకరణ లోనికి తీసికొని రావచ్చును. ఈ విధముగా జాతీయోద్యమ కవిత్వము ఆనంద మయకోశ సంబంధి

# చైనా దురాక్రమణము

భారత-చైనా దేశముల మధ్య నున్న సత్సంబంధము లీనాటివి కావు. సహస్రాబ్దముల నుండి చరిత్ర కందని కాలమునుండి ఈ రెండు దేశములును స్నేహసేతువును నిర్మించుకొనినవి. సంస్కృత ప్రాకృతములలోని 'శినా' శబ్దము వికృతి నంది, 'చైనా'గ మారినది వారి దేశములో భూస్వామిని మన్ డరిన్ అందురు. ఇది మంత్రిన్‌శబ్ద వికృతి.

**వివాహ బాంధవ్యములు :** బుద్ధుని అవతరణముతో భారత - చీనా దేశముల మధ్య అభేద మేర్పడినది. అశోకుడు 2 8 B.C. లో ఎందరో బౌద్ధ భిక్షువులను చైనాకు పంపెను. వారు అస్సామునుండి టిబెట్టు (త్రివిష్టపము) నుండి, సముద్రము నుండి మూడు మార్గములలో పయనించిరి. క్రీ. శ. 1వ శతాబ్దములో నొక హిందూ బ్రాహ్మణ యువకుడు ఫోనన్ ప్రాంతవేగి అక్కడి రాణిని తన పాండిత్యముచే నాకర్షించి వివాహమాడెనని చారిత్రకాధారములు లభ్యమగుచున్నవి.[1]

**నాగరికతా వ్యాప్తి :** ఇట్లు భారత-చీనీ దేశముల మధ్య సాంస్కృతిక

---

1. భారతీయ నాగరికతా విస్తరణము - చైనా- మారేమండ రామారావుగారు

నాగరికతా వ్యాప్తులెన్నియో దశలలో జరిగినవి మొన్నమొన్నటి వఱకును బుద్ధుడు శివుడు కాలభైరవుడు చైనీయుల ఉపాస్య దైవములు.1 ఇండో సిథియను, పార్థియను, సోగ్దియను, కుచియను, కోటానీయాది జాతు లీ నాగరికతా విస్తరణమునకు ప్రత్యక్షముగ పరోక్షముగ దోహదము చేసినవి.

**కమ్యూన్ మత స్వీకరణ :** 1947 లో మావ్-టు-సింగ్ నాయకత్వమున చైనాదేశము హిందూ-బౌద్ధ ధర్మములను విసర్జించి 'కమ్యూన్' మతమును స్వీకరించినది. నాటినుండి ఇతర దేశముల నాక్రమించుట, వారి ధన సంపత్తులను కొల్లగొట్టుట, వారి నాగరికత, సంస్కృతి, కళలను, జీవన విధానమును భ్రష్టముచేసి ఆయా దేశములలో తమ పంచమాంగ దళములను సృజించుకొని పెద్దపెట్టున విధ్వంసకాండ జరుపుట కమ్యూన్ మతము పేర మావో చేసిన దారుణములు.

**విద్రోహము :** 'నూరు పుష్పములు వికసింపనిమ్మను' సూక్తిని ప్రవచించి మావో నెహ్రూజీని నమ్మించి పంచశీలపై సంతకములు చేయించినాడు. అనంతరము భారతదేశ పర్యటనమును చౌ-ఎన్-లై (ప్రధాని) ఒకవైపు చేయుచుండగనే హిమాలయములలో 14500 చదరపు మైళ్ల భూభాగము నాక్రమించుకొనినారు. ఆ భూమి తమకేనని వాదన ప్రారంభించినారు. సరిహద్దుల పేరున చైనా ఇంతటి నమ్మకద్రోహము చేయునని భారతీయులు కలలోనైన తలంచలేదు.

**సరిహద్దు :** భారత - చీనా దేశముల మధ్య 2500 మైళ్ల పొడవైన సరిహద్దు కలదు ఇందు పశ్చిమముగా జమ్మూ-కాశ్మీరుకు చెందిన లడక్-చైనాకు చెందిన సింకియాంగ్ - టిబెట్ లకు మధ్యనున్న సరిహద్దు 1100 మైళ్లు. ఈశాన్య ఏజెన్సీ (నేఫా) కి - చైనాకు మధ్యనున్న సరిహద్దు 800 మైళ్లు. పంజాబు, యు.పి. భూటాన్, సిక్కింలకు - చైనాకు మధ్యనున్న సరిహద్దు 600 మైళ్లు. ఇవి అనాదిగా నున్న సరిహద్దులు. వేదకాలము నుండి కూడ హిమాలయములను మన సరిహద్దులుగా భావించి దేవతాత్మగా శివధామముగా భావించి దివ్యత్వ కల్పనముతో భక్తిశ్రద్ధలతో పూజింపసాగినారు. లడక్‌ను పాలించిన రాజులు

1. హిందూ విశ్వ.

హిందువులే, పంజాబులోని స్పితిలోయను పాలించిన రాజులు సేనవంశ నామము కల హిందువులు. అస్సాం - నీఫాలలో కామరూప రాజ్యమున్నదని అలనాటి చైనా యాత్రికుడు హ్యూయన్‌త్సాంగ్ అంగీకరించినారు. సరిహద్దు తెగలైన ఖాంబా, అకాదాఫ్లా, మిరి, అబోర్, మిష్మి జాతులవారు అస్సాము కొండ తెగలకు సన్నిహితులు. సంప్రదాయికముగ చారిత్రకముగ, రాజకీయాధారములతో పరిశీలించి చూచినచో ఎన్నడును చైనాకాని టిబెట్టు కాని ఈ ప్రాంతములపై పాలన నెరపవలెనను ఇచ్ఛను వెలిబుచ్చలేదు. భారతదేశము తన సర్వసర్వం సహాధికారము నిట నెలకొల్పి యుగయుగములుగ పాలించినది.

**మెక్‌మోహన్ రేఖ :** 1913 అక్టోబరు నుండి 1914 జులై వరకు సిమ్లాలో భారత - టిబెట్ - చైనా ప్రతినిధులు త్రైపాక్షిక సమావేశములు జరిపి సమానాధికారములతో ఒప్పందమును కుదుర్చుకొనినారు. అనగా నాటికి చైనా టిబెట్‌ను కూడ తోటి రాజ్యముగా గుర్తించినది. (కాని తరువాత టిబెట్టును కబళించి తానే టిబెట్టుకు ప్రతినిధినని పలికినది) ఈ సమావేశములో పాల్గొనిన బ్రిటీషు ప్రతినిధి మెక్‌మోహన్. ఆయన పేర నొక రేఖను గీచి సరిహద్దుల విభజనము స్పష్టముగా జరుపుకొనినారు. నాడిట్లు చట్టబద్ధమని అందరును అంగీకరించిన రేఖ చెల్లదని నేడు చైనా తిరిగి వాదము ప్రారంభించినది.

**వివాద ప్రాంతములు :** నిజముగా అక్కడ వివాదగ్రస్త ప్రాంతమే లేదు కాని లేని వివాదమును చైనా సృజించి కొంత భూమిని వివాద ప్రాంతముగా ప్రకటించినది యు పి. టిబెట్‌లకు మధ్య సట్లెజ్ నదీ జలస్థావరము ఒక వైపు గంగానది జలస్థావరములు (కాలిఅలక్‌నందా, జడ్‌గంగా) మరొకవైపున ఉన్నవి. ఇక్కడి హిమాలయముల ఎత్తు 17 వేల అడుగులు. ఇచ్చటి గార్వాల్ జిల్లా రెవెన్యూ రికార్డులను బట్టి చూచినచో 1850 నుండి 1958 వరకును ఎట్టి మార్పును లేదు. కాని ఆకస్మికముగా దురాక్రమణమునకు ముందు చైనా ఇక్కడి నిలాంగ్, జాదాంగ్, బారాహోతి, లోప్షామ్, సంఘామల్లా ప్రాంతములు తనవని పిడివాదము ప్రారంభించినది.

**విఫలమైన హెచ్చరికలు :** 1954 ఏప్రిల్‌లో భారత - టిబెట్ వ్యాపారపు టొప్పందమనున దొకటి జరిగినది. తత్ఫలితముగా టిబెట్‌పై గల సర్వహక్కులను భారతదేశము బుద్ధిపూర్వకముగా వదులుకొనినది. ఈ యొడం

ఐడికను ధృవీకరించుటకు నెహ్రూ చైనా వెళ్లినప్పుడు 1954 అక్టోబరు 18వ తేదీ భారత భూభాగము నుండి 50 వేల చదరపు మైళ్లు తనకు రావలెనని చైనా గీచిన చిత్రపటములను చూచి ప్రశ్నింపగా 'అవి కుమింటాంగ్ చైనానాటి పాత చిత్రపటములు వానిని సవరించు తీరిక ప్రభుత్వమునకు లేకపోయిన'దని చౌ. ఎన్ లై ప్రత్యుత్తర మిచ్చినాడు. ఈ తతంగము వెనుక ఏదో షడ్యంత్రమున్న దని నాయకులు పెక్కు రూహించినారు కాని అహింసామూర్తి, శాంతి ప్రియుడు నైన నెహ్రూజీ చైనా ఇంతటి ద్రోహము చేయునని కలలోనైన ఊహింపకుండు టచే పలుపురి హెచ్చరికలను పాటింపలేదు.

**దురాక్రమణము:** కొందరు చారిత్రకులు దురాక్రమణము 1952 నుండియే ప్రారంభమైనట్లు చెప్పుచున్నారు. మనకు తెలిసినంత వరకు స్పష్ట ముగా 1955 నుండి జరిగినది. 55 జూన్‌లో చైనా భారత భూభాగమునారా హోతిలో మకాము వేసినది. సెప్టెంబరు 15వ తేదీని ఉత్తరప్రదేశ్‌కు 10 మైళ్లు వచ్చి దమ్‌జామ్‌లో మకాము వేసినారు. 1956 ఏప్రిల్ 28న, నిలాంగ్‌కు తూర్పున అరమైలు వఱకును ఆక్రమించుకొనినారు. జులై 26న బారాహోతీ, తున్‌జున్‌లా తమదేనని స్పష్టముగా ప్రకటించి శివకిన్, హుప్‌సాంగ్ మొదలగు భారతీయ ప్రాంతములలో విహరణము జరిపినారు. 1957 అక్టోబరులో నీఫా లోని లోహిత్ డివిజన్‌లో నలాంగ్‌వద్ద చైనీయులు కన్పించినారు. జులై 2న భారతదేశము తన లధక్ భూమిలోని ఖురనక్‌ను ఆక్రమించినందుకు నిరసన పంపినది. దానికి చైనా తిరస్కరించినది. అంతటితో ఆగక భారత గస్తీ దళ మును బంధించి భవన నిర్మాణ కార్యక్రమ మారంభించినది. అక్టోబరులో ఉత్తరప్రదేశ్‌లోని లాప్తల్, సంగ్ చమల్లాలలో చైనా గస్తీ ప్రారంభించినది. పంజాబ్‌లోని స్పితీ లోయపై చీనా విమానము లెగిరినవి. ఈ ఆక్రమిత ప్రాంత మంతయు తమదేనని చైనా ప్రకటించినది. 1959 జనవరి 23న తాము మెక్ మోహన్ రేఖను గుర్తింపబోమనియు, తిరిగి సరిహద్దులు నిర్ణయించుకొనవలెనని యును చైనా బహిరంగముగా ప్రకటించుటతో భారతదేశము విభ్రాంతి నందినది.

1959 మార్చి 31న చైనా టిబెట్‌ను కబళించుటతో గత్యంతరము లేక దలైలామా భారతదేశమున కాశ్రయమునకై వచ్చినాడు దీనిని సాకుగా తీసి కొని చైనా అంతర్జాతీయముగా భారత వ్యతిరేక ప్రచారము ప్రారంభించినది.

1959 జులై 28న లధక్‌లోని పశ్చిమ పాంగాన్ సరస్సులో ప్రవేశించి అక్కడి భారత గస్తీ దళమును పట్టుకొని స్పాంగుర్‌లో తన శిబిరమును నెలకొల్పినది. ఆగస్టు 7 న మెక్‌మోహన్ రేఖ దాటివచ్చి ఖింజిమాన్ ఇవతల భారత సైనికులను తరిమికొట్టినది. అప్పుడే లాంగ్జూ నాక్రమించుకొనినది. అక్టోబరు 20 దక్షిణ లధక్‌లో కాంగ్‌చెన్‌మో లోయలో 40 మైళ్ల భారత భూమి నాక్రమించి భారత సైనికులను తొమ్మిది మందిని చంపి పది మంది నపహరించుకొని పోయినది. 'కాంగ్‌కా' అను భారత ప్రాంతము తమదేనని ప్రకటించినది. డిసెంబరులో ససైన్యముగా లధక్‌లోని ఆక్సాయ్‌చిన్‌కు పశ్చిమముగా దక్షిణముగా విజృంభించి టిబెట్ నుండి ఆక్సాయ్‌చిన్ నుండి సింకియాంగ్‌కు రహదారిని నిర్మించినది.

1960 ఏప్రిల్‌లో భారతదేశము తిరిగి సంధికి సిద్ధపడగా అప్పటికే 12 వేల మైళ్లు నాక్రమించుకొనిన భూమి తమదేనని ఇంకను 50 వేల మైళ్లు రావలెనని పలికినది. మంచితన మన్నిచోటులలోను మన్నన నందలేదు కదా! ఆ దురాక్రమణము క్రమముగా సాగి, జూన్ 8న నీఫాకామెంగ్ డివిజన్‌లో తసాంగ్ గోంపావద్ద చైనా దురాక్రమణము జరిపినది. సెప్టెంబరు 22న సిక్కిం వద్ద జీలాకనుమను దాటి వచ్చినది. ఈ మధ్యకాలములో 52 సార్లు విమానములతో భారత గగనతలము నతిక్రమించినది.

1961 మేలో లధక్‌లోని ఛుశూల్ వరకును చైనా సైనికులు వచ్చినారు జులై 2వ తేదీ నీఫాలో మఱొక మైలు ప్రాంత మాక్రమించినది. కారకోరం నుండి కోంగ్‌కా కనుమ వఱకు నున్న భూభాగమును స్వాధీనము చేసికొనినది. ఇంత జరిగిన పిదప చరిత్రలో తొలిసారిగా 1962 జులై 21వ తేదీ భారతీయులు లధక్‌లోని చిప్ - చాప్, వాలాంగ్‌ల వద్ద సంఘర్షణమునకు సిద్ధమైనారు. కాని చైనా అసంఖ్యాకమైన సైన్యమును ప్రమత్తత వలన భారతదేశము నిర్లక్ష్యము చేయుటచే, చైనాయే పురోగమింప సాగినది! నేఫాలోని లాంగ్జూను కూడ దాటి భారత భూభాగములో ప్రవేశించి తాంగ్లా కనుమను కబళించి వేసినది. 1962 అక్టోబరు 20వ తేదీన భారతముదేశము పూర్తిగా కన్ను తెరిచినది. కాని నాటికే జరుగవలసిన దంతయును జరిగిపోయినది. లధక్ - నీఫా రంగములు రెండింటిలోను భారతదేశము ఓడిపోయినది !!

చైనా క్రమముగా విజృంభించి లధక్‌లోని దౌలత్‌బేగ్ వోల్డీ నుండి ఛుసుల్ వఱకు 15 వేల చదరపు మైళ్లు కబళించినది. నేఫాలో బొమ్‌డిలా, తవాంగ్‌లను వశపరచుకొని 18 వేల చదరపు మైళ్లు స్వాధీనము చేసికొనినది. ఈ రీతిగా తన దురాక్రమణమును నిరాఘాటముగా సాగించి 1962 నవంబరు 20 నాటికి తిరిగి తానే ఏకపక్షముగ యుద్ధవిరమణను ప్రకటించి చైనా వెనుతిరిగి పోయి నది.

**కారణములు - పరిణామములు :** చైనా ఇట్లెందుకు చేసినదను విష యములో ఎవరి ఊహాగానములు వారికున్నవి. భారతదేశము నాక్రమింపవలె ననియే చైనా భావమనియును కాని దేశములోని పంచమాంగ దళము సహాయము సకాలమున కవసరమైన పద్ధతిలో అందలేదు. కావున వెనుదిరిగినారనియును పరిశీలకు లభిప్రాయపడినారు. అట్లుకాక చైనాలోని ఆంతరంగిక పరిస్థితులధ్వా న్నముగా నుండుటచే తమ ప్రజల దృష్టిని మరలించుట కిదొక పన్నాగమని కూడ కొందరు భావించినారు. ఏదిఏమైనను చైనాలోని పాలకులది దురాక్రమణ మనస్తత్వము. టిబెట్టు తరువాత భారతమును కూడ మట్టుపెట్టినచో ఈ ఖండములో తమ కెదురులేదని వారు భావించి యుండవచ్చును!

**దీనివలన భారత దేశములో అసాధారణ పరిస్థితి నెలకొనినది. రాజకీయ ముగా పెక్కు పరిణామములు సంభవించినవి. దేశములో అసాధారణ పరిస్థితిని** రాష్ట్రపతి ప్రకటించినారు. సరిహద్దులో సాధన సంపత్తి లోపముచే సైనికులు పరాజితులైనను జాతియొత్త యొక్క ప్రాతిపై నిలబడి వారికి వెన్నెముకయై నిలిచినది! ఇట్టి అసాధారణమైన 'జాతీయ సమైక్యత' ఇటీవలి కాలములో ఎఱుగనిది !!

**ప్రజాచైతన్యము :** చైనా జరిపిన యీ దండయాత్ర ఫలితముగా జాతిలో పెల్లుబికిన చైతన్యము కట్టలు తెగి ప్రవహించినది. ఊరూర తెలుగు నాట సభలు సమావేశములు జరిపి దురాక్రమణమును ఖండించినారు. దినములపై బుఱ్ఱకథలు, హరికథలు, నాటకములు రచింపబడినవి. మావోను చౌ-ఎన్-లై మొదలైన వారిని అపహాస్యము చేయుచు అసంఖ్యాకమైన రచనలు వచ్చినవి. 'చైనా దుండగములు'[1] మొదలైన గ్రంథములు పత్రికాముఖమున వెలువడి ప్రజ లలో చైతన్యమును నింపినవి !!

---

1. శ్రీ వేమూరి రాధాకృష్ణమూర్తి

**కవి కర్తవ్యము:** ఆంధ్రదేశము నుండి రక్తము ధనము సైనికుల సహాయార్థము పంపబడినది. అఖిల భారత తెలుగు రచయితల మహాసభలవంటి వెన్నో తమ కార్యక్రమములను అవాంతర పరిస్థితుల కనుగుణముగా జరుపుకొనినారు. "రచయితల కలాలు ఖడ్గాలకంటె వాడిగా కదం త్రొక్కవలసిన కాలమొచ్చింది. మన రచనలు హిమాలయా సరిహద్దులలో ప్రాణాలొడ్డి పోరాడుతున్న జవానులకు జవసత్వముల నివ్వవలసిన అగత్యమేర్పడినది" అని శ్రీ క్రొవ్విడి లింగరాజుగారు రాజమండ్రిలో స్వాగతోపన్యాసములో పలికినారు[1] నాటి ఆంధ్ర కవి పండితుల తీర్మానములివి: "పంచశీలను కాలదన్ని మిత్రద్రోహం చేసిన చైనా సామ్రాజ్యకాంక్షను దురహంకారాన్ని ఈ సభవారు తీవ్రంగా ఖండిస్తూ ఉత్తర సరిహద్దులో ముంచుకువచ్చిన ఈ మహోపద్రవాన్ని ఎదుర్కొనడానికి భారత ప్రభుత్వం తీసుకుంటున్న చర్యలన్నిటినీ హృదయపూర్వకంగా సమర్థిస్తూ తెలుగు రచయితలు యావన్మందీ దేశరక్షణ మహాయజ్ఞంలో సంపూర్ణంగా సహకరించగలరని....హామీ యిస్తున్నారు"[2] అంతేకాక "రచయితలు తమ రచనలద్వారా వచ్చే ఆదాయంలో యథాశక్తి మాతృదేశ రక్షణ నిధికి సమర్పించవలెన"ని తీర్మానించినారు. చైనా దురాక్రమణవంటి ప్రమాదపరిస్థితులలో రచయితల సభలేలనని ఆక్షేపించినవారు లేకపోలేదు. "వారిలో చాలా మందికి సాహిత్య స్వరూపమే అసలు తెలియదని చెప్పవచ్చు.... దేశభక్తిని ఉజ్జీవింపచేసి ప్రజాశక్తిని కూడగట్టుకొని మనం, మనల్ని మన దేశాన్ని ఎలా పరిరక్షించుకోవాలో ఉద్బోధించే రచనల ఆవశ్యకత యిట్టి సమయంలో ఎంతైనా వుందని" నిర్వాహకులు భావించినారు.[3] ఉద్యమము కవులనెట్లు ప్రేరేపించునో- కవులు ఉద్యమమునకెట్లు దోహదము చేయవలసినవారో నిరూపించుటకు పై పంక్తులు చాలును!

---

1. అఖిల భారత తెలుగు రచయితల ద్వితీయ మహాసభ. ప్రత్యేక సంచిక పుట. 7
2. అఖిల భారత తెలుగు రచయితల ద్వితీయ మహాసభ. ప్రత్యేక సంచిక పుట. 14 (4-1-1963 వ తేదీ తీర్మానములు)
3. కార్యదర్శి నివేదిక 18వ పుట 1963 అఖిల భారత తెలుగు రచయితల ద్వితీయ మహాసభ. ప్రత్యేక సంచిక.

### కవిత్వముపై ప్రభావము :

దేశభక్తి కవిత్వము తిరిగి తెలుగులో అలలు అలలుగ పొంగిపొర్లినది. జాతీయోద్యమములో కవిత్వమెన్ని పాయలై ప్రవహించినదో అన్ని పాయలుగా ఈనాడును తిరిగి కవిత్వము విజృంభించినది. వానిని ప్రదర్శింతును.

**వస్త్వాశ్రయ పద్ధతి :** చారిత్రకాదులగు ఇతివృత్తములను స్వీకరించి అన్యాపదేశముగా చైనీయుల పాశవిక తత్వమును సూచించి ప్రజల నుత్తేజితులను చేయుటొక పద్ధతి. తెలుగులో కవితా రహస్యమెరిగిన కొందరీ మార్గమునే అనుసరించినారు.

**మహామరకతము :** ముదిగొండ వీరభద్రమూర్తిగారు రచించిన ఈ కృతి చైనాదురాక్రమణ సందర్భములో వచ్చిన కృతులలో నెల్ల మరకత సదృశమని చెప్పవలెను. కాకతీయ గణపతిదేవుడు పాండ్యరాజు నోడించి అతడు ధరించెడి పెద్దపచ్చ- మహామరకతమును విజయచిహ్నముగా గ్రహించుట ఇందలి కథ. గ్రంథములో నాద్యంతము చైనీయుల దుర్బుద్ధి- దానికి ఫలితము కవిచే సూచింపబడినది. ఓఢ్రయాదవపాండ్యుల మదమడగించినాడు గణపతి దేవుని సేనాని చోడిరాజు. 'ఇతర దేశదురాక్రమణ బుద్ధులు'వారు. అంత్యమున వారు 'పరాజితులై అవమానింపబడుదురని' కవి సందేశ మొసంగినారు. ఇదే దృష్టితో భఖతయార్ ఖిల్జీకథను తామందు ప్రవేశపెట్టినట్లు ముందు మాటలలో చెప్పుకొనినారు.

మారవర్మ కులశేఖర సుందరపాండ్యునికి సచివశేఖరుడు నీతి నుపదేశించెడి సందర్భములో :

> 'సరిహద్దులందు నెందును
> బొర పొచ్చెమురాని యట్లు పాలింపు'మని హితవు గరపును. అంతే

కాక 'కర్మాగార సమూహపోషకుడవై కాదంబరీ పానము న్నిర్మూలింపుమ'ని కోరుట ఆధునిక పరిస్థితుల కనుగుణమైన చిత్రీకరణ 'కర్షకులను బాగుగా బ్రోవదగు బాణవర్షకులనె కాదు వైభవేంద్ర' యనుటలో 'జై జవాన్ - జైకిసాన్' నినాదమున్నది. కొందరు 'కనిబూనుచంద్రు రజితాచలముం బెకలించు పూన్కిమైఁ జైకొనినట్టి రావణుని భీతిగ' ననుటలో అభినవరావణుడు మావో తెల్ల

కొండపై సాగించిన దృష్టి స్ఫురించుచున్నది. ఖిల్జీ సైనికులు చైనీయులవలె 'మంచుకొండ ప్రక్కనున్నరువన్'[1] క్రూరమృగములచే బెదిరినవట

'అడవి జాతివారి నచ్చిన బుచ్చిక
లాడి యుద్ధరింతు మంచు జలికి
వారి యిండ్ల దోచి వారల పసులను
జంపితిని రి ఖిల్జి సైన్యభటులు'[2] అనుటలో చైనీయులు టిబెట్టు మొదలైనచోట్ల జరిపిన పశుకృత్యములు సూచితములు.

"అఖిల ప్రపంచ వేదాంత సారములే మొ
శిఖరమ్ములొప్పిన శిఖరి యెద్ది
సాత్విక గుణసార సంపూర్ణమానస
మన మానస సరస్సు తనరునెద్ది
డేని త్యాగమ్ము గంగానదీ ఝురమొ శౌ
ర్యమ్ము యమునా నదీ ప్రకటితమ్మొ
యుక్తేజము హిమమ్ము మొత్తమ్ములో నిండె
నివురుకప్పిన చంద్ర నిప్పువోలె

భారతీయ జాతి ఖర సంస్కృతి ప్రతి
నిధిగ దనరు నెద్దినింగిముట్టి
యది విభూతి భరత హారతపస్స్ఫిత శరీ
రమ్ము వీప్సహిమధరాధరమ్ము"[3] దాని నెక్కినారు ఖిల్జీ సైనికులు (చైనీయులని ధ్వని) ఇట్లు కథ మొత్తమును నడిపి 'పరసీమల నాత్రినం జనుటో యవమానమో పొసగు'[4] ననెను. భారతకాశ్యపీ ఖండముపై చైనీయులు సాగించిన దండయాత్ర నాద్యంతము స్ఫురి పజేసిన మహాకావ్యమిది!

**విజయముద్ర:** కర్త శ్రీ గాదేపల్లి కుక్కుటేశ్వరరావు చరిత్రలో అలెగ్జాండరు పురుషోత్తముని ఓడించెనని కలదు. అది అసత్యమని నేడెన్నియో

1. మహామరకతము 23వ పుట.
2. మహామరకతము 53వ పుట.
3, 4. మహామరకతము 55వ పుట, 64వ పుటలు.

ఆధారములు లభ్యమైనది. ఇటీవల దొరికిన నాణెములపై పురుషోత్తము డుత్తమ గజముపై నుండి శూలమును గురిపెట్టుచుండగా అలగ్జాండరు తన అశ్వముపై నుండి క్రింద పడినట్లున్నది. ఇవి విజయముద్రికలు. పురుషోత్తముడు పరాజితు డైనచో విజయముద్రిక లెట్లు ముద్రింతురు? కుక్కుటేశ్వరరావుగారి కృతికి చారిత్రకాంశ మాధారము. సావర్కార్ తన స్వర్ణపత్రములలోను, ఢిల్లీలోని రీసెర్చి సంస్థకు చెందిన పి. ఎన్. ఓక్ తన వ్యాసములలోను దీనినే బలపరచి నారు!

ఇందు విదేశీయుడైన గ్రీకు రాజు చైనీయునికి సంకేతము. పురుషోత్త ముడు భారతీయ పురుషోత్తముడే! 'గాజువారిన కన్నుగవఁ గల్గియున్నాఁడు గోధుమ రంగు ముంగురులవాడ'ని అలగ్జాండరును కవి ప్రత్యంగమును వర్ణిం చుట అణగిన ముక్కులతో పొట్టిగా వింతయాకృతితోనున్న చైనీయులను పరిహ సింపఁదలచుటయే! పురుషోత్తము డలగ్జాండరుతో ఇట్లనును:

"ఒక దేశమ్ము మఱొక్క దేశమననేదో లేనిపోనట్టి క
క్షకులోనై కబళింపరేగిన దురాశాభూత మెన్నాళ్లు?" జవహరు నాయ కుడే పురుషోత్తముడు మర్యాదా పురుషోత్తముడని పై పంక్తులలో ధ్వనింపబడి నది.

"తమ పొలిమేర దాటి చరితల్ గనువిప్పిన యట్టి యీ మహా
ర్తము మొదలింతదక్క భరత ప్రభుఁ వెవ్వఁడుగాని యిట్టి దా
హమున నొకప్పుడైనను దురాక్రమణం బొనరించినట్టి ఘ
ట్టము గలదేమొ వెన్కటి పుటల్ పరిశోధనచేసి చూడుఁడీ"

**పురుషోత్తమ చరిత్ర:** పోతరాజు పురుషోత్తమరావుగారు దీనికి కర్త! పురుషోత్తముని ఇతివృత్తమే ఇందును చిత్రితము. 'పరపాలన పీడి తాత్మతను భావించినవారు దైశికోద్యమము తలపెట్టి పరపాలన విమోచనము సంకల్పింపగా తద్భావ సముత్తేజమునకై కవులు కావ్యములల్లిన 'పద్ధతిని పరిశీ లించి కవి దానిని రచించెనని పీఠికలో వివరణము! ఇట్లే వల్లూరి వేంకట రత్నమాచార్యులవారి 'వెన్నుపోటు' 'ఆవేదన' వంటి పద్యకావ్యములెన్నో వచ్చి నవి. ఇందితివృత్తము ప్రత్యక్షముగా చైనా దురాక్రమణమే!!

**ఖండ కావ్యములు :** వస్త్వాశ్రయ కృతులకన్న మిన్నగా ఈనాడు ఖండ కావ్యములు వచ్చినవి. అందు 'సమరగీతి'యను సంకలనము మిక్కిలి ప్రశస్తమై కావ్యధర్మమను కలిగియున్నది !

'ఈ కాశ్యపీ ఖండమెవనిదా? ఎవడు స్వ
  త్వాశ్రియయుతుడో అవ్వాని దౌట
దేవదుర్లభమైన ఈ వసుధ యెవ్వని
  దా? మగటిమిగల స్వామి దౌట
ఈ రత్నగర్భకు నెవడు ప్రభుండని
  య? ఎవడు దక్షుడో అతని దౌట
ఈ నేల నేలగ పూనునర్హత ఎవ
  నిద? దర్పాశ్రియునిదే యిదియు నౌట
కాలసాక్షి ఎరుంగు నకాట్య శస్త్ర
కౌశల శ్రీగలట్టి దోర్ఘనత ఎరుగు
నెరుగు రాఘవు కోదండ మెరుగు సవ్య
సాచి గాండీవటాంకృత శబ్ద గర్జ' అను **ఆవాహనతో** కృతి ప్రారంభము.

**సామ్యవాద నైచ్యము :** విశ్వనాథ సత్యనారాయణగారు సిద్ధాంత పరముగా సామ్యవాదమునకు హైందవమునకు గల భేదమును ఎత్తిచూపి చైనా విజయమందినచో భారతీయుని జీవనమెట్లు మారునో చెప్పినారు.

'ఎన్నగ నీదు తిండి తిననీయడు నిన్ను త్వదిష్ట దైవమున్
పన్నగ కొల్వనీయడును; భార్యయు పిల్లలు దొడ్డిత్రోవ సం
పన్నత నుండనీయ దతిమానవవృత్తము వాని దక్కటా
కన్నుల నప్పగించి కనగా దగునే యరి సంహరింపుడీ' సామ్యవాదములో ఈశ్వరీయమైన భక్తికి తావులేదు. కేవల పదార్థవాదమే ప్రామాణ్యము 'ఇంతటి దేవతా మతిఃహీనుడు లేడను నాస్తికత్వ సిద్ధాంతమునందు తాతలకు తాతగ మారినవాడు' పాపముల చిచ్చెనకున్ తొలిమెట్టు చేరినాడు !

**హింస - అహింస :** ఇట్టి వానిని హింసతోనే కడతేర్చవలెనని గాంధే

యుడైన తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు ప్రబోధించినారు. భారతీయుల అహింసనాత దశక్తత క్రింద పరిగణించినాడు నిజమున కది సహిష్ణుతయే కాని శక్తిహీనత కాదు

"కత్తిని గత్తితో నణపగాదని పల్కెద మింతెకాక యీ
నెత్తురుకూడు కీడని యనిన్ దిగనాడిన క్రీడిధైర్య వి
చ్ఛిత్తియు నింద్యవృత్తియని చెప్పెద ముత్తమ ధర్మరక్షకై
యెత్తిన నాడగత్యమగునేని వరించెద మస్త్రశస్త్రముల్"

ఒక్క 'సమరగీత'లోనే కాక తత్తుల్యమైన 'శంఖారావం' వంటి ఇతర సంకలనములలో కూడ ఈ ధోరణియే కన్పించును వీనిలోని విశేషములనిట్లు వింగడింపవచ్చును

**శత్రువిందు:** డ్రాగన్ పురాణభూతము. చైనీయుల కది సంకేతము. నాయని సుబ్బారావుగారు 'డ్రాగన్ గీత'తో ఘటసర్పమును త్రిశూలముతో సంహరింపవలసినదేనని చెప్పినారు. 'ఈ మంచుకొండపైనే పోరుగద్దరా.... ఈ తుహినాద్రిపైనే త్రాచుపాముురా.... ఈ శీతగిరిపైననే పాడు మొసలిరా.... ఈ హిమాచలముపైనే క్రూరమృగమురా....' యని దూషించినారు. చీనీ సర్పములు కప్పలన్ మెసవి 'నలమందున్' తిని బిలముల్ సొచ్చినవి'. విషాహులకున్ నాల్కలు రెండుకాదు పదివేలుండును' అట్టి చెనటిని సంహరించుటకు ప్రతిన గైకొనవలెనని జాషువా హెచ్చరించినారు. మరొక కవి చైనీయులను 'వెధవ' లనినాడు:

'నేనే తపొ్పనరించినాను వెధవన్నే శీర్షమెక్కించుకున్నానే'

ఐందారు సదాశివరావు

తళ తళ మను బట్టతల కాముదమురాచి
చెల్వొనలైని శిక్షించు' జాషువా.

'ఎవ్వండా దుష్కర్ముం
డెవ్వండా ఖలుడు ధూర్తుడెవ్వడు?' విద్వాన్ విశ్వం.

'నల్లి ద్రావినవ్యాఘ్రాల నాల్కలు శత్రుపతాకములు' దాశరథి.

'కృతఘ్నతరూపుగా నున్న వీని మరణమాసన్నమైనది'

లక్ష్మణమూర్తి.

జరిమీదవ దిలినపాము' తిలక్.

**పురాణగాథా సంస్మరణము:** జాతిలో జవసత్వములను నిద్రలేపు టకు ప్రాచీన వీరగాథా సంస్మరణ మవసరమే! అందును మహిమాలయము శివధామము అట్టిచో రుద్ర తత్వమును జాగృత మొనరించుటకై పురాణ గాథ లను జ్ఞప్తి చేయవలసియున్నది. 'ప్రాణప్రదమ్ము మాకు హిమవంతము. మా కథలెల్ల తద్యశ స్నాతపునీతములు!' (పుట్టపర్తి నారాయణాచార్యులవారు) 'ఇచట పార్వతీదేవి పుట్టింటిపైన ఘటసర్పము దిగినది (నాయని)[1] ఈ పాము మరల నొక గోగ్రహణము చేసినది. "గోవన గోవెకాదు మరి గోవన భూమియు" సంపత్కుమార.

"మెల్ల దావన్ లయగవచ్చిన ప్రల్లదుడు తారకుని త్రుంచగ తెల్లుతెల్లున కార్తికేయులు కొల్లలేదు రిటన్ 'జాగృహి' శీర్షిక 'వాడా వాడొక ధార్తరాష్ట్రిదని' నిందించి సాహిత్యములో కవులు పాంచజన్యము, దేవదత్తము, పాశుపతము, త్రిశూలము శివుని త్రినేత్రము, ప్రాగ్జోతిషదైత్య సంహరణ పాండిత్యము నెఱి గిన చక్రాయుధ భ్రుకుటీ ప్రాకటకోప కార్ముక వినిర్ముక్తాగ్ని కీలలు స్మరణము నకు తెచ్చినారు!

**అంతశ్శత్రువులు:** శత్రువుల కన్నను వారికి సాయము చేసేడి అంత శ్శత్రువుల వలననే ప్రమాద మెక్కువ. అట్టివారు చైనీయుల చర్యలను విమ ర్శింపరు సరికదా ప్రశంసింతురు. చైనీయులకు వ్యతిరేకముగా కవిత్వము వ్రాయుమని కవులను కోరినప్పుడు 'కొందరు ఇన్స్పిరేషను రాలేదన్నారు. దుష్కర ముష్కర పదాలతో వ్రాసే మనస్సు లేదన్నారు'[2]

---

1. భారతమాతను శ్రీదేవిగాను, చైనాసురుని మహిషాసురునిగాను భావించి విశ్వనాథవారు రచించిన కవితామయ శ్రవ్యరూపకము ఈ ఉద్యమకాల ములో మిక్కిలి ప్రసిద్ధినందినది.

2. సమరగీతి పీఠిక. 'వినతి'వే నరసింహారెడ్డి.

"చైనీయులు నా మాతృ కపోలము
స్పృశించుటను కాంచియునావారే
నవ్వెడి నపుంసకావళి కాగా
నిజముగ నేనిక బ్రతుకనేమిటికి ?
పాలుత్రావి రొమ్మును గ్రుద్దెడి యీ
పశువులతో నిక బ్రతుక నేమిటికి ?"[1]

**జాతీయ సమైక్యత :** విఘటనమే శత్రువుకు బలము. ప్రతి క్రియాత్మక భావముతో వచ్చిన సంఘటనము శాశ్వతము కాకున్నను చైనా దండయాత్ర వలన అట్టి సమైక్యత సిద్ధించినది శ్రీ కాళోజీ నారాయణరావుగారు

"ఆంధ్రావళి ఆండదండ ఆ సాముకు అందింపగ
అయ్యర్లకు తోడ్తోడుగ నాయర్లను నిలిపి వుంచ
బదరీనాధుని రక్షకు మధురను కంచిని కదుపగ
కాశ్మీరమునకు జంటగ కన్యకుమారిని నిలుపగ" వర్ణస్వప్నము కనినారు. ఇట్టి ప్రబోధములు ప్రచారముకు ముఖ్యముగా ప్రభుత్వమువారు ప్రచురించిన కవితలలో ఎక్కువగా కన్పడినవి. వాని సారాంశమిట్లున్నది : ('శంఖరావం' మొదలగు (ప్రచురణలు)

**మాతృదేశ వర్ణన :**

'పరమశివుని పుట్టిల్లు' -నాయని
'స్నిగ్ధ హిమాలయ శిఖరాగ్రమ్ములు
శివతాండవ నేపథ్యములోయ్' -కె. రామగోపాలరావు

**అధికోత్పత్తికై ప్రచారము :**

'పొలాలనన్నీ హలాల దున్ని
పంటలు పెచ్చుగ పండిద్దాం
ఫ్యాక్టరీలలో పంట చేలలో
అధికోత్పత్తి సాధిద్దాం' -శ్రీవాత్సవ

---

1. మహోసర్గ. శివప్రసాద్.

**ప్రబోధములు :**

'సైన్యంలో చేరండి'
'పైకెగసే ధరలను దించండి'
'జై హిందని లాభము వదలండి'
'న్యాయంగా సరుకుల నొసగండి'
'జై హిందని భోగము వీడండి'
'దేశానికి త్యాగం సలుపండి' -మల్లవరపు

**త్రివర్ణ పతాక వర్ణన :**

'మువ్వన్నె జెండాలతో
విడరాని బంధాలతో
పోదాము పదవోయ్' -దాశరథి

'జగతిలో ఆ జయపతాక ఛాయలలో చెయిచెయి విడవక సాగవోయీ' వేటూరి.

'ఎగసి ఎగసి వినువీధుల
ఎగురుము విజయపతాకా
నవభారత వీరపతాకా' -ఇంద్రగంటి

**సైనిక ప్రశంస :**

'వీరుడవీవే' 'కానుక'లో బుద్ధిరాజు.
'తరుణ భారత సైనికా
తరుణ మిదియె లెమ్మికా' 'ముందడుగు'లో రజని
'మరతుపాకీ పట్టరా
సరిగా గురి పెట్టరా' -దాశరథి

**వీరపురుషుల సంస్మరణ :**

'రుద్రాంబా మల్లాబిక ఝూన్సీ
బానమాంబ మాంచాల మొదలుగా
వీరవనితలకు కారణమైనది

భారతదేశం....' -పైడిపాటి
'ఝాన్సీరాణి చూపిన దారిని
బాలచంద్రుడు పోరిన రీతిని
నలభై కోట్ల సవ్యసాచులన
సాగించండీ ఘనవిజయం... ' -పట్టపు దశరథరామయ్య
'శివాజి వీరుగన్న ధాత్రి' -కె. వి. సుబ్బారావు

**ఆయుధ ప్రశంస :**

'దుయ్యరే కత్తులు దుయ్యరే
తియ్యరే బాకులు తియ్యరే' -నాయని (పదండి)
'శ్రీతిశూలధారి లేలెమ్మ త్రిపురహరీ' -మల్లవరపు (ప్రమధులు)
'ఖడ్గము బూనుచు కదనుద్రొక్కుచు' -బుద్ధిరాజు (కానుక)
'గుండెలో గుండులు పిలుస్తాం' -పైడిపాటి (దండన)
'మీ చేత తుపాకులు పట్టడీ' -మల్లవరపు (త్యాగం)
'తుపాకి తీసుకో హస్తాన
శత్రువు చావు మూడిందీ' చాశరధి (పిలుపు)
'గాండీవమ్మును నెక్కుబెట్టుచు ...
పాంచజన్యమును పూరించండీ' -పట్టపు దశరథరామయ్య

**సర్వసమర్పణ :**

'ఇదిగో నా శరీరం
ఇదిగో నా సంకల్పం
ఇవిగో ఆభరణాలు
కొనండి మన కాయుధాలు' ఒక పిలుపు (కుందుర్తి)
'చివరి చివరి మా నెత్తురు బిందువు
అమ్మకోసమని అర్పిస్తాం' -పురిపండా అప్పలస్వామి
'నీ సతి మెడలో బంగారపు తాళి
ప్రతిష్ఠ కాపాడటానికి తన
ఇల్లాలి సౌభాగ్యాన్ని కూడ సరుకుగొనని
సైనికుని ఋణం' -వరవరరావు

'గుండె గుండెకొక దీపకరండము వెలిగింది నేడు
శిరము శిరముకొక హిమాద్రి శిఖరము పెరిగింది నేడు
గళము గళముకొక కేసరి గర్జన వినిపించె నేడు
జాతిరక్తమున సాగర చేతన కనిపించె చూడు'

సి. నారాయణరెడ్డి (గుండె గుండెకొక దీపం)

కవితావాసన తక్కువగా నున్నను 'జయభేరి'లోని ఒక గీతములో అన్ని వృత్తులవారను ఎట్లు దేశసేవ కంకితమైనారో వర్ణింపబడినది. రైతు 'భూమిలోన బంగారము తీస్తా'నని ప్రతిజ్ఞ పట్టును. కార్మికుడు 'వస్తూత్పత్తిని హెచ్చిస్తా వైరిజనావళిని గెలిచేస్తా'నని వీరవాక్యము లాలాపించును. షావుకారు 'ధరలు పెరుగుటనే ఆపేస్తా మూటాముల్లెం విప్పేస్తా చీకటి బేరము చిదిమేస్తా'నని చైనా దురాక్రమణలో తన కర్తవ్యమును ప్రకటించును. యువకుడు 'రమ్మీ ఆటలు మానేసి డిటెక్టు షోకును విడిచేసి సోమరినై ఒజారు తిరుగక కదనరంగమున కనిపిస్తా'నను. దేశ నాయకుడు 'గ్రూపు తత్వమును మాపేస్తా - సిఫారసన్నది తుడిచేస్తా'నను. ఉద్యోగి 'లంచం మంచం విడిచేస్తా ఆఫీసన్నది స్వర్గం చేస్తా' నని అవినీతిపై కత్తి కట్టును. స్త్రీ 'పాతాచారం విడిచేస్తా నూతనత్వమును నింపేస్తా'నను సైనికుడు 'శత్రువుల సఫా చేస్తా'నని చెప్పును. కవిగారు 'ప్రబోధాలతో ప్రజలను లేపి కవిత్వాలతో కదిలిస్తా'నను !!

**వచన గీతములు :** పద్య కవితను, గేయకవితను వివరించితిని. వచన గీతములలో వచ్చిన చైనా వ్యతిరేక కవిత్వమును కూడ ప్రసక్తముచేసి ముగించెదను. ఈ సందర్భములో వచ్చిన వచన గేయ సంకలనములలో 'స్రోతస్విని' పేర్కొనదగినది. పరాశరం గోపాలకృష్ణమూర్తి, ముదిగొండ వీరభద్రయ్యలు సంయుక్తముగా రచించి ప్రచురించిన సంకలనమిది. వీరు సామ్యవాదమును, వాదులను కూడ నిందించినారు. సామ్యవాదము ప్రగతికి పర్యాయపదము. అభ్యుదయము తమ లక్ష్యమని వారు చెప్పుదురు. దానిపై స్రోతస్విని కర్తల విసురు చూడుడు :

'జరిగిన మార్పంతా అభ్యుదయం అంటే
పున్నమకంటె అమావాస్య మహాబ్రైట్' పరాశరం వారి గొంతు.

'ఎల్లన్న మొసలిపై ఎక్కి
సరైన దోవలో పడ్డాడు
జానిస మనస్సు నెప్పులు పడ్డది - దుందుభి చొక్కపు బిడ్డను కన్నది'

నాటి రాజకీయ ముద్ర స్పష్టముగా కన్పడెకి పంక్తులివి. బాలగంగాధర తిలక్ ప్రభృతులు ప్రసరించిన కవితామయమైన వచన గీతములు యుద్ధపు సంసిద్ధపు వస్తువు (War made quality) వలెకాక కదనరంగమునకు ప్రజలను జోదులుగా మార్చి ప్రోత్సహించెడి కర్పూర సుగంధిత కవితాఖండికలుగా సాహిత్యములో నిలిచిపోయినవి.

**ఉద్యమ ధర్మము :** చైనా దురాక్రమణమువలన కాని పాకిస్తాను యుద్ధ సమయములో కాని వచ్చిన కవిత్వమంతయును మేలిమి ముత్తెముల పోహళింపుగా నిర్ణయింపలేము. ఉద్యమములలో అట్లు వచ్చుట కూడ సహజము కాదు. కావుననే 'ఓన్నులకొద్దీ సారస్వతం' వచ్చుచున్నదే కాని స్థాయి లోపించినదని కొందఱు విమర్శకులు బాధ పడినారు.[1]

'మనుషులంటే మట్టిబొమ్మలు
కాదుకాదోయ్ - కర్మకాండల
కదనభూముల - కాకలారిన
భారతుల మగబిడ్డలోయ్' అను రచనము నుదాహరించినారు. కాని ఇందాశ్చర్యమేమియును లేదు ఉద్యమ స్రోతస్విని కల్లోలినిగా వర్షాకాలములో విజృంభించినపుడు కల్హారములే విరబూయగలవని ఎవరు చెప్పగలరు? విరబూయ వలెనని ఎవరు శాసింపగలరు??

## పాకిస్తాన్ యుద్ధము

1947 ఆగస్టు 15వ తేదీన ద్విజాతి సిద్ధాంత ఫలితముగా భారత దేశము రెండు ముక్కలైనది. నాడు పాకిస్తాన్ మవతరించినది. పాక్ అనగా 'పవిత్ర'మని అర్థము. మతపరమైన రాజ్యాంగ విధానముకల తమ దేశము పవిత్రమైనదని జిన్నా ప్రభృతులు భావించి పాకిస్తానమను నామమను దాని కొసంగినారు !!

1. 1962 సాహిత్య సమీక్ష - వ్యాసము. శ్రీవాత్సవ జనవరి 63. భారతి.

**శత్రుత్వము :** హిందూస్థానము పాకిస్తానము సహోదరులవలె జీవింపవలెనను భారతీయ నాయకుల కలలు కల్లలై ఆదినుండియును పగటి కలలుగనే మారినవి. పాకిస్తానము అవతరించిన తొలి దినములలోనే కాశ్మీరముపై దండయాత్ర జరిపి 32 వేల చదరపు మైళ్ల భూభాగము నాక్రమించుకొని దానిని 'ఆజాద్ కాశ్మీర'మని పిలిచినది నాటినుండియు 'కాశ్మీరు విముక్తి' జరుగవలెనని అది భారతదేశములో అంతర్భాగమగుటకు వీలులేదని పాకిస్తానము బ్రహ్మాండమైన ఆందోళనము ప్రారంభించినది. ఎన్నో కుట్రలు పన్నినది. 1965 లో జరిగిన యుద్ధమునకు కూడ పాకిస్తాను కాశ్మీరుపై చేసిన ఇట్టి దురాక్రమణమే మూల కారణము.

**కుతంత్రముల పుట్ట :** భారత ప్రప్రథమ ప్రధాని శ్రీ నెహ్రూ 'పాకిస్తానము విద్వేష కుతంత్రముల మధ్య పుట్టినద'ని అభివర్ణించినారు కుతంత్రముల మధ్య పుట్టిన పాకిస్తానము కుతంత్రముల పుట్టయై నిలిచినది. భారతదేశముపైకి ఎన్నోసార్లు అతిక్రమణములు జరిపినది. పాక్ విమానములు భారత గగనతలములోనికి ప్రవేశించి ఎన్నియో ఛాయాచిత్రములను తీసికొని పోయినవి, ఇక్కడ తమ పంచమాంగ దళమును నియమించి రహస్యములను సేకరింపసాగినది.

**కూటములలో చేరిక :** తన సైనిక శక్తిని పెంపొందించుకొనుటకు శాంతి సమయములలో కూడ పాకిస్తానము యుద్ధ ప్రయత్నములను చేసినది. భారతదేశమునకు శత్రువు తమకు మిత్రుడను రాజనీతిని పాటింపసాగినది. సీటో సెంటో వంటి అంతర్జాతీయ రక్షణ వ్యవస్థలలో భాగస్వామ్యమును పొందినది. ఇవి పశ్చిమ రాజ్యములకు చెందినవి. ఒకవైపు వీటితో పొత్తు కుదుర్చుకొని రెండవవైపు చైనాతో చేతులు కలిపినది. 1962 అక్టోబరులో చైనా భారతదేశముపై జరిపిన దురాక్రమణమును చూచి ఆనందించిన వారిలో పాకిస్తానము ఒకటి !! చివరకు తన భూభాగములను చైనాకు దత్తము చేసియైనను 'పిండి-పికింగు'ల మైత్రి నిలిపి భారతదేశమును నిర్వీర్యము చేయవలయునను పన్నాగమును పన్నినది. 1963 నుండి పాకిస్తాను తన దురాక్రమణమును పెంపొందింప సాగినది. కాశ్మీరములో 470 మైళ్ల పొడవున నున్న యుద్ధ విరమణ రేఖను అతిక్రమించినది. 1963లో 448 మార్లు, 1964 లో

522 మార్లు, 1965 తొలి ఏడు మాసములలోను 1800 సార్లు అట్లతిక్రమించి నది ! ఇట్లు యుద్ధమునకు సన్నద్ధమై 1965 లో ఆగస్టు చివరి వారములో వేల కొలది దురాక్రమణ పరులను కాశ్మీరములోనికి పంపి అల్లరులను ప్రారంభించి నది. ఆపై ప్రత్యక్ష యుద్ధము !!

**యుద్ధ సన్నాహములు :** భారతదేశము 1962 లో ఓడిపోవుటతో పాకిస్తానము మన శక్తిని తక్కువగా అంచనా వేసినది. అందుచేతనే ముందుగా కచ్ ప్రాంతములో దురాక్రమణము జరిపినది 16-25 సం॥ మధ్యనున్న యువకులందరికిని నిర్బంధ సైనిక శిక్షణము నిప్పించినది. 8500 మందితో ఒక రజాకారు దళమును, దానికి సహాయముగా 1,50,000 మందితో నొక 'ముజాహిద్' దళమును ఏర్పరచినది మే నెలలో ముర్రీలో 30,000 మందికి తిరిగి గెరిల్లా యుద్ధశిక్షణము నిప్పించినది. దీనినే జిబ్రాల్టర్ సేన యందురు. కాశ్మీరములో అక్రమముగా ప్రవేశించుట వీరి పని. 12 పాక్ పదాతిదళ (బెటాలియన్) సర్వాధికారి మేజర్ జనరల్ అఖ్తర్‌హుస్సేన్ దీనికి నాయకుడు. సరిహద్దు భటులు, రజాకార్లు, ముజాహిదులతో కూడి మొత్తమిది పది బ్రిగేడ్ల స్థాయి కల సేన !! తారిఖ్, ఖిల్జీ, సలావుద్దీన్ ఖాసిమ్, ఖాలిద్, గజ్నవీ, ముర్తుజ్, ఖాజర్‌నస్రత్ సికిందరు లందలి ఆరు విభాగములకును నాయకులు. వీరు మెల్లగా కాశ్మీరములోనికి ప్రవేశింపసాగినారు ఆగస్టు 1 నుండి ఈ కార్యక్రమ మారంభ మైనది. సలావుద్దీను దళము శ్రీనగరమును చుట్టుముట్టినది. ఆగస్టు 8 న పీర్ దస్తగీర్ అను కాశ్మీరు ప్రాంత ప్రవక్త ఉత్సవములో పాల్గొన్న జనసమూహ ములో కలిసిపోయి నగరములోనికి ప్రవేశింపవలెనని పథకము చేయబడినది. ఆ మరునాడు అనగా ఆగస్టు 9వ తేదీ భారతదేశమునకు వ్యతిరేకముగా ప్లెబిసైటు ఫ్రంటు అను ముస్లిము సంస్థ ప్రదర్శనముల నేర్పాటు చేసినది. కాని ఈ కార్యకలాపము లన్నియును వ్యర్థములైనవి స్థానిక ప్రజల సహకారము దురాక్రమణపరులకు లభింపక పోవుటేకాక వారు వీరిని రక్షకభటులకు పట్టి ఇచ్చినారు. ఆగస్టు 5వ తేదీ మొహమ్మద్ దీన్ అను గొల్ల పిల్లవానికి లంచము లిచ్చుచుండగా అతడు పసిగట్టి దురాక్రమణ పరులను పోలీసుల కప్పగించినాడు. అదే దినము వజీర్‌అహ్మద్ అను నొక గ్రామస్థుడు జమ్మూలో మరికొంత మందిని రక్షకభటుల స్వాధీనము చేయించినాడు ఈ విధముగా వీరి తొలి చర్యలు విఫలముకాగా పట్టుబడుటో నిహతులగుటో జరిగినది.

**యుద్ధక్రమము :** దానితో పాకిస్తానము ప్రత్యక్ష యుద్ధమునకు సిద్ధ పడినది. సెప్టెంబరు 8న పాకిస్తానము 90 టాంకులతో ఒక బ్రిగేడ్ బలముతో యుద్ధము ప్రారంభించినది దీనిని వారు 'ఆపరేషన్ గ్రాండ్‌స్లామ్' అని ప్రక టించుకొనినారు. ముందుగా అన్నూర్ అను కీలక పట్టణమును కైవసము చేసి కొనిరి. తర్వాత జమ్మును పట్టుకొని భారత్‌ను అష్టదిగ్బంధము చేయవలెనని వారి సంకల్పము.

కాని భారత నాయకుడు లాల్‌బహదూర్‌శాస్త్రి వామనుడేకాదు త్రివిక్రము డును. మూర్తి ఎంత చిన్నదో కీర్తి అంత దొడ్డది. ఆతడు వాక్శూరుడు కాదు-కార్యశూరుడు. దేశమునకు 'జై జవాన్ - జై కిసాన్' పిలుపునిచ్చి సైనికులకు తోడుగా కార్మికులను కర్షకులను సమాయత్తులను చేసినాడు. జాతి మొత్తము వారి వెనుక నిలిచి వీరోచితమైన పోరాటమునకు సిద్ధపడినది.

ముందుగా భారతీయ వాయుసేన యుద్ధమునకు కదలినది. తొలి దెబ్బ లోనే 13 టాంకులను 40 శకటములను ధ్వంసముచేసి శత్రుగమనము నాపివేసి నది. సెప్టెంబరు 8న పాక్ వాయుసేన సాబర్‌జెట్లను వదలినది. దానికి ప్రతిగా నాడు భారత వాయుసేన తన గ్నాట్ విమానములను వదిలి పాక్ పొంగును చల్లార్చినది. నాటి గ్నాట్‌వీరులు త్రెవర్‌కీలర్, పఠానియాలు.

**శాంతికి తిరస్కృతి :** యుద్ధవిరమణ చేయవలసినదిగా ఐక్య రాజ్య సమితి అధ్యక్షుడు ఉథాంట్ చేసిన విజ్ఞప్తిని పాకిస్తాన్ కాలదన్ని చైనా విదేశాంగ మంత్రిని సెప్టెంబరు 4వ తేదీ తన రాజధానికి పిలిపించి భుట్టో సంప్రదింపులు జరిపినాడు. భారతీయులను 'శునకము'లని నిందించిన తీవ్రవస్థాయిగల ఈతని మనస్తత్వము శాంతికెట్లు సమ్మతించును?

**భారత్ విజయ పరంపర :** సెప్టెంబరు 6వ తేదీ పాక్ విమానదళము అమృతసరము వరకు వచ్చి అక్కడి యాక్-యాక్ యంత్రాలయమును ముట్ట డించినది. దీనితో యుద్ధమును సరాసరి పాక్ భూభాగముపైకి కేంద్రీకరింపవల సిన అవసరమును భారత్ గుర్తించినది. 7వ తేదీ మన సేనలు సియాల్‌కోట ప్రాంతములో ద్విముఖముగా పోరాటము ప్రారంభించినవి

6వ తేదీ పాకిస్తానము 500 మంది సైనికులను గాలిగుమ్మటముల (పారా ట్రూపర్ల) లో భారత సైనిక స్థావరములైన అంబాలా లూధియానా ప్రాంతము లలో దించినవి. కాని ఈ ప్రయత్నమును భారతీయులు ఆదిలోనే తుదముట్టించి నారు.

అపై లాహోరుపై భారతదేశ త్రిముఖమైన ముట్టడిని సాగించినది. ముఖ్యముగా బుర్కి, డోగ్రై గ్రామములలో జరిగిన సంకుల సమరము భారత రాజనీతికొక తురాయి వంటిది. అట్లే సియాల్‌కోట విభాగములో కూడ పాక్ పటాన్ టాంకులను భారతీయులు అగ్గిపెట్టెలవలె కూల్చినారు. పాకిస్తానీయులది కేవల యంత్రబలమైనదో భారతీయులది ఆత్మబలము. ధర్మబలము !! కావుననే మన సేనలు తిలక్‌పూర్ మధుపూరులను స్వాధీనము చేసికొని చక్రపార్ పోవు రోడ్డును ఆకట్టివేసి దిగ్భ్రాంతి కలుగజేసినవి.

8వ తేదీ నుండి 12వ తేదీవరకు జరిగిన యుద్ధము ప్రపంచ యుద్ధ చరిత్రలలో లెక్కదగినది. ఇందు మొత్తము 400 టాంకులు ముఖాముఖీ పాల్గొనినవి. మన ఆయుధ విభాగాధిపతి మేజర్ జనరల్ రాజేందర్‌సింగు పన్నిన అద్భుతమైన వ్యూహము ఫలితముగా పాక్ ఆయుధదళము, పదాతిదళము విడివడిపోయి వేరువేరుగా నాశనము చేయబడినవి. 12వ తేదీ ఫిలోరా కైవస మయినది. తరువాత అలహర్ రైల్వే స్టేషనును పట్టుకొని భావిందేవైపు పురోగ మించినవి. అట్లే రాజస్థాన్-సింధ్ సరిహద్దులలో కూడ భారత్ పురోగమించి గాద్రాను హస్తంగతము చేసికొనినది. ఈ యుద్ధములో 248 టాంకులను భారత్ ధ్వంసము చేసినది. 78 విమానములను నేలకూల్చినది. 120 శత్రు వుల టాంకులను స్వాధీనము కూడ చేసికొనినది !!

**దుష్టతంత్రము :** యుద్ధ రంగములో అయూబ్‌ఖాను ఓటమికి సిద్ధ పడుటతో తన మిత్రరాజ్యములచే భారత్‌పై షడ్యంత్రము పన్నుటను ప్రోత్స హించినాడు. 17వ తేదీని, చైనా, భారత్ తన భూభాగములో ఏవో కట్టడములు నిర్మించినట్లును, వానిని నిర్మూలింపకున్నచో యుద్ధము తప్పనట్లు హెచ్చరిక నిచ్చినాడు. ఇదొక అభూత కల్పనము. దానికి ప్రతిగా లాల్‌బహదూర్‌శాస్త్రి ఇట్లు రెండుసార్లు స్పష్టముగా నొక్కి చెప్పినారు.

“చైనా భూభాగముమీద మేము అక్రమముగా నిర్మించిన కట్టడము లున్నచో వానిని తాము నిరభ్యంతరముగా నిర్మూలించుకొనవచ్చును అంతేకాని మమ్ములను తన భూభాగములోనికి వచ్చి వానిని నిర్మూలింపమనుట నిష్ప్రయోజనము.”[1] దీనితో చైనా తన బెదిరింపును ఉపసంహరించుకొనినది. అట్లే అమెరికా, పాకిస్తాను తిరిగి కోరిన యుద్ధసహాయమును తిరస్కరించినది. దీనితో దౌత్యరంగములో కూడ పాకిస్తానము ఓడిపోయినది!

భారత్ ఇంతటి యుద్ధములో కూడ దౌత్యమర్యాదలను యుద్ధ సంప్రదాయములను విస్మరించలేదు. కాని పాకిస్తానము మత సంస్థలపై బాంబులు వేసినది, వైద్యశాలలపైన పౌరులపైన విమానముల నుండి అగ్నులను రాల్చినది. గుజరాత్ ముఖ్యమంత్రి బల్వంత్‌రాయ్ మెహతా ప్రయాణము చేసెడి ‘సివిల్’ విమానమును కూల్చి ఆయనను చంపినది. ఇంత చేసినను అధర్మమే నశించినది. భారత్ తన వాయుసేనలో కేవలము మూడవవంతు మాత్రమే యుద్ధరంగములోనికి దింపగా, పాక్ దాదాపు మొత్తము [illegible]మును [illegible]పి సగమునకు సగము కోల్పోయినది.

సముద్ర రంగములో కూడ పాక్ యుద్ధమునకు ప్రవేశించినది. తమకు లేశమైనను హాని చేయని ద్వారక స్థావరమును ఎదుర్కొనినది. పాక్ జలాంతర్గామి గాజీ, బొంబాయి చుట్టును కొన్ని దినములు పొంచి పొంచి తిరిగినది. కాని భారత జలాంతర్గాములు దానిని తరిమితరిమి కొట్టినవి!!

పాక్ దీనితో అన్ని విధములను నష్టపోయినది. అస్సల్ ఉత్తర్ ఖేమ్‌కరన్ ఫిలోరాలలోని కీలక యుద్ధములలో సర్వనాశనమును పొందినది. 740 చదరపు మైళ్ల భూమి భారత్ స్వాధీనములోనికి వచ్చినది. కాగా 210 చదరపు మైళ్లు మాత్రమే తాను స్వాధీనము చేసికొనగలిగినది. పాక్ ప్రారంభించిన విమోచనోద్యమమును కాశ్మీరీయులే చిత్తు చేసినారు. ఛాంబ్, డేరా బాబానానక్, ఖియాన్ ప్రాంతములోని తన సైనికపుటొత్తిడి, రాజనీతి ఘోరపరాజయము నందినవి. దీనితో అంతర్జాతీయపు టొత్తిడులకు లొంగి యుద్ధము విరమించినది.

1. 19-9-65 దినపత్రికలో వార్త!

**తాష్కెంటు ఒప్పందము :** రష్యా అధినేత కోసిగిన్, భారత - పాక్ స్థానముల మధ్య నిర్యుద్ధపు టొడంబడిక నేర్పరచి శాంతికై సమావేశమును తాష్కెంటులో జనవరిలో జరిపినారు ఇటు యుద్ధరంగములోను అటు దౌత్య రంగములోను కూడ మన ప్రధాని లాల్‌బహదూర్‌జీ విజయము సాధించి తాష్కెంటు పత్రముపై సంతకముచేసి శాంతికి సోపానములు నిర్మించి హఠాత్తుగా తాను స్వర్గస్థుడైనాడు. దీనితో ఈ వీరగాథ మహాకవులకొక అమరేతి వృత్తమైనది. అపర భారతగాథ- అభినవ కురుక్షేత్రము- జరిగినప్పుడు నవీన వ్యాసులేల తమ లేఖినులతో ఈ యితివృత్తమును పల్కింపక మిన్నకుందురు?

**అపూర్వ ప్రజాచైతన్యము :** ఈనాడు తెలుగునాట కన్పడిన ప్రజా చైతన్యము- అపూర్వము- అద్భుతమది !! ధనమును రక్తమును పంపుటేకాదు దేశభక్తితో శత్రు సంహారమునకై తనువుల వంతెనను కట్టినారు. కరీంనగరము లోని సిరిసిల్లకు చెందిన కెప్టెన్ రఘునందనరావు అఖిల భారత ప్రశంసలనందు కొని ఆత్మాహుతినందినాడు. సాగర తీరమునకు చెందిన పోతరాజు ప్రభృతుల పరాక్రమము వీరత్వమునకొక మేలిమివన్నె !! ఇట్టివారు జ్ఞాతవీరులుం అజ్ఞాతులు ఎందరో !!

1965 ఆగస్టు 16వ తేదీ ఢిల్లీలో అయూబునకు వ్యతిరేకముగా జరిగిన పది లక్షల మంది ప్రదర్శనములోను ఆంధ్రులు పాల్గొనినారు. 'సోలాగస్ట్ భూలోమత్' (ఆగస్టు 16 మరువకుము) 'అయూబ్‌ఖాన్ సావధాన్ జాగ్ ఉఠాహై హిందూస్థాన్' (అయూబ్‌ఖాన్ జాగ్రత్త. హిందూస్థాన్ నిద్ర మేలుకొన్నది) మొదలైన నినాదముల నా ప్రదర్శకులు తిరిగివచ్చి తెలంగాణమంతటను నింపినారు !! ప్రజాగీతములతో ప్రాంతము మార్మోగినది.

ఆంధ్రదేశములో నాడు జరిగిన సభలు సమావేశముల నుదాహరించినచో అత్యుక్తిగా తోచును. రెండవ జాతీయోద్యమమా ? అనిపించినది ధనికులంద రును 'బంగారు బాండ్లలో పెట్టుబడికిగాను విరివిగా స్వర్ణం సేకరించేందుకు ఒక ప్రత్యేక ఉద్యమం'[1] స్వీకరించినారు నాడే సమావేశములు జరిగినను "భారత-

1. 10-11-65 జంటనగరములలోని వివిధ వ్యాపార సంఘముల ప్రతి నిధుల సమావేశములో తీర్మానము. పత్రికా వార్త.

పాక్ యుద్ధ సందర్భముగా రచింపబడ్డ ఉత్తేజాత్మకమగు మంగళగీతికలతో"[1] సభ ముగియుచే! జాతీయ సమైక్యతా దినములు గ్రామగ్రామమున నిర్వహింప బడినవి. పాఠశాలలలో కళాశాలలలో ఇట్టి నిర్వహణమొక ఉద్యమముగా సాగినది. నాడు పాఠశాలలో విద్యార్థుల ప్రతిజ్ఞలివి: "కరీంనగరు జిల్లా కల్వకుర్తి తాలూకా మాడుగుల హైస్కూలు విద్యార్థులు ఉపాధ్యాయులు హోమ్‌గార్డులు కలసి 20-10-65 తేదీన జాతీయ సమైక్యతా దినోత్సవం బ్రహ్మాండమైన ఊరేగింపుతో జరిపారు.... భారతీయులంగా యావన్మంది మీ సమైక్యతతో వుందామనిన్నీ దేశం యొక్క ప్రమాద పరిస్థితుల్ని ధైర్యంగా ఎదుర్కొందామనిన్నీ, కష్టించి అధికాహారోత్పత్తిని సాధిద్దామనిన్నీ, దేశాన్ని కాపాడటంలో ప్రభుత్వానికి అండగా నిలుద్దామనిన్నీ ముక్తకంఠంతో యావన్మందీ దీక్ష స్వీకరించారు. గ్రామ సర్పంచ్ శ్రీ రామలింగారెడ్డి, దళాధిపతి, ప్రధానోపాధ్యాయులు పాక్, చైనా దురాక్రమణలను ఖండిస్తూ ఉపన్యసించారు."[2] ఇట్టి సమావేశములు వేనకువేలు జరిగినవనుట అతిశయోక్తి కాదు!

**రచయితల కర్తవ్యము:** కవులు తమ కర్తవ్యము నేమాత్రమును విస్మరింపలేదు. వివిధ రచయితల సంఘములును చిత్తశుద్ధితో మాతృదేశ సంరక్షణమునకు తీర్మానములు చేసి అమలుపెట్టినవి. 'సరిహద్దులలో పోరాడుతున్న జవాన్లకు అభినందనలూ, మృతవీరులకు జోహార్లూ అర్పించారు. రచయితల సమితి ఆంధ్ర రచయితల తరపున సంపూర్ణ సహకారాన్ని రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలకు వాగ్దానం చేసింది రచయితలు దేశభక్తి గీతాలు వ్రాయాలని తీర్మానించారు."[3] "నేడు భారతదేశం మిక్కిలి క్లిష్టపరిస్థితులలో ఉన్నది. దాదాపు ఇదివరకు ఎప్పుడూ మనం ఎదుర్కొననంత విపత్కర స్థితి ఇది. లభించిన స్వాతంత్ర్యాన్ని జాతి నిలుపుకొనగలదా? లేదా? అన్నది నేటి సమస్య.... కాబట్టి తెలుగు రచయిత పై విషయాలలో శ్రద్ధ వహింపవలసిందిగా మేము విజ్ఞప్తి చేస్తున్నాము"[4] విజ్ఞుల విజ్ఞప్తులు ఫలించినవి. తెలుగు కవి

1. 20-10-65 కృష్ణాజిల్లా ఆకునూరు సభ. వార్త.
2. పత్రికా ప్రకటన.
3. అఖిల భారత తెలుగు రచయితల సమితి దామోదరం సంజీవయ్యగారి అధ్యక్షతన అక్టోబరు 20, 1965 నాడు చేసిన తీర్మానము.
4. రచయితల కర్తవ్యం. కృష్ణాపత్రిక సంపాదకీయము 19-6-1965.

కలమును కాహళిగా ప్రయోగించినాడు. కవిత్వముద్యమాత్మకమై కట్టలు త్రెంచు కొని ప్రవహించినది. ఆ కథనిక చెప్పెదను.

## కవితపై ప్రభావము :

భాషపేర ప్రాంతముల పేర దేశము విచ్ఛిన్నమగుచున్న కాలములో చైనా దండయాత్ర పాక్ యుద్ధములు విద్యుదాఘాతములవలె వచ్చి జాతిలో తాత్కాలికమే అయినను తీవ్రమైన జ్వలితజ్వాలను ప్రవేశపెట్టినవి. ఒకటి సామ్యవాదముపై విరక్తిని కల్గింపగా, రెండవది మన మత ప్రమేయములేని రాజ్యతత్వమునకు వన్నె తెచ్చినది !!

**వస్త్వాశ్రయ కృతులు :** ఈ యుద్ధములో వస్తువు నాశ్రయించి మహా కావ్యములు వెలువడకపోవుట కొక ప్రముఖ కారణమున్నది. 1966 జనవరి 10వ తేదీ తాష్కెంటులో రష్యా ప్రధాని కోసిగిన్ పౌరోహిత్యములో జరిగిన భారత - పాకిస్తానముల శాంతి సంభాషణలలో ఒక యొప్పందము జరిగినది. అందు "ఒక దేశానికి వ్యతిరేకంగా మరొక దేశం ప్రచారం జరపకుండా నిరుత్సాహపరచాలని ఉభయ దేశాల మధ్య స్నేహసంబంధాలను పెంపొందించే ప్రచారాన్ని ప్రోత్సహించాలని ఉభయ నాయకులు అంగీకరిస్తున్నారు."[1] తత్ఫలితముగా వ్యవధితో నిర్మించదలచిన మహాకావ్యములను పెక్కింటిని కవులు గుణాఢ్యుడు చేసినట్లు చేసినారు. మిగిలినవారు దీనిని ఇతివృత్తముగా స్వీకరించుటకు వెనుకంజ వేసినారు !!

కాని సమతమునకు శాంతికి కూడ సారధ్యము వహించిన, తాష్కెంట్ అమరవీరుడు లాల్‌బహదూర్‌జీ స్మృత్యర్థము పెక్కు గ్రంథములు వెలువడినవి. ముదిగొండ వీరభద్రమూర్తిగారి ఝాన్సీరాణి, మొదలైన వస్త్వాశ్రయకృతులు కూడ పాకిస్తాన్ యుద్ధమునాటి ప్రజాచైతన్యమును పరోక్షముగా ప్రవృద్ధము చేసినవి. వేముగంటి నరసింహాచార్యులవారి 'వీరపూజ' వంటివి యుద్ధము మధ్యలోనే వెలువడి ప్రజల నుత్తేజితులను చేసినవి. శాస్త్రీజీపై వచ్చిన రచనలలో కథాకథన పద్ధతిలో రంగకృష్ణమాచార్యుల వారి కృతి ప్రశస్తమైనది :

---

1. తాష్కెంటు ఒడంబడిక. పూర్తి పాఠము. ఆంధ్రప్రదేశ్ మార్చి 1966 46వ పుట.

**లాల్‌బహదూరీయం :** ఇది త్ర్యస్రగతిలో నడచిన రచన.[1] శ్రీ శాస్త్రి జీవితము అభినవ మహాభారతము. కావుననే ఆదిపర్వము నుండి తాష్కెంటు పర్వము, స్వర్గారోహణ పర్వమువరకు పదునెనిమిది పర్వములుగ విభజించి నారు. కవిత చమత్కృతుల యెడ శ్రద్ధ వహింప కథాకథనమునకే ప్రాధాన్య మిచ్చినది.

> 'పతివ్రత రామదులారికి వ్రతమన్నను మతమన్నను
> ఘనతర విశ్వాసముంచి మనసారగ చేయుచుండ
> శారదప్రసాదు పాఠశాలయందు అధ్యాపక
> వృత్తి స్వీకరించి....' ఇట్లు రచన సాగినది.

**సంకలనములు :** ఈ సందర్భమును పురస్కరించుకొని వచ్చిన సంకలనములలో 'సమరభారతి' కవితాగుణములో ఉత్తమ శ్రేణికి చెందినది.

> 'ఉత్తిష్ఠత సన్నహ్యధ్వ ముదారాః కౌతుభిస్సహ
> సర్పా ఇతర జనారక్షాం స్వమిత్రానను ధావత-
> తెండు రెండు ధ్వజములతో
> పోరుకు సిద్ధముకండహో
> త్రాచులవలె దైత్యులవలె పైబడు
> విరోధి మూకల వెన్నాడుడహో' అని 'భూమిక'తో కృతిని తెరిచి

నారు. 'భారతదేశం ఏ దురాక్రమణ దారుకూలొంగిపోకూడదు అంతేకాదు వాణ్ణి అర్థగించాలి కూడా' అని మహాత్మాగాంధీ 1942లో చేసిన ప్రబోధమునకు వీరు ప్రముఖ స్థానమిచ్చి దానిని సాకారముగా ప్రదర్శించినారు.

**వీరసంస్మరణ :** యుద్ధ రంగములో మాతృపద పద్మముల కడ అసువులను దరహాసముతో సమర్పించిన వీరు లిందు పలువురు కవులచే వివిధ ఖండికలలో స్మరింపబడినారు !

> 'అబ్దుల్ హమీద్ ! బి. ఎస్. సంధూ
> పూనంసింగ్ ! పెరుమాళ్ ! లక్ష్మణన్

---

1. శ్రీ ముదుంబ రంగకృష్ణమాచార్యులు.

గురుబక్ష్‌సింగ్ ! ఇంకా ఇంకా
జవాన్ ! పైలట్ ! కల్నల్ ! కెప్టెన్
బహుళ నామముల భారత సోదర
భారతజాతి ఉదాత్త ప్రతీకా

భారత జాతికి కార్యపతాకా' అని వే. నరసింహారెడ్డిగారు ప్రశంసించినారు. ఇందు స్తుతింపబడినవారు అమరవీరులు. అగేబఢో 'పరమవీరచక్ర' బిరుదమునందిన హవల్దార్ అబ్దుల్‌హమీద్ నోట వెడలిన చివరి వాక్యము. కానూరు రంగములో తానొక్కడు ! శత్రువులకు చెందిన నాలుగు పాటన్ టాంకులు ఆయనను చుట్టుముట్టినవి ఒకదానిని విధ్వంసము చేసినాడు. రెండవ దానిని దగ్ధము, మరునిమిషములో మూడవ దానిని భస్మీపటలము చేసి శత్రువులు కాల్పుల వర్షము కురిపించుచున్నను రక్తసిక్తుడై నాల్గవ టాంకును కూడ కూల్చి అసువులు కోల్పోయినాడు !! 'చూడు నాన్నా నా వీపులో ఏమైనా శత్రువుల గుండ్లు వున్నాయేమో'- ఇవి తన్ను సైనిక ఆస్పత్రిలో చూడవచ్చిన తండ్రి సర్దార్ పూరణ్‌సింగ్‌తో ఎదలో తొడలో గుండ్లు దూసుకొనిపోయిన బి ఎన్. సంధూ అనినమాటలు ! 'అదిగో మన విమానం' మాటలని విమానమును భద్రముగా అప్పగించి అమరుడైన వీరుడు గురుబక్ష్‌సింగ్. ఇట్టి వారి సంస్మరణ పై పంక్తులలో చేయబడినది !

'వీరుడు అబ్దుల్ హమీద్ - ఇంద్రుడు - పాటన్‌లు గిరులు
భీముడు అబ్దుల్ హమీద్ - టాంకులు దుర్యోధను తొడలు
హనుమడు అబ్దుల్ హమీద్ - టాంకులు ప్రహస్తుని ఒడలు
గరుడుడు అబ్దుల్ హమీద్ - టాంకులు కదలెడి డ్రాగన్‌లూ'-

—కాళోజీ !!

**పురాణగాథా సంస్మరణ : 'మళ్లీ మహాభారతమే'[1] జరిగినది.**

'సైరంధ్రి అవమానిత అయినప్పుడల్లా
కీచకవధ జరుగక తప్పదు' సైరంధ్రి. మాతృభారతి. కీచకుడు పాక్ దురాక్రమణపరుడు,

1. కాళోజీ.

'కాశ్మీర కుంకుమ మలదిన నా భారతి
సిగబట్టి చిచ్చు రగిలించాలని
పాక్ దుస్సేనుడు పగటి కలలు కంటున్నాడు'[1]

**శత్రునింద :**

'ఇకరారా! నిల్చున్నాను నేను
ఇకరారా సవాలు చేస్తున్నా నేను
నీ గుండెమీద తన్నుతూ
ఒకటా రెండా ఎన్నాళ్లు
నిండా నిండా పద్దెనిమిదేండ్లు
కరుడు కట్టిన నా క్రోధం
నిన్ను దహించే పండగ ఇది'[2]

**త్యాగమునకై పిలుపు :**

'వేళ్లని రక్తంతో తడపకుండా
బ్రతుకు ఎలా పూస్తుంది
త్యాగాలను ఎరువు వేయకుండా
బ్రతుకు ఎలా ఫలిస్తుంది'[3]

**యుద్ధజ్వాలలు :**

'జీలం నదిలో నౌకావిహారాలు కాదు నేడు
శ్రీనగర్‌పై శత్రువిమానాలు చూడు
ఆ అంగళ్లలో పోసిన ఆపిల్ పండ్లు కాదు
అంగట్లో విషం దాచి ఇగిలించిన ఆ పండ్లుచూడు
ఇవ్వాల్టికి స్కేటింగ్ మాను

---

1. వరవరరావు.
2. బండారు సదాశివరావు.
3. సురమౌళి.

మనుషులు కాదు మారణాయుధాలు
ఆడుకుంటున్నాయి మంచుమీద ఈరోజు'[1]

'రణకవితా శిశువు శివభక్తికి మల్లే విరబోసుకు ముందు కమాంతం దూకింది దాని కళ్లనుండి నెత్తురు గొట్టంలా చిమ్ముతున్నది.'[2]

**ఇతివృత్త గౌరవము:** జాతీయ కవులకు ఇన్నాళ్లకు వీరోచితమైన ఇతివృత్తము లభ్యమైనది. మనసు నిండుగా ఎదలు మండగా కవనమును కణ కణ లాడెకి గంధకపు కాల్వలుగా పారింపదగిన ఇతివృత్తము కావుననే కల ములు కాలనాగులైనవి.

'నా కలంలో నాగుపాముల బుసబుసలు, గ్రీష్మతాపపు నిప్పులు ప్రళయ గర్జా భయదధ్వనులూ, క్రోధఘూర్ణిత సింహ నేత్రజ్వాలలూ'[3]

'ఎన్నాళ్లకి చేరావీ ఆవేశ శిఖరానికి
బాటలు తోటలు గిరినిర్ఝరాలు
పాటలు పద్యాల్ వాద్యస్వరాలు
ప్రణయం పంపినమం దమరుత్తులు
ధమరం క్రక్కిన ధణధణలూ
లయహీనపు సంద్రపు ఘోషలు
నురువులు క్రక్కే జవనాశ్వపు హేషలు
చల్లని చంద్రుడు తెల్లని వెన్నెల
గాలిని కదిపే కిన్నెరపాటా
నల్లనిరేయీ ఒంటిగ యెంకీ....' ఇవేవియును కవిని 'ఉద్రిక్తుని చేసి' 'ఆవేశ శిఖరి'కి చేర్చలేదు. నేడు మాత్రము నూతన కవితా వస్తువు లభ్యమైనది. "గుండుగుండుకొక జీవం రాల్చె మరతుపాకి- సైన్యం గడచిన బాటలు పేటలు। జవాను దాటిన గిరులూ నిర్ఝరులూ। శత్రువు రక్తం దోసిళ్లతో త్రాగిన సిపాహి విజయోత్సాహం"[4] వీరోచిత కావ్యవస్తువులు !!

---

1. వరవరరావు
2. అనుముల కృష్ణమూర్తి.
3. బం. సదాశివరావు.
4. వీరభద్రయ్య.

విజ్ఞత :- లోగడ తెలియక మోసపోయినాము కాని నేడిక పొరపడు నది లేదు.

'తెలిసీ తెలియక చేసిన తప్పుల
మలిపికొనేందుకు నడువుడు- ముందుకు'[1] అని ఈ రణయజ్ఞములో పాల్గొనుటయే పాపపరిహారమనుచున్నారు కవులు. మనము విజ్ఞులమైనాడు కాని శత్రువు అజ్ఞత తమాలవనవాటివలె దట్టముగా, కాటుక కొండవలె సాంద్రముగా, చీకటిగా మారుచున్నది

'పాకిస్తాన్ యమనియంత కింకర శ్రేణులు మానవతా ధర్మాలవిడచి
అంబాలా జలంధర్ అమృత్‌సర్ నగరాలలో
హాస్పిటళ్లపై పౌరుల యిళ్లపై మసీదుల చర్చిల గురుద్వారాలపై
బాంబుల అంగారవృష్టి కురిపించగా, న్యాయం చచ్చినప్పుడు' చీకటి వికటాట్టహాసము చేయుచున్నదట ! నేడు విజ్ఞతకు అజ్ఞతకు మధ్య సంగరము మొదలైనది. విజయ మెవరిదని కవులు ప్రశ్నించినారు.

"శాంతి విహంగాల రెక్కలను ముడిపించు
కాదంటే కత్తిరించు"-[2] ఈ వాక్యము రెండు సిద్ధాంతముల మధ్య, రెండు యుగముల (నెహ్రూజీ - శాస్త్రీజీ)ల మధ్య జరిగిన సంఘర్షణమును సూచించుటకై కవి వచించినాడు !! నాడు కావలసినది శాంతికాదు శాంతి కొఱకు యుద్ధమని కవి ప్రబోధము.

"పంజాబు నదులు హిమాంశువుల్తో కాదు
నెత్తుటితో తలంటి పోసుకున్నవీ రోజు"[3] శాంతి వలదనుట కన్న శాంతికొఱకు యుద్ధమని దీనిని వ్యాఖ్యానించుట సముచితముగా నుండును !

**శ్రద్ధాంజలి :** పాకిస్తాన్ యుద్ధమునాటి ప్రజోద్యమములోను కవిలోక మందలి చైతన్యములోను, కన్పడిన ప్రముఖ రీతి లాల్‌బహదూర్‌శాస్త్రి గారికి శ్రద్ధాంజలి సమర్పించుట. ఇటు సమరమును, అటు శాంతిని సమరసముగా

---

1. వే. నరసింహారెడ్డి.
2, 3. వరవరరావు.

నడిపి జాతీయ మహాయజ్ఞమునకు తాష్కెంటులో తానే బలియైపోయిన అమరవీరు డాయన. కావుననే శాస్త్రీజీని ప్రశంసింపని తెలుగుకవి నాడు లేడు. ఆయనకు పద్యకుసుమములతో నీరాజనముందీయని ఆంధ్రుడు లేడు. స్వర్గీయ శాస్త్రీజీ చితాభస్మ కలశమును ఆంధ్ర ముఖ్యమంత్రి ఢిల్లీనుండి తీసికొనిరాగా,[1] తోట రామస్వామిగారు గోదావరిలోను,[2] ఏ సి. సుబ్బారెడ్డిగారు కృష్ణానదిలోను[3] చితాభస్మమును కలిపినప్పుడు కన్నీరుమున్నీరై విలపించని తెలుగువాడు లేడు. 'అశ్రుమాల'లో మహాకవి జాషువా

"ఏ విమానమెక్కి యేగెనో తాష్కెంటు
కా విమానమందె హస్తిపురికి
వచ్చెనయయొ శాస్త్రి భౌతికదేహంబు
కాలుదెట్టి యైంద్రజాలికుండా" [4] అని గుండెలు పిండునట్లు కవిత సల్పినారు. మొత్తముమీద పాకిస్తాన్ సంగరమునాటి కవితోద్యమమునకు విజయము, విషాదము. రెండును సమానేతి వృత్తములైనవి. వీరము, కరుణ, సమానముగా పరిపోషింపవలసిన రసరాజములైనవి !! తరతరములును జాతి మరచిపోలేని అమరగాథ యిది !!

## బంగ్లా పోరాటము

ఆధునిక నాగరికత హద్దులను చెరిపివేసినది. ఆఫ్రికాలో, అడిస్ అబాబాలో జరిగెడి సంఘటనలకు ఆంధ్రప్రదేశ్‌లో స్పందనలు కన్పించుచున్నవి. అట్టిచో సరిహద్దు దేశములు తమ ప్రకంపములను భారతములోనికి వ్యాపింప చేయుటలో ఆశ్చర్యమేమున్నది? 1947 లో మతప్రాతిపదికపై భారతదేశము విభజింపబడినది. పాకిస్థానము తూర్పున, పశ్చిమమున అవతరించినది. తూర్పు పాకిస్థానము తనపై పశ్చిమ పాకిస్థానము సాగించెడి పైతనమును ఒప్పుకొనలేక 1970 తరువాత తిరుగబడ్డది. మతము ఈ రెండు దేశములను కలుపలేకపోయినది. పశ్చిమ పాకిస్థానమును పాలించెడి జనరల్ యాహ్యాఖాన్, టిక్కాఖాన్‌లు

---

1. జనవరి 24, 1966.
2, 3. జనవరి 25, 1966.
4. 'ఆంధ్రప్రదేశ్' మార్చి 1966, 13వ పుట.

తూర్పు పాకిస్థానముపై తమ కరాళ పదఘట్టనను సాగించినారు. షేక్ ముజీబుర్ రహమాన్ నాయకత్వంలో తూర్పు పాకిస్థానము విరిగిపడ్డది. పద్మావతి రక్తసిక్తమైనది. ఈ క్రూర దమనకాండకు ప్రపంచమంతయును పరితపించినది. తెలుగు కవి కలమును, గళమును విప్పి బంగ్లా సోదరుని స్వేచ్ఛా పిపాసకు బాసటగా నిలిచినాడు. నాటి భారత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ సహాయముతో తూర్పు పాకిస్థాన్ స్వతంత్ర బంగ్లాదేశ్‌గా అవతరించినది. ఈ వీరోచిత సంఘటనములే బంగ్లా స్వాతంత్ర్యోద్యమ కవితగా రూపుదిద్దుకున్నవి.

**ముక్తధాత్రి :** క్రౌంచ మిధున వియోగముతో వాల్మీకి శోకము శ్లోకమైనట్లే బంగ్లా అనాథల ఆర్తనాదాలతో తెలుగు కవి హృదయము కన్నీళ్ళతో కవిత్వమును, రంగరించి వర్షించినది. శ్రీ మాదిరాజు రంగారావు రచించిన ముక్తధాత్రి ఈ ఉద్యమ కవితలో మేలుబంతి అయిన రచన. బంగ్లాలో విప్లవము, ముజీబ్‌ను బంధించుట, ఇండియా విమోచన సేనలను పంపుట, స్వతంత్ర బంగ్లాదేశ్ అవతరణ, గుర్తింపు, ముజీబ్ విడుదల వంటి సంఘటనలన్నియును ఈ లఘుకావ్యములో కవితామయముగా చిత్రింపబడినవి. ఉద్యమ కాలములో అనగా 1972 లోనే ఇది వెలువడుట విశేషము. ఇందులో అనలతోరణము, జ్వాలా తరంగాలు, విలయచక్రము, విజయవర్షము అన్న నాలుగు శీర్షికలున్నవి. పచ్చదనమును దహించు గ్రీష్మపు వెచ్చదనమును కవి యాహ్యా సైనికులకు సంకేతముగా స్వీకరించి, ఇండియా విమోచన సైన్యమును అమృత స్వాతంత్ర్య వర్షదళముగా వర్ణించినారు. "ఈ గాలిలో అణువణువులో అమర్‌బంగ్లా స్వరారకం, ఈ భూమిలో అణువణువున సోనార్‌బంగ్లా శక్తినాదం" అనే పంక్తులతో ఈ కావ్యము ప్రారంభమైనది. శరీరంలో ప్రవహించే రక్తధునీతతుల వలె మహానదులు, ఉపనదులు బంగ్లాదేశ్ నిండా వ్యాపించి ఉన్నవి. అయినను ప్రజలలో దుర్భర దారిద్ర్యము. శరణార్థుల ధనము, మానము కొల్లబోయి మిగిలి ఒకే ఒక ప్రాణము ఎగిరెగిరిపోయే పక్షులు సీమదాటి ఆకులవలె ఉన్నారట. "ఉదయకాలపు సాయం వేళల నీడలు ఎదురెదురై క్రమ్మికొని నిలిచాయి పందిరివలె" ఇంతలో నక్కలు, సింహాలు, పులులు జనపదములలోనికి వచ్చి ప్రజలను అడవిలోనికి తరుముచున్నవట. ఈ క్రూర జంతువులు యాహ్యా సైనికులకు సంకేతము. ముజీబ్ నెత్తురు మడుగులో విరిసిన అగ్నిపద్మం వలె ఉన్నాడట. చీకటిలో దీపశిఖ, అడవిలో సదస్సు, దైన్యంలో వసంతం అతడే వంగనేత.

అతని కళ్ళముందు కపోతాలు శ్రేణులు శ్రేణులుగా సాగి సైనికుల శిరస్త్రాణాల పై ఆయుధాల చివరలపై ఆగి ఆగి ఎగసాయి పైకి" శాంతిభావనలు పావురము లతో పోల్చబడినవి.

ఇట్లే ఎన్నో ఖండికలు, ఖండకావ్యములు ఈనాడు వెలువడినవి. శక్తి బెనర్జీవంటి వారి కవితలు తెలుగులోనికి అనువదింపబడినవి. అబూ హెనా ముస్తఫా కమల్ రచనలకు శ్రీ లక్ష్మణమూర్తి అనువాదము ఇట్లున్నది" ఈ ప్రశాంతిని, నిర్మలనీల సరస్సుని, చల్లని పలెపట్టుని, పసిపాపల నవ్వుని, పావురం గుస గుసని, బంగారు పుష్పపాటని నీవు నేనూ పంచుకున్నాము." సమకఫధే బంగ్లా అనే కవితా సంకలనము ఈ కాలములోనే వెలువడినది. ఇందు దాశరథి, ఎం. వీరభద్రయ్య, ఉండేల మాలకొండారెడ్డి, వై. నరసింహారెడ్డి, ముదిగొండ శివ ప్రసాద్, లక్ష్మణమూర్తి వంటి వారి కవితలెన్నియో కలవు. బంగ్లాదేశ్ మొత్తము ఒక బ్లడ్ బ్యాంక్‌గా వర్ణింపబడినది. శ్రామికుడు నెత్తురుచుక్క విత్తనాలుగా చల్లుమన్నాడట. శ్రీ ఎం. వీరభద్రయ్య స్వర్గనరకాలు పేర కథాత్మకమైన వచనకవిత్వము వ్రాసినారు. పాక్ సైనికుల దారుణానికి గురైన ఒక బంగ్లా కుటుంబ విషాదగాథ ఇందులో చిత్రింపబడినది. ఈ దారుణాలు చూడలేక చంద మామ ముఖముపైన నల్లని బట్ట కప్పుకున్నాడట. నడి చెయ్యని వెదురుబొంగులు దయ్యాల్లా నిలబడ్డాయి. కరిగిన ఆశల్లా పద్మ ప్రవహిస్తున్నదట. "సాక్షులై నిల్చున్నవి లక్షల నక్షత్రాలు. కళ్ళ నీళ్ళు పెట్టుకున్నవి అచట క్షేత్రాలు" అని నారు 'గూబల రాజ్యం'లో శ్రీఉండేల మాలకొండారెడ్డి యాహ్యాఖాన్‌ను అభినవ రావణునిగా శ్రీ దాశరథి ఉపమించి 'బంగ్లా స్వాతంత్ర్యోద్యమ సూర్యకిరణ మును కత్తులెట్లు నరుకగలవని' తమ కవితలో ప్రశ్నించినారు.

ఉద్యమ స్వభావము ననుసరించి అసంఖ్యాక రచనలు 1971 నుండి 1973 వరకు పుంఖానుపుంఖముగా వెలువడుచునే యున్నవి. స్వతంత్ర బంగ్లా దేశ్ అవతరణతో క్రమముగా ఈ కవితా ప్రవాహము నిలిచిపోయినది.

## షష్ఠాధ్యాయము

# రాజకీయోద్యమములు

## (ప్రాంతీయములు)

**ఆంధ్రోద్యమము :**

"నా జాతిపూర్వ ప్రథాజీవ రహితమై
శక్తి నాడులయందు చచ్చిపోయి....
నా మాతృభాష నానా దుష్టశక్తుల
యౌద్ధత్యమును తల నవధరించి,
ఏమి మిగిలిన దీ నాటికిట్లు పొంగు
లొలయు వర్షానదీ గభీరోదకముల
దైన్యగర్భ చారిత్రముల్ దక్క భిన్న
గిరిశిఖర దుర్గ పరిదీన గీతిదక్క" అని కవిసమ్రాట్టు చేసిన

విలాసమునకెంతో పూర్వరంగమున్నది. ఈ ఉద్వేగ మొక్కనాడు తెలుగు సుకవిరాజు యెదలో మ్రోగిన మురళీ సంగీతము కాదు. దీనికొక సుదీర్ఘమైన రాజకీయ చరిత్రము, ఉద్యమము, ఏబది వత్సరముల సంఘర్షణము కలదు. దీనినే 'ఆంధ్రోద్యమ' మందురు !

**జననము :** శాతవాహన, పల్లవ, చాళుక్య, కాకతీయ, విజయనగర సమ్రాట్టుల చల్లని పాలనముతో 'శ్రీలు పొంగిన జీవగడ్డ'యై నిలిచిన తెలుగు నాటిని - ముక్కోటి ఆంధ్రుల నొక్కటిగా చేయవలయునను వాంఛ అటు జాతీయోద్యమముతోపాటు ప్రారంభమై, జాతీయోద్యమానంతరమొక ఆరు సంవత్సరముల కాలము సాగినది. అటు బొంబాయిలో జాతీయ కాంగ్రెసు ప్రారంభము - ఇటు ఆంధ్రోద్యమ ప్రారంభము - రెండును ఒకేసారి జరుగుటకు కారణము లేక పోలేదు. నాడు ఆంధ్రోద్యమ మనగా ప్రత్యేక రాష్ట్రము - దేశవిచ్ఛిత్తి యను భావము లేనేలేదు ఆంగ్లేయులను పారద్రోలెడి జాతీయ కార్యక్రమములో ఇది అంతర్భాగమే ! అందులకు బాపట్లలో ప్రథమాంధ్ర మహాసభ సందర్భములోని ప్రసంగములు పత్రికల సంపాదకీయములు తార్కాణములు.

"దేశభక్త విహార ప్రదేశమగుచు
సాధుజన నివాసంబగు సౌధమగుచు
భరతమాతకు ముద్దు కొమరిత యగుచు
నలరి మన యాంధ్రమాత వర్ధిల్లెడుగాత"[1]

"ఆంధ్రోద్యమము జాతీయాదర్శము చేతనే ప్రేరితమగుచున్నదనుట నిశ్చయము"[2] ఆంధ్రులు, ఒరియా తమిళ కన్నడ ప్రాంతముల వారిచే బాధనొందుట ఆంధ్రోద్యమమునకు మూలకారణ మను వ్రాతలు,[3] ఉద్యమ ప్రారంభ దినములలోని చరిత్రకు విరుద్ధములు. ఆంధ్రులు బక్కా యుద్ధ కాలమునుండి సైన్యములో చేరరాదను నిషేధమును విమర్శించుచు శ్రీ కొండా వేంకటప్పయ్య తీవ్రముగా ప్రసంగించినారు. "బక్కవాడనైనను నేను కూడా రణరంగమున ప్రతినామ ప్రతాపమును ప్రకటింతును" అని హర్షధ్వానముల మధ్య చాటినారు కదా,[4] దీని భావమేమి ? ఆంధ్రులు, స్వీయమైన ప్రజ్ఞను పాయసములో పాలవలె జాతీయ శక్తితో మేళవింపవలెనని తీవ్రముగా వాంఛించుటయే !

ఈ భావమునకు బీజావస్థ గుంటూరు యువజన సాహితీ సమితి (**Young men's Literary Association**) స్థాపన. ఆంధ్రోద్యమమే ఇంధధ్యయనము చేసెడి సాహిత్యము.

గుంటూరు కృష్ణా మండలములలోనే ముందుగా ఆంధ్రోద్యమము వేయి రూపములతో వెల్లివిరిసినది. 1907 వ సంవత్సరము బందరులో రాజకీయ దృష్టితో కాకున్నను విశాలాంధ్ర భావావిష్కరణమునకు దోహదము చేసెడి ప్రాతిపదికపై ఆంధ్ర మహాసభ ప్రారంభమయ్యెను. గుంటూరులో శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారు, జొన్నవిత్తుల గురునాధంగారును ఈ ఉద్యమమునకు నారు బోసి నీరు పెట్టిరి. "ఆంధ్ర ప్రతినిధులు గోదావరి కాల్వలో స్నానం చేయు సందర్భములో అన్ని తెలుగు జిల్లాలలోని ఆంధ్ర ప్రముఖులంతా కలసి మహా

---

1. మే 24, 1913 'మాతృసందర్శనము' సంపాదకీయము, కృష్ణాపత్రిక.
2. సంపాదకీయము 1917, కృష్ణాపత్రిక.
3. వి. స III.
4 ఆంధ్రోద్యమబీజాలు దేశభక్త జీవితచరిత్ర. 37వ పుట. శ్రీ మాదల వీరభద్రరావు.

సభ జరుపుకొంటే బాగుంటుందని శ్రీ చట్టి నరసింహారావు ఒక సముచిత సూచన చేశారు. బాగుందని అందరూ అభిప్రాయపడినారు "[1]

1911లో న్యాపతి నారాయణరావుగారు భాషాప్రాతిపదికపై ఆంధ్ర రాష్ట్ర నిర్మాణము జరుగవలెనని పత్రికలకు వ్రాసిన వ్యాసములతో వాద ప్రతివాదము లారంభములైనవి. 1912లో కూడ శ్రీ న్యాపతిగారు గుంటూరు దర్బారు పత్రికలో వ్యాసము వ్రాయుచు హార్డింజి ప్రభువుయొక్క బీహారు - బెంగాలు ప్రాంతమును భాషా ప్రాతిపదికపై విభజింపవలెనను సంకల్పము కల లేఖాంశము నుదాహరించెను. ఆంధ్రోద్యమమున కిది అంకురార్పణము.

**సాహిత్యవాహిక :** రాజకీయాందోళనకు వెన్నెముకగా సాంస్కృతిక చైతన్యము ప్రారంభమైనది. సాహిత్యము దీనికి వాహిక. కందుకూరి వీరేశ లింగముగారు పునాదిరాయి వేయగా, ఆంధ్ర సాహిత్య పరిషత్తు, విజ్ఞానచంద్రికా మండలి, ఆంధ్ర భాషాభివర్ధనీ సంఘము, ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాల, వేగు చుక్క గ్రంథ మండలి మొ॥వి సాహిత్యమును జనసామాన్యము చాపునకు తీసి కొని వచ్చుటకు తీవ్ర ప్రయత్నములు చేసినవి. బందరు, రాజమండ్రిలలోని జాతీయ పాఠశాలలు కృష్ణాపత్రిక, ఆంధ్రపత్రిక, దేశాభిమాని, ఆంధ్రప్రకాశిక, ఆంధ్ర అడ్వకేట్, ఇండియన్ పేట్రియట్ మొదలైన పత్రిక లిటు ఆంధ్రోద్యమమునకు తద్వారమున జాతీయోద్యమమునకు ఎనలేని సేవను చేసినవి !!

1913న బాపట్లలో సభ జరుగు నాటి దేశభక్త కొండా, 'ఆంధ్రోద్యమ' మను గ్రంథమును రచించి ఆంధ్రాంగ్లములలో ప్రచురించిరి. రెండవ కూర్పు పదివేల ప్రతులు సునాయాసముగా వ్యయమైన పనినచో ఉద్యమము వేళ్ల తన్ను కొనుచున్నదనుటకు చిహ్నము ! అంతేకాక శ్రీయుతులు కొండా, భోగరాజు, ముట్నూరి, వల్లూరి సూర్యనారాయణగార్లు డిసెంబరులో రాయలసీమ పర్యటించి ఉపన్యాసములిచ్చి ప్రజాభిప్రాయ సేకరణ జరిగినారు. ఈ ఉత్సాహముతో ద్వితీయ మహాసభ 1914లో విజయవాడలో జరిపినారు ! దీనితో ఆంధ్రులలో

1. దేశభక్త జీవితచరిత్ర. శ్రీ మాదల వీరభద్రరావు 37వ పుట.

ఐకమత్య లోపము, కార్యదీక్షా రాహిత్యము కలదను అపవాదు తొలగిపోయినది.[1] ఈ సభలో ఆమోదించిన తీర్మానములివి :

1) పరిపాలనా సౌకర్యమునకును ప్రజల పురోభివృద్ధికిని భారతదేశమును భాషలనుబట్టి రాష్ట్రములుగ విభజించుట అవసరము

2) కాంగ్రెసు మహాసభవారు వ్యక్తీకరించిన స్వపరిపాలన విధానమును ఇండియా గవర్నమెంటువారు వారి అధికార పత్రమందు సూచించిన స్థానిక స్వాతంత్ర్య విధానమును సిద్ధించుటకు భాషాప్రయుక్త రాష్ట్రములే అనుకూలములు.

3) ఈ రాజధానిలోని తెలుగు జిల్లాలను ప్రత్యేక రాష్ట్రముగా చేయుట వాంఛనీయము.

4) సమితులను స్థాపించుట మొదలగు మార్గములచే ఈ చర్య విషయమున జనాభిప్రాయమును ఏకముఖము గావించుట యావశ్యకము.

ఈ సభలోనే ఆంధ్రుల ప్రత్యేక కళాశాలగూర్చి పునరద్ఘాటింపబడినది!! ఈ కార్యక్రమ నిర్వహణమునకై ఏర్పడిన 'స్థాయీ సంఘము'లో కోపల్లె, భోగరాజు, కొండా లు సభ్యులు

సరిగా ఈ వత్సరమే ఏప్రిల్ 10 చిలకమర్తివారి అధ్యక్షతన ఆంధ్రదేశ గ్రంథాలయ ప్రతినిధుల ప్రథమ సమావేశము జరిగినది. దీనికి శ్రీ సూరి వెంకటనరసింహారావు, శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యలు సారథులు. ఈ సమావేశము ఆంధ్రోద్యమములో అంతర్భాగమే! భాషాభివృద్ధిని ప్రాతిపదికగా చేసికొని రాజకీయ చైతన్యమును నిర్మించుట దీని పరమావధి!

తరువాతి ఆంధ్రోద్యమ సమావేశము శ్రీయుతులు పానుగంటి రాజు రాజారామాయణం గారి అధ్యక్షతన విశాఖపట్టణములో జరిగినది. ప్రతి సంవత్స

---

1. మనవారు ఐకమత్య లోపమువలనను కార్యదీక్ష లేమింజేసియు ఒండొరులపై అసూయాగ్రస్తులగుటంబట్టియు ప్రత్యేకాంధ్ర రాష్ట్రము తెచ్చుకొనజాలకున్నారు' శ్రీ మారేమండ రామచంద్రశాస్త్రిగారు 'తెలుగువారి చదువు' వ్యాసములో.

రము సమావేశము జరిపి తీరవలెనను నిర్ణయము తీసికొనుట నాడు జరిగినది. 1916 లో కాకినాడ, 1917 లో నెల్లూరులలో సమావేశములు జరిగినవి 1917 లో మాంటేగు - ఛెమ్సువర్డులను ఆంధ్ర ప్రతినిధులు కలిపికొనినపుడు ప్రజాభిప్రాయ సుముఖతను వారు కోరిరి. 1918 ఆగస్టు 17, 18, 19 వ తేదీలలో ప్రత్యేక రాష్ట్ర నిర్మాణమును వాంఛించుచు శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారి అధ్యక్షతన మహాసభలలో ఆమోదించిన నివేదికను మాంటేగు కమిటీకి పంపిరి. అంతటితో ఆగక తమ వాదమును గాంధీ, తిలకులకు బలముగా విన్పించిరి. గాంధీ, అనిబిసెంటులు దీనిని తిరస్కరించినను తిలక్ సావధాన చిత్తుడై వినెను!! ఆ మరుసటి సంవత్సరము కూడ ఆంధ్ర రాష్ట్ర మహాసభలు కడపలో జరిపిరి! ఈ యొత్తిడి ఫలితముగా నాగపూర్ కాంగ్రెసు అనంతరము 1918లో ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు ఏర్పడినది! ఆ తరువాత కూడ ప్రతి సంవత్సరమును ఏదో తీర్మానము చేసి పంపుటయును, సమస్యను ప్రభుత్వము ఆలోచించెదమనుటయును జరిగినదే కాని గణనీయమైన ఫలితములేవియును రాలేదు. ముఖ్యముగా ఆంధ్రోద్యమ నాయకులందరును ఈ మధ్య కాలములో సంపూర్ణముగా జాతీయోద్యమములోనే తమ దృష్టిని కేంద్రీకరించినారు!

1980లో సైమను కమీషను ఆంధ్రోద్యమమును పేర్కొని భాషాపరముగా దేశ విభజన చేయుటను సూచించినది కాని, అందరితోపాటు ఆంధ్రులును ఈ కమీషను బహిష్కరించుటతో ఆంధ్ర రాష్ట్రమును 'సిఫారసు' చేయలేదు. తరువాత బొబ్బిలి రాజాగారు దేశ పాద్య సుబ్బారావుగారు లండను రౌండు టేబిలు సమావేశములో ఈ సమస్యపై నివేదికలు సమర్పించిరి. కాని 1987 నాటికి దేశములో భాషా ప్రయుక్త రాష్ట్రములకు వ్యతిరేకాభిప్రాయ మేర్పడి 'స్వాతంత్ర్యము సిద్ధించుటే ప్రస్తుత కర్తవ్యమ'ని అగ్ర నాయకులు భావించుట జరిగినది.

**శ్రీబాగ్ ఒడంబడిక :** 1937 లో కాశీనాధుని వారి నివాసగృహమైన శ్రీ బాగ్‌లో సర్కారు-రాయలసీమ ఆంధ్రులు తమ నడుమ గల ఆంతరంగిక విభేదములను విస్మరించి ప్రత్యేక రాష్ట్రముగా రూపొందుట కొరకు ఒప్పందమునకు వచ్చిరి దీనినే 'శ్రీ బాగ్ ఒడంబడిక' అందురు. నాడు తెలంగాణము

నిజాము పాలన క్రింద నలిగిపోవు చుండుటచే ఏమియును చేయలేకపోయిరి. 1938 మహా సభలకు సర్వేపల్లి రాధాకృష్ణ పండితుడధ్యక్షుడు ఈ విషయము నాయన లండనులో ప్రభుత్వ కార్యదర్శి దృష్టికి కూడ తెచ్చెను. ఇంతలో ద్వితీయ ప్రపంచ సంగ్రామము ప్రారంభమగుటతో ఎక్కడి సమస్య లక్కడ నిలిచిపోయినవి. 1941లో విశాఖ మహాసభలలో విజయానంద గజపతి అధ్యక్షతన "ప్రత్యేకాంధ్ర రాష్ట్రము నేర్పరచు విషయములో ఆంధ్ర ప్రతినిధులు తమశక్తి సామర్థ్యాదులన్నిటిని వినియోగించవలెనని.... ప్రత్యేక రాష్ట్రమేర్పరచక పోయిన పక్షమున దాని నిమిత్తము ఆంధ్ర ప్రజలను వారి ప్రతినిధులను సర్వ విధములు త్యాగము చేయవలయు"నని తీవ్ర స్వరమున తీర్మానించుట జరిగినది.

**1947 తరువాత :** అఖిల భారతీయులను ఏకోన్ముఖముగా జరిపిన కృషి ఫలితముగా 1947 ఆగస్టు 15వ తేదీ భారతదేశ స్వాతంత్ర్యము సిద్ధించినది. దానితో ఆంధ్ర నాయకులు తిరిగి దశాబ్దముల నాడు ప్రారంభమైన తమ సమస్యపైకి దృష్టిని మరల్చినారు కేంద్రము 'థార్' కమిటీని భాషా ప్రయుక్త రాష్ట్రముల గూర్చి పరిశీలించుటకు నియమించెను కాని కమిటీ అభిప్రాయము ఇట్టి రాష్ట్రముల నిర్మాణమునకు విరుద్ధముగా వచ్చినది. దానితో ఆందోళనము తీవ్రము కాగా నెహ్రూ, పటేల్, భోగరాజులతో కూడిన కమిటీ తిరిగి ఈ సమస్యను పరిశీలింప నారంభించినది.

ప్రధానికి ఈ సమస్యపై సానుభూతి దృష్టి కలదు కాని పటేలు మరొక దశాబ్దము కాలము ఇట్టి ప్రసక్తులను చేయవలదని నిషేధించినారట ! శ్రీ మున్షీ భాషా ప్రయుక్త విభజనము "అధిక్షేపిస్తూ హిట్లరిజం, ఫాసిజం, రేషియలిజం మొదలైన వాటిని ప్రతిఘటించినట్లే దీనిని ప్రతిఘటించాలని" తీవ్రముగా చెప్పినారు.[1] దీనిని ఆంధ్రులు ప్రతిఘటించినారు. వీరికి సర్ థామస్ హోల్డర్‌నెస్ అభిప్రాయముపబలకమైనది. రాష్ట్ర భాషగా హిందీని వీరు వ్యతిరేకించి రాష్ట్రములన్నియును 'లింకు'లవలె బలముగా నున్నచో గొలుసు బలపడునని భావించినారు. దేశభక్తకొండా 1948 డిసెంబరులో బందరులోని 'థింకర్సు ఫోరం'లో

1. దేశభక్త జీవితచరిత్ర. శ్రీ మాదల వీరభద్రరావు. 185వ పుట.

ఈ సమస్య నిట్లే ప్రసక్తము చేసినారు. "ఆంధ్ర రాష్ట్రం సిద్ధిస్తే వీరు ఇండియాలో ఏ రాష్ట్రానికీ వెనుకబడరనీ మన భారత భాగ్యవిధాత బాపూజీ బోధించిన ఆశయాలను విశ్వాసంతో అనుసరిస్తారనీ నా దృఢ విశ్వాసం"[1] ఈ దృష్టితోనే 1949 జులై 26 అఖిలాంధ్ర మహాసభ శ్రీ కొండా అధ్యక్షతన విజయవాడలో జరిగినది. గాని ఫలితము కన్పడలేదు అగ్రనాయకులు దీనికామోదము తెలుపలేదు.

1950 లో రాజ్యాంగము ప్రకటింపబడినది. కాని దానిలో ఆంధ్ర రాష్ట్ర ప్రసక్తిలేదు. ఇది ఆందోళనమున కవకాశమిచ్చెను. 1951 ఆగస్టులో స్వామి సీతారాం (గొల్లపూడి సీతారామశాస్త్రి) ప్రత్యేక రాష్ట్రముకొఱకు 38 దినములు నిరాహార దీక్షపూని ఆచార్య వినోబా భావే జోక్యముతో విరమించిరి. 1952 లో దేశవ్యాప్తముగా ఎన్నికలు జరిగెను ఇందు ప్రత్యేక రాష్ట్రము నొక ఎన్నికల సమస్య క్రింద ఆంధ్రులు స్వీకరించిరి. ఇట్లు సమస్య ఉద్రిక్తతనూ పొంచిన సమయములో పొట్టి శ్రీ రాములుగారు ఆమరణ నిరాహారదీక్ష ప్రారంభించిరి. దీనితో ఆంధ్ర రాష్ట్రోద్యమము పతాకాస్థ నందినది-ఫలోన్ముఖమైనది.

**పొట్టి శ్రీరాములు :** గాంధేయుడైన పొట్టి శ్రీరాములుగారు మద్రాసులో సాగించిన నిరాహారదీక్ష చరిత్రాత్మకమైనది. ఆది నుండియు హరిజనోద్ధరణము దేశ సేవలలో మునిగితేలెడి శ్రీరాములుగారు ఆంధ్రుల అభీష్ట సిద్ధ్యర్థము ఆత్మాహుతికి సిద్ధపడిరి.[2] 1952 డిసెంబరు 15 వ తేదీ మద్రాసు మైలాపూరులో బులుసు సాంబమూర్తిగారి ఇంటలో ప్రారంభించిన ఆమరణ నిరాహారదీక్ష 58 దినములు సాగినది. పొట్టి శ్రీరాములు అమరజీవియైనాడు. ఆత్మాహుతి చేసినాడు. దీనితో తెలుగునాట చెలరేగిన హింసాకాండ అనూహ్యము. అవర్ణనీయము ఈ ఉద్రేకము నెహ్రూ పండితుని కక్కుఱము, దిగ్భ్రాంతి కల్గించి, రాత్రికి రాత్రే ఆకాశవాణిలో ప్రత్యేకాంధ్ర రాష్ట్రమును నిర్మించెదమని ప్రకటన చేసినారు. దానితో 1953 అక్టోబరు 1 వ తేదీ ప్రత్యేకాంధ్ర రాష్ట్ర మవతరించినది.

---

1. 1948 డిసెంబరు ప్రసంగము. 'త్రివేణి' ఆంగ్లపత్రికలో వ్యాసము.
2. శ్రీరాములుగారు లోగడ హరిజన సమస్యపై 23 దినములు, 1948 లో వార్ధాలో 29 దినములు నిరాహారదీక్షను జరిపిరి. తరువాత గాంధీ స్మారకనిధి కార్యదర్శిగా పని చేసిరి.

**విశాలాంధ్ర :** ఖండితమైన ఆంధ్రప్రాంతముతో నాయకులు సంతృప్తి నందలేదు. త్రిలింగ భూమిలేని ఆంధ్రరాష్ట్రము (కాకతి) శక్తిలేని శివునివంటిది. కావుననే విశాలాంధ్రకై సన్నాహములు ప్రారంభించినారు. నాటికి పటేలు సాహసము ఫలితముగా తెలంగాణము నిజాము పాలనము నుండి విమోచన మందినది. దానిని తెలుగు దేశములో చేర్చి నాలుగుకోట్ల తెలుగు కంఠములతో బృందగానము పాడవలెనని నాయకులు మధుర స్వరకల్పనము చేసిరి పరిస్థితులును దీని కనుకూలింప సాగినవి !

1953 లో కేంద్ర ప్రభుత్వము నియమించిన సంఘము 1955 సెప్టెంబరులో భాషా ప్రయుక్త రాష్ట్రములపై తమ నివేదికను సమర్పించినది. అందు తెలంగాణము ఆంధ్రలో చేర్చవలెనని తీర్మానించినది. భాషా ప్రయుక్త రాష్ట్రములను అయిదు సంవత్సరము లాగి విభజింపవలెనని వారు వ్రాసినను అంతవరకు దేశ పరిస్థితులందుల కంగీకరింపలేదు.

తత్ఫలితముగా 1956 లో భాషా ప్రయుక్త రాష్ట్రముల నిర్మాణము జరిగినది ఈసిద్ధాంతము ప్రకారము రాయలసీమ, సర్కారు, తెలంగాణములతో కూడిన 'విశాలాంధ్ర' నవంబరు ఒకటవ తేదీన అవతరించినది. ఏనాడో ప్రారంభమైన ఆంధ్రోద్యమ మీనాడు భాగ్యనగర రాజధానితో ఫలసిద్ధిని పొందుటతో 'ఈ జగచ్ఛ్రేయసంబులై యలరు తొంటి వేంగిరాజుల పాద పవిత్ర చిహ్న గర్భితమ్మైన యీ భూమి ఖండమందునశ్రువులు జార్చుజీవచ్చవాంధ్ర జనులు'[1] ఆనందాశ్రువులు జార్చినారు· 'బ్రహ్మకోశ గోపాయతలాంధ్ర పల్లవ నృపాలు రహుంకృతి వ్యాఘ్రమగర్జగానై యరిలోక భీకర మహాద్భుత శౌర్య రసాకృతిం'[2] జనిన దృశ్యములు తిరిగి దృగ్గోచరములైనవి. ఇమ్మగ కాకుశమ్ము మొదలీవఱకుం గల యాంధ్ర పూర్వరాజ్యము'[3] మఱల వినిర్మింపబడినది.

## కవిత్వముపై ప్రభావము :

ఆంధ్రోద్యమ ఫలితముగా రెండవ జాతీయోద్యమ స్థాయిలో గ్రంథములు పుంఖాను పుంఖములుగా వచ్చినవి. అందలి ప్రధాన విభాగములను, ప్రముఖ రచనలను పేర్కొందును.

---

1, 2, 3. వేంగి క్షేత్రము. శ్రీ విశ్వనాథ సత్యనారాయణ.

**వస్త్వాశ్రయ రీతి :** కథాత్మకమైన పద్ధతిలో ఆంధ్ర పౌరుషమును చాటెడి కృతులు 1900 నుండి 1956 (విశాలాంధ్రావతరణము) వఱకును ఎన్నో వచ్చినవి. ఇందు మహాకావ్యములు, లఘు కావ్యములు, ఖండకావ్యములు, ఖండికలు ప్రచారగీతములును కలవు !

**మహా కావ్యములు :** వస్త్వైక్యము లేకున్నను మహాకావ్యముల కోవకు చెందినదే శ్రీమధునా పంతులవారి 'ఆంధ్ర పురాణము' ఉద్యమ కాలములో ప్రథమ భాగము, ఉద్యమానంతరము ద్వితీయ భాగము వెల్వడినవి. ఇందు హరవిలాసములో శివలీలలెట్లు ప్రధాన విషయమో ఆంధ్రత్వమట్లు ప్రధానాంశము. రాళ్ళనుండి రప్పలనుండి పుట్టిన చరిత్రలోని ఘట్టములను స్వీకరించి రస కల్పనము చేసిన అమృత శిల్పి ఈయన. ఉదయ పర్వములో ముందుగా హరిశ్చంద్రుని కథ వర్ణింపబడినది. తరువాత గుణాఢ్యుని కావ్య హోమగాథ రసవత్తరముగా పోషింపబడినది. కాకతీయ ప్రతాపరుద్రుని అస్తమయముతో ప్రథమ భాగము ముగియును.

"కాకతీయ భానుగం భీర తేజము
బొదువుకొన్న రెడ్డి భూపవహ్ని
వెలుగుఁ రేక విరిసి తెలుగుఁ జీఁకటి యింక
శుభసుఖాంత మగుటఁ జూతుమింక !"

ఈసుఖాంతము ద్వితీయ భాగమునకు చెందినది. భాగ్య నగర వైభవము చూచియే దానిని వెలువరించినారు. క్షారచారిత్రక సముద్రమును క్షీరతుల్యముగా మార్చినారు. రాముడను రాజు చరిత్రను వాల్మీకి మహాకావ్యముగా మార్చినట్లు రఘు వంశమును దుష్యంత భూపతి కథను రసమయములుగా శాశ్వతము చెన్నొందునట్లు కాళిదాసు చేసినట్లు ఆంధ్రుల చరిత్ర కాత్మతత్వమేదో గ్రహించి తిథి, వార నక్షత్రములను తేదీలను దండయాత్రల జాబితాలను గౌణముగాచేసి తన లేఖినితో దేశకాలావధులులేని కావ్యముగా మార్చుట ఇతఃపూర్వమిట్లితరులు చేసిన పనికాదు !

**ఆంధ్ర సామ్రాజ్యము :** ఉద్యమ ప్రభావము కేవల మా ఉద్యమము సాగుచున్న కాలముననే పరిమితము కాదు. ఉద్యమము ఫలసిద్ధినందుటకు చూచి కూడ రససిద్ధులు కావ్య నిర్మాణోద్యమమునకు కటిబద్ధులౌదురు. కావుననే కాల

క్రమములో మిక్కిలి అంతరమున్నను జంధ్యాల సుబ్రహ్మణ్యముగారి పురాణ మును కూడ ఆంధ్ర పురాణానంతరము ప్రసక్తము చేయక తప్పలేదు ఇందు కూడా చరిత్ర నిమిత్త మాత్రము. కావ్యధర్మమే ప్రధానము. ఆంధ్రౌన్నత్యము నకు యెద జలదరించి వ్రాసిన కృతి యిది.

**ఆంధ్ర రాష్ట్రోదయము :** ఆంధ్ర రాష్ట్ర నిర్మాణ కారకుడైన ఆమర జీవి జీవితగాథ యిది. శ్రీ జంధ్ల సుబ్రహ్మణ్యకవి రెండు భాగములలో ఈ కావ్య మును రచించినారు.

'మన పురాణాదులెన్ని చూచినను వినిన
నౌత్తరాహుల కథలెగా అలము కొనియె
అరుదెకవులు ధీరోదాత్తులాంధ్రులందు?' అని కవి ప్రశ్నించి ఈ కావ్య నిర్మాణమునకు కంకణము కట్టుకొనినారనిచో వీరి ఆంధ్రాభిమానమెట్లి వధులు దాటినదో సువ్యక్తము. అమరజీవి తల్లిదండ్రులైన లక్ష్మి గురవయ్యల గార్హస్థ్యముతో ప్రారంభించి సంప్రదాయకమైన స్వప్న వృత్తాంతముంచి, శ్రీరాముల వారి జననముతో కథనుముందుకు నడిపినారు. శ్రీరాముల విద్యాభ్యాస మునకు ముందు సూర్యోదయాది వర్ణనము, సీతారామ కల్యాణము ముందు వసంతర్తు వర్ణనము, కావ్యమునకు అష్టాదశవర్ణనా శోభను సమకూర్చుటయేకాక కవి ప్రతిభకు కూడా సూచనలు (విద్యకుముందు సూర్యోదయము - వివాహము నకు ముందు వసంతము మొదలైనవి.)

## లఘుకృతులు - ఖండ కావ్యములు :

**వీరమ నీడు :** ముదివర్తికొండమాచార్యులవారు ఆంధ్రోద్యమ కీలలలో ఈ కావ్య సువర్ణమును పుటముపెట్టి మేలిమివన్నెతో ప్రకాశింపజేసినారు. వీర మనీడు జీవితము కూడ అట్టిదే! కృష్ణరాయలపై గలభక్తితో తండ్రినే బందీ చేసిన ధీరోదాత్తుశతఁడు. "తొలకరి మబ్బులో మెఱుపు తున్క విధమ్మున శత్రుసైనికావళి"లో జొరబారిన వీరమనీడు గాథ, ఆంధ్రులకు ప్రాచీన పౌరుష స్ఫూర్తిని కల్గించుటలో కరదీపికవలె నిలిచినది.

**నాయకురాలు - మగువ మంచాల :** ఏటుకూరి వారి లఘు కావ్యము లివి. తన రాజనీతి తంత్రముతో పల్నాటి సామ్రాజ్యమును గడగడ లాడించి

అపర భారతగాథను ఆంధ్రదేశములో నడిపించిన నాగమ్మ గాధ మగువలకే కాదు మగటిమి గల పురుషులకును శిరోధార్యమే. మాంచాల మాత్రమేమి సామాన్యురాలా? బాలచంద్రునిలోని శౌర్య విద్యుల్లతకామె ఉత్పాదక కేంద్రము. అఖిల భారత స్థాయిలో ప్రశంసింపదగిన పరాక్రమమును ప్రదర్శించిన యీ నారీమణుల గాధను ఏటుకూరి వారు ఉద్యమ కాలములో స్వీకరించుట కాలము చూపిన ప్రేరణ కొక ప్రముఖోదాహరణము.

**రామచంద్రుని హంపీయాత్ర :** గంటి జోగి సోమయాజిగారు రచించిన కృతి యిది. ఇది మూడాశ్వాసముల గ్రంథము. రామచంద్రుడను యువకుడు రాజ్మహేంద్రపురములో పట్టభద్రుడై, ప్రాచీన భారతీయ విద్యలను కూడ నేర్చుకొని సేవా ధర్మములోని అధర్మమును చూచి చింతతో సెలవు గైకొని హంపీ విజయనగర సందర్శనమున కేగినాడు. అచ్చటి ప్రాచీనాంధ్ర వైభవమును చూచి స్తబ్ధుడై తన జీవితమును ఆంధ్రౌన్నత్యమున కంకితము చేయదలచినాడు. ఆరాత్రి స్వప్నములో విద్యారణ్యులవారు కన్పడి ప్రబోధము చేయుటతో కావ్యము ముగియును. రామచంద్రుడు ఉద్యమ కాలములోని ప్రతి ఆంధ్రునికిని ప్రతినిధి ఒకవేళ కవియే రామచంద్రుడైనను కావచ్చును.

> "శాతకర్ణికరాగ్ర సందీప్తమై దొల్త నలరినయాంధ్ర శౌర్యాగ్ని కణము
> రాజ రాజ నరేంద్ర రాజ్యకాలమునందు జ్వాలయై వెలుగంగఁ బరిణమించె
> కాకతీయుల బాహుగర్వ రూపమ్మున శత్రురాజులను భస్మమ్ము నర్చె
> తరువాత నీ పేర్మి దశ దిక్కులనుండి యాకాశవీధికిఁ బ్రాకిపోయె
> నీవు గతియింప నేలకో నిలిచిపోయె బాహ్యదృష్టికిఁ గానంగబడదు గాన
> నివుఱు గలిసెనో యాఱెనో నేనెఱుంగ సకల గుణధామ శ్రీకృష్ణ
> సార్వభౌమ"[1]

కావ్యమంతయును ఇట్లు నివుఱు గప్పిన, లేదా ఆరిన ఆంధ్ర శౌర్యాగ్నికణమును రగిలింపజేయుటయే కర్తవ్యముగా కవి భావించినట్లు సాక్ష్యమిచ్చుచున్నది. 'జీవమ్మను నావహమ్మనను బంటు తనమ్మును'[2] ఆంధ్రులకు నేర్పిన దీ కావ్యము :

1. తృతీయాశ్వాసము - (శ్రీకృష్ణదేవరాయలు) - శ్రీ గంటిజోగి సోమయాజి
2. తృతీయాశ్వాసము- 26, 59 పద్యములు.

**ఓరుగల్లు కోట :** కాకతీయుల శౌర్యమునకు కుదురుగా నిలిచిన ఓరుగల్లు కోటను కథా వస్తువుగా స్వీకరించి శ్రీనివాస సోదరకవులు, అచ్చటి వేయి స్తంభములగుడి, శిల్పములు, రుద్రమదేవి, ప్రతాపరుద్రుల పౌరుష ప్రాగల్భ్యము మహోన్నతముగా వర్ణించి ఆంధ్రాభిమానమును మేలుకొల్పినారు. 'నిజంబు ...నిద్రపోవుచు నుండినో మేలుకొని యుంటినో' యని అనుమానము వ్యక్తీకరించినారు. తురుష్కులచే నాటి దేవాలయములు శిథిలములైనవి. వానిని చూపినప్పుడు ప్రాచీన వైభవమును స్మరించుకొని 'నాదు మిత్రులెల్ల నన్ను వంచించి యెటు పోయిపోయని కవులు పొందిన అనుభూతులే ఈ కార్యరూపమున ఘనీభవించినవి.

**ఆంధ్ర ప్రశస్తి :** కవి సమ్రాట్టుల యీ కృతి కొన్ని లఘు కావ్యముల సంపుటమనినచో సముచితముగా నుండును. శాతవాహనుడు, శాతకర్ణి, వేగి క్షేత్రము, ముఖలింగము, ప్రోలరాజు, చంద్రవంక యుద్ధము, మాధవవర్మ కథ మొదలైన విభాగములందు కలదు. అన్నియును ఆంధ్రప్రశస్తి కెత్తిన బావుటాలే! నాడును- నేడును తెలుగు సాహితీవేత్తల కిది పారాయణ గ్రంథము వలె నున్నదనినచో 'ఆంధ్రప్రశస్తి' యొక్క ప్రశస్తి ఎట్టిదో వేఱుగా చెప్ప నవసరములేదు. 'మాతృదేశావిల దుఃఖదారితమైన' యెదతోకవి అస్వతంత్ర తానియతమైన యీ బ్రదుకు తెల్గువారు' భరింపలేరని చాటుటకీ కృతి యజ్ఞమునకు సోమయాజియైనారు. వేంగి క్షేత్రములోని గాలి, పృధ్వి, నీరు జడచేతనములు కూడ కవికి ఉన్మత్తతను కల్గించినవి. నాటివీరులు వేరు - కాని వారల స్మృతి చిహ్నములు మాత్రము మిగిలినవి. అవి చూచినప్పుడు కవి 'పూర్వప్రథా జీవరహితమై' శక్తి నాడులలో నశించిన వర్తమాన జాతిని చూచి ఇట్టి జాతి నశించుటే మంచిదని శపించునంతటి తీవ్రవస్థాయిని చేరినారు.

**పెనుగొండ లక్ష్మి :** పుట్టపర్తి నారాయణాచార్యులవారు 'హంపీ క్షేత్రము' కన్నముందే పెనుగొండ శిథిలములను గాంచి గుండెబండగా మారగా విలపించి రాతి శిథిలముల మూగ బాధకు తన కవితతో స్వరకల్పన చేసినారు. ఇక్కడి లలితకళా వైభవము, శౌర్యధైర్య పరాక్రమాదులు, విజయశీలురైన ప్రభువుల గాథలు, మహాకవి మనములో మార్మోగి అక్షరనిక్షిప్తమైనవి. ఇది మా యాంధ్ర పవిత్ర రాజ్యరమ, ఇందువయం బందిననల్ల క్షీమలకు నాంధ్రోర్వి

గత స్వాభిమాన దయాశాంతులు వెన్నతో నిడినవర్ననన్ సందయమ్మేమి'యని ఘంటాపథముగా చాటినారు. పెనుగొండ శిల్పలక్ష్మి :

"మేలుకున్నపూల జూచుచున్నయది సిగ్గున్ జీల్చిత్రోపాడు న
వ్వులలో బచ్చి విసంబు నూల్కొలిపి యీ పూబోడియే వాని భా
వలలీ స్వర్ణ సుమంబౌ నేటికిపూర్వ ప్రౌఢి వంచించు మా
తలంపుల్ తీక్ష్ణములైన మంత్రములచేత న్వ్రాలె నాడించుచున్"

రాష్ట్రాభిమానమునకు జీవగఱ్ఱయై ప్రాచీ ప్రాచీన ప్రశంసకు, స్మృతులకై మాణిక్య దర్పణమై నిలిచినది 'పెనుగొండ లక్ష్మి.'

**హంపీ క్షేత్రము :** కొడాలి వారి మధురలేఖిని నుండి జాలువారిన అమృతధునీ శీకరముల చెమ్మయే హంపీ క్షేత్రము. గతమొక స్వప్నకథా విశేషమై మిగిలిపోగా శిలలుద్రవించి తుంగభద్ర దాపున యేడ్చిన కథయే 'హంపీ క్షేత్ర'ముగా కావ్యత్వము నందినది. ఇందుచాకలి దాని మేడ, హంపీస్థాపన. విద్యారణ్యులు, కనకాభిషేకము, తళ్ళికోట యుద్ధమువన్నగు శీర్షికలున్నవి. వీనిని చదువు వారి గుండెలు చెరువులగును. కన్నీరు మున్నీరై కరిగి కరిగి సహృదయుడట్లే నిలువున నీరైపోవును - రసమయుడగును. ఇందలి గత స్మృతుల ప్రాభవమట్టిది! ప్రభావమట్టిది!!

"ఈ పెనుకొండ బండలెటు లెత్తిరొ ఆకసమంట లాఘవ
ప్రాపిత కార్యమా యిది సభాస్థలులైనవి కోటలైన నం
తా పనివాంద్ర కౌశల విధానమె చూపు బలే నవీన యం
త్రో పకృతుల్ విదేశపు విధుల్ విసరంతయు నేర్చినారటో"

హంపిలో 'ఆముక్తమాల్య వాసనలు వాణీ కుంభ వక్షోజ నాట్యా యత్తం బగుపీఠె తంత్రిపయి' బాహాటించినవి. నేడా సౌందర్య మెచ్చట దాగినదని కొడాలి క్షోభించినారు. ఆనాటి రాజెట్టివాడు??

"గండ పెండెరముల కవులకీ వచ్చును.
కవి హృదయము పిండగలడె రాజు?
ఏనుగంబారీల నెక్కించవచ్చును?
కవి మనస్సున కెక్కగలడె రాజు?

కృతులెన్నియైన పేరిచి పుచ్చుకో వచ్చు
కవితారసము పిల్చగలడె రాజు?
పొగడింతలను వేలు పొందగా వచ్చును
కల యూహలందుకో గలడె రాజు?
ఆది మహాయుగ సారస్వతాత్మ పండి
రాజుగా, తెల్గు గ్రుడ్డి యరణ్యములను
పరువమును కాంతివీగని పారిజాత
పుష్పమయి నిల్చినది జ్ఞాన పూజ కొఱకు"

'పద్దెము పద్దెమొక్క మణి- పట్టిన దెల్లను పైడిముద్ద'. ఈ విద్యరాయలకే కాదు కొడాలికిని తెలియునని 'హంపీక్షేత్రము' చెప్పుచున్నది. నవ్యాంధ్ర సాహిత్య మంతటిలోను పరాకోటికి చెందిన కృతులలో హంపీక్షేత్ర మొకటి!

**దాక్షారామము :** ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారి కృతియిది. పౌరాణిక చారిత్రక సంఘటనములకు సంగమస్థలి దాక్షారామము. అగస్త్యుని కాలమునుండి అన్నయమంత్రి నాటివఱకును గల మధుర గాథలెన్నిటినో కవి మనములో మథించివేసి పర్యవసానముగా ఈ కావ్యామృతమును పంచిపెట్టినారు. ఆంధ్రాభి మానమున కీశ్వర స్పర్శ ఈ కృతిలో సిద్ధించినది.

**ఆంధ్రావళి :** రాయప్రోలు వారి ఆంధ్రావళి కేవల ఆంధ్రవీరుల ఘన తకే సంకేతము కాదు అఖండ భారతములో అంతర్భాగమైన ఆంధ్రదేశములోని వీరుల సంకీర్తనము. ఈ జాతి ఏనాటిది? ఎంతటి పౌరాణిక కాలములలోనో తన పౌరోహిత్యమును నెరపినదికదా! 'కురు పాండవుల కత్తికోతలలో భాగ ధేయము నందినది. యవనధాటీ ప్రవాహమును' బంధించినది, మగధ, కళింగ, కర్ణాటక, తంజాపుర సీమలలో తన 'అఖండ ప్రభావమును' నెలయించి ఐక్య మునకు పరోక్షముగా మామిడితోరణము కట్టినది.

'గడ్డపారలు గోగుకాడల వలె ముళ్ళు
వేసినారట కొండవీటి రెడ్లు
తెలివెన్న రాసుల తీరుననల్ల కొండలు
చీల్చినారట పలనాటి గండ్లు

> శివుడు గంగను బోలె జెనవుగండి ప్రవాహ
> మాపినారద్దంకి కాపుమగలు
> నాచెదేసి శిలాకవాటముల్ గ్రుద్దుల
> గదపినారట తెలంగాణ భటులు'

అట్టి 'బలభద్రులు' పుట్టిన సీమలో పులి కడుపున చలిచీమలు పుట్టునా? మన వారు పంజాబునుండిక ప్రపు మొక్కలను తెచ్చి' పెరటిలో పెంచినారు. 'పచ్చి జవ్వాజిగోవా'నుండి తెప్పించి దండపు జాడీలలో రాచినారు. కొండవీటి గులాబి గుత్తులతో అత్తరులు తయారు చేసి 'శీలుశిత్తులలో' బిగించినారు. అసలైన పారశీకాశ్వములను తెచ్చి 'విజయయాత్ర' స్వారి చేసినారు. 'ఖండఖండాంతరములలో ప్రకాశమైనది ఆంధ్ర కీర్తి అట్టి దాని పునరుత్థానము కన్న కావలసినదే మున్నదని రాయప్రోలు వారి సందేశము !

**ఆంధ్ర పౌరుషము :** కవి సమ్రాట్టుల ఖండకావ్యమిది. ప్రాచీన పౌరుషమును స్మరించుకొనుట, వర్తమాన దుస్థితికి విలపించుట, ఇందలి మూలతత్త్వము, ఆంధ్రులు పాటలీపుత్రమ్ము కోటపై విజయపతాకము నాటి వచ్చినారు. కాని నేడో.

> "పట్టి పేనుగులు గర్వ సమేతముగ నేగు
> కడల జిల్లేడు మొక్కలు" జనించినవి. ఇంతకన్న దౌర్భాగ్య

మేమికావలెనని కవివేదన !

**రాష్ట్రగానము - ఉదయగానము :** తుమ్మల సీతారామమూర్తి గారు రాష్ట్రము రాకముందొకటి వచ్చిన తరువాత మఱొకటి రచించినారు. 'తెలుగు' పేరు చెప్పిన చాలును వీరియెద పులకరించును. 'జీడిపప్పువలయు, జేజేల బాసయు వలయు బాసెమునకు తెలుగునకును' అని వీరి భావము. సంస్కృతము మీది ప్రేమతో తెలుగును తిరస్కరించెడి వారసినచో వీరికి కోపము. 'తెల్గును తెగడు వారు వ్రాయు.... తెలుగు కావ్యమ్ములనుపసుద్దలే కాని యని లద్దుముద్ద'లు కావని కవి వాదము "తెలుగుదేశము, తెలుగు భాష, తెలుగు చరిత్ర తెలుగు ప్రజ, తెలుగు సంస్కృతి యనినంతనే నా యొడలు పులకించును ఇవి నాకు ప్రాణకల్ప విషయములు. నేను తెలుగువాడనను అహంకారము

నాకెక్కువ. ఈ యహంకారమే నన్ను కవిని చేసినది. ఇట్టి నా జాతియు, నా భాషయు, పరతంత్రములై పరకీయ సంస్కారము నాశ్రయించి ప్రాచీన గౌరవమును కోల్పోయినవి కదా! ఇది నా మనస్సులో అనుక్షణమును రేగినట్టి ఆరాటము ఈ యారాటమునకు నా జీవుడు కదలినాడు. ఆ కదలికయే రాష్ట్ర గానము" ఇందలి హెచ్చరిక, కైవారము, ప్రశస్తి, అనుతాపము, ప్రబోధము మొదలైన ఇరువది శీర్షికలతోను సారాంశ మొక్కటే-ఆంధ్రగానము!!

'ఆంధ్రరాష్ట్ర ముదయించినది' 'శుద్ధ సత్వమూర్తి సుతుడొక్కడాహుతి వో'యిన పిమ్మట వచ్చినది.

'వచ్చినది రాష్ట్రము సరే
హెచ్చినదా యింతమాత్ర నేమన భోగం
ఐచ్చపు రాగము త్యాగము
రెచ్చిననాడే కదా తరింతురు తెల్గుల్' అని ఉదయ గానములో

ప్రబోధించినారు. 'మూడుకోట్ల ప్రజలు మూగిన యింటిలో మంచి పీట లెంత మంది కుండు'నని మంత్రి పదవులకై సాగెడి కుమ్ములాటలు చూచి విలపించినారు. ఆంధ్రోద్యమ మాద్యంతము గోచరించెడి దర్పణములీ రెండు కృతులు.

**జాషువా ఖండకావ్యములు :** వివిధ శీర్షికలతో కూడిన ఖండ కావ్యము లతో జాషువా తెలుగుతల్లికి మంగళ నీరాజనముల నెత్తినారు.

'పసుపు ముద్దలనుంచి పతికిరోసముఁ బోయు
వీరపత్నులు పుట్టి పెరుగునాఁడు .........'లో నదులు క్షేత్రములు ప్రజలు ప్రభువులు అందరును పవిత్రమూర్తులే!

"శబ్దశాసనుని ద్రాక్షా కవిత్వమునుగా
వించి యెన్నాళ్లు లాలించినావొ
విష్ణువర్ధన మహీవిభుని శాసనమును
దలదాల్చి యేరీతి మెలగినావొ
రడ్డిరాట్పుత్రలపాణి వన్నెలుదేలు
నలతో సెబ్బంగి గులికినావొ
చాళుక్య నృపతుల సంగరశ్రమ వోప

గలువ పుప్పొడి యెంత చిలికినావొ
భద్రగిరి రామపాదుకా స్పర్శనంబు
గణన కెక్కిన కోటిలింగాల పూజ
కలిగి పయనించు హంసికా గమనవీవ"ని అఖండ గౌతమికి స్వాగతము చెప్పినారు 'భారత గ్రంథమందు పర్వత్రయంబు చదువుకొన్నట్టి' పుణ్య సుకృతి గోదావరి. 'వేగిరాజుల సతీవితతికి గరువంపు నడక నేర్పినది నన్నయ్య రచన' 'ఆంధ్రభారతీ నీతేజ మద్భుతంబ'ని ప్రశంసించినారు జాషువా!

ఇట్లెన్నియో ఖండకావ్యములు నాడుద్యమ ప్రభావమున వెల్వడినవి. ప్రముఖమైన కొన్నిటిని మాత్రము మనవి చేసితిని.

**ఖండికలు :** కవితాగుణములో తీసిపోక ఆంధ్రత్వము ఆయువుగా, ఊపిరిగా కలిగిన ఖండికలా నాడెన్నియో వెలువడినవి. చింతా దీక్షితులవారి 'గోదావరీ మాత గొనియాడరమ్మ' అను సంకీర్తన మిట్టిదే! 'ఉప్పొంగి పోయింది గోదావరీ తాను తెప్పున్న ఎగిసింది గోదావరీ' యని అడవి బాపిరాజు గారు గానము చేయుటకు కూడ ఆంధ్రత్వమే ప్రేరణ. త్రిలింగదేశములో భాషను వెలుగులు పండించిన సాహిత్య కర్షకుడు సూరవరం ప్రతాపరెడ్డిగారు.

'కొండవీటను కోటల మరచి । దండివీరులు దాండ వింపగ
చండ శౌర్యము నిండి యుండిన తెలుగు నాడిది మిత్రమా'

యని ఆంధ్రయోధులను, ఆంధ్రవాణిని, వాణి వీణను ప్రశంసించినారు. నోరి వారు కృష్ణానదిపై తమకుగల భక్తిని ప్రదర్శించి 'నిత్య యౌవన సుధా శ్రీరాగ మాలాపనము' చేసెడి నదీమతల్లికి కైమోడ్పు లర్పించినారు.

వింజమూరి శివరామారావుగారు

'దాసిగా నీనాడు తలయొగ్గినే లెమ్మ । నిరుపేదలై నేడు దుర పిల్ల గానిమ్ము । ఏనాడూ సంపదల కురిసిందిలే తల్లి ఈ నాల్గదిక్కులా విరిసిందిలే' యని వర్తమాన (రచనా కాల) దుస్థితికి వాపోయినారు. వాన మామలై వరదాచార్యులవారు :

'కుక్కలు చింపు విస్తరిగ కూలిన యోర్గలు కోట కంటివే
ముక్కున ఊపిరుండియు నుమూతికి మీసము కల్గు ఆంధ్రుడా'

అని శౌర్య మనవత్తిని పద్యపు పుడకతో ఎగద్రోయుచున్నారు. బొడ్డు బాసిరాజుగారి 'కోణార్క' అపూర్వమైన ఖండిక. కళింగ శిల్పులు ఆంధ్రులే. గాంగ వంశీయుడైన మొదటి నరసింహదేవుడు మహమ్మదీయుల నెదిర్చి విజేతయై నిర్మించిన జయ నికేతన మిది!

'ఇవితురంగములు కావింద్ర ధనుష్కాంతు
లేదు వారము లందగించె గాక
అవి రథాంగములు కావలసితా సిత పక్ష
ముల శరన్మాసముల్ పొలిచె గాక
ఇవి పత్రములు కావు దివసార్థ దళములు
జాము లెన్నినియు పొసంగె గాక
అవి గోపురములుగా వ క్రభంకషమ్మలైన
ఉదయాస్తగిరులు చెల్వొందెగాక

అసమ చతురశ్రకోణ విన్యాస శోభ
నా పదాంచల శిఖర శిల్పాంతర మిది
మందిరము కాదు దిన కర స్యందనంబు

ఏ మహా శిల్పిస్వప్న సరోమ రాశి'. ఆ మహాశిల్పి ఆంధ్రుడు కావుననే కవి కింత అభినివేశము!

పైడిపాటి సుబ్బరామశాస్త్రి గారు తమ 'ఆంధ్రశ్రీ'లో రామదాసు, డొక్కా సీతమ్మ, త్యాగరాజు, మాధవవర్మలవంటి ఆంధ్రవీరుల, భక్తికి, దాన వీరమును గాన సుధను, పరాక్రమమును పేరుపేరున వర్ణించినారు. 'ఆంధ్రం - ఆంధ్రం- ఆంధ్రమ్మంటే అతి మధురం' అని ఆలాపించినదీ యనే!! హంపిలోని విట్టలాలయములోని రాతి రథమను చూచినప్పుడు కవయిత్రి పుట్టపర్తి కనకమ్మగారి యెదపొంగి అడుగడుగులో తెల్గుటందమ్ము చిరునవ్వ పొరలపై జిలుగు వెన్నెల ముంప నడువవే రథమా'యని కృష్ణరాయల కీర్తికాంతను నాట్య మాడుమని కోరినది! శ్రీ మాధవశర్మ గారి తల్లికోట. కుందుర్తి నరసింహారావుగారి పంప, కొసరాజు వారి తెలుగుతల్లి పద్యములు ఈ మహోద్యమ జ్వాలలనుండి రాలిన విస్ఫులింగములే!

**అతి వేలము :** అవేశ మెక్కువై, ఆక్రోశము పెరిగినప్పుడు ఆలోచన తెక్కువ తాపీయని కవిత్వము ఉద్యమములో వెల్వడుననుటకు ఈ క్రింది ఉదాహరణము చాలును. 'శ్రీ'యను పీరావేశము కల ఆంధ్రుని గీతమిదః "భారతం ఛీ! కాదు - ఆంధ్రమాతకు జై!

'ఆంధ్ర భాషకూ జై ఆంధ్రులకూ జై
ఆంధ్ర - ఆంధ్ర - ఆంధ్ర - జై - జై - జై
తెలుగువాణ్ణి నేను తెలుగు దేశం నాది
తెలుగు తల్లికి నేనె అనుగు బిడ్డణ్ణి
తెలుగు గాలులు నేను తెగ పీల్చుకుంటాను
పరగాలి పొలిమేర పనికి రాదంటాను
తెలుగు సూర్యుడె నాకు వెలుగులిస్తుంటాడు
తెలుగు చంద్రుడె నాకు చలువలిస్తుంటాడు
తెలుగు ఎండై తేనూ మలమలా మాడుతా
తెలుగు వెన్నెలలంటే గిలగిలా లాడుతా' నను అతి వాదము

వలుకును కవిపోయినాడు!! తుమ్మలవంటి ప్రముఖులు కూడ 'వంగ భస్మము' వంటి ఖండికలలో వంగీయులను విమర్శించుట ఇట్టి తీవ్రవాదమే!!

**ఉద్యమకారుల సంకీర్తనము :** ఆంధ్ర దేశమును, నదీనదములను' క్షేత్రములను, పురాతన శిథిలములను, దేవాలయములను కవులను ప్రభువులను లలిత కళాకారులను ప్రాచీనాంధ్ర వైభవమును. వర్తమాన దుస్థితిని వర్ణించుటతో పాటు ఆంధ్రోద్యమము నడిపిన నాయకులను కూడ కవులు కంఠమెత్తి కీర్తించినారు. శ్రీ కొండా, భోగరాజు, టంగుటూరి, పొట్టి శ్రీరాములు, స్వామి సీతారాం బులుసు సాంబమూర్తి ప్రభృతు నెందరో ఇట్టి నుతులకు అర్హులైరి ఇట్టివి పురుషార్థ ప్రదాయిని, వివేకవర్ధని, చింతామని, ఆంధ్రకేసరి, దేశమాత, ఆంధ్ర ప్రకాశిక, దేశాభిమాని, సమదర్శిని, కాంగ్రెసు పత్రిక సత్యాగ్రహి- ఇంద్రావతి- కృష్ణాపత్రిక, ఆంధ్రపత్రికలలో అసంఖ్యాకములుగా ప్రచురింపబడినవి.

'ఆత్మబలియనంగ స్వరాజ్యం బనంగ
తెలుగు వారికిం గరపి మేల్కొలిపి నారు

కృష్ణరాయ నాగేశ్వర కీర్తి నిధులు
సత్కరించి కృతజ్ఞతన్ జాటరయ్య' - మంగిపూడి వేంకటశర్మ
కాశీనాధుని, ముట్నూరిగార్లను ప్రశంసించుచు వ్రాసిన కవిత యిది [1] కొండా వెంకటప్పయ్య గారిని ప్రశంసించుచు కోన వేంకటరాయశర్మగారు రచించిన కవిత : "ఒకనాడేనియు రాజకీయ విషయోద్యోగంబుచే నింత తీరిక లేకుండగ జేసి దేశ హితమున్ రేయింబవళ్లాని నాయకులం దొక్కరుగాగ నెంచబడి యీ యాంధ్రోద్యమ వ్యాప్తినొదక సాధింపక దైవమేలుఁ గృపఁ గొండా వెంకటప్పాం కితా ! [2] దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారిపై జాషువా కవి :

"కృష్ణవేణీ తరంగిత తరంగములందు
దేశీయ గానంబు దిద్దినావు
జాతీయ పౌరుష స్వచ్ఛంద రక్తంబు
చీరాల రణసీమ జిందినావు.... ....
ఆంధ్ర సోదరలోక మల్లాదనపుడు
స్వర్గ మెక్కితివేల? గోపాల నీవు!" [3]

వెల్లూరి శ్రీనివాసమూర్తిగారు తమ 'అమృతాభిషేకము'లో కల్లూరి సుబ్బారావు, వెలవాడ గోపాలరెడ్డి సర్వేపల్లి రాధాకృష్ణ పండితులు, టంగుటూరి ప్రకాశం పంతులు మొదలైన ఆంధ్ర నాయకాగ్రణులపై కవితల వెలయించినారు. ఇట్టి వింకెన్నో కలవు !!

**ప్రభావములు :** ఆంధ్రోద్యమములో వెల్వడిన కవితపై ముఖ్యముగా ఆంగ్ల కవితా ప్రభావము అచ్చు గుద్దినట్లున్నది. కాల్పనిక కవిత్వములోనిది అంతర్భాగము కావున తక్కిన శాఖలవలె ఇదియును వైదేశిక ముద్రనుండి దూరము కాలేకపోయినది రాయప్రోలు గీతములపై వర్డ్స్వర్తు స్కాటుల ప్రభావమున్నది. విశ్వనాధ వారి ఆంధ్ర ప్రశస్తిలో వాల్టర్ స్కాటు వ్రాసిన **Batlle of Bannockburn, Batlle of fledden field'** వంటి కృతులు

1. 1929 సెప్టెంబరు 7, దుర్గకళా మందిరములోని సన్మాన సభ.
2. హోమ్‌రూల్ ఉద్యమం. దేశభక్త జీవితచరిత్ర 80వ పుట.
3. రత్నచ్యుతి. ఖండకావ్యము. మొదటి భాగము 49వ పుట.

స్ఫూర్తి గోచరించును. శ్రీ గంటిజోగి సోమయాజిగారి కృతిపై బైరను కవి వ్రాసిన 'Childe Harolds' Pilgrimage ప్రభావము సంస్కృతములోని విశ్వగుణా దర్శమనెడి చంపువు ఛాయలు గోచరించును.

'బ్రతుకొక పెన్ ప్రవాహము నిరంతరమున్ జలనంబె దానికిన్
జతపడు లక్షణంబు చెయిదాఁపగ కాలుకదర్ప కుండగా
బ్రతికెదు వాని జీవనము బల్కగవచ్చునె జీవనమ్ముగా
సతతము కార్య భారమున సల్పెడు జీవమె జీవమౌ గదా'

రామచంద్రుని హంపీయాత్ర - 3-48

"Not enjoyment, and not sorrow
Is our destined end or way
But to act that each to-morrow
Find us farther than today"

(Psalem of life. Longfellow)

'నహికశ్చిత్ క్షణమపి జాతుతిష్ఠత్య కర్మకృత్' అని భగవద్గీత. ఆంధ్రోద్యమ కవులు సంస్కృతాంగ్లములలో నిష్ణాతులు కావుననే ఆ భావములు వారిలో జీర్ణమైపోయి, నవీనావిష్కరణము నంది తెలుగులో ఒలిచినవి!!

**ఆంధ్ర ప్రకృతి :** ఉద్యమము తీవ్రముగా నున్నప్పుడు ప్రకృతి మొత్తమును ఉద్యమ స్వరూపముగనే గోచరించును. ఆంధ్రుల జీవితమిట్లర్థ శతాబ్దము సాగినది. అందుకు విశ్వనాథ వారి ఋతుసంహారమొక ప్రముఖోదాహరణము. తెలుగు ఋతువుల నింత అపురూపముగా వర్ణించిన వారరుదు. విశాలాంధ్రావతరణము వరకు ఇట మానవ ప్రకృతికి ఉద్యమ ప్రవృత్తికి భేదము లేదనినట్లు సాగినది. ఆంధ్రావతరణము జరిగినది. 'తెలుగు రాజ్యమేర్పడితే.... తాగేంద్రుకు కుళ్ళు నీళ్ళు తినడానికి గడ్డి'[1] అని తెలుగు వానిని తెలుగువారు విమర్శించుటకు ప్రారంభించినారు. ఆంధ్రుల ఆంతరంగిక ప్రకృతికి - ప్రవృత్తికే కాదు, ఉద్యమ పరి సమాప్తికిని ఇది చిహ్నము!!

1. శ్రీశ్రీ

# తెలంగాణా పోరాటము :

'నా తెలంగాణ కోటి రత్నాలవీణ'యని దాశరథి పరవశముతో గానము చేసినను శతాబ్దముల పర్యంతమీ విపంచి వైదేశిక శక్తుల తాడనముతో మూగబోయి, తెగిన తీగలనుండి వాయు ప్రహారములతో అవేళలో అపస్వరములనే పల్కినది. త్రిలింగదేశము శివమయము కాక శవమయమైనది. జీవచ్ఛవముల వలె మారిన కోటిమంది ప్రజలు కోటి గొంతులతో ఈ దుస్థితికి వ్యతిరేకముగా అర్ధశతాబ్దము సాగించిన నిరవధిక సాయుధ నిరాయుధ సంగ్రామమే యీ తెలంగాణా ఉద్యమము !

**తొలి తిరుగుబాట్లు :** 1724లో ఔరంగజేబు ప్రతినిధి చిక్‌కిలిచ్‌ఖాన్ (అసఫ్ జా) ఔరంగజేబు మరణానంతరము నిజాముల్ ముల్క్‌పేర స్వతంత్ర హైదరాబాదు రాజ్యము స్థాపించుటతో తెలంగాణము చరిత్ర క్రొత్తమలుపు తిరిగినది. వీరుకైన త్రిలింగాంధ్రులు బానిసలైనారు. "నూటికి ఎనిమిదిమంది వాడుక భాష అయిన ఉర్దూను రాజభాషగా ప్రవేశపెట్టి దేసభాషల నశింపజేయుటకు తీవ్రకృషి సలుపబడుచున్నది. నవాబు.... భావంలో హిందువులంటే దాసులు ముస్లిములకు సేవ్యతోడే సేవకులు. అడవులు కొట్టే కోతకాండ్రు. అంతే కాదు 'హిందూ ధార్మిక సంస్థలను దేవాలయాలను నశింపజేస్తూ విదేశీ ముస్లింలకి ధార్మిక సంస్థలకి విరివిరిగా లక్షలాది విరాళాలివ్వడం పరిపాటి అయింది'[1] ఈ స్వభావము తొలినుండి తుదిదాక నిజాముల పాలనలో సాగినది. దీనిని ఆద్యంతమును దేశీయు లెదుర్కొనుచునే వచ్చినారు. 1795లో మహారాష్ట్రీయులు ఖుర్దాలో నిజాం అలీఖాన్‌ను సైన్యముగా చావ మోదిన సంఘటనము సామాన్యమైనది కాదు. 1750లో గద్వాలరాజు 'ప్రహ్లాద విభుడు' సోమవిభుడు తెచ్చిన విప్లవము కూడ చరిత్రలో స్వర్ణాక్షరములతో లిఖింపదగినది. అట్లే వనపర్తి అధీశులు రాజాసోమేశ్వరరావు, పాపన్నపేట ప్రభువు రాజాసదాశివరెడ్డి నిజామును ఓడించిన సంస్థానాధీశులే! కాని వీరిలో సామూహిక శక్తి, ఏక సూత్రత లేకపోవుటవలన అంతిమ విజయము నిజామునకే దక్కినది.

---

1, 2. **Police action against Hyderabad. V. Veerabhadra Rao. 12 P.** (అను : బి. ఎస్. శర్మ)

**గ్రంథాలయోద్యమము:** ఇట్టి స్థితిలో ఇరువదవ శతాబ్దము నుండి రాజకీయ చైతన్యమునకు, జాతీయ పునరుజ్జీవనమునకు స్థానికులు ఉపాయాంతర మాలోచించి గ్రంథాలయోద్యమము ప్రారంభించిరి. గ్రంథాలయమొక అపహ్నవా లంకారము. స్వాతంత్ర్యోద్యమమే వ్యాజోక్తి! 1901 లో శ్రీకృష్ణ దేవ రాయాంధ్ర భాషానిలయము హైదరాబాదు సుల్తానుబజారులో స్థాపింపబడినది. అనతి కాలములోనే 1904 లో హనుమకొండలో రాజరాజనరేంద్ర భాషానిల యము ప్రారంభింపబడినది. 1908 నాటికి విజ్ఞానచంద్రికా గ్రంథమండలి వచ్చినది. మాడపాటి హనుమంతరావు, ఆదిపూడి సోమనాథరావు, మైలవరపు నరసింహమూర్తి దూపాటి వెంకటరమణాచార్యులు, కొమర్రాజు లక్ష్మణరావు, రావిచెట్టు రంగారావు, నాయని వెంకటరంగారావు గార్లు ఇందలి అతిరథ మహా రథులు! నాటి కాంగ్రెసు నాయకులందరును గ్రంథాలయోద్యమములోని వారే! 'దీనిని బట్టి గ్రంథాలయము ద్వారా జాతీయ జీవనమెట్లు వ్యాపించినదియు తెలిసి కొనవచ్చును.[1] ఆర్థికముగా వెనుకబడినను సరస్వతీ పూజలో ఏనాడును తెలం గాణము వెనుక పడలేదు. పాల్కురికి, పినవీరన, పోతనవంటి ఆంధ్రకవి శిరో మణుల నందించిన ప్రాంతమిదియే! కావుననే సారస్వతము వేయి ముఖముల విరిసినది. రక్షక భటుల కనుమానము పెరిగినది కాని తగిన ఆధారములు లేక వారు మిన్నకుండ వలసివచ్చినది.[2] రాజకీయ సభలవలె గ్రంథాలయ సమావే

---

1. సరస్వతీ సామ్రాజ్యము. అయ్యంకి వెంకటరమణయ్యగారి సన్మాన సంచిక.

2. సూర్యాపేటలోని గ్రంథాలయమును అధికారి చూచి 'ఈ గ్రంథాలయమున కనుమతి పొందితిరా? లేదా?' యని ప్రశ్నించిరి. లేదని జవాబు. వెంటనే మూతపడెను. ఈ విషయము సర్- అక్బర్ హైదరీ (హోం సెక్రెటరీ) దృష్టికి తీసికొని రాబడినది. ఆయన ఆలోచించి 'గ్రంథా లయము స్థాపించుటకు ఈ కార్యాలయము నుండి ఆజ్ఞ పొందవలసిన అవసరము లేదని ఫర్మానా జారీ చేసెను. ఇట్లే వరంగల్ జిల్లా మడి కొండలోను జరిగెను. "మురాసిలామహకమె మోతమది సర్కారె అలీ సేగే ఆదాలత్ కోత్వాలీ - ఉమూరె అమా" నిషాన్ - 1920. సేగేతాలీ మాత్ !!

శములు మహోత్సాహముతో ప్రతి సంవత్సరమును జరిగినవి 'దేశభక్త' 'ఈశ్వర భక్త' వామన నాయక్ శ్రీ పింగళి వేంకటరామారెడ్డి సీతారామ భూపాలుడు (గద్వాల) ప్రభృతులీ ఉద్యమమునకు తరువాతి కాలములో ఆధారశిలలై నిలువగా, వెల్లాల సదాశివశాస్త్రులు, బుక్కసముద్రము శ్రీనివాసాచార్యులు, పుల్లగుమ్మి వేంకటాచార్యులు, కర్నమడకల అనంతాచార్యులవారు, పత్రి విశ్వేశ్వరశాస్త్రి, గోపాలపేట రామచంద్రాచార్యులు, మందడి వేంకటకృష్ణకవి చివుకుల అప్పయ్యశాస్త్రి, అయితమురాజు కొండల్‌రావు, నరసింగయ్య, గాదేపల్లి వీరరాఘవశాస్త్రి, మాదిరాజు విశ్వనాథరావు, రామసుబ్బారాయుడు, గవ్వా అమృతరెడ్డి. గంగుల శాయిరెడ్డి, ప్రభృతు లీ ఉద్యమ సహస్రదళ కమలమున కొక్కొక్కరేకై పల్లవించిరి. ఇట్లు రెండు దశాబ్దముల కాలము జరిగినది.

**గణేశోత్సవములు :** ఇంతలో మహారాష్ట్రమున బాలగంగాధర తిలక్ జనజాగరణమునకు గణేశోత్సవములనొక సాధనముగా స్వీకరించుట తెలంగాణా ప్రజల నాకర్షించెను. ఏ బూరుగు మహదేవ హాలులోనో గణేశుని ప్రతిమను పెట్టుట- నవరాత్రములు జరపుట- హరికథలు, ఉపన్యాసముల పేర మతప్రాతిపదికపై హిందూ సమైక్యత సాధించుట- ఇట్లు కొంతకాలము జరిగినది. మతములో ప్రత్యక్షముగా ఐక్యము కల్గించుకొన్నచో సంస్థానమునకు ప్రమాదము వచ్చునని నిజాము కూడ దీనికి ఆటంకము చెప్పకుండ పరోక్ష పద్ధతులతోనే హిందువుల నణచసాగెను.

**'ఆంధ్ర జనసంఘ' స్థాపన :** ఇంతలో 1921 లో ఒక ప్రముఖ సంఘటనము జరిగినది. సన్నివేశమెంత చిన్నదో దాని ప్రభావమంత మిన్నడిగా తరువాత తరువాత చరిత్రలో కన్పడెను. నవంబరు 11, 12 తేదీలలో హైదరాబాదులో కార్వే అధ్యక్షతన 'సంఘ సంస్కరణ సమావేశ' మొకటి జరిగినది. అందు వక్తలెందరో ప్రసంగించిరి కాని తెలుగులో ఎవరును మాట్లాడలేదు. రెండవ దినమున అలంపల్లి వెంకటరామారావుగారు తెలుగులో మాట్లాడుటకు ప్రారంభింపగనే సభలో చప్పట్లు ప్రారంభమయ్యెను. ఇంగ్లీషు, ఉర్దూ, మహారాష్ట్రముల పాటి గౌరవము కూడ తెలుగునకు లేకపోయెను కదా యని ఆంధ్రులు బాధపడిరి. వెంటనే రాత్రికి రాత్రే టేకుమాల రంగారావుగారి గృహమున సమావేశమై చర్చ సాగించి, వెంటనే ఆంధ్రులకొరకొక సంస్థను స్థాపిం

చిరి. దీని పేరే 'ఆంధ్ర జనసంఘము'. "పుట్టుకవలన కాని స్థిరనివాసము వలన గాని హైదరాబాదు రాజ్యములోని యాంధ్రులగు వారందరును ఈ సభలో చేర వచ్చును. కట్టివారి వయస్సు 18 సంవత్సరములకు మించి యుండవలెను." అప్పటికప్పుడే నూరుమంది కార్యకర్తలు చేరిరి. దీనికి కొండా వెంకటరంగారెడ్డి గారధ్యక్షులు బూర్గుల, మాడపాటి, ఆదిరాజు వీరభద్రరావువంటి ప్రముఖులెం దరో ఇందలి సభ్యులు. ఈ రీతిగా తెలంగాణా పోరాటములో సాంస్కృతిక ముగా ఒక ప్రత్యక్ష వేదిక ఏర్పడినది. 1922 లో బారిస్టర్ రాజగోపాలరెడ్డిగా రధ్యక్షులుగా, మాడపాటివారు కార్యదర్శిగా మహాసభలు బ్రహ్మాండముగా జరిగి నవి !!

**ఉద్యమ తీవ్రత :** 1937 నిజామాబాదు సభ నాటికి ఆంధ్రోద్యమము స్పష్టమగు రాజకీయోద్యమముగా పరిణమించినది ఉద్యమములో తీవ్రత పెరిగి నది. జాతీయోద్యమములో వలె ఇందును అతివాదులు బయలుదేరిరి. సురవరం ప్రతాపరెడ్డిగారు దీనికి నాయకులు. కేవలము తెలుగు మాట్లాడువారికే సంస్థ పరి మితము కావలెనను సంకల్పముతో 'అభివృద్ధి పక్షము' ను స్థాపించి హైదరాబాదు లోని తెలుగువారి కమూల్యమైన సేవను చేసిరి. 1942లో వరంగల్ జిల్లా ధర్మ వరములో ఆంధ్ర మహాసభతోపాటు మహిళా సభ కూడ జరుగుటలో ప్రజా చైతన్యము పెల్లుబికినట్లూహింప వచ్చును. దాని ఫలితమే బరకత్‌పురాలోని 'ఆంధ్ర యువతీ మండలి' స్థాపన. అట్లే వారసత్వములో రాజధాని పౌరులకొరక సమగ్రమైన ఆంధ్ర సంస్థ కావలెనని ప్రముఖులు ఏకగ్రీవముగా ఉద్ఘాటించిరి. ఆ ఘోష వేయి జవనాశ్వముల హేషగా మారి, ప్రతిధ్వనించి అందరి ఆమోద సహకారముల తోను 'ఆంధ్ర సారస్వత పరిషత్తు' వెలసినది.

**విద్యావేత్తల పాత్ర :** నిజాముకు వ్యతిరేకముగా త్రిలింగాంధ్రము లోని ప్రజాచైతన్య సమీకరణములో విద్యావేత్తలైన కవులు వారి ముఖయం త్రములైన పత్రికలు గణనీయమైన పాత్రను నిర్వహించినవి, 1918 లో 'హితబోధిని' యను తెలుగు పత్రిక మహబూబునగరములో స్థాపింపబడినది కాని ఎక్కువ కాలము నిలువలేదు తరువాత 1922 ఆగస్టు, 24 తేదీన 'నీలగిరి' పత్రిక నల్గొండ నుండియును ఆ తరువాత మూడు దినములకే మహబూబాబాదు తాలూకా ఇనుగుర్తి గ్రామము నుండి 'తెలుగు పత్రిక' ప్రారంభమైనవి. 'నీల

గిరి'కి షబ్నవీసు వేంకట రామనరసింహారావు, రెండవ దానికి డాక్టరు బద్దిరాజు సీతారామచంద్రరావు దేశముఖ్‌లు సంపాదకులు 1925 సురవరం ప్రతాపరెడ్డి గారు 'గోలకొండ' పత్రిక వారమునకు రెండుమార్లు వచ్చునట్లు ప్రారంభించినారు. ఇట్లే సుజాత,[1] ఆంధ్రాభ్యుదయము,[2] ఆంధ్ర శ్రీలు[3] తరువాత దేశబంధు,[4] ఆంధ్రకేసరి,[5] తెలుగుతల్లి,[6] విభూతి,[7] దివ్యవాణి[8] మొదలైన పత్రిక లుద్యమవ్యాప్తి కెంతో దోహదము చేసినవి. 'భాగ్యనగర్' హరిజనోద్ధరణమునకు కంకణము కట్టుకొనినది. 'మీజాన్' కమ్యూనిస్టు రాజకీయముల కొరకు స్థాపింపబడినది. అడవి బాపిరాజుగారు దీనికి సంపాదకులు. బుక్కపట్నము రామానుజాచార్యులవారి 'తెలంగాణ', దేవులపల్లి రామానుజరావుగారి 'శోభ' కూడ ఈనాటి ప్రజాచైతన్యమునకు ధ్వజస్తంభములట్లు నిలిచినవి. ఇవికాక పూలతోట, మద్యపాన నిరోధ పత్రిక, శైవప్రచారిణిల పేర్లు కూడ ప్రసక్తము చేయక తప్పదు. పత్రికలతోపాటు గ్రంథమాలలెన్నియో వెలసినవి. గోలకొండ, కిన్నెర, దివ్యవాణి సుకృతి ప్రసాదము, మాతృభారతి, ఆంధ్రశ్రీ, కాకతీయ, పూలతోట, వీరేశలింగ కవి కంఠాభరణ, కృషిప్రచారిణి, శివధర్మ గ్రంథమాల, విజ్ఞాన ప్రచారిణి, వేంకటేశ్వర, ఆజా, దేశోద్ధారక, ఆంధ్రకేసరి, సాహితీమేఖల' సాహితీ సమితి, కావ్యమాల మొదలైన నామములతో ఈ గ్రంథమాలలు ఆంధ్ర సాహిత్య ప్రచురణములో అద్వితీయమైన సేవను చేసినవి!

ఆంధ్ర రాజకీయముల వెన్నెముకను కాచుటకై వివేకవర్ధనీ పరిషత్తు వైతాళిక సమితి, ఆంధ్ర వాఙ్మయసేవా సమితి, కాకతీయ కళాసమితి మున్నగు సారస్వత సంస్థలు వీకోచితముగా ఉద్యమ రంగమున నిలిచినవి. దాశరథి

---

1. పి. ఎన్. శర్మ.
2. కోకల సీతారామశర్మ.
3. సికిందరాబాదు ప్రచురణ.
4. మాసికము.
5. మాడపాటి.
6. రాచమళ్ళ సత్యవతీ దేవి.
7. చిదిరె మఠము వీరభద్ర శర్మ.
8. చివుకుల అప్పయ్యశాస్త్రి.

నారాయణరెడ్డిగార్ల ఆధ్వర్యమున తెలంగాణా యువకవులకొక కోవెలను కట్టి 'తెలంగాణా రచయితల సంఘ'మని పేరిడిరి చైతన్యమును, విప్లవమును, అక్షరముగ ముద్రించిన సంస్థ యిది! సర్దార్ పటేలు నిజాముపై రాజకీయముగా పోలీసు చర్య జరుపుటకు పూర్వరంగ మిది. ఈ ప్రజాచైతన్యము పక్వస్థితి నందకున్నచో కేవలము రాజకీయముగా జరిగిన పరిణామము శాశ్వతముగా నిలిచియుండెడిది కాదు.

**షడ్యంత్రము:** పోలీసు చర్యనాటి నిజాము పేరు మీర్‌ఉస్మాన్ అలీ ఖాన్ బహద్దూర్. జి.సి.యస్.ఐ.జి.బి.ఎస్. ఈతడు అసఫ్‌జాహి వంశములో ఏడవవాడు. స్థానిక హిందువులకు వ్యతిరేకముగా తాను కవిత్వము వ్రాసి, ఉర్దూ కవులచేత వ్రాయించినాడు[1] అందువలననే ప్రజాకంటకుడుగా పేరొంది ప్రజలచే అనుదినమును నిందింపబడెడివాడు ఈయన ఆంగ్లేయులున్నను పోయినను తన పరిపాలనము మాత్రము నిలబెట్టుకొనవలెనను కోరికతో ఆదినుండియు కృషి ప్రారంభించెను. 1944 జులై 26 సుభేదక్కన్'లో ఇట్లు వ్రాసినాడు. "బ్రిటిషువారితో స్నేహబాంధవ్య సంపత్తి కలిగించుకొనిన సంస్థానములలో కాని లేదా పారమౌంటు ఆధిపత్యము క్రింద రక్షణ బడసిన సంస్థానములలో కాని, ముఖ్యముగా యీ దక్కనులో బాధ్యతాయుత ప్రభుత్వ సంస్థాపనము నిరర్థక విషయము." కావుననే భారతదేశమున కాంగ్లేయులు స్వాతంత్ర్యము ప్రకటింపగనే తాను సర్వతంత్ర స్వతంత్రుడనని ప్రకటించుకొనినాడు. జిన్నా మొదలైన ముస్లిము నాయకులు దీనిని బలపరచినారు. దీనికి పాకిస్తాను నుండియేకాక చర్చిల్ వంటి వారినుండియును ప్రోత్సాహము లభించినది. "నిజాం బ్రిటిషు విలేఖరులు బ్రిటిషు ఏజెంట్లు జగద్వ్యాపక ప్రచారమును విరివిగ సాగించినారు"[2]

---

1. ఈయన స్వయముగా వ్రాసిన కవిత :
"బంద్ నా ఖూన్ హువా సున్కే నిదాయ్ తక్బీర్
జల్జలా అహిగయా రిష్త యే జున్నార్పేబి" (కల్మా అను ఇస్లాము మతములోని ప్రథమ సూత్రము యొక్క ధ్వని బహిర్గతము కాగానే శంఖనాదములాగిపోయినవి హిందువుల జన్నిదములపై, మత చిహ్నములపై భూకంపములు ఆచ్ఛాదితమైనవి) – "రహబరే దక్కన్"నుండి.

2. శ్రీ కె. ఎం. మున్షీ.

కాని రాజకీయముగా పరిశీలించినచో నిజాము స్వతంత్ర ప్రభువుగా నున్నది మిక్కిలి తక్కువ కాలమే కదా. 1829లో నిజాం ముత్తాత నాసరౌద్దౌలా తన వారసత్వపు హక్కునకై 'నజరానా'లను 'దాఖలు' చేసికొనుట జగద్విఖ్యాతము. అట్లే ఢిల్లీ మహారాష్ట్రులు తెలంగాణము నాక్రమించి నిజామును సామంతునిగా చేసికొనినప్పుడు నిజాము 'చౌత్' పన్నును కట్టక తప్పలేదు ఇదియును సత్యమే! అట్టిచో "దక్షిణ ప్రాంతాన్ని మహమ్మదీయులు జయించిన నాటినుండి అనగా 700 సంవత్సరాల నుండి నిజాం వంశీయులు నిరాటంకముగా సర్వాధిపత్యముతో హైదరాబాదు రాజ్యమును పాలించుచున్నార"ను[1] ఆంగ్లేయుల వ్రాతలు బుద్ధిపూర్వకమగు దుశ్చర్యతో కూడుకొనినవి కావా? కావుననే హిందువులే కాక 'ఇమ్రోజు' సంపాదకులు షోయీబుల్లాఖాన్, ముజూర్జంగ్, వంటి మహమ్మదీయులు కూడ నిజాము స్వాతిశయమును ఖండించినారు. అఖిల భారత జాతీయ కాంగ్రెసు నిజాము 'ఫర్మానా'ను తిరస్కరించినది "ప్రజాభిప్రాయమును చూరగొనక యిట్టి ముఖ్యప్రకటన చేయబడినందున దీనిని ప్రజాభిమతమన వీలులేదు. ప్రజానుమతి గౌరవము కలుగని నిర్ణయము ఆమోద, ఆచరణ యోగ్యముకా జాలదు."[2]

**ప్రజా చైతన్యము :** సామాన్యుని సంగ్రామము లేనిదే సామ్రాజ్యములు ముడివడవు, విడివడవు. పటేలు సాహసమునకు కారణము స్థానికుల ప్రజా చైతన్యమేనని గుర్తింపవలసియున్నది.

1947 డిసెంబరు 14వ తేదీ హైదరాబాదు స్టేటు కార్యాచరణ సంఘము సమావేశమై 'పన్నుల నిరాకరణము'నకు సంబంధించిన తీర్మానము నారంభించినది. అనగా మరొక అసహాయోద్యమము ప్రారంభమైనట్లు గుర్తు.

మెదక్ జిల్లాలో సంగారెడ్డి వద్ద మహంకాళి నారాయణరావుగారి నాయకత్వమున కర్ణాటక ప్రాంత హిందూసభ కార్యదర్శి శ్రీ భీమసేనాచారి, కార్యవర్గ సభ్యులు బదరీ ప్రసాద్ భారత్‌సింహ, పండిత శ్రీరాంజీరావు గార్లు సత్యాగ్రహమారంభించిరి.

1. స్పెక్టేటర్ ఏప్రిల్ 30, 1948.
2. 1947 సభలలో తీర్మానము.

నాసిక్ శ్రీ ధర్మవీర్, డాక్టర్ బి. ఎస్. ముంజేగారి అధ్యక్షతన భోన్స్లే మిలటరీ పాఠశాలలో ఈ సత్యాగ్రహ దళములకు శిక్షణ మొసంగబడినది. విద్యార్థులు పాఠశాలలు మానివేసినారు సాయుధ నిరాయుధ సంగ్రామములును మొదలైనవి.

**హత్యా ప్రయత్నము :** భారత స్వాతంత్ర సంగ్రామములో అతివాదులెట్టి పాత్ర నిర్వహించిరో తెలంగాణా పోరాటములో నారాయణ గండయ్యలను దేశభక్తులట్టి చర్యనే తీసికొనిరి. నిజాంను హత్య చేసినకాని స్వాతంత్ర్యము సిద్ధింపదని వీరు నిర్ణయించిరి సమయము చూచి నిజాంకారుపై బాంబును ప్రయోగించిరి. కారు దెబ్బతిన్నది కాని నిజాం సురక్షితుడుగా మిగిలినాడు. వారిరువురిని పట్టుకొని నిజాం ప్రభుత్వము నిలువున ఉరి తీసినది.

**నిరసన :** నిజాం ఘాతుక కృత్యములకు వ్యతిరేకముగా విద్యావంతులెందరో తీర్మానములు చేసి తమ నిరసనలు తెలిపిరి. విద్యాలంకార్ వినాయకరావు నాయకత్వమున సుమారేడు వందల మంది న్యాయవాదులు 'ప్లీడర్సు ప్రొటెస్టు కమిటీ' పేర సమావేశమై నాటి దోపిడీలు, హత్యలు మానభంగములు, లూటీలు, గ్రామదహనములు, స్త్రీ జనాపహరణములు, ప్రజలపై కాల్పులవంటి దుండగములన్నిటి వివరములను సేకరించి ప్రకటించిరి.

**యుద్ధ సన్నాహములు :** కాని నిజాము గద్దె దిగుటకు సిద్ధముగా లేడు. సయ్యత్ కాశింరజ్వీ ఫీల్డ్ మార్షల్‌గా రజాకర్ సైన్యము'ను సిద్ధము చేసినాడు. వీరితోబాటు సిద్ధిఖ్ అనునతడు 'దిన్దారు'లను ముఠాను తయారుచేసెను. బ్రహ్మముగారు కాలజ్ఞానములో నిజాము మాత్రమే హైదరాబాదును పాలించునని దేశమంతయు మహమ్మదీయులాక్రమింతురని చెప్పినాడనియు, నిజాముగారనగా సాక్షాత్తు ధర్మరాజేననియును, తాను బసవేశ్వరావతారమనియును ప్రబోధించినాడు 'గాంధీ ఒక ముస్లిమై చస్తాడు. నెహ్రూ మనసూర్తిగా ముస్లిమౌతాడు. ....హిందువులారా నా వద్దకురండి! సరిహద్దులపైన కార్యం ముగిసిన తరువాత ఇండియన్ యూనియన్‌లోని దుష్టుల సంహరించి శిష్టుల రక్షిస్తాను. తెలంగాణ నుండి నేను నా కార్యం ఆరంభించాను. నా ఆజ్ఞలను పాలించాలి. అదే మీకు ముక్తిదాయకం."[1] ఈ సంహరణ కార్యక్రమము రజాకార్లు, దిన్దారులు క్రియా

---

1. సిద్దీఖ్ ప్రవచనములు. 'దీన్దార్' నుండి.

రూపములోనికి తెచ్చినారు. 1948 సెప్టెంబరు 7వ తేదీ నెహ్రూ పండితుడు ఈ పశుకాండను గూర్చి సుదీర్ఘమైన హృదయ విదారకమైన నివేదికను ప్రచురించినారు.

**రజ్వీ కోరికలు :** కాశిం రజ్వీ మొత్తము 80 వేలమంది రజాకార్లను కూలీపై నియమించినాడు. వీరు రెండు లక్షలని రాజధాని పత్రికలు వ్రాసినవి. సంస్థానములోని 87 శాతము హిందువులను బానిసలుగా మార్చుటో కాందిశీకులుగా తరుముటో చేసినాడు. ఈతనికి సమర్థకుడై డాక్టర్ అబ్దుల్‌లతీఫ్ తన 'క్లారియన్'లో ప్రజాభిప్రాయ సేకరణపై నినాదము ప్రారంభించినాడు. 'దక్షిణ భారతదేశములోని కోటియేబది లక్షల మంది ముస్లిములు సంస్థానములోనికి దిగుమతి కావలెను. ఇక్కడి 2 కోట్ల హిందువులు ఆస్తులు వదిలి ఇండియన్ యూనియన్‌లో చేరవలె'ననునది ఈతని వాదము. రజ్వీ, నిజాములు దీని నామోదించినారు. అప్పటికప్పుడే 50 లక్షల మందిని సంస్థానమునుండి తరిమివేసి 7 లక్షల మందిని నైజాం దిగుమతి చేసికొనినాడు. ఇంతటితో ఆగక 'ప్రత్యక్ష చర్య' జరిపి 'ఇత్తెహాదుల్ ముస్లిమీన్' స్వతంత్ర రాజ్యము స్థాపింపవలెనని రజ్వీ ఒక ప్రణాళికను సిద్ధపరచినాడు. హిందువుల ఆస్తులు, ధనాగారములు (బ్యాంకులు) దోచుకొనుట ఈ చర్యలోని భాగములు. ఈ రహస్య కార్యాచరణ పత్రమునకు అంజుమన్ ఆమోదముద్ర వేసినది. దీనికి అర్థబలము, అంగబలము సమకూర్చినవాడు నిజాము. భారతదేశము జరిపిన రాయభారములన్నిటిని తిప్పికొట్టినాడు. ఈ లోపున రజ్వీ సమర సన్నాహములు వృద్ధి చేసినాడు. ఖాదర్‌ఖాన్, గోల్కొండ, మోతీ మహలులలో మందుగుండు సామాగ్రిని నిర్మించినారు. సైన్యము మొత్తము పదివేలకు పెరిగినది.

**సంకేతములు :** రహస్యమగు యుద్ధ సంకేతాదులను కూడ నిజాం సైన్యము ఏర్పరచుకొనినది **'LONG LIVE THE NIZAM'** అనునది సంకేతములను రూపొందించు మూలశబ్దము. ఇందు అక్షరముల వరుస ప్రకారము

---

1. రజాకారు ఉద్యమము 1927 లోనే పుట్టినది. నాడు 'అంజుమన్' అను పేర నొక సంస్థ స్థాపింపబడినది నవాబు యార్జంగ్ దీనికి నాయకులు. మతము పేర ప్రారంభమైన ఈ యుద్యమము 1937 నాటికి రాజకీయ స్వరూప మందినది.

A–1., తరువాత E–2., రెండవ E–3, వరుసలో గల G–4., తరువాతి మొదటి I-6; రెండవ I-7; ఇట్లు వచ్చును. అనగా : LONG LIVE THE NIZAM అను సంకేతమునకు సంజ్ఞలు : 8 13 11 4 9 6 15 2 14 5 3 12 7 16 1 10 ఒసంగబడును. అప్పుడు సంకేతమిట్లు రూపొందింతురు :

| L | O | N | G | L | I | V | E | T | H | E | N | I | Z | A | M |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 8 | 13 | 11 | 4 | 9 | 6 | 15 | 2 | 14 | 5 | 3 | 12 | 7 | 16 | 1 | 10 |
| T | H | E | E | N | E | M | Y | A | D | V | A | N | C | I | N |
| G | T | O | W | A | R | D | S | N | A | L | D | U | R | G | O |
| N | E | B | N | S | T | R | O | N | G | G | X | X | X | X | X |

అప్పుడు సంకేతమిట్లు పంపబడును. IGYSO; VLEWN DANGER; T NUTC; NNASN; OEOBA; DHTEA; NNMDR; CRXXX– సంకేతము స్వీకరించిన వాడు వీనిని నిలువు పఙ్క్తులలోనికి మార్చినప్పుడు రహస్యము బోధపడును. ఇట్టి యుద్ధ తంత్రములన్నింటితోను నిజాము సర్వసన్నద్ధుడైనాడు. అట్టి దశలో సాహసించి పటేలు పోలీసు చర్య కనుమతి నిచ్చినాడు.

**ప్రజా విమోచనము :** శతాబ్దములనాటి శృంఖల లొక్కపెట్టున త్రెంపి త్రిలింగాంధ్రులకు విమోచనము కల్పించిన మహావీరుడు పటేల్. 1948 సెప్టెంబరు 18 వ తేదీ సోమవారము పోలీసు చర్య జరిగినది. యూనియన్ సైన్యము ఘటకేశ్వర్ వఱకు కూడ రానేలేదు, నిజాముసేనలు తిరోగమనమారంభించినవి. నిజాం సేనాధిపతి లెఫ్టినెంట్ మహమ్మదాలీ సాహెబ్ భయముతో తన సేనపై తానే కాల్పులు జరుపుకొనినాడు. మేజర్ జనరల్ జె. ఎన్. చౌదరి ఆధ్వర్యమున 'హరహర మహాదేవ' నినాదములతో షోలాపూరు నుండి భారత సైన్యము బయలుదేరి నిజాము రాష్ట్రము నాక్రమించినది. ఒకేసారి సంస్థానమును దిగ్బంధన చేసివేసిరి.

సెప్టెంబరు 18 వ తేదీ సాయంకాలము భారత సైన్యము సికిందరాబాదు ప్రవేశించుటతో పోలీసుచర్య పరిసమాప్తమందినది. నిజాం శ్వేతపతాక మెగురవేసి శరణము కోరినాడు. ఇక జనవేశ్వరావతారము సిద్దిఖీ ప్రభుత్వములేమైరో

పరమేశ్వరుని కెరుక! భారతీయుల చిరకాల సంతాపమొకటి తీరిపోయి సమా న్యుడా నందబాష్పములు రాల్చి తృప్తిగా నిశ్వసించినాడు. నాటితో మహోద్యమ మొకటి ముగిసినది!

ఈ వీరోచిత గాధ ఆంధ్రకవులకొక వరప్రసాదమైనది. తెలంగాణా ప్రజలు నిజాము పాలనలో పడిన కష్టములు, శిలలు కూడ కరుగునట్లు విలపించిన వారి ఆక్రందనలు కవుల కింధనములై పని చేసినవి. తెలంగాణ పోరాటమొక అమూల్య కావ్యవస్తువైనది!!

## కవిత్వముపై ప్రభావము :

తత్వదృష్టితో తెలంగాణా పోరాటమును కవులు భావించిన దృష్టిని పరిశీ లించినచో అందీ ప్రముఖమైన విభాగములు కన్పడును.

**1. హిందూ-ముస్లిము సంఘర్షణ :** నిజాము మహమ్మదీయుడు. వేయి సంవత్సరములుగా ఈ దేశమును దోచుకొనుచున్న వైదేశిక శక్తులకు ప్రతీక. ఆతనిపై హిందూవీరులు సాగించిన విజయమే తెలంగాణా ఉద్యమమను భావమొకటి పీవు కవిలోకములో నున్నది. యర్రోజు మాధవాచార్యులు, శివ ప్రసాద్ ప్రభృతులీ వర్గమునకు చెందినవారు.

**2. భూస్వాముల పరాజయము :** ధనమును కేంద్రీకరించిన వ్యవస్థకు నిజాము ప్రతినిధి. పీడితులు తాడితులునైన కార్మిక కర్షకసోదరులు సామ్రాజ్య వాద వ్యవస్థను నిర్మూలించుటకు సాగించిన ఘోరాటమే తెలంగాణా ఉద్యమమని మఱొక భావము. ఇది 'కమ్యూనిజము' స్ఫూర్తితో ఉదయించినది. గంగినేని, కుందుర్తి, రెంటాల, రమణారెడ్డి ప్రభృతులు దీనికి ప్రతినిధులు.

**3. మిశ్రమతత్వము :** దేశభక్తికి సామ్యవాదమునకు చుక్కెదురు. కాని తెలంగాణా పోరాటమును దేశభక్తుల విజయముగాను, సామ్యవాదుల ప్రగతి చిహ్నముగాను, ఏక కాలములోనే భావించినవాడు దాశరధి ఈతడు త్రిలింగ క్షేత్ర సంకీర్తనముతో దేశభక్తుడైనాడు కార్మికులకు ప్రతినిధిగా సామ్రాజ్య వాదమును నిరసించి సామ్యవాద ప్రభావితునివలె కన్పడినాడు. అట్లని భారత దేశమవలంబించెడి తాటస్థ్య విధానమును నిరసించలేదు. ఇదొక మిశ్రమతత్వము.

త్రివేణీ సంగమము. అగ్నిధార, రుద్రవీణ మొదలగు కృతులందుకు నిదర్శనములు !!

## నిరవధిక ప్రభావము :

తెలంగాణా ఉద్యమమే కాదు. ఏ యుద్యమమైనను తన ప్రభావమును కేవల ముద్యమము జరుగు కాలమునకే పరివ్యాప్తముచేసి మిన్నకుండదు. ఉద్యమ ప్రభావము నిరవధికమైనది. దానిశక్తి ననుసరించి అనంతర కాలములో అనంతముగా ప్రసరించి తన ముద్రనద్దును. కావుననే ఉద్యమానంతరము వెల్వడిన గ్రంథములను కూడ పరిశీలించుట ఈ పరిశోధనావ్యాసము పరిధిలోనే చేరను ! కావుననే కాలక్రమములో చివర చేర్చవలసి వచ్చినను కావ్యక్రమములో ముందే చెప్పక తప్పని 'మఘవలయము'తో ఈప్రభావ భాగమును ప్రారంభింతును.

**మాఘ వలయము :** ప్రతిజ్ఞలోనే కవి నిజాము పతనమును సూచించినా ఔచిత్యమును కాపాడినాడు. 'మ'హా, 'ఘ'నత వహించిన **(His Highness)** నిజాముయొక్క అధికారలయము ఇందలి యితివృత్తము. ఇట్లే జోతిస్సంపరముగా మఱొక అర్థము : సూర్యచంద్ర గ్రహణములు కల సర్వధారి సంవత్సరములో **18-9-48 మొదలు 17-9-48 వరకు సింహరాశిలో** మఘా నక్షత్రము నావరించిన అష్టగ్రహమాలికా వలయ యోగము, ఆందోళాకృతిఁ గల మఘా నక్షత్ర ప్రవేశమొనరుచుకొనిన బుధ, రవి, గ్రహముల కారకత్వ ప్రభావము నిజాము పతనమును, భాగ్యనగర సంప్రాప్తిని సూచించినవి [1] మఘమనగా యజ్ఞము; అది బలిదాన సూచన. వలయము ఆంధ్రదేశావతరణముల నంతర్గతము గావించుకొనిన చక్రము. ఇట్లును నామముసార్థకమైనది ఇందుకథ నిమిత్త మాత్రము. దుష్టుడై రజాకార్లలో చేరిన వ్యక్తి కందుకూరు దాడిలో తన సోదరుని చేతనే చంపబడిన యదార్థేతి వృత్తము 'ఆహుతి'యను ద్వితీయ ప్రకరణములో వర్ణింపబడినది. కాని, ప్రధానముగా హిందూ సామ్రాజ్యరమను చెరబట్టజూచిన నిజాము దుష్కార్యములను వర్ణించుటే కవి లక్ష్యము :

---

1. కందుకూరి వేంకట సుబ్బారావు, సమోదము. ౧౨. మఘవలయము.

'ఇత్తేహాదిలు ముస్లిమీన్ ముసుఁగులో హిందూజన ద్వేషమున్
జిత్త భ్రాంతియు నాగ్రహోగ్రతయు నాశ్లేషింపఁగా వారు కిం
చిత్తున్ దాపథయఁబు బో విడిచి 'రజ్వీ' నాయకత్వాన 'మా'
సత్తాకాఫిరులార ! 'చూడు ధని హింసాకార్యదుర్వ్యగ్రులై' [1]

ఇంతేకాక రజాకార్లు హిందువుల యెడల, వారి పవిత్రమందిరముల యెడల చేసిన అత్యాచారములను వివరముగా వర్ణించినారు.

'దివ్యస్థలంబుల దేవాలయంబుల । మధుమాంస దుర్గంధమయ మొనర్చి
విగ్రహంబుల నెల్ల విధ్వంసనముచేసి । మూత్రాభిషేకాల ముంచి యెత్తి
భూషణాదుల దొంగవోటుగా హరించిన । వాహనాలెక్కి సవారిచేసి
చేతికందినవారి సిగలెల్ల గొఱిగించి । యుపవీతముల మొలకుచ్చుపోసి

యర్చకస్త్రీల గర్భాలయములఁ బట్టి । చెప్పరానట్టి విధములఁ జెఱచి చెఱచి కఱకు గుండెలు రూపులై తిరుగు మొఱకు । రక్కసుల రాజ్యమైపోయె నక్కటక్కట ! ! [2] 'మత విరోధపిశాచమీగతి' నరకమును భువిపై తాండవింప జేయగా రజాకార్లు 'అయ్యవార్ల నదల్చి రొయ్యలు దినిపించి నామ విభూతుల నాకివైచి' నారు 'నిష్ఠాగరిష్ఠుల నిచ్చి 'సున్తి'చ్చేసి కుచ్చుటోపీలు పెట్టి మతము మార్చినారు 'కుల కాంతలనుబట్టి బలవద్రతు లొనర్చి 'గోలు' మనంగ నిఖాలుగట్టి'నారు. 'ఇత్తెహాదులు దుష్ట పీడితాకులరవాగ్రేడితమ్ము' 'హిందూగృహేందిరా ప్రాణ మానోత్పదవ ప్రళయ'మైనదని కవివాపోయినారు. నిజామును సిద్దీక్ ధర్మాత్ము రాజు అవతారమని చెప్పినారు కాని కవి 'లోభమోహాంధధీ ప్రాభవుండభినవ ధృతరాష్ట్ర'[3] దని నిందించినారు.

'ఎంతరాక్షసత్వమెంత పైశాచిక
మెంతమత విరోధమెంత హింస' ! ! [4] వల్లభాయిపటేలు 'మేధా విభవ ప్రయోగ సముదారుడ'యి చేసిన వీర కార్యము ఫలితము 'త్రిలింగ విషయాభ్యుదయారుణ కాంతి పూరమై'నది. 'ఇది ఫలోదయము' ! ! ఈ తెలంగాణా

---

1. 3 వ పుట.
2. 4 వ పుట.
3. 44 వ పుట.
4. 40 వ పుట.

స్వాతంత్ర సమరగాథ పాక్ యుద్ధమునకు ముందే వ్రాసినను యుద్ధకాలములో ప్రజలకు స్ఫూర్తి నిచ్చి నిజాము పొందినట్లే అయూబుఖాను కూడ పతనము నందగలడను విశ్వాసమునకు దారి చూపిన దీపకళికయైనది. అట్లే అయూబు ఖాను 1965 యుద్ధములో ఓడిపోయి తరువాత నాలుగేండ్లలోనే పదవీచ్యుతు డైనాడు !!

**తెలంగాణ :** కుందుర్తి రచించిన కావ్యమిది. భారత గాథతో ఈ అభి నవ భారతగాథను పోల్చినారు ఇందును పదునెనిమిది పర్వములున్నవి. సంఘో దయ పర్వములో సామ్యవాదమెట్లు వికసించినది వర్ణించినారు. రజాకార్లు సాగిం చిన దౌష్ట్యములను మానభంగ, గృహదహన, రజాకార, దురాగత పర్వములలో హృదయ విదారకముగా వర్ణించినారు. భారతములో దుర్యోధనుడు భూదాహ ముతో చేసిన దారుణమే నిజాము కూడ హైదరాబాదు సంస్థానము విషయములో చేయుటలో సామ్యమున్నది. కావుననే దీనిని కవి భారత తుల్యముగా భావించుట ! ధనిక స్వామ్యముపై జరిగిన విప్లవముగా దీని వ్యాఖ్యానించి సామ్యవాదులకు, వాదమునకు శృంగార నీరాజనము లెత్తినాడు కుందుర్తి !

**శ్వమేవాహం :** ఆరుద్ర రచనమిది. బుర్రకథ పద్ధతిలో దీనిని నడిపి నిజాము సాగించిన దుశ్చర్యలను తీవ్రముగా విమర్శించినారు.

> 'భళానోయి భాయి తమ్ముడా ! భళానోయి భళి దాదానా
> నక్కలు తిరిగే తోటతో నాలుగు స్తంభాల కోటలో
> రాకాసి రాజొకడుండెదా వాడి గుండెరా, బండరా
> వాడి చూపు మధ్యాన పిండరా వాడి వాలుక వాడికత్తిరా
> వాడి రాజ్యము పొట్ల పాదురా వాడి ఆశల కంతులేదురా
> వాడి పేరు దగాకోరురా వాడి వజీరు పుండాకోరురా'

ఈ రీతిగా కథ సాగినది. నిజాము అపర మాయలఫకీరు హైదరాబాదు సంస్థానమే బాలనాగమ్మ కావుననే నిజాం పత్నిని 'వాడి పెండ్లాం గాండ్ల సంగురా వాడి రాజ్యాని కది సరంగురా' అనినారు. ఆక్రోశము తీవ్రమైనప్పుడు ఔచిత్యమునది పాటింపదు. కావుననే 'వాడు పెళ్ళానికే పెళ్ళావు' అని ముదురు పాకమున తిట్టినారు. ఉద్యమ

లక్షణ మిట్టిదే! ఈ గ్రంథము వెలువడినప్పటికి పోలీసుచర్య జరుగలేదు. కావుననే ఉద్యమపు వడగాల్పులు పీల్చి నిప్పులు మిసినారు ఆరుద్ర! దేశీయ యులకు కర్తవ్య ప్రబోధమే 'త్వమే వాహమ్' పరమార్థము.

'కొలిమిలో ఐ। లిమి తయారు
కమ్మెచ్చులు తీ। సిన శౌర్యం క్రౌ
ర్యం విరుగుడు। ధైర్యంచే కార్యం' జరుగవలెనని కవి ఆకాం
క్షించినారు ఈయన కూడా సామ్యవాద దృష్టితోనే సమస్యను విశ్లేషించినారు.

'ఒక నూతన వ్యవస్థ
ఒక పునీత వ్యవస్థ
అవి వుపపాద్యం
వామ పక్షాలని నాదాల పచ్చరించి
వామపక్ష విధానాల చరించి
నిర్మాణ కార్యక్రమాన్ని చెయ్యండి' అని ఆరుద్ర సందేశము.

**అగ్నిధార - రుద్రవీణ :** త్రిలింగోద్యమ కాలములో నిలిబడి మధ్యం దిన మార్తాండుడై దాశరథి రాల్చిన రెండు అంగారములివి. దాశరథి, ముందు వివరించిన విభాగములలో మూడవ పంథాకు చెందినవాడు. కావున మాతృదేశా రాధన, సామ్యవాద ప్రశంస, హిందూత్వ స్ఫూర్తి, వర్గ సంఘర్షణము ఏక కాలములోనే నిజాము కథ కన్పయించి అగ్నిధార, రుద్రవీణలను ఖండకావ్యము లను రచించినారు. వీరు స్వయముగా నిజాముకు వ్యతిరేకముగా సాగిన ఉద్య మములో పాల్గొని బందీకృతులైనారు కావుననే స్వానుభవమును కవితామయము చేసినారు. వారు బంధింపబడిన కారాగృహ మొకనాడు దేవాలయమట :

'ఒక కాలమ్మున ఇద్దిదేవళము వేయొక్క ప్డు దుర్గంబునే
డకటా! జైలయి కానుపించెను భవిష్యత్కాల మందెట్టి రూ
పకమున్ దాల్చునొ కాలచక్రగమన స్వాభావికా వర్తక
ల్పకమై దేవళమౌను దుర్గమగు నీ బందీ లె పాలింపగన్'

పూర్వము శిలాప్రతిమకల దేవాలయమైనచో సత్యాగ్రహులతో కూడిన కారాగారము సజీవ మానవాలయమేల కాదు ??

దాశరథిలోని ప్రముఖ రీతులివి గోచరించును :

**1. మాతృదేశ వర్ణనము :** త్రిలింగదేశము అఖండ భారతములోని భాగము. తీయని మాగాణమిది. నిజాముకు వ్యతిరేకముగా ప్రజాశక్తిని సమీకరించుటలో మాతృభూమిపై శ్రద్ధాభక్తులను కల్పించుట ప్రసిద్ధమైన కవితా పద్ధతియే. దాశరథి కూడ దీని ననుసరించినారు.

'మూడు కోటుల దేవతామూర్తులందు
కోటిమంది వసించెడి హాటకావ
నీ మహాఖండమీ రమణీయ భూమి
నా తెలంగాణ లేమ సౌందర్య సీమ'

**ఆంధ్ర సంకీర్తనము :** దేశముతోపాటే భాష ! కావుననే 'తెలుగు' శబ్దము పేరు విన్నంతనే కవి పరవశించిపోయినారు

"ఎన్నాళ్ళకు తెల్లవారె
ఎన్నాళ్ళకు కన్ను దూరె
వెలుగు వెలుగు వెలుగు వెలుగు
తెలుగు తెలుగు తెలుగు తెలుగు"

**శత్రునింద :** ఉద్యమమున కిది సహజ లక్షణము. శత్రునిందలో నిజాము చేసిన దారుణములను కవి ప్రజలముందుంచి హృదయ ముద్రవింప జేసినారు.

'ఓ నిజాము పిశాచమా ! కానరాదు
నిన్ను బోలినరాజు మా కెన్నడేని' ఇట్లు నిజామును పిశాచతుల్యునిగా భావించుటకు కారణమున్నది.

"అడుగడుగున యెడద నెత్రు
గడగడమని త్రాగినావు
పడతుల మానాలు దోచి
గడగడమని ముక్కుపట్టి

జడయక కూర్చుండి నావు
మడి కట్టుక నిలిచినావు
దగాకోరు బటాచోరు
రజాకారు పోషకుడవు
దిగి పొమ్మని జగత్తంత
నగారా కొడుతున్నది
దిగిపోవోయ్ తెగిపోవోయ్"

**4. కర్షక విజయము:** తెలంగాణా పోరాటమును ధనవంతునిపై కర్షకుడు సాగించిన విప్లవముగా చిత్రించుటలో దాశరథి సామ్యవాదమునకు సన్నిహితుడైనాడు.

"ప్రాణములొడ్డి ఘోర గహనాటవులన్ పడగొట్టి మంచి మా
గాణములన్ సృజించి ఎముకల్ నుసిచేసి పొలాల దున్ని భో
షాణములన్ నవాబునకు స్వర్ణము నింపిన రైతుదే తెలం
గాణము రైతుదే ముసలి నక్కకు రాజరికంబు దక్కునే"

'ఉస్సురనెడి పేదవాడు' పరుడెవడో నిరంకుశుని జాతి ప్రభుత్వము చేయుట సహింపజాలడని కార్మిక, కర్షక చైతన్యము, వర్గ సంఘర్షణ సూచించినారు.

**జాగృతి:** ఉద్యమములో కవికి గురుతరమైన బాధ్యత కలదు. జాతిని సత్య పథమువైపు నడిపింపవలసిన అప్రకటితుడైన శాసనకర్త అతడు. దాశరథి యీ బాధ్యతను ప్రశస్తముగా నిర్వహించి ఉద్యమము నాటికంకను నిద్దురపోయెడి సోమరుల మత్తును వదిలించినాడు! కావుననే తరువాత సగర్వముగా ఇట్లు చెప్పుకొనినారు

'పాటలు పాడితిన్ తెలుగు బాబులు నిద్దుర మేలుకోగ పో
రాటము సేయగా కరకు రాచరికమ్మును కూలద్రోయగా
కోటి గళాల నొక్కకడ గూర్చితి విప్లవ శంఖమెత్తితిన్
నాటికి నేటికిన్ తెలుగునాటను కాంతి పతాక లెత్తితిన్'

**వజ్రాయుధం - సర్పయాగం:** తెలంగాణా సమస్యను కేవలము మార్క్సిష్టు దృక్పథముతోనే పరిశీలించిన కవులు రమణారెడ్డి, గంగినేని, రెంటాల,

సోమసుందర్ ప్రభృతులు కలరు, వీరందరును ఖండికలను ప్రచురించింది. అందు ముఖ్యముగా రెంటాల రచించిన 'సర్పయాగం' సోమసుందర్ 'వజ్రాయుధం' పేర్కొనవలసిన రచనలు. నిజాము దుర్గమును ఛేదించి అరుణ పతాకమును ఎగురవేయవలెనని 'వజ్రాయుధం'లో సోమసుందర్ కోరినారు. 'తెలంగాణా సమరగీతం'లో రెంటాల దీనిని ధనవంతులకు- నిర్ధనులకు మధ్య జరిగిన సంఘర్షణముగా చిత్రించినారు. అడ్లూరి అయోధ్య రామకవి, రమణారెడ్డి ఈ వర్గములోనికే చేరెదరు. కాళోజీ నారాయణరావుగారు

'నల్లగొండలో నాజీశక్తుల
నగ్ననృత్య మింకెన్నాళ్లు' అని గర్జించి నిజామును నాజీలతో పోల్చి నిందించుట ఈ రీతిలోనికే చేరును.

**ఇతర ఖండికలు :** విడిగా ఖండికలు ప్రచురించిన వారెందరో ఉద్యమ ప్రభావితులు కలరు వానమామలై వరదాచార్యులవారి 'రాజప్రముఖుడు నైజామ్లు' ఖండిక మిక్కిలి ప్రసిద్ధమైనది.

'నైజామా నైజామా నైజము నీకీయూట' అని గీతము ప్రారంభించి

'రక్కసి చేష్టలు చేసిరి రజాక్వి నీవో కాని
ఒక్కొక్కటి దలచికొనిన ఒళ్లంతా ముండ్లుతేలు
తెక్కా పత్రం లేని కుక్కచావు చావకుండ
ఉక్కు మనిషి పటేలు దయనున్నా మీ యింతైనా' అని విలపించినారు. నిజామునకు శరణమిచ్చుట కూడ కవి సహింపలేక పోయినారు.

'ఏబది లక్షల రూకలు ఏటేటా ప్రతిఫలమట
గుఱ్ఱము పడవేసినసూ గగ్గిళ్ల సమర్పణమట' అని అవహేళన చేసినారు. నిజముగా నిజాము తెలంగాణా రైతును పడవేసిన గుఱ్ఱమే! 'కాలునట్టి యిండ్లు', 'ప్రేలు మందుగుండ్లు', 'అరిగిన మానాలు', 'తరిగిన ప్రాణాలు' కవియే కాదు, మానవుడెవ్వడును మరచిపోలేని దుస్సంఘటనములు!

'చినిగిన గుడ్డలు తొడిగే
చిత్రపు ఫకీరువయా

ఇమును పలెనె బంగారపు

ఇటుకలింక గూర్చుమయా' అని వరదాచార్యులవారు నిజామును ద్వేషించుట, సకారణము, సహేతుకమునైన చర్య! శివప్రసాద్ రచించిన ఖండికలలో కూడ నిజామును ద్వేషించుట, నాటి హైదరాబాదుపై సాయుధ విప్లవము సాగించిన మోహన్‌రానెడే వంటి వీరులను స్తుతించుట గోచరించును కాని దానికి సామ్యవాద స్ఫూర్తి కారణము కాదు. నిజాము విదేశీయుడు. పరధర్మమునకు చెందినవాడు. కావుననే జాతీయశక్తి అతనిని హతమార్చినదని శివప్రసాద్ భావన. 'మోహన్‌రానెడే'[1] 'స్వాగత గీతిక'[2] అను రెండు ఖండికలలోను ఇదే దృష్టి గోచరించును. కావుననే రజాకార్లతో సమముగా, నల్గొండ ప్రాంతములో నాగిరెడ్డి ఆధ్వర్యమున జరిగిన సామ్యవాదుల పోరాటములో పాల్గొనిన కమ్యూనిష్టులను కూడ 'స్వాగత గీతిక'లో విమర్శించినాడు

నాడు రచనలు సాగించిన తెలంగాణా కవులు లీలగా హేలగా రసానందము కొఱకు 'కప్పుర విడెమాత్మ కింపైన' భోజనముల తరువాత వ్రాసినవారు కారు. ఉద్యమము కొఱకు ఉద్యమముచేత, ఉద్యమము నడుమ రచనలు వెలువరించినవారు. 'జైల్లో రైల్లో తోటలో బాటలో కత్తుల్లో మెత్తని పూసుత్తుల్లో ఆకలో ఓటమిలో.... తెలంగాణం పుటలు విప్పి మనిషి మనిషి మధ్య పంక్తులు చదివి పంక్తుల గర్భంలోకి దిగి భయాలను విస్మయాలను చూచి గుండెలతో పోట్లాడి అలసిపోయి'[3] వ్రాసినారు. కళకొరకు కాక కేవలము ఉద్యమముకొరకే కవిత. కవితతో జాతికి జాగరణ కల్పింపకున్నచో బ్రతుకు వ్యర్థమని వారి భావన

"కాలము వ్యర్థము చేయగ కళయని
వ్రాసిన కైతలు చాలింక
కైతచేత మేల్కొల్పకున్న
కాళోజీ కాయమే చాలింక"[4]

1. జాగృతి, ఫిబ్రవరి 69
2. జనసందేశ్, మార్చి 69
3. దాశరథి. పునర్నవం, మననం 8వ పుట.
4. కాళోజీ నారాయణరావు.

**స్వేచ్ఛ:** రైత ప్రజలను మేల్కొల్పినది స్వేచ్ఛ లభించినది ఉద్యమము జయప్రదమైనది. 'పేదజనం నేడు మొగం తుడుచుకొని మేలుకుంది.'[1] కవులు గట్టిగా గాలిని పీల్చుకొని వెలుగులకై వేచి నిలిచినారు కాంతి విరజిమ్ముచు అరుణ కిరణములు కన్పడినవి. వైదిక సంధ్యలో ఋషులు సూర్య సంకీర్తనము చేసినట్లు తెలంగాణములోని కవులు 'కాంతినేత్రమును విచ్చి'[2] 'తమ మండలాన మండెడి స్వాతంత్ర్య భానునికి నీరాజనము అర్పించినారు. జాతి మయూరమై నర్తించినది. హరిణమై త్రిలింగ తపోవాటికలో విహరించినది

> "తమ మంత్రం పారదింక
> ఉచ్చు త్రెంచుకొనెను జింక
> ఇక స్వేచ్ఛా ప్రయాణము
> ఇదే తెలంగాణము"[3]

# 1969 తెలంగాణా ఆందోళనము

అనిబద్ధోద్యమముల క్రమములో తెలంగాణా 1969 ఆందోళనము చేరునని ముందే మనవి చేసితిని. ఇందుకొక కారణమున్నది. తెలంగాణమును ప్రత్యేక రాష్ట్రముగా చేయవలెనను ఆందోళన మొకవైపు సాగుచుండగా కవులందఱును సమైక్యత నుద్బోధించెడి ఖండికలనే రచింపసాగిరి. కావుననే దీని సమగ్ర స్వరూపమును భవిష్యత్తులోనే నిర్ణయింపవలసి యున్నది. ప్రస్తుతమున కిందలి ప్రధాన తత్వముప మాత్రమే సూచింపదలచితిని.

త్రిలింగమను నామాంతరము గల సమగ్రాంధ్ర దేశము ప్రాదేశికముగా తెలంగాణము, కోస్తా (సర్కారు) ప్రాంతము, రాయలసీమలను మూడు పేర్లతో విభజింపబడి పిలువబడుచున్నది. పోలీసుచర్య (1948) వఱకును నిజాము పాలనలో క్రుమ్మగ్గిన తెలంగాణము 1956 లో ఆంధ్ర ప్రాంతముతో కలసిపోయి 'ఆంధ్రప్రదేశ' మేర్పడినది కాని 1969లో తెలంగాణము ప్రత్యేక రాష్ట్రముగా

---

1. పునర్నవం 11వ పుట.
2, 3. 'తెలంగాణం' ఖండిక. పునర్నవం - దాశరథి 12వ పుట.

నిర్మింపవలెనను ఆందోళన మొకటి ప్రారంభమైనది. ఆర్థిక పరిస్థితులు ఉద్యోగాద్యుపాధి సౌకర్యములలో కొన్ని అన్యాయములు - దీనికి ప్రధానకారణములుగా చెప్పబడినవి. బాహిరమైన కారణములెట్లున్నను భారతదేశము లోని వివిధ ప్రాంతములు నీరక్షీర న్యాయముతో కలసిపోక పాయసములో పాలవలె చేరక శాకములో శనగలవలె మిలిగిపోవుట గమనార్హమైన యంశము.

**విశ్లేషణము :** 1969 లో తెలంగాణాలో సాగిన ఆందోళనమును సామ్యవాదులు ఫ్యూడల్ శక్తుల మధ్య జరిగిన సంఘర్షణముగా భావింపగా,[1] మఱొక వర్గము దీనిని అఖిల భారత దృష్టితో పరిశీలించి మహారాష్ట్ర, అస్సాం వంటి ప్రాంతములలో కూడ ఇట్టి ధోరణి ప్రబలుటకుగల కారణము జాతీయాత్మ విస్మృతి చెందబడుటయేనని తీర్మానించినది. శ్రీశ్రీ మొదలైన కవులు ఖమ్మం సమ్మేళనములలో పాల్గొనుటకి మొదటి వాదము కారణము కాగా ప్రముఖ కవుల రచనములెన్నో రెండవ వాదమున కుపబలకముగా నున్నవి.

ప్రత్యేక తెలంగాణము కావలెనని కాళోజీ నారాయణరావు వంటి కొందఱు కవులు రచనములు సాగించినను నేటి వఱకును గణనీయమైన గ్రంథము లేవియును వెలువడలేదు ప్రత్యేక తెలంగాణా సదస్సులలో కొందఱు పాడిన ప్రజాగీతములు. కొన్ని ప్రజల నాకర్షించినవి. మఱికొన్ని గీతములు సమకాలీనమైన రాజకీయ వర్తనములను విమర్శించుచు గానముచేయబడినవి. తెలంగాణాకు జరిగిన అన్యాయములను చాటుట ఇందలి ప్రధానతత్వము. ఈ వర్ణనమునకు

---

1. "బ్రిటిషు సామ్రాజ్యవాదులు నైజాం నవాబులు లాలూచీపడి తెలుగు భూమిని ముక్కచెక్కలు చేశారు. అర్థ శతాబ్దం ప్రజా పోరాటాలద్వారా సామ్రాజ్యవాదుల ఫ్యూడల్ తాబేదారుల పన్నాగం భగ్నమయింది. పూజ్యులు పొట్టి శ్రీరాములు కొమరయ్య, నర్సింహారెడ్డి, రామిరెడ్డి, మొదలైన అనేకమంది అమరవీరుల త్యాగ ఫలితంగా తెలుగుజాతి తిరిగి ఏకమయింది. నాలుగుకోట్ల తెలుగులం ఐక్యమై ఆంధ్రప్రదేశ్‌ను ఏర్పరచుకొన్న పన్నెండేండ్లకే చరిత్రను వెనక్కి నడిపించాలనడం జాతి విచ్ఛిత్తికి పూనుకోవడం సిగ్గుచేటు" ప్రగతి సంపాదకీయం. 'తెలుగుతల్లి రక్తాశ్రువులు' 6.6.1969.

చెందిన కవులు తక్కువ. ఉన్నంతలో లక్ష్మయ్య వ్రాసిన 'జై తెలంగాణా' అను గేయ సంపుటి మాత్రము పేర్కొనదగియున్నది.[1]

సమైక్యతను బోధించిన వర్గమునకు చెందిన రచనలలో కె శివారెడ్డిగారి 'వెలుగు బావుటా' ఖండకావ్యము పేర్కొనదగినది.

'కుడిచేయి ఎడమ కంట్లో
వేలు పెట్టి పొడిచింది
ఎడమచేయి కుడి కంటో
జిల్లేడు పాలు కొట్టింది' అనుటలోవారు అన్నదమ్ముల మధ్య చెలరేగిన సంఘర్షణమునకు విచారము వ్యక్తపరచినారు. ఆంధ్రదేశమను దేహములో ఆంధ్ర-తెలంగాణా ప్రాంతములు వివిధాంగములవంటి వనియును వీని మధ్య సమన్వయములేనిదే దేహమెటు సుఖవంతముగా ఉండగలదని వీరు ప్రశ్నించినారు. "ఈదేహం ఒకటే, ఆకళ్ళు చేతులు ఈదేహానికి చెందినవే"ననుటలో భావమిదే !!

ఈ సందర్భములో ఆకాశవాణిలో సౌమ్య ఉగాది కవి సమ్మేళన సందర్భములో వచ్చిన గీతములను పేర్కొనవలసి యున్నది ప్రముఖాంధ్ర కవులందరును దీనిలో పాల్గొనినారు. శ్రీశ్రీ 'సామ్య'వాదము మాటకేమిగాని 'సౌమ్య' వాదము కావలెనని శబ్దవైచిత్రిని ప్రదర్శించి సంవత్సరము సార్థకనామ ధేయముతో పురోగమింపవలెనని కోరినారు నాయని కృష్ణకుమారిగారు ఇద్దరు సోదరుల మధ్య సంవాదము సాగుచున్నట్లుగా చిత్రించి సంఘర్షణ నివారింపవలెనని హితవు బోధించినారు. ఈ సమ్మేళన గీతములలో విద్వాన్ విశ్వం దాశరథి, నారాయణరెడ్డి గార్ల రచనలు మేలు బంతులై నిలిచినవి. 'ఆంధ్రుల రాజధాని గోడలపై ప్రముఖముగా వ్రాసిరన్నచో కవిత్వమునకు ఉద్యమ కాలములో గల వ్యాప్తిని వేఱుగా చెప్పనవసరములేదు. 'అంతా ఒక పీడకల' అను వీరి ఖండిక మిక్కిలి ప్రజాదరణమును పొందినది.

---

1. ఎక్కువ భాగమిందు సినిమా పాటల వరుసలలోని ప్రచార గీతములున్నవి 12 ఏండ్లు విశాలాంధ్రను పాండవుల వనవాసముతోను వేటి పోరాటమును యుద్ధపర్వముతోను ఒక గేయముతో లక్ష్మయ్య కవి (14వ పుట) అభివర్ణించినారు. ఆంధ్రప్రదేశ్ పేరు 'తెలుగునాడు యనవదేల?' (7 పు.) అని ప్రశ్నించి త్రిలింగ దేశాభిమానము ప్రకటించినారు.

సమైక్యతను వాంఛించిన గీతములలో ఈశ్వరలక్ష్మి భగీరథరావుగారి రచన పేర్కొనదగినది. గాంధీజీ శతజయంతి వత్సరములోనే హింసాకాండ జరుగుట కవి గుండెను పిండి వేసినది. 'బాపూజీతోటి ఒక్కమాట'[1] అను ఖండికలో 'శతవృద్ధువినీ వాస్తావని ఆకాశం ఎత్తున భూమ్మీదంతా పందిరి వేశాం.... అయితే మేం అనుకోలేదు ఇంతలో యింతౌందుందని'[2] అనుటలో కేవలమాంధ్ర దేశములో చెలరేగిన ఈర్ష్యాద్వేషములే కాక పూర్తి భారత దేశమును దృష్టిలో నిడుకొని ప్రవచించి నట్లూహింపవచ్చును. గాంధీజీ చేతికర్రను శాంతికిగాక హింసకు ఉపయోగించుచున్నారని ఆయనకు స్వాగతము పలుకవలసిన 'మామిడి తోరణాల్తో మానవత్వాన్ని బంధిస్తారని'[3] తాను కలనైన భావింపలేదని కవి పల్కినాడు. ఈ జాతి రచనలు శతాధికములు వచ్చినవి! డి. శంకర్‌గారు 'కాకతీయ కృష్ణరాయ గణనీయ రెడ్డిరాయ విభులేలిన సీమ మాద'[4]ని అభివర్ణించుటలో తెలంగాణా, రాయలసీమ, ఆంధ్ర ప్రాంతములకు మూడింటికి సంకేతముగా ముగ్గురు ప్రభువులను పేర్కొనుట గమనార్హము!! జి. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు 'బమ్మెర పోతనార్యుడు విభాసిలి భక్తిమరంద బిందువుల్ జిమ్మిన శాంతి'[5] సీమలో చిచ్చు రగులుకొనుటకు విలపించుటలో గతవైభవమును ప్రాచీన స్మృతులను సంస్మరించి వర్తమానమును గాంచి చింతించిన తత్వము గోచరించినది. 'ఏమాట కామాటే చెప్పుకోవాలి ఈ మాత్రానికా ఆ మహాత్ముడు తపించినది'[6] అని విద్వాన్ విశ్వం విలపించుటలో కూడ ఈ భావమే గోచరించును. సి. నారాయణరెడ్డిగారు 'చినిగిపోయిన సింహాసనానికి జిగురుపెట్టి లాభం లేద'[7]ని సింహాసన శబ్దమునను రాచరికమునకు ప్రతీకగా స్వీకరించి ఫ్యూడల్ వ్యవస్థను ధిక్కరించినారు. 'బూర్జువా భూస్వామ్య శక్తుల బూజుపట్టిన వల్లమాలిన పెత్తనమ్మే'[8] ఈ ముప్పుకు కారణమని గజ్జల మల్లారెడ్డిగారు వర్గసంఘర్షణ సిద్ధాంతము నాధారముగా దీనిని చిత్రించినారు. ఇట్టి గేయములు కొన్ని వందలు వచ్చినవి. అన్నింటిని పేర్కొనకున్నను నేనిందు ఉద్యమములోని మౌలికమైన తత్వమును మాత్రము ప్రదర్శించితిని.

---

1, 2, 3. కృష్ణాపత్రిక 3-5-69.

4. నిజరూపం ఖండిక. అదే సంచిక.

5. రసమంజరి 6వ పుట. 19-4-69 కృ. ప.

6 ఆకాశవాణి ఉగాది కవి సమ్మేళన గీతము. 'మాణిక్యవీణ' శీర్షికలో ప్రచురణ. ఆంధ్రప్రభ. అందుకే కవిత వ్రాస్తాను. 9-4-69 సంచిక (వార)

7. ఆంధ్రభూమి.

8 సమరగీత. ప్రగతి 6వ పుట. 16-5-1969.

## సప్తమాధ్యాయము

# సాంఘికోద్యమములు

### మహిళోద్యమము :

యుగయుగములుగా భారతనారిని సీతగా, సావిత్రిగా దమయంతిగా, చంద్రమతిగా ప్రశంశించి, పూజించి చివర కాధునికయుగమున కామెకీ దేశము మిగిల్చిన దేమున్నది? ఇన్ని కన్నీళ్లు, ఇంత కఠిన పాషాణసదృశ జీవన శకలము తప్ప !! నాడుమాత్ర మామె సుఖపడినదెన్నడు ?? అగ్నిలోనో అంతకుని కడనో పరీక్షింపబడినది- జూదములో పణమైనది. చివరకు నడివీధిలో వేలము పాడబడినది. మాతగా మన్ననలందినది, నిజమేకాని మమతల మల్లెలలో మైమరచి పోగలిగినదా ?? యుగయుగములుగా ఇట్లు అభిశప్తయైన స్త్రీ. పురుషుడు చేసిన పాపమునకు పాషాణముగా మారిన స్త్రీ, తొలిసారిగా ఇరువదవ శతాబ్దములో తన దీనకంఠమును విప్పి జగత్తు దృష్టిని ఆకర్షించినది. కన్నీటి కాలువలలో వికసించిన బాధామయ కమలములతో కదంబమును నిర్మించి కాల పురుషునికి కానుకగా సమర్పించినది. కన్నీరు కాదది కవోష్ణ సాగర సంగీతము. కావుననే కన్నులు నులుముకొని సమాజము తొలిసారిగా లేచి నిలిచినది. తన పాపమునకు తానే సిగ్గుపడి తలను వంచుకొనినది. ఈ యవమానము చాలదా, శిరచ్ఛేద సదృశమైనది ??

**విశ్లేషణము :** ఆధునిక యుగమున ఆంధ్రదేశములో జరిగిన సామాజిక పరివర్తనమును సాంఘికోద్యమములను శాస్త్రీయముగా పరిశీలించినచో మనకు కన్పడెడి ప్రముఖ విభాగములివి :

(1) మహిళాభ్యుదయోద్యమము.

(2) హరిజనోద్యమము.

(3) తదితరములైన సాంఘిక వ్యతిరేక శక్తులపై పోరాటము.

మహిళాభ్యుదయములో మఱల అంతశ్శాఖలు కలవు :

1) స్త్రీ విద్య.
2) రజస్వలానంతర వివాహము.
3) కన్యాశుల్కము - వరశుల్కము.
4) వితంతూద్వాహము.
5) దేవదాసీ జోగినీ వృత్తి నిర్మూలనము.
6) వేశ్యాకుల నిర్మూలనము.

హరిజనోద్యమము వర్ణవ్యవస్థా శైథిల్యము యొక్క పరిణామము. కుల వ్యవస్థను నిర్మూలించుటకు సాగిన పోరాటమును గూర్చియు, సంఘ వ్యతిరేక శక్తులపై కవులు సాగించిన దండయాత్రను గూర్చియు తరువాత చర్చించెదను ప్రస్తుతము మహిళాభ్యుదయమున కాఘాతముగా నిలిచిన సమస్యలలోని ఆంతరమైన తత్వమును మనవి చేసెదను.

**రెండు ప్రమాదములు :** తొలి పుటలలోనే భౌతిక- ఆధ్యాత్మిక శక్తులకు వర్తమాన కాలములో జరుగుచున్న నిరంతర సంఘర్షణమును వివరించితిని. స్త్రీ సమస్యలలో ప్రముఖమైన వానికి కూడ కారణమీ సంఘర్షణమేనని తత్వ పరిశీలనలో వ్యక్తమగును. మానవునిలో ఆధ్యాత్మిక శక్తి. దృష్టి కొలవడిన కొలది, ఆతడంబరము చుంబించెడి తాత్త్విక దశనుండి అధఃపతితుడై భూమిని దాటి లేవలేడు. పృథ్వి జడతత్వము. భౌమికమైన దృష్టి పెరిగినకొలది ఆర్థిక దాస్యము జీవునికి మితిమీరును. తత్ఫలితముగా ఆధ్యాత్మికత్వమునకు కూడ ఆత దధునాతన భాష్యము చెప్పుటకు సాహసించును ఇందువలన జరిగెడి ప్రమాదములు :

1) అతివేల భౌతిక ప్రవృత్తి.

2) ఆధ్యాత్మిక మౌఢ్యము.

మహిళా సమస్యలకే కాదు తదితర సాంఘిక సమస్యలన్నిటికిని మూల కారణములివి.

స్త్రీ విద్యావంతురాలు కాకుండుటకు మత మౌఢ్యము కారణము. స్త్రీ స్వాతంత్ర్యము సర్వథా వర్జనీయమని నవీనకాలములో సనాతనులు వ్యాఖ్యానించుటకు వేదవిద్యకు సక్రమమైన వ్యాఖ్యానము నెఱుంగకపోవుటే కారణము. రజస్వలానంతర వివాహము శాస్త్ర సమ్మతమే. బాల్య వివాహమొక సాంఘిక

దురాచారము. దురాచారమో సదాచారమో పరిశీలింపకుండ సనాతనత్వము సిద్ధించిన కొలది సంప్రదాయము పేర దానిని మత గ్రంథములలో చేర్చుట అనాదిగా జరిగెడి అన్యాయములలో నొకటి బాల్యవివాహ మీ కోవలో చేరినది. వితంతూద్వాహము కూడ అట్టిదే!

కల్యాణము, కాన్యాకుబ్జము, అర్థ సంబంధులు, ద్రవ్య పరిభాషలో స్వర్ణమే కాక, స్త్రీ శ్రమ, వంటి తత్త్వములు కూడ అర్థము క్రిందనే లెక్క! పరిమితము కాని కామము లాలసకు త్రోవ చూపును. భౌతికముగా నరుడు పతితుడౌట కిది రాచబాట. నాడాతడు స్త్రీని ధనమున కమ్మును. లేదా ధనము కొలుకు కొనును. అర్థము మే పరమార్థమైన దశయిది! అట్లే ఇంద్రియ లౌల్యముతో పతితుడైన మానవుడు ఆనందము ఆత్మనిష్ఠమని ఎఱుంగక వ్యభిచరించును. ధన సంగ్రహణ బుద్ధితో వేశ్య శరీరము నొక పదార్థముగా మూల్యమున కర్పించును. మానవత్వమునకు దైవీతత్వమునకు కాక వ్యాపారమునకు, అర్థమునకు, మకుటము తొడిగిన చర్యయిది!! దేవదాసి భువికి దివికి మధ్య నిలిచిన లంకె. కళతో కైవల్యము చూపెడి వ్యవస్థకామె చిహ్నము. కాని ఆధ్యాత్మికత్వము తిరోగమించినప్పుడు కళాపంతులు వ్యవస్థ, కామవ్యవస్థగా పరిణామము నందినది. కాలక్రమములో జరిగిన మహత్తరమైన అనివార్యమైన పరివర్తనమిది. కాలమును చక్రముతో పోల్చినప్పుడు అందలి ఆకులు క్రిందివి మీదికెట్లు వచ్చునో మీదివి తిరిగి క్రిందికి పోవుట కూడ సహజమే! కావుననే సంస్కర్తలు నవీన మహర్షులై సాంఘిక దౌష్ట్యము నెదిరించినారు. దధీచి జీమూతవాహనులవలె స్వశరీర సమర్పణముతో సమాజ కల్యాణార్థము మహోద్యమములను నడిపినారు. ఆ యుద్యమముల కథను వివరించెదను.

**1. స్త్రీ విద్య :** వేదకాలమున స్త్రీకి సమాజములో సమున్నత స్థానమున్నది. స్త్రీ వేదాధ్యయన మొనర్చి యజ్ఞములు నిర్వహించినట్లు ప్రమాణములు కలవు! సులభ, గార్గీ, మైత్రేయివంటి విదుషీమణులు ఉపనిషత్కాలములో వినుతి కెక్కిరి. చారిత్రక యుగములో కూడ శంకర - మండనమిశ్రులకు శాస్త్రవివాదములో మధ్యవర్తిత్వము నెఱపినది విద్యాధరియను పేరంబరగు ఉభయ భారతీ దేవియే! కావ్యయుగములోనూ స్త్రీ 'ఇయంగేహే లక్ష్మీ ఇయమమృతవర్తిన్' అను దృష్టితోనే సంభావింపబడినది కాని కేవలముప భోగ్యవస్తువను భావము

వైదేశిక దండయాత్రల వలన దిగుమతియైన పర సంస్కృతీ ప్రభావమేనని సిద్ధాంతీకరింప వచ్చును.

**గౌతముని వర్గీకరణము :** స్త్రీ అవిద్యావంతురాలైనచో సంతతి మొత్తమట్లేయగును నాడు దేశమెల్ల అవిద్య తాండవించి అనాచారములు ప్రబలును. శుల్కపద్ధతి శతాబ్దములుగా ఇట్లే వ్యాప్తిలోనికి వచ్చినది. బుద్ధ భగవానుకు సమకాలీన సాంఘిక పరిస్థితులను గమనించి అవిద్యావంతులై, శుల్క సంప్రదాయము పాటించువారి నిట్లు తీవ్రముగా నిరసించెను.[1]

(ద్రోణుడను శిష్యునితో) 'ద్రోణా! మీ పూర్వఋషులు, మంత్ర ప్రవక్తలును, మంత్రకర్తలును అయిదు విధములగు బ్రాహ్మణులను చెప్పియున్నారు. 1) బ్రహ్మసముడు, 2) దేవసముడు, 3) మర్యాదుడు, 4) సంభిన్న మర్యాదుడు, 5) బ్రాహ్మణ చండాలుడు....క్రయ విక్రయముల ద్వారాకాక జల సహితముగా నీయఁబడిన బ్రాహ్మణిని మాత్రమే గ్రహించి యితర స్త్రీలతో కలియని వారు....దేవసములు, ధర్మమునగాని యధర్మమునఁ గాని క్రయ విక్రయముల వలనగాని భార్యను గ్రహించి క్షత్రియ స్త్రీని ఋతుమతిని కూడ కామముకొరకై కలియుచుఁ బ్రాచీన బ్రాహ్మణ మర్యాదల నతిక్రమించు బ్రాహ్మణులను సంభిన్న మర్యాదులందురు." దీనినిబట్టి ఈ అనాచారమునకు కూడ చరిత్ర కలదనుట స్పష్టము. స్త్రీ విద్య దీనికి రాజౌషధము.

**శాస్త్రప్రమాణము :** స్త్రీ విద్యను శాస్త్రము నిషేధించెననుట అవిచార మూలకము. 'పల్యా అపి మంత్ర పథోభవత్యేవేత్యాది' కాత్యాయన గృహ్య సూత్రము. (భార్యను కూడ వేదమంత్రములు పఠింపనిమ్ము) 'ప్రావృతాం యజ్ఞోపవీతి నీ మభ్యుదాన యజపేత్ సోమోదదగ్ గంధర్వాయేంతి గోభిల గృహ్యసూత్రము! (సుందరమైన వస్త్రములను యజ్ఞోపవీతమును ధరించిన కన్యను వివాహవేదిక ప్రవేశింపనిమ్ము). ఈ వాక్యములచే సామాన్య విద్యయే కాక వేదాధికారము కూడ ఉన్నట్లును, యజ్ఞోపవీత ధారణముతో పురుషునివలెనే జన్నము కూడ చేయునదియును తెలియుచున్నది. కావుననే నవీన సంస్కర్తలు

1. త్రిపిటకముల నుండి (అను) శ్రీ చర్ల గణపతిశాస్త్రిగారు (బుద్ధ జీవిత ఘటనములు) 119 పుట.

వేదమతానుసారముగా 'ప్రథమాశ్రమమున బ్రహ్మచర్యమును పాటించుచు విద్యాబుద్ధుల గఱచుట యావశ్యకమగును. ఇట్లు ప్రథమ వయస్సు (25 సం॥) గడిపి యటుపై యేబది యేండ్లవఱకు గృహస్థ ధర్మముల పాటింపవలెనని' బాటినారు.[1] తద్విరుద్ధమైనది అశాస్త్రీయమని తాత్పర్యము. స్త్రీకిట్లు విద్యార్హత, వయో వివాహము నిర్ణయించుటతో సమాజమును సువ్యవస్థితముగా, నిల్పుటకు మహర్షులు తోడ్పడిరి.

**బాల్యవివాహ నిషేధము:** ఇట్లు చెప్పుటచే బాల్యవివాహము సనాతన కాలములో నిషేధింపబడినదని వేఱుగా చెప్పనవసరము లేదు. ఆశ్వలాయన,[2] ఆపస్తంబ సూత్రానుసారము రజస్వలానంతర వివాహమే ఆర్షసమ్మతమని వేద విదులు వచింపగా జైమిని, హిరణ్యకేశవులు దానిని బలపరచినారు. సీత, రుక్మిణి. దమయంతుల వివాహములందులకు లక్ష్యములుగా చూపినారు.

ఆధునిక వైద్యులును బాల్యవివాహములను శరీర శాస్త్రప్రకారము నిషేధించిరి 'జంతుకోటిలో పూర్ణమైన శరీరపాటవము కలుగక పూర్వము సంతానము కను జంతువులేదు మానవ శరీరమునకు పెంపు 25వ సంవత్సరమున పూర్తియగును-'[3] కావుననే వివాహ వయోపరిమితిని ఇరువదియైదు వత్సరములుగా స్థిరపరచిరి. '14 సంవత్సరములకు పూర్వమే పునస్సంధానమగుట పిల్లదాని యావజ్జీవము అనారోగ్యమునకు కారణము. ఆ చిన్న వయసులో ఒక పిల్ల పుట్టినప్పటికిని తిరిగి సంతానము కలుగుట దుర్లభము. బలహీనమయిన, రోగములు కల, పిల్లల జననమునకిది కారణము'[4] 'బ్రహ్మచర్యేణ కన్యాయు వానం విందతే పతిం' అని అథర్వవేదము వచించినను (బ్రహ్మచర్యము, విద్యాపూర్తి అయిన తరువాతనే కన్య యవ్వనవంతుడైన పతిని వరింపవలెను) తురుష్కుల దండయాత్రల ఫలితముగా ప్రవేశించిన సాంఘిక దురాచారము తరువాతి కాలములలో సంప్రదాయముగా నిలిచిపోయినది.

---

1. వైదికసంధ్య - ఆర్యసమాజ పరిచయము. 113వ పుట.
2. సమానం బ్రహ్మచర్యమ్ - ఆశ్వలాయన సూత్రము.
3. డాక్టర్ ఇందుమాధవ మల్లిక్ - బాల్య వివాహములపై ప్రసంగాంశము. 9 నవంబరు, 1912. కృష్ణా పత్రిక 8వ పుట.
4. బాల్య వివాహములపై P.F. సన్‌దొరసాని నివేదిక

**కన్యాశుల్కము - వరశుల్కము :** వయోవృద్ధుని నుండి ధనము స్వీకరించి కుమార్తె నమ్ముట కన్యాశుల్కము కాగా, పురుషునకు ధనమునిచ్చి కన్యాదానము చేయుట వరశుల్కము. ఈ శుల్కము ఐచ్ఛికము కాక శుల్కము కొలతకే వివాహ నిర్ణయములు జరుగుటతో పెండ్లి నూరేండ్ల పంట, ఆధ్యాత్మికానుబంధము కాక కేవలము వ్యాపారముగా మిగిలిపోయినది. ఆంధ్ర దేశమున ఇరువదవ శతాబ్దమున ప్రథమ భాగములో కన్యాశుల్కము పిల్చి పిప్పిచేయగా ద్వితీయ తృతీయార్థములలో వరశుల్కము కరాళ నృత్యమును చేయుచున్నది. అనాగరిక జాతులలో దీనిని 'ఓలి' యందురు. విదేశములలో కూడ ఈ దురాచారము తీవ్రముగా వ్యాపించి ప్రాణాంతకముగా పరిణమించినది.[1] ఐతరేయ బ్రాహ్మణములోని శునశ్శేపుని కథ నుదాహరించుటతో పురాణములలోని ఐచ్ఛికమైన అరణమును శాస్త్రబద్ధముగా తీర్మానించుటకు విద్వాంసులు చేయుచున్నారనినచో వారు తమలోని శుద్ధ భౌతికవాదమునకు శాస్త్రీయ పరివేషమును ఆచ్ఛాదనగా చేసి ఆత్మవంచన చేసికొనుచున్నారనుటే సమంజసము.

**సతి :** పురాణ కాలములో భర్త మరణవార్త విన్నంతనే సతి అసువులను బాసినట్లును, సతీపతులనేకముగా దహనము చేసినట్లును పాతివ్రత్యమునకుదాహరణముగా కథలు కలవు. మధ్యయుగములలో సజీవురాలైన స్త్రీని భర్తతోబాటు చితికెక్కించుట సంప్రదాయమైనది. రసపుత్ర నారీమణులు తురుష్కుల చేతిలో పడకుండ ఆత్మ రక్షణార్థము 'జోహార్' చేసినమాట నిజమే కాని సామాన్య వనితలట్లు ఆధునిక కాలములో చేయకుండుట వారి పతిభక్తికి కళంక

---

1. టెల్‌అవివ్. అక్టోబర్ 14. ఇజ్రాయెల్-అరబ్ ఉత్తర భాగంలోని ఫారడిన్ అనే గ్రామములో ఫాతిమా మహమ్మద్ రజీక్ అనే 16 సం॥ వయస్సు గల మహమ్మదీయ బాలిక స్వయంగా సృష్టించుకున్న మంటలవల్ల చనిపోయింది. యూసస్ ఖాసీమ్‌ను వివాహం చేసుకునేందుకు ఆమె తండ్రి నిరాకరించగా ఫాతిమా స్వయముగా మంటలలో కాలిపోయింది. ఆమె తండ్రి 800 పౌండ్ల ధనం వధుకట్నం కొరకు రొక్కం కోరగా ఖాసీమ్ 2000 పౌండ్ల ధనమే చెల్లించగలనని అన్నాడు. (ఇండియన్ ఎక్స్‌ప్రెస్) ఇట్లే రష్యాలో స్త్రీలు వరశుల్కమును భరింపలేక పశుప్రవృత్తి నవలంబించి ధనము తెచ్చుకొని వివాహము చేసికొనెడివారు,

మని సమాజము భావించుట సౌజన్యమునకు చిహ్నము కాదు. 'కావమ్మ కథ' నుదాహరించినంత మాత్రమున సజీవ నారీదహనము శాస్త్రసమ్మతము కాజాలదు కదా!

**వితంతు శుల్కము:** ఇదొక చిత్రమైన ఆచారము. అపత్నీకులు, పునర్వివాహమునకై కన్యలు లభింపక వితంతువుల నన్వేషింపగా వారు కన్యాశుల్కమును కోరుదురు. ఆంధ్ర ప్రాంతమునే కాక భారతదేశములో అనేక ప్రాంతములలో ఇది వాడుకలోనికి వచ్చినది.

**వేశ్యావృత్తి:** ధనము కొఱకో- విలాసార్థమో శరీరమును విపణిలో నుంచుట వేశ్యావృత్తి లక్షణము స్త్రీలకే పరిమితమైన దురాచారమిది. కుటుంబ వ్యవస్థ విచ్ఛిన్నమైనప్పుడు సమాజములో త్యాగము కన్న భోగమునకు ప్రాధాన్యము పెరిగినప్పుడు వేశ్యావృత్తి ఛాయవలె వెన్వెంటనే ఇతోధికమై ప్రవృద్ధమానమగును. (విదేశములలో "లిట" సంప్రదాయమును కలదు.)

**దేవదాసీ వ్యవస్థ:** ఒకనాటి సదాచారము కాలక్రమమున శైథిల్యము కాగా మిగిలిన మొండి గోడలలో దేవదాసీ వ్యవస్థ యొకటి! భారత దేశములో దేవదాసీలు, శైవ సంప్రదాయములో బసివిరాండ్రు, జోగినులు, ఆంగ్లేయులలో 'నన్స్' (Nuns) ఇట్టివారే! తమ జీవితమును సంపూర్ణముగా ఈశ్వరార్పణము చేసిన పవిత్ర స్త్రీలు వీరు. ఈశ్వరుడే తమ భర్త. సర్వకళామయమైన తమ బ్రతుకుల కాతడే గమ్యము. ఇట్టి వ్యవస్థ రానురాను పతనమై వరాధిపాంకితము, నరాంకితము చివరకు ధనాంకితము అగుటతో అస్ఖలిత బ్రహ్మచారిణులకు నిలయమైన వ్యవస్థ పతనమై కేవలము ఆటలకు 'భోగము మేళము'లకు పరిమితమై నేటికి 'దేవదాసీనృత్యం' మనునది నాట్య గ్రంథములలో నొక ప్రక్రియగా మాత్రమే మిగిలిపోయినది. సాంఘికముగా స్త్రీలకు చెందిన దురాచారముల సంగ్రహ తత్వమిది!

**ఆంధ్రదేశ దుస్థితి:** పందొమ్మిదవ శతాబ్దము పశ్చిమాద్రిని చేరి మఱొక శతాబ్దము దయించు నాటికి ఆంధ్రదేశమిట్టి దురాచారములకు నిలయమై యుండెను. 1890 వ సంవత్సరములో అఖిల భారత స్థాయిలో సేకరించిన లెక్కల ప్రకారము 20 సంవత్సరముల లోపుననే వివాహమైన బాలికలు 18

కోట్లు, బాలురు 6 కోట్లు, వితంతువులు 6 లక్షలు, వయస్సు లోనే భార్యలను కోల్పోయినవారు సుమారు 2 లక్షల మంది కలరు. ఇందు ఆంధ్రదేశములో గణనీయమైన సంఖ్యయే కలదు. రాజారామమోహను డిచ్చిన పిలుపు ఫలితముగా 'సతి' అంతరించెను. బ్రహ్మ సమాజముతోబాటు వారి సంస్కరణాత్మక దృష్టి కూడా ఆంధ్రదేశములో వెన్వెంటనే ప్రవేశించెను. ఆ భావములతో యెదలను వికసింప జేసికొనిన మహాపురుషులలో కందుకూరి వీరేశలింగం పంతులు. బ్రహర్షి రఘుపతి వేంకట రత్నం నాయుడు, ఉన్నవ దంపతులు ప్రముఖులు, క్రమముగా జాతీయోద్యమచ్ఛాయ దేశమెల్లెడల వ్యాపించుటతో మహిళాభ్యుదయమా మహోద్యమమునకంగభూతమైనది. గురజాడ అప్పారావు పంతులుగారి సుప్రసిద్ధ నాటకము 'కన్యాశుల్కము'లోని పాత్రల నామములు కల్పితములే. అయినను సంఘటనములు, సన్నివేశములు, స్థలములు యదార్థములే. స్త్రీలను 'మినప్పప్పు రుబ్బుకునే' దశనుండి కాసులకొఱకు కలకలలాడే పూర్ణమ్మలను ముసలివారి బారినుండి కాపాడుటకు దేశభక్తులు, కవులు నిర్ణయములు స్వీకరించుటతో తెలుగు సీమలో సరికొత్త వెలుగులు పూచినవి !

**ఉద్యమారంభము :** స్త్రీలనుద్ధరించెడి ఉద్యమ మారంభమైనది. దేవుని రథము సాగుకొలది భక్తులు మోకాలుపట్టి లాగునట్లుగా ఉద్యమము పురోగమించు కొలది దానిలో భాగస్వామ్యము నందుటే భాగ్యముగా ఆంధ్రప్రజలు భావించినారు. దీనికి వివిధ కారణములును సకాలములో తోడ్పడినవి :

**1. సాంఘికము :** సమాజము వెనుకటివలె పరిమితమైన చట్రములో బంధింపబడక విశాల దృక్పథముతో పురోగమింప సాగినది. సామాన్యుని జీవన కల్పనమే పరిణామమునకు లోనైనది. అది అజ్ఞాతముగా భావ విప్లవమునకు దారి తీసినది.

**2. రాజకీయము :** ఆంగ్లేయులీ దేశమును పాలించుటవలన వారి రాజకీయ దృక్పథము భారతీయులను ప్రభావితము చేసినది. దానికి తోడు స్వాతంత్ర్య సముపార్జనమునకై జాతీయ కాంగ్రెసు సాగించిన పోరాటములో జాతీయ పునరుజ్జీవనము కూడ ఒక భాగమే కావున మహిళాభ్యుదయము రాజకీయోద్యమములో భాగమైపోయినది,

**3. మతము :** క్రైస్తవ మత సంస్కారముల ఫలితముగా తెలుగు ప్రజలలోనేమి భారత ప్రజలలో నేమి సంస్కరణాభిలాష పెరిగినది. స్త్రీకి సభార్హత సిద్ధించినది. మాతృభావనను భార్యా భావన జయించినది.

**4. ఆర్థికము :** సమాజము పెరిగి ఉత్పాదక శక్తులు తరిగిన కొలది ఆర్థిక క్లిష్టత తెలుగుదేశమును పీడింపసాగినది.[1] సంసారము మొత్తమును పోషింప వలసిన బాధ్యతను గృహ యజమాని భుజస్కంధములపై నుండి కుమార్తెలు, భార్య, చెల్లెండ్రు కూడ స్వీకరింపక తప్పని పరిస్థితి ఏర్పడినది. దీనితో స్త్రీ విద్య అనివార్యమైన ఆర్థిక ప్రేరణగా మారినది. జగత్తులో అన్నిటికన్నను ప్రియమైనది ప్రాణము. వైధవ్యము కారణముగా సమాజ హింసలకు గురియగు స్త్రీ స్వీయ రక్షణార్థము విద్యను పాసింప సాగినది. ఆర్థిక స్వాతంత్ర్యమునకై పరితపింప సాగినది. సమాజములోని మహాశ్చర్యకరమైన వర్తమాన పరిణామమున కిదొకచోదకశక్తి! ఇరువదవ శతాబ్దములోని ప్రథమ దశాబ్దములోనే ఈ పరివర్తనము సామాజిక జీవితములో ప్రత్యక్ష విప్లవమును సాధించినది.

**ఉద్యమ పురుషులు :** మహారాష్ట్రము, వంగప్రాంతము, తెలుగు ప్రజల చైతన్యమునకు మార్గదర్శకములైనవి. 1887 నుండియే బొంబాయిలో ఇట్టి పరిణామము ప్రారంభమైనది.[2] పండిత విష్ణుశాస్త్రి దీనికి నాయకుడు. 1879 జూన్ 15వ తేదీ వేణుబాయి, పాండురంగ వినాయక ధర్మాధ్యకారులకు తొలి వివాహము చేయుటతో ఉద్యమమునకు నాంది పలికినాడు. 1872లో ముందుగా తానొక బాలవితంతువును వివాహమాడి మార్గదర్శకుడైనాడు 'వితంతూ ద్వాహ మందిరము' 'మహారాష్ట్ర' పత్రిక వీరి కృషి ఫలితమే. ఆంధ్రదేశముపై వీరి ప్రభావము ప్రసరించినది. అట్లే ఆర్య సమాజముతోపాటు దయానందుని

1. "వరుడు నారాయణుడు, వధువు లక్ష్మి. వివాహము రెండు ఆత్మల కలయిక" అనెడి వేదభావనను "కన్యాశుల్కం" జయించినది. ఇదియే నేటి (క్రి.శ. 1990) వికృతి.
2. **'The Bombay Re-marriage movement'** శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు పంతులు - వ్యాసము. 1904 అక్టోబరు 1, కృష్ణా పత్రిక.

సంస్కరణాత్మక సువిశాల దృష్టి కూడ ముందుగా తెలంగాణము నావరించినది. వేఱొక వైపు ఈశ్వరచంద్ర విద్యాసాగరుని ప్రబోధములు, అనిబిసెంటు సంఘ సేవ తెలుగువారిని ముగ్ధులను చేసినవి సాహిత్య చక్రవర్తి రామావతారశర్మ వంటి సంస్కరణశాలురు పర్యటనములు సాగించి మహిళోద్యమ శంఖారావమును విన్పించుచుండగా బధిరులే జాగృతి నందగా ఆంధ్రు లేల అంధత్వమును వీడకుందురు? 'నా జీవితములో జ్ఞాన ప్రకరణము ప్రారంభమైనది 1) అజ్ఞానము 2) వర్ణభేదము 3) బాల్య వివాహము 4) అనేక పతీత్వము 5) నిర్బంధ వైధవ్యము 6) సాధువులకు నిర్బంధ బ్రహ్మచర్యము 7) సముద్రయాన నిషేదము అను దురాచారముల నెదుర్కొనుటే కర్తవ్యమని బంకింపురములోని దేశీయ సంఘ సంస్కరణ మహాసభలో అధ్యక్ష పీఠము నుండి చేసిన భాషణమును తెలుగు పత్రికలు వేయి నోళ్ల ప్రశంసించినవి.[1] పరంజపే, మహాగోవింద రానెడేల కృషి ఆంధ్రుల కాదర్శమైనది. రవీంద్రుని కవిత సంస్కర్తల కు శ్రీగంధమలదినట్లైనది ఈ వీరావేశముతో జయులుదేరిన ఉద్యమ పురుషులే వీరేశలింగం పంతులు గారు 'ఇతర సంస్కర్తల కాయన నాయకుడుగా నిలిచినాడు. తన దేహము తన గేహము తన సర్వస్వమును స్త్రీ జనోద్ధరణకే సమర్పించినాడు.

**ఉద్యమ విజృంభణము:** 1874 లో ధవళేశ్వరములో స్త్రీ విద్యకై బాలికా పాఠశాలను కందుకూరి స్థాపించి ముందుగా వైతాళిక గీతమును పాడినారు. 1883లో స్త్రీల కొఱకు ప్రత్యేకముగా 'సతీ హితబోధిని' పత్రికను స్థాపించినారు. ప్రహసనములను, తదితర సాహిత్య ప్రక్రియలను ఆశ్రయించి ఉద్యమమునకుజ్వలభావిని చూపినారు. 'ఈ ఉద్యమము వీటికి ఎదురీత! కఠిన శిలా పర్వతంగా మారిన సంఘాన్ని ఎదుర్కొనడం చేసిన వారికి చేసుకొన్న వారికి సంఘ బహిష్కారాలు .... కాని ఆయన లొంగలేదు రాజీ పడనూ లేదు'[2]. అట్లే గుంటూరులో ఉన్నవ దంపతుల నిర్విరామకృషి అజరామరమైనది. నాటి వారి పత్రికా ప్రకటన లిట్లుండెడివి. "స్త్రీ పునర్వివాహ సంబంధముల గూర్చుటకై వరులను గాని వధువులను గాని కలయువారు ఈ క్రింది సంతకము చేసిన

---

1. 1918 జనవరి 11, సంపాదకీయము. కృష్ణాపత్రిక 6వ పుట.
2. సెట్టి ఈశ్వరరావు 'ప్రతిభ' వ్యాసము (యుగపురుషుడు)

వారి పేర వ్రాసి తెలిసికొనవచ్చును" ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులు ప్లీడరు. గుంటూరు డిసెంబరు 15వ తేదీ పత్రికా ప్రకటన!! కొటికలపూడి సీతమ్మ, భండారు అచ్చమాంబ, దుర్గాబాయి దేశ్‌ముఖ్ వంటి మహిళలకు వీరి కృషి కరదీపికమైనది.

**పరివర్తనము :** ప్రవాహ వేగమునకు శిలలే కరిగిపోవుచుండగా ఉద్యమ వేగమునకు సమాజము పరివర్తన మందుటలో వింత ఏమున్నది? 1904వ సంవత్సరములో రాష్ట్రములో వివిధ ప్రాంతములలో సంఘ సంస్కరణ సమావేశములను ప్రారంభించిరి. నాడు కృష్ణా జిల్లా సమావేశములలో 1) స్త్రీలకు పాఠశాలలు పెట్టింపవలెనని 2) శాఖాంతర వివాహములు ప్రోత్సహింపవలెనని 3) బాల్య వివాహములు నిషేధింపవలెనని 4) సముద్రయానము దోషము కాదనియు 5) అస్పృశ్యత రూపుమాపవలెనని 6) మద్యపానము, భోగముమేళములు కూడదనియును తీర్మానించిరి ఇది వారి ఆరవ సమావేశము. ఇట్లు సంస్కర్త లాశించిన ప్రయోజనములు క్రమముగా నెరవేరినవి, వాని నీ క్రింద వివరింతును.

**2) వడుపువృత్తిపై రోత :** 1911 జులై 7వ తేదీ 'పడుపు జీవనము' శీర్షిక క్రింద సుమారు ముప్పది మంది వేశ్యా కులమునకు చెందిన ప్రముఖులు తాము వృత్తిని విరమించుచున్నట్లు ప్రకటించిరి. 'మా బాలికలనే గాక యితర జాతుల పిల్లలను గూడ పెంచి వ్యభిచారమునందు ప్రవేశపెట్టు నాచారము పోయి మా సంఘము మంచి స్థితికి రాగలదని నమ్ముచున్నారము' అని సంతకములు జేసిరి.

**2) అంతశ్శాఖా వివాహములు :** గూడూరులో వైదికి సుబ్బమ్మ అను వితంతువును నియోగి చుండి జగన్నాధమున కిచ్చి భారతుల మార్కండేయ శర్మగారు వివాహము చేయించినారు. (ఆ సుబ్బమ్మ తరువాత సరోజినిగ పేరు మార్చుకొనినది.) ఇట్లు వితంతూద్వాహమే కాక అంతశ్శాఖా వివాహము కూడ జరిగినట్లయినది భారతులవారు 1933 డిసెంబరు 27వ తేదీ స్వయముగా వితంతూద్వాహము చేసికొని మార్గదర్శకులైనారు.

**3) కులాంతర వివాహము :** వీరే రెడ్డి-చౌదరి కులములకు చెందిన వారికి వివాహము జరిపించినారు సరోజిని యను కమ్మవారి వితంతువును వెంకట్రెడ్డి యను రెడ్డి వారి చిన్నవాని కిచ్చి వివాహము జరిపించినారు. దానికి కమ్మ-రెడ్డి వంశములలోని ప్రముఖులు వీరిపై హత్యా ప్రయత్నములు చేసిరి. కాని సంస్కర్త కావున భయపడలేదు. వెనుకంజ వేయలేదు.

**4) భర్త జీవించియుండగా :** సభర్తృకకు వివాహము జరిపించుట కూడ సంస్కరణాత్మకమే. భారతుల వారే, ఒంగోలు తాలూకా గుడిమెళ్లపాడు గ్రామములో వారణాశి హనుమయ్య కుమార్తెను చిలకమర్తి లక్ష్మీనారాయణ కిచ్చి వివాహము జరిపించినారు. హనుమయ్య కుమార్తెను భర్త వదలినాడు. అతడు సజీవుడే !!

**5) వేశ్యా వివాహము :** 1910 ఏప్రిల్ ఒకటవ తేదీ ఉయ్యూరులో సిద్ధాబత్తుల నారాయణం గారు పరంపరాగతమైన తమ సంప్రదాయము విడిచి రెండవ కుమార్తెకు వివాహము వైభవముగా జరిపిరి. 'దీనిని బట్టి చూడగా వేశ్య కులస్థులు చిరకాలము నుండి వంశ పరంపరముగా వచ్చుచున్న వ్యభిచార మహా పాతకము నుండి తప్పించుకొను ప్రయత్నములు జరుగుచున్నట్లు'[1] వ్యక్తమైనది.

**6) మతాంతర వివాహము :** 'గుంటూరు జిల్లా బాపట్ల తాలూకా చీరాల గ్రామ కాపురస్థులు కోటంరాజు నారాయణ గారి కొడుకు పున్నయ్య అహమ్మదు నగర వాస్తవ్యులు క్రైస్తవులు జి. వి. మీసాలు గారి ఏకైక పుత్రిక శ్రీమతి తారాబాయిని వివాహము చేసికొనినారు. వారికి సచ్చిదానందమూర్తి యను కుమారుడు కలిగినాడు.[2]

**7) స్త్రీ విద్య :** 'శ్రీమతి ముద్దు లక్ష్మమ్మ యను హిందూ స్త్రీ ఎమ్.బి. అండ్ సి.ఎమ్. అను వైద్యశాస్త్రము పరీక్షయందు కృతార్థత నందిన దని తెలియజేయుటకు చాలా సంతసించుచున్నాము. ఈ పరీక్షయందింత వర

---

1. వార్తలు - విశేషములు ఏప్రిల్ 1, 1990, కృష్ణాపత్రిక.
2. 3-3-1912 వృత్తాంతములు. కృష్ణాపత్రిక.

కును ఏ భారతీయ స్త్రీయును కృతార్థురాలై యుండలేదు'[1] క్రమముగా స్త్రీలకు గుంటూరు, నెల్లూరు, రాజమహేంద్రవరము, ఏలూరు, కాకినాడ, మద్రాసులలో విద్యాసంస్థలు, ఉచిత భోజనాది వసతి గృహములు ఏర్పడినవి. మహిళలు రాజకీయములలో కూడ పాల్గొన సాగినారు. తెలంగాణములో, రాజా వెంకటరామా రెడ్డి, అహల్యా మల్లన్న, వామన నాయక్ గార్లు నూటికి రెండు వంతులు కూడ మొత్తము మీద విద్యావంతులు లేని కాలములో ప్రత్యేకముగా స్త్రీలకై నారాయణ గూడాలో బాలికోన్నత పాఠశాల ప్రారంభించినారు. ఈ స్ఫూర్తితో బాల సరస్వతీ పాఠశాల, శారదా కన్యా పాఠశాల, సావిత్రీ కన్యా పాఠశాల, గజానన కన్యా పాఠశాల, పరోపకారిణీ బాలికా పాఠశాలలు వెలసినవి.

8) **కట్న విరోధము :** కన్యాశుల్కము, వరశుల్కములకు వ్యతిరేకముగా సాగిన ఉద్యమములు రాజకీయోద్యమములను మించి పోయినవి. 'స్నేహలతా వరకట్న నిషేధ సంఘము' సుదీర్ఘమైన పోరాటమును సాగించి ప్రభుత్వముచే శాసన రూపమున అమలు జరిపించి కాని విశ్రమింపలేదు. వావిలాల గోపాలకృష్ణయ్య, తలగడదీవి రామారావు, కె వి ఎస్. సూర్యనారాయణ రాజు, సుబ్బారావు, శ్రీమతి కామాక్షి ప్రభృతు లీ ఉద్యమమునకు సారథ్యము వహించిన విజేతలు !

9) **దేవదాసీ వృత్తి :** దేవదాసీమణులు ఆలయ నృత్యములను, వేశ్యావృత్తిని వదలి వేసినారు. ఎవరైనను భోగము మేళములను పిలిచినచో సమాజము మొత్తమును వారిపై వెల్లువ వలె పొంగి తిరుగుబాటు చేసినది.[2]

**ప్రతిఘటనము – పురోగమనము :** ఈ విజయములు సామాన్యముగా సిద్ధించినవి కావు. వివాహము షోడశ సంస్కారములలో ప్రముఖమైనది. అనగా మతమునకు సంబంధించినది. మత విషయికమైన పరివర్తనమును జాతి సహిం

1. వృత్తాంతములు మే 1912 కృష్ణాపత్రిక.
2. శ్రీ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు తమ కుమార్తె వివాహమునకు (మే, 1911) భోగము మేళమును పెట్టినారని పె. కామప్పశాస్త్రి ప్రభృతులు సాగించిన వ్యతిరేకోద్యమము బ్రహ్మాండముగా పత్రికల కెక్కినది. (5-6-1911 కృ.ప. 5వ పుట.)

చుటన్నచో అది ప్రళయ సదృశ్యమే! కావుననే సంస్కర్తలు దూషణములకు హింసలకు తలవంచిరి వీరేశలింగము గారిని రాళ్లతో కొట్టినను వారు పూల దండల వలె స్వీకరించిరి. హత్యా ప్రయత్నములు తమపై సాగినను పోరాటము విరమింపలేదు. హత్య చేయునది దేహమునే కాని ఆత్మను కాదు కదా! తాను నిజమని నమ్మిన సిద్ధాంతమునకై ఆత్మ శక్తితో పోరాడుచున్నప్పుడు దైహికముగా సాగిడి దూషణ భూషణములను ప్రాజ్ఞులు పాటింపరు కదా!! కావున మహోద్యమము పురోగమించినది. మహిళాభ్యుదయము రాజ్యాంగబద్ధమైనది. 1829లో సతి నిషేధింపబడినది. 1856 జులై 25వ తేదీ హిందూ వితంతూ ద్వాహమును చట్టము సమ్మతించినది. అట్లే బాల్య వివాహము నిషేధింపబడినది. 1955 'హిందూ విడాకుల చట్టము' రూపొందినది. 1956లో స్త్రీకి ఆస్తిలో వారసత్వము లభించినది. 1961 మే 9-వరకట్నము నిషేధింపబడినది. మే 20 రాష్ట్రపతి దాని నామోదించినారు. ఇట్లు సమాజము, ప్రభుత్వము కూడ మాతృశక్తి మ్రోల తల వంచి నిలిచినది.

**పత్రికల పాత్ర :** మహోద్యమములో సావిత్రి (పులుగుర్త లక్ష్మీనరసాంబ) హిందూ సుందరి (బాలాంతరపు శేషమాంబ) ఆంధ్రలక్ష్మి (కళ్లేపల్లి వేంకటరమణమ్మ గారు) అనసూయ (వింజమూరి వేంకటరత్నమ్మ) స్త్రీ ధర్మము (భారత మహిళా సంఘము) వంటి స్త్రీల పత్రికలే కాక సామాన్య పత్రికలు కూడ గణనీయమైన పాత్రను నిర్వహించి మహిళాభ్యుదయమునకు తోడ్పడినది. ఇట్టి స్థితిలో కవి కంఠమెట్లు మిన్నకుండ గలదు? దాని నిక వివరించెదను!

## కవిత్వముపై ప్రభావము :

భాషా విషయికముగా గ్రాంథికమునో, వ్యావహారికమునో సమర్థింపవచ్చును కాని మహిళాభ్యుదయ సిద్ధాంతములో మాత్రము రెండభిప్రాయము లుండకూడదని నిశ్చయించుకొనిరా యనునట్లు ఇరువదవ శతాబ్దము పూర్వార్థములో తెలుగు కవులందరును గ్రాంథికములోను వ్యావహారికములోను కూడ స్త్రీజనోద్ధరణోద్యమమునకు ప్రోద్బలకమైన కృతులనే వెలయించిరి. అందు వస్త్వాశ్రయ రీతిని ముందుగా వివరింతును.

**మునలమ్మ మరణము :** కట్టమంచి రామలింగారెడ్డి గారి కృతి యిది.

ముసలమ్మ మహా సాధ్వి. అనంతపురమునకు సమీపములో బుక్కరాయ సముద్రమను గ్రామములో నివసించెడిది. ఒకసారి గ్రామములోని చెరువుకట్ట తెగిపోగా రైతులు పోలేరమ్మ (పొలి పీరమ్మ)ను ప్రార్థింపగా ఆమె ముసలమ్మను బలి కోరినదట ముసలమ్మ ఆనందముగా ఆత్మార్పణము చేసినదని కథ. ఇది స్పష్టముగా సంస్కరణాత్మకమైన కావ్యమే. పొలి పీరమ్మ నరబలి కోరినదనుట అభూతకల్పనము ఐనను వెనుక ముందు ఆలోచింపక ముసలమ్మ ఆత్మార్పణము చేసినదనినచో దానిని త్యాగముగా భావించుట కన్న స్త్రీ ప్రాణమునకు నాటి సామాజిక మూల్యమెంత తక్కువో గ్రహింపవచ్చును సమష్టికై వ్యక్తి బలియై పోయినదనుట కన్న మూఢ విశ్వాసములకు బలియైనదని వ్యాఖ్యానించుట సమంజసము.

**జలదమాలిక :** వేంకట పార్వతీశ కవుల లఘు కావ్యమిది. రజస్వలానంతర వివాహము కూడదను సంప్రదాయమునకు బలియైన యువతి గాథ యిది. అన్నపూర్ణా చంద్రశేఖరులు బాల్యము నుండి ప్రేమించుకొనిరి. కారణాంతరములచే వెంటనే వివాహము కాదు. చంద్రశేఖరుడు దేశాంతర మేగెను. ఇంతలో అన్నపూర్ణ రజస్వల యైనది.

'అన్నపూర్ణ రజస్వల యయ్యె ననుచు
బలుకు భంగులచే నిట్టె తెలిసిపోయె
మా కులాచార సంపత్తి మాసిపోయె
నెమ్మదిగ నూర నీ వాదు నిండిపోయె'. అంతటితో సంఘ మాగలేదు. 'నాసికం దర్జనిం జేర్చి నవ్వుకొని' బ్రహ్మ పరిషత్తును రావించి శాస్త్ర చర్చ జరిపినారు అందు రజస్వలానంతర వివాహము వలన కలుగు దోషములు భయంకరములని తీర్మానింపబడినది. 'పతితమైనట్టి యీ కుటుంబంబు చావ వలయునే కాని నిష్కృతి కలుగబోదని' 'ఇట్టె తలలూపి' ఆ కుటుంబమును బహిష్కరించినారు గ్రామస్థులు. అన్నపూర్ణ చంద్రశేఖరున కిమ్మని ఆ యూరి రాజు (జమీందారు) పేర లేఖ వ్రాసి కడసారి సెలవు గైకొనినది. మత మౌఢ్యమునకు అన్నపూర్ణ బలియై పోయినది. బ్రహ్మ సమాజ ప్రభావముతో కవివరులు సంస్కరణాత్మకమగు దృష్టితో ఈ కథను హృదయవిదారకముగా చిత్రించి వేదికపై వేయి ప్రసంగములకన్న మిన్నగా ఫలితమును సాధించినారు.

**స్నేహలతాదేవి :** వర శుల్కమునకు బలియైన అబల స్నేహలత. వంగ భూమిలో జరిగిన ఈ యదార్థ గాథను రవీంద్రుని సాహచర్యమునకు నోచుకొనిన రాయప్రోలు వారు కరుణరసాత్మకమగు కావ్యముగా తీర్చిదిద్దినారు. స్నేహలత వయస్సు పదునైదు సంవత్సరములు. ఆమె కల్యాణార్థము తండ్రి స్వగృహ నిర్మూలనమునకు సిద్ధపడును. 'ఈ నిర్బంధాచారము జ్ఞాన పుష్టిత మైన యుత్తమ కన్యా దృష్టికి హేయ అజ్ఞాకరముగ నుండదా'[1] కావుననే ఆత్మార్పణమునకు సంసిద్ధమైనది. ప్రియంవద మొదలైన స్నేహితురాండ్రు మఱికొన్ని దుఃఖ భాజనమైన కథలు చెప్పినారు.

"మొన్న పెండిలి చేసిన పుణ్యవల్లి
జనకుఁడు ఋణాతిరేకలజ్జా ప్రపీడఁ
గడవఁజాలక గంగలోఁ బడి శమించె
భయము తలయెత్తదోయీ ప్రవాహతలిని"

మఱొక సంఘటనము :

"తాను వలచిన వరునకుఁ దగిన శుల్క
మభిజనంబు లర్పింపలే కడలుచుండ
మానికమువంటి 'శ్యామ' జన్మంబు చెల్లి
ఈమె పాల్సేసికొనె నెంత కృపణ గతియొ" తాను మాత్రమేల బ్రతుకును ఈమె పాల్సేసికొనకూడదను భావమా ముగ్ధ యెదలో పొట మరించినది. 'పశు సహజమైన పురుష స్వభావ'మని లత చెప్పిన మాట ఆమెలో శూలమై నాటినది. దానితో తండ్రి పేర లేఖ వ్రాసి 'హేయమయిన కన్యకా వరశుల్కలాంఛన కళంకముకు' తాను బలియై పోయినది.

'అధమ శుల్క కలంకమునంట కుండ
నా పవిత్ర మనః కన్యకా పథంబు
దక్షణము చేసినట్టి యీ దక్షిణాగ్ని
కలుషితాచారములఁ గాల్చి వెలుఁగు గాక' యని అస్తమించినది. 'ఆర్య కన్యా కులీనత కర్పణముగ తనువు దొరఁగిన స్నేహలతను తల్లి రగులజేసి

1. పీఠిక. స్నేహలతాదేవి.

పోయిన పవిత్రంపు వహ్ని ఋషుల యీ భూమిఁ బునరుద్ధరించుగాక'యని కవిగా రాశించుచు ఈ కృతిని సమర్పించినారు.

**పూర్ణమ్మ :** వృద్ధ వివాహమునకు బలియైన, మిసమిసలాడెడి పసిడి మనసు కథ యిది. పూర్ణమ్మ పూజారుల ఇంటి చిన్నది. బాల్య వివాహము అందునను ధనాశతో వృద్ధ జంబుకమున కిచ్చినారు.

కాసుకు లోనై తల్లిదండ్రీ
నెనరూ న్యాయం విడనాడి
పుత్తడిబొమ్మను పూర్ణమ్మను నొక
ముదుసలి మొగుడుకు ముడి వేస్రీ' ఆ దుఃఖముతోనే పూర్ణమ్మ క్రుశించిపోయినది. ఆత్మహత్యకు నిశ్చయించుకొనినది. 'ఎప్పటి యట్టులు సాయంత్రమ్మున యేరిన పువ్వులు సరిగూర్చి' దుర్గాలయమును ఒంటరియై చేరినది.

'కన్నుల కాంతులు కలవల చేరెను
మేలిమి జేరెను మేని పసల్
హంసల జేరెను నడకల బెడగులు
దుర్గను చేరెను పూర్ణమ్మ' గురజాడ అప్పారావుగా రీ గాథను అత్యద్భుతముగా చిత్రించినారు. సాంఘిక దురాచారపరుల పాషాణ హృదయములపై కవి ప్రయోగించిన కులిశధార పూర్ణమ్మ కథ.

**పండుగ కట్నము :** భోగరాజు నారాయణమూర్తి గారి కావ్యము. రచన ప్రాచీనాలంకారిక పద్ధతులకు లోనైనను ఇతివృత్తము నవీనము. వర శుల్కమును విమర్శించుట కవి దృషి. ముఖ్యముగా పండుగల కవి పెట్టలేదివి మొసంగలేదని పీడించెడి జామాతల దశమ గ్రహ లక్షణములిందు విపులముగా వర్ణింపబడినవి. వీని వలన పిల్లను కన్నవారు, పిల్ల కూడ ఎంతగా నలిగిపోవు దురో భోగరాజువారు హృదయమునకు హత్తుకొనునట్లు చిత్రించినారు. సంక్రాంతి, దశమి మొదలగు పర్వములలో అల్లుడు కట్నముల రూపమున ధనము గుంజుట- మామగారీయలేకున్నచో కుమార్తె నేలుకొనననని బెదిరించుట తెలుగుదేశములోని ప్రసిద్ధ సాంఘిక దురాచారమే ! ఇట్టి గ్రంథములింకను

నాడు పుంఖాను పుంఖముగా వెలువడినవి కాని ప్రధానమగు కృతులను స్వీకరించి రీతి (Trend) ని మాత్రము ప్రదర్శించితిమి. ఇక కథా వస్తువులేని కావ్యములను ఖండికలను పేర్కొందును.

**బాల వితంతు విలాపము :** మంగిపూడి వేంకటశర్మ గారి ప్రముఖ రచనమిది వారు దయానందుని శిష్యులు. కావుననే వేదార్థమును 'సత్యముగా' 'ప్రకాశింప' జేయుచు మహిళోద్ధరణమునకు కంకణము కట్టుకొనినారు, 1904 ప్రాంతములోని పత్రికలన్నింటను "బాలవితంతు విలాపము. జాలి పుట్టించు పద్యములు. వెల. 0-4-0. మం. వేంకటశర్మ గారికి, పిప్పర, కృష్ణాజిల్లా, అను ప్రకటనము విరివిగా కన్పడెడిది. విశ్లేషణాత్మకముగా పరిశీలించినచో కవిగారి కృతిలో నిందించిన దురాచారము లీ క్రిందివి గోచరించును.

1) **బాల్య వివాహము :** పీటపై గూర్చుండఁ బెట్టిన వేళను
మాతకై పెండ్లి కుమారుఁ డేడ్వ
తాళిఁగట్టెడు వేళఁ బాలకై పోర్వెట్టి
గోలుగోలునఁ బెండ్లి కూతురేడ్వ'

కల్యాణములు జరుగుచున్నవని మంగిపూడివారు విచారించినారు. బాలవితంతు సమస్యలోనికి రాదిది ఇరువురును పసిపాపలే అయినప్పుడు స్త్రీ బాలిక వితంతువగుటకు విధికారణమే కాని వయస్సు కారణము కాదుకదా ! ముఖ్యముగా వృద్ధ వివాహములే బాలవితంతువుల దుస్థితికి కారణము.

**2. స్త్రీ విద్య :** బాల్య వివాహము ఫలితముగా స్త్రీ విద్య అంతరించుచున్నదని కవి వక్కాణించినారు. వర్తమాన సమాజ దుస్థితికి 'అవిద్య, (లౌకికార్థము)యే మూల కారణము.

'స్త్రీ విద్య మొదలంట క్షీణించుచుంటకి
కందుల పెండ్లిండ్లె కారణములు' (14) అని ఖండితముగా చెప్పినారు.

**3) వికృత రూపము :** బాల వితంతువుకు తల బోడి యైనది కాని తలపులు బోడి కాలేదు. ఆమె స్వయంకృతాపరాధమో విధి విధానమో కాదు సమాజ దౌర్జన్య ఫలితమా దుస్థితి.

'నోము గేరెడు లేఁతమోమునఁ గస్తూరి
రేఖ పోయి విభూతి రేఖ వచ్చె
తళతళలీను నిద్దఁపు గాజులు పోయి
కేల మోటైన పట్టెలు వచ్చె
మృదువైన వన్నె చీరెలు పోయినెమ్మేన
ముదుకమల్ సైను దోవదులు వచ్చె
గళమున భూషణావళి పోయి తులసి మా
లికలు, రుద్రాక్ష మాలికలు వచ్చె' (24వ పుట)

ఆధ్యాత్మికముగా సనాతనులీ వేషమును సమర్థింపవచ్చును. కాని అది అకార్యము. ఆధ్యాత్మికత్వమునకు గార్హస్థ్యము నిషిద్ధము కాదు. బౌద్ధము, అద్వైతము చారిత్రక యుగములో పతనమగుటకు కారణములేవో బసవేశ్వరుడు పరిశీలించి

'ఇంద్రియ నిగ్రహమేల చేసెదవు
పంచేంద్రియములు బాధ పెట్టవా?
సతి-పతి, రతి సౌఖ్యంబు వదిలిరా,
సింధు భల్లాల సిరియాళాదుల'[1] ని సూటిగా ప్రశ్నించినాడు.

ధనమునకు దాసోహమని కుమార్తె కకాల వైధవ్యము తెచ్చిపెట్టిన భౌతిక వాంఛాపరు లీ అకృత్యమునకు ఆధ్యాత్మిక వ్యాఖ్యానము చెప్పుట ఆత్మవంచనమే'. కావుననే మింగిపూడివా రిట్టి ప్రముఖులను 'నరమాంస మమ్మి ధనముఁ గూర్చి గర్వించి'న లుబ్ధక జనులని అభివర్ణించినారు.

**వృద్ధ వివాహము :** బాల వితంతువుల దుర్గతికి వారి తల్లిదండ్రులే కారణము.

'వృద్ధ ధనికులకు సుతలనిచ్చి వారి
మృతికి గాచుక యుండెడి హీనులార !' అని నిందించినారు.

అల్లుని మృతికి ఎదురు చూచెడివారు కుమార్తెను జీవచ్ఛవముగా మార్చిన వీరు, వయసు పొంగులో ఆమె చేసిన తప్పిదము కప్పిపుచ్చుకొనుటకై జరిగిన భ్రూణ

1. బసవగీత. (అను. శివప్రసాద్)

హత్యకును కారణ భూతులైన వీరు 'హీను'లని కవిచేత నిందింపబడుట ఉద్యమ లక్షణమే ! !

**వివిధా దర్శములు :** కవి, ప్రబోధాత్మకమగు ఈ పద్యములో తన ఆదర్శములను చాటినారు.

సద్విద్యలను నేర్చి స్వాతంత్రముల నిచ్చి
స్త్రీ పురుష లాదరింత్రు గాత !
దంపతులకు సౌఖ్యదంబులై యలరారు
ప్రౌఢ వివాహముల్ ప్రబలు గాత !
విధవా వివాహముల్ వివాహితంబులై యొప్పి
భ్రూణ హత్యలు లేకపోవు గాత !
యువకులు దేశోపయోగ కార్యములందు
గదిరి ముందంజ వేయుదురు గాత !

అసమ వైవాహికములెల్ల నణచుఁ గాత !
కన్యకా శుల్కములు గంగఁ గలియుగాత !
పురుష భరణం బులను మాసిపోవు గాత !
ఎల్ల శుభములు నిండు వర్ధిల్లుఁగాత' (60వ పుట)

అని యాకాక్షించుటలో వరుసగా 1) స్త్రీ విద్య, 2) స్త్రీ స్వాతంత్ర్యము, 3) సమ దాంపత్యము, 4) ప్రౌఢ వివాహములు, 5) విధవా వివాహములు, 6) భ్రూణహత్యా నిరోధము, 7) స్త్రీల రాజకీయ ప్రవేశము, 8) కన్యాశుల్క నిరోధము, 9) వరశుల్క విరోధములను ప్రచారము చేయవలెనని తమ మహిళాభ్యుదయేచ్ఛను వెల్లడించినారు. నాటి స్త్రీల సమస్యలన్నియును దాదాపుగా పై కవితలో ప్రసక్తము చేయబడినవి. ఇట్టి కవితలే తరువాత 'అబలావిలాసము' పేర మరల ప్రచురించినారు. పండుగకట్నము వ్రాసిన నారాయణమూర్తిగారి 'విధవా విలాపము' ఈ జాతి కవితయే !

**ఆధ్యాత్మిక దృష్టి :** చెరుకువాడ నరసింహముగారు మహిళా సమస్య

నాధ్యాత్మికముగా పరిశీలించినారు. దాంపత్యము విశ్వధర్మమున కాధారము. జగత్తు సత్వరజస్సుల సమష్టిరూపము శ్రీవాణీ గిరిజలను వక్షో ముఖాంగము లలో, పురుషోత్తమాంబుజ భవ శ్రీకంధరులు ధరించినారను కల్పనములోని రహస్యమిది, కావుననే.

> 'అఖిల లోకస్థితి కాధారమైన
> దాంపత్య ధర్మంబు దగ్ధమై పోయె
> వైవాహికం బిప్డు వాణిజ్యమాయె
> సతిపతు లన్యోన్య శత్రువులైరి' అని విలపించినారు, 'పసి

పాపలను దెచ్చి పరిణయం బనుచు కసిలేక గొంతుకలు ఖండింతురేల' యని ప్రశ్నించినారు.

**గణికాంగనా వివాహము :** ప్రబంధకాలము నుండి గణికాంగన, వేశ్యమాత, సమాజ శత్రువులని కవులచే నిందింపబడుట పరిపాటియైనది. అట్టి గణిక స్త్రీ గార్హస్థ్యము స్వీకరింపగనే కవి హృదయము ఉప్పొంగిపోయినది. దేవినేని సూరయ్యగారు వేశ్యా వివాహమును తమ ఖండికలో ఇట్లు వర్ణించినారు :

> 'జాణతనంబునన్ మెలఁగి జాణలటంచును చేరఁ బొంద గ
> ల్యాణము చేసికొన్న నెటులంచు దలంచెదరంతె కాని క
> ల్యాణము నావచించెడు పదార్థ మెఱింగిన పూవు బోండ్లు
> కల్యాణము నాద కుందురె భళా.........'

కల్యాణమను పదములో మంగళకరమైనదను అర్థము కలదు. గణికల కేమి మానవులందరకును మంగళము కలుగవలసినదే కదా యని సూరయ్యగారు పై పద్యములో చమత్కరించినారు.

'ఎన్నో విధాల గన్గొనిన నేహ్యముగాఁ గనుపట్టునట్టి యీ తెన్ను దొరంగి శీలత సుధీమణు లెల్లను మెచ్చునట్లుగా చిన్నలకైన నింక వెపచెండిలిఁచేయుట మేల'ని ఖండితముగా పల్కినారు.[1]

**సంప్రదాయ నింద :** శుద్ధ సాత్విక స్థితిలో మహర్షులవలె చెప్పుట

1. గణికాంగనా వివాహము ఖండిక. 9 ఆగస్టు, 1912. కృష్ణాపత్రిక

ఉద్యమ కాలములో సాధ్యపడదు. వాక్కులో పాటవము, పారుష్యము కూడ వెలియును. తాబట్టిన కుందేటికి మూడేకాళ్ళను తత్వము కల సంప్రదాయ పరు లను సంఘ సంస్కర్తలు దుంద్రగింద్ర'ని నిందించినారు.

"తన కోడి కొక కాలెయని వాదములు చేయు
దుండ గీడుల జిమ్మ దువ్వివైచు........' అనుటలో నింద నిందా ర్ధమే అయినను సమస్యా తీవ్రత నది స్పష్టము చేయును. ఈ దినములలోనే ఆ. నారాయణరావుగా రొక వ్యాసము వ్రాయుచు 'వితంతుకోటి యొక్క స్థితి జక్క బరచలేకపోయిన యెడల ప్రొఫెసరు హక్సిలే చెప్పిన రీతిని ఈ దేశమును ఒక్క సారేదయిన ప్రళయము వచ్చి తుడిచిపెట్టుకొని పోవుట యుక్త'[1] మను టలో మానవతా దృక్పథముకన్నను ఉద్యమ ప్రభావమే తీవ్రముగా గోచరిం చును. సమస్యకు మరణ వరణము పరిష్కారమనుట సత్యమును తిరస్కరిం చుట. సంప్రదాయమును వ్యతిరేకించుట. కాని ప్రముఖ పత్రికా సంపాదకులే నిస్సహాయ స్త్రీ ఇట్లు విలపించుచున్నట్లు వ్రాసినారనినచో నాడు సంప్రదాయ వ్యతిరేక భావమెంత తీవ్రముగా నుండెడిదో ఊహింపవచ్చును.

'ఇట్టి దుఃఖకరమైన - యిట్టి బ్రతుకు
బ్రతుక లేమిక మీద శీఘ్రముగాను
దీన పోషక ! పరమేశ ! దేవదేవ
తీసికొని పొమ్ము నీ సన్నిధికిని మమ్ము'[2]

**జాతీయోద్యమ ఫలితము :** నాడు వెల్వడిన ప్రముఖ కవుల గ్రంథము లన్నిటిలోను మహిళా సమస్యయే ప్రముఖమైనదిగా ప్రత్యక్షముగానో పరోక్షము గానో వాచ్య, వ్యంగ్య పద్ధతులలో చెప్పబడినది. విశ్వనాథ వారి కిన్నెరసాని పాటలు' మహిళోద్యమ ప్రభావమనుట సాహసోక్తి కాజాలదు. నాటి తెలుగు కుటుంబములో కోడంటికములోని వ్యథయే కిన్నెరగాథ !. కోడలి బాధలకు కరిగి కరిగిపోయినది. గుండె చెరువైనది - నదియైనది ! ఆమె భర్త గుండె బండయై నది. స్థాణువైనాడు ఇట్టి శతాధికరచనము లన్నిటికిని జాతీయోద్యమమే

1. 1904 నవంబరు, 15 కృ ప. 4వ పుట.
2. 1904 రచన (దాసు వామనరావుగారేమో ?)

ప్రేరణయని చెప్పవలెను. సంఘ సంస్కరణము జాతీయోద్యమములో అంత ర్భాగము. కావుననే స్వాతంత్ర్యోద్యమములోని తీవ్రత మీదనే దీని పెరుగు తరుగు లాధారపడినవి ! !

## హరిజన సమస్య :

హరిజనోద్ధ రణోద్యమము జాతీయోద్యమములోని వివిధ సమస్యలలో అంతర్భాగమే అయినప్పటికిని మహాత్ముడు దానికొక ప్రత్యేక గౌరవమును కల్పించుటతో హరిజన సమస్య ఒక్కటే ఒక ప్రముఖోద్యమముగా మారిపోయి నది. దేశ స్వాతంత్ర్యము - హరిజనోద్ధరణము పర్యాయ పదములను నంతటి తీవ్రదృష్టి 1930 ప్రాంతములో దేశములో వ్యాపించినదనగా ఈ సమస్యకు గల మహత్వము సామాన్యమైనది కాదని స్పష్టమగును. ఈ యుద్యమము పుట్టు పూర్వోత్తరములను మనవి చేసెదను.

**హరిజనులు :** అస్పృశ్యులకీ పవిత్ర నామమును మహాత్ముడు ప్రసా దించెను [1] పూర్వగ్రంథములలో ఛండాల పులస్క ప్లవ మాతంగ అంతే వాసు లని వీరు పిలువబడిరి. బ్రాహ్మణ స్త్రీయందు శూద్రునికి జన్మించినవాడు అస్పృశుడని మనుస్మృతి. ఆర్యులు స్థానికులైన అనార్యులను అస్పృశ్యులుగా పరిగణించిరని ఆంగ్లేయ సిద్ధాంతము. ఇతర ప్రాంతములలో బవరియా, చమర్ చుహ్రా డాగి కోలి దూమ్నా మేఘ్ ఓడ్ రామదాసి సంసిసరె, ముషర్, దోసద్ డోమ్, మెహతర్, భంగీ మొదలగు పేర్లతో పిలువబడింది. తెలుగునాట మాల, మాదిగ కులములవారిని అస్పృశ్యులుగా పరిగణించిరి. తమిళదేశములో పర యనులు అస్పృశ్యులు. కర్ణాటకమున హొళియనులు అస్పృశ్యులు మలబారులో ఒకరి కింకొక రస్పృశ్యులు. ప్రధానముగా ఇది సాంఘిక సమస్య అయినప్ప టికిని మహాత్ముడు స్వాతంత్ర్య సముపార్జనములో దీనినొక భాగముగా స్వీక

---

1. "హరిజనుడనగా హరియొక్క జనుడని యర్థము లోకములోని మత ధర్మము లన్నియు భగవంతుని ముఖ్యముగా నిస్సహాయులకెల్ల సహా యునిగను దుర్బలులకెల్ల సంరక్షకునిగను .... వర్ణించుచున్నవి.... వీరి కన్న ఇంకెవ్వరీ భారత భూమిలో (అట్టివారు) కలరు? కావున నేను 'నవజీవన్' పత్రికలో హరిజనుడను పదమునే ఉపయోగించుచుంటిని." మహాత్మా గాంధీజీ.

రించుటతో హరిజన సమస్య కెనలేని రాజకీయ ప్రాముఖ్యము సిద్ధించుటే కాక ప్రత్యేకముగా నొక మహోద్యమముగా మారినది.

**యుగయుగముల ఉద్ధరణము :** సాంఘిక దురాచారములను ఖండించి మానవుని మాధవునిగా ఆరాధించినవాడే మహర్షి యని మనకు పౌరాణిక యుగము సాక్ష్యమిచ్చుచున్నది. కులమునుబట్టి కాక గుణమునుబట్టి వారు అర్హత్వమును నిర్ధారించిరి. పరాశరుఁడు మాలకు పుట్టినవాడు. వ్యాసుఁడు సాత్యవతేయుఁడు. వశిష్ఠుడు వేశ్యాపుత్రుడు. అతడు హరిజన కన్య అరుంధతిని వివాహమాడెను. రామానుజులవారు గుర్వాజ్ఞను ధిక్కరించి హరిజనులకు తిరుమంత్రమును గోపుర మెక్కి ఉపదేశించెను. రోహిదాసను చమారుడు స్వామి రామానందుని ముఖ్య శిష్యుడు. బసవేశ్వరుడు పంచములతో కలిసి విందారగించెను.[1] గురునానకు, కబీరు, దయానందాదులు తమ జీవితమునీ పవిత్రోద్యమమున కంకితము చేసిరి. 'నన్ను ముట్టరాదను మతము ప్రారంభమైననాడే హిందూమతమునకు మరణము' ప్రారంభమైనదని వివేకానందు డుద్ఘాటించెను. గోఖలే, అమృతలాల్, ఠక్కర్, వెంకట సుబ్బయ్య ప్రభృతులాధునిక కాలమున ఈ మహోద్యమమును నడిపిరి. 1906 లో జ్యోతి బాపలే పూనాలో 'డిప్రెస్డ్ క్లాస్ మిషన్ సొసైటీ' స్థాపించి అమోఘమైన సేవ చేసెను. మహాత్ముడు లక్ష్మి యను హరిజన బాలికను పెంచు కొనెను. వీరందరకును శ్రీకృష్ణుని గీతోపదేశమే దివ్యస్ఫూర్తి. 'శునిచైవ శ్వపాకేచ పండితాః సమదర్శనః' అను సందేశమే శిరోధార్యము.

**రాజకీయ ప్రాముఖ్యము :** హరిజన సమస్య ఇరువదవ శతాబ్దములో కేవల సాంఘిక, ఆర్థిక, సమస్యగా మాత్రమే మిగిలిపోక రాజకీయ ప్రాముఖ్యము నందినది. స్వాతంత్ర్య సిద్ధికి హరిజన సమస్యకు ఆంగ్లేయులు ముడిపెట్టిరి. మహమ్మదీయులవలెనే అంటరాని వారొకజాతి కావున వారికిని ప్రత్యేక శాసన

---

1. భక్త మహాశయులెల్లరు వీరలు
 కులముచేత తక్కువవారైనను
 నన్ను బ్రాహ్మణుం డనినను పక్కన
 నవ్వను కూడల సంగమ దేవుడు'

 —బసవేశ్వరుడు (బసవగీత. అను. శివప్రసాద్)

సభా స్థానాదులు కావలెనా? లేదా? అను సమస్య ఉద్భవించెను. వాదోపవాదములు పెరిగినవి. హరిజనులకు అంబేద్కరు, గాంధీజీ లిరువురును రెండు సిద్ధాంతముల ప్రాతిపదికపై నాయకత్వము వహించిరి. సువిశాల హిందూ సమాజములో హరిజను లంతర్భాగమేనని నిరూపింప దలచి 1932 జనవరి 4 వ తేదీ అర్ధరాత్రి మహాత్ముడామరణ నిరాహారదీక్ష ప్రారంభించుటతో సమస్య జటిలాతి జటిలమగుటయే గాక విశ్వవిఖ్యాతి నందినది. అట్లే గాంధీజీ 1933 మే 8 నుండి రెండవ మారు ఇరువదియొక్క దినములు నిరసన వ్రతము పూనుటతో భారత దేశము దద్దరిల్లిపోయినది. నాడు దేశవ్యాప్తముగా సాగినంత మహోద్యమము మఱియొక సాంఘిక సమస్యను గూర్చి జరుగలేదనుట ముమ్మాటికిని సత్యము. సత్యమే జయించినది. హరిజనులు విజేతలయినారు గాంధీజీ ఆశయము సిద్ధించినది.

**మహోద్యమ క్రమము :** ఆంధ్ర ప్రాంతములో హరిజనోద్ధరణము గాంధీజీ పిలుపుకు ముందే ప్రారంభమైనది కందుకూరి, రఘుపతి వేంకటరత్నం నాయుడుగారు, పిఠాపురం రాజావారు హరిజన బాలబాలికలను చేరదీసి విద్యాబుద్ధులు నేర్పిరి. ఏలూరులో 'ఆది ఆంధ్ర మహాసభ' ప్రారంభమైనది. గుడివాడ వాస్తవ్యులు గూడూరి రామచంద్రరావు, ఏలూరు వాస్తవ్యులు వెల్లంకి కృష్ణమూర్తి, నెల్లూరు జిల్లా పల్లెపాడు ఆశ్రమ స్థాపకులు దిగుమర్తి హనుమంతరావు, నరాలశెట్టి దేవేంద్రుడు, చంద్రు వెంకయ్య, రాయుడు, గంగయ్య ప్రభృతు లీ ఉద్యమములోని అతిరథ మహారథులు. హైదరాబాదులో భాగ్యరెడ్డి వర్మ 'ఆదిహిందూ సేవా సంఘము' స్థాపించి దానికనుగుణముగా పెక్కు విద్యా సంస్థలను వృద్ధి చేసెను. వేమూరి రాంజీరావు, గూడూరి రామచంద్రరావు, నల్లపాటి హనుమంతరావు, తలారి గోపాలరావు నాయుడు, అవటపల్లి నారాయణరావు, తల్లాప్రగడ ప్రకాశరావు, నరసింహశర్మ, తాటిమేటి సూర్యకుటుంబశాస్త్రి ప్రభృతులే కాక జాతీయోద్యమ యోధులైన, చెరుకువాడ, కాశీనాధుని, మంగిపూడి, కొండా, బాపినీడు, ప్రభృతులందరును హరిజనోద్యమమునకై జీవితమును ధార పోసినవారే !!

1933 నవంబరులో గాంధీజీ ఆంధ్రదేశములో హరిజన యాత్ర సాగించినప్పుడు 65 వేల రూప్యముల నిధి ప్రజలిచ్చినారు. మొత్తము 60 ప్రసంగ

ములు చేసి మహాత్ముడు తెలుగునాడును మేల్కొల్పినారు. 1934, 35, సంవత్సరములలో ముత్నేవి మాధవాచార్యులు, వావిలాల గోపాలకృష్ణయ్య, కొండా వెంకటప్పయ్యగార్లు నిర్వహించిన హరిజన దేవాలయ ప్రవేశోద్యమము చరిత్రలో శాశ్వతత్వము నందినది. కేరళలోని గురువాయూరు హరిజన సత్యాగ్రహము లలో కూడ ఆంధ్రులు పాల్గొని దేశమునకు వన్నె తెచ్చినారు. స్వాతంత్ర్యసిద్ధికి ముందును తరువాతను హరిజనోద్యమిట్లే తెలుగుసీమలో నిర్విరామముగా సాగినది.

**రచయితల పాత్ర :** నాడు పత్రికలు ప్రముఖ విద్యావంతులు హరిజన సమస్యకే తమ లేఖినుల నంకితము చేసిరి. ఇందు వారికి గాంధేయ దృక్పథము, 2) ఈశ్వరారాధనా మార్గము, 3) స్వాతంత్ర్యసిద్ధికి సాధనము, 4) సమాజ సంఘటనా సూత్రములనెడి చతుర్విధ ప్రయోజనములును, భౌతికాధ్యాత్మిక లక్ష్యైప లబ్ధత్వమును గోచరించినవి. మాలపల్లివంటి నవలలు, గబ్బిలము వంటి కావ్యములు, మంచియన్నది మాలనే అగుదున్' వంటి గేయములు వెల్వడినవి. రాంజీరావుగారి 'దీనబంధు', గాంధీజీ 'నవజీవన్' సాధించిన చైతన్యము నాంధ్ర దేశములో సాధించినది. ఈ మహోద్యమముచే ప్రభావితులైన కవులను గూర్చి, కావ్యములను గూర్చి ఇక విన్నవింతును!

**కథాకావ్యములు :** వస్త్వాశ్రయములైన కృతులు, కేవలము హరిజన సమస్యను దృష్టిలో నుంచుకొనినవి తెలుగులో పెక్కురచే రచింపబడినవి. అందు ప్రముఖమైన వానిని పేర్కొందును.

**లవణరాజు కల :** జ్ఞానవాశిష్ఠాంతర్గత గాథను గురజాడ అప్పారావు గారు గ్రహించి పునర్నిర్మించినారు. వేదాంత సంబంధియైన మూలగాథ అస్పృశ్యతా నివారణోద్యమ ఫలితముగా ఆధునికత్వమును సంతరించుకొనినది. లవణ రాజు అశ్వారూఢుడై పోవుచుండగా తండ్రికి అన్నము తీసికొని పోవుచున్న పాటలాధరి కన్పడినది. ఆమె సౌందర్యమునకు రాజు ముగ్ధుడై

'భృత్యునైతిని నీదుమూర్తికి
భృత్యునౌదును నీకు సుందరి
మృత్యుముఖమున నున్న భటునకు
నన్నమీ వలదో' అని ప్రార్థించినాడు. దానికామె తానస్పృశ్య

వంశమునకు చెందిన కన్యవని చెప్పను, లవణరాజు వెంటనే అస్పృశ్యతను ఖండించుచు సుదీర్ఘ ప్రసంగమిచ్చెను.

'మలినదేహుల మాలలనుచును మలినచిత్తుల కధిక కులములు
నెలవొసంగిన వర్ణ ధర్మమధర్మ ధర్మంచే........
మంచిపెద్దలు మనుజులందున యెంచిచూడగ రెండె కులములు
మంచియన్నది మాలయైతే మాలనే నేదున్' అని ప్రకటించి 'సూర్య చంద్రుల సాక్షిగా' ఆమెను వివాహమాడుటతో కథ ముగియును. కావ్యశిల్పి కావున గురజాడ దీనిని రమణీయముగా తీర్చిదిద్దినాడు.

**విశ్లేషణ :** లవణరాజు కల హరిజనోద్యమ ఫలితముగా వెలువడిన కావ్యమే కాని లవణరాజు మాత్రము ఉద్యమార్థము వివాహమాడినవాడు కాడు. లవణరాజు కాముకుడు. తాను చూచిన కన్య మాతెత యగుట కాకతాళీయము. స్వకులస్థురాలైనచో అస్పృశ్యత గూర్చి ప్రసంగించి యుండడు. లేదు 'మాతెత' అయినను ఆమె మాతెత కావున వివాహమాడవలెనని సంకల్పము కలవాడు కాడు. అట్లైనచో ఆదర్శమే కరదీపిక కాగా అనాథయైన మరే మాతెతనో లవణరాజు వివాహమాడగలడా?? కావున లవణరాజు ఆదర్శమున కంకితమైన రాజు కాక పోవచ్చును. కాని గురజాడ దీనినితివృత్తముగా తీసికొని మట్టివంటి కథ నుండి మాణిక్య సౌధమును నిర్మించి ధూళినుండి దివ్యపుష్పములను వికసింపజేసి ఉద్యమ ప్రచారార్థము చక్కని ఖండకావ్యమను శాశ్వతముగా నిలిపినారన్నచో గురజాడ చిత్తశుద్ధి, ఆదర్శములను మాత్రము ప్రశంసింపవలసియున్నది. మనకు కావలసినది కూడ లవణరాజు చిత్తశుద్ధి కాదు - గురజాడపై ఉద్యమ ప్రభావమే కదా !

**గబ్బిలము :** జాషువా రచించిన రెండు భాగముల లఘు కావ్యమిది. వస్తువు నిమిత్తము. ఉద్యమ ప్రచారమే ప్రధానము. హరిజనునికి దేవాలయ ప్రవేశములేదు. కాని గబ్బిలము నిరంతరమాలయ గర్భమందిరమున వ్రేలాడ వచ్చును. పక్షి కన్నను పతితుడుగా నరుడుతోటి మానవునిచే తీర్మానింపబడి నిర్లక్ష్యము చేయబడినాడు కావుననే గత్యంతరములేక హరిజనుడు పూజారిని కాక గబ్బిలము నాశ్రయించి దేవదేవునకు రాయబారము పంపినాడు.

'ఆలయంబున నీవు వ్రేలాడు వేళ
శివుని చెవి నీకు కొంత చేరువగ నుండు
మౌని ఖగరాజ్ఞి! పూజారి లేనివేళ
విన్నవింపుము వాని జీవిత చరిత్ర!' అని సందేశము ప్రారం భించును. 'పూజారి లేనివేళ' యను చిన్న పదమే మన యెదలో నాగటిచాలువలె నాటుకొని పోయి కరుణారస సస్యములను పండించును. ఇందలి తంజాపుర, సింహపుర, హంపీవిద్యానగర, రాజమహేంద్రవర, గుంటూరు, బొబ్బిలి, నలందా, పాటలీపుత్రముల ప్రశంసలన్నియును నిమిత్త మాత్రములే. హరిజ నోద్యమమే కవి దృష్టిలోని కావ్యాదర్శనము. నరసింహాచార్యుల వారు దీని నాంగ్లములోని కనువదించుటకి దియే హేతువు. 'సనాతన ధర్మ ధేనువులపాలు' తమకు లభింపలేదని కవి విలపించినారు. స్మశాన వాటి దర్శించినను కవి సమస్యాత్మక దృష్టితోనే పరిశీలనము జరిపినారు. సామాన్యులకు స్మశానము ప్రేతభూమి. కాని హరిజనునికట్లు కాదు తరతమ భేదములను సమదర్శి పాటిం పని పవిత్ర స్థలము

'ఇట నస్పృశ్యత సంచరించుటకు తావేలేదు విశ్వంభరా నటనంబున్ గబళించి గర్భమున విన్యస్తంబు గావించియు త్కటపుం బెబ్బులితోడ మేక నొక ప్రక్కన్ జేర్చి జోకొట్టియూఱట కల్పించున భేదభావమును ధర్మంబిందు గారా డెడిన్' కావుననే జనాలయమైన భూమికన్న నిర్జనమైన కపాలవాటికయే మేలను భావము సజీవ మానవుని యెదలో కుసుమించినదనగా సంఘుదుస్థితికది పరాకాష్ఠ !

**స్వప్నకథ :** జాషువాగారే హరిజనోద్యమ ప్రభావముతో రచించిన రెండులఘు కావ్యముల సంపుటి యిది. 'అనాథ' ఒక హరిజన యువతి దీనగాథ ఆమె కారుగురు సంతానము. తలదాచుకొనుట కొక శైథిల్యము నందినగుడిసె. తినతిండి కట్టబట్టలేని దుస్థితి. మీదు మిక్కిలి సంఘములోని దుష్టశక్తులు పాద తాడనముచే నిట్టి గుడిసెల కాపురములనే బలికోరెడి క్రూర ప్రవృత్తి. వీని మధ్య నలిగిపోయిన వితంతువు దీనగాధను వారు హృదయ విదారకముగా, ప్రత్యక్ష రములోను నిక్షిప్తము చేసినారు.

**గుడిగంటలు :** కాటూరి వేంకటేశ్వరరావు గారు రచించిన కావ్యమిది.

తిరుపతి వేంకటేశ్వరు నుద్దేశించి భక్తుడు చేసిన విన్నపమిది. హరిజనుల దీన స్థితిని వినవలసినదిగా కవి జాగృత ఘంటికలను మ్రోగించినారు. స్వామివారి దర్శనార్థము లక్షలకొలది నందనార్లు ద్వారముకడ నిలిచినారు కాని దర్శనమే వారికి కరువైనది. స్వామికి పూజారులు సమర్పించెడి 'సేవ'లలోని భోజ్యములు, ఖాద్యములు ఎక్కడివి? ఈ యంటరాని వారి కష్టార్జితమే కదా! స్వామికి వారి సేవలు పనికి వచ్చినవి కాని దర్శన మిచ్చుట మాత్రము పాపమా? యని వాదించినారు హరిజనుల కోరికలను తెలియ నడుగవు. స్వయముగావారే 'అడుగ వచ్చిన గుడిదూరి గడియ వైచి కూరుచుంటివి. కొండెక్కి గొప్ప దొరవ'ని ఈశ్వరుని చేరలేని అస్పృశ్యుల ఆత్మవేదనను ఘంటా పథముగా చాటినారు. భక్త్యాత్మక రచనమే అయినను మహాత్ముని హరిజనోద్ధరణమే మనకు ప్రతి పదము వెనుకను ప్రతిధ్వనించును 'వైష్ణవజనతో తేనే కహియే జో పీడ పరాయీ జాణేరే। పరదుఃఖే ఉపకార కరతోయే మన అభిమానన ఆణేరే'యను మహాత్ముని ప్రియతమ ప్రార్థనా గీతమునకు గుడిగంటలు సాకారమైన శబ్దకల్పనమని చెప్పవచ్చును.

**సౌందర నందము :** పింగళి, కాటూరి కవుల సమష్టి వ్యవసాయమునకు ఫలమిది. బౌద్ధమత ప్రభావమున వెలసిన గ్రంథమిది. దానిని వేఱుచోట చర్చించెదను. ప్రస్తుతమిందలి 'సహధర్మ చర్య'మను చివరి యాశ్వాసమీ సమస్యకు సంబంధించినది కావున ఇట ప్రస్తావించెదను.

కథానాయికా నాయకులైన సుందరీనందులు చిర వియోగానంతర మొక వెలివాడలో కలిసికొనినారు. అవి 'చితచితలాడు నీరమున చేపల కంపున బంది ముట్టియల్ కతికెడి చప్పరింపుల'తో కూడిన దరిద్రతత తలపేలు గ్రుక్కికొను తావు. బుద్ధు డప్పు డచ్చటికి వచ్చి శృంగారనాయికా నాయకులను 'దీనులే కందులమట్టి పుట్టువుల గాచి యఖండము నవ్యయమ్మునానందము' గొను బాధ్యతనప్పగించి హరిజనోద్యమ జ్యోతినందించి తారుణ్యమూర్తులలో కారుణ్యమును పండించినాఁడు అశ్వఘోషునికన్నను భిన్నమగు ఈ వర్ణనము గాంధేయ ప్రభావముతో సమకాలీనమైన అస్పృశ్యతా నివారణోద్యమమున కుప బంధముగా నుండవలెనని కవులు రచించినదే ననుట స్పష్టము. ప్రధానేతివృత్త మొకటి సాగుచుండగా దానికంగముగా రచనా కాలము నాటి సమస్యలను రసోచి

తముగా, కథోచితముగా ప్రవేశపెట్టెడి రీతికిది ఉదాహరణముగా దీనిని పేర్కొం టిని. ఇట్టి వింకను పెక్కు గ్రంథములున్నవి.

**ఖండికలు :** వేంకట పార్వతీశ్వర కవులు కావ్య కుసుమావళిలో పంచ మాభివందనమను పేర రచించిన ఖండిక బసవేశ్వరుని వచనమునకు మిక్కిలి సన్నిహితముగా నున్నది

'మమత దప్పిన యాతడు మాలగాక
మాట దప్పిన యాతడు మాలగాక
అన్నెమును పున్నె మెఱుగని యట్టి మాల
మాలయే? దేవుమెడఁ బూల మాలగాక' యను ఖండిక.

'హింసాత్ముండగు వాడే మాదిగ
నీచు భుజించెడి వాడే మాఁడు
సర్వభూత హిత మెవరు కోరునో!
సంగమదేవ కులస్థుండాతడు'[1] అను వచనమునకు సన్నిహిత

ముగా నున్నది. దీనిని బలపరచుటకు మఱొక సాక్ష్యమున్నది. ఏ కాంత సేవ లోని పెక్కు భాగములు బసవ వచనముల కనువాదమా యనిపించును. కావున వారీ కన్నడ వచనాంధ్రానువాదము చదివియే యుందురు. గురజాడ అప్పారావు గారి 'మనిషి' ఖండిక అటు విగ్రహారాధనను తిరస్కరించుచు ఇటు హరిజనోద్య మమునకు బలము చేకూర్చుచున్నది.

'మనిషి చేసిన రాయి రప్పకి
మహిమ కలదని సాగి మొక్కుతు
మనుషులంటే రాయి రప్పల
కన్న కనిష్టం
గాను చూస్తా వేల బేలా' అని సరిగా హరిజనోద్యమము బలము

పుంజుకొనుచున్న దినములలో కృష్ణాపత్రికలో ప్రచురించినారు![2] మనిషిని

1. బసవగీత 62 పుట. అనువాదం : శివప్రసాద్.
2. 12-12-1912 కృష్ణాపత్రిక 6వ పుట. 'శ్రీ గురజాడ అప్పారాయ కవి.'

'రాయి రప్ప'కన్న కనిష్టముగా చూచుట - అనెడి వాక్యము కేవలము హరిజనులకు వర్తించినంతగా అన్యుల కన్వయించదు. 1904లో సంఘ సంస్కార సమావేశములు జరిగినప్పుడు దాసు వామనరావుగారు సమర్పించిన పద్యములలో

'వర్ణ భేదము గాల్చి వైచి యన్యోన్యంబు
పొత్తు గూర్పగ పెద్ద సుత్తి పెట్టు' అను పంక్తులు చాతుర్వర్ణ్య వ్యవస్థా విచ్ఛేదము నుద్దేశించుటతోబాటు హరిజనోద్ధరణమును కూడ మనసులో పెట్టుకొని పలికిన పంక్తులే. మంగిపూడి వారి 'నిరుద్ధ భారత' మానాడు సంఘ సంస్కర్తలచే గీతపలె పారాయణము చేయబడినది. బ్రహ్మ పట్టాభిరామశర్మగారు, పురిపండా అప్పలస్వామిగారు ఈ జాతి కవితనే వెలయించిరి. జాషువా తమ ఖండికలలో 'బాపుసందేశము' మొదలైనవి హరిజనోద్ధరణమే పరమావధిగా భావించి వెలయించిరి 'కారణ్యంబున నంటరాని తనమున్ ఖండింపవా యీ నిరాధార వ్యక్తుల ఘోషణంబు కనరాదా నీకు? నాంగ్లేయులన్ మా రాజ్యం బిడుడంచు వేడుకొనుచున్నా విట్టి నీ కిత్తురా? ప్రారంభంబున నిన్ను దిద్దుకొనుమయ్యా కోర్కె సిద్ధించెడిన్'[1] అని స్వాతంత్ర్య సిద్ధికి ముందుగా వచించుటలో గాంధేయ ప్రభావము స్పష్టముగా గోచరించుచున్నది. స్వీయ సమాజమును సువ్యవస్థితముగా రూపొందించుకొన లేని వారు స్వాతంత్ర్యమున కర్హులు కారను కవి భావమువలన హరిజనోద్యమము దేశ స్వాతంత్ర్యముతో ముడిపడిన గంభీర సమస్యయను స్ఫురణ కలుగుచున్నది. మఱొక పద్యములో

'అనుగుందమ్ములు దిక్కుమాలి పుర బాహ్య క్షోణిగారాడ నె
చ్చిన సౌభాగ్య సువర్ణ మందిర సమాసీనుండవై హాయిగా
గనుమూయందగవా?'[2] అని ప్రశ్నించుటలో హరిజనోద్ధరణముతో బాటు నాడు క్రమముగా వికసించుచున్న సామ్యవాద ప్రభావము కూడ కవిపై ముద్ర వైచినదనుట స్పష్టము.

సాయంవరదా దాసుగారు గాంధీ సిద్ధాంతము వలన ప్రభావితుడై స్వరాజ్య ధంకాయను గ్రంథము రచించెను. దీనికే 'గాంధీమత ప్రబోధ'మని నామాంత

1. ఖండకావ్యము. మొదటి భాగము. 29వ పుట. 6వ పద్యము.
2. ఖండకావ్యము. మొదటి భాగము. 29వ పుట. 8వ పద్యము.

రము. గీత నృత్యముల కనువగురీతిలో అప్పుడప్పుడు దాసు రచించిన కవితల సంకలన మిది. అందు 'అస్పృశ్యత' యను శీర్షికలో కవియిట్లు పేర్కొనినాడు.

'పంచమ జాతియటంచు కరుణనెంచక మాల మాదిగల నొప్పించూ కొంచపు బుద్ధినిద్రుంచూ గాంధి గురుబోధ గాంచిన సత్కీర్తిమించు దయరాదె హిందువులారా !!' - విదేశీయులను స్పృశించిన తప్పులేదుకాని హరిజనులను తాకుటతప్పా? యని ప్రశ్నించినారు.

'తురకల తగులుటలేదా వారితో కూడా కూర్చొనియుండుట లేదా, మరి మాలవానితో వాదామాడి తరిమి గొట్టూట యధర్మము కదా' - శ్వానమువంటి జంతువులను స్పృశించెదరు కాని సాటి మానవుడు అస్పృశ్యుడా? అని దాసుగారు ప్రశ్నించినారు.

'కుక్కల కోళ్ళను మీరూ బల్ మక్కువతో తాకి సొక్కుచుందేరూ అక్కట యిదిమేమి తీరు' అని ప్రశ్నించుట 'మృత జంతువు కన్నను నరుడ ధముడు మది నెరింగి గొల్వుము సంగమునిక !' అను బసవేశ్వరుల ప్రబోధము నకు తుల్యముగా నున్నది!! ఇట్టి గీతములింకెన్నియో వెలువడినవి.

ప్రక్రియా వైవిధ్యమునంతటిని ప్రదర్శించుటకు లఘు కావ్యములు, ఖండి కలు, ప్రచార గీతములలో హరిజనోద్యమమెట్లు ప్రతిబింబించినదో వివరించితిని. ఈ సంఘ సంస్కార మింకను ముగియకుండుటచే నేటికిని అట్టి రచనలు వచ్చు చునే యున్నవి.[1] వానినెల్ల పేర్కొనక దాశరథి 'సీలిరవ్వ'ను పేర్కొని విర మించెదను. కాలము గడచిన కొలది దూరము తరిగిన కొలది దేశ సమస్యల నంతర్జాతీయ దృష్టితో పోల్చిచూచుట విశ్వము యొక్క శ్రేయస్సును కాంక్షించెడి కవి కర్తవ్యము. కావుననే దాశరథి దేశీయమైన అస్పృశ్యతను, అమెరికాలోని రంగుభేదముతో పోల్చి చూచి 'సీలి రవ్వ' సాధించిన విజయమును ప్రస్తుతించి నారు. అమెరికా మిసిసిపీ విశ్వవిద్యాలయములో నీగ్రో జేమ్స్ మెరిడిత్ పట్ట భద్రుడైన వార్తవిని కవి యెద కమలమై విరిసినది.

---

1. శ్రీ గోపి హంపయ్య ఇటీవల రచించిన 'అస్పృశ్యత' అను పద్యకావ్యము పేర్కొనదగియున్నది.

"నలుపులోంచి నవనాగరిత ఉద్భవిస్తున్నది
నలుపులోంచి వెలుతురు వికసిస్తున్నది"[1] అని రంగు కారణ ముగా అస్పృశ్యతను పాటించెడి వారికి నీతిని బోధించినాడు.

'పరిమళాలు చిమ్మే హృదయపు అగరువత్తిని చేత పుచ్చుకొని
అణుబాంబుల వాళ్ళను అదిరించిన నీలమణీ........
అవును దమ్ముల్లేని దద్దమ్మలు దొమ్మీలుచేసే వాళ్ళను చూసి
భయపడతారు పరుగెడతారు'[2] అనుటలో కవి మెరిడిత్‌ను సంకేతముగా స్వీకరించి గాంధీజీనే వర్ణించినారా, అనెడి భావము సహజముగా కలుగును. హరిజ నుడైనంత మాత్రమున అంటరానివాడు కాజాలడు. తెల్లని చర్మమున్నంత మాత్రమున మనస్సులో కాలకూటము లేదని చెప్పలేము. కావుననే కవి 'నల్లని వాడ జ్ఞాననయనమ్ముల వాడ మనస్సులోపలన్ తెల్లనివాడ'[3] అని సంబోధించి స్పృశ్యా స్పృశ్యతలు 'వర్ణము' ననుసరించినవి కావని ఎలుగెత్తి చాటినారు. దేశీయ సమస్య కంతర్జాతీయ స్వరూపమెట్లు సిద్ధించినదో చూపుట కిది ఉదహ రించితిని. ఇక విశ్వగీతిలోని సి. నారాయణరెడ్డిగారి కవితతో ఈ యుద్యమ మును ముగించెదను

"వర్ణ విభేదాలు తొలగి । వైషమ్యాలణగి మణగి
బర్బరత్వ మంతరించి । పశుతత్వం మెడలువంచి
మానవత్వము జయించెను శాంతి తంత్రి నినదించెను"[4] కవి (ర) సహృదయుడు కావున దీనిని భూతకాలములో చెప్పినారు కాని నిజమున కిది భువిలో సిద్ధింపవలసిన మధురాకాంక్షగనే నేటికిని మిగిలియున్నది.

## ఇతర సాంఘికోద్యమములు :

మహిళోద్యమము, హరిజనోద్యమములు కాక ఆంధ్ర ప్రాంతములో సాగిన మిగిలిన సాంఘికోద్యమములన్నింటిని ఈ క్రింది విధముగా వింగడింపవచ్చును :

1) సమాజ రచన :- కులవ్యవస్థ ఇత్యాదులకు వ్యతిరేకమైన పోరాటము.

---

1, 2, 3. నీలిరవ్వ. కవితాపుష్పకం - ఖండకావ్యము 107వ పుట.
4. విశ్వగీతి 18వ పుట.

2) ఆరాధనా విధానము :- మతసంబంధి, విగ్రహారాధనాదుల తిరస్కారము.
3) వ్యసనములు :- కల్లు నల్లమందు, జూదము, వ్యభిచారములకు వ్యతిరేకముగా సంగ్రామము.
4) మూఢాచారములు :- సముద్రయానము కూడదనుట, భూతములపై విశ్వాసము దృష్టిదోషము మొ॥ ఆచార వ్యవహారములను నిరసించుట.

ఈ దురాచారములు కొన్ని వైయక్తికములు. కొన్ని సామూహికములు. నల్లమందు, జూదము తన యింటిని యొంటిని గుల్లచేయును. త్రాగుడు, వ్యభిచారముల ఫలితముగా వ్యక్తి సమష్టి సౌఖ్యమునకు భంగకారియగును. కుల వ్యవస్థ సామూహికమైన సమస్య. సమాజ నిర్మాణ ప్రణాళికను చెందినది. విగ్రహారాధనము వైయక్తికమైనను జంతుబలులు, నరబలులు సమాజ సంక్షేమమునకు భంజకములు. భూతములపై విశ్వాసము కూడ అట్టిదే ! సముద్రయాన నిషేధము సమాజ పురోగతికి విరోధము కల్పించును. కావుననే సంఘ సంస్కర్తలును జాతీయోద్యమ నాయకులును పై సమస్యలను దృష్టిలో నుంచుకొని పోరాటములను సాగించిరి.

జాతీయోద్యమ సంగ్రామము ద్విధా వర్తించినది :

మొదటిది, బాహిరమైన శత్రువులపై దృష్టి-ఆంగ్లేయులను పారద్రోలుట. రెండవది, ఆంతరమైన శత్రువులను నిర్మూలించుకొని సమాజమును సువ్యవస్థితము చేయుట. సాంఘికోద్యమము లన్నియును ఈ తరగతిలోనికి వచ్చును. ఉద్యమశీలమైన వీని గతినిక వివరించెదను.

**వర్ణవ్యవస్థా వ్యతిరేకోద్యమము :** గుణకర్మల ననుసరించి తానే చాతుర్వర్ణ్య వ్యవస్థ నేర్పరచినట్లు భగవానుడు గీతలో చెప్పినప్పటికిని అధునిక కాలములో అది తన పూర్వౌన్నత్యమును, ప్రయోజనమును కోల్పోయినది. బ్రాహ్మణులు ముఖస్థులు, క్షత్రియులు బాహువుల నుండి వచ్చినారు, వైశ్యులు ఊరువుల నుండి శూద్రులు పాదముల నుంచి వచ్చినార[1]ను వైదిక కల్పనములోని

---

1. 'బ్రాహ్మణోఽస్య ముఖమాసీద్బాహూ రాజన్యః కృతః
ఊరూతదస్య యద్వైశ్యః పద్భ్యాగ్ శూద్రో అజాయతః' యజుర్వేదము 31వ అధ్యాయము, 11వ మంత్రము.

తాత్పర్యము నష్టమైనది. సంఘర్షణను నిర్మూలించెడి సమాజ రచనకిది ప్రాతి పదికగా ఋషులీ మంత్రమును ప్రవచించినారు. బ్రాహ్మణులు బుద్ధిజీవులు. క్షత్రియులు రక్షణ వ్యవస్థకు ప్రతినిధులు. వైశ్యులు వస్తు వినిమయాదులచే సమాజ పోషణ చేయుదురు. సమాజ పరమేశ్వరుని సేవలో దేహమునకు పాద ములవలె శూద్రులు తమ పాలు తాము పంచుకొందురు. ఇట భగవానుడనగా సమాజ విరాట్స్వరూపమే! లేనిచో నిరాకారుడు నిర్గుణుడునైన పరమేశ్వరునికి వేదములో పై కరచరణాద్యవయవ కల్పనమెట్లు పొసగును??

కాని నవీన కాలములో సమాజ రచనము శిథిలమైనది. కర్మననుసరించి కాక కేవలము జన్మ ననుసరించి ఉచ్చనీచము లారోపింపబడసాగినవి. బ్రాహ్మ ణుని కుమారుడు పాదరక్షా వ్యాపారము చేయుచున్నను బ్రహ్మజ్ఞుడైన శూద్రుని కన్న శ్రేష్ఠుడేననుట సమంజసమగునా?? కావుననే వర్ణవ్యవస్థపై మున్నెన్నడును కానరానంత వైషమ్యమును సంఘ సంస్కర్త లాధునిక కాలములో ప్రదర్శించి నారు. ఉద్యమమునకు మూలకారణమైన తత్వము స్వరూపమిది!

**అనార్యోద్యమము:** వర్ణ వ్యవస్థా శైథిల్యమును గూర్చి సంఘ సంస్కర్త లందఱును విచారము వ్యక్తపరచినవారే కాని ఆంధ్రదేశములో దానికి విలక్షణమైన వ్యాఖ్యానము చెప్పబడినది. ఆర్యులు ఔత్తరాహులనియును స్థానికు లందరును ద్రావిడులనియును, ప్రస్తుతమున్న బ్రాహ్మణ వంశము ఆర్యులకు ప్రాతినిధ్యము వహించుచున్నదనియును ఈ వాద సారాంశము. ముందుగా మద్రాసులో గుడ్విన్ దీనికి బీజావాప్తి చేసినారు. డాక్టరు నాయరు, పిట్టి త్యాగ రాయచెట్టిగార్లు దీనికి నాయకత్వము వహించినారు. తెలుగునాట సాంస్కృతిక ముగా భాషాపరముగా సాంఘికముగా కూడ ఈ యుద్యమము ముప్పేటయై ముందుకు సాగినది. మద్రాసులో ద్రవిడ కజగము ఆంధ్ర ప్రాంతములో జస్టిస్ పార్టీ రాజకీయముగా ఈ సిద్ధాంతమునకు నాయకత్వము వహించినవి. ఈ యుద్యమము దిన దిన ప్రవర్ధమాన మగుట కీ క్రింది కారణములు తోడ్పడినవి.

**ఆర్థికము:** నాడు మద్రాసు రాష్ట్రములో ఉద్యోగము లన్నింటిలోను బ్రాహ్మణు లధిక సంఖ్యలో నుండెడివారు. ఇది బ్రాహ్మణేతరులకు కోప కారణ మైనది.

**అనైకమత్యము :** ఆంధ్రప్రాంతములోని బ్రాహ్మణుల అనైకమత్యమీ యుద్యమమునకు బాగుగా దోహదము చేసినది. గుంటూరులో తిరుపతి వేంకట కవులకు సన్మానము జరుగగా నియోగి - వైదీకి కక్షలతో మరునాడొక గరిదెను వీధులలో ఊరేగించినారు. పరస్పరశాఖా విద్వేషములతో నాడెంతో సాహిత్యము వెల్వడినది. బ్రాహ్మణుల పరస్పర వైమనస్యము బ్రాహ్మణేతరోద్యమమున కాయువు పట్టైనది.

**సంస్కరణాభిలాష :** బ్రాహ్మ సమాజము ఆర్యసమాజము సంస్కరణాభిలాషను సమాజములో పెంపొందింప జేసినవి. జి. వి. ఎన్. సరస్వతీ స్వాములవారు 'పంచముల చరిత్ర'మను గ్రంథము రచించి కుల మత విచక్షణ లేకుండ మానవులందరును బ్రహ్మత్వమున కర్హులేనని చాటి వైదిక సంస్కార మొసంగిన యజ్ఞదీక్ష విస్పించినారు. అట్లే గానాల రామమూర్తి నిరంజన శాస్త్రి గార్లు విశ్వ బ్రాహ్మణోద్యమమును గుంటూరులో జిల్లాలో నడిపి 'సమదర్శిని' యను పత్రికద్వారమున పునఃసంస్కారమునకు తోడ్పడినారు. త్రిపురనేని రామస్వామి చౌదరిగారు నిర్వహించిన అనార్యోద్యమముకుసుమించుట కవి దోహద ప్రక్రియలైనవి.

**రామస్వామి చౌదరిగారి వాదము :** అరబ్బులు, మొగలులు, ఆంగ్లేయులు ఎట్లు విదేశములనుండి భారతదేశముపై దురాక్రమణము చేసినరో ఆర్యులు కూడనట్లే మధ్య ఆసియా ప్రాంతమునుండి వచ్చి ద్రావిడులను అనార్యులని దస్యులని అణచివేసి తమ యజ్ఞ విధానమునిట ప్రవేశపెట్టినారు. రామరావణ సంగ్రామమీ ఆర్యానార్య సంఘర్షణమే కాని వేరుకాదు. నేటి ద్విజులార్యులు. శూద్రులు అనార్యులు. కావున తిరిగి వైదేశిక పాలననుండి ద్రావిడులు స్వాతంత్ర్యము పొందవలెనని రామస్వామి చౌదరిగారి వాదము. వారి కృతులన్నిటిలోను ఈ సిద్ధాంతమే ప్రతిబింబించినది. సూర్యదేవర రాఘవయ్య చౌదరి, దుగ్గిరాల రాఘవచంద్రయ్యగారు సాహిత్య రంగములో వీరికి సహాయ భూతులైరి.

**ఉద్యమ విజృంభణము :** 1923 నుండి 26 వఱకు రాఘవచంద్రయ్యగారు 'స్వరాజ్య' పత్రికను విజయవాడనుండి నడిపినారు. అనార్యోద్యమమునకిది విజయకాహళ. పెండ్యాలవారి మహాభారత విమర్శనము వేమూరి రత్నయ్య

గారి హిందూధర్మ రహస్యము, ముద్దుకృష్ణగారి అశోకము, చలంగారి సారంగ ధర సమాజములో గొప్ప సంక్షోభమును సృష్టించినవి. ఉద్యమము తీవ్రతనందు కొన్న కొలది 'చివరకు' 'జూ'లను జర్మనీనుండి వెళ్ళగొట్టినట్లు ఆర్యులవే వాళ్ళను వెళ్ళగొట్టుటము క్రిందికి దిగుతుందేమో తెలియదని సమకాలీనులు భయ పడినారు.[1]

వర్ణ వ్యవస్థా వ్యతిరేకోద్యమములో మఱల మూడు విభాగములున్నవి. 1) అనార్యోద్యమము :- త్రిపురనేని వారి నాయకత్వమున సాగినవి. ఆర్య-ద్రావిడ భేదము దీని సిద్ధాంతము

2) వర్ణ వ్యవస్థా వ్యతిరేకోద్యమము :- ఆర్యా - నార్య భేదమును పాటింపకుండ - భారతీయులలో కులవ్యవస్థను నిర్మూలింపవలెనని పోరాడుట దీని కార్యక్రమము. 'గోరా' ప్రభృతులీ వర్గమునకు నాయకులు.

3) హరిజనోద్యమము : అంత్యజులుగా నిర్లక్ష్యము చేయబడిన వారిని చాతుర్వర్ణ్య వ్యవస్థలో భాగము స్వీకరింపవలెనను సిద్ధాంతము వీరిలో పెక్కురు చాతుర్వర్ణ వ్యవస్థను ధిక్కరింపకనే హరిజనోద్ధరణమును సాగించిరి. కొండా వెంకటప్పయ్య పంతులువంటి వారీ వర్గములోనికి వత్తురు ఈయవాంతర భేద ములవలన ఫలితాంశములలో కూడ స్వల్పముగా వైవిధ్యము గోచరించుట సహ జమే! కాని స్థూలముగా సాగిన పోరాటము సామూహికముగానే నడచినది.

## కవిత్వముపై ప్రభావము :

హరిజనోద్యమ కవితను ముందే వివరించితిని. ఆర్యా - నార్య సిద్ధాం తము వర్ణ వ్యవస్థా వ్యతిరేకోద్యమముల ప్రభావముతో వెలువడిన కవిత్వము నుదాహరించెదను.

**సూత పురాణము :** త్రిపురనేని రామస్వామి చౌదరిగారు నాల్గు భాగ ములుగా వెలయించిన కావ్యమిది. ప్రాచీన పౌరాణిక మతమ సత్యమని నిరూపిం చుట, శ్రీకృష్ణాదులైన అవతార పురుషుల చరిత్రలో ఆర్యా - నార్య సంఘర్షణ మును చూపుట కవి వక్తవ్యాంశములు పౌరాణిక మత ఖండనమునకు 'సత్యార్థ

---

1. కురుగంటి సీతారామయ్యగారు. నవ్యాంధ్ర సాహిత్యవీధులు.

ప్రకాశిక' బలము నిచ్చినది. అవతారములు మిథ్యయని, పరమేశ్వరుడు కరచర ణాద్యయవములతో జన్మింపడని వారు నిరూపించినారు. త్రిపురనేని వారింకను కొంచెము ముందుకేగి రామకృష్ణాదుల జీవితములు, పోరాటములు అనార్య ప్రభు వులపై సాగించిన ఆర్యుల దండయాత్రగా వ్యాఖ్యానించినారు కావుననే శ్రీకృష్ణునిపై ఆనార్యుడైన బోయ తన పగను తీర్చుకొనవలసి వచ్చినది.

'బోయ డొక్కఁడు వీక్షించి పొత్తిపట్టి
చిక్కెనే చిక్కె గృష్ణుండు చేతికిప్పు
డెటుల దప్పించుకొని యాతడేగ గలడొ
కాంతునని చెప్పి సంతోష కలితుఁడగుచు' శర సంధానము చేసి

నాడు. ఇట్లే అనార్యుడైన ఏకలవ్యుని అర్జునుడు జయించుటకై ద్రోణుడు పన్నిన కుతంత్రముగా ఏకలవ్యోపాఖ్యానము వ్యాఖ్యానింపబడినది. శంబూక వధ కూడ ఇట్టి ఆర్య విజయములోని భాగమేనని త్రిపురనేని వారభిప్రాయబడినారు. వచన ములో వారు 'ఖూనీ'యను నాటకమును ఉద్యమ కాలములో పై సిద్ధాంతమున కుప బలకముగా రచించుట దానికి ప్రతిగా విశ్వనాథవారు 'వేనరాజు'ను ప్రక టించుట ఉద్యమములోని తీవ్రతకు చిహ్నములు.

**పురాణవిందు :** సూత పురాణములో వెనుకటి పురాణములన్నియు **'బూతు పురాణము'**లని చెప్పబడినవి. 'మతి మాలిన కవిచంద్రులు గతి మాలిన వారలగుచు గది' కినకథలవి. లేనిచో టిబెట్టును త్రివిష్టపమని వర్ణించి స్వర్గ సుఖములను, గంధర్వాప్సరో భామినుల నట కల్పించుట హాస్యాస్పదము కాదా యని కవిగారు విమర్శించినారు. మంచుకొండయే రజతాద్రి. భిల్లుడే శివుడు. లింగాకార శిలనుండి గంగ ప్రవహించుటే శివ జటాజూట నిర్గమన గాథయని యీ తీరులో పురాణములను వ్యాఖ్యానించినారు.

**స్వర్గవిందు :** స్వర్గమభూత కల్పన. లేనిచో నరకమున కన్న భయం కరమైన ప్రాంతము. 'ఆంధ్రేకాని యిల్లాంధ్రు'లేని ప్రదేశమది- అమృతమనగా సురయే. కల్లు నిచ్చెడి చెట్టకు కల్గు గౌరవంబు పెఱవానికినిలేదు వజ్ర మ్రోల' యని వ్యగ్యముగా స్వర్గ కల్పనమును ఖండించి ఇట్టి అభూత విషయమునకై యజ్ఞములు చేయుట వ్యర్థమని చాటినారు. దేవేంద్రుడు మాత్రమేమి విశుద్ధ చరి త్రుడా? సుఖవ్యాధి పీడితుడు.

'వేయి కన్నులు నాకు కన్పింపలేదు
పొడలు మాత్రము కన్పించె నొడలినిండ' యని పరిహసించి
నారు.

**మనుస్మృతిపై విమర్శ :** హిందూవర్ణ వ్యవస్థ మనుస్మృతి నాధార
ముగా చేసికొని నిలిచినది. కావున త్రిపురనేని వారు మనువును విమర్శించినారు.
"శూద్రున కుం ధనం బమరశోభపదుం జగమంచని" యేల వ్రాసినావని మను
వును గద్దింపగా ఆయన 'జడుడను గావున క్షమింపు'మని కొందరు బ్రాహ్మణులు
బలవంత పెట్టగా వ్రాసినానని రోదించి కవి పాదములపై పడినారు. అది గని
చౌదరిగారు రోసినారట! ఈ రీతిలో హిందూవ్యవస్థను సుతపురాణము తిరస్క-
రించినది.

**ఆరాధనము :** త్రిపురనేని వారు నాస్తికత్వమును ప్రచారము చేయ
లేదు కాని ఆర్య దైవములను వ్యతిరేకించినారు. ద్రావిడులు బుద్ధిమాంద్యులై
"గంగగుడులు మాని" సీతారాములను కొలువసాగినారు. పోతరాజునకు ఛిందులు
మాని వీరభద్రుని మ్రోలగెంత సాగినారు. గొంతెమ్మ కొలుపుమాని బ్రహ్మ
విష్ణు మహేశ్వరులను, పాలేరమ్మ జాతరమాని యజ్ఞ బలులను ప్రారంభించినా
రని కవి విచారించినారు.

ఇట్లే భగవద్గీతకు మారుగా బాలచంద్రునకు బ్రహ్మనాయు డుపదేశించి
నట్లు నవీన గీతను రచించినారు. కుప్పుస్వామి శతకము, కురుక్షేత్రసంగ్రా
మము, ఈ జాతి గ్రంథములే

సమాజ రచనలో పరివర్తనము రావలెనని సంస్కర్తలు కవులు సాగిం
చిన ఉద్యమ తత్వమును వివరించితిని విగ్రహారాధన, వ్యసనములు మూఢా
చారములవంటి వానిపై సాగిన పోరాటము నుదాహరించెదను! సాంఘికోద్యమము
లలో సంస్కరణాత్మకము లన్నియును జాతీయోద్యమమునకు గాంధేయతత్వ
ప్రచారమున కనుబంధముగానే సాగినవని ముందే మనవి చేసితిని అనగా
స్వాతంత్ర్య సంగ్రామము నడిపిన వారే సంఘ సంస్కరణములన్నిటిని నిర్వ
హించినారు కావున వీనిని ప్రత్యేకముగా చారిత్రక దృక్పథముతో పరిశీలించుట
పునరుక్తియే కాగలదు అందుచే సంస్కరణాత్మకముగా వెల్వడిన కవిత్వము
లోని శాఖలను ఉదాహరించెను

**విగ్రహారాధనము:** విగ్రహముల పూజ వైయక్తికమే అయినను సామ్యవాదులు వ్యతిరేకించుటతో రాజకీయ ప్రభావము, సంస్కర్తలు బ్రహ్మ సమాజ, ఆర్యసమాజ కార్యకర్తలు ధిక్కరించుటచే సాంఘిక, మత ప్రభావముల కును లోనైనది. విగ్రహారాధనను వ్యతిరేకించుటలో కార్యమొక్కటే అయినను కారణములు వేఱు. నిరీశ్వరవాదముతో సామ్యవాదులు దీనిని తిరస్కరింపగా ఈశ్వరుడొక్కడేనని ఆతనికి ప్రతిమలు నిర్మింపకూడదని ఆర్య సామాజికుల భిప్రాయపడినారు. సజీవమైన మానవునే మాధవునిగా ఆరాధింపవలెను, కావున విగ్రహా రాధన కూడదని సంస్కర్తల మతము. కవితలో ఈ రీతులన్నియును ప్రతిబింబించినవి.

'ఘలఘల లాడు పొట్ట తెగ మాసిన బట్ట కలంతపెట్టగా
విలవిల యేడ్చుచున్న నిరుపేదకు జాలిని చూపకుండ ని
త్రల పడిపోయి జీవరహితంబగు బొమ్మకు నిండ్లు వాకిళుల్
పొలమును బొట్ట నిచ్చెడి ప్రబుద్ధవదాన్యుల నిచ్చమెచ్చెదన్' అని

త్రిపురనేని వారు సూత పురాణములో పలికి మానవారాధనమే మాధవారాధన మని చాటినారు. దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు 'చిత్ర చిత్రపు పూలు చైత్రమాసపు పూలు ఊరూర ఇంటింట ఊరికే పూచాయి. శిథిలాలయములో శిల కెదురుగా కునుకు పూజారి కొకటేని పూయలేదోయీ,' అని బ్రహ్మ సమాజ ప్రభావముతో సజీవ సృష్టి నారాధింపుమని చాటినారు. పేదల దుఃఖమును చూచినప్పుడు ఆత్యాధునికులకు ఆస్తికులకు కూడ విగ్రహారాధనముపై నిట్టి భావమే కల్గినది.

"ఓ పరమేశ్వరా! యెచట నుంటివి! నీవసలుంటివా ప్రజా
శాపములం భరించుటకు సాధ్యముకాదని పాత పెత్తనం
బీ పయిసాగ బోదని యెటేని పరారయినావ? ఆధలం
బాపగలేవు నీవు శిలవా? కలవా? సెలవీయుమో ప్రభూ'

అని గుంటూరు శేషేంద్రశర్మగారు 'ఋతుఘోష'లో ఈశ్వరుడు పెనుశిలగా మారినాడని కలగా మిగిలినాడని నిరసించుట మానవారాధనా భావములోని భాగమే. గృహమే కైలాసమైనచో స్త్రీ పురుషులే శివానీ పరమేశ్వరులౌదు రనునది దీని తత్త్వము.

**వ్యసనములు :** 'దేహం దేవాలయం ప్రోక్తం జీవోదేవస్సనాతనః' యను శంకరాచార్యులవారి సూక్తి ప్రకారము ఈశ్వరమందిరమైన దేహాలయ మును పవిత్రముగా కాపాడవలెననునది వ్యసన నిరసనలోని అంతరార్థము. గాంధీజీ ప్రబోధించి తత్వమిదే! కావుననే జాతీయోద్యమములో గాంధేయులైన కవిగాయకులందరును గొంతెత్తి వ్యసన పరాయణత్వమును నిరసించిరి. 'కల్లు మానండోయ్ బాబూ కళ్ళు తెరవండోయ్' అని పాడుచు సత్యాగ్రహులు స్వాతం త్రోద్యమములో కల్లు దుకాణముల ముందు పికెటింగు జరిపెడివారు.

'కల్లు ద్రావిన క్రూరకర్ముండు కీచకుం
దం భీమసేనుచే హతమునొందె
యాదవుల్ సురద్రావి యబ్ధితీరంబున
కలహించి యొండొరుత్విలయమైరి
శుక్రుడు నంతటివాడు సురమీది భ్రాంతిచే
శిష్య హంతకుడౌచు జింతనొందె'[1] అనుటలో పౌరాణిక

గాథా స్మరణము వలన సద్బుద్ధి కల్గింపవలెనని కవి సాగించిన ప్రయత్నము సువ్యక్తమగుచున్నది.

'పతి గొట్టుట హత్యకు పాలుపడుట
దొంగతన మొనర్చుట తిట్ట దొరయుటమును
వసుధ వొక్క యీ త్రాగుడు వలన కాదె
భరతపుత్రకులార ! మీ పాదములకు
వందనము సేతు త్రాగుడువదలుడయ్య'[2] అని దీనముగా ప్రార్థిం

చుటలో సప్త వ్యసనములన్నియును మదిరాశ్రయములేనని కవి ఉద్ఘోషించు చున్నారు. ఇట్టివి శతాధికములు కలవు.

**ఆదర్శ సతీత్వము :** వ్యభిచారము, పునర్వివాహము, ఆదర్శ లక్ష ణములు కావని ఏకపత్నీత్వ మెట్టిదో పాతివ్రత్యము కూడ నట్టిదేనని సంస్క ర్తలు కొందరభిప్రాయపడినారు. కపోతముపై అన్యాపదేశముగా వేంకట

---

1, 2. స్వరాజ్యఢంకా. చెడిపోయిన పూర్వులు. 33వ, 36వ పుటలు.

పార్వతీశ్వర కవులు రచించిన ఖండికలోని భావ మిదియే.[1] పతంగి తన ప్రియుని కొఱకై ప్రాణత్యాగము చేసిన కథ నాధారముగా కవివరు లల్లినారు. "ఓ వెఱ్ఱిపులుగ యేఁటికి పాపవలయునమ్మ....విధవలు జీవించి సతీవ్రతంబు చెల్లింపరచే" అనుటలో సతీవ్రత మాహాత్మ్యమును చాటినారు.

"చెలువల రెండవ పెండ్లికి
బలవంతము చేయుదురటె వలదనుచుండం కులజులు" అనుటలో సంస్కారణాత్మక వివాహము ఐచ్ఛికమే కాని నిర్బంధ విషయము కాదని చాటినారు. 'కుల కాంతల నిను(బోలంగల వారలు కోటికొకరు కలరో లేరో' యని పులుగును ప్రశంసించుట నెపముగా సమాజము ముందొక మహోన్నతాదర్శముకు కవివరు లుంచినారు. ఇట్లే తిరుపతి వేంకట కవుల శ్రవణానందము, పాణిగృహీతలు, వేశ్యా నిరసనము, ఆదర్శ వివాహము, ఏకపత్నీవ్రతము, ఉత్తమ సతీ ధర్మములను ప్రతిపాదించిన కృతులన్నిటిలోను అగ్రశ్రేణికి చెందినవని చెప్పవలసి యున్నది.

**సాగరయానము :** 'బహు దేశ సంచార భాగ్యంబుల దలంచి
సింధు యానంబుల జేయరాదొ'[2] యని సంస్కర్తలు ప్రబోధించి సముద్ర యానము దోషమను మూఢ విశ్వాసమును నిర్మూలించినారు. అగస్త్యుడు సాగరయానము చేసి జావాసుమత్ర ద్వీపములలో భారతీయ నాగరికతను వ్యాపింపజేయుటే 'అగస్త్యుడు సముద్రము నాపోసనము గొనినాడ'ను గాథలోని ఆంతర్యము కదా! పూర్వము నుండి పరంపరాగతముగా వచ్చెడి ఆచారము నే డనాచార మెట్లగునని సంస్కర్తలు ప్రశ్నించినారు.

'సాగరయానంబు సలుపరాదనువారి
దుర్దశాబ్ధి దరింప ధూమనౌక'గా సంస్కరణోద్యమము వచ్చినదని ఆలంకారికముగా కవి ప్రవచించినాడు.[3]

---

1. రచనా కాలము 1910 మే. 20.
2. 1902 బందరు సంస్కరణాత్మక సభలో అయ్యంకి కుటుంబరావుగారి కవిత. (కృ. ప.)
3. దేసు వామనరావు. సంఘ సంస్కరణ సభలో చదివిన పద్యములు 15-6-1904 కృ. ప.

**దృష్టిదోషము:** దృష్టిదోష మటంచు తెరలోన దినువారి
తెర లూడిపడ గడ తేర్చు గాలి[1]గా సంస్కారణోద్యమము వచ్చినదని సహపంక్తి భోజనమును ప్రబోధించినాడు.

## మాదక ద్రవ్యములకు వ్యతిరేకత :

'శాకములను ధాన్యములను స్వాదు ఫలముల
స్వీకరించి భోజనముగఁ జెలగుచుండుడు
మాంసభక్షణంబు మరియు మద్యపానమున్
హింస కాకరములనుచు నెంచి వదలుడు
పొడుము గంజాయి చుట్ట మొదలుగాఁ గల
చెడు దురభ్యాసములకు జిక్కకుండుడు'[2] అని ఆదిపూడి సోమనాథరావుగారు 'ఆత్మ జీవితాధర్మ'మను కవితాముఖమున పొడుము గంజాయి, చుట్ట మొదలగు దురభ్యాసములకు వ్యతిరేకముగా పోరాటము సాగించినారు. వీరు దయానందుని శిష్యులు. కావున ఆర్య సమాజ ప్రభావముతో గాంధేయుల వలెనే ఈ యుద్యమమును నిర్వహించినారు.

**పశు హింసా విరసనము:** మానవుడు చేయు ప్రతికర్మమును యజ్ఞతుల్యమే! అందును హవిస్సును హోత ప్రేల్చెడి యజ్ఞము పూర్తిగా సాత్త్వికమైనదని వేదమతము. కాని కాలక్రమమున హింస దురాచారమై యిందు ప్రవేశించినది. బుద్ధుని వంటి ప్రవక్త లందులకే జన్మించి హింసా యజ్ఞములకు వ్యతిరేకముగా పోరాడినారు తిలక్, గాంధీ ప్రభృతులు కర్మ యజ్ఞమును జ్ఞాన యజ్ఞమును ఆధునికముగా ప్రబోధించినారు. వారి ప్రభావము జాతీయోద్యమ కాలములో మిక్కుటముగా కవులపై బడినది. దయానందుని ప్రభావముతో సోమనాథరావుగారు "వర మృతౌషధీ సుగంధ వస్తు సమితిచే నిరత మగ్నిహోత్ర విధిని నెరపుచుండుడు."[3] అని సాత్త్విక యజ్ఞమే వేద విహితమని నిర్ణయింపగా

---

1. దాసు వామనరావు సంఘ సంస్కరణ సభలో చదివిన పద్యములు 15-6-1904 క్రి. ప.
2, 3. ఆర్య జీవితాదర్శము. గీతము. ఆర్యసమాజమనగా నేమి? అను గ్రంథమున కనుబంధము ఆదిపూడి సోమనాథరావు.

దీపాల పిచ్చయ్య శాస్త్రిగారు "పశు హింసాపరులైన మూఢ జనులున్ భాష్యార్థ ముల్ చెప్పుచున్ యశ మార్జించుచు నుండి"[1] రని హింసాత్మక యజ్ఞము శాస్త్ర సమ్మతమేనను వారిని తమ ఖండ కావ్యమున నిందించినారు. భూతములు, రాక్ష సులు వేఱుగా లేరు, మానవులలోని దుష్టులే రాక్షసులని[2] సంఘ వ్యతిరేక శక్తు లను, మౌఢ్యమును నాటినుండి నేటివరకును కవులీ తీరున తీవ్రముగా విమ ర్శించుచునే యున్నారు!! ఇంకను బుద్ధుడు, గాంధీ వెల్గించిన దీపము కాలములో ఇంత దూరము పయనించుచునే యున్నది.

1. 'కాలము'. దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు (1920) 18వ పుట.
2. 'చేతనావర్తం'లో పేర్వార జగన్నాథం ఖండిక,

# అష్టమాధ్యాయము

# మతోద్యమములు

## హిందూ మతోద్యమము

మహాత్ముని స్వాతంత్ర్యోద్యమము దేహళీ దీప న్యాయములో ఆంగ్లేయులను పారద్రోలి దేశీయులకు ముక్తిని ప్రసాదించుటతో బాటు వైదిక మహర్షులు ప్రవచించిన హిందూ ధర్మములోని సత్య స్వరూపము నావిష్కరించి మతోద్ధరణమునకును తోడ్పడినది. తిలక్ నుండి మాలవీయా నుండి గాంధీజీకి సంక్రమించిన పైతృకమైన ఆస్తి యది! మతమే జీవన సర్వస్వము-మతము కొఱకే మనుగడయను దృక్పథమును జాతిలో జాగరణము చేయుటకు ప్రయత్నించిన మహోద్యమ మది!! దీనిని గూర్చి వివరించుటకు ముందుగా హిందూ మత స్వరూపమును సంగ్రహముగా ప్రదర్శించెదను.

**మూల సూత్రములు:** సామాన్యార్థముకో హిందూ మతమని ప్రయోగించినను వివిధ మతముల సంపుటీకరణ మనదగిన హిందూత్వమును మతమనుటకు వీలులేదు హిందూ ధర్మమొక జీవన విధానమునకు సంబంధించినది. రాజ్యాంగమును పాలకులును వైద్యులును ఎంతో కృషితో రక్షించుటకు తమ సర్వశక్తులను ధారవోసెడి ప్రాణమన నేమో నిర్వచింపలేనట్లు విగళిత వేద్యాంతరము బ్రహ్మానంద సబ్రహ్మచారి అయిన రసానంద మిట్టి దట్టిదని నిర్వచింపలేనట్లే హిందూ ధర్మ జీవనము కూడ అనుభవైక వేద్యమే కాని అనిర్వచనీయమైన అనుభూతి యన నొప్పును. నాస్తికుడును ఆస్తికుడును హిందువు కావచ్చును విగ్రహారాధనము, అవతార తత్వములను నమ్మినవాడు, నమ్మనివాడును హిందువులే. ఆత్మవాది అనాత్మవాది కూడ హిందువులే. అట్టిచో హిందూత్వమనెడి వృత్తమునకు కేంద్ర బిందువును నిర్వచించుట సామాన్యము కాదు కావుననే హిందూత్వములో ఇన్ని అవాంతర శాఖలు దర్శనములు ఏర్పడినవి హిందూత్వమునకు తిలక్ చెప్పిన భాష్యమునకు దయానందుని భాష్యమునకు గాంధీజీ

నిర్వచనమునకు, డాక్టర్ హెడ్గేవార్ ప్రవచనమునకు ఎంతో భేదమున్నది. అట్లని అందరును అంగీకరించిన మూల సూత్రములు కొన్ని లేకపోలేదు.

**రాష్ట్ర శక్తి:** దేశములో సంప్రదాయములలో, ఆచార వ్యవహారములలో వేష భాషలలో వైవిధ్యము, వైరుధ్యము ఎంతో కన్పడుచున్నది. కాని హిందువు లందరిలోను భావనము (Sentiment) సంస్కృతి ఏకరసమై ప్రవచించుచున్నది. ఈ సమైక్యతకు మాతృ దేశభక్తి మూలతంతువు. యుగ యుగములనుండియును ఈ రాష్ట్ర శక్తి సూత్రముతోనే ప్రాచీనులు జాతిని సుసంఘటితము చేసిరి. 'గంగేచయమునే చైవగోదావరి సరస్వతీ నర్మదా సింధు కావేరీ జలేస్మిన్ సన్నిధిం కురు' అని సర్వ నదీ సంస్మరణముతో దేశములోని జల ఫల వనగిరులన్నింటిలోను తాను తాదాత్మ్యమును చెందుటకై హిందువు ప్రయత్నించినాడు. 'ఆసేతు సీత పర్యంతం ఏకరాట్' అను మహర్షి మంత్రములో మాతృదేశ స్వరూపము నిర్వచింపబడినది. ఈ దేశీయమైన సిద్ధాంతములకు జీవన విధానమునకు తాను వారసుడనని భావించుకొనుట ప్రతి హిందువులోను ఉండవలసిన ప్రాథమిక సంస్కారము.

**షోడశ సంస్కారములు:** ప్రపంచములో మరెచ్చటను కన్పడని విధాన మిది. జీవుడు మాతృ గర్భములో ప్రవేశించుటకు ముందుగానే అతనికి సంస్కారములు ప్రారంభమై, సీమంత, జన్మ, నామకరణ, ఉపనయన, వివాహాది కర్మలన్నియు నియమబద్ధముగా జరిగి చివరకు ప్రేత వాటికకు చేరునప్పుడు కూడ శుభంకరమైన చివరి సంస్కారముతో అతని జీవన యాత్ర ముగియును. దహన ఖననాది అవాంతర భేదములున్నను సంస్కార రచనలో హిందువులలో ఏక సూత్రత గోచరించును.

**వర్ణ వ్యవస్థ:** చాతుర్వర్ణ్య విధానము, కులముల ప్రాతిపదికపై శ్రమను వింగడించుట హిందువుల బుద్ధి కుశలతకు నిదర్శనము. పాశ్చాత్య దేశములోని కులములన్నియును అర్థము నాశ్రయించినవి[1] (Lords, Labou-

1. "లోకములో దాదాపుగా ప్రతి దేశమునందును కుల విభాగములుండుట నేను చూచినాను. కాని ఇంకెచ్చటను వాని గమ్యార్థము ఇందున్నంత మహనీయముగా లేదు ... డబ్బువల నేర్పడిన విభేదముకంటె పవిత్రత సభ్యత త్యాగము మున్నగు వానిపై నాధారపడిన విభాగమునే నభిమానింతును" వివేకానందుని కుంభకోణము ప్రసంగము. సంపూర్ణ గ్రంథావళి ౬ సం. 186 పుట సంపాదకులు: ఆచార్య జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి.

rers etc.) కాని భారతీయుల కులములు గుణము ననుసరించినవి. కుల వ్యవస్థను నిర్మూలింపదలచిన హిందువులు కూడ గుణాశ్రితములైన వర్ణముల యెడ ద్వేషమును చూపలేదు.

**స్ఫూర్తి కేంద్రములు :** తల్లి, తండ్రి, గురువు స్త్రీ గోవు మొదలైన జాతీయమాన బిందువులు హిందువులందఱికిని పూజ్యములే. ఆమోదయోగ్యములే. బ్రహ్మజ్ఞులు, మహర్షులు, సన్యాసులు సర్వులకును ఆరాధ్యులే !!

**పురుషార్థములు :** ధర్మార్థ కామమోక్ష చతుర్విధ పురుషార్థ ప్రాతిపదిపై జీవన సౌధమును నిర్మించుకొనుట ప్రతి హిందువులోను సామాన్యమైన ధర్మము. బ్రతుకొక వెన్నెల మంటలోని నవ్వుల పంట అను అనుభవముతో హిందువు జీవింపలేదు. జీవిత మొక నిర్మాణాత్మకమైన, అనుశాసన బద్ధమైన ఉద్యమము ఈశ్వర సాక్షాత్కారము దానికి ఫలసిద్ధి. ఇంద్రియములతో అతీంద్రియ దర్శనమునకై చేయు నిరంతర సాధనము జీవితము. అందుకు చతుర్విధ పురుషార్థ రచన సహాయభూతము.

**వేద విశ్వాసము :** హిందువు లందరికిని వేదము ప్రమాణ గ్రంథము. అట్లని అవైదిక మతానుయాయులైన హిందువులు కూడ లేకపోలేదు కాని అట్టి వారికీ దేశములో శాశ్వతత్వము సిద్ధింపకుండుటొక చారిత్రక సత్యము. వివిధ మతకర్తలైన హిందూ ప్రవక్తలు తమ తమ సిద్ధాంతముల కనుగుణముగా వేదములకే భాష్యము చెప్పుకొన ప్రయత్నించిరి.

అట్లే కర్మ సిద్ధాంతము, పునర్జన్మపై విశ్వాసము. ఆత్మ నిత్యమను నమ్మకము-ఈశ్వరుడవతారము లెత్తుననుభావనలు కూడ హిందువులలో కలవు కాని వానిని ఖండించిన ప్రముఖ ప్రవక్తలు కూడ హిందువుల కారాధ్యులుగానే నిలుచుట వలన వానిని సార్వజనీనమైన సిద్ధాంతములుగా స్వీకరింపలేము. మొత్తము మీద హైందవ జీవనమును పునరుద్ధరించుటకు సాగిన కృషి మాత్రము ప్రవక్తలందరికిని ఆమోదయోగ్యమే అయినది. హిందూ ధర్మ పునరుద్ధరణము నకై సాగిన మహోద్యమము మూడు పాయలై ప్రవహించినది.

1) గాంధేయమైన జాతీయోద్యమము.

2) సంస్కరణాత్మకములైన ఆర్య సమాజ, బ్రహ్మ సమాజాదులు.
3) రాష్ట్రీయ స్వయంసేవక సంఘోద్యమము.

మౌలికముగా 'హిందూత్వ'మే మూడు సిద్ధాంతములకును ఆధారతత్వమైనను, దానిని నిర్వచించుటలో మూడు మార్గముల నడుమ సముద్రమంత వ్యత్యాసము కలదు. గాంధీ నిర్వచించిన హిందూత్వము సత్యాహింసలకు పర్యాయ పదము. దానికి దేశ మత కాలావధులు లేవు. క్రైస్తవులు, మహమ్మదీయులు, పార్సీలు అందరును సత్యాన్వేషులైనచో హిందువులుగనే పరిగణింపబడుదురు. భారతదేశములో నివసించెడి వారందరును భారతీయులే. కావుననే గాంధీజీ పరమేశ్వరుని 'ఈశ్వర-అల్లా తేరే నామ్' అని కొనియాడినాడు! సర్వమత సమైక్యమే గాంధీజీ హిందూ దర్శనము.

కాని ఆర్య సమాజ మిందుల కంగీకరింపలేదు ద్విముఖమైన కత్తి యంచులతో ఒకవైపు వైదేశికములైన క్రైస్తవ మహమ్మదీయ మతములను చీల్చి చెండాడి రెండవవైపు దేశీయములైన ద్వైతాద్వైత విశిష్టాద్వైతములను విగ్రహారాధనా తత్పరములైన మతములను ప్రతిఘటించినది. ఆర్య సమాజము చివరకు 'హిందూ' శబ్దమునే అంగీకరింపలేదు. తన వేద మతమునను సరించెడి భారతీయులు 'ఆర్యు'లనియును, 'హిందూ' శబ్దము సింధార్థములో విదేశీయులచే నొసంగబడినదనియును భావించినది. అట్లే బ్రహ్మ సమాజము కూడ ఏకేశ్వరోపాసన, ఆ సామూహిక ప్రార్థనలను పాటించి క్రైస్తవ మతము పద్ధతిలో కార్యక్రమములను నడిపి వర్ణ వ్యవస్థను ప్రతిఘటించినది. ముఖ్యముగా ఆర్య సమాజము దేశీయులు మహమ్మదీయులు కాకుండ కాపాడినచో బ్రహ్మ సమాజము క్రైస్తవము నెదిర్చి నిలిచినది. దివ్య జ్ఞాన సమాజము కూడ తెలుగునాట మహోద్యమమునే నడిపి సంఘ సంస్కరణమునకు తోడ్పడినది. కాని రాష్ట్రీయ స్వయం సేవక సంఘమట్టిది కాదు. అరబ్బులు, మొగలులు, బ్రిటీషువారు ఈ దేశము నాక్రమించుకొనుటకు వచ్చిన దురాక్రమణపరులు. ఆర్థికముగా రాజకీయముగా వారీ ప్రజల నెట్లు పాలించినారో మత విషయికముగా కూడ అట్లు దురాక్రమణ జరుపుటకే మహమ్మదీయ క్రైస్తవములు ప్రవేశపెట్టబడినవి. ముస్లిము విశ్వాసము మక్కాకే పరిమితము కాని భారత భూమి యెడల సంశయాస్పదము, అతడీ భూమిని సమయము వచ్చినప్పుడు విభజించుటకే ప్రయత్నించును కాని అఖండతకు తోడ్పడడని చాటి చెప్పినది. 'హిందూ స్థానము

హిందువుల భూమియే'[1]నని వక్కాణించినది. హిందూత్వమునకు గాంధీజీ చెప్పిన వ్యాఖ్యానము కన్న నిది భిన్నము. అట్లే గాంధేయ మతములో తీవ్రవాదులు, హింసావాదులు నయిన భగత్‌సింగ్ ప్రభృతులకు స్థానము లేదు కాని రాష్ట్రీయ స్వయం సేవక సంఘము మితవాద, అతివాద, ఉగ్రవాద, సనాతన, ఆర్య సమాజ పక్షములన్నిటికి చెందిన హిందువులను తనలో లీనము చేసికొనుటకు సంసిద్ధతను వ్యక్తపరచినది.

## ఉద్యమ క్రమము :

1) **గాంధీ మార్గము :** ఆంధ్ర దేశములోని హైందవము గాంధీ మార్గము ననుసరించి సంస్కారణాత్మక కార్యక్రమలకు సిద్ధపడినది హరిజనోద్యమాదులన్నియును మతపరముగా గాంధేయ దర్శనము ఇచ్చిన స్ఫూర్తితో సాగినవేనని ముందే మనవి చేసితిని. కొండా వెంకటప్పయ్య పంతులు దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు మొదలైన జాతీయ వీరులు ముందు భక్తులై తరువాత రాజకీయ నాయకులైరి గో హత్యా నిరోధము, వేద ప్రచారము, 'రామదండు' నిర్మాణము, మతపరముగా ఆంధ్ర నాయకులు సాగించిన కార్యక్రమములే. 'ఆంధ్రరత్న' న్యాయ స్థానములో నాడొసంగిన ఒక వాఙ్మూలములో ఇట్లున్నది. "ఈ మహాయోగ సాధనలోన సహాయోద్యమము కేవలము ప్రథమావస్థయే. అహింస, అస్తేయ, బ్రహ్మచర్య అపరిగ్రహాది సుగుణ భూయిష్ఠమైన 'యమ'దశమా చిత్తవృత్తినంతయు పాశ్చాత్య నాగరికతచే జారగొనబడినది."[2] మతము-రాజకీయములు అభిన్నములని న్యాయాలయములో చాటినాడు ఆంధ్రరత్న. తిలక్ గణేశోత్సవములు నిర్వహించినట్లే వీరు గోపాష్టమిని జరిపి గోపూజతో మత సంబంధమైన భావనలను జాగృతము చేసినారు. 'స్వాతంత్ర్య సమరాన్ని నా విధిగా నేను గుర్తించాను. ఎందుచేతననగా స్వాతంత్ర్యము

1. "....The deep rooted conviction which would spontaneously evoke a ready answer 'Yes this Hindu nation' under all conditions even in dreams...." Bunch of thoughts P. 53. M.S. Golwalkar.

2. 19 నవంబరు 1921 కోర్టు వాఙ్మూలము - పత్రికా ప్రకటన.

ద్వారానే గోవుకి సంపూర్ణమైన రక్షణ కల్గుతుంది'[1] అను మహాత్ముని వాక్యము వీరికి శిరోధార్యమైనది. మిగిలిన జాతీయోద్యమ చరిత్రను ముందే మనవి చేసినాను

**2) ఆర్య సమాజోద్యమము :** దయానందుని మతము ముఖ్యముగా తెలంగాణములో మహత్తరమైన పోరాటమును నిర్వహించినది. నిజాము పాలన లోని హిందువుల నిది వెన్నుతట్టి నిలిచినది. ధైర్యమును సాహసమును మత ముతో కలిపి రంగరించి పోసినది 'ఇన్ద్రం వర్ధన్తోఽప్తురః కృణ్వన్తో విశ్వమార్యమ్ అపఘ్నన్తోఽరావ్ణః'[2] అననది వీరి ఆశయము. 1910 నుండి 47 వఱకు హైదరాబాదు రాష్ట్రములో కలిగిన చైతన్యమునకు విద్యుత్కేంద్రముగా 'సత్యార్థ ప్రకాశిక' పని చేసినది. బొలారము, సుల్తానబజారు, కిషనుగంజి, లాల్‌దర్వాజా మొదలగు ప్రాంతములలోని వీరి కార్యాలయములు ఆందోళనలు నిర్వహించి ప్రచార సాహిత్యమును వెలువరించినవి తెలుగుతల్లి మొదలైన పత్రికలు. ఆజా గ్రంథమాల మొదలైన ప్రచురణలు, వివిధ కన్యాశాలలు, విద్యా కేంద్రములు ఆర్య సమాజ సంస్కారములను వెదజల్లినవి. ఆర్య సమాజ నాయకులైన శ్రద్ధానందులు ముస్లిముచే హత్య చేయబడినప్పుడేమి, ప్రతి విజయ దశమికి సాగించెడి శోభాయాత్రల వలననేమి, గోహత్య నిరోధోద్యమము వలన నేమి హైదరాబాదు సంస్థానములో హిందువుల చరిత్రమనినచో ఆర్య సమాజ చరిత్రమే ననిపించునట్లు గణనీయమైన కార్యక్రమమును నిర్వహించినది.

**3) బ్రహ్మ సమాజము :** ఆర్య సమాజమునకు తెలంగాణము నిలయ మైనట్లు బ్రహ్మ సమాజ సంస్కారములకు ఉత్తరాంధ్రము ముందుగా కేంద్ర స్థానమైనది. కేశవ చంద్రసేనుడు 1864లో మద్రాసులో ప్రసంగములు చేసిన నాటి నుండి ఈ చైతన్యము ప్రారంభమైనవి. 1878లో బుచ్చయ్య పంతులు గారు బ్రహ్మ సమాజ కార్యక్రమ భారమును చేపట్టి విజయవంతముగా నిర్వహించి తన వారసత్వమును రఘుపతి వేంకటరత్నము నాయుడు గారి కిచ్చి వెళ్లిరి. వారి వైయక్తిక జీవనము, గంభీర కంఠస్వరము ఉపాధ్యాయ వృత్తి

1. నవజీవన్. గాంధీజీ 1-10-1921
2. ఋ. వే. ౯-౬౩. ౫ ౧.

మతవ్యాప్తికి దోహదము చేసినవి. దుగ్గిరాల సూర్యప్రకాశరావు, తాయి సూర్యనారాయణరావు మొదలైన వారి కృషి కందుకూరి వంటి కవి పండితులకు స్ఫూర్తి నిచ్చినది. వారి నిర్విరామకృషి ఫలితముగా పిఠాపురం రాజాగారు, దివాన్ కోకా వెంకటసుబ్బారావు, డాక్టర్ వేమూరి రామకృష్ణారావు గార్లు కార్యరంగములోనికి దిగి ఆర్థికముగా, హార్దికముగా ఎనలేని సేవను చేసిరి. కాకినాడ, పిఠాపురము ఈ యుద్యమమునకు కేంద్రాలయములైనవి. ఆకులో ఆకుగా అణిగి మణిగి కూసిన దేవులపల్లి వారి విపంచికి సిద్ధాంతములే స్వరతంత్రులై నిలిచి మూర్ఛనలు పోయినవి.

**4) దివ్యజ్ఞాన సమాజము :** అనిబిసెంటు ఆంధ్రదేశములో లెడ్బీటరుతో కలిసి ప్రచారము చేసిన మత మిది. దీనికి అంతర్జాతీయ ప్రతిపత్తి కలదు. ఈశ్వరావతారమని అపరబుద్ధునిగా, జీససుగా జిడ్డు కృష్ణమూర్తి గారిని అనిబిసెంటు భావించి మతాధిపత్యము వారికి ప్రసాదించుటతో తెలుగు సీమలో సరికొత్త చైతన్యము ప్రారంభమైనది. హిందూమతము నీ సమాజము ఖండించుటో సంస్కరించుటో చేయక తన దర్శనమును తాను ప్రవచించుటతోను, గాంధీ గారితో బాటు స్వాతంత్ర్య సమరములో పాల్గొనుటతోను ఆంధ్రదేశములోని సముద్ర తీరస్థ ప్రాంతము లన్నింటను ఇది మిక్కిలి అభిమానమును చూరగొనెను. హరనాథబాబా, రాధాస్వామి, సాయిబాబాల వంటి వారి మతములును తెలుగుదేశములో వ్యాప్తి నందినవి కాని కవిత్వముపై తమ ప్రభావమును వైలక్షణ్యముతో ముద్రించకపోవుటచే వాని నిందు వివరించలేదు.

**5) రాష్ట్రీయ స్వయం సేవక సంఘోద్యమము :** అభ్యుదయ రచయితల సంఘము కన్న తీవ్రముగా తెలంగాణా రచయితల సంఘము కన్న దీర్ఘముగా మహోద్యమమును నడిపిన భారతీయ రచయితల సమితికి సిద్ధాంత శక్తి నందించిన సంస్థ రాష్ట్రీయయ స్వయం సేవక సంఘము. దీని నొక విధముగా కమ్యూనిష్టు పార్టీతో పోల్చవచ్చును. సైద్ధాంతికముగా పరస్పరము సరళరేఖల వలె పయనించును. సామ్యవాద ముత్తరధ్రువమైనచో ఆర్. ఎస్. ఎస్. దక్షిణ ధ్రువమని చెప్పవచ్చును. సామ్యవాదమునకు వర్గ కలహము, కార్మిక సంఘటనము ఊపిరితిత్తుల వంటి ఇంట సిద్ధాంతములైనచో ఆర్. ఎస్. ఎస్. వైదేశిక దురాక్రమణల నెదుర్కొనుట-హిందూ సంఘటనను సిద్ధాంతములను

కనుగవతో తన దర్శనము సాగించినది. త్రిగుణాత్మక భేదము మాటకేమి గాని, 'శక్తి' ఇర్వురికిని ఉపాస్య దైవమే! ఇట్లే 1940లో ఆర్.ఎస్.ఎస్. 43లో అభ్యుదయ రచయితల సంఘము, తమ ప్రభావములను ప్రసరించెడి రెండు సమానాంతర కాంతిరేఖలుగా ఆంధ్రలో వెంట వెంట పురోగమించినవో, అది కాకతాళీయమో లేక చరిత్రలో అజ్ఞాతమైన ఏ అనివార్య శక్తుల ప్రోద్బలమో చెప్పలేము.

1925 విజయదశమినాడు నాగపూర్‌లో డాక్టర్ కేశవరావు బలీరామ్ హెడ్గెవార్ అను వారు-సంఘమును స్థాపించిరి. వీరు మహారాష్ట్రమునకు కొన్ని తరముల క్రితము వలసపోయిన తెలుగు కుటుంబములో జన్మించిన నాయకులు. కావున అఖండ భారత దృష్టి కల సంఘీయులు పేర్కొనకున్నను తెలుగునకు సంబంధించి పరిశీలనము జరిపెడి మన మది పేర్కొనుట అనౌచిత్యము కాజాలదు. 'రాష్ట్రీయ' శబ్దము జాతీయ శబ్దమునకు పర్యాయ వాచకము హిందువులే రాష్ట్రీయులని డాక్టర్‌జీ నిర్వచనము[1] హిందూ జాతి వైభవమే సంఘాదర్శము[2] హిందూ వైభవమనగా విశ్వ వైభవమేనని శ్రీగోల్వాల్కర్ వ్యాఖ్యానించినారు "The mission of reorganising the Hindus on the lines of their unique national genious which the Sangh was taken up is not only a great process of true national regeneration of Bharat but also the inevitable pre-condition to realise the dream of word unity and human welfate ....... This knowledge is in the safe custody of Hindus alone."[3] స్వయం సేవకులకి వాక్యములు వేదమంత్రములు !!

---

1. "Doctorij used to say that in our land word Rashtriya naturally means Hindu and therefore the word Hindu need not be used" Bunch throughts. 137 P. Sri M. S. Golwalker.
2 హిందూజాతి కా అంతిమ కల్యాణ్ ఇస్ సంఘటన్ హీ ద్వారా హోసక్‌తా హై దూసరా కోయీ భీ కామ్ కరనా రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్ నహీ చాహతా. జూన్ 9-1940 నాగపూర్ ప్రసంగం. యుగధర్మ స్మృతి విశేషాంక సంచిక 4వ పుట (1962)
3. Bunch of thoughts. (Our world mission. 7 P.)

1937లో ఆంధ్రలో సంఘ శాఖను ప్రారంభించుటకు జరిగిన తొలి ప్రయత్నములు ఫలించలేదు విశాఖపట్టణములో ఒక శాఖ స్థాపించినారు కాని త్వరలోనే అది ఆగిపోయినది. 1940లో నాగపూరునుండి యాదవల్కార్, వినాయక లక్ష్మణ దేశముఖ్, గోపాలరావ్ మోరోతీరావ్ ఠాకూర్, శ్రీ దత్తాత్రేయ దండోపంత్, బంధీష్టే గారలు సంఘ విస్తరణార్థము కార్యకర్తలుగా వచ్చినారు. బంధిష్టే విజయవాడ కళాశాలలో విద్యార్థిగా చేరి తద్వారా సంఘ కార్యమునకు పునాదులు వేసినారు. మిగిలినవారు విజయవాడ, రాజమండ్రి, గుంటూరు మొదలైన ప్రాంతముల కేగినారు. 1940 ఆగస్టులో విజయవాడలో తొలి శాఖ స్థాపించబడినది. రెండవది రాజమండ్రిలో, అప్పటికే పూనాకు చెందిన స్వయం సేవకు లక్కాడ పేపరు మిల్లులో పని చేయుటకు వచ్చియున్నారు. అచ్చట వారి ఆహ్వానముపై రెండవ శాఖ ప్రారంభింపబడినది. మూడవది గుంటూరులో. ఇట్లు విస్తరించి 1941 కార్యకర్తల శిక్షణ శిబిరము (O.T C.) కి నాగపూరుకు అంధ్ర నుండి పది మంది స్వయం సేవకులు వెళ్లినారు. తొలి దినములలో ఎస్. బి. పార్కే, తరువాత బాబూరావ్ మోఘే, అపై సోంపల్లి సోమయ్య గారి ఆధ్వర్యమున (ప్రాంతీయ ప్రచారకత్వము) సంఘ సిద్ధాంతము ఆంధ్ర ప్రాంతములో వేరూని నిల్చినది. ఆంధ్రదేశములో అత్యధిక కాలము పని చేసిన ఇతర ప్రాంతీయులైన సంఘ ప్రచారకులలో శ్రీ నీలకంఠ్ మోరేశ్వర్ దేశ్‌పాండే ఒకరు!

**రచయితల సమితి స్థాపన:** కమ్యూనిష్టు పార్టీకి అభ్యుదయ రచయితల సంఘము నిర్వహించినది. విశుద్ధ జాతీయ దృక్పథమే ప్రాతిపదికగా కల తెలుగు కవులను సమీకరించుటకై రచయితల సమితి గుంటూరులో స్థాపింపబడినది. గుంటూరు, విజయవాడ, హైదరాబాదు, సిద్ధిపేట, జనగామ మొదలగు పలు ప్రాంతములలో రచయితల సమితి శాఖలు విస్తరించినవి. సాహిత్య మొక ఉద్యమాత్మకముగా పురోగమించినది సామ్యవాదోద్యమములో 'అభ్యుదయ' నిర్వహించిన పాత్రను సంఘోద్యమములో 'జాగృతి' 'సాధన'లు నిర్వహించినవి. రాజశేఖర శతావధాని, గడియారము శేషశాస్త్రి, విశ్వనాథ సత్యనారాయణ గార్లు తొలి దినములలోను, జమదగ్ని శర్మ, మన్నవ గిరిధరరావు, ముదిగొండ వీరభద్రమూర్తి, వీరభద్రయ్య, బండారు సదశివరావు, ఘనశ్యామల, ఉత్తమ్, సంపత్కుమారాచార్యులు, నరసింహారెడ్డి ప్రభృతులు మలితరములోను సంఘ

సిద్ధాంతములచే ప్రత్యక్షముగానో పరోక్షముగానో ప్రభావితులైనవారే! శివాజీ, రాణాప్రతాప్, లచిత్‌బర్ ఫకన్ వంటి జాతీయ వీరులు సంఘమునకు ఉపాస్య దైవము లనదగిన వీరులు. వీరి కథలు తెలుగులో కావ్యము లగుటకు "ఆ కాలానికి రాష్ట్రీయ స్వయం సేవక సంఘము ప్రేళ్ల పాతుకు .... నలుముఖాలా"[1] పోవుటయే కారణము. "ఆర్. ఎస్. ఎస్. మొదలైన.... ఇవాలన్నీ సాహిత్య దర్పణంలో ఈ కాలానికి ప్రతిబింబించినట్లు"[2] రాణాప్రతాప చరిత్ర, శివ భారతము మొదలైన వివిధ కావ్యములు అనేక ఖండికలును సాక్ష్యమిచ్చుచున్నవి.

## మానిఫెస్టో

**ప్రశాంత విప్లవము:** కాని గాంధేయమైన జాతీయోద్యమమునకు 'సంఘో'ద్యమమునకు సిద్ధాంతములోనే కాక కార్యక్రమములో కూడ ప్రధానమైన భేదము కలదు గాంధీజీ సాగించినది ప్రత్యక్షమైన రాజకీయ సంగ్రామము. అట్లే దయానందుడు, రామమోహన, కేశవ చంద్రసేనులు మతపరముగ, సంఘ సంస్కరణాత్మకముగా ప్రత్యక్ష ప్రచారమును నిర్వహించినారు. కాని 'సంఘము' జాతిలో నేమి సాహిత్యములో నేమి ప్రవేశపెట్టిన సంస్కారములు అజ్ఞాత విప్లవమునకు దారి తీసినవి ప్రచారములో కాక వ్యక్తుల నిర్మాణము లోనే విశ్వాసముకల సంఘము ప్రశాంత పరిణామమును సాధింప నెంచినది. కావుననే తెలుగునాట జరిగిన మిగిలిన ఉద్యమముల కిది సిద్ధాంతములో కాని కార్యాచరణములో కాని దేనికిని తీసిపోకున్నను ప్రత్యక్షముగా పెక్కురికిది గోచరము కాలేదు. ఉద్యమముల చరిత్రలోనే ఇదొక విశిష్టాంశము!!

## కవిత్వముపై ప్రభావము

**రామాయణ కల్పవృక్షము:** హిందూ ధర్మ పునరుద్ధరణమే పరమావధిగా కల కవులు హిందూ జాతికి మూలకందములైన గ్రంథములు అవెంత ప్రాచీనములైనను[3] ప్రాగ్విపశ్చిన్మతంబున రసము వేయి రెట్లు నవకథాదృతిని మించి గొప్పది కావున రసోచితముగ సనాతన సాహిత్యములోనే నవకథాదృతి

1, 2. నవ్యాంధ్ర సాహిత్య వీధులు. చతుర్థ సంపుట. 647, 802 పుటలు.

3. శ్రీమద్రామాయణ కల్పవృక్షము, బాలకాండము.

చెన్ను మీరు నట్లు రచింతురు.[1] అట్టి వస్త్వాశ్రయమైన కృతులలో శిఖరాయమానమైనది విశ్వనాథ సత్యనారాయణ గారి శ్రీమద్రామాయణ కల్పవృక్షము. ఇందలి హిందూ ధర్మోద్ధరణ తత్పరతను వివరింతును.

౧. **జీవుని వేదన :** వ్రాసినచో శ్రీమద్రామాయణమే వ్రాయవలయునని కవికి తండ్రి యాజ్ఞ, ఆత డెట్టివాడు? మనుధర్మ స్మృతికి సాకార స్వరూపము-జంగమ భాష్యమును!! కావుననే 'కట్టుకథ లైహికమా పరమా'యని విమర్శించినాడు. తండ్రి యాజ్ఞయును జీవుని వేదన రెండు నేకమైనవి. కవి రామాయణ రచన కుపక్రమించినారు.

> 'కలిలో దైవము లేఁడు భూసురులనంగా ద్వేషమైపోయె నీ
> తెలుఁగున్ నాట మఱి విచిత్రమయి పొందెన్ ఖాని ముక్త్యాల తే
> డులు బద్ధాదరులైరి నాఁడు మఱి నేఁడున్ సంప్రదాయంపుఁబో,
> కలకున్ వారికి విన్చి రామకథ యీ కాలుష్యముం ద్రోఁచెదన్'.[2]

దైవ బ్రాహ్మణుల ధర్మమును పోషించుటకు తా నీ కృతి వ్రాసినట్లు కవి చెప్పినారు. ఇది హిందూత్వ స్ఫూర్తికి చిహ్నము ఆ రాజులొక్కొక్కరు.... వీరకళాకేళి ధర్మ వితరణ పటువుల్'[3] అని వర్ణించుట కాళిదాసు రఘువంశ కథనమునకు ముందుగా ఇక్ష్వాకు వంశస్థుల ధర్మ గుణములను వర్ణించినట్లున్నది!! అట్టి వంశ చరిత్ర కావుననే ఇట్టి కవి వ్రాయుటకు ఉంకించుట!!

౨. **రామరాజ్య కల్పన :** స్వాతంత్ర్యోద్యమములో గాంధీజీ తన అంతిమ లక్ష్యము రామరాజ్యమని చాటినారు. హిందువుల పరమాదర్శము రామరాజ్యము. దానిని విశ్వనాథవారు బాలకాండములో నగర వర్ణన సందర్భములో పూనికతో పేర్కొనినారు. నాటికి రాము డింకను జన్మింపక పోవచ్చును కాని ఇక్ష్వాకు వంశస్థుల ఆదర్శ కల్పన మిది.

---

1. వీరి 'పురాణవైర గ్రంథమాల' ఈ ఉద్దేశముతోనే ఉద్యమాత్మకముగా సాగిన ప్రచురణము కాని అది వచన పరిధిలో నున్నందున ఇందు పేర్కొనలేదు.
2. బాలకాండము అవతారిక. ౪౦ వ పుట.
3. ఇష్టి ౩.

'మఱి యరదంబు బ్రాహ్మణుల మాడువులుండి నరథ్య బోవనం
దఱు నటు బ్రసగ్వులున్ మకుటధారులు కుండలులున్ ముదాననుల్
పెఱతలపేరి కర్మకృతి బేర్చెడువారలు వేద పాఠకుల్
గుఱి చెడకుండ నేత్రములకున్ నడుమన్ దిలకించు వారలున్'.[1]

నన్నయ్యగారు దుష్యంతుని కణ్వాశ్రమయాన సందర్భములో 'ఏచితనర్చి' 'చనిచని ముందట' వర్ణించినట్టి దృష్టి విశ్వనాథ వారి పైవర్ణనములో గోచరించు చున్నది. తాను రామాయణ రచనమునకు పూనుకొని నన్నయ గారిని 'ఋషి వంటి నన్నయ్య రెండవ వాల్మీకి'[2]యని పేర్కొనుటలోని కవితా రహస్యమిదే!!

దశరథుని మంత్రి భేరీ వేయించినాడు. 'ఎవడు నృశంసుడో యెవడ విద్వాంసుడో యెవడు నాస్తికుఁడో హ్రీహీనుఁ డెవఁడో, యెవ్వఁడు లోభియో యెవ్వడు క్షుద్రుఁడో, సంకరు డెవడో తస్కరు డెవడో' చెప్పుడని, కాని 'వీఁడు దురాచారుఁడని రాజభటు లొక్కని బ్రత్యక్ష పఱుపర'ట. దీని యర్థమేమి? ఆ ధర్మ రాజ్యములో 'తమ కులాచార రీతుల తప్పినట్టివార లెవ్వరును' లేరని కవి చాటినారు. చాతుర్వర్ణ్య వ్యవస్థయు, ధర్మమును, నాలుగు పాదములతో సాగుచున్న కాల మిది. ఇరువదవ శతాబ్దములో దీని నింత అభినివేశముతో వర్ణించుట కేవలము హిందూ మతోద్ధరణమే దృష్టిగా గల చర్య.

**౩. యజ్ఞముల వర్ణన:** వేద వ్యవస్థకు అధ్వరమే ఆననము. కావు ననే దయానందు డింటింట యజ్ఞము యథావిధిగా సాగించుట ఆర్య సమాజ కర్తవ్యములలో ప్రముఖమైనదిగా స్వీకరించి ఆచరింపజేసినారు. విశ్వనాథవారు, భావ కవులు ప్రకృతిని ప్రణయ స్వరూపిణిగా భావించి పులకరించినట్లుగా, విశ్వ నాథవారు హిందూ ధర్మాభిరతులై సృష్టి మొత్తమును లక్షణార్థములో కాక సామాన్యార్థములో కూడ యజ్ఞమయమైనట్లే వర్ణించినారు. వసంతములో కోకిల కనపించుట సహజము. కాని కవికి కోకిల యజ్ఞకర్తవలె గోచరించుటలోనే వైశిష్ట్యమున్నది.

---

1. ఇష్టి. 13.
2. అవతారిక 10వ పుట.

"ఎట్టినా నేత్రమ్ము లిష్టివేళానల
ధూమ సంతానమ్ము తూటినట్లు
ఆకులు తినుట దీక్షాకాల భోజన
నియమతీవ్రతచేత నెగడినట్లు
చివురాకు ముక్కున జిమ్ముట జుహూవుచేఁ
బాత్రాదికమ్ములు పట్టినట్లు
పంచమ స్వరము స్తోభలు చక్కఁగా జూఁచి
సామగానమ్ములు సదివినట్లు
రేఁకలీఁకల నలుపు ధరించినట్టి
నియమవస్త్ర మాలిన్యంబు నెఱయునట్లు
సప్త తంతు మహాకార్య సమయమందుఁ
గర్త వోలికఁ గోకిల కానుపించె."[1]

యజ్ఞ తత్పరుడైన దశరథుని కిట్లు కన్పించునట్లు వర్ణించుటకు కావ్యశిల్ప మెట్లు కారణమో కవి ధర్మ ప్రచార తత్పరత, హిందూమతైక జీవన పునరుజ్జీవనమును అంతే కారణము. కావుననే అశ్వమేధమును వివరముగా వర్ణించినారు. విశ్వనాథ వారు పౌరాణిక హైందవము వలన ప్రభావితులైనవారు. కావుననే పురాణ కాలము నాటి వేదమతము ప్రతిష్ఠాపింపవలెనని ఉద్యమించినారు. వీరిపై దయానందుని ప్రభావము లేశమాత్రమును లేదు. ఉన్నచో 'రాష్ట్రం వా అశ్వమేధః' అను వాక్యమునకు 'రాజు న్యాయముగ ధర్మానుకూలముగ ప్రజా పాలనము చేయుటకు విద్యాదు లొసఁగు యజమాను దగ్నియందు నాజ్యాదులను హోమము చేయుటయు నశ్వమేధ మనఁబడు'[3]నని చెప్పిన యర్థమును మాత్రమే గ్రహించినచో 'తక్కిన తురగాంగమ్ములు ముక్క మిగుల కుండ హోమము జేసిరి ఋత్విక్కు'[4]లని కవి వర్ణించియుండడు. కావున నిది పురాణ ధర్మ సంబంధమైన ఉద్యమమున కుదాహరణము.

---

1. ఇష్టి 255. 43వ పుట.
2. శతపథ బ్రాహ్మణము ౧౩.౧ ౬.౩.
3. సత్యార్థ ప్రకాశిక. ఏకాదశ సముల్లాసము ౩౩౯.
4. ఇష్టి ౩౮౬.

**గోవింద రామాయణము :** ఆత్మకూరి గోవిందాచార్యుల వారి కావ్యమిది. వేద చోదితమై శ్రేయస్సాధనమైనది ధర్మము. 'రామో విగ్రహవాన్ ధర్మః' కావుననే ధర్మసంస్థాపనార్థము రామగాథను మహా కావ్యముగా రచించినారు ఇందు రాముడే పరదైవము భక్తియే రసము. ధర్మసంస్థాపనమే కావ్యాదర్శము. 'హరి నామస్తుతి లేని కావ్యము విచిత్రార్థాన్వితంబయ్యు శ్రీకరమై యుండదు'[1] కావున రామచరితమే ఇతివృత్త గౌరవము నందినదని కవి భావించినారు. వీరు గాంధేయ సిద్ధాంతమునకు చెందినవారు, మీదు మిక్కిలి రామానుజ ప్రోక్తమైన వైష్ణవములోని ప్రపత్తి వీరి జీవిత లక్ష్యము. కావుననే ఇహపర సాధకముగా రామాయణమును రచించినారు. 'కలియుగమున సగుణోపాసనము భక్తియోగము తరణమునకు సులభ మార్గములు. వాల్మీకి త్రేతాయుగమున వ్రాసినను కలియుగమునకు ఉపయుక్తమగునట్టి రచన చేశారు. వాల్మీకి రచనను భక్తితత్త్వముతోనే పరిశీలించిన శ్రీమాన్ ఆత్మకూరి గోవిందాచార్యుల వారు తమ కావ్యమును ఆ మార్గముననే నిర్వహించినారు.'[2] అనగా విశ్వనాథ వారి మార్గములోను ఆచార్యులవారి మార్గములోను ప్రముఖ భేద మొక్కటి కన్పట్టును. కలియుగమును త్రేతాయుగముగా మార్చి భూమిని అయోధ్యగా రూపొందింపవలెనని విశ్వనాథ వారు భావించిరి. కాని పరమేశ్వర సాన్నిధ్యము నకై పద్య విద్యాసాధనకై రామాయణమును గోవిందాచార్యుల వారు ఆధారముగా స్వీకరించిరి హైందవములోని రెండు సున్నితమైన మత భేదముల కివి రెండును ఉదాహరణములు కావున ఇంతగా చెప్పవలసి వచ్చినది.

'నీ వాసంగినే విద్యచే నిన్నే మించి
సతము ముక్తికిఁ గన నెంతు జానకీశ'[3] యని కవి శరణాగతిని

పొందినారు. ఈ జాతి రచన లసంఖ్యాకములుగా వచ్చినవి. వీనిలో 'కృష్ణాతి మానుషతత్వము,[4] ఆత్మ భాగతము'[5] వ టివి ప్రత్యేకముగా పేర్కొనదగిన వెన్నో కలవు.

---

1. ప్రథమ స్కంధము 91వ పద్యము.
2. శ్రీమదాచార్య రఘునాథ చక్రవర్తి. పీఠిక 47వ పుట.
3. ఇష్టదేవతా ప్రార్థనము. 20వ పద్యము.
4. శ్రీ దివి రంగాచార్యులు
5. శ్రీ బిట్రా ఆంజయ్య.

ఇట్లే నోరివారు దేవీ భాగవతమును చివుకుల అప్పయ్యశాస్త్రి గారు గర్గ భాగవతమును సనాతన ధర్మ సంస్థాపనాభిలాషతో తెనుగించినారు. చివుకుల వారు తమ దివ్యవాణీ సుకృతి ప్రసాదముతో సికిందరాబాదు నుండి అనన్య సామాన్యమైన మతోద్యమమును నిర్వహించినారు. సాహిత్య మీరౌతుకు జవనాశ్వమువలె సాయపడినది. ముదిగొండ నాగవీరయ్య శాస్త్రిగారి శివపురాణ మీ సందర్భములో హైందవములోని అంతర్భాగములైన శైవ వైష్ణవ శాఖలలో శివ తత్వమును ప్రచారము చేయుటకు వచ్చిన కృతులన్నింటిలోనికి తలమానికమని చెప్పనొప్పును. నందిరాజు వేంకట చలపతిరావుగారి మంగళగిరి మాహాత్మ్యము క్షేత్ర ప్రశస్తికి చెందిన గ్రంథము. రామాపర్తుల కొండయ్యగారి వామన పురాణము అవతార ప్రశస్తి కెత్తిన ధ్వజమైనచో వానమామలై వరదాచార్యుల వారి పోతన చరిత్రము హిందూ మత గ్రంథమును రచించిన ఆర్ష కవిపై మఱొక ఆర్ష కవి నిర్మించిన హిందూ మత గ్రంథమున కుదాహరణము. ఇట్లు సనాతన హిందూ ధర్మ సంస్థాపనాభిలాష శాఖోపశాఖలై విస్తరిల్లినది. వీనిలో స్వమత ప్రతిష్ఠాపనముతోబాటు పరమత ఖండనము కూడ తిన్నగానో, తీవ్రముగానో మొత్తము మీద సాగినది. ఇట్టి అసంఖ్యాకమైన వానిలో కాకర్ల వేంకటరామ నరసింహముగారి 'విరికన్నె వేడికోలు' అను వస్త్వాశ్రయమగు ఖండికను ప్రత్యేకముగా పేర్కొనవలసి యున్నది.

**విరికన్నె వేడికోలు :** భక్తుడుదయమే నిద్రలేచి **పుష్పాపచయమునకై** పూదోట కేగిని నిషతో విరికన్నె ముందు నిలిచినాడు. కాని 'కలికిలే నవ్వు వెన్నెలల్ కాయుచున్న యీసమమ్మను ద్రుంపజే యెట్టునాడు'నని బౌద్ధభావనతో వెనుకంజ వేయగా పువ్వమే తన గొంతుక విప్పినది

'సర్వలోకేశ్వరుని పద సరసిజముల
గ్రోలుకంటె శుభంబేమి వలయు మాకు' అని తన ఈశ్వరార్పణ బుద్ధిని వెల్లడించి 'తలపుల విపరీత ధర్మతత్వము బలియుటయె పూవులు కోయ రాదను బౌద్ధభావమునకు హేతువని కవి విమర్శించినారు చింతా దీక్షితులవారి 'తోట'లో ప్రకృతినే దైవముగా ఆరాధించు తత్వమున్నచో వేదులవారి 'కాంక్ష'లో దేశభక్తి రూపుదిద్దుకొన్నది. పాపయ్యశాస్త్రిగారి 'పుష్ప విలాసము' అహింసా తత్వమునకు బుద్ధుడు చెప్పిన వ్యాఖ్యానమును సూచింపగా కాకర్లవారి రచన

యదార్థమైన హైందవ జాతీయ జీవనమునకు ప్రతిబింబమై వెలసినది. ఒక్కే పుష్పమిన్ని పరిమళములను తెలుగు సాహిత్యములో వెదజల్లినది! ఇందు వివిధోద్యమముల ఆంతరమైన ప్రేరణయే కారణము!

**సంఘ ప్రభావము:** ఇప్పటివరకును సనాతన హిందూ ధర్మ పునరుద్ధరణాకాంక్షతో సాగిన కావ్యములను ఖండికలను ప్రస్తావించితిని. ఇక రాష్ట్రీయ స్వయంసేవక సంఘ ప్రభావమును వివరింతును.

హెడ్గేవారుచే ప్రణీతమైన హైందవములో మాతృదేశమే దైవము. హిందువే ప్రత్యక్ష నారాయణుడు. ఈ సత్యము నెరుగుటే జ్ఞానము వీరి నారాధించుటే భక్తి. అందుకు జీవితము సమర్పించుటే కర్మయోగము. అట్లు దేశమునకై సర్వ సమర్పణ చేసిన మహనీయుల మహిమ సంస్మృతులే పౌరుషావిర్భావమునకు హేతువులని వీరి విశ్వాసము ఈ దృష్టితోనే రాణాప్రతాప్ శివాజీ వంటి హిందూ వీరులను వీరారాధింతురు. రాజశేఖర శతావధానిగారి రాణాప్రతాప చరిత్రము, శేషశాస్త్రిగారి శివభారతము ఈ కోవకు చెందిన గ్రంథములే మొదటిది తెలుగునాట సంఘోద్యమమునకు ముందుండై నిలువగా రెండవది ఉద్యమ స్ఫూర్తితో బహిర్గతమైనది. గాడేపల్లివారి విజయముద్ర కూడ సంఘ ప్రభావమును త్రోసిరాజన లేకపోయినది. పండిత నాగనార్యగారి కృతి వంటివి ఈ కోవకే చెందును. వానిని మఱొక సందర్భములో పేర్కొనుట జరిగినది. కావున ప్రస్తుతము సంఘప్రభావములో విస్తరించిన ఖండ కావ్యములను ఖండికలను ఉదాహరింతును.

**కళ్యాణ వీణ:** పురుషోత్తమ పుత్ర భార్గవ వెలువరించిన గ్రంథమిది. జాతీయ కల్యాణము హిందూ ధర్మోద్ధరణమువలననే జరుగునని వీరి విశ్వాసము.

> 'వేద సూర్యుడే ఉదయించాలి
> గోపూజా గాయత్రీ జపములు రేపుమాపులూ జరగాలి
> గంగామాతా భగవద్గీతల గణగణ గానం జనగణమనముల
> మధురనాదమై మార్మ్రోగాలి మరల ధర్మమిట మనగలగాలి'[1]

అని తమ హైందవాకాంక్షను వెలిబుచ్చినారు. ఇందలి ఛత్రపతి శివాజీ, రాణాప్రతాప్

1. కల్యాణవీణ మేల్కొలుపు. 36వ పుట.

వివేకానంద మొదలైన ఖండికలు మహాపురుషుల సంకీర్తనముకు, భువనమోహిని, గోపూజ, సంస్కృతి, ఖండికలు పూజ్యమైన మాన బిందువుల ఆరాధనకు చిహ్నములు. 'భారతీయుల సంస్కృతి ప్రభలమీదె పరుల సంస్కృతి నిర్మింపబరగె'[1] నని కవి విశ్వాసము. అట్టి భారతదేశము వేదేమైనది?

> "చైనీయులొక వంక జైత్రయాత్రలు చేసి
> ఆక్రమించగ దేశమక్రమముగ
> పంజాబులో శిఖుబాబులు చెలరేగి
> ప్రత్యేక రాష్ట్ర విభాగమడుగ
> అస్సాములో నాగులద్ద దిద్దము చేసి
> కేంద్ర ప్రభుత్వమున్ క్రిందు పరుప
> దక్షిణాదిన రేగి ద్రావిడు లొక వంక
> ప్రత్యేక ద్రవిడ స్వరాజ్య మడుగ
>
> దేశ విచ్ఛిత్తి శక్తులుత్తేజమంద
> నిమరగను చుండిరెల్లరు నేత లిచట'[2]

అనుటలో దేశ అఖండతకై కవి కలలు కనుట సుస్పష్టము. సంఘ నాయకులు ఎం. ఎస్. గోల్వాల్కర్ వ్రాసిన యీ క్రిందివాక్యములకు పై పద్యమొక కవితామయ రూపకల్పన మన వచ్చును **"No wonder that such a land with divinity ingrained in every speck of its dust has been to us the holiest of the holy, the centre of our utmost devotion"**[3] ఈ కారణము చేతనే ఆంధ్రుడు పంజాబులోని కల్లోలములకు కలతపడినాడు. కాశ్మీరములోని కలహములకు కన్నీరు కార్చినాడు చైనా, పాక్, దండయాత్రల సందర్భములో తెలుగులో సమరగీతి, సమరభారతి, మొదలైన సంకలములను వెలువరించి దేశభక్త్యాత్మకమైన సాహిత్యమును ప్రోత్సహించిన కవులలో నూటికి తొంబదిమంది స్వయం సేవకులే!

---

1. 'జాగృతి' ఖండిక 11వ పుట.
2. 16వ పుట.
3. **Our Motherland. 1. Bunch of throughts. M.S. Golwalkar 86 P.**

**విజయ విపంచి :** తెలుగుసీమలో గ్రామగ్రామములలోను దశాబ్దములుగా పాడబడుచున్న సంఘ గీతముల సంకలనమిది. ముందు రెండు భాగములుగా ప్రచురించినారు. తరువాత దీని కనుబంధమో అనునట్లు 'రాష్ట్రగీతావళి' యను మరొక గ్రంథమును సంఘ ప్రచురణకర్తలు వెలువరించినారు 'తమ మనో జీవనముల హైందవపుడ నేను ప్రత్యణువు హైందవమ్ము నా పరిచయమ్ము' అను గీతముతో ఈ గ్రంథము ఆవిష్కరింపబడినది. బుద్ధవరపు వేంకటరత్నముగారు 'మనదేశ గాథ వినరా మనజాతి చరితమిదిరా హృదయమునే కదలించు కథలతో మెదులుచుండురా మదిలో'' అని సాగిన గీతములో భగీరథ శంకరాచార్యాది హిందూ వీరపురుషుల, తపస్వుల సంస్మరణము చేయబడినది 'ఐకమత్య సాధకులారా లేవండోయ్ ఇకలేవండోయ్' అను బండారు సదాశివరావుగారి గేయములో సంఘమునకు మూలసిద్ధాంతమైన 'ఐకమత్యము (సంఘటన)' ప్రతిపాదింపబడినది 'అజాతరిపు లోక సంగ్రహీ అభివాదనములు కేశవజీ' అను గేయములో సంఘ సంస్థాపనాచార్యుని సంకీర్తనము. 'మా ప్రాణాలకు నవ ప్రాణం మా జీవానికి నవజీవం మా రాష్ట్రానికి ఉజ్జ్వల కేంద్రం అరుణారుణ భగవ పతాకం' అను గీతములో సంఘ ధ్వజమును స్తుతించుట గోచరించును. త్యాగరాజ కీర్తనలను అర్థము తెలియకున్నను తమిళులు సాధనచేసి పాడుచున్నట్లుగా ఈ తెలుగు గీతములను బొంబాయి, నాగపూర్, శ్రీనగర్‌వంటి ప్రాంతములలోని తరుణ స్వయం సేవకులు పాడుట నేనెరుగుదును. ఘనశ్యామల, ఉత్తమ్, శివప్రసాద్, వే. నరసింహారెడ్డి, రాయప్రోలు, (ఏ దేశమేగినా, శ్రీలు పొంగిన) శ్రీరామ పాద సాతే (హిందువులది ఈ హిందూస్తాన్) 'మొదలైన గేయములు ఈ సంఘోద్యమమును నడుపుటలో శంఖధ్వానములైనవి. 'మహా సర్గ,' ఈ జాతికి చెందిన ఖండ కావ్యమే !

**అవాంతరోద్యమములు :** ప్రధానమైన హిందూ పునరుజ్జీవనోద్యమములో అంతర్భాగముగా సంఘము నిర్వహించిన అవాంతరోద్యమములలో వివేకానందుని శతజయంత్యుత్సవము పేర్కొనదగినది. సంఘ నాయకులలో ప్రముఖులైన శ్రీ ఏకనాథ్‌జీ రానెడే దీనికి అఖిల భారత స్థాయిలో సారథ్యము వహించి 1963 నుండి దేశవ్యాప్తముగా వివేకానందుని హైందవ ప్రబోధములను

ప్రచారము చేసి మతమే జాతీయ జీవన ప్రాతిపదికయని చాటినారు.[1] దీనికి ప్రభుత్వము, రామకృష్ణ మఠమువంటి సంస్థలు సహకరించినవి. కన్యాకుమారి తీరములో వివేకానంద స్మారక మందిరమును లక్షల వ్యయముతో నిర్మించినారు. ఈ ప్రభావము తెలుగునాట తీవ్రమైన ఆధ్యాత్మిక సంచలమును కల్గించినది. రామకృష్ణ వివేకానందుల స్తుతితో తెలుగు సాహిత్యము ప్లావితమైనది. సుప్రసన్న తన 'అధునా'లో 'పడమటి దేశమువారు భయభ్రాంతులు కాగ' హైందవ మతో ర్ధ్వబాహుడై' చికాగోలో పొందిన ఘనవిజయమును శతధా కీర్తించినారు. 'బ్రాహ్మ విద్యా ప్రవర్తక పంక్తి చివర పెరిగె శ్రీ రామకృష్ణయోగుల మహస్సు ఈ మహా ధర్మరథమున కెత్తికట్టి శ్రీ పతాక నరేంద్రుండు చిన్మయుండు'[2] ఇట్లే జగద్గురు పూరీ శంకరాచార్యుల వారి పర్యవేక్షణలో నిర్వహింపబడిన గోహత్యా నిరోధోద్యమ సందర్భములో వందలకు వందలు ప్రచార గీతములు వచ్చినవి. అందు కావ్యత్వమును కలిగియున్న జంధ్యాల పాపయ్యశాస్త్రిగారి రచనల వంటివి కూడ కలవు ఇట్లే కచ్ సత్యాగ్రహములోను కేరళలోని మొల్లాపురం జిల్లా నిర్మాణమునకు వ్యతిరేకముగా సాగిన రాజకీయోద్యమములో ఆంధ్రులు, ఆంధ్ర కవులు పాల్గొనినారు. ఈ సందర్భములో కూడ ప్రచార గీతములు వచ్చినవి. హిందూ పునరుజ్జీవన మహా సాగరములో ఇవెల్లను 'చిటి పొటి' తరంగముల వంటివి తరంగములెట్లు పెరుగనో అట్లే తరుగును. కాని రసనిధి మాత్రము గంభీరముగా ఘోషించుచు అట్లే స్థాయీ భావముతో నిలిచి యుండును!! ఈ సందర్భములో చివుకుల అప్పయ్యశాస్త్రి గారి వాక్యముల నుదాహరించుట సముచితము.

"నేటి కాలమున భారతీయుల దృక్పథములో కొంత మార్పు వచ్చినది. దానికి పాశ్చాత్య నాగరికతా ప్రభావము కారణము. పాశ్చాత్య విద్యార్జనమునసే

---

1. "I claim that no distruction of religion is necessary to improve the Hindu society and that this state of Society exists not on account of religion but because religion has not been applied to Society as it should have been "Swami Vivekananda—Reusing call to the Hindu nation. Compiled by Eknath Ranade. 46 P.
2. అధునా. 14వ పుట.

జీవితము గడిచినందున ప్రాచ్య విజ్ఞాన స్వరూపము సుగోచరమగుటలేదు. భారత దేశమునకు రాజకీయ స్వాతంత్ర్యము లభించినది. ఆర్థిక స్వాతంత్ర్యమున కిపుడొక యత్నము జరుగుచున్నది. సంస్కృతి స్వాతంత్ర్యమునకొక యత్న మావశ్యకమై యున్నది. నేటి సనాతన ధార్మికుల యత్నము సంస్కృతి స్వాతంత్ర్యమునకే! అట్టి భవిష్యన్మహా సంగ్రామమున వీరు కంకణము కట్ట వలసి యున్నది."[1] ఔను! కంకణము కట్టియే ఉద్యమించినారు!!

## బ్రహ్మసమాజ ప్రభావము :

ఏ సిద్ధాంతమైనను కాలము గడిచిన కొలది దూరము సాగిన కొలది పరి వర్తనము నందును. హిందూత్వమట్లు మారినదే. దీనిని సాంఘిక, మత రంగ ములలో సంస్కరణము చేయ ప్రయత్నించిన ఉద్యమమే బ్రహ్మ సమాజము. పాశ్చాత్య దేశములలో పెట్రార్క్, ఇరాజ్‌మస్, బేకన్, లెస్సింగ్ మొదలగు వారు భిన్నకాలములలో నిర్వహించిన కార్యక్రమము నంతయును రాజారామ మోహన రాయలు ఏకకాలములోనే బ్రహ్మసమాజ ధ్వజము క్రింద నిర్వహిం చెను. మతము నీయన సహేతుకముగా వైజ్ఞానికముగా పరిశీలించుటకు ప్రారం భించెను. తరువాత కేశవ చంద్రసేనుడు ప్రాక్పశ్చిమముల సమన్వయమును సాంకేతిక వేదాంత విజ్ఞానముల సమైక్యతను ప్రతిపాదించినాడు. ఆంధ్ర దేశ ములో బ్రహ్మసమాజ వ్యాప్తి సాగిన కొలది ఈ సిద్ధాంతములు వేరూనసాగి నవి. ఇదిట్లుండగా వేరొకవైపు నుండి దేవేంద్రనాథ రవీంద్రనాథుల విష్ణుభక్తి సమన్వితమైన విశుద్ధ ప్రపంచాతీత ఈశ్వరవాద ప్రభావము మఱొక పాయగా ప్రవహించి రెండును సాగరాంధ్ర తీరములో సంగమించినవి. అందుండి జన్మిం చినవారే కృష్ణశాస్త్రి ప్రభృతులు. ఇందలి ప్రముఖ ఘట్టములను పేర్కొందును.

**ఏకాంతసేవ :** ఏకేశ్వర భావముతో మధురభక్తిని మార్గముగా చేసి కొని ఈశ్వరుని సాన్నిధ్యములో కవి ప్రేయసివలె పలవరించుట, పలుకరించుట వేంకట పార్వతీశ్వర కవుల 'ఏకాంత సేవ'లోని తత్వము.[2] కవి ప్రకృతినే దూతికగా చేసికొని పరమేశ్వరునితో సమాగమమునకై రాయబార మంపును.

---

1; గర్గభాగవత పీఠిక.

2. 1922 ప్రచురణ.

కవి తన్నుతాను వనలక్ష్మివలెను ప్రభువును శృంగారమాధవుని వలెను సంభావించి సంబోధించినాడు సమాగమమునకై పరితపించి చివరకు పరమేశ్వర సాయుజ్యము నందినాడు. తరువాత వెలువడిన భక్తి కావ్యమార్గమున కిదియే ఒరవడి!

**కృష్ణపక్షము :** దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి యీ సుప్రసిద్ధ కృతిబ్రహ్మ సమాజ భావము, వైష్ణవ భక్తితత్త్వము, ద్విధాపక్షములై విప్పారగా నింగి నెరిగిన రాయచ వంటిది. ఇందు ఏకేశ్వరతత్త్వము ముద్రితమైనది. ఇందలి రాధాకృష్ణులు, పౌరాణిక వ్యక్తులు, హిందువుల దేవతలు కాదు. జీవేశ్వరుల కవి సంకేతములు కావుననే ఈశ్వరునికి నామరూపములు లేవను బ్రహ్మ తత్త్వమిందు అతిక్రమింపబడినదని భావింపరాదు. రవీంద్రుని వలెనే కృష్ణశాస్త్రిగారును పరబ్రహ్మమును 'ప్రాణేశా', 'ప్రభూ' అని మాత్రమే సంబోధించును. ఎదదయే ఇందు బృందావనము భక్తిభావమే విరహ ప్రకోపము. వేణునాదమే ఈశ్వరుని పిలుపు. తానే రాధ, తానే కృష్ణుడుగా మారుట ఈ తత్త్వమునకు పరమావధి. కృష్ణ పక్షములోని అన్వేషణమువంటి ఖండికలన్నియు ఇందు కుదాహరణములు. బసవరాజు అప్పారావుగారి గీతములు వేదులవారి 'రాధ' మొదలైన ఖండికలు ఈ రీతి కుదాహరణములు. ఈ దశలో భక్తుడు తన్ను 'పాపి'గా భావించుకొని నిందించుకొనును (కృష్ణశాస్త్రి) పరమేశ్వరుని ముందు తనదెంత అధమ జన్మమో గ్రహించి విలపించును (వెంకట పార్వతీశ్వర కవులు) పరమేశ్వరునికి దాసిగా నిలిచి దాస్యభక్తిని ప్రదర్శించును (బసవరాజు అప్పారావు). తన్ను తాను నిలువున పరమేశ్వరునికి కానుకగా సమర్పించుకొనును. ఈ జాతి గ్రంథముల లోనే ఉత్తమ శ్రేణికి చెందిన మరొక కృతి 'భావసంకీర్తనము'.[1]

**ఋగ్విధి :** అనువాద గ్రంథమైనను ఈ దశలోనే వెలువడిన బ్రహ్మర్షి రఘుపతి వేంకటరత్నము నాయుడుగారి 'ఋగ్విధి' నిట ఉదాహరింపవలసి యున్నది. కృష్ణశాస్త్రిగా రీ కార్యభారమును నిర్వహించినారు. ఋగ్విధి యను నామములోనే బ్రహ్మసమాజ తత్త్వమే యదార్థమైన వైదికమను స్ఫురణము కలుగుచున్నది. బ్రహ్మ సమాజికులకు నిజముగా వేదములకన్న ఉపనిషత్తులే

1. వేంకట పార్వతీశ్వర కవులు. ఇందు నవవిధ భక్తిభావములును కలవు.

ప్రధాన దర్శనములు. సృష్టి మొత్తము పరమేశ్వరమయమేనని ఇది నిరాశకు నిస్పృహకు ఆలవాలము కాక ఆత్మ సాక్షాత్కారమునకొక సాధనమని పూవు పూవులో పరమాత్ముడు, ఆకు ఆకుచో అనంతబ్రహ్మము దార్శనిక దృష్టి నల వరచుకొన్నచో కన్పించునని చెప్పుట ద్వారా బ్రహ్మసమాజ సిద్ధాంతముల కింద కావ్యరూపము కల్పింపబడినది జ్ఞాతముగానో అజ్ఞాతముగానో ఈ తత్వము నాడు కొంచెముగనో గొప్పగానో అందరిని ప్రభావితము చేసినది. ఈ దృష్టితో వచ్చిన ఖండికలన్నింటిని ఉదాహరింపక బుద్ధతత్వము నిక పేర్కొందును.

## బౌద్ధ దర్శనము :

విశేషార్థములో బౌద్ధము, క్రైస్తవము భిన్న భిన్న దర్శనములను కలిగి యున్నను సామాన్యార్థములో రెండింటికిని సామ్యమున్నది. బుద్ధుడు జీససు ఇద్దరును శాంతిమూర్తులే. ఇద్దరును హింసాత్మక యజ్ఞములను ధిక్కరించిన వారే యుద్ధ విముఖతను ప్రదర్శించినవారే! మానవుని సుఖశాంతుల నన్వేషించుచు తమ రాజ్యమునో ప్రాణమునో త్యజించి ముండ్ల కిరీటమును ధరించుటకు సిద్ధమైనవారే! కావుననే భారతదేశములో నేమి, ఆధునికాంధ్ర సాహిత్యములో నేమి ఇద్దరికిని అభేదము చెప్పబడినది.

అనాది బౌద్ధమున కాంధ్రదేశము పుట్టినిల్లు. శ్రీ పర్వత ప్రాచీన గాథలందుకు సాక్ష్యములు శిథిల స్తూపములలోని జాతక చిత్రములందుకు నిదర్శనములు. హీనయాన మహాయాన బౌద్ధవిభాగ మిచ్చటే జరిగినది. అజంతా, ఎల్లోరా, కుడ్య శిల్పములక్కడే తీర్చిదిద్దబడినవి. వ్యాఘ్రా నదీతీరములోని త్రిశరణశ్రావణములెన్ని దిశలను మించి, ముందుకు సాగినవో ఎవరు చెప్పగలరు? కళింగ ధాన్యకటక, అమరావతీ భట్టిప్రోలు, సాలిహుండాదులా నాటి బౌద్ధమత ప్రభ కాంధ్రులెత్తిన అరుణకమల నీరాజన కళికలు. అట్టి బుద్ధుని 2500 వ మహోత్సవములు 1956వ సంవత్సరములో వచ్చినవి నాటికి బుద్ధునికి తెలుగు నాటిలో గల స్థానమెట్టిదో గమనింపవలసి యున్నది.

**గాంధీ- థోరో - బుద్ధుడు :** బౌద్ధము, గాంధీ దర్శనము, ఒకే అహింసా సూత్రముంపై తమ పోరాటమును సాగించినవి. సంయమనము ఆత్మదర్శనము 'సత్య ఆగ్రహ' రూపముననే సిద్ధించుననియు దీనికి అహింస మూలాధారమని గాంధీజీ మతము. ఈ దర్శన నిర్మాణమునకు బుద్ధుడు. జీసను, థోరో గాంధీ

జీని ప్రభాషితుని చేసినారు. థోరోవాల్డన్ తీరములో చేసిన ప్రయోగమే గాంధీజీ సబర్మతి ఆశ్రమము నుండి చేసినారు అందు గాంధీజీకి, బుద్ధునికి జీససుకు లభించిన దివ్యదర్శనమే లభించినది. కేవలమిది యూహ కాదు ఇచ్చట గాంధీజీ బుద్ధునిపై క్రీస్తుపై పెక్కు చర్చలు సాగించినారు. **"I was then re-reading Arnold's Light of Asia. Once we began to compara the life of Jessus with that of Buddha 'Look at Gountama's compassion' saied I. 'It was not confined to mandkind. It was extended to all living beings. Does not one's heart overflew with love to think of the lamb Joyously perchcd on his shoulders? One fails to notice this love for all living beings In the life of Jesus"** [1] ఈ దివ్యదర్శనమే సత్యాగ్రహ రూపమున రాజకీయములలో ప్రతిబింబించినది.

## గాంధీ - నెహ్రూ - వినోబా :

గాంధీ దర్శనము రెండు పాయలై ప్రవహించినది ఒకటి రాజకీయములకు సీమితమైనది. నెహ్రూజీ దానికి వారసుడు. వారి ఆధ్వర్యములోనే బుద్ధుని జయంత్యుత్సవములు జరిగినవి. రష్యా-అమెరికాల మధ్య సహజీవనమును ప్రతిపాదించి చైనాతో సరసము నెరపి పులి సరసన మేకను నిలుప యత్నించిన ఇంద్రజాలికాగ్రణి నెహ్రూజీ. గాంధీ దర్శనములోని రెండవ పాయ సాంస్కృతికముగా ప్రసరించినది. ఆచార్య వినోబాభావే దీనికి నాయకత్వము వహించినారు. సమాజములోని అసమానతలను మార్క్సు ప్రతిపాదించిన సంఘర్షణ ద్వారా కాక సమన్వయముతో నిర్మూలించుటకు బద్ధ కంకణులైన వీరు ప్రతిపాదించిన తత్వమే సర్వోదయము. వీరు చిన్ననాటి నుండి గాంధీజీ కడ అంతేవాసియై యుండి సబర్మతీ ఆశ్రమములో అసిధారా వ్రతముగ బ్రహ్మచర్యమును నిర్వహించి ఆశ్రమవాసులకు ఆదర్శప్రాయుడైనాడు.

'అహింసా సత్య అస్తేయ బ్రహ్మచర్య అసంగ్రహ
శరీర శ్రమ అస్వాద సర్వత్ర భయవర్జన

---

1. M.K. Gandni. 'My Experiments with truth' 120 P.

సర్వధర్మ సమానత్వ స్వదేశీ స్పర్శభావనా
ఏకాదశ సేవావీం నమ్రత్వే వ్రత నిశ్చయే' అను పదునొకండు సూత్రములను శ్లోకరూపమున నిబద్ధము చేసి జీవితము నా సాధనలో ఫలింపజేసి 'జై జగత్' మంత్రమును అనుష్ఠానము చేసిన కర్మయోగి వినోబా ! సంపత్తి యొక్క వికేంద్రీకరణమే పరమాశయముగా భూదానోద్యమమును ఆంధ్ర ప్రాంతము నుండియే ప్రారంభించినారు. దుర్ముఖి వైశాఖ శుద్ధ పూర్ణిమనాడు 1956 మేలో జరిగిన బుద్ధుని 2500 మహా జయంత్యుత్సవములనాటికి భారత దేశ స్థితిగతులు ఆంధ్రప్రాంత పరిస్థితులు ఇట్లున్నవి.

అభినవమనువైన అంబేద్కరు ప్రోత్సాహముతో బౌద్ధము జీవము పోసికొని నిలిచినది. అట్లే క్రైస్తవమత కార్యకలాపాలు కూడ దిన దినాభివృద్ధి నందుచునే సాగినవి. నిరుపేదలకు విద్య వైద్యము, ఆహార సౌకర్యములు కల్పించి అస్పృశ్యతను నివారించి మతాంతరీకరణములో ప్రశాంత విప్లవమును సాధించినారు. 1964 లో బొంబాయిలో జరిగిన ప్రపంచ యూఖరిస్టు మహాసభలకు వాటికన్ వదలి తొలిసారిగా పోపు భారతదేశమునకు వచ్చినారు. ఇది తెలుగునాట క్రైస్తవ చైతన్యమునకు దోహదము చేసినది. హింసోన్మత్తమైన పృథ్వీలో బాంబుల వానలు వెలిసిన పిమ్మట పైని పేర్కొనిన పవిత్ర పురుషుల ప్రబోధ జ్యోతిస్సులకై శూన్యాకాశములో ఆంధ్ర పాఠకుడు కూడ అన్వేషణ మారంభించినాడు. ఈ గవేషణలో తెలుగు కవులాతనికి ఆశాభంగము కలిగింపలేదు సరికదా అన్య భాషలతో దేనికిని తీసిపోనంతగా శాంతిని కుందపోతగా వర్షించి సారస్వత శకుంతమునకు శాంతికులాయము నిర్మించినారు. ఇట్లు 1) గాంధీ, 2) జీససు, 3) బుద్ధుడు, 4) నెహ్రూజీ, 5) వినోబాలను శాంతి-కుడ్యముల పైపైకి లేచిన ఆంధ్ర సారస్వత భవన నిర్మాణోద్యమములో భాగ భాగస్వాములైన కవుల రచనా విశేషములను రీతులను విన్నవింతును.

**వస్త్వాశ్రయ రీతి :** కథ నాశ్రయించి రచింపబడిన బౌద్ధమత ప్రభావితమైన కృతులలో రెండు పద్ధతులున్నవి.

**i)** బుద్ధుని జీవితమును, ఆయన శిష్యుల జీవితములలోని రసాత్మక ఘట్టములను కావ్యములుగా రూపొందించుట.

ii) అహింసా సిద్ధాంతమును మాత్రమే బుద్ధుని నుండి స్వీకరించి దాని కను
గుణమైన మరొక కథను కల్పించుట లేదా ప్రసిద్ధ గాథనేదైన బుద్ధ
సిద్ధాంత పట్టకమునుండి వక్రీభవింపజేసి నూతన వ్యాఖ్యాన మొసంగుట
ఇందు మొదటి పద్ధతికి చెందిన సుప్రసిద్ధ కృతులలో కాటూరి వెంకటే
శ్వరరావు, పింగళి లక్ష్మీకాంతముగారు రచించిన సౌందరనందము,
జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు రచించిన కరుణశ్రీ, సి. నారాయణరెడ్డిగారి
నాగార్జున సాగరము, తొలి నాడులలోను దాశరథి రచించిన మహాబోధి.
కరుటూరి సత్యనారాయణగారి కరుణా సౌగతం మలినాడులలోను ఉదాహ
రణములు కాగా దుర్గానంద్‌గారి మధూలిక, కాటూరివారి పౌలస్త్య హృద
యము, పల్లా దుర్గయ్యగారి గంగిరెద్దు, మొదలైనవి రెండవ పద్ధతికి
నిదర్శనములు. ఇందలి బౌద్ధమతతత్వమును ప్రదర్శించెదను.

**సౌందర నందము :** ఆంధ్ర దేశములో బౌద్ధ తత్వమున కెత్తిన
ఆకాశ దీపమే సౌందర నందము.[1] ఇది బుద్ధుని జీవిత గాథలలో నొకటి.
నందుడు వరుసకు బుద్ధుని తమ్ముడు. ఆతని భార్య సుందరి, సుందరియే!
'ఉడురాజోపల' భవనములో వారు సుఖించెడి వేళ బుద్ధుడు భిక్షార్థము ఆ గృహము
ముందు నిల్చినాడు. శృంగార కౌశీవిలాసలోలురయిన దంపతులది వెంటనే
గుర్తింపలేదు. కాని తరువాత తెలిసినది. నందుడు అన్నగారిని అన్వేషించుచు
విహారమున కేగినాడు. పోయినదేపోక. మరి రాలేదు. బుద్ధుడు బలవంతముగా
నందునికి ధర్మదీక్ష నిప్పించినాడు. ఎంతకును రాని నందుని తలంచి తలంచి
సుందరి 'మాశాక్య వంశ స్త్రీలకి వియోగము వ్రాసిపెట్టినదేమో'నని విలపించినది.
కొంత కాలము తరువాత నందునికి బుద్ధుడు ధర్మ సందేశమును విన్పింపగా
నందునికి పరమార్థము అర్థమైనది. సంఘమే శరణమని లొంగిపోయినాడు.
సుందరి కూడ నందుని కొరకు వేచివేచి చివరకు నిరాశతో జీవితమును ప్రజా
సేవలో గడుపుటకై నిశ్చయించుకొనినది. ఇట్లొక వెలివాడలో తిరిగి సుందరీ
నందుల ద్వితీయ సమావేశమైనది. బుద్ధుడు వారికి సంకుచితమైన ప్రేమను
మమతను వదిలి విశ్వమానవ సౌభ్రాతృత్వము నలవరచుకొండని సందేశమిచ్చి
వెళ్లుటతో కథ ముగియును సంస్కృతములో అశ్వఘోషుడు తీర్చిదిద్దిన యీ

1. ప్రథమ ముద్రణ 1982.

గాథను ఆయనకన్న మిన్నగా నాటకీయముగా మహాకావ్యముగా తెరయెత్తు టొండుగాఁ తెరదించుటొక్కఁడై' రంగ నిర్వహణమును రక్తితో జంట కవులు నిర్వహించినారు.[1]

ఇందు ఉపదేశము ధర్మ సంవాదమను రెండు సర్గలును పూర్తిగా బౌద్ధ మత తత్వమును విశదీకరించుచున్నవి. ఇందు ప్రత్యక్షరములోను గాంధేయ దర్శనము, జీవనము స్ఫురించుచున్నది. సర్వసంగ పరిత్యాగముచేసి ధర్మ దీక్షను స్వీకరించిన బుద్ధుడే సత్యాగ్రహ దీక్షను స్వీకరించిన గాంధీ మహాత్ముడు. బుద్ధుడు 'ఉపదేశము'లో నందుని కిట్లనును :

'అద్యులైనట్టి ఋషులు సత్యం బహింస
ధర్మదేవత రెండు నేత్రములటంచు
గలిపిపోయిరి లోక సంగ్రహము కొఱకు
నంధు రాలయియూపె యల్లాడు నపుడు'[2] అనుటలో స్వాతంత్రో

ద్యమ కాలములోని దేశ దుస్థితి సత్యాహింసల స్థాపనకై ప్రతిన పట్టిన ఆద్య మహాత్ములవంటి మహాత్ముడును మన మనస్సీమలలో గోచరింపక పోరు. గాంధీ శిష్యులు నాడెట్లు సమాజ నిర్మాణ కార్యక్రమములలో వెలివాడలు సందర్శించి నారో సుందరీ నందులట్లే 'దుర్గంధిలంపు సందులలో' 'శైలలవపుష్టమ్మా మక మకని దివ్వె వెలుఁగు'లో దివ్వెవలెనే రెపరెపలాడెడి బ్రతుకులకు బాసటయై నిలిచినారు. గురువు వారికి 'సర్వజగతిన్ భజియింపు'[3]మని 'తాఁ దనయాలు నాత్మసంతానము తోడబుట్టువులు తల్లియుఁ దండ్రి కులమ్ము దేశమున్ మానవు లెల్ల ప్రాణులు కుమార సమస్తముఁను గావలె'[4]నని ఉపదేశించుట అచ్చముగా గాంధేయమైన విశ్వప్రేమకు ప్రతిబింబము. గౌతమబుద్ధుడు నందునితో

'ప్రేమకన్న సత్యములేదు భిక్షువులకు
పరమ సత్యముకన్న సుందరముళే'[5] దనుట

---

1. ఉపదేశము 57వ పుట.
2. పన్యాల రంగనాథరావుగారు దీనినే 'జ్ఞానభిక్ష'యను పేర గేయములో నాటికగా రచించినారు.
3, 4, 5, ధర్మసంవాదము 67వ పుట.

'But one thing took Deep root in me- the conviction that morality in the basis of things and that truth is the substance of all morality'1 అను గాంధేయ దర్శనముకన్న భిన్నము కాదు. ఇట్లు బుద్ధునికి గాంధీజీకి ఈ కృతిలో అభేదము ప్రతిపాదింపబడినది

**సుజాత :** బుద్ధుని జీవితగాథలలో సిద్ధి నొందుటకు ముందు సుజాత యను గృహిణి శాక్యమునికి క్షీరాన్నము సమర్పించిన సన్నివేశమున కత్యంత ప్రాధాన్యమున్నది ఆచార్య కాకర్లవారి కృతికి గాథయే ఆధారము. లలిత విస్తరములోను సోమ జాతకములోను ప్రవచింపబడిన మూలకథను కాకర్లవారు గ్రహించిరి. సేనానిపురములోని సత్యరతుని పత్ని సుజాత., మహా సాధ్వి. భయంకరమైన క్షామ పరిస్థితులలో జంతుజాలమెల్ల 'విలవిల తన్నుకొంచు కాళుల పసలేక' కూలబడినప్పుడు, ఆకటితో ప్రజలంగలార్చి పిట్టలవలె రాలిపోవుచున్న ప్పుడు ఆమె చేసిన దాతృత్వమును నేలయు, నింగియు ప్రశంసించినవి ఆమె సుగుణ సంపత్తికి జలదేవతలే కరుణించి వర్షములు కురిపించినారు.

ఆనాడు బుద్ధపూర్ణిమ. ఆత్మవత్సర్వ భూతానియను సిద్ధాంతమును నమ్మిన సుజాత 'మైకి గిన్నెనుగొని పాయసాన్నమును నించి'2 ముని దరిచేరి తదంతిక మందు నుంచ నాయకముడుదాని నారంగించి యిట్లనినాడు.

'సర్వప్రాణుల యెడల న
ఖర్వంబగు ప్రేమఁ జూపు కరుణాళువులీ
యుర్విం గల్గిన యంతకు
నార్వఁబోలేదు విబుధులయ్యో యనుచున్'3 తన ప్రేమ సిద్ధాం

తమును తొలిసారిగా ప్రవచించినాడు బౌద్ధతత్వ ప్రతిపాదకములైన తక్కిన కావ్యములకు సుజాతకు నొక ప్రముఖ భేదమున్నది. హిందూ బౌద్ధ ధర్మముల సంగమస్థలి ఆచార్య నరసింహముగారి హృదయము. కావుననే సుజాత 'పతిసేవ శాస్త్ర విహితము పతియే దైవంబు నాకు పతి కొలకైనన్ వెతలెన్నియైనఁ

1. X Glimpses of Religion. My Experiments with truth 25 P.
2. 52వ పుట. 127వ పద్యము
3 55వ పుట 138వ పద్యము.

బొందుదు'[1]నని బౌద్ధ సన్యాసినివలె కాక హిందూగృహిణివలెనే పలుకగా తథాగతుడు కూడ ఆమె నాశీర్వదించి.

'వనిత బుద్ధులు గల్గిన వారమనుచు
గర్వపడు వారలెల్ల నీ కడచు వచ్చి
హృదయశాంతికి మార్గము నెఱుఁగవలయు
మానవున కబ్బు సుగతికి మార్గమంత'[2] యని ప్రశంసించినాడు.

ఇట్లు పల్కుటలో బౌద్ధమతము హిందూ ధర్మములో అంతర్భాగమే కాని తద్భిన్నమైనది కాదనియు 'అతిలోక సామాన్యమైన పాతివ్రత్య మహిమ నొప్పారెనే మగువమిన్న.........అట్టి జగదేక పావని'[3] ఆ సుజాత ధర్మము గౌతముని కంగీకృతమేననియు కవి చాటి చక్కని ధర్మ సమన్వయమును సాధించినారు.

**కరుణశ్రీ :** బుద్ధ భగవానుని జీవితము నాధారముగా రచించిన కృతియిది. మానవతా వాద ప్రతిష్ఠాపనా చార్యులలో బుద్ధుడు హిమాలయ శృంగము వంటివాడు, కావుననే ఈ కృతి దివ్యతేజస్వి, నిశ్చల ధ్యానియగు మహీధర మండలస్వామి వర్ణనతో ప్రారంభమై లుంబినిలో భగవానుని జన్మము మాయాదేవి అస్తమయము, సిద్ధార్థుని బాల్యక్రీడలు, రాయంచను దేవదత్తుని బారినుండి భగవానుడు రక్షించుటలో ముందుకు సాగును. మృదు మధురమైన కవితతో కరుణశ్రీని రూపొందించి కవి 'కరుణశ్రీ' యనియే పేరొందినారు.

**మహాబోధి :-** పునర్జన్మ విషయములో సిద్ధార్థుడు మౌనము వహించినను మతము పెరిగిన కొలది జాతక కథలు వెలువడిన కొలది సిద్ధార్థు దవతార పురుషుడుగా మారినాడు. వివాదగ్రస్త విషయ మైనప్పటికిని బుద్ధుని (శాక్యముని) దశావతారములలో నొకనిగా హిందువు లంగీకరించినారు. బుద్ధుని 2500 జయంత్యుత్సవము తెలుగుజాతిలో నిలిపిన చైతన్యమునుండి వెల్వడిన కావ్యజ్యోతులలో దాశరథి కృష్ణమాచార్యులవారి 'మహాబోధి' పేర్కొనదగినది.

---

1. 184 పద్యము.
2. 182 పద్యము.
3. 143 పద్యము.
4 జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు.

చాంపేయ, భదంత, మహాపద్మ, జాతకాదులలోని గాథలను స్వీకరించి వానికి రససిద్ధిని కల్పించినారు.

'ఆసియా ఖండ భావ మానవాళికెల్ల

బుద్ధ సంస్కృతి ఆనందము నిడుగాక'[1]యను ఆకాంక్షతో ఈ కృతి రచింపబడినది. ఇందు బుద్ధుడనగా నెహ్రూ పండితుడే. అష్టాంగ మార్గముతో మానవుల కమృతమును బుద్ధుడు పంచిపెట్టగా పంచశీలతో నరులకు పంచామృతము నిచ్చినవాడు నెహ్రూ పండితుడు. 'వాక్సరథిన్ వామకరమ్ము' 'పాశ్చాత్యార్ణవం బన్యమౌకరము'[2]తో బుద్ధుడు జవహరులాలు కూడ స్పృశించినవారే! 'బ్రాహ్మణాది చతుర్వర్ణభవులు ప్రజలు భేదభావమ్ము లన్నియు విడిచివైచి'[3] బుద్ధుని కడకెట్లు వచ్చిరో మతాతీత రాజ్యాంగములో ప్రజాస్వామ్య సమాజ వాదమును ప్రతిపాదించిన నెహ్రూ కథకు కూడ అట్లే వచ్చిరి.

'ఈ ప్రపంచంబునం దెన్నడేనిగాని

ద్వేషమును ద్వేషమున నిరోధింపలేము

దాని మాయించుటకు చిరంతన సుఖంబు

నందుటకు కావలెను ప్రేమకాంత మొకడు'[4] అని బుద్ధుని ప్రబోధము కన్న పంచశీల భిన్నముకాదు. కావున ప్రత్యక్షముగా బుద్ధుని మాహాత్మ్యమును వర్ణించుచు కవి ధ్వన్యాత్మకముగా నెహ్రూజీ ఘనతను గళమెత్తి గానము చేసినారు. శ్రీ కరుటూరి సత్యనారాయణగారు రచించిన 'కరుణాసౌగతం' మొదలైనవి ఈ జాతి గ్రంథములే. అంగుళిమాలుడు, ఆమ్రపాలి, సుదాసుడు, సుప్రియ, సునీత, సుజాత, కిసగౌతమి, చందుడు గౌతముని అహింసాతత్వము, ముఖ్యముగా భారతదేశమునకు గాంధీజీ నెహ్రూ పండితులు నాయకత్వము వహించుటతో 1920 నుండి 1960 వఱకు నొక మహోద్యమ స్రవంతియై పొంగి పొర్లినది. బుద్ధ, క్రీస్తు, గాంధీ, నెహ్రూ, వినోబాలనెడి పంచముఖములు

---

1. అంకితము మహాబోధి. 12వ పుట

2. 28వ పుట

3. 29వ పుట

4. 35వ పుట

గల పరమేశ్వరుని తెలుగు కవులు అర్చించినారు. ఒక కథకు కావ్యముగా రచించుచు వేరొక్కరి ప్రసక్తిలోనికి కవులు తమకు తెలియకుండగనే ప్రవేశించుట తెలుగునాట సామాన్యమై పోయినది. 'సర్వోదయ సిద్ధాంత సూత్రానుసారముగ దిద్ది తీర్చుటకు సాహితీ దివ్యామృత గుళికారూపములగు కావ్య దీప కళికలే వెలుగుబాటలుగా'[1] సాగిన బోయి భీమన్నగారి దీపసభలో గుజ్జుపు బండి వాడు బండి తోలుచు ప్రవంగవశమున,

'హెచ్చి బాంబులకంటె హెచ్చు సత్తువ యెంతొ
గాంధి సూత్రాలకే కలదటంచు' గాంధీతత్వ చర్చను సాగించుట

ఇట్టి ధోరణి కుదాహరణమే !!

హిందూ మతోద్యమములో అంతర్భాగములై సాగిన వివిధ శాఖాంతర్గత కవితా రీతులను మనవి చేసితిని. ఇట్లు ఏ మతోద్యమముచేతను ప్రభావితము కాకుండ కేవల సంప్రదాయ పద్ధతిలో వెలువడిన రచనలెన్నో కలవు ఆచార్య దివాకర్ల వేంకటావధాని ప్రభృతు లీ మార్గములో అగ్రగాములై నిలిచెదరు. కాని వీరిపైకూడ హిందూమత ప్రభావము లేదని చెప్పలేము. సనాతన మతాభిమానులు ముఖ్యముగా సంస్కృతమును; సంప్రదాయ కవితను, గ్రాంథిక భాషను అభిమానించి పోషించుట, ఒక చారిత్రక సత్యము కాని వీరి రచనలు గతానుగతికములై, నన్నయాదుల ఒరవడిలో మార్గకవితా మార్గములో సాగినవే కాని ఉద్యమాత్మకములు కానందునను హిందూ మతోద్ధరణాభి నివేశముతో తీవ్రముగా వెల్వడినవి కానందునను పేరున పేరున ఈ అధ్యాయములో వేఱుగా ప్రస్తావించలేదు.

---

1 దీప సభ పీఠిక నిడుదవోలు వెంకట్రావుగారు

# నవమాధ్యాయము

# శాస్త్రీయ విప్లవము

ఉద్యమము లెల్లప్పుడును ముహూర్తము నిశ్చయించి శుభలేఖలు పంచి మేళతాళములతో భేరీభాంకారములతో తమ్ము తాము ప్రకటించుకొనవు. ఒక్కొక్కప్పుడు బృహన్నలవలె అవమానములకు గురియై ఓరటునిచే అనరాని మాటలని చివరకు భీష్మ ద్రోణ కృపాది ధన్వినికరాభీలమును అవలీలగా ఓడించి విజయధ్వజమెత్తును ఈ భావమును దృష్టిలో నిడుకొనియే మార్టిన్ గిల్కిన్ 'ఒకానొక నూత్న సాహిత్యోద్యమము రాత్రివేళ దొంగవలె ఎవరికంట బడకుండ ప్రారంభమగునది ప్రాతమర్యాదల నుల్లంఘించుచు పూర్వాచార పరాయణుల కెదురొడ్డి నిల్చి క్రమముగా ప్రజాభిమానమును చూరగొనున'[1]ని నిర్వచించినాడు. అంగుష్ఠమాత్ర స్వరూపముతో ప్రారంభమై క్రమముగా విరాట్పురుషుని వలె విశ్వరూపమెత్తి అణువును భేదించి మహత్తోమహీయమై ప్రపంచమును తన పిడికిట బిగించి పరాశక్తికి ప్రతిరూపమై నిలిచిన సాంకేతిక విప్లవోద్యమ కథ గోగ్రహణము నాటి ధనుంజయుని విక్రమముకన్న భిన్నమైనది కాదు. గోవనగా ధేనువేకాదు దిక్కు భూమికన్ను బాణము కిరణము స్వర్గము చంద్రుడు వజ్రాయుధము- అని కూడ యర్థము[2] శాస్త్రీయ విజ్ఞానము చేసిన నవీన గోగ్రహణము కూడ దిగ్భ్రమ కల్గించి దశ దిశలాక్రమించినది. శరవేగముతో కిరణవేగముతో[3] నభోంతరాళములను పవివలె భేదించి స్వర్గమును మర్త్యమునకు దింపినది. చలువల రేనిపై నరునికి నిలుచుటకొక నీడను గూడను కల్పించినది.[4] ఇది అద్భుతమే కాదు అనూహ్యము అపూర్వమును. ఇట్లు మానవ జీవనమునే

---

1. A key to modren English poetry.
2. శ. చ 309.
3. అంతరిక్షములో దూరమును కిరణవేగముతో (కాంతి) కొలిచెదరు.
4. 21, జులై, 1969 వ తేదీ ఆమ్‌స్ట్రాంగ్ అను మానవుడు మానవ చరిత్రలో ప్రప్రథమముగా చంద్రునిపై అడుగిడినాడు.

మొదలంట కదలించిన మహత్తర శాస్త్రీయ విప్లవ స్వరూపమును వివరించి ఆధుని కాంధ్ర కవిత్వముపై దాని ప్రభావమును ఉదాహరించెదను.

## ప్రపంచ పరివర్తనము :

సాంకేతిక పరిజ్ఞానము అజ్ఞాతముగా ఆకులో ఆకునలె అణగి మణగి కొమ్మలో కోయిలవలె కొసరి కొసరి కూసినిలిచి కాలము గడచిన కొలది బలము పుంజుకొని క్రమముగా విజృంభించి పొగ గొట్టముల భూంకార ధ్వనితో ప్రళయ శ్యేనముల భయంకరారావములతో ప్రపంచమునెల్ల తన పరిష్వంగములోనికి తీసికొనినది. మాధ్యమో ముందుచూపో కారణమున కేమిగాని పశ్చిమ ఖండ ములో తొలినుండియును మతము శాస్త్రముతో సహకరించలేదు సరికదా విజేతలై పీరణము ప్రయోగించిన విజ్ఞానవేత్తలను మతకర్తలు మారణమునకు గురిచేసినారు. దీన్నిని గూర్చి ద్వితీయాధ్యాయములో కొంత వివరించితిని.

అయినను సాంకేతిక ప్రగతి నెవ్వరును ఆపలేకపోయినారు ఇంతింతై వటుడింతయై శాస్త్రీయ విజ్ఞానము మానవుని జీవిత విధానమునే సమూలముగా మార్చివేసి విజయధ్వజమే కాదు, చంద్రధ్వజమును శుక్రధ్వజమును కూడ ఎగురవేసి మర్త్యలోకము తలపై కిరీటము తొడిగినది. భారతదేశము కూడ భూగోళముపై నొక భాగమే కదా !

**రెండు దృక్పథములు :** భారతదేశములో 1920 నుండి 1964 వర కును సాగిన చరిత్రను పరిశీలించినచో మనకిందు రెండు ప్రధాన మార్గములు గోచరించును. రెండు ప్రముఖమైన జీవన విధానములు కన్పడును. ఇందు మొదటి రీతికి గాంధీజీ రెండవ పద్ధతికి నెహ్రూ పండితులు నాయకత్వము వహించినారు. గాంధీజీ స్వాతంత్ర్యోద్యమమునకు జాతీయాత్మ కేంద్రబిందువు. అనూచానమైన పరంపర ఆర్షమైన విచారధార తత్వ చింతనలు ప్రాతిపదికలు. వారు నిర్మించిన జాతీయోద్యమము మొత్తమును 'స్వదేశీ' వాయువుతో నిండినవి. రామరాజ్య కల్పనము దీనికి లక్ష్యము కావుననే ఈ యజ్ఞవహ్ని నుండి వెడలిన తేజస్సు మానవునిలోని కాయకమునకు కర్మణ్యతకు ప్రాధాన్యము కల జీవన పద్ధతిని వెలిగించినది. వ్యక్తిలోని శక్తిని రగిలించినది. ఇందుండి లేచిన శిఖలే ఖద్దరు ఉద్యమము కుటీర పరిశ్రమలు మొదలైనవి కాని నెహ్రూ పండితుని

నాటికి దేశకాల పరిస్థితులలో కొంత పరిణామము వచ్చినది. గాంధీజీ విశ్వాత్మను యెద స్థగిత మొనరించుకొన్నచో నెహ్రూజీ విశ్వనాగరికతను ప్రతిబింబించి నాడు. గాంధీజీ గ్రామోద్ధరణమును తన ఉద్యమమునకు కార్యరంగముగా స్వీక రింపగా - నెహ్రూజీ నగరములలోని వేనకువేల ప్రజల కన్నీటిని పన్నీటిగా మార్చుటకు కంకణము కట్టుకొనినారు. కావుననే స్వాతంత్ర్య సిద్ధికి పిమ్మట రాట్నము స్థానమును రాచీ కర్మాగార మాక్రమించుకొనినది. హృషీకేశములో పాశ్చాత్యౌషధ కర్మాగారము వెలసినది. మానవుని హస్తమునకు బదులు మరకు ప్రాముఖ్యము హెచ్చినది. గాంధీజీ - నెహ్రూజీ - ఇర్వురును యుగపురుషులే, మానవతావాదులే. ఇర్వురును భారతదేశ భవితవ్యము కొఱకు జీవితము అంకి తము చేసినవారే. కాని వారి మార్గములు మాత్రము భిన్నములు, కీలకమైన యీ రహస్యము గమనింపనిదే భారతదేశ సాంకేతిక విప్లవగాథ అవగతముకాదు.

**పారిశ్రామిక ప్రగతి :** నెహ్రూ పండితుడు భారీ పరిశ్రమలే మన నవీన దేవాలయములని ప్రకటించుటతో తెలుగునాట కూడ నూతనయుగ శంఖారా వము మ్రోగినది. అధిక సంఖ్యాకులకు విద్య, అధిక సంఖ్యాకులకు పని లక్ష్యములు పెద్దపెద్దగా పరిశ్రమలు కర్మాగారములు దేశము నలుమూలల నెల కొల్పబడినవి "చిరుతిండ్లు ఎన్ని తిన్నప్పటికీ కడుపు నిండుతుందా? విస్తరినిండా నంజుళ్లు ఎన్ని వడ్డిస్తే మాత్రం వాటితో ఆకలి తీరుతుందా? .... దేహపుష్టికి కడుపునిండా అన్నం పడాలి అలాగే మన రాష్ట్రంలో చిన్నతరహా పరిశ్రమలు కాని చేతి పరిశ్రమలు కాని అనుబంధ పరిశ్రమలు కాని ఎన్ని వున్నప్పటికీ అవన్నీ చిరుతిండ్లు నంజుళ్ళు వంటివే. రాష్ట్ర ఆర్థిక స్తోమతకు నిరుద్యోగ నిర్మూలనకూ పనికి వచ్చేవి భారీ పరిశ్రమలే'[1] అను నిర్వచన మీ నవయుగ నిర్మాణ కార్యక్రమములోని మౌలికమైన తత్వము.

**ఉద్యమ స్వరూపము :** ఈ ప్రగతిని సాధించుటకై మన ప్రభుత్వము పంచవర్ష ప్రణాళికలు రూపొందించినది. ప్రథమ ప్రణాళికలో మొత్తము మన వ్యయము 64·32 కోట్లలో నీటి పారుదల విద్యుత్తులకే 39 78 కోట్లు వెచ్చించి

1. రాష్ట్ర సమాచార పౌర సంబంధశాఖ వారి ప్రచురణ 'ప్రగతి కోసం పరిశ్రమలు' గ్రంథమునుండి.

పారిశ్రామిక ప్రగతికి తోడ్పడినది ద్వితీయ ప్రణాళికా కాలమున తిరిగి తెలుగు నాట 18.74 శాతము, అనగా 90 కోట్లు విద్యుదుత్పత్తి పథకములకై వెచ్చించి నది. దీనివలన అదనముగా 5 42 లక్షల కిలోవాట్ల శక్తి పెరిగినది. ఇట్లే తృతీయ ప్రణాళికా కాలములో మన 482 కోట్లలోను వ్యవసాయమునకు 112 కోట్లు నీటి పారుదల విద్యుత్తులకు 216 కోట్లు పారిశ్రామిక ఖనిజ సంపదల వృద్ధికై 45 కోట్లు రవాణావృద్ధికి 26 కోట్లు కేటాయింపబడినవన్నచో కేవలము పారిశ్రామిక ప్రగతికే ప్రాముఖ్యము నిచ్చి రూపొందించిన ప్రణాళికయని స్పష్ట మగును. నాల్గవ ప్రణాళికలో భారీ పరిశ్రమలు, వ్యవసాయాభివృద్ధుల కొరకు ఇంతకన్నను ఎక్కువ శ్రద్ధ చూపబడినది.

ప్రస్తుతము ఆంధ్రదేశములో సుమారు 588 జాయింట్ స్టాక్ కంపెనీలు పని చేయుచున్నవి. ఇవి త్వరలో పెరిగెడి సూచన కలదు. భారీ పరిశ్రమలలో 150000 టన్నులు సాలీనా ఉత్పత్తి చేయగల పంచదార కర్మాగారములున్నవి. ఇవిగాక వనస్పతి తయారుచేయు కర్మాగారము లేదు. సబ్బు కర్మాగారములు రెండు, జనపనార మిల్లులు నాలుగు, అసంఖ్యాకమైన బియ్యపు దంపుడు మిల్లులు ప్రత్తిని బేళ్లు కట్టు యంత్రములు, వేరుశనగ పిండి, నూనె తీయు యంత్రములు పొగాకు బేరన్లు, పెట్రోమాంగనీసు కర్మాగారము రెండు పింగాణీ పరిశ్రమ కేంద్రములు గాజు ఫాక్టరీలు నెలకొల్పబడినవి ఇట్లే నెల బొగ్గు బంగారము తెల్ల మట్టి అభ్రకము పంచదార వస్త్రములు ఆల్కహాలు నూలు, సిగరెట్లు ఉత్పత్తులు విపరీతముగా పెరుగుచున్నవి.[1]

ఫలితముగా కాడెద్దుల స్థానమును ట్రాక్టరులాక్రమించినవి. నగరము లన్నింటికిని నలువైపుల పారిశ్రామిక క్షేత్రములు వెలసినవి. ప్రభుత్వ రంగ ములో 260 కార్ఖానా భవనములు నెలకొనినవి. ప్రైవేటు రంగములో 247 ప్లాట్లు సిద్ధమైనవి. 13 చిన్నతరహా యూనిట్లు ప్రభుత్వము చేపట్టినది. ప్రపం చములోని వ్యోమగామ క్షేత్రముల చిత్రములో నెల్లూరు జిల్లాలోని శ్రీహరికోట చేరినది. విశాఖపట్టణము పట్టణమే పెద్ద పారిశ్రామిక నగరమై భూజల వాయు

1. ఈ సంఖ్యలు వివిధ పారిశ్రామిక సంస్థల అధినేతలనుండి (Disectors) పంచవర్షీయ యోజనా గ్రంథముల నుండి విజ్ఞాన సర్వస్వముల నుండి సేకరించితిని (1970).

మార్గములలో మన కీర్తిని నలుదిశల వ్యాపింప జేసినది. నాగార్జునసాగర నిర్మాణముతో బుద్ధుని పాదతీర్థము భక్తులకే కాదు అందరు వ్యక్తులకును అందుబాటులోనికి వచ్చినది. శ్రీశైలములో మల్లికార్జునుని పాదపద్మముల దాపున నవీన జల దేవాలయమునకు నెహ్రూ పండితుడు పునాది వేసినాడు. దీనివలన ఆర్థిక శాస్త్ర పితామహుడైన ఆడమ్‌స్మిత్[1] కలలకు కార్యాచరణమా అనునట్లు ప్రాంతమునకు ప్రాంతమే ఒక పెద్ద కర్మాగారముగా మారిపోయినది. ఒకనాటి కాగితము, వెండి, తివాచీలు, అల్లికలు మొదలైన కుటీర పరిశ్రమలన్నియును భారీ పరిశ్రమలుగా మారిపోయినవి. భారతీయు డూహించని పరివర్తనమిది.

**ప్రభావములు :** దీనివలన జాతిగతిలో అసాధారణ పరిణామములు కలిగినవి మానవుడు ప్రధానముగా ఆర్థిక జీవిగా మారిపోయినాడు. ఉత్పత్తి వినిమయములు పరస్పర సంబంధము కలవి కావున వస్తువుల సముపార్జనకై అధిక ద్రవ్యార్జన మవసరమైనది. నిన్నటి విలాస వస్తువు నేడత్యవసర వస్తువుగా మారిపోయినది. అధిక వ్యయమునకై అధికాదాయము అధికాదాయమునకై అధికోత్పత్తి, అధికోత్పత్తికై అధిక వ్యయము- ఇట్లు ఆద్యంతములు లేని వలయములో ఆధునిక మానవుడు సంచరింపసాగినాడు. ఉత్పత్తికి మించి వినియోగము జరుగుచున్నప్పుడు ఉత్పత్తిని పెంచుట వినియోగము చేసెడి వారిని తగ్గించుట- రెండు పద్ధతులు ప్రభుత్వ మీ రెండింటిని రెండు ఉద్యమముల క్రిందికి మార్చినది. అవి,

(i) అధికోత్పత్తికై ప్రచారము.
(ii) కుటుంబ నియంత్రణములు.

ఈ పారిశ్రామిక విప్లవమువలన పల్లెలు తరిగి పట్టణములు పెరిగినవి. జీవనోపాధికై అందరును నగరముల నాశ్రయించుటతో నాగరిక జీవనము మరుభూమి (Waste Land) యై గోచరించినది. వర్ణవ్యవస్థ, మత సిద్ధాంతములు

1 ఆడమ్‌స్మిత్ తన సుప్రసిద్ధ గ్రంథము 'An inquiry into the nature and causes of wealth of nations' లో దేశమంతయును బ్రహ్మాండమైన కర్మాగారమని, దేశీయులెల్లరును కార్మికులేనని ప్రతిపాదించినారు.

ఆర్థిక వ్యవస్థకు దాసోఽహమనినవి. ఫలితముగా వర్గ సంఘర్షణము నేటి చైతన్యమునకు కేంద్రబిందువైనది. సమాజవాదము, జాతీయవాదములు రెండును సరిజోడై నిలిచినవి మతము హేతువాద హేతిముందు కింకర్తవ్యతావిమూఢయై నిలిచినది. మానవుని జీవనగతిలో సంధ్యోదయమైనది. అటు కునుకు దీయని చీకటి, ఇటు పొడుపెరుగని వెన్నెల. మధ్యలో గమ్యమెరుగక భ్రామికుడైన తెలుగు పాఠకుడు నిలిచినాడు. పతితతోడిదే సాహిత్యమును, స్రష్టల సృజనాత్మక రీతులును. కావుననే మార్క్సు, ఇలియట్, మల్లార్మేల వంటి వైదేశిక పుష్పముల పరపరాగ సంపర్కముతో తెలుగునాట మందారములు విరబూయ సాగినవి. ఇట్లే శాస్త్రీయ విప్లవ ప్రభావముతో మారిపోయిన తెలుగు సాహిత్య రీతులను విశ్లేషణాత్మకముగా ప్రదర్శించెదను.

**శాస్త్రముల కథ :** శాస్త్రీయ యుగములో శాస్త్రములే కథావస్తువులైనవి. వచనములో చెప్పవలసిన శాస్త్రీయ సత్యములను కవులు వృత్తములలో ఇతివృత్తములతో చెప్పసాగినారు. ఒకనాడు అశ్వశాస్త్రము, సస్యానందము, ఖడ్గశాస్త్రము వెల్వడినట్లే కాలము కోరికను అవసరమును అనుసరించి వసంతరావు వెంకట్రావుగారు 'సైన్సు'ను తమ 'విశ్వవిన్యాసమ'ను గ్రంథములో సరళమైన కవితా మార్గములో ప్రపంచించినారు.

> 'చంద్రలోక మందు సాగరమ్ములు లేవు
> నదతటాక కూప నదులు లేవు
> నీటిచుక్కయైన లేటె చంద్రుని యందు
> వాస్తవ మ్మెఱుంగ వశమె మనకు?'[1]

అని చంద్రుని నిజస్వరూపమును వివరించినారు. 'యంత్ర సౌకుమార్యం పెంపొందుతున్న కొద్దీ నూతన జ్ఞానాన్వేషణ సాధ్యమౌతుంది.'[2] ఈయన్వేషణను శాస్త్రవేత్తలు జగద్ధితార్థము ప్రచురింపదలచి 'వైజ్ఞానిక విషయాలపై పద్యాలు వ్రాయడం అవసరమని'[3] భావించినప్పుడది పద్యకృతిగా రూపొందును ఇందు కవిత్వాంశము స్వల్పము. కేవలము శాస్త్రీయ విజ్ఞానమును యథాతథముగా ఛందములో చెప్పుటే కవి కర్తవ్యముగా భావించినారు. కావున దీనిని కావ్యములలో చేర్చుటకు వీలుపడకున్నను

1. చంద్ర మండలము 48వ పుట, 45వ పద్యము
2. 3. మనవి 2, 5, పుటలు.

శాస్త్ర ప్రభావము. వలన వెలువడిన ఒకానొకశాఖలో మేలుబంతివంటి కృతి కావున ప్రస్తావించితిని ఇట్టి విం కెన్నియో వచ్చినవి.

**శాస్త్రవేత్తల కథ :** జాతీయ నాయకులు దైవములైనట్లే శాస్త్రీయ యుగములో శాస్త్రవేత్తలే కథానాయకులౌదురు. వీరి కథలనే జాతి అత్యంతా సక్తితో పఠించును. కావుననే ప్రతివాది భయంకర వేదాంతచార్యుల వారు మొక్కలకు ప్రాణమున్నదని నిరూపించి సనాతన భారతీయ ఏకాత్మ సిద్ధాంతమునకు నవీన ప్రవక్తయై నిలిచిన ఆచార్య జగదీశ చంద్రబోసు జీవితమును పద్య కృతిగా రచించినారు. కథా కథనము కవితావైభవము మనకిట పరిశీలనాంశములు కావు కావున శాస్త్రీయ విజ్ఞానమును కవిత్వముగా పరివర్తన చెందించి ఛందోబద్ధ మొనరించినపుడు కవి చూపిన విశేషమును మాత్రము పేర్కొందును సైన్సు భారతీయులకు ఆంగ్ల భాషనే వాహికగా చేసికొని లభించినందు వలన కవిగారు సాంకేతిక పరిభాష కొరవడినచోట, ఆంగ్ల పదములే యథాతథముగా ప్రయోగించినారు.

ఉదా॥ 'స్ఫటికమౌ నెమిలైటును సంతసించె' (289 పు)

'విపరీతంబుగ నా రిసీవరులు నిర్వేదంబు కల్పించె' (291 పు)

'ఈథరు తరంగ ప్రతిక్రియ యెంచగావలెన్' (300 పు.)

'ఐ. సి. ఎస్. అన్నిటిలో' (116వ పుట.)

ఈ శబ్దప్రయోగము చమత్కారార్థము కమింగ్స్ ప్రభావముతో అధివాస్తవిక కవులు సాగిన మార్గముకన్నను భిన్నమైనది! ఇట్లుగాక సాధ్యమైనంత వరకు సాంకేతిక పరిభాషకు కవి ఆంధ్రానువాదమునే స్వీకరించినారు. **Stimulus of gravity** కు 'గురుతదే ప్రేరణమ్మున మెఱపుగెరట' యని **Magnetic crescograph** కు 'అయస్కాంత వృద్ధి పృథులేఖక'మని **Tropic Movements** 'అనువర్తన సంచలమ్ము'లని ప్రయోగించినారు. శాస్త్రవేత్తలే కథానాయకులైనప్పు డిట్టి పరిభాషా స్వీకారమవర్జనీయము.

'సారంబే నేలయు వి

స్తార పరిశ్రమలకు ప్రసారము కనువే

భారతదేశం బీ విధి
నీరసమై యుంట శోచనీయము కాదే'యని జగదీశ చంద్రబోసు

విలపించినట్లు రచించుటలో కవి కూడ శాస్త్రీయ విప్లవమునకై పరివేదన ననుభ
వించుచున్నాడని స్పష్టమగును.

సి నారాయణరెడ్డిగారు 'జాతిరత్నం' కావ్యములో రాజకీయ శాస్త్రము నెఱింగిన పాలకుడు (Statesman) జవహరు కథను రమణీయమైన కావ్య శైలిలో వర్ణించినారు.

'పంచవర్ష ప్రణాళికలను పసిడిమెట్లుగా భావించి
ప్రాజెక్టులను దేవాలయాల ప్రతీకలుగా సంభావించిన' నాయకుని

కావ్య నాయకునిగా స్వీకరించుటకు పారిశ్రామిక విప్లవమే స్ఫూర్తి నిచ్చినది.

**స్వీయకథ :** శాస్త్రము తన స్వీయకథ చెప్పుకొనుచున్నట్లు రచించుట మఱొక శాఖ. బోయి భీమన్నగారి దీపసభ' ఈ రీతికి చక్కని యుదాహరణము ఇందు ప్రమిదె నుండి, మైనపు దీపము, బండిదీపము హరికేను దీపము విద్యుద్దీపములు క్రమముగా తమ స్వీయచరిత్రను చెప్పును. 'వివిధ పరిస్థితులకు పరిసరాలకు చెందిన రకరకాల దీపాలు తమ ప్రత్యక్షానుభవాల దృష్ట్యా ఈ సర్వోదయ సమాజ నిర్మాణావశ్యకతను ఉద్ఘాటిస్తాయి' అని గ్రంథమునకు ముందే వ్యాఖ్యానింపబడినది.

'ఎచ్చట నెవండొ దబ్బునస్విచ్చి నొక్క
పర్వు పర్వున పోయి దీపమ్ము నైతి'నని విద్యుద్దీపము తన కథ

నొక పూర్తి అధ్యాయములో వివరించును. సందర్భోచితముగా దీపసభ నాధారముగా చేసికొని కవి శాస్త్రీయ విప్లవ ఫలితముగా మారిన వర్తమాన రాజకీయ జీవనగతులను నాగరికతా విధానమును, సంస్కరణ సిద్ధాంతములను ప్రసక్తము చేసినారు

**వస్త్వాశ్రయ రీతులు :** ఇట్లుగాక కథ నాధారముగా చేసికొని మారి పోయిన సమాజ పరిస్థితులను ప్రత్యక్షముగానో పరోక్షముగానో వ్యాఖ్యానించుట మఱొక పద్ధతి ఆరుద్ర 'సినీవాలి' ఇందుకు సరియైన యుదాహరణము. పారిశ్రామిక విప్లవము వలన పరివర్తన మందిన ఆధునిక నగర జీవన చిత్రణమిం

దలి ప్రధానాంశము. క్లార్కు సూర్యారావు (ఎన్.జి వో) ఇందలి కథానాయకుడు. పొట్ట చేతబట్టుకొని నాయకుడు నగరములోని కడుగుపెట్టు నాటికే నగరము 'కుడికంట్లో పుసి మలికంట్లో కసి'తో 'తొలికథలో ఆకలి మలికథలో చీకటి'తో 'ముందుటికాళ్ల బంధమై కాలకూటమకరందమై' నిలిచినదట ఇట్లనుటలో వరుసగా 1) జుగుప్స, 2) ద్వేషము, 3) ఆకలి, 4) అవిద్య, 5) బంధనము, 6) పయోముఖ విషకుంభ ధోరణులు నగరములో పేరుకొనిపోయినవని కవి సూచించినారు.

'మగవాడి జీవితం ఒక బైసికిలు
దాని ముందు చక్రానికి బ్రేకు తండ్రి

వెనుక చక్రానికి బ్రేకు భార్య' అని మొదటి అధ్యాయములో వర్ణించుటలో శాస్త్రీయ విప్లవ ప్రభావమున్నది. పూర్వకవులు సంసారమును రథముతోనో గుఱ్ఱపు బండితోనో పోల్చిరేగాని బైసికిలుతో పోల్చుట అపూర్వము. అత్యాధునికము కదా! గ్రామీణ జీవనము విఫలమై మానవుడు పట్టణములకు నాగరిక జీవనమునకై ఎగబ్రాకుటను చూచి కవి

'పల్లెలో ప్రాణవాయువులు పీల్చలేక
బొగ్గుపులుసు గాలుల బోనులోకి సూర్యుడు

వినయ విధేయతలున్న సర్కసు జంతువులాగా' నగర ప్రవేశము చేసినాడని వర్ణించినారు. 'బొగ్గుపులుసు వాయువు' శబ్దము పొగగొట్టముల నాగరికతకు ప్రతీక. సర్కసులో జంతువుతో ఆధునిక నాగరికుని పోల్చుటతో ఆతని నిర్జీవమైన యాంత్రిక ప్రవృత్తి సూచింపబడినది. 'ఆఫీసుల కార్ఖానాలో అతి చిన్న చక్రంగా బ్రతకడానికి అంగీకరించి' సూర్యుడు అమ్ముడుపోయినాడనుటలో విప్లవ స్వరూపము నంతయును ఆరుద్ర అద్భుతముగా ఒకే వాక్యములో వర్ణించినారు. ఆధునిక నాగరికుడు స్వతంత్ర జీవికాడు. పారిశ్రామిక విప్లవ యంత్రాంగములో ఉన్న మరమేకు వంటివాడు. ఈ భావము ఇలియట్ ప్రభావముతో ఆరుద్ర ప్రవచించినప్పటికిని ఆధునికాంధ్ర దేశ పరిస్థితికి చక్కగా సరిపోయినది. తత్వమును పరిశీలించినచో ఇలియట్ మరుభూమి మాత్రము పాశ్చాత్య పారిశ్రామిక విప్లవ సాగరము నుండి వెలువడిన తరంగమే కదా!!

'క్లాక్కు సూర్యారావు క్వశ్చన్‌మార్కు
క్లాక్కు సూర్యారావు కాగితం కార్కు' అనుటలో ప్రశ్నార్థకమైన, నిర్జీవమైన, కాగితపు పూవువలె అలంకారప్రాయమైన సామాన్యుని జీవనము ఆధునిక నాగరికత వలన ఎట్లు క్రుంగిపోయినదో సూటిగా వర్ణింపబడినది. తరువాత పుంఖానుపుంఖముగా వెల్వడిన రచనలెన్నింటికో 'సిసీవాలి' మార్గదర్శకమై నిలిచినది ఇదొక శాఖకు ప్రాతినిధ్యము వహించినది.

పారిశ్రామిక విప్లవ ప్రభావముతో వస్తువేకాక శబ్దప్రయోగము అలంకారము, వ్యాకరణము కూడ పరివర్తనమందినవి. వానిని సోదాహరణముగా చూపెదను.

**(i) శబ్దప్రయోగ విశేషములు :** శాస్త్రీయ విజ్ఞానమొక దేశమునకు చెందినది కాకపోవుటచే వర్తమాన కవులు ప్రధానముగా అందుబాటులో నున్న ఆంగ్ల పదములను గౌణముగా తదితరములను కూడ స్వీకరించిరి. ఒక దశలో పఠిత యొక్క అవబోధనా సామర్థ్యము కూడ గమనింపని ప్రయోగమిది. పరిణామము కాలమే నిర్ణయించును. నేనిట తత్వమును మాత్రమే ప్రదర్శించెదను.

'వృథా పోతున్న రేడియేషన్ శక్తిని
కవితా జీవితభీమా కార్పొరేషన్‌లో జమకడతాన'[1]ని ఆధునికాంధ్ర కవి వచించుటలో శాస్త్రీయ విజ్ఞానమును సమృద్ధిగా ఉపయోగించుకొనుటతోబాటు శబ్దప్రయోగ విశృంఖలత్వము కూడ స్పష్టమగును. 'జీవితం రేడియో సెట్టుకి శత్రు ఏరియల్ ఖార్య ఎర్తు'[2] అని ఆరుద్ర సాంకేతిక పరిభాష నుపయోగించినారు. ఇట్లే అజంతా తన ఖండికలో 'పుష్‌బటన్ రాజకీయవేత్తల ట్విస్ట్ సంగీతానికి దయాదాక్షిణ్యాలు లేవు'[3] అని వర్తమాన రాజకీయ నాయకుల ధోరణిని విమర్శించుటకు పుష్‌బటన్ తత్వమును 'ట్విస్ట్' నృత్యరీతిని ఉదాహరించి ఆంగ్ల పదములను యథాతథముగా వాడినారు. 'ఇది పసితనం ప్లస్ వెర్రితనం యింటూ డికెడెన్సు'[4] అని గణిత శాస్త్రపద జాలమును ప్రయోగించుటలో పారిశ్రామిక

---

1. శీనవాజ్ 'సీరసమధనం' ఖండిక నవత -
2. సిసీవాలి.
3. అజంతా 'జండాలకు కన్నీళ్ళులేవు' నవత.
3. బాలగంగాధర తిలక్, నవత.
4. ఓటో

విప్లవముతో ప్రభావితుడైన కమింగ్స్ యొక్క ప్రభావమున్నది. ఇదే పద్ధతిలో ఆంగ్ల పదములను రోమన్ లిపిలోనే పెక్కురు రచించినారు. 'కవిత్వం ఒక Alchemy' అనుట యిట్టిదే. సింగరాచార్య, పూషా, వంటివారు అధివాస్తవికోద్యమ కాలములో హిందీ శబ్దములను ఇంగ్లీషు మాటలను ఇట్లే ప్రయోగించినారు.

**(ii) అలంకార విశేషములు:** వెనుకటివలె నేడు చంద్ర వదనయనుటకు కవి సంకోచించుట స్పష్టమే. శాస్త్రీయ విప్లవము వలన కవి సమయములు రూపు మార్చుకొని నిలిచినవి కావుననే 'ప్రియురాలి చూపులు రాకెట్లు'[1] ని తెలుగు కవి ఖండాంతరవేధుల స్వభావమును సంకేతముగా స్వీకరించినాడు. 'ఈ ప్రపంచాన్నెవడో నైట్రిక్‌యాసిడ్లో ముంచాడని'[2] కవి తన భావతీవ్రత కనుగుణమైన స్వభావము కల ఆమ్లము యొక్క రసాయనిక చర్యతో భావవ్యక్తీకరణములో సౌలభ్యము సాధించినాడు 'నేనేం వంకాయనా సల్ఫేటుకు పెరగడానికి'[3] అని మఱొక కవి పలుకుటతో వంకాయలను సల్ఫేటును ఎరువుగా వాడి పండించుచున్నారను వృక్షశాస్త్ర విజ్ఞానము కూడ కవిత్వములో చోటు చేసికొనినది. కవి సల్ఫేటుకు పెరిగిన వంకాయ కాకున్నను సల్ఫేటుతో పెరిగిన వంకాయతో పెరిగినవాడే కదా! ఇట్లే అద్వైతత్వమేవాహంలో గణితశాస్త్రము వృక్షశాస్త్రముల నాధారముగా స్వీకరించి వర్గకలహ సిద్ధాంతమును వ్యాఖ్యానించినాడు. 'ఒక్క చాంద్ర విశ్వకళా పరిషత్తులోనే ఇరవై యేడు కాలేజీ'[4]లని బోయి భీమన్న గారనుటలో కవి ఖగోళశాస్త్రము నాధారముగా చేసికొని వైచిత్రి సాధించినారు. 'మధుర భావాలకు మార్కెట్ లేదనుట'[5]లో కవిత్వముతోపాటు వాణిజ్యమును పతితకు దర్శనమిచ్చినది పాశం చెన్నకేశవరెడ్డి తన 'కాంతిచక్రం' ఖండికలో

'సప్తవర్ణ సంకీర్ణమై శ్వేతవర్ణమైనట్లు నాలోని
భిన్న భావసంఘర్షణమే ఏకత్వమందిన చాలను'[6]టలో భౌతిక శాస్త్ర

---

1. నాయని సుబ్బారావు. భాగ్యనగర కోకిల
2. దుర్గానంద్, అంతర్గోళాలు.
3. బండి నాగరాజు, అమాయికం, ఖండిక, భారతి డిసెం. 1966. 1వ పుట
4. బోయిభీమన్న. అనాది కొసనుంచి అనంతత్వంలోకి
5. అదే.
6. జ్యోతిర్మయి, సంకలనం

మునకు సంబంధించిన 'Dispersion of Light' తత్వమును కవి భావవ్యక్తీకరణకు అలంకారముగా స్వీకరించినాడు. దాశరథి

'కాటరాక్ట్ ఆపరేట్ చేయించుకోండి
జాతికి రెటీనా డిటాచ్‌మెంట్ జరిగిందా
జన్మజన్మాలకి కళ్ళు కన్పడవు'[1] అని నేత్ర వైద్యమునకు సంబంధించిన పరిభాషతో జాతి కన్నులు తెరువవలెనని ప్రబోధించినాడు. కేశవరావ్ 'మనసులోంచి మనసుకు వేసుకున్న ఎలక్ట్రిక్ తీగెలు తెగిపోయినై'[2] అనుటలో ప్రేమను విద్యుత్తుతో పోల్చి భావప్రసారమును ఎలక్ట్రిక్ తీగెలుగా భావించుటలో కవి భౌతికశాస్త్రమునకు చెందిన Heat & Electricity పరిభాషను ఆధారము చేసికొనినాడు. ఇట్లు వివిధ శాస్త్రములు వాని పరిభాషలు శాస్త్రీయ విప్లవ ఫలితముగా తెలుగు కవిత్వములోనికి ప్రవేశించినవి.

**(iii) సమాస విశేషములు :** పాల్కురికి వంటి మహాకవుల ప్రయోగము లుండుటచే గత్యంతరము లేక వైయాకరణులు 'ఆర్య వ్యవహారంబులదృష్టంబు గ్రాహ్యంబు'[3]ని వైరి సమాసములకు గతిని కల్పించినారు. కాని పారిశ్రామిక విప్లవమీ 'వ్యాకరణాల సర్ప పరిష్వంగము'లను ఛట్ ఛట్ మని త్రెంపివేసి వైరి సమాసములేమి, వైదేశిక సమాసములనే కల్పించినది, ప్రాచీనమైన అలంకార శాస్త్రమును తిరస్కరించినప్పుడు నవ్యులు చమత్కృతికై అనుప్రాస తప్ప మఱొక శబ్దాలంకారము నాశ్రయించలేదు. కావున వైదేశికమైన పదముల సమ్మేళనతో వైచిత్రిని సాధించినారు. పోతుకూచి సాంబశివరావుగారు 'బీరు పోయగానే బీర్బలు దయ్యేరా'[4] అని బీరు పానీయమును త్రాగినవాడు ఉత్సాహవంతుడుగా మారెనని అక్బరు దర్బారులోని బీర్బలుడను చమత్కారజ్ఞుని పేరు స్ఫురించునట్లుగా 'బీర్ + బలుడు' అను పదములను అనుచితముగా సమసించి చమత్కారమును సాధించినారు. అట్లే రైక్షికుడు క్రిటిక్ మిత్రుడు మనస్ చెలి

---

1. అమావాస్య దీపాలు. ఖండిక పునర్నవం. 102 వ పుట.
2. సంధ్యాగీతం ఖండిక 54 వ పుట. ఉదయించని ఉదయాలు.
3. బాల వ్యాకరణము సంజ్ఞా 23 సూ.
4. పోతుకూచీయం. 18 వ పుట, 39 వ పద్యము.

విజన్[1] మొదలైన సమాసములను గోపాలచక్రవర్తిగారు కల్పించుటకు కారణము కేవలము శాస్త్రీయ విప్లవ ప్రభావమే! ఆధునిక కవులు తమ ఖండికలకు కాస్మిక్ జాతికోసం[2] పంద్రాగస్టు[3] ఆడ్అవర్స్[4] మొదలైన ప్రతిజ్ఞలు నిర్ణయించుటలోనే వారి శబ్దవైచిత్రీ ప్రియత్వమును శాస్త్రీయ విజ్ఞాన ప్రభావమును ద్యోతకమగును.

**భావ విప్లవము:** శబ్దమువలెనే అర్థము కూడ విప్లవ ప్రభావముతో మహత్తర పరివర్తనకు లోనైనది. సామాజిక వ్యవస్థ సాంఘిక జీవనము అనూహ్యమైన పరిణామమునందుటతో సమాజమునకు ప్రతినిధియైన కవి యీ విప్లవమునకు దర్పణమై నిలిచినాడు. భౌతికముగా సౌకర్యములు వృద్ధినందుట నిజమే కాని సాంకేతికమైన ప్రగతికి రెండవ ముఖమూ యనునట్లు సామాన్యుడు తన సారహీనమైన జీవితమును తానే నిందించుకొనుట ప్రారంభించినాడు. ఆత్మహత్యా సదృశమైన ధోరణి యిది. కేవలము ధోరణి యననేల హత్యలు, ఆత్మహత్యలు సమాజములో అనుదిన కార్యక్రమముగా మారి హత్యాసాహిత్యము నిత్యజీవితావసరమైనది. ఇదొక విషాదకరమైన పరిణామము.

మొత్తము మీద శాస్త్రీయ విప్లవమువలన సంభవించిన హానివృద్ధుల విశ్లేషణ మిట్లున్నది.

**(1) రాజకీయ చైతన్యము:** విద్య (లౌకికము) యంత్రాశ్రయమైనందువలన సాంకేతిక విజ్ఞాన జ్యోతిస్సులు నలుదెసల వ్యాపించిన కొలది అవిద్యాంధకారము పటాపంచలై పోయినది. (అవిద్యా శబ్దమిట సామాన్యార్థములోనే ప్రయోగింపబడినది లౌకికమైన విద్యవృద్ధి నందిన కొలది ఆధ్యాత్మిక విద్య నశించుట విచిత్రమైన పరిణామము.) అక్షరాస్యత సామాజిక చైతన్యమునకు దోహదము కల్గించినది. దానివలన రాజకీయాధికారము పారంపర్యము కాక సామాన్యునికి కూడ అందదగిన ద్రాక్షపండుగా మారినది. చర్మకారుని కుమారుడు సామ్రాజ్యము పాలించినాడు. మద్దంగి కుమారుడు మద్దంగి కానక్కర

1. ఆనందం జీవనది
2. దిగంబర కవితా సంపుటి.
3. డిటో
4. రాత్రి సంకలనం. వరవరరావు ఖండిక

లేదు. విశ్వవిజయమును కూడ ఆకాంక్షించుట కవకాశమున్నది. పారిశ్రామిక విప్లవము వలన అధికారము, ధనము, కేంద్రీకరణ ఒకవైపు- విజ్ఞానము, శ్రామిక చైతన్యము, మఱొకవైపు- ఏకకాలములోనే పురోగమించుట విశేషము. భారతదేశములో ప్రజాస్వామ్యము పారిశ్రామిక చైతన్యము చెట్టాపట్టీలు వేసికొని ముందుకు సాగినవి. ఓటు హక్కు మానవునికి తన అస్తిత్వము, ప్రయోజనముల యెడల విశ్వాసమును ప్రతిష్ఠించినది. కావుననే తెలుగు కవి స్వేచ్ఛగా తనకు కావలసిన రాజకీయ సిద్ధాంతమును ఆహ్వానించినాడు. ప్రయోగదశను దాటుచున్న రాజకీయ శాస్త్ర పరిజ్ఞానమున కిది సంకేతము. నార్ల వేంకటేశ్వరరావుగారి 'వాస్తవమ్ము నార్లవారి మాట' శతకము ఈ భావమునకు ప్రతిబింబము.

'వ్రాయబోడుసుమ్ము వాల్మీకి నేడున్న
రఘుకులమ్ము గూర్చి రాముగూర్చి
ప్రజకు నేడతండు పట్టమ్ము కట్టును
వాస్తవమ్ము నార్లవారి మాట' అనుటలో రామరాజ్య వ్యవస్థతో

ఏకచ్ఛత్రాధిపత్యమున్నది కావున దానికన్నను ప్రజాస్వామ్యమ్మే మిన్న యని కవులకు నవీన వస్తువును ఉపాదేయమ్ముగా ఉపపాదించినారు.

'వర్గ కలహమొకటి స్వర్గమార్గము కాదు
ప్రగతిలేదు రక్తపాతమందె
మార్క్సుదొర యొకండె మార్గదర్శియు కాదు' అని వర్గ సంఘర్షణ సిద్ధాంతమును మార్క్సు వాదమును తిరస్కరించినారు. స్వేచ్ఛగా భావ

వ్యక్తీకరణము సాగించుట ప్రజాస్వామ్యము ప్రతిపాదించిన హక్కులలోనొకటి. కావుననే నార్లవారు రక్తపాతమందు ప్రగతి లేదని యెంత తీవ్రముగా స్పష్టముగా చెప్పినారో అంతే తీవ్రముగా శ్రీశ్రీ 'గాంధేయ సిద్ధాంతము వెన్నెముకలేనిద'[1]ని నిర్భయముగా చాటి ఆయుధమే సమస్యలను పరిష్కరింపగలదని ప్రతిపాదించినారు.

'ఆశయాలు సంఘర్షించే వేళ
ఆయుధం అలీనం కాదు....

---

1. ప్రగతి, వారపత్రిక తొలి సంచికలలో శ్రీశ్రీ. ప్రశ్నలకు జవాబులులో (1969)

అందుకే అంటున్నాను నేను
అందుకో ఆయుధం అని'[1] అని సాయుధ సంఘర్షణమే సమస్యా పరిష్కార మార్గమని శ్రీశ్రీ వర్గ కలహ సిద్ధాంతముకు పునరుద్ఘాటించినారు. శాస్త్రీయ విజ్ఞాన ప్రభావమిది. మల్లాది రామచంద్రశాస్త్రిగారి 'ఆహా ఎంత విచిత్రము'[2] శతకము శివారెడ్డి, కవితలు[3] ఈ జాతికే చెందినవి.

(2) **హేతువాదము:** శాస్త్రము విశ్వాసమును తిరస్కరించి హేతువాదముతో పురోగమించును. దీనివలన మతవిశ్వాసము లీ యుగములో ప్రశ్నార్థములై నిలిచినవి. శ్రీశ్రీ సదసత్సంశయ[4] ఖండికలో భాగవతమందలి గజేంద్రమోక్షమును నిశితముగా విమర్శించి తిరస్కరించినారు. సి. విజయలక్ష్మి తన విషాద భారతంలో "డార్విన్ జీవపరిణామ సిద్ధాంతంపై థీసిస్ వ్రాసి డాక్టరేట్ గడించిన సైన్సు లెక్చరర్ ఊళ్లో కలరా వస్తే ఇంట్లో పోలేరమ్మకి చద్దినివేదన"[5] చేయుటను అవహేళన చేసినారు. 'పెళ్లానికి టైఫాయిడ్ వొస్తే ఏసు ప్రభువును ప్రార్థించే పీటర్ ప్రభాకరం'[6] విమర్శింపబడుటకు కారణము ఔషధమును మించిన అతిలోక సత్యములేవియును మానవుని రక్షింపజాలవను హేతుపూర్వకమైన విశ్వాసమే! విప్లవము, క్రాంతి స్వర్గములో లభింపవు గావున విశ్వాసముపై ఆధారపడిన స్వర్గముకన్న ప్రత్యక్షమైన భూలోకమే తనకు రావలెనని తెలుగు రచయిత్రి వాంఛించినది.

"భూలోకం బాగుంది.... ...
మంత్రులుండె మార్పు వుండె
ఈర్ష్యా ద్వేషం రోసం
వేషం మోసం జూదం

1. ఖడ్గసృష్టి 2వ పుట.
2. కృష్ణా పత్రికలో ధారావాహికముగా ప్రచురణ 1965.
3. జమీన్ రైతులో ప్రచురణ.
4. ఖడ్గసృష్టి 59వ పుట.
5. విషాద భారతం మహాప్రస్థాన పర్వం
6. విషాద భారతం. మహాప్రస్థాన పర్వం.

అణువు పరమాణువు
రాకెట్ స్పుట్నిక్‌లుండె
ఎల్లప్పుడు భయముండె—
స్వర్గంలో ఏముంది భూలోకం బాగుంది[1] "అని చివరకు ఈర్ష్యా ద్వేషములు. భయము కూడ మానవీయమైన గుణములే కావున మానవోపాసనమే ఈశ్వరోపాసనమని భావించిన హేతువాద యుగమందలి కవి వెలుగు చీకటులను రెండింటిని ఆహ్వానించినాడు. మతమును గతములో వదిలి కేవల హేతువాదము తోనే పురోగమింప జూచినాడు.

"మతాన్ని ముక్కలు ముక్కలుగా నరికి
గతం అడవిలో మృగాలకి వదిలేసి"[2] సాంకేతిక విజ్ఞానము మీదనే మనుగడ సాగింపవలెనని ఆకాంక్షించినాడు. శాస్త్రీయ విప్లవ యుగములోని సహజమైన తొలి పరిణామము లివి.

(3) **భోగలాలసత్వము :** భౌతికమైన విజ్ఞానము మానవునిలోని కోరి కలను రగిలించును. నిగ్రహము సంయమనమును విదిలించును. మరణానం తర జీవితమును విశ్వసింపక ఉన్నంతలోనే సుఖింపవలెనను భావమునకు ప్రోదియై నిలుచును. దశాధికములైన ఉమర్ ఖయాము అనువాదము లీనాడు వెలువడుట కిది ప్రధాన కారణము. చిత్రభాను 'ఉమర్ ఖయ్యాంకు ఉత్తరం' అను ఖండికలో

"డియర్ ఉమర్
అధరసుధను త్రాగి అమరుడవైన ఉమర్
నిన్నా- రేపు- రెండూలేవు నీకు
ఈ క్షణం గురించే అనుక్షణం ఆలోచించమన్నావు
నీ వకాల్తా నేను పరిగ్రహిస్తున్నాను"[3] అని అతినవ్య కవుల భావ

---

1. కుమారి యలమాటి క్రాంతికుమారి 'దర్శన' సంకలనం.
2. 'నిశిలోంచి నిజంలోకి' కేశవరావ్ కృతి 'ఉదయించని ఉదయాలు' 94వ పుట.
3. రాత్రి సంకలనం 26వ పుట.

ముల కొక ప్రతీకగా నిలిచి చాటినాడు. 'నాకు మాత్రం స్కాచ్ విస్కీయే అమృతోపమానం'[1] అని జంకు లేకుండ చెప్పినాడు

'సైన్సువల్ల ఈ రోజున సామాన్యుని బతుకు కూడ
సౌందర్యమయం కాగల సదుపాయం లభించింది'[2] ఆ సముదాయము తో 'Jazz Rumba Carioca హుషారిస్తాయ్ నిషా చేస్తాయ్'[3] కావున వానినే సేవింపవలెనని శ్రీశ్రీ చెప్పినాడు.

"ఒక Cup కాఫీ ఒక పఫ్ Cigarette తమాంషుద్"[4] అనుటలో సామాన్యమైన లౌకిక సుఖములను మించి శాస్త్రీయ విజయములకు చకితుడైన మానవుడు అతిలోక సత్యములను చింతించుట లేదని స్పష్టమగును. యుగోచితమైన ధోరణి యిది !!

(4) **కాలజ్ఞానము :** శాస్త్రీయ విప్లవములవలన కాలమును గూర్చిన చైతన్యము మానవునిలో ప్రవృద్ధమానమైనది. ఐన్‌స్టీన్ నిర్వచించిన నాల్గవ పరిణామముతో సాంకేతిక పరిజ్ఞానము ఆకాశము వంటి, ఇలియట్ ఫెచ్. జి. వెల్సుల నాటికన్నను ప్రగతిని సాధించినది మానవుడు కాలముతో కాలముతో దూసుకొని ముందుకు పోసాగినాడు. బ్రౌనింగ్ 'నాతో కాలగర్భములోనికి ముందుకు ప్రయాణము చేయుము. ఇంకా మంచిరోజులు ముమ్ముందే కలవ'[5]ను ఆశయే మానవునికి అమృతప్రాయమై బ్రతుకుకు చోదకశక్తియైనది. భూగోళము నకే పరిమితమైన మానవుడు విశ్వాంతరాళ యానముతో అక్షరాల 'దిక్కులేని వాడైనాడు.' పారిశ్రామిక విప్లవమునకు కాలము- వేగము రెండును రెండు నేత్రములు. కావుననే ఆధునికాంధ్ర కవిత్వము కాలవేధియైనది. సెకనుకు 186000 మైళ్ల కల కాంతివేగముతో పురోగమించి క్రమముగా కాలవేగమును కూడ అధిగమించినచో నేటి తరువాత రేపుకు బదులు నిన్న రావచ్చునను సత్యమును తెలిసికొన్నాడు. దీనివలన అతని ఊహలు అద్భుతములైనవి. ఆశలు

1. రాత్రి సంకలనం
2, 3, 4. రుబాయత్- ఖడ్గసృష్టి. 47వ పుట.
5. 'Grow old with me, the best is yet to be' Rabbi Ben Ezra. Robert Browning.

అపరిమితములైనవి ప్రబద్ధతైన అణువును మానవుడు చూచినాడు. చంద్రునిపై నుండి, ఉదయించెడి భూగోళము నాతడు దర్శించినాడు దీనివలన ఆనందము ఆందోళనము ఆశ- నిరాశ బ్రతుకుపై తీపి మరణమువైపు చూపు ఒకేసారి విచిత్రముగా విజృంభించినవి యాంత్రిక యుగవైశిష్ట్య మిది.

ఒకనాడు దినపత్రికలో అస్సాంలో మిడిల్ స్కూలు లీవింగ్ సర్టిఫికెట్ పరీక్షలో బాలుడు వాల్మీకి తాజమహల్‌లో కూర్చొని రామాయణమును వ్రాసెనని జవాబిచ్చుటను విస్తారముగా ప్రకటించిరి. దాని చూడగానే తెలుగుకవి గోపాల చక్రవర్తి యెద పులకించినది. బాలుడెరిగిన కాలజ్ఞానమును ప్రజలేమెరుగుదురని భావింపసాగినాడు.

"ఎవరికి అర్థంకాదు ఐన్‌స్టినీయం (నాలుగో పరిణామం)
ఎవరూ ఆమోదించరు ఈ పసివాళ్ల అందమైన డిస్కవరీ"[1] అని

నిన్న- నేడు- రేపులను సాపేక్ష విభజనములు నశించిన అనంత కాలతత్వమును కవిత్వములో ప్రతిపాదించినారు. కాలము సాపేక్షమైనది కావున 'నన్ను సూత్యుని తీసివేసిన, నిన్న నేటికి భేదమేమిట'[2]ను ప్రశ్న తెలుగుకవి మదిలో తీంబ్రడించి నిలిచినది.

'కాలాన్ని హత్యచేసి కాలం దాని స్థానాన్ని ఆక్రమించి తిరిగి హతమౌతుంది. మరుక్షణం'[3] అని మాదిరాజు రంగారావుగారనుటలో క్షణక్షణమును గతములోనికి కరగిపోయెడి కాలహేలను లీలను చూచి కవి చకితుడైనాడని తెలియును. ఈ కాలమునకు గడియారమును సంకేతముగా తెలుగు కవులు స్వీకరించినారు.

'గడియారం క్షణాల్ని ఉరితీస్తోంది'[4] అనుటలోని తత్వమిదే. ఒకవేళ యాంత్రిక లోపముతో గడియారమాగునేమో కాని కాలము మాత్రమాగదు.

---

1. కలం కలలు. గోపాలచక్రవర్తి
2. కాలహేల. మహాసర్గ. శివప్రసాద్.
3. మేల్కొన్న ఆకాశం. 9వ ఖండిక (27వ పుట) మాదిరాజు రంగారావు.
4. 'ఉదయించని ఉదయాలు' 14వ పుట.

"గడియారం నడిచినా నడువకున్నా
గడుస్తోంది నడుస్తోంది కాలం"[1] అని దాశరథి కాల వేగమునకు భయభీతుడై జిజ్ఞాసలో పలికినాడు. దీనివలన కాలమును స్తంభింప జేయవలెనను ప్రవృత్తి ఆతనిలో ప్రగాఢమైనది. ఇందు సాధ్యాసాధ్యముల ప్రసక్తిలేదు. మానవుని సుఖదుఃఖములను సాపేక్షములే కావున కాలమును జయించుటతో మానవుడు చిరంతనానందము నందగలడను తత్వము ఆతని మదిలో మెరుపువలె మెరిసినది.

'ఊహాకందని ఊహల కీకారణ్యంలో
కాలాన్ని పట్టి తెచ్చి కాట కట్టివేస్తాను
కాలాన్ని మీకు బానిసగా చేస్తాను
కళ్లల్లో జ్యోతులు వెలిగిస్తానని'[2] ఆరుద్ర ప్రవచించుటలోని భావమిదే! కాలస్వామి కాగలిగిన మానవుడు మహాకాలుడే కాగలడు. కన్నులలో జ్యోతులు వెలిగించుకొని నిలిచిన అనంతాకాశమే తానై పోగలడు. సంస్కృతిలో సంపూర్ణత్వము సాధించుటకి దేశకాలాధిగమనము చరమ సోపానము, పరమ ప్రస్థానము.

'కాలగమనం ఆగిపోనంత వరకు
సంస్కృతి శిల్పంగా మారిపోవు
మానవుడు చుంబించగలడు ఆకాశం
మానవతకు సిద్ధించదు సంపూర్ణత్వం'[3] ఈ భావన క్రమముగా యంత్ర యుగములో తత్వచింతనకు బీజప్రాయమై నిలిచినది. భౌతిక భోగలాల సర్వమునుండి పైకెగిరి ఆకాశమును మెట్టుగా చేసికొని అనంతకాలము నధిరోహించిన మానవుడు తాత్వికుడై పోయి చూడగా జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయములు, శూన్యములైనట్లు కన్పడగా, గత్యంతరము లేక పరాతత్వము ముందు శరణు జొచ్చినాడు. చలం 'సుధ'లో వ్యక్తమైన భావమిదే.[4]

---

1. జిజ్ఞాస కవితా పుస్తకం. దాశరథి.
2. త్వమేవాహం.
3. మేలో్కాన్న ఆకాశం.
4. సుధ. 38 ఖండిక.

"ఈ అనంతమనేదే ఒక్క క్షణం
ఆ క్షణికమైన కాలంలో
ఒక్క క్షణం మన బతుకు
నువ్వూ నేననే ఈ జ్ఞానం
అంతే మరుక్షణం
నువ్వు లేవు నేను లేను
ఆ లేకుండా పోయిందేదో

ఎన్నటికీ తిరిగిరాదు...." జగన్మిథ్య బ్రహ్మ సత్యమను సూత్రమునకు సన్నిహితముగా సాగిన యీ తత్వచింతన నాల్గవవైపున కెదిగిన మానవుని మేధలోని సహోజాతి సహజమైన స్పందనము.

(5) **నిరాశ - భయము :** ఊహకందని కాలము ఆజ్యముతో పెరిగెడి జ్వాలలవలె మితిమీరిపోయిన కోరికలు యంత్రయుగములో మానవుని యెదలో నిరాశను భయమును నింపివేసినవి. శాస్త్రీయ విప్లవము సిద్ధింపజేసిన సహజమైన మానసిక పరిణామమిది. **Automation** వలన నిరుద్యోగము మిన్నుముట్టుచున్నది. అణుబాంబుల యుద్ధపు భయములో భూగోళము గజగజలాడుచున్నప్పుడు, రేపటి గూర్చి నిశ్చింతతో నిర్భయముగా మానవుడు జీవింపగలడనుకొనుట పొరపాటే! మూడవ ప్రపంచ యుద్ధమే వచ్చినచో నాల్గవ యుద్ధము చేయుట కిక భూగోళమే మిగలదు కదాయని తెలుగు కవి తెలిసికొనినాడు. యాంత్రిక నాగరికత అభిమంత్రించుటతో సమ్మోహితుడై సంశయగ్రస్తుడై కవి నిరాశాపూరితమైన వర్తమానపు యెదల పందిళ్లకు భయమనెడి లతను ప్రాకించినాడు సి. నారాయణరెడ్డిగారు తమ 'అక్షరాల గవాక్షాలు'లో

'ఈ జగత్తు ఎప్పుడు చితికిపోనుందో
ఇంకా నాకు సంశయంగానే వుంది
ఏ నగరం హిరోషిమా కానుందో

ఇప్పటికీ భయంగానే వుంది'[1] అని యంత్రయుగమందలి భీతిని దర్పణ బింబమువలె తమ కవితలో ప్రదర్శించినారు. ఆధునిక కవులు ప్రముఖముగా 'రాత్రి'ని నిరాశకు సంకేతముగా స్వీకరించినారు. చీకటి అవిద్యకు

1. 'జలపాతం'.

అఘములకు ప్రతీక. 'రాత్రి'యను పేర ఎంసిన కవితా సంపుటములో పదు నైదుగురు ఆధునిక కవులీ విషయమునే ప్రస్తావించినారు 'గడియారం రెండు ముండ్లు ఏకాంతంలో గడిపే అర్ధరాత్రి, 'లోకం భూతమని చిత్రించుకొని జడుసు కొనేటట్లు'[1] చేసినది. ఈ చీకటిలో జరిగెడి మోసము వ్యభిచారము, దౌర్జన్యము లను తెలుగుకవి వర్ణించినాడు. నగరములో అశోకా లాడ్జింగ్‌లో 'సజీవ నర మాంస విక్రయ వ్యాపార సంత'[2]లో సాగిన దారుణములు కవికి కథావస్తు వైనది.

'మామూలు యంత్రానికి యేటేటా అరుగుదల
ఈ మానవ యంత్రానికి అలాగే నరాల సత్తువ కరుగుదల
యంత్రం సెకండ్‌హేండ్ ధరకు అమ్మకం
ఈ యంత్రం సంఘం విషంతో కుళ్లి పూరకుక్కల పరం'[3] అని

చీకటి తప్పు చేసెడి వనితను యంత్రముతో పోల్చి సి. విజయలక్ష్మి జుగుప్సా వహమైన దృశ్యమును ప్రదర్శించి యాంత్రిక నాగరికతలో మానవుని నిరాశకు నిస్సహాయతను వర్ణించినారు. పరిగి రాధాకృష్ణ 'చీకటి విశ్వాసాలు' యాదవరెడ్డి 'ఆరాత్రి' మాల్యశ్రీ 'పరాజితుని స్వగతం' మొదలైన ఖండికలు తమ ప్రతిజ్ఞల తోనే యీ తత్వమును సువ్యక్తము చేసినారు అజంతా నగరములోని నిరుద్యో గిని వర్ణించుచుఁ నిరుద్యోగి వెంకట్రావు నిత్యం ఆకాశం క్రిందనే ప్రస్తుతం నివాసం చేస్తూ వుంటాడు'[4] అని సామాన్యుని పేదతనమును సూచించి 'అతని చుట్టూ పరాజయ కాలంతో క్రుంగుతూ వున్న వృక్షాలు' అని నిరాశ- భయ ములు క్రమముగా పరాజయమునకు దారి తీసినవని సూచించినాడు.

'కంచెయె చేను మేసిన రకమ్మగ నాయకులున్ ప్రజాళి రక్షించుట పోయి నిర్దయత కేవల మాత్మసుఖమ్ము గోరి భక్షింప సాగినప్పుడు'[5] దాశరథి యెదలో

---

1. ఆడ్‌అవర్స్. వరవరరావు. రాత్రి సంకలనం. 6 పుట.
2, 3. సి. విజయలక్ష్మి శోకంలో అశోక నిలయం. రాత్రి సంకలనం. 17, 20 పుటలు.
4. చెట్లు కూలుతున్న దృశ్యం. ఖండిక.
5. దాశరథీ శతకము. 27వ పుట.

వ్యథ ఉత్పన్నమై నిరాశకు దారి తీసినది. హేతువాదము, యాంత్రిక నాగరికత, మనసులో మంచిని పెంచుటకు బదులుగా త్రుంచివేసినది. పాలకులలో స్వార్థమును పెంచినది. కావుననే కవి తన దాశరథీ శతకములో[1] 'యేసును చంపి ఆ పిదప నెల్లరు నాతని భక్తులైనటుల్ వేసిన బాంబు మానవుల వేలును లక్షలుగా' వినాశము చేసినను పిమ్మట శాంతిని వరింతురా యేమని దిగ్భ్రాంతుడైనాడు. బైరాగి 'నూతిలో గొంతుకలు' కావ్యము ఈ జాతి రచనలలో ఉత్తమ శ్రేణికి చెందినది !!

(6) **మానవ ద్వేషము :** న్యాయాన్యాయ విచక్షణ లేకుండ మానవుని తోటి మానవుడు దోచుకొనుచు యంత్రములపై పెట్టుబడి పెట్టి మనుష్యులను వాటికి మరమేకులుగా బిగించి పీడించుచున్నప్పుడు నిరాశ- ద్వేషములతో రగిలిన సామాన్యుని యెద అగ్నిపర్వతమట్లు బ్రద్దలై మానవ ద్వేషము వెలిగక్కినది. ఇది **Nihilism,**[2] **Anarchism,**[3] ల తత్వము. ఆధునికాంధ్ర కవి దీనిచే ప్రేరేపితుడై 'నాకీ మానవలోకం నిర్భరమై తోస్తున్నది నరమేధం చేయాలని నామది వాంఛిస్తున్న'[4] దని తీవ్రధోరణిలో ఆక్రోశించినాడు. పార్థివమైన మానవుడు తప్పులు చేయుట సహజమే ! వానిని సహించి సరిజేసినవాడే మహర్షి. యంత్ర నాగరికతా వేగములో కాలమట్టి సహనమునకు సంయమనమునకు అవకాశ మీయదు. కావుననే సంస్కారమున కాస్కారము తక్కువై స్పర్ధ కవ

---

1. దాశరథీ శతకము. 23వ పుట.
2. **'As a Social doctrine Nihilism is the beleif that Progress is possibls only through the destruction of all Social and Political organisations' Charles. A. Baylis. Dictionary of Philosophy. 210 P.**
3. **This doctrine advocates the abolition of Political control within society; the state it contend, is man's greatest enermy-eliminate it and the evils of human life will disappear.... In a popular sense the word 'Anarchism' is often used to denote a state of social chaos'[5] Murcus. B. Maliett. Dictionary of Philosophy. 12 P.**
4. రుద్రవిపంచి. మహాసర్గ. I శివప్రసాద్ 88 పుట.

కాశము ఎక్కువైనది. 'అందరూ చెప్పేవి నీతులే అందరూ ఆషాఢభూతులు'[1]గానే కన్పించుటతో సభ్యాసభ్య విచక్షణమును కూడ విడిచి తోటి మానవుని తిట్టుటకు కవి సాహసించినాడు :

'మీ ఒంటిమీది చర్మం బుల బులాగ్గా ఒలిపించి
కారం పూసి నిప్పుల మీద దొర్లించి మిమ్మల్ని తింటున్నాన్రా'[2] అని దిగంబర కవి నరమాంస భక్షణకు తన సంసిద్ధతను వ్యక్తపరచుటలోని తత్వ మిదే. 'సిగ్గుంది నీకు'[3] అని ప్రశ్నించి 'పుచ్చకాయలు నలిపే కాకారాయుళ్లని బద్మాష్ ముండా కొడుకులనీ'[4] నోరార తిట్టినాడు.

(7) **అశ్లీల పదప్రయోగము :** తంత నిరంకుశమైనప్పుడు శ్లీలా శ్లీలముల విచారణ యుండదు. గ్రామ్యములను, అనింద్య గ్రామ్యములను, భావించి కాని రచించికాని ఆనందించుట అవ్యవస్థితమైన మనోధర్మము. వ్యక్తా వ్యక్తములోని తమస్సుకు సాత్వికుడు సంయమనశీలియై శుద్ధి చేయును. అట్లు గాక బహిర్ముఖుడైన తమస్వి వానిని సమాజముపాలు చేయును. యంత్రయుగ నాగరికలోని వికృతమైన పార్శ్వమిది. వ్యాసవాల్మీకుల సంతతికి వారసుడైన తెలుగు అధివాస్తవికోద్యమ కాలములోను అతినవ్యమైన యాంత్రికయుగ కాలము లోను అశ్లీలములను నిహతిలేక ప్రయోగించుట విచారకరమైన పరిణామము. దిగంబర కవితోద్యమ సందర్భములో ఈ ధోరణిని కొంత ప్రసక్తము చేసి తిని. వెన్నం తన గేయములో

'నా కవిత పతిత
నిహతిలేని వనిత'[5] యనుట అశ్లీలమునకు పరాకాష్ఠ! మీదు మిక్కిలి ఆధునికాంధ్ర కవి తన అశ్లీలములను సమర్థించుకొనుచు 'అశ్లీలం పలుకుతోంది దిగంబరాక్షరం అంటున్నావు నిగ్గు లేకుండా- నీ మెదడు పురుగు తినేసి[6]నదని

---

1. అగ్నిశిఖలు మంచుజడులు 12వ పుట.
2. నరమాంసం రుచి మరిగి. ఖండిక. దిక్‌ల సంపుటి 3 భైరవయ్య 54వ పుట.
3, 4. కొజ్జాల కామకేళి చూస్తున్నాను, దిక్ సంపుటి 3. నగ్నముని పుటలు 12, 16 లు.
5. నా కవితా కన్నె. గేయము. ముమూర్షువు. రచన వెన్నం 102 పుట.
6. దిక్ 3. పుటలు 12-16.

ప్రతి సమాధానమీయలేనట్లు తిట్టినారు. అశ్లీలము పామరజనుల భాష కావున యంత్ర యుగములో సామాన్యునికి కిరీటము పెట్టినప్పుడాతని భాషకు మాత్రము కావ్యగౌరవము కల్పించుటలో తప్పేమున్నదని వీరు ప్రశ్నించినారు. "భాష శ్లీలమా అశ్లీలమా అనేది సందర్భాన్ని దాని అంతరార్థాన్ని అనుసరించే వ్యాఖ్యానింపబడుతుంది. పైగా శతాబ్దాల తరబడి పతితులు పద దళితులూ అయిన పీడిత ప్రజానీకానికి వారసత్వంగా లభించిందిది. దాన్ని తిరస్కరించడం ఒక రకంగా సామాన్యుని అస్తిత్వాన్నే తిరస్కరించడం"[1] అను సమర్థనము యుక్తమేనా అని విజ్ఞులు పరిశీలింపవలసి యున్నది. 'యద్భావం తద్భవతి' యను సూక్తి ననుసరించి అమంగళము మనసులోనే చొరగూడదని కట్టడి విధించిన జాతి మనది. కవి చౌడప్ప జగ్గకవుల తిట్టు కృతులకు కావ్య గౌరవ మీయని కారణమిదే. తిక్కన్న జుగుప్సావహమైన యుద్ధరంగమును 'దారుణ ప్రియదర్శన'[2]మని మనోహరముగా వర్ణించి భారతీయ సంస్కారమును ప్రదర్శించినారు. అశ్లీలము కావ్యదోషము కావున అశ్లీల స్ఫూర్తి కూడ కలుగకుండ నీమల్లిపాయ, మోమడ్డంబు వంటి వానిలో సంధిగతమైన దోషమును చూచి లాక్షణికులు వీనిని కవుల పరిహరింపవలెనని కట్టడి చేసినారు :

'వసుదేవ యోని గోపీ
విసర మహా పీన కుచ నవీనాశ్లేషో
ల్లసితుం డనఁ గాలిందీ
రసవిహరణ కరణ నిత్య రసికుండ నఁగన్'[3]లో యోని, మహాపీన, కాలిందీ పీ(పీయి) పదములు జుగుప్సార్థ స్ఫోరకములు గావున కవి ఉద్దేశింపకున్నను శబ్దాంతరములను స్మరింపజేయుచున్నవని వీనిని లాక్షణికులు త్యజించినారు. ఈ లక్షణమును తిరస్కరించినచో కవిత్వమిక కేవలము లక్షణ గ్రంథములలో దోష ప్రకరణమునకు లక్ష్యముగా మాత్రమే మిగిలిపోవును. కమ్మిశెట్టి

---

1. దిగంబర కవి నిఖిలేశ్వర్ తన 'దిగంబర చింతనం' వ్యాసములోని సారాంశము నీ మాటలలో నా 28-6-69 నాడు చెప్పినారు. వ్యాసము తరువాత ప్రచురింపబడినది.
2. ద్రోణపర్వము అభిమన్యు వధ. 77వ.
3. కావ్యాలంకార సంగ్రహము. చతుర్థాశ్వాసము. గ౩. భట్టుమూర్తి.

వెంకటేశ్వరరావుగారు 'రహస్యాల్ని ప్రసవిస్తోంది రాత్రి. పతిత భయంకర సుఖవ్యాధి పీడిత జారిణి.... నగ్నయై త్రపాహీనయై....'[1] అనుటలో Libido ప్రభావముతో అశ్లీలము నగ్నముగా తాండవమాడినది.

'సిగరెట్ త్రాగని ఈడియట్
విస్కీ త్రాగని విలన్
అధరపీ యూషాన్ని గ్రోలని షండుడు

మనకు ఆజన్మ వైరుల'[2]ని సభ్య ప్రపంచము మెచ్చని భావములను సాహసముతో చెప్పుటలో అరాజకవాదము గోచరించుచున్నది. వామనుడొక పదమున కనేకార్థములున్నప్పు డందు ఒక్కటి అశ్లీలమును ధ్వనింపజేసినను ప్రయోగింపకుమని చెప్పినాడు.[3] అట్టిచో అనౌచిత్యమునకు ధ్వజమెత్తి నిలిచి, తమ్ము తాము ఆధునిక కవులు సమర్థించుకొనినచో పరిణామము కాలమే నిర్ణయించును.

(8) **ఏకాకితనము:** శాస్త్రీయ విప్లవ ఫలితముగా మానవుడు తన్ను తాను ఏకాకిగా నిరంతరము భావించుకొనుట పరిపాటి వ్యక్తుల మధ్య పరస్పరము ఆత్మీయమైన తాదాత్మ్యము శూన్యమైనప్పుడు 'ఎవరికివారే యమునాతీరే' అనునట్లు జీవింతురు. ఈ భావమునకొక తాత్విక స్థాయిని కల్పించినవాడు జాంపాల్‌సాత్రే. వీరు తమ **'L' Ele it be N'eant (Being & nothingness'** అను గ్రంథములోను (1943) **Critque de la raisendia lectique'** (1960) అను గ్రంథములోను తన ఎగ్జిస్టెన్షియలిజం సిద్ధాంతమును ప్రతిపాదించెను. ఆధునికాంధ్ర కవులపై దీని ప్రభావము ప్రసరించినది.[4] నిఖి

---

1. రాత్రి సంకలనం 1వ పుట.
2. చిత్రభాను. రాత్రి సంకలనం 27వ పుట.
3. అసభ్యార్థాంతర మసభ్యస్మృతి హేతుశ్చాశ్లీలం- వామనుడు. కావ్యాలంకార సూత్రవృత్తి. 15వ సూత్రము ద్వితీయాధికరణమున ప్రథమాధ్యాయము.
4. నిఖిలేశ్వర్ తాని గేయము అస్తిత్వవాద ప్రభావముతోనే రచించినానని నాతో చెప్పినారు.

లేశ్వర్ రచించిన 'నా దేశంలో నేను ఏకాకిని' ఖండిక దీనికి స్పష్టమైన ఉదాహరణము.

"నేను నా దేశానికి పరాయివాడిని

జ్వలిస్తున్న ఏకాకిని" అని భావించుటలో జీవుని యొంటరితనము గోచరించుచున్నది. తాను అనాదృతుడనని భావించుకొని సమాజములో యంత్రముల నడుమ, యంత్రములవంటి మానవుల నడుమ, దిగులుతో నిలబడుట దీని భావము. 'జ్వలిస్తున్న' శబ్దముతో కవి హృదయముతోని నిర్భర వేదనను వ్యక్తీకరించినాడు.

'స్నేహం ఇవ్వని దేశంలో

స్నేహం లేని ప్రతివాడూ ఒక్కొక్క ద్వీపం' అని అనంతసాగరములో ఒకదానికొకటి పొత్తులేక నిలిచిన మట్టి ముద్దలైన ద్వీపములతో పార్థివమైన మానవ ద్వీపములు కూడ స్నేహశూన్యమైన ప్రపంచములో జీవించుచున్నవని చక్కగా చిక్కగా చెప్పినాడు. పాశం చెన్నకేశవరెడ్డి 'ఎడారిలో ఒంటెవలె ఎంతకాలమని పయనించను?[1] అని ప్రశ్నించుటలో కూడ ఈ భావమే దాగియున్నది. నిరాశతోకూడిన అస్తిత్వవాదమిందు ధ్వనించినది. నిరవధికమైన కాలములో ఈదలేక అలసిపోయిన ఆధునిక మానవునికి సంకేతముగా 'ఒంటె' ఉదాహరింపబడినది. యంత్రయుగ ప్రభావములలో విశిష్టమైనది.

**(9) మరణ వరణము :** భయము నిరాశలకు దానిసగా చిక్కిన మానవుడు బ్రతుకుటకన్న మృతి పొందుటే ఉత్తమమని సత్వరముగా నిశ్చయించుకొనును. ఒక శతాబ్దపు కాలములోనే నిత్యజీవితావసర వస్తువుల వెల నమ్మలేనంతగా పెరిగినది.[2] దుర్భరమైన యాంత్రిక జీవనము, నిరంతర ప్రగతిశీలమైన శాస్త్రీయ విజ్ఞానము సమాజ వ్యవస్థను తారుమారు చేయుటతో హత్యలు ఆత్మహత్యలు అత్యాచారములు అమితముగా జరుగుచున్నవి. సామాజికమైన యీ అనారోగ్యకరమైన ధోరణి, కవి లోకముపై ప్రసరించుట సహజమే! 'అగ్నిశిఖలు - మంచుజడులు' అను ఖండకావ్యములో కమ్మిశెట్టి వెంకటేశ్వర

1. కాంతిచక్రం ఖండిక. జ్యోతిర్మయి సంకలనం.

2. చూ. అనుబంధము.

రావుగారు జీవితమును రైలుబండితో పోల్చినారు. అది తుఫాను రాత్రి బండి బయలుదేరినదే కాని 'చీకట్లోనే వాలిపోతుందా సిగ్నల్ రెక్క'[1] అను అనుమానము వచ్చినది. 'తలవంచుకు వెళిపోదాం తప్పదు మరి ఏంచేస్తాం'[2] అనినాడే కాని సంతృప్తి చెందలేకపోయినాడు :

'యుగయుగాలుగా పేరుకున్న అబద్ధాల పుట్టలో
నిజం వాల్మీకి తపోముద్రలో ఉన్నాడో దీర్ఘనిద్రలో ఉన్నాడో
ఎవడికి తెలుసు'[3]నని సత్యము మరణించినట్లు భావించుటలో మానవునికి జీవితముపై విరక్తి పుట్టినది. భవిష్యత్తును గూర్చిన మధురోహల కది చివరి క్షణము. కావుననే సామాన్యుడు యంత్ర యుగముతో గత్యంతరము లేక మృత్యువు నాహ్వానించినాడు. సినీవాలిలో ఆరుద్ర ఎన్ జివో. మృత్యువుతో సంభాషించినట్లు రచించుటలోని తత్వమిదే! కేశవరావు 'ఉదయించని ఉదయాలు' ఖండ కావ్యములో

'తుఫానులో ముక్కలయ్యే తెరచాపనై పోతాను
కాంతిలో కాలిపోయే శలభాన్నై పోతాను'[4] అని మృత్యువరణమును ప్రకటించి 'నాకు శాంతిలేదు నాకు శాంతిలేదని' చాటుకొనినారు. ఈ జన్మమిక యవ్వనములోనే వ్యర్థమైపోయినది కావున మరణించి 'శవాలు కాలే వాసన తరువాత పురిటింట్లో కేరింతలతో శైశవమును 'మరల మరల పిల్చుకొందు'నని[5] కవి భావించినాడు. శైశవనుతి యంత్రయుగ ప్రభావితులైన ఆధునిక కవులందరిలోను గోచరించుట గమనార్హము !! ఇందు నైరాశ్యము వలాయన వాదములతోబాటు ఇలియట్ మరుభూమి ప్రభావము కూడ ప్రసరించినది. ఇలియట్ మరణ వరణ దశలో కూడ మానవునికొక ఆధ్యాత్మిక పరిష్కారమును చూపి

---

1. తుఫానురాత్రి ఖండిక. 64వ పుట.
2 ఖేదాంతం ఖండిక.
3, అదే. 52వ పుట.
4 ఉదయించని ఉదయాలు. 14వ పుట.
5. అగ్నిశిఖలు-మంచుజడులు. జననమరణాలు ఖండిక 45వ పుట. దాశరథి రచించిన బాల్యం ఖండిక (పునర్నవం) ఈ శైశవమతికి చెందిన గేయమే.

నాడు కాని ఆధునికాంధ్ర కవులు తాత్త్వికముగా మార్క్సువాదమును నాశ్ర యించుటతో సమస్యలకు భౌతికమైన ఉపాధిని భగ్నము చేయుటే ముగింపుగా భావించినారు !! వేదాంతియైన చలం కూడ సుధలో

'ఈ అగాధ ఆద్యంత రహిత శూన్యంలో

ఒక్కక్షణం ఈ నేననే వెలుగు'[1] అనినాడే కాని అసత్తునకు భావ ముండదని సత్తునకు అభావముండదని గీతాకారుడు చెప్పినట్లుగా[2] 'నేనను వెలుగు' ఒక్కక్షణము కాక కార్యకారణావస్థ లన్నింటిలోను నిత్యమైనదేనని అంగీకరించు టకు అవకాశమీయకుండ యంత్ర నాగరికత తన ప్రభావమును ప్రసరించినది!!

**ప్రణాళికా ప్రచారము:** ఇప్పటివరకును శాస్త్రీయ విప్లవము శబ్దార్థ ముల నెట్లు పరివర్తనమందునట్లు చేసినదో వివరించితిని. భారతదేశములో శాస్త్ర ప్రగతి ప్రణాళికాబద్ధముగా సాగుచున్నది. కావుననే ప్రభుత్వము ప్రత్యక్షము గాను పరోక్షముగాను కవి తను కవుల సాయమును అర్థించినది. కవులు కూడ ఉత్సాహముతో వివిధోద్యమములలో భాగస్వామ్యము స్వీకరించినారు. బోయి భీమన్నగారు 'దీపసభ'లో ప్రణాళికాభ్యుదయమును గూర్చి మంత్రుల బాధ్యత అను గూర్చి, ప్రజల విన్నపములను గూర్చి సందర్భోచితముగా చక్కగా చిత్రించినారు.

'క్రొత్తగా గట్టిన కోదండ ఫేక్టరీ
నిప్పుపెట్టెలలోని నిజముఁగూర్చి
ప్రేలబోవు ప్రపంచ పృథుల యుద్ధమునాప
గైకొనమన్న వైఖరిని గూర్చి
ఊఁకవలె రూకలను బొక్కుచున్న పాల

నా వ్యవస్థను గూర్చి' ప్రశ్న పయి ప్రశ్నలు వేయునప్పుడు నాయకులెట్లు చాతుర్యముతో వ్యవహరింతురో వర్ణించినారు. కొందరు 'బడిపెట్టి నాము ప్రారంభోత్సవమునకు' రమ్మని మంత్రిని కోరుదురు. 'అఖిల ప్రపంచ

---

1. సుధ. ౩౧వ ఖండిక. ౩౩వ పుట.
2 'నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః । ఉభయోరపి దృష్టోఽంత స్త్వనయో స్తత్త్వదర్శిభిః' గీత. ౨ ౧౬.

మహా క్రిమిసభ'కు అధ్యక్షత వహించమందురు 'చాప్పా పురాన పశుప్రదర్శనములో' పాల్గొన దయచేయుమందురు. 'ఘూనైన గాంధీ పొగాకు కేంద్రపు దర్శనమ్మునకై వచ్చి పొమ్మం'దురు ఇట్టి పనుల యొత్తిడి నడుమ 'పథకములు వేయు నభివృద్ధి పనుల కతఁడ'ని వర్తమాన పాలకుల బాధ్యతను చమత్కారముగా వర్ణించినారు.

సాంకేతిక ప్రగతిలో అధికాహారోత్పత్తి, నరనియంత్రణలు అనాంతరోద్యమములని మనవి చేసితిని ప్రభుత మ పూనికతో వీని ప్రచారమునకై కవులను వినియోగించినది. ఆకాశవాణిలో దూరదర్శన్‌లో అసంఖ్యాకములుగా గేయములు, నాటికలు, కథలు అనుదినమును ప్రసారమగుచున్నవి. కాని యివి ప్రచారస్థాయి నధిగమించి కావ్యత్వము నందకుండుటచే పేర్కొనుటకు వీలుకాక పోయినది. పరిమిత కుటుంబమే పరమశ్రేయోదాయకమను సిద్ధాంతముతో కవులు ఉత్తమ జాతి కావ్యములను రచించుటకు తగిన కాలము నేడు సమాసన్నమైనది.

# వర్తమాన ధోరణులు (1970-1990)

ఈ రెండు దశాబ్దములలో చెప్పుకొనదగిన ధోరణులను ఈ అధ్యాయములో స్పృశింతును.

ఈ కాలములో వచ్చిన ప్రధాన ఉద్యమ కవిత్వములు మూడు. అవి : 1) బంగ్లా విముక్తి, 2) అత్యవసర పరిస్థితి, 3) జాతీయ సాహిత్య పరిషత్ స్థాపన. ఇందు బంగ్లా విముక్తి పోరాటమును ముందుగా మనవి చేసితిని. మిగిలిన వానిని ఈ క్రింద వివరించెదను :

## అత్యవసర పరిస్థితి :

1975 సంవత్సరములో భారత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ ఎన్నిక చెల్లనేరదని అలహాబాదు హైకోర్టు తీర్పు నిచ్చినది. ప్రతిపక్షములవారు రాజకీయ ఆందోళనలను సాగించినారు దానితో జులై నెలలో ఆమె దేశములో అత్యవసర పరిస్థితిని ప్రకటించినది. కొన్ని రాజకీయ, సాంస్కృతిక, మత, సంస్థలను నిషేధించినది. రాష్ట్రీయ స్వయంసేవక సంఘ కార్యకర్తలెందరో అజ్ఞాత పోరా

టమును సాగించినారు. వేలకొలది రాజకీయ ఖైదీలతో దేశములోని జైళ్లన్ని యును నిండినవి. జయప్రకాశ్ నారాయణ నేతృత్వములో సాగిన ఈ ఆందోళనమునకు "జె పి" ఉద్యమము అని పేరు వచ్చినది. ఇట్లు 18 నెలల కాలము గడించినది. 1977 మార్చిలో శ్రీమతి గాంధి సాధారణ ఎన్నికలను నిర్వహించినది. అందు ఆమెయును, ఆమె పక్షమును పరాజయము పొందగా, శ్రీ మొరార్జీదేశాయి నాయకత్వములో ప్రభుత్వము ఏర్పడినది. ఈ సంఘటనలన్నియునూ తెలుగు సాహిత్యమును ప్రభావితము చేసినవి.

**రెండు మార్గములు :** ఈ కాలంలో తెలుగు కవులందరును రెండు మార్గములుగా విడిపోయినారు అత్యవసర పరిస్థితి మంచిదనియును, జాతికిది క్షేమకరమనియును ప్రచార విభాగమువారు ప్రభుత్వ పక్షమున పుస్తకములు ప్రకటించి, కవి సమ్మేళనములు నిర్వహించినారు. ప్రముఖ కవులెందరో ఇందు పాల్గొనినారు. శ్రీమతి గాంధీని భద్రకాళిగా, మహాకాళిగా, శక్తిస్వరూపిణిగా అభివర్ణించినారు. "అత్యాచార పర్వముకాదిది, అనుశాసన పర్వమిది" అని కీర్తించినారు. కాని 1977లో జనతా ప్రభుత్వము రాగానే ఈ కవితలు, గ్రంథములు తగులపెట్టబడినవి. ఇదిట్లుండగా కొందరు కవులు జయప్రకాశ్ నారాయణను సమర్థించుచూ కవితోద్యమము నిర్వహించినారు. పత్రికలపై సెన్సారు ఉండుటతో ఈ రచనలన్నియునూ 'Underground' సాహిత్యముగా ప్రచారము చేయబడినవి. అంతేకాదు, ఒక రాష్ట్రములోని కవితలు మరొక రాష్ట్రములో ముద్రించబడినవి. ఈ దేశములోని ఉద్యమమునకు కావలసిన సాహిత్యము, ఎన్నో విదేశములలో ప్రచారము చేయబడినది. భవిష్యత్తులో మిక్కిలి పరిశోధన జరుపవలసిన అంశమిది.

**జాతీయ సాహిత్య పరిషత్ :** 1974 లో ఈ సంస్థ స్థాపింపబడినది. ఇంతకు పూర్వమున్న భారతీయ రచయితల సమితి దాదాపు ఈ సంస్థలో తాదాత్మ్యము చెందినది. ఆ సంస్థ నిర్వహించిన 'సాధన' పత్రిక పరిషత్ ముఖవాణిగా ప్రచురణ ప్రారంభమైనది. 1975 మార్చి తన ప్రథమ మహాసభలను హైదరాబాదులో నిర్వహించినది. ఆ తరువాత వరుసగా ఓరుగల్లు, మహబూబ్‌నగర్, నల్గొండ వంటి ప్రాంతములలో ప్రాంత మహాసభలు జరిగి

నవి. 1990 నాటికి దాదాపు 60 శాఖలతో ఈ ఉద్యమము ఆంధ్రప్రదేశమంత టను విస్తరించినది.

## 1975 ప్రథమ సభల విశేషములు :

హైదరాబాదు వీరశైవ విద్యావర్ధక హాస్టల్‌లో 1975 మార్చి 8, 9 తేదీలలో జా.సా.ప. ప్రథమ (రాష్ట్ర) మహాసభలు జరిగినవి. ప్రతినిధులుగా అప్పటికి వ్యాపించిన పరిషత్ 14 శాఖల నుండేగాక రాష్ట్రములోని అన్ని ప్రాంతముల నుండి 157 మంది కవి పండితులు ప్రతినిధులుగా విచ్చేసినారు. మహాసభల వేదికపై విశ్వశ్రేయః కావ్యమ్ అనెడి పరిషత్ చిహ్నముతోబాటు 'జాతీయ వైభవమే సాహిత్య ప్రయోజనమ'ను నినాదము కూడా అలంక రింపబడినది. ఒకవైపు సరస్వతీ చిత్రము, మరొకవైపు తెలుగు కవితకు శ్రీకారము చుట్టించిన రాజరాజ నరేంద్రుని చిత్రము అలంకరింపబడినవి.

నాటి రాష్ట్ర కార్యవర్గము :- ఆచార్య బి. రామరాజు, అధ్యక్షులు; భండారు సదాశివరావు, కె. వెంకట్రామరాజు, ఉపాధ్యక్షులు; కె. ఘనశ్యామల ప్రసాదరావు ప్రధాన కార్యదర్శి; కె సుప్రసన్నాచార్య ప్రసాదరాయ కులపతి, కందర్ప రామచంద్రరావు, జానకీజాని, జి. సోమరాజు, మన్నవ గిరిధరరావు, పరాశరం గోపాలకృష్ణమూర్తి, ఎల్దెండ రఘుమారెడ్డి కేంద్ర కార్యవర్గ సభ్యులు; ముదిగొండ శివప్రసాద్ కేంద్ర కార్యాలయ కార్యదర్శి.

## అధ్యక్షోపన్యాసము :

8-3-1975 జాతీయ సాహిత్య పరిషత్ ప్రథమ మహాసభలో రాష్ట్ర శాఖ అధ్యక్షులు ఆచార్య బి. రామరాజుగారు పరిషత్ లక్ష్యములను, ఉద్యమ స్వరూపమును ఈ రీతిగా అధ్యక్షోపన్యాసములో స్పష్టీకరించినారు.

"జాతీయ సాహిత్య పరిషత్ ప్రారంభానికి ఒక ప్రయోజనమున్నది. సాహిత్యంలో కూడ ఉద్యమాలు ఏమైనా వస్తే, అవి ఏదో ఒక మార్పును, సద్యః స్థితిలో వాంఛించతగ్గ ఒక విధమైన మలుపును సాధించడానికి వస్తవి. ఒక్కొ క్కప్పుడు అవి సమూలంగా మార్పును కోరి రావచ్చును. లేదా అంశికంగానైనా రావచ్చు.

సాహిత్య వస్తువులో మార్పు కోరినా, రూపంలో మార్పు కోరినా, అభివ్యక్తిలో మార్పు కోరినా, అవి ప్రజల నిత్యజీవితాన్ని ఒక జీవనంతో పాటు, ప్రజల హృదయాలలో నింపుకొని, నిద్రాణంగా ఉన్న ఆత్మను తట్టి మేల్కొలుపగల శక్తి ఆ కోర్కెతో లేకపోతే ఆ ఉద్యమం సఫలంకాదు. శాశ్వతముగా నిలవదు. అట్టి ఉద్యమాలు క్షేమకరాలు కూడా కావు.

మన దేశంలో మానవ జీవితాన్ని గురించిన ఒక శాశ్వతమైన వ్యాఖ్య ఉన్నది. పురుషార్థాలను ప్రతిపాదించి జీవితంలో ఒక విధమైన సమన్వయాన్ని సాధించడం ద్వారా శాశ్వతమైన విలువలకు నిత్యనూతనత్వాన్ని ప్రాప్తింపజేయగల వ్యాఖ్యగా అది నేటికీ మన ప్రజలలో ఒక విధమైన స్పందనను కలుగజేస్తూనే ఉన్నది. నేడు దాని అవగాహన మందగించవచ్చు. వికృతి పొందవచ్చు. కాని మానవుణ్ణి ఇటు కేవలము ఒక భౌతిక పిండంగా చూడక, అటు కేవలం మోక్షగామిత్వమేననీ, మిగతా పురుషార్థాలు లేవనే ధోరణిని స్వీకరించకుండానూ, అధికార భేదంతో అన్ని స్థాయిలకు ఆలంబనాలను, జీవన సంప్రదాయాలను నిర్ధారణ చేసిన సమాజంగా నేటికీ అనేకములైన ఆటుపోట్లను సహించి నిలువగల్గిన సమాజము మనది.

ఈ మార్గాన్ని పునరుద్ఘాటించి, ప్రశస్తమైన ప్రత్యక్ష నిదర్శనాన్ని చూపి ప్రజలను అభ్యుదయ నిశ్శ్రేయస సాధనామార్గంలో నడిపించడానికే సాహిత్యం మన దేశంలో ఆవిర్భవించింది.

ఆదికవి వాల్మీకి 'కోనస్మిన్ సాంప్రతంలోకే' అని అన్నా, వ్యాసుడు "ఊర్ధ్వబాహుః రికామ్యేష నచకశ్చిత్ శ్రుణోతుమే" అని బాధపడ్డా, మహాకవి కాళిదాసు "శైశవేభస్త విద్యానామ్" అంటూ ఉత్తమ జీవన వ్యాఖ్యానం చేసినా, ఆంధ్ర మహాభారతం 'ధర్మశాస్త్రంబని' ఆయా స్వరూపాలలో దర్శనం ఇచ్చినా, పెద్దన ప్రవరుని జూపి మానవ జీవన విభాగ వ్యవస్థను నిరూపించి కర్మమార్గాన్ని చాటినా, అధములకు కావ్యమంకితం చేయనని భాగవతం భక్తిరసధుని ప్రవహింపజేసినా ఉత్తమమైన ఒకానొక జీవన మర్యాదను ప్రస్థాపించి సాధారణ మానవకోటికి మార్గదర్శకంగా ఉండవలెనని ఊహించి చేసిందే. మన సాహిత్య పరమేశ్వరులు అందుకే మానవ సుఖదుఃఖాల గాథను అవి వ్యక్తీకరించేటప్పుడు ఔచిత్యమునూ, వస్తుమర్యాదనూ పాటిస్తూ ప్రయోజన సాపేక్షను భావించినారు.

కాలం మారి గత వెయ్యేండ్లలో మన జాతికి సంభవించిన గ్లానిని తొలగించుకోడానికి నేడు మనం అన్ని రంగాలలోను కృషి చేస్తున్నప్పుడు ఒక జబ్బునుంచి తేరుకున్న వ్యక్తి పథ్యం విషయంలో ఎంత శ్రద్ధగా ఉండాలో గుర్తు చేసుకోవడం సముచితం.

వెయ్యేండ్ల వైదేశిక పరిపాలనా కాలంలో మన సాంఘిక వ్యవస్థలో గల సమష్టి భావన నశించింది. విదేశీ పరిపాలనలో ఉన్న కారణంగా ప్రజలకు, పరిపాలకులకు మధ్య ఉండవలసిన నిత్యజాగృత సమాజ భావన లోపించింది.

అందువలన మన వ్యవస్థలు జీర్ణములై, అర్థరహితములై, వ్యక్తికి సమష్టికి గల బాధ్యతాయుతమైన సంబంధాన్ని విస్మరింపజేసేవిగా మారి సంకీర్ణమైనాయి. దానితో ఆనాడు పరిపాలకుల అనుసరణ అనుకరణలు అవసరమని భావించినవారు తమలో తాము చీలిపోయినవారై లోన ఒకటి, బైట ఒకటిగా తమ ప్రవర్తనలో అంతర్బాహ్య సమభావన లేనివారుగా వేర్పడి, జాతీయ జీవనంపట్ల విశ్వాసాన్ని చెరపడానికి కారకులైనారు నేటికీ ఆ మలినసంజె నీడలు దేశాన్ని ఆవరించే ఉన్నాయి.

నేటికీ మనం అదే ధోరణిలో ప్రయాణిస్తూండడానికి కారణం ఇదే. అందుకే సాహితీవేత్తలలో కూడ ఆత్మవిశ్వాసం కల్పించడం లేదు. మనను గురించిన విమర్శనను సహించలేకపోవడం ఎంత బలహీన భావమో, తమకు అర్థం కాకపోయినా అది ఒక వేడుకగా 'ఫ్యాషను'గా ఒక ప్రవాహ పతితంగా దూషించడమో నిరాకరించడమో అంతే దుర్బలత్వం.

"నన్ను చూడకు- నామాట విను- నా పాట పాడు, నా కవిత చదువు" అనేవాడు ఆత్మఘాతుకానికి పూనుకున్నవాడే కాగలడు. నేడు మన జీవనం, మన ఆదర్శానికి మూర్తిమంతమైన ప్రతీక కావాలి. ప్రజల నిత్యజీవితంలో నేడు కనిపిస్తున్న దారిద్ర్యం, అసహనం, అజ్ఞానం, అనైక్యం, పరస్పర విద్వేషం, చీలికలు, అహంకారం ఇవన్నీ మానవునిలోని నిమ్నస్థాయికి చెందిన గుణాలు. వీటిని తొలగించి మానవుని సంపూర్ణ మానవునిగా రూపొందించడానికి, ఈ దేశంలో, ఈ జనంలో ఆత్మవిశ్వాసం నింపడానికి ఈ చిరంతన సంస్కృతి ధారలోంచి కర్మమయ జీవసాఫల్యాన్ని సాధించడానికి, సాహిత్యక్షేత్రంలో

ఉత్తమ భావనా వ్యవసాయం చేయడానికి కలం హలంగా ధరించిన 'అక్షర కృషీవలులు, కంకణధారణ చేయాలి. వ్యక్తులు మారాలి. మారిన వ్యక్తుల సంఘటనతో ఈ జాతీయ సమష్టిమూర్తి సాక్షాత్కరించాలి. జుగుప్సను, రోతను, క్రోధాన్ని, ద్వేషాన్ని, పరస్పర కలహాన్నీ, రక్తపాతాన్ని ప్రజలలో రెచ్చగొట్టేవారు ప్రజలకు స్నేహితులు కారు. ప్రజల మేలుకోరినవారు కారు. వారు సాహిత్యం ద్వారా ప్రజల నేటి స్థితిని మార్పు చేయాలనే ఉత్తమ భావన గల వారని చెప్పడానికి వీలులేదు.

కనుక నేడు జాతీయాత్మను, జాతీయైక్యతను ఆసేతుశీతనగ వ్యాప్త భారతజాతి సమాన స్పందననూ గుర్తించి, నేటి దైన్యావస్థనుంచి ఉత్తమ జీవన వ్యవస్థను నిర్మాణం చేసుకోవాలనే భూమికతో, తమ తమ ప్రత్యేకతలతో, తమ తమ ధోరణులలో, తమ తమ ప్రక్రియలతో సమాన ఆదర్శం, ఆదరం గల సాహితీ బంధువులు ఒక వేదికగా రూపొందాలని అనుకొని ఆవిష్కరించుకున్నదీ జాతీయ సాహిత్య పరిషత్."

**ప్రభావము:** జాతీయ సాహిత్య పరిషత్ సాగించిన ఉద్యమము, స్పందన, కవులపై విపరీతమైన ప్రభావమును చూపినది. ఆవేళ ప్రధానమైన తాత్కాలిక రచనలేకాదు "గొప్ప ప్రేరణ పొంది, సమకాలీనతా పరిధిని అతిక్రమించి సార్వకాలీన చైతన్యముతో ప్రకాశించునవి"[1]; "ఈ దేశాన్ని ఆధార భూమిగా జాతీయశక్తిని ఉన్నత దివ్యజీవనానికి నిశ్రేణికగా"[2] స్వీకరించిన రచనలతో అగ్నిగర్భ, అమృతవృష్టి, హిరణ్యగర్భ, సవిత మొదలైన సంకలనములు, అసంఖ్యాక లఘుకావ్యములు, కథానికా సంపుటములు- ఎన్నియో ప్రక్రియల్లో ఈ ఆర్తి సువ్యక్తమైనది. ఈ దేశీయులు "కన్నుల్లో కాశ్మీర సౌందర్య దీపం వెలిగించుకున్నారు. ఆలోచనల్లో సిత హిమాచలం పెంచుకొన్నవాళ్ళు అమృతపుత్రులు, ఆనందగాత్రులు, అంభోదనేతులు" అని భారతీయులను సుప్రసన్న ప్రశంసించినారు. "ఈ దేశం నాదనటం ఎప్పటిదో పాతమాట ఈ దేశం నేననటం ఇది నవకవితా సూక్తం" అని ముదిగొండ శివప్రసాద్ సువర్ణ మంత్రపుష్పమును ఈ భారతీయునికి సమర్పించినాడు "క్షమించండి మీతో కలసి పయనించలేను, మీ ఆలోచనలతో శృతి కలుపలేను. తియ్యని పండ్ల

---

1, 2. శ్రీకోవెల సుప్రసన్నాచార్యులు 'అగ్నిగర్భ'-పీఠిక. (ప్రరోచన)

చెట్లతో మధురమైన వాసనల్ని వెదజల్లే రకరకాల పూలమొక్కలతో అందంగా స్వేచ్ఛగా ఎగురుతున్న సీతాకోకచిలుకలతో నందన సదృశమైన ఈ వనం. వనమాలి నిర్లక్ష్యంవల్ల పాడుపడిందని మొత్తం తోటని సమూలంగా పెకిలించ లేను, మరుభూమిగా మార్చలేను" అని జానకీజాని 'మేలుకున్నవాడి కలలు' కని జాతీయ కవితాత్మ నావిష్కరించినారు "శ్రీ భారతి అఖరోత్సవము చిందించెడి చిరునవ్వులు, ఈ భారతమాత పూజకెత్తిన బంగరు పువ్వులు, అనుపమాన దీక్ష గలుగు అత్యమృత సాధకులే, ఆ పూజావేళలోన దీపమ్మును వెలిగింతురు" అని శ్రీ ప్రసాదరాయ కులపతి 'నవభారతి' గీతమాలాపించినారు వే. నరసింహారెడ్డి, సంపత్కుమారాచార్య, యస్వీ. జోగారావు, యెల్దెంద రఘుమారెడ్డి, కసిరెడ్డి వెంకటరెడ్డి, అనుముల కృష్ణమూర్తి, శశాంక, వేముగంటి నరసింహాచార్యులు, ఉత్పల సత్యనారాయణాచార్యులు, చౌడూరి గోపాలరావు, గాదేపల్లి కుక్కుటే శ్వరరావు, చిట్టిమల్లె శంకరయ్య, తుమ్మపూడి కోటేశ్వరరావు ఇట్లు అసంఖ్యాక కవిపండితులు జాతీయ కవితా ప్రవాహ భగీరథులై నిలచినారు.

> "ఓ జనతా నతాంజలి పుటోజ్జ్వల కోష్ణకవోష్ణ బాష్పధా
> రా జలసిక్త పాదకమల ద్వయశోభి మనోజ్ఞదేహ రే
> ఖా జయభారతీః యుగయుగమ్ముల పున్నెపు పంటవీవు, నీ
> పూజకు తెచ్చినాడ నిదె పొంగిన గుండియ నిండు పద్దెముల్"[1]

స్వరాజ్యమునకై ఆవేశము 1947 కు ముందు ఉద్యమము. సురాజ్యము నకై ఆలోచన ఈ రెండవ జాతీయోద్యమము !![2]

**1) నవ్య సంప్రదాయ వాదము :** ప్రాచీన సంప్రదాయ మూల్యము లను పరిరక్షించుచు నవ్యసమాజ సంవేదనలకు స్పందించుచు వచ్చినదే నవ్య సంప్రదాయము- దీనినే 'నియోక్లాసికల్ ట్రెండ్' అనుచున్నారు. ఈ ధోరణికి

---

1. దాశరథి.
2. 10, మార్చి, 1990 ఎమ్మిగనూరులో జరిగిన జాతీయ సాహిత్య పరిషత్ ఏడవ ప్రాంత మహాసభలు తమ సంస్థను అఖిల భారతీయ సాహిత్య పరిషత్కు అనుబంధము చేయవలెనని సంకల్పించుటతో ఈ ప్రాంతీయ సాహిత్యోద్యమము అఖిల భారతీయ స్రవంతిలో లీనమైనట్లైనది.

చెందిన కవులు ఎవరెవరను విషయములో అభిప్రాయభేదము లున్నవి. ఆచార్య కోవెల సుప్రసన్నాచార్యులగారి దృష్టిలో వానమామలై నవ్యసంప్రదాయవాది కాగా ఆచార్య ఎస్వీ. జోగారావుగారి దృష్టిలో ఆయన పూర్తి సంప్రదాయవాది.

మొత్తముమీద ఈ ధోరణి సుమయములలోని సూత్రమువలె అంతర్నిహితమై కొన్ని దశాబ్దములుగా సాగుచునే యున్నది. కాని దీనికొక ఉద్యమ స్ఫూర్తి రాలేదు. కావున ఇందు విపులముగా చర్చింపబడలేదు. మీదు మిక్కిలి వీరందరును దాదాపుగా దేశభక్తి కవులే. కావున ఈ పాయ దేశభక్త్యుద్యమ కవితా పరిణాహములో అంతర్వాహిని అయినట్లే లెక్క. 1989లో ఈ ధోరణి పై దాదాపు సంవత్సరమంతయును (నెల, నెల) శ్రీ జి. వి. సుబ్రహ్మణ్యంగారు హైదరాబాదులో విమర్శక గోష్ఠులు నిర్వహించి విశ్లేషింపజేసినారు.

2) శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ 'కవిసేన మానిఫెస్టో' వెలువరించినారు. సాహిత్యమునకొక నూతన దర్శనమును తద్వారా వారు చూపించినారు. "నీరై పారిపోయింది", "నా దేశం నా ప్రజలు", "గెరిల్లా" వంటివారి వచన కావ్యములు తెలుగు సాహిత్యమునకు అంతర్జాతీయ స్థాయిని కల్పించుచున్నవి.

3) ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము 1975లో మొదటిసారి హైదరాబాదులో ప్రపంచ తెలుగు మహాసభలు జరిపించినది. దేశదేశాంతరముల నుండియును ప్రతినిధులు విచ్చేసినారు. ద్వితీయ ప్రపంచ మహాసభలు కౌలాలంపూర్‌లో జరిగినవి.

4) ఆధ్యాత్మిక రంగములో మహర్షి మహేష్‌యోగి భావాతీతధ్యానము ప్రపంచవ్యాప్తమై చిత్తశాంతికి యోగసోపానములను నిర్మించినది.

ప్రభుపాద స్వామివారి "హరేకృష్ణ" ఉద్యమము అంతర్జాతీయముగా చైతన్య మహాప్రభు ప్రోక్తభక్తి యోగామృతమును పంచుచున్నది.

5) 1962లో వివేకానంద శతజయంతి, గాంధీ శతజయంతి, 1989 లో నెహ్రూ శతజయంతి, రాష్ట్రీయ స్వయంసేవక సంఘ సంస్థాపకులైన డాక్టర్ కేశవరావు బలీరాం హెడ్గేవారుల శతజయంతులు, ఆంధ్ర సాహిత్యముపై అనన్య సామాన్యమైన ప్రభావమును ప్రసరించినవి.

6) క్రీ. పూ 100 ప్రాంతములో సమ్రాట్ విక్రమాదిత్యుడు 84 స్తంభముల రామమందిరమును అయోధ్యలో నిర్మించినాడు దానిని క్రీ. శ. 1528లో జలాల్‌పాషా, షకీర్‌ఫజల్ అబ్బాస్, కలందర్‌లతో కలిసి మొగల్ సామ్రాజ్య నిర్మాత బాబరు, నిర్మూలించి తన పేర ఒక మసీదును నిర్మించి నాడు నాటినుండి మందిర పునర్నిర్మాణ పోరాటము సాగుచునే యున్నది. స్వాతంత్ర్యానంతరము గుజరాత్‌లో సోమనాథ దేవాలయ పునర్నిర్మాణము వలెనే అయోధ్య రామమందిర నిర్మాణమూ, మథురలో కృష్ణమందిర నిర్మాణమూ, వారణాశిలో విశ్వనాథ మందిర నిర్మాణములను జాతీయ ప్రతిష్ఠాత్మక దృష్టితో స్వీకరింపవలెనని విశ్వహిందూ పరిషత్ 1989లో నిర్ణయించినది. ఆ మేరకు దేశమంతట గ్రామగ్రామములోను రామమందిర నిర్మాణ శిలలను ఊరేగించి, ఒక మహోద్యమమును నిర్మించినది.

"రాముని గుడికట్ట, ఎవడడ్డు పెట్టునంట?" "రామరామ యని పలికెడి రామచిలుక ధన్యము - రాముని ప్రేమకు నోచిన చిట్టి ఉడత ధన్యము" వంటి గీతాలు తెలుగునాట మార్మోగినవి. 'రామ జన్మభూమి' ఉద్యమము కేంద్ర ములో శ్రీ రాజీవ్‌గాంధీ ప్రభుత్వము పతనమగుటకు ఒక ప్రధాన కారణమని రాజకీయవేత్తలు అంగీకరించినారు.

6) **విప్లవ కవిత్వము :** ఈ మధ్య కాలములో విప్లవ రచయితల సంఘము- విరసం బాగా బలపడినది, అతివాద సామ్యవాద దృక్పథముతో విరసం కవులు ఉద్యమమును నడిపినారు. 'సృజన' మాసపత్రిక వీరికి ముఖవాణి అయి నది. ప్రభుత్వపు అణచివేత, కవులపై నేరారోపణలు, కోర్టుల చుట్టును త్రిప్పుట వీటన్నింటినీ ఎదుర్కొనుచూ విప్లవ కవులు ముందుకు సాగుచూనే ఉన్నారు. జానపద గేయరీతులలో రచింపబడిన గద్దర్ పాటలు, కవితాస్పర్శ లోపించని వరవరరావు సంకలనములు ఈ సందర్భములో పేర్కొనదగినవి. వీరి ప్రభా వముతో ఎన్నో లఘుకావ్యములు, ఖండకావ్యములు, సంకలనములు వెలువడు చున్నవి. 21వ శతాబ్దములో ఈ వర్తమాన ధోరణులను తిరిగి పరిశోధకులు సింహావలోకనము చేసికొన్ననేగాని, ఇందలి లోటుపాటులు స్పష్టము కావు.

8) ఈ మధ్యకాలములోనే యుగకర్తలైన విశ్వనాథ సత్యనారాయణ, శ్రీరంగం శ్రీనివాసరావుగార్లు అస్తమించినారు.

9) అఖిల భారతీయ స్థాయిలో ప్రతిష్ఠాత్మకమైన జ్ఞానపీఠ బహుమానము 1972లో విశ్వనాథ సత్యనారాయణగారికి, 1989లో సి. నారాయణరెడ్డి గారికి లభించినది.

10) సామాన్య జనానీకానికి పత్రికలు, ఆకాశవాణి, సినిమాలతోపాటు దూరదర్శన్ తన ప్రభావమును విస్తృతముగా చూపుచున్నది.

11) దాదాపు 40 వేల నవలలు వెలువడిన తరువాత, 1990 నాటికి నవలా రచయితల ఉధృతము తగ్గినది. నవలలను సామాన్య పాఠకులకు రచించు చున్న నవలామణులు కూడా తెరమరుగైనారు.

12) తెలుగు పద్యముపై అభిమానము పెరిగినది. జె బాపురెడ్డి, ఉందేల మాలకొండారెడ్డిగార్లు ఛందోబద్ధమైన తెలుగు పద్యము అనశ్వరము అని ఖండిత ముగా ప్రకటించినారు. పద్య నాటకములపై వ్యామోహము పెరిగినది. సంప్ర దాయ నాటకములతోపాటు ఆచార్య దివాకర్ల వేంకటావధాని రూపొందించిన పద్య సాహిత్య రూపకములు "భువన విజయము", "కనకాభిషేకము", "ఆంధ్ర భారతావతరణము" వంటివి ఎన్నో ప్రదర్శనలకు నోచుకున్నవి. వీరి భువన విజయము నాలుగు వందలకు పైగా ప్రదర్శనలను ఇచ్చినవనినచో ఈ సాహి త్యోద్యమము ఎంత తీవ్రస్థాయిని చేరినదో ఊహించుకొనవచ్చు. ఇందు పాల్గొ నిన వారందరును విశ్వవిద్యాలయ ఆచార్యులు, కళాశాల ఉపన్యాసకులు, డాక్ట రేట్ పట్టభద్రులే.

13) **చలనచిత్ర కవితలు :** సంవత్సరమునకు మూడు వందలకు తగ్గకుండ తెలుగు చలన చిత్రములు విడుదల అగుచున్నవి. ఉద్యమ పరిధి లోనికి రాకున్నను ఈ కవితలలో భావ, అభ్యుదయ, దేశభక్తి ధోరణులు, విప్లవ వాదములు చోటు చేసికొని సమాజమును ప్రభావితము చేయుచున్నవి. ఉదాహరణకు :

భావ కవిత :- "చుక్కలతో చెప్పాలని
ఏమని ?
ఇటు చూస్తే తప్పని-
ఎందుకని ?
ఇక్కడ ఏకాంతంలో ఏమో ఏమేమో అని"[1]

---

1. దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి

అభ్యుదయ కవిత :- "కనీసం ప్రతి మనిషికి
కూడు గుడ్డ నీడైనా ఉండాలా ?"[1]

దేశభక్తి కవిత :- "పదండి దండి దండుగా"[2]
"తెలుగువీర లేవరా
దీక్షబూని సాగరా"[3]

విప్లవ కవిత :- "కుళ్ళిన సంఘం
వయసు మళ్ళిన సంఘం"

సి నారాయణరెడ్డి, దాశరథి, ఆరుద్ర, ఆత్రేయ, కొసరాజు, వంటి వారి చిత్రగీత సంకలనములును వెలువడినవి.

14) మహాకావ్యముల నిర్మాణము తగ్గి, మినీ కవితలు, సౌదామినీ కవికలు ఎక్కువైనవి. (మనీ కవితలును, వ్యాపార కవితలు) రుబాయీలు, తెలుగు ఘజల్స్‌పై తెలుగులో ప్రయోగములు జరుగుచున్నవి. దాశరథి, సి. నారాయణరెడ్డి, తిరుమల శ్రీనివాసాచార్యులవంటి వారు ఈ ప్రయోగములో సఫలీకృతులైనారు.

15) ప్రపంచవ్యాప్తముగా సామ్యవాదము తిరోముఖమైనది. రష్యాలో పెరస్త్రోయికా, గ్లాస్నాస్ట్‌లు ప్రారంభమైనవి. రష్యా, చైనా, జెకోస్లవేకియా, నికరాగ్వా, రుమేనియాలలో ప్రజాస్వామ్య ప్రభంజనములు వీచుచున్నవి. 1989 డిసెంబరులో బెర్లిన్ గోడ బ్రద్దలు కొట్టబడినది.

16) మత తత్వము కొత్త ప్రాధాన్యమును సంతరించుకొనుచున్నది. షిర్డీ సాయిబాబా, సత్యసాయిబాబా, శబరిమలై అయ్యప్ప, శ్రీ వేంకటేశ్వర స్వాముల భక్తుల సంఖ్య వేలనుండి లక్షలలోకి చేరినది. అట్లే శ్రీ సంతోషీమాత వంటి కొత్త దేవతలు కూడా వెలసినారు. వీరందరిపైననూ కవితలు, కథాకావ్యములు, సంకలనములు వెలువడుచున్నవి. ఉద్యమస్ఫూర్తిని అందుకొనుచున్నట్లు కనపడుచున్నది.

---

1. ఎం. ఎస్. రామారావు
2. టంగుటూరి ప్రకాశం పంతులు- చిత్రములో
3. అల్లూరి సీతారామరాజు - చిత్రము

"మాలధారణం నియమాల తోరణం"
-(అయ్యప్ప మాహాత్మ్యం చిత్రం)

"బాలభానుని లేతకిరణం నీకు ఆభరణం
హరిహరాత్మజ మేలుకో" -(ఎం. సి. వి. శశిధర్)

"అయ్యప్ప శరణం అయ్యప్ప శరణం అంటూ రారండి
ప్రతిసారి పరవశించి జపమాలను ధరియించి"
(జోస్యుల నాగభూషణరావు)

వంటి గీతములు ప్రజాదరణ పొందుచున్నవి.

17) అన్నమాచార్యుడు రచించిన 32 వేల కీర్తనలలో 16 వేలు లభ్యమైనవి. తిరుమల తిరుపతి దేవస్థానము, అన్నమాచార్య ట్రస్టు, అన్నమాచార్య భావనావాహిని వంటి సంస్థలెన్నియో ఈ కీర్తనలను దేశవిదేశములలో వినిపించుచున్నారు. అన్నమయ్య పదములు అమెరికాలో మారుమ్రోగుచున్నవి. భక్తి ఒక ఉద్యమమైనది. అన్నమయ్యపై నవలలు, కథలు, కావ్యములు, నాటకములు వెలువడుచున్నవి భౌతిక, ఆధ్యాత్మిక లోకముల మధ్యగల ఎల్లలు చెదిరిపోయినవి. పదార్థము ఘనీభవించిన శక్తి అని శాస్త్రజ్ఞులు నిర్వచించినారు. హింస వ్యాపించుచున్ననూ సంఘర్షణ కన్న సమన్వయమే అనివార్యమను దృక్పథమునకు మేధావి వర్గము వచ్చినది. రాబోయెడి యుగమునకు శుభసూచన మిది.

# సింహావలోకనము

నూటయేబది సంవత్సరముల (1840-1990) సాహిత్యములోని ప్రధానమైన ఉద్యమ తత్వములను విశ్లేషణాత్మకముగా ప్రదర్శించితిని. సాహిత్యముపై సాంఘిక రాజకీయ ఆర్థిక శాస్త్రీయ మతశక్తుల నిరంతర ప్రభావమెట్లు ప్రసరించునో నిరూపించితిని. కవి సమాజమును వదిలి ఎట్లు జీవింపలేడో మనవి చేసితిని. వ్యష్టి- సమష్టి- శక్తుల మధ్యగల సంఘర్షణమును సమన్వయమును- రెండింటిని వివరించితిని. ఇప్పుడొకసారి ఉద్యమములన్నింటిని సింహావలోకనము చేయవలసి యున్నది.

**అనుక్రమ విప్లవములు :** ఈ శతాబ్దములోని సాహిత్యోద్యమములను పరిశీలించినప్పుడొక విషయము సుస్పష్టమగును. ఆధునిక కాలములో విభిన్న శక్తులు పరస్పరము తిరుగుబాటు చేసికొనుటకు యత్నించినవి 'పరస్పరం సంఘర్షించిన' శక్తులలో ఉద్యమ చరిత్రలు పుట్టినవి. ఈ విప్లవములలో ఒకానొక అనుక్రమము కన్పడుచున్నది. అనూచానమైన కవితామార్గము మీద, ముఖ్యముగా ప్రబంధపు పై, కట్టమంచి రామలింగారెడ్డిగారు కవిత్వ తత్వవిచారముతో చేసిన దాడి తెలుగు సాహిత్యగతిని మరలించివేసినది. భావకవిత్వమునకిది అంకురార్పణము. నాటినుండి నాలుగు దశాబ్దములు అవిచ్ఛిన్నముగా ఆంధ్రదేశమును భావకవిత్వము పరిపాలించిన పిదప దానిని అభ్యుదయ కవిత్వము మార్క్సు వర్గ సంఘర్షణము నాధారముగా చేసికొని అవరోధించినది. నాటినుండి ఒకటిన్నర దశాబ్దము అభ్యుదయ కవిత్వోద్యమము తీవ్రముగా సాగి భారత దేశముపై చైనా దండయాత్రతో తిరుగుముఖము పట్టినది. మన ఆంతరంగిక వ్యవహారములలో చైనా జోక్యము, చెకోస్లవేకియా వ్యవహారములలో రష్యా జోక్యము, ప్రపంచ సామ్యవాద నాయకులలోనే సిద్ధాంత భాగమును గూర్చి పునఃపరిశీలనము కావించుట కవకాశమును అవసరమును కల్పించినవి. ఇంతలో పాకిస్తాను యుద్ధము వచ్చి సహజీవన సిద్ధాంతములోని మౌలిక సత్యమునకు సరియైన భాష్యమును నిర్వచింపవలసి వచ్చినది. ఈ దశలో అంతర్జాతీయ సామ్యవాద సిద్ధాంత ప్రాతిపదికతో సాగిన అభ్యుదయ కవిత్వముపై దేశభక్తిని రంగరించుకొని నిలిచిన సమర కవిత్వోద్యమములు తీవ్రమైన తిరుగుబాటును చేసి జాతిగతిని మరల మరలించినవి. ఇదొక అనుక్రమము !!

ఇట్లే నిరాఘాతముగా సాగెడి సనాతన వ్యవస్థపై కశాఘాతమువలె సంఘ సంస్కరణోద్యమము వచ్చి తిరుగుబాటు చేసినది. వీరేశలింగం పంతులుగారు, వెంకటరత్నం నాయుడుగారు, ఉన్నవ దంపతులు, త్రిపురనేని ప్రభృతులీ ఉద్యమములోని భిన్నభిన్న శాఖలకు నాయకులై సారథ్యము వహించినారు. వీరి గదాఘాతములకు కాగడా చురకలకు జనత మరల కన్నులు నులుముకొని ఉలిక్కిపడి లేచి కర్మసిద్ధాంతమును గూర్చి కులవ్యవస్థలను గూర్చి పునరాలోచనము ప్రారంభించినది. హైందవము భారత, భాగవత, రామాయణము లనెడి పౌరాణిక త్రివేణీ సంగమ తీరములలో పర్ణశాలలను నిర్మించుకొన్నది కావున చలం, పెండ్యాల, శ్రీశ్రీ, త్రిపురనేని ప్రభృతులు మత్తేభములై నిలిచి తమ

విమర్శయే సేతువుకాగా నదీగమనమును నిరోధింప యత్నించినారు. వీరి హేతు వాదోద్యమము ప్రతిఘటన లన్నింటిని ప్రతిఘటించి కొన్ని దశాబ్దములు ముందుకు సాగిపోయినది. ఇంతలోనే హైందవ పునరుజ్జీవనోద్యమ వైతాళికుడై విశ్వనాథ సత్యనారాయణగారు, కోట వెంకటాచలం వంటి చారిత్రకుల సహకారముతో మఱల తిరుగుబాటుచేసి కల్పవృక్షముతోను పురాణ వైర గ్రంథమాలతోను తదితరములైన శతాధిక గ్రంథములలోను సనాతన మార్గమున కేర్పడిన అవ రోధములను అత్యంతాభి నివేశముతో నిర్మూలించి కేవలము మూలతత్త్వమునకే గాక వ్యవస్థా ధర్మమునకు కూడ ఎనలేని ప్రాధాన్యమునిచ్చి పునరుజ్జీవనోద్య మములో విజయధ్వజ మెత్తినారు !!

భాషావిషయికముగా కూడ శతాబ్దముల తరబడి పట్టము కట్టుకొని పాలిం చిన గ్రాంథికము రాచరికము, పోయి ప్రజాస్వామ్యము వచ్చుటలో తన స్థాన మును ప్రజల భాషకు సమర్పించినది. వ్యావహారికమునకు కావ్యప్రయోగ గౌర వమును కల్పింపవలెనను ఉద్యమము నిసర్గముగా సాగినది గురజాడ గిడుగులు దీనికి నాయకులు. ఈ శతాబ్దారంభములో మొదలైన యుద్యమము ఏబది యేండ్లకు ఫలశ్రుతి నందినది. భాషతోబాటు ఛందము కూడ పరివర్తనమంది, వృత్తము గేయమై, గేయము వచనగేయమై చివరకు వచనమే మిగిలిపోవు చున్నది. ఒక అర్ధశతాబ్ది కాలములో జరిగిన అనూహ్యమైన ప్రముఖ పరిణామ మిది !!

నేడు సాంకేతిక విప్లవము సాగుచున్నది. విజ్ఞాన శాస్త్రమునకు భూత ములే ప్రాతిపదికలు. భూతములు కార్యావస్థలో నిన్నటివలెనే నేడును రేపును కూడ నిలువగలవు. **'Will preceds motion'** అను వాక్యము నంగీకరించి నచో కారణావస్థలోని భూతములకు ఎవరి యిచ్ఛవలన కార్యరూపము సిద్ధించిన దను ప్రశ్న కలుగును. కావుననే హెకెల్ ప్రళయమును మాత్రమే అంగీకరించి మహాప్రళయమును తిరస్కరించినాడు.[1] కారణమేమనగా చలనములేని ప్రకృతి నుండి జగదుత్పత్తి కలుగదు కావున చలనమునకు కర్త నంగీకరించినచో ఈశ్వ రుని అస్తిత్వమును స్థాపింపక తప్పదు. ప్రకృతికి చలనము స్వాభావికము గాక నైమిత్తికమగుటచే సృష్ట్యంతమందు చలనరహిత ప్రకృతి నిలిచియుండగా

---

1. **Riddle of the Universe.**

ఈశ్వరుని ఈక్షణమువలన ప్రవాహగతిచే అనాదియైన సృష్టిమఱల యథా ప్రకారము రూపొందును. "సూర్యాచంద్రమసౌ ధాతా యథా పూర్వమకల్పయత్‌ది పంచ పృథివీం చాంతరిక్ష మథోస్వం[1]" అను వేద ఋక్కున కర్థమిదే! దీనివలన నిరంతర ప్రగతిశీలమైన వర్తమాన సాంకేతిక విప్లవము తనకు తెలియకుండ తానే ఈశ్వరుని అస్తిత్వమును నిరూపించుట కున్ముఖమై సాగుచున్నది. ఇట్టి దశలో పరాజితమైన శాస్త్రీయ విజ్ఞానముపై సనాతన తత్వము మఱల తిరుగుబాటు చేయును.[1] నేడాంధ్ర దేశములో సాగుచున్న మతౌక చైతన్యములోని రహస్యమిదే!!

**విదేశీయుల ప్రేరణ:** తెలుగులో సాగిన వివిధోద్యమములను మఱొక కోణములో పరిశీలించి నప్పుడొక అంశము గోచరించును. దేశీయమైన ఉద్యమములన్నింటికిని విదేశీయమైన శక్తుల ప్రేరణ లభించుట గమనార్హము. ఇందలి మంచిచెడులను చర్చించుటగాక తత్వమును మాత్రమే ప్రస్తుతము ప్రదర్శించుచున్నాను కీట్స్, షెల్లీ వర్డ్స్వర్త్ బైరన్‌వంటి కవుల ఖండికలను ఆంగ్ల విద్యాభ్యాసమువలన పఠించి భావకవిత్వ శాఖ వికసింపగా మార్క్సుతత్వము అభ్యుదయ కవులకు మార్గదర్శకమైనది కాల్డ్వెల్, గుడ్విన్ పండితుల అద్యుల-నార్య సిద్ధాంతము త్రిపురనేని వారికి కరదీపిక కాగా ఏట్సు దొరవేసిన పట్టాలపై గిడుగు గురజాడలను రెండు చక్రములు గల బండి పయనించినది. చివరకు దేశభక్తి కవిత్వము కూడ నిసర్గమైన సహజమైన సృష్టికాక ఆంగ్లేయులో చైనీయులో పాకిస్తానీయులో భారతదేశముపైకి దురాక్రమణ చేసినప్పుడు ప్రతి క్రియాత్మకముగా సంఘటనను ప్రోత్సహించి మఱల చల్లారిపోవుచున్నది. నిర్మాణాత్మకమైన ఉద్యమము మానవునికి ఉచ్ఛ్వాసనిశ్వాసములవలె జీవలక్షణముగా కర్తవ్యముగా మారిపోవలెను. అది లేనప్పుడు దేశీయ సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమమునకు కూడ వైదేశిక స్ఫూర్తి తప్పని సరియగును. సంస్కృతము ఘనతను జర్మను పండితుడు మాక్సుముల్లరు ప్రశంసించినవే కాని ఆంగ్ల విద్యాభ్యాసములో మునిగిన దేశీయులకు దానిపై ఆసక్తి కలుగలేదు. హిందూ సంస్కృతిని పున

1. "ఈ (శాస్త్రీయ) పరిశోధనవలన మతమునకు ప్రాణప్రదమైన ప్రధాన విషయములు తిరుగులేని సత్యములుగా నిరూపితములు రాగలవు." వివేకానందస్వామి శ్రీ వివేకానంద సంపూర్ణ గ్రంథావళి 2 సం. 320 పుట

రుద్ధరింపవలెనని అని బిసెంటు మద్రాసునుండి శంఖారావము విన్పించిననే గాని విద్యావంతులకు దేశీయ రీతులపై అభిమానము పొడుకొనలేదు. చికాగోలో స్వామి వివేకానందుని ప్రసంగమును న్యూయార్క్ క్రిటిక్, బోస్టన్ ఈవినింగ్ ట్రాన్స్పోర్ట్, న్యూయార్క్ హెరాల్డు, అయోవా స్టేట్ రిజిష్టర్ పత్రికలు ప్రశంసించు వరకును భారతదేశములో జాతీయ భానూదయ మీశతాబ్దములో పూర్వాంబోధిలో ప్రభవింపనేలేదు. ఉద్యమ చరిత్రలలో ఇదొక విచిత్రమైన విషయము ! !

**నవీన రీతులు :** ప్రస్తుత మాంధ్ర సాహిత్యములో ఒకానొక వైలక్షణ్యము గోచరించుచున్నది. వెనుకటివలె కవులందరును ఒకే మూలతత్వముచేత ప్రేరణనంది రచనా వ్యాసంగము సాగించుటలేదు. వివిధోద్యమములు బీజావస్థలో నిలిచి తమ తమ కంఠబలముతో అందదండలను పెంచుకొనుటకై ఒకే సారి పోరాడుచున్నవి. ముఖ్యముగా నేటి కవులను మూడు తరముల క్రింద విభజింపవచ్చును ఈ విభజన కవుల శక్తియుక్తుల ననుసరించిన తరతమ భేదముగాక విశ్లేషణకొఱకు కాలక్రమములోని సౌలభ్యమును మాత్రమే ఆశ్రయించినదని గమనింపగోరుదును. విశ్వనాథ సత్యనారాయణ, వానమామలై వరదాచార్యులు, ఆచార్య దివాకర్ల వేంకటావధాని, ఆచార్య కె. వి. ఆర్. నరసింహం, తుమ్మల సీతారామమూర్తి చౌదరి, దివి రంగాచార్యులు, మిన్నికంటి గురునాథశర్మ ప్రభృతులిందు మొదటి తరమునకు ప్రతినిధులు. భాషలోను భావములోను, ఛందములోను, ఇతివృత్తములోను సంప్రదాయ పద్ధతికే గౌరవము నిచ్చెడివారు. కవిత్వము చరమబిందు నిష్యందముగా ప్రత్యక్షరమును పిండీకృతము కావలెనని వీరి సంకల్పము. ఇఁక డాక్టర్ సి. నారాయణరెడ్డి, డాక్టర్ ఎన్. వి. జోగారావు, దాశరథి, ఉత్పల సత్యనారాయణాచార్యులు, గొట్టిముక్కల కృష్ణమూర్తి, విజయాత్రేయ, మారుటూరి పాండురంగారావు మొదలైనవారు నడిమి తరమునకు ప్రతినిధులు. వీరు సమన్వయవాదులు. కొత్త పాతలు రెండింటిని తమ లేఖినిలో ఇముడ్చుకొనగలరు. మిగిలినది మూడవ ప్రయోగాత్మకమైన తరము. ఆరుద్ర, అరిపిరాల విశ్వం, దిగంబర కవులు, కె. వి. రమణారెడ్డి, సి. విజయలక్ష్మి, చిత్రభాను, మాల్యశ్రీ, వరవరరావు, పరిగి రాధాకృష్ణ మొదలైన వారెందరో ఈ వర్గమునకు చెందుదురు. వీరు శబ్దమునకన్న భావమునకు, ఛందమునకన్నను జీవనబంధమునకు రసాలంకారములకన్నను వైచిత్రికి ప్రాధాన్య మిచ్చెడివారు. వీరుగాక "మఱికొందరు ముఖ్యంగా

గతంలోనే కవులుగా జీవించి- కొనవాసనలతో వర్తమాన కాలాన్ని భ్రమింప జేస్తున్నారు"[1] ఉద్యమము తీవ్రమైనప్పుడు వారిలో కూడ స్పందనము కలుగుట కవకాశము లేకపోలేదు!

కవిత్వము నిట్లు కాలావధితో కొలుచుట తగనిమాట నిజమే. 'Modern' కాలవాచకము కాదను స్టీఫెన్‌స్పెండర్[2] నిర్వచనము నంగీకరించినను 'అరవై ఇరవై పదీ ఒకటిగా సంవత్సరాల దామాషా లెఖ్ఖను సాహిత్య అభివృద్ధిని కొలిచే వాళ్లకు గతి లేదనుకోండి మత్తైనా ఉండాలిగా'[3] అను విమర్శలో సత్యము కొంత మాత్రమే కలదు. అనంత విశ్వమునే కిరణవేగముతో కొలిచినప్పుడు సాహిత్యమునేల కొలచుట తగదు? 'ఎప్పుడో ఒక మహాకవి భగీరథునిలా వస్తాడు। కొంగొత్త కవితా గంగను తెస్తాడు'[4] అని యంగీకరించినప్పుడు 'అరవై ఇరవై పది ఒకటి'లలో కాకున్నను ప్రాచీన ప్రాతిపదికలను తిరస్కరించినను, ఆ భగీరథుడు సాహిత్యమును మలువు। తిప్పిన నాటినుండి జరిగిన పరిణామమును ఉదంమాను వర్తితమైన దృష్టితో పరిశీలనము సాగించుట సర్వులకును ఆమోదయోగ్యమైన కొలమానమే అయినచో ఈ పరిశోధనా వ్యాసములో, నే నా కొలతనే ఉపయోగించితిని'!

**భవిష్యత్తులో ఉద్యమములు :** రేపటి సాహిత్యోద్యమములను గూర్చి నేడే చర్చించుట ఎంత సాహసమో అంత అవసరమైన అంశము. "సైంటిఫిగ్గా సాంకేతికంగా రాపిడ్‌గా రాపిడిగా ఇంతగా మారిపోతున్న లోకంలో ఊహలతో కాలం గడిపే కవిత్వం బ్రతుక గల్గుతుందా అనే సందేహం కలగడం సహజం"[5] అట్టి స్థితిలో రేపటి గూర్చి ఆలోచించుట ప్రమోదకరము కాదేమోకాని ముందు చూపు లేకుండుట మాత్రము ప్రమాదకరము. 'మనిషి అనేవాడు ఉన్నన్నాళ్లు కవిత్వానికి అణుమాత్రం క్షతి'[6] లేదని విశ్వసించినప్పుడు, మానవునిలోని అరి

---

1. అడుగుజాడ గురుజాడది సంకలనం. పీఠిక కె వి. రమణారెడ్డి 1 పుట
2. The Struggle of the Modren
3. అడుగుజాడ గురజాడది
4. కుందుర్తి. యుగేయుగే
5, 6. భవిష్యత్తుతో కవిత. వ్యాసము డా॥ సి. నారాయణరెడ్డి వ్యాసవాహిని 95వ పుట.

షడ్వర్గములు, నవరసములు, విశ్వాసము, హేతువాదము, కవిత్వమునకు చోదక శక్తులై ఉద్యమములను నిర్మించునని నమ్మినప్పుడు నిన్న- నేడు- రేపనెడి భేదములకిక అర్థమే లేకుండ పోవును. కావుననే రేపటి దశను కూడ చర్చించి, యీ పరిశోధన వ్యాసమును ముగించెదను.

వర్తమానము బీజమైనచో భవిష్యత్తు వృక్షమగును. వర్తమానము పుష్పమైనచో భవిష్యత్తు ఫలమగును. నేడు పండిన పండే తిరిగి రేపు బీజావస్థనంది సామాజిక లవణములను, పరిస్థితుల వాయువులను మానవ జీవనమును స్వీకరించి మఱల మొలకెత్తుటకు ఉద్యమించును అందువలన నేటిని మరింత నిశితముగా పరిశీలించుటే మనకు సాధనమై యున్నది !

**ప్రజాదరణము :** వాఙ్మయములో నేడొక స్తబ్ధత ప్రవేశించినదను భావము జనవ్యాప్తమై యున్నది.[1] అది సరికాదు. అండావస్థలోనున్న సాహిత్య విహంగము జగన్మాతచే నేడు వెచ్చగా పొదుగబడుచున్నది. రెక్కలు వచ్చిన వెంటనే యీ పులుగు రిక్కలనంటుటకు నాల్గవ పరిమాణములోనికి దూసుకొని పోవుటకు కుద్యమింపగలదు.

ఒక్క విషయము మాత్రమందరును అంగీకరించినారు కవిత్వమునకు వెనుకటి కన్నను వ్యాప్తి పెరిగినది. ప్రచురణావకాశములు పెరుగుట దీనికొక కారణము. విద్యాగంధము వృద్ధియగుట మఱొక హేతువు. రేడియో, టి. వి. పత్రికలు, గ్రంథములు నిత్య జీవితావసర వస్తువుల స్థాయినందుకొనుటతో మనసును ఝుమ్మనుపించెడి కమ్మని రచనలను చేయవలెనని ఊహ రచయితలకు చదువవలెనను ఊహ పాఠకుని కలుగుట సహజమైన పరిణామము. వెనుకటి కాలములో కవిత్వమే రాజాంతఃపురములలోనో అరచాటుగా తెరమాటున నిలిచిన ప్రబంధ సుందరివలె గగనములో తారకవలె భాసించెడిది కాని నేడా వియన్నది ఆకాశంబున నుండి శంభుని శిరంబందుండి క్రమముదా దిగి వచ్చినది. ఎంత వలదనుకొనుచున్నను ప్రజాశికా ప్రచారమునకే కాదు వ్యాపార ప్రకటనలకు కూడ (Advertisement) కవులను గేయములను నేడు సమాజ మాశ్రయించుచున్నది. దీనివలన ఉత్తమజాతి కావ్యసృష్టి జరుగుననుకొనుట అపోహయే

1. ఆంధ్రవాఙ్మయంలో స్తబ్ధత. వ్యాసము. శ్రీశ్రీపాదుక డిసెం. 1965 భారతి.

అయినను కవిత్వమునకు ప్రచారము హెచ్చినదని సామాజికమైన, ఆర్థికమైన గౌరవము పెరిగినదని అంగీకరింపక తప్పదు. ఇదొక విధముగా శుభ పరిణామమే. వెనుకటివలె గ్రంథమొకటి ముద్రించినచో జీవితాంతము వఱకు దానిని కవి అమ్ముకొనవలసిన స్థితిలో నేడు లేదు. ముప్పది నుండి నలుబది ముద్రణముల వఱకును తమ కావ్యమందుట తమ కాలములోనే చూచిన జంధ్యాల పాపయ్య శాస్త్రిగారి వంటి వారెందరో తెలుగు కవులున్నారు. గ్రంథాలయోద్యమము వారికి సహాయభూతమైనది. సాహిత్య ఎకాడమీలు నోబుల్ బహుమతివంటి జ్ఞానపీఠ బహూకృతులు విశ్వవిద్యాలయముల సహాయము ప్రభుత్వ ప్రోత్సాహము కవుల అస్తిత్వమునకు అండదండలై నిలిచినవి. సభలలో సన్మానములలో పరిమళ ద్రవ్యములతోబాటు కవితా ఖండికలు కూడ నేడు గుబాళించుచున్నవి. ఈ పరిణామ మంతటిని స్తబ్ధతగా త్రోసివేయలేము

**అతివాద తిరస్కృతి :** వెనుకటి శతాబ్దములో కాని, ఈ శతాబ్దారంభములో కాని సంఘ సంస్కరణ విషయములోను గ్రాంథిక వ్యావహారిక భాషోద్యమ సందర్భములలోను ఇరువైపులనున్న పండిత భిషక్కులును ప్రదర్శించిన భాషాభేషజము భయావహమైనది. కాని నేడా తీవ్రధోరణి ఆంధ్రులలోను అదృశ్యమైనది. దీనిని సోదాహరణముగా చూపెదను.

(౧) ముందు శాబ్దికముగా పరిశీలించిన యెడల ప్రాచీనాలంకారములను తిరస్కరించి నూతన రీతులను సంతరించుకొనుట కుద్యమించిన అతినవ్యులే తిరిగి ఆత్మపరిశీలనము ప్రారంభించినారు కేవల మంత్యప్రాస నాశ్రయించినందువలన పోతన్నగారే చులకనగా చూడబడినప్పుడు నవ్యకవుల లెక్క యేమని విశ్వనాథవా రనుటలో వింతలేదు[1] గాని బాలగంగాధర తిలక్ ప్రవచించుట పేర్కొనదగిన అంశము.[2] "ఆహార్యం మార్చినంత మాత్రాన సామాన్యుడు మహారాజవడు। అంత్యప్రాసలు వేసినంత మాత్రాన ప్రొజైక్ భావం పొయెట్రీ అవదు."

(౨) అట్లే కేవల వైచిత్రి నాధారముగా చేసికొని సాగిన అతినవ్యోద్య

---

1. ప్రగతి కవిత్వమంటే ఏమిటి? విశ్వనాథవారితో ఇంటర్వ్యూ. 1965 దీపావళి. కృష్ణాపత్రిక.
2. నవత- కవిత- ఖండిక. నవత (సంపాదకుడు శ్రీశ్రీ) ద్వితీయ సంచిక.

మములలో వెనుకచూపు ప్రారంభమైనది. కాబట్టిన కుందేటికి మూడే కాళ్లను ధోరణిని వదలి తాత్విక చర్చలో స్వేచ్ఛగా కవులు పాల్గొనుట ప్రగతికి లక్ష ణము. వైచిత్రినే ధ్వజముగా చేసికొనిన నవ్యతే "ఈ కషాయం వికటిస్తుంది ఈ వ్యవసాయం వెర్రితలలు వేస్తుంద"[1]ని ఆత్మవిమర్శ చేసికొనుట ఆశ్చర్య కరమైన పరిణామము.

"రాత్రి రెండో జాములో రెండు కత్తుల్ని తిన్నాను
గుండెమీద గుండుమీద సల్ఫ్యూరిక్ యాసిడ్ పోసుకున్నాను
నా పెదవుల్ని కత్తిరించి నీ వీపుమీద అతికాను
ఈ నిముషంలో విషంలో నా నేత్రాలు సువర్ణఝషాలు?
ఇలా రాయడం కొత్తగా గమ్మత్తుగా వుంటుంది కాని యిది
నాన్సెన్సు"[2] అని తీవ్రముగా తిలక్ విమర్శించుటలో Obscrurity ని

అర్థరహితమైన శబ్దముల కూర్పును గర్హించుట వ్యక్తమగును.

(౩) ఛందము విషయములో కూడ నవీనులు తీవ్రవాదములను వదిలి వేసినారు. వచన కవిత్వము నుద్యమముగా నడుపువారికి నాయకులైన వారిలో ఒకడైన కుందుర్తి "నియమబద్ధమై నన్నయాదులచేత తీర్చిదిద్దబడిన పద్యం మాకు తల్లి. దానిని కించపరచాలనే ఉద్దేశంలేదు. పద్య రచయిత లోకవేళ గేయాన్ని తూలనాడినా- ఒకవేళ ఎందుకు? తూలనాడటం తథ్యం- మేము పద్యాన్ని ఏమనేదిలేదు"[3] అనుట వచనగేయ కవులలో, కొందరి సహృదయము నకు పరాకాష్ఠ. వర్తమాన సాహిత్యములోని సమన్వయ ధోరణికి విజయధ్వజము 'గతసహస్ర వత్సరాల కాలంలో మహాకవి ప్రతిభా సన్నికర్షచేత తెలుగు పద్యం యిట్లా బహుముఖ శిల్పసౌందర్యాన్ని సంపాదించుకుంది.... ఎందరో కవులు ఇంత సముజ్జ్వల సంపద మనకిచ్చిపోతే దాన్ని అనుభవించడానికి చేతగాక ధ్వంసం చేస్తామనే మాటలు చేతలు ఈ తెలుగుగడ్డ మీదనే పుట్టడం దురదృష్టం"[4]

1, 2. నవత-కవిత ఖండిక. తిలక్. నవత ద్వితీయ సంచిక.
3. యుగేయుగే. పాఠకులతో పది నిమిషాలు (పీఠిక).
4. సాహిత్య కౌముది. వ్యాసావళి. ఛందస్సుకు అలంకార శాస్త్రానికి ఒక సేతువుగా పద్యశిల్పశాస్త్రం నిర్మించాలి వ్యాసము గుంటూరు శేషేంద్ర శర్మ. 82వ పుట.

అను విమర్శను ఆధునికులు శిరసా వహించుట హర్షదాయకమైన పరిణామము.

(౪) వ్యావహారిక భాషోద్యమము ఫలసిద్ధినందినది. విశ్వవిద్యాలయము లలో కూడ ప్రవేశపెట్టవలెనని ఆందోళన సాగిపలించనది. కాని వ్యావహారిక భాషావాదులే నియమోల్లంఘనము కూడదని ప్రబోధించుట చూడగా నేడు వాఙ్మయ ములో స్తబ్ధతకాక సమన్వయోద్యమము సాగుచున్నదని గుర్తింపవలసి యున్నది. 'గ్రాంథిక భాషను పూర్తిగా పరిహరిస్తే భాషాసాహిత్య సంప్రదాయ విచ్ఛేదం కలుగుతుంది. ఈ విచ్ఛేదం ఏమాత్రం అభిలషణీయం కాదు'[1] అని జి. వి కృష్ణా రావుగారు తీర్మానించి 'గ్రాంథిక వ్యావహారిక భాషలకు ఏకశబ్దానుశాసనం కోశము అవశ్యకాలు'[2] అని ప్రతిపాదించుట నేను చెప్పిన సిద్ధాంతమున కుపబలకముగానే యున్నది. వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు వ్యావహారికమునకు వ్యాకరణమును రచించి శబ్దములకు గతి కల్పించుట, ఈ సమన్వయ తత్వమునకే ఉదా హరణము.

(౫) జాతీయోద్యమముతో అంతర్భాగమ గా ప్రారంభమైన ఆంధ్రోద్య మము భాషాప్రయుక్త రాష్ట్ర విభజనకు దారి తీసినది. దీనివలన దేశములో విచారకరమైన పరిణామములు సంభవించినవి. ప్రాంతీయాభిమానములు పెరిగి నవి. ఒకే భాష మాట్లాడు తెలుగువారు కౌరవ పాండవులవలె నిలిచి ఆంధ్ర - తెలంగాణా భేదములతో పోరాడినారు. కావుననే ప్రాంత కులమతముల కతీతమైన సిద్ధాంతమును- మానవత్వమును ప్రాతిపదికగా చేసికొనవలెనని, భారతీయ సంస్కృతిని ప్రతిబింబింపవలెనని కవులు తమంతతామే నిశ్చయించు కొనగలిగినారు. ఆంధ్రోద్యమ కాలములోనే కొప్పరపు సుబ్బారావుగారు 'నాయ కుడు పంద్రంగి' అను గేయములో అతిమేలమైన ప్రాంతీయాభిమానమును అవ హేళన చేసినారు. తుంగభద్రాతీరతటములో పండిన జొన్నలు తిని కృష్ణరాయలు హంపి నేలిన శూరుడైనాడు కావున.

'అహహ ఆ జొన్నలు ఆంధ్ర జొన్నలె సుమా
కన్నడ జొన్నల కర్తిలేదేమియు

---

1, 2. విద్యాసంస్థలలో వ్యావహారిక భాష. తిరుపతి రచయితల మహాసభలలో చదివిన వ్యాసము. ప్రచురణ ఆగస్టు, 1965. 8, 9 పుటలు. భారతి.

తలపోసి గర్వించవోయ్ జొన్నలను తలపోసి గర్వించవోయ్',[1] అని హేళన చేసినారు గుంటూరు నల్లచెర్వు గోంగూర తిని 'తిక్క' భారతము వ్రాసెను గాన 'అహహ ఆగోంగూర ఆంధ్ర గోంగూరయే అందులో సందియం భావంతయున్ నహి పాడవోయ్ గోంగూరపై పాటలను'[2] అని చమత్కారముగా విమర్శించినారు. రాళ్ళపల్లివారు వేమన విషయములో చెప్పినట్లు[3] కత్తికే మందు కూడ పూసి దెబ్బకొట్టుట వంటి విమర్శనమది. 'గోదారి లంకలో కోటాకు మన హక్కు। గునపరపు సీమలో ముద్దపప్ మన హక్కు। ఆ కోనసీమలో ఆవకాయ్ మన హక్కు.... ప్రాచీన హక్కులను విడనాడకోయ్'[4] అని ప్రాంతీయాభిమానమును హక్కుల పేర జరిపెడి అందోళనములను పరిహసించినారు. ప్రాంతీయాభిమానము పెరిగిపోవుచున్నట్లు కవి భావించి విశాలదృష్టి నలవరచు కొనుటకు తీవ్రమైన ఉద్యమమును భావిలో నడుపవలసిన యవసరమును గుర్తించిన సూచన నేడు కన్పడుచున్నది. కావుననే దీని నింతగా పెంచి వ్రాసితిని. 'నా తెలంగాణ కోటి రతనాల వీణ' యనిన దాశరథియే ఆంధ్రత్వము వలన ప్రభావితుడై, 'మహాంధ్రోదయము'లో 'ముక్కలు ముక్కలై చెదరిపోయెనురా మన జాతి' అని విలపించి ఆంధ్రులందరి సమైక్యతను కాంక్షించి విశాలాంధ్రకై కలలు గని, 'నాకు కావలె మహాంధ్రోద్యమ'యని ఉద్ఘోషించినాడు; చైనా భారత ధరిత్రిని కబళించినప్పుడు 'నలుబదికోట్ల భారత జనమ్ములు నిద్దుర లేచినార'[5]ని భారతీయుడై శంఖారావమూదిన యీ కవియే 'కపోత సందేశం'లో

> 'కాస్త పశ్చిమాద్రి కడకేగి నా బంధు
> జాలమునకు గూడ శాంతినేర్పి
> ఇలను కాచుమోయి యీ అణుప్రోద్ధత
> ప్రళయ వహ్నినుండి పక్షిరాజ్ఞి' అని విశ్వపౌరుడై నిలబడి

'ముక్కున శాంతిబీజములు మోయుచు బోయి విశాలభూమికల్ దిక్కుల చల్లి

---

1, 2. 'ఎరుకల లచ్చిమి' ఇతర గేయాలు. 'గడ్డపారలు గోగుకాడలవలె ముళ్లు వేసినారట కొండవీటిరెడ్లు' అను ఆంధ్రావళిపై ఇది సెటైర్ లేక, పేరడీ కావచ్చును.

3. వేమన ఉపోద్ఘాతము. ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రచురణ. 1945.

4. 'ఎరుకల లచ్చిమి' ఇతర గేయాలు.

5. సమరగీతి సంకలనం. 24వ పుట.

వచ్చితిమ'ను శ్వేత కపోతము మాటలకు సంతసించును. వివిధోద్యమములకు స్పందించిన కవిలేఖినిలో క్రమముగా ప్రాంతీయత నధిగమించి జాతీయత జాతీయతను మించి అంతర్జాతీయత చోటు చేసికొనుట గమనార్హము!! భావిపౌరుని హద్దులులేని మానవతావాదమున కిది మచ్చుతునక.[1]

(ఒ) వెనుకటివలె తెలుగుసీమలో జరిగిన సంఘటనము మాత్రమే సాహిత్యోద్యమమును నిర్మించునని భావించుట కవకాశమిక లేదు. మానవుడు కాలమును దూరమును జయించుచున్న కొలది ఆకాశమే పైకప్పు గాగల అనంత విశ్వనికేతనములో ఖండఖండాంతర పౌరులెల్లరును అరలుపొరలు తొలగించు కొని ఒకే గదిలో అతిథ్యమందు చున్నప్పుడు ఢిల్లీలోని గాంధీ శతజయంతి న్యూయార్కును కదలించివేయును, టెక్సాస్‌లోని దారుణ హత్య తెలుగుకవి కంటనీరు పెట్టించును. ఇది మిక్కిలి ప్రముఖమైన విషయము!! రెంటాల హిరోషిమా గూర్చి సోమసుందర్, మలయా గూర్చి రమణారెడ్డి, కొరియా మీద సి. విజయలక్ష్మి, వియత్నాం గూర్చి కుందుర్తి, పసిఫిక్ యుద్ధరంగము కీన్యా పోరాటముల గూర్చి ఖండికలు వెలువరించినారు మార్లిన్ మనోమరణము దిగంబర కవికి కవితావస్తు వైనట్లే అంతరిక్ష యాత్రికుడైన యూరీగెగారిన్ మృతి ఆంధ్రులకొక శోకదినమైనది. గాంధీజీ మరణించినప్పుడు వచ్చినన్ని ఖండికలు లుమాంబా, మార్టిన్‌లూథరు కింగుల మరణములపై తెలుగులో రచింపబడినవి. నెహ్రూజీ మృతికి ప్రపంచమెల్ల విలపించినది. నెల్సన్ మండేలా విడుదల "నల్లరవ్వ"ల విజయముగా ప్రపంచమంతటను కీర్తింపబడినది.

'మేలుకొన్న దేషియా

కోలుకొన్న దేషియా'[2] అని సంపూర్ణ ఖండమును గూర్చి కొన కళ్లే వెంకటరత్నం గీత మాలాపిలపగా మల్లాది రామచంద్రశాస్త్రిగారు

---

1. "He will do more of it for love- true love of himself Love of humanity, Love of the future in a developed race-consciousness and the glory of God" The citizen of the future. Criticism and other addresses by Sri Josah Stamp.

2. మేల్కొన్న ఏషియా. అడుగుజాడ గురజాడది. 62వ పుట.

'భూతలమున కంతకు నొకటే
కేతనమిక నే నిర్మిస్తా
ఖండమ్ముల నన్నిటి నొకటే
జెండా క్రిందికి నే తెస్తా'[1] నని వసుధైక కుటుంబమును వాంఛించి ఏకైక ప్రపంచ ప్రభుత్వమును సాధింపవలెనని ప్రతిజ్ఞ పట్టినారు. వర్తమాన సాహిత్య రీతికిది ప్రతిబింబము.

(౭) సమర కవిత్వము జాతిలో చైతన్యమును కల్గించిన మాట నిజమే కాని గాంధీజీ శతజయంత్యుత్సవము 1968 నుండి 69 వరకు జరుగుటతో యుద్ధమే సమస్యలకు పరిష్కారము కాదను సత్యమును భారతీయులు ప్రపంచ వ్యాప్తముగా ప్రచారము చేసిరి **"How could we assume that the so-called 'enemies' were 'Knavish? from God we could only ask for Justice"**[2] గాంధేయ సిద్ధాంతములకు తీవ్రమైన ప్రచారము లభించుటతో ఆంధ్రులలో వర్తమాన హింసాత్మక ధోరణుల యెడల ఏహ్యభావము కలిగినది. భవిష్యత్తులోని శాంతి యుగోదయమున కీ మధురభావనము మంగళ కైశికీ గానమని భావించుట కవకాశమున్నది.

(౮) సంఘ సంస్కరణోద్యమములు విజయము నందినవి. భారతదేశము నకు శ్రీమతి ఇందిరాగాంధీ ప్రధాని యగుట మహిళాభ్యుదయమునకు మరకత తోరణమని చెప్పనగును. ఆంధ్రుల రాజధానిని వరుసగా సరోజినీ పుల్లారెడ్డి, రాణీ కుముదినీదేవి, కుముద్‌నాయక్‌లు పాలించుట కూడ ఈ అభిప్రాయమునే బలపరచినది. అట్లని ఉద్యమము ముగిసినదని చెప్పుటకు వలను పడదు. సంఘ సంస్కరణమనునది ఒకనాటితో తీరెడి సమస్యకాదు. చక్రక్రమమువలె సాగుచు సంఘము, కాలానుగమనములో ఎగుడు దిగుడుగా మారినప్పు డెల్లను ఉద్యమము భవిష్యత్తులో మరల ప్రభవించుననుట కవకాశమున్నది. 1990 లో వరకట్న మునకై స్త్రీలను దహించుచుండగా దీనికి వ్యతిరేకముగా ఉద్యమము - కవిత్వము ప్రారంభమైనది.

(౯) హిందూ జాతీయ భావము జాగృతమగుచున్నది. కాని దానిలో మౌఢ్య మీనాడు లేదు. రవీంద్రుడు, రాధాకృష్ణ పండితులు సనాతన

1. విశ్వవీణ. వసుధైక పతాక ఖండిక. 69వ పుట.
2. **Two Passions. My experiments with truth. M.K. Gandhi 129 P.**

హిందూ ధర్మములోని విశ్వవ్యాపకత్వమును బహిర్గతము చేయుటతో దానికి సంకుచిత పరిధి నశించి విశ్వజనీనత సిద్ధించినది. భారత జాతీయ పునరుజ్జీవనమే విశ్వశాంతికి మార్గమను అరవిందుని సందేశము[1] భారతీయులకు శిరోధార్యమైనది. వివేకానందుని శతజయంతి, గాంధీజీ శతజయంతులు[2] సాధించిన విజయమిది. చలం రచించిన 'సుధ' సంజీవదేవ్ తేజోరేఖలు' పొట్లపల్లి రామారావు గారి 'చుక్కలు' ఈ విశ్వజనీనమైన ఆధ్యాత్మిక ధోరణిని ప్రతిబింబించుచున్నవి.

చలం తన 'సుధ'లో ప్రవక్త తరువాత ప్రవక్త 'జ్ఞానివెంట జ్ఞాని' అవతారము వెనుక అవతారము, ఈ రొంపిలోకి వచ్చి బుక్కులను విన్పించి కాంతిని వెదజల్లినారనియును తత్ఫలితముగా,

> 'తమ క్షుద్ర ఇంద్రియ లోలత్వాన్ని తిట్టారని
> కాంతికి మూసుకునే కంటిరెప్పల్ని విప్పజూచారని
> దౌర్జన్యాన్ని వ్యభిచారాన్ని నిరసించారనీ....

ఆ దివ్యసందేశ హరుల్ని వాళ్లు కొట్టి హింసించారు'[3] అని వాపోయినారు. గాంధీజీ హిందూత్వములోని సత్యాహింసల విరాట్స్వరూపమును ప్రదర్శించి అన్ని మతముల వారికిని అవి ఆరాధనాయోగ్యములేనని చాటినారు. "సత్యాహింసల ద్వారానే ఆయన హిందూ దేశానికి స్వాతంత్ర్యం సంపాదించకల్గాడు. గాంధీజీ సిద్ధాంతాలు ఒక్క భారత స్వాతంత్ర్యోద్యమానికి మాత్రమే పరిమితమైనవి కావు. అవి యావత్తు మానవ జాతికి కూడా వర్తిస్తాయి. ఉపయో

---

1. "The sun of India's destiny would rise and fill India with its light and overflow India and overflow asia and overflow the world." The rising sun of India's destiny. 'The Message and mission of India' Sri Aurobindo. 89 P.
2. "I read with interest Max Muller's Book India was can it teach us-? and the Translation of upanishads by the Theorsophical society,....... I began to realise more and more the infinite possibilities of Universal love" My Experiments with truth. M.K. Gandhi. 119 P.
3. సుధ. 18 ఖండిక. 15వ పుట.

గిస్తాయి.... గాంధీజీ భారతదేశం యొక్క సార్వకాలీన సభ్యతకి ఒక ప్రతి నిధి "[1] భవిష్యత్తులోని మతోద్యమ నౌకలకిది వర్తమానములోని దిక్సూచి !! పేరడీ కవి జరుక్‌శాస్త్రి శ్రీ విద్యోపాసనతో తరించుట చలం రమణాశ్రమము చేరుట గోపీచంద్ పూర్ణయోగమును వరించుట గమనార్హము.

(౧౦) చిన్న కథ, నవల, ఈనాడు 'ఉద్యమ' స్థాయిలో వ్యాప్తినందు చున్నవి. గద్యకావ్యములని చెప్పదగిన ఉన్నవవారి మాలపల్లి, బాపిరాజుగారి గోన గన్నారెడ్డి, హిమబిందు, నారాయణరావు మొదలైన నవలలు విశ్వనాథవారి వేయిపడగలు, నోరి నరసింహశాస్త్రిగారి నారాయణభట్టు, రుద్రమదేవి వంటివి కావ్యత్వము నందినవి నిజమేకాని చుక్కలలో చంద్రునివలె అసంఖ్యాక గద్య కృతులలో ఇట్టివి పరిమితముగానే ఉన్నవి !!

**సమగ్ర మానవతావాదము :** భౌతికాధ్యాత్మిక శక్తుల మధ్య చిర కాలముగా సాగుచున్న సంఘర్షణమెటు తెలుగు కవితలో వివిధోద్యమముల అవ తరణమునకు దారి తీసినదో ద్వితీయాధ్యాయములో విపులముగా వర్ణించితిని. కాని వర్తమానాంధ్ర కవులలో ప్రముఖులీ రెండు శక్తుల నడుమ సంఘర్షణ మును కాక సమన్వయమును కోరుచున్నారు. మానవుని పరిపూర్ణ వికాసమునకు శాస్త్రీయ విజ్ఞాన మవరోధము కాబోదని వీరు భావించినారు. వ్యక్తుల వలెనే ఉద్య మములు కూడ సత్వరజస్తమోగుణోపేతములై యుండును. సాత్వికమైన ఆధ్యాత్మిక శక్తి రాజసమైన యంత్రశక్తి మీదనే ఆధారపడవలెనను తత్వము తెలుగుకవు లవగతము చేసికొనినారు.

**"Let us learn to use 'Tamas' and make it glorious that way. How could the gardens grow if we threw away the dirty manure and not used it? 'Tamas' is the coal without which there can be no fire and steam (Rajas) and no light (Sattva)."[2]** అను వాక్యములకు భాష్యమా అనునట్లు తెలుగు కవి 'కర్మా గారమ్ములందు కళలను పలికించాలి'[3] అని శాస్త్రమునకు కళకు మధ్యగల సంఘ

1. నాగరికత అంటే ఏమిటి? ఇంద్రపల్లి బాలేందుశేఖరం. 161వ పుట.
2. **Gospel of work. Swami Rama Tirtha. 27, 28 Pages.**
3. మనిషి-యంత్రం. డా. సి. నారాయణరెడ్డి.

ర్షణమును నివారింపగోరుచున్నాడు. యస్వీ. జోగారావుగారు తమ పంచకల్యాణిలో 'సంప్రదాయ విధేయ సాధ్వసము వలదోయి సంప్రదాయ విరుద్ధ సాహసము వలదోయి'[1,2] అని ప్రాచీనార్వాచీన శక్తుల మధ్య సమన్వయమును ప్రతిపాదించినారు. ఆచార్య గంటిజోగి సోమయాజిగారు 'క్రొత్త లాంతర్లు' అను రచనలో ఈ తత్వమునే రసవత్తరముగా విస్తరించి చెప్పినారు.

'క్రొత్త లాంతర్లివిగో కొనరండి బాబు
సరికొత్త లాంతర్లు సంతరించితి' మనుటలో లాంతరును చిచ్ఛక్తికి ప్రతీకగా కవి స్వీకరించి, రెండు తత్వములకు నడుమ సేతువై నిలిచినారు. మానవుడిక యంత్రమునకు బానిస కాకూడదని తెలుగు కవి కలలు కను చున్నాడు. డా. సి. నారాయణరెడ్డిగారు

'యంత్రం ఒక మదపుటేనుగైతే
నీవు మావటీడవు కావాలి
యంత్రం ఒక వారిధియైపోతే
నీవొక వారధియై నిల్వాలి'[3] అనుటలో యంత్ర నియంత్రణమునే ప్రతిపాదించి మానవత్వమునకు పట్టము గట్టినారు. శక్తి - శక్తము, గుణము - గుణి, శబ్దము - అర్థములకు నడుమ గల సంబంధమే భౌతికాధ్యాత్మిక శక్తుల మధ్య నున్నది. దీనిని గమనింపని అతివాదములు విధ్వంసక హేతువు లగును. కావుననే జ్ఞానపీఠ బహూకృతినందిన 'చిదంబర' కృతిలో సుమిత్రానందన్ పంత్ సమగ్ర మానవ జీవనమున కీ రెండు శక్తులును సమభాగములలో మేళవించి తీరవలెననియును భారతీయ తాత్విక రహస్యమిదేననియును చాటి విశ్వముచే వినుతింపబడినాడు.[4] కావుననే తెలుగు కవి మృణ్మయ చిన్మయ శక్తులకు నడుమ వంతెనను కట్టి,

1. 34వ పుట.
2. "A blind reverence for the Past is bad and so also is a contempt for it" Pandit Jawaharlal Nehru. 'The Discovery of India'.
3. యంత్రం-మనిషి.
4. "మానవ జీవితము సమన్వయాత్మకమైనది. శాంతి, ఆనంద, మోక్ష ప్రాప్తికై భౌతిక సుఖములను త్యజింప పనిలేదు. వీనిని సాధించుటకై మనము లోక జీవితమును నూతన రీతులలో సంతరించుకొన వలసి యున్నది. భౌతికతతో ఆధ్యాత్మికత్వమును మేళన మొనర్చుటే మానవతా లక్షణము" భూమిక. 'చిదంబర'.

"దిగిరాను దిగిరాను దివినుండి భువికనకు
ఎగురలే నెగురలేన్ భువినుండి దివికనకు
దివి భువుల నడుమ నొక దీపమున్నాదిలే
కవితలో నా దీపకాంతి యున్నాదిలే"[1] అని సమున్నతమైన సాహిత్య తత్వమును ప్రతిపాదించినారు. నేటి యుగధర్మమిదే !! 'సహస్ర కంఠాలతో ఒక గీతం నినదించి ... రాకెట్టుల తో- ణాలు స్ఫుట్నిక్కుల వీరణాలు- అణువు గుండెలో మనిషికి అమరత్వం లభించాక'[2] చిరంజీవియై మానవుడు జీవింపవలె నని ఆరుద్ర 'మంత్రపుష్పం'లో ఆకాంక్షించినారు. వర్తమానము నుండి భవి ష్యత్తులోనికి తొంగి చూచినప్పుడు కన్పడెడి ఉద్యమమిది. సాపేక్షమైన భూత భవిష్యద్వర్తమానములను మూడింటిని జయింపగోరిన మానవుడు నేడు యుగ సంధ్యలో నిలిచి వలచిన చింతనమిది, స్వీకరించిన సంకల్పమిది, సాగించనున్న ఉద్యమమిది !!

నాకున్న పరిమిత శక్తితో అపరమేయమైన ఉద్యమ స్వరూపమునిందు వివరించుటకు ప్రయత్నించితిని. సుమసౌరభమున కాశపడి సుదతులు సూత్ర మును కూడ కౌదల దాల్చినట్లే వస్తుగౌరవము ననుసరించి నా పరిశ్రమను కూడ సహృదయులు మెచ్చుకొనగలరని విశ్వసించుచున్నాను. శిల్పములో పాచగుడనని కాక సవినయముగా 'నా నేర్చిన భంగిచెప్పి వరణీయుడ'ను కావలెనను నా ఉద్య మమును ఉపనిషదుద్యానము నుండి టి. ఎస్. ఇలియట్ స్వీకరించిన,[3] ప్రసన్న మందార ప్రసూన పంక్తితోనే శివంకరముగా ముగించెదను.

'దత్త, దయాధ్వమ్, దమ్యత, శాంతి శ్శాంతి శ్శాంతిః'[3]

---

1. పొలిమేరలు ఖండిక. పంచకల్యాణి. ఎస్వీ. జోగారావు 24వ పుట.
2. ఆరుద్ర.
3. ఉపనిషత్తు.

అనుబంధము - 1

# 19 వ శతాబ్దములోని ప్రచార సాధనములు

## (వివిధోద్యమములకు బీజములు చల్లిన తొలి తెలుగు పత్రికలు)

| పత్రిక పేరు | ముద్రణ స్థలం | వత్సరము | సంపాదకులు |
|---|---|---|---|
| 1. సుజనరంజని | మద్రాసు | 1845 | చిన్నయసూరి |
| 2. శ్రీయక్షిణి | బళ్లారి | 1850 | ? |
| 3. ఉపాధ్యాయోపకారి | గుంటూరు | 1861 | శ్లాండర్ |
| 4. శారద | అత్తిలి | 1865 | ఆచంట సూర్య నారాయణరాజు |
| 5. విబుధ రంజని | ఏలూరు | 1864 | దామరాజు రామచంద్రరావు |
| 6. గ్రంథ ప్రదర్శిని | విశాఖపట్టణము | 1896 | శ్రీనివాస జగన్నాథశాస్త్రి |
| 7. జనవినోదిని | చెన్నపట్టణము | 1880 | ? |
| 8. మహారాణి | చెన్నపట్టణము | 1880 | వి. కృష్ణమాచార్యులు |
| 9. లోకరంజని | —— | 1989 | కాకర్ల సుబ్బారావు |
| 10. శారద | బుచ్చిరెడ్డిపాలెం | 1870 | యడవల్లి కామశాస్త్రి |
| 11. వర్తమాన తరంగిణి | నెల్లూరు | 1895 | బెజవాడ బాలకృష్ణారెడ్డి |
| 12. వాగ్వల్లి | నెల్లూరు | 1895 | సి.కె. రామానుజశర్మ |
| 13. సూర్యాలోకము | చెన్నపట్టణము | 1895 | జి. సి. వి. శ్రీనివాసాచార్యులు |
| 14. సుమనోభిరంజని | —— | 1888 | కృష్ణమూర్తి |

| | | | |
|---|---|---|---|
| 15 కళాభివృద్ధి | విశాఖపట్టణము | 1890 | పన్యాల వేంకట రంగనాథస్వామి |
| 16. విద్యార్థి కల్పభూజము | నెల్లూరు | 1882 | ఊ. రామచంద్రరావు |
| 17. ఆంధ్ర భాషాసంజీవిని | రాజమహేంద్రవరము | — | కొక్కొండ వేంకటరత్నము |
| 18. వివేకవర్ధని | ,, | 1878 | వీరేశలింగం పంతులు |
| 19. చింతామణి | ,, | 1894 | ,, |
| 20 సుజన మనోల్లాసిని | చెన్నపట్టణము | 1890 | ఏ. ముత్తయ్య |
| 21. హిందూ జనసంస్కారిణి | ,, | 1892 | మన్నవ బుచ్చయ్య |
| 22. యదార్థవాది | విశాఖపట్టణము | — | గ. కూర్మయ్య |
| 23. తెలుగుహార్డు | విజయనగరము | — | వేంకటరామయ్య |
| 24. ఆంధ్ర ప్రకాశిక | మద్రాసు | 1895 | ఎ.పి పార్థసారధి |
| 25. శశిలేఖ | మద్రాసు | 1894 | గట్టుపల్లి శేషాచార్యులు |
| 26 జ్ఞానోదయ | ఏలూరు | 1890 | దాసు కేశవరావు |
| 27. దేశాభిమాని | గుంటూరు | 1893 | దే. శేషాచలపతి |

---

'ప్రాచీనాంధ్ర వార్తాపత్రికలు' భారతి 1929 మే సంచిక ఆధారము.

అనుబంధము - 2

# ఉద్యమాత్మకములైన అభ్యుదయ రచయితల మహాసభలు

| తేదీలు | స్థలం | వివరాలు |
|---|---|---|
| 13-2-1943 | తెనాలి : | సభాధ్యక్షులు : తాపీ ధర్మారావు, కార్యదర్శి : చదలవాడ పిచ్చయ్య. |
| 29, 30, 31 తేదీలు డిసెంబరు, 1944 | బెజవాడ : | ప్రారంభకులు : సజ్జాద్ జహీర్, ఆహ్వాన సంఘాధ్యక్షులు : పాటిబండ్ల అప్పారావు, కార్యదర్శి : తుమ్మల వెంకట్రామయ్య, సభాధ్యక్షుడు : తెలికిచర్ల వెంకటరత్నం. |
| డిసెంబరు 31, జనవరి 1, 2 తేదీలు 1945 - 1946 | రాజమండ్రి | అధ్యక్షుడు : దేవులపల్లి కృష్ణశాస్త్రి. ప్రారంభకుడు : శ్రీశ్రీ, ఆహ్వాన సంఘాధ్యక్షుడు : జయంతి గంగన్న. కళాప్రదర్శనాధ్యక్షుడు : దామెర్ల వెంకటరావు. కార్యదర్శి : చదలవాడ పిచ్చయ్య. సహాయ కార్యదర్శులు : కొడవటిగంటి కుటుంబరావు, జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి. |
| 18, 19 తేదీలు జనవరి, 1947 | మద్రాసు : | ప్రారంభకుడు : కె. ఏ. అబ్బాస్, ఆహ్వాన సంఘాధ్యక్షులు : వింజమూరి గోవిందాచారి, సభాధ్యక్షులు : పి. వి. రాజమన్నారు, కార్యదర్శి : చదలవాడ పిచ్చయ్య, సహాయ కార్యదర్శులు : ప్రయాగ కోదండ రామశాస్త్రి, కొమ్మరాజు వినాయకరావు. |
| 30, 31 జులై, 1955 | విజయవాడ : | ప్రారంభకులు: డా. జి వి. సీతాపతి, ఆహ్వాన సంఘాధ్యక్షులు : డా. ఉప్పల లక్ష్మణరావు, సభాధ్యక్షులు : శ్రీశ్రీ, కార్యదర్శి : తుమ్మల వెంకటరామయ్య, కార్యదర్శి వర్గము : కాళోజీ నారాయణరావు, నార్ల చిరంజీవి, అనిసెట్టి సుబ్బారావు, కె వి రమణారెడ్డి, ఎ. సోమసుందర్, కారుమంచి వెంకటేశ్వరరావు, గంగినేని వెంకటేశ్వరరావు. |

## అనుబంధము - 3

# అభ్యుదయ కావ్యసూచిక

### మూలపురుషులు (1934-1944)

శ్రీరంగం శ్రీనివాసరావు - మహాప్రస్థానం - ఇతర గేయాలు ఖడ్గసృష్టి; శ్రీరంగం నారాయణబాబు - రుధిరజ్యోతి (అముద్రితం); శిష్ట్లా ఉమామహేశ్వరరావు - విష్ణుధనువు, నవమిచిలుక; పురిపండా అప్పలస్వామి - సౌదామిని (ఆంగ్లము); పఠాభి - ఫిడేలురాగాల డజన్, నీలగిరి కనుమలు; తొలి తరము (1944-1948); బెల్లంకొండ రామదాసు, ఏల్చూరి సుబ్రహ్మణ్యం, కుందుర్తి ఆంజనేయులు - నయాగరా; అనిసెట్టి సుబ్బారావు-అగ్నివీణ; నార్ల చిరంజీవి-విప్లవాత్మ; తెన్నేటి సూరి-అరుణరేఖలు; కొనకళ్ల వెంకటరత్నం - ప్రతిశీ-బంగారుమామ పాటలు, ప్రొద్దుతిరుగుడు పూలు; చదలవాడ పిచ్చయ్య-చదలవాడ గేయాలు; కొమర్రాజు వినాయకరావు-హృదయశ్రుతి; విద్వాన్ విశ్వం - పెన్నేటిపాట; వట్టికొండ రంగయ్య - అభ్యుదయ గేయాలు; అబ్బూరి వరద రాజేశ్వరరావు-చిరకాలం (అముద్రితం), ఆందాక, ముక్తయాత్ర, నవతరం (1948-1955); సోమసుందర్-వజ్రాయుధం, కాహళి. రక్తాక్షి, గోదావరి, జలప్రళయం, మిణుగురులు; ఆరుద్ర - త్వమేవాహం, గాయాలు, గేయాలు, సినీవాలి; రాంషా-అనంతం; కె వి రమణారెడ్డి-అడవి, భువనఘోష, అంగార వల్లరి; రెంటాల గోపాలకృష్ణ-సంఘర్షణ, సర్పయాగం, ఆకలిపాటలు; గంగినేని వెంకటేశ్వరరావు-ఉదయిని; శశాంక-నయా జమానా; బైరాగి-నూతిలో గొంతుకలు; కుందుర్తి ఆంజనేయులు-తెలంగాణ, యుగేయుగే, ఆశ; శార్వరి-రోదసి; దుర్గానంద్ - అంతర్గోళాలు; నారపరెడ్డి రామిరెడ్డి - బాష్పకణాలు, అశ్రుమాల, నా వీణ; రాంభట్ల కృష్ణమూర్తి-శశపిషాణం గేయాలు; రంగకవి-వంకతగీతలు; రావెళ్ల వెంకట్రామారావు-జీవనరాగం; కళారవి-ఉదయ కిరణాలు; కొత్తపల్లి

---

'నవత'లో కె వి. రమణారెడ్డి.

రంగారావు - మేలుకొలుపు; పాములపర్తి సదాశివరావు - అభ్యుదయ గేయాలు; కాళోజీ నారాయణరావు-నా గొడవ; కారుమంచి వెంకటేశ్వరరావు-ఉదయతార, పాంచజన్యం; దాశరథి కృష్ణమాచార్యులు-అగ్నిధార, రుద్రవీణ, పునర్నవం, మహాంధ్రోదయం; సి. నారాయణరెడ్డి - జలపాతం, సమదర్శనం, నాగార్జున సాగరం; కవిరాజమూర్తి - ప్రణుతి, కొత్తతరం (1955-1968); గోపాల చక్రవర్తి-కలం కలలు, ఆనందం జీవనది; స్వర్ణరాజు హనుమంతరావు - ధారా పాత్ర; జె బాపురెడ్డి - చైతన్యరేఖలు; గజ్జల మల్లారెడ్డి - మల్లారెడ్డి గేయాలు; ఉండేల మాలకొండారెడ్డి-శాంతిచక్రాలు; మాదిరాజు రంగారావు-కర్మీరం, మేలు కొన్న ఆకాశం, పృధ్వీగీతం, మనోభూమికలు, అద్దలో నీడలు; అరిపిరాల విశ్వం-నిద్దురకన్నెలు కాలం గీస్తున్న గీతలు; కేశవరావ్ - ఉదయించని ఉద యాలు; మురళీధర్-భిన్నదృశాలు; వజీర్ రహ్మాన్-ఎవరికి పోతావీ రాత్రి?; వెన్నం - నా గేయాలు; సి. విజయలక్ష్మి - విషాదభారతం.

## అభ్యుదయ కావ్య సంకలనాలు :-

నవ్యాలోకం (ఏలూరు), మధుపర్కాలు (ఏలూరు), జలజ (ఏలూరు), కల్పన (విజయవాడ), స్వేచ్ఛాపథం, ప్రజాశక్తి గేయాలు (విజయవాడ), ఉదయ ఘంటలు (హైదరాబాదు), శ్రీశ్రీ యుగం (మద్రాసు), అడుగుజాడ గురజాడది (కావలి), యువసాహితి (గుంటూరు), నవీన కావ్యమంజరి (దక్షిణ భారత పుస్తక ప్రచురణ), నవీన కావ్యమాల (సాహిత్య ఎకాడమీ), శతపత్రం (హైదరాబాదు).

## అభ్యుదయ పత్రికలు :-

జ్వాల-ముద్దుకృష్ణ; తెలుగుతల్లి-రాచమల్లు సత్యవతీదేవి; విశాలాంధ్ర (వాస)-సెట్టి ఈశ్వరరావు; ఉదయిని-తుమ్మల వెంకట్రామయ్య; నవ్యసాహితి-విద్వాన్ విశ్వం; అరుణరేఖ-నారపరెడ్డి రామిరెడ్డి; సంధ్య-అనిసెట్టి సుబ్బారావు; జ్వాల-కొల్లి ప్రత్యగాత్మ; అభ్యుదయ-శ్రీశ్రీ కొడవటిగంటి, అనిసెట్టి, తుమ్మల రమణారెడ్డి; నగారా-మాన్సు; కవిత - ఆబ్బూరి ఛాయాదేవి; నవత - శ్రీశ్రీ; సృజన-వరవరరావు; సంవేదన-రాచమల్లు రామచంద్రారెడ్డి; కళాకేళి-సోమసుందర్; ప్రగతి-మద్దుకూరి చంద్రశేఖరరావు

ఇంకను, ఆనందవాణి, ఢంకా, ఆంధ్రశిల్పి, తెలుగు స్వతంత్ర, మాలి, కథావీధి, కిన్నెర, జనవాణి, ప్రజాశక్తి, విశాలాంధ్ర, జనశక్తి, ప్రతిభ, యువజన మొదలైన పత్రికలు కూడ సామ్యవాదుల రచనముల కాశ్రయము కల్పించినవి.

అనుబంధము - 4

# మహాత్ముని ఆంధ్రదేశ సంచారము

"మహాత్ముడు సీతానగరములో నుండగా 1921 సం.లో గూడూరి రామచంద్రరావుగారి కప్పగింపబడిన కాంగ్రెసు నిధిని గూర్చి నారాయణమూర్తిగారి వలన నొక పెద్ద స్టేటుమెంటును పుచ్చుకొనెనని ప్రకటింపబడినది- నెల్లూరు జిల్లాలో మహాత్ముని పాదపూజ క్రింద 26500 రూ.లు ముట్టినది. ఈసొమ్ముతో కూడ కలుపుకొనినచో నింతవరకు 2 లక్షల 26 వేల రూపాయలు నగదు. ఇవి గాక 10 వేల రూపాయల నగదు వచ్చినవి- నెల్లూరు కాంగ్రెసు ఆఫీసులో కె వి. రాఘవాచారయ్యరు, ఎ ఎన్. కృష్ణారావు, రాజగోపాలరావు, డి. రంగయ్య మున్నగు ప్రముఖులు సమావేశమై పల్లిపాడు ఆశ్రమమును నడుపుటకు క్రొత్త స్కీమును తయారుచేసిరనియు కద్దరు వ్యాపనమును గూర్చి ప్రత్యేకముగ నొక ప్రణాళికను తయారుచేసి మహాత్మునికి సమర్పింప నెంచిరనియు ప్రకటింపబడినది.

నెల్లూరు జిల్లా సంచారమును మహాత్ముడు 18వ తేదితో పూర్తి గావించుకొనెను ఆ జిల్లాలో వసూలైనది 29 వేల రూపాయలని మరియొక రిపోర్టు కనబడుచున్నది. నెల్లూరి జిల్లా సంచారము మొత్తముమీద మూడున్నర రోజులు జరిగినది ఇదిగాక 18వ తేదీ మౌనవ్రత దినమైనను నారోజు 8 గంటల నుండి మహాత్ముడు మౌనవ్రతమును చాలించెను-

కందుకూరులో మహాత్మునకు వేయిన్నూటపదార్లు నర్పించిరి. కందుకూరు తాలూకా బోర్డువారు శూన్యహస్తములతో వచ్చి వట్టి సన్మానపత్రము నర్పించగా మహాత్ముడు చిరునవ్వుతో నిట్లు ప్రశ్నించెను-

మహా :- డబ్బు లేకుండ వట్టి సన్మానపత్ర మిచ్చినచో ప్రయోజనమేమి?

పెరుమాళ్లునాయుడుగారు (అసెంబ్లీ సభ్యులు) :- అయ్యా మాది వట్టి తాలూకా బోర్డు. మెంబర్లు కూడా బీదవారే.

సభలో ఒకడు : అవునండీ! అందుకనియే మొన్న తాలూకా బోర్డు ఎన్నికలలో 8 వేల రూపాయలు ఖర్చు పెట్టినారు.

మహా :- అయితే నాకొక వేయి రూపాయలైన నియ్యగలరు.

నాయుడుగారి ముఖవర్చస్సెట్లుండినదియు రిపోర్టరు వర్ణించలేదు. నెల్లూరులో మహాత్ముడు కస్తూరిదేవి బాలికా పాఠశాల సహాయార్థమై ప్రదర్శింపబడిన నాటకమును మహాత్ముడు చూచెనని ప్రకటింపబడినది.

## దినచర్య

గాంధీగారు తమ దినచర్యను ముందే కాంగ్రెసు కమిటీలకు ఇట్లు అందజేసిరి :

నా దినచర్య :- ఉదయం 7-30 వరకు కాలకృత్యాదులు ఇతర పబ్లికు పనులేమియును చేయజాలను. 7-30 మొదలు 10-00 వరకు సంచారము, సభలు వగైరా మీ కార్యక్రమ మేర్పాటు చేయవచ్చును. 10-00 మొ॥ సాయంత్రము 5-00 సంపూర్ణ విశ్రాంతి స్వంత పనులు. 5-00 మొ॥ 8-30 సంచారము, సభలు వగైరా మీ కార్యక్రమము. నా భోజన వేళలు ఉదయం 10-30 సాయంకాలము 4-00 గం॥ ఉదయం 10-00 గంటలు మొదలు సాయంత్రము 5-00 వరకు నా భోజనమునకును, వ్రాతకును, విశ్రాంతికిని నిరాటంకముగ వినియోగించుకోదలచి కొద్ది మార్పు చేసితిని. సూర్యాస్తమయమైన తరువాత భోజనము చేయను కనుక సాయంకాల భోజనము 4-00 గంటలకే ముగింతును. ఇంకే సమయమును అనుకూలించదు.

ఉత్సాహపరులు నాయెడ జాలి వహించవలెను. నా సదుపాయమునకే వారు నాకు తగు విశ్రాంతి నొసంగక తప్పదు. నా శరీరము దేశమునకంతకును చెందినది కాని నా ఒకనికే కాదని చాలమంది చెప్పియున్నారు. ఇందుకేమాత్రము నేనొప్పుకొనలేదు. ఆంధ్ర జాతీయవాదులు నా యీ అభిప్రాయమును మార్చుకొనుటకు తగు సమాధానము చెప్పిననేగాని వారు శరీరమును తమ యిష్టము వచ్చినట్లు వాడుకొనజాలరు.

1) నా శరీరమునకు ఆరుగంటల కంటె యెక్కువ శ్రమ నియ్యరాదు.
2) బహిరంగ సభలలోగాని మరెచ్చట కాని గందరగోళములు చేయరాదు.
3) ఊరేగింపులు మానివేయండి.
4) అట్టహాసపు వేడుకలు చేయవలదు.
5) ఒకే దినము పెక్కు కార్యక్రమము నేర్పాటు చేయకుడు.
6) శ్రమకు తగిన డబ్బు లభించని స్థలములకు నన్ను తీసుకుపోరాదు.
7) ఇతరులెవరిని గౌరవించుటకును నన్నెచ్చటికిని తీసికొనిపోవలదు.
8) వీలైనంతవరకు పెక్కు స్థలములకు నన్ను గొనిపోవలదు.
9) ఈ నా శరీరమును కేవలము మట్టిముద్దగ భావింపకుడు. అసలు నా శరీరము కూడ మట్టిముద్ద కాదని చెప్పనుగాని యేమాత్రము కష్టము కలిగినను భరింపజాలని దుర్బల శరీరమని తలంచవలెను.

ఇట్లు, విన్నవించు
**కరంచంద్ మోహనదాస్ గాంధి**

**అనుబంధము - 5**

# మహాత్ముని ఆంధ్రదేశ పర్యటనము[1]

**మహాజనులారా!**

మహాత్ముడు ఏప్రిల్ 12వ తేదీ మన జిల్లాలో సంచారము చేయ ప్రారంభింతురు. వారిని తమ ప్రాంతములకు ఆహ్వానముచేసి సత్కరింపగోరు సెంటర్ల వారు మాకు యిదివరకు తెలియపర్చినారు. వారి గ్రామములను మహాత్ముని సంచార కార్యక్రమమునందు జేర్చియున్నాము మిగతా గ్రామవాసులు ఎవరైనను వారిని తమ గ్రామములకు ప్రత్యేకముగా ఆహ్వానింప నిచ్ఛగించే యెడల మా కార్యాలయమునకు తెలియపరుప గోరుచున్నాము మరియు యే సెంటరులో యే యే గ్రామములలో కాంగ్రెసు సంఘములెన్ని గలవో కాంగ్రెసు సభ్యులెందరు గలరో ఖద్దరు ఉత్పత్తి వ్యాపన ఎట్లు జరుగుచున్నదో మద్యపాన నిషేధము అస్పృశ్యతా నివారణ మొదలగు కార్యములెట్లు జరుగుచున్నదియు తెలుపుచు ఒక చిన్నసన్మానపత్రము తయారుచేసి ప్రతి సెంటరువారును 4-4-1929 తేదీలోగా మాకు పంపవలెను. మరియు మహాత్మునితో ప్రసంగింప కోరువారు కూడా మాకు 4-4-1929 తేదీలోగా తెల్వియపర్చ కోరుచున్నాము. మా కార్యాలయమునకే తెలియపరచవలెను.

తూర్పు కృష్ణాజిల్లా<br>
కాంగ్రెసు కమిటి<br>
బందరు.<br>
28-3-29

**అయ్యదేవర కాళేశ్వరరావు**<br>
అధ్యక్షులు<br>
**చె॥ వెం॥ నరసింహము**<br>
**బొ॥ వెం॥ శేషయ్య**<br>
సం॥ కార్యదర్శులు

**తూర్పు కృష్ణాలో యింతవరకేర్పడిన సెంటర్లు:**

1) కపిలేశ్వరపురము, 2) పీరంకి, 3) కురుమద్దాలి, 4) పామర్రు, 5) గుడ్లవల్లేరు, 6) కవుతరం, 7) నిడుమోలు, 8) బందరు, 9) కొడాలి, 10) మొవ్వ, 11) కప్తానుపాలెము, 12) ఘంటశాల, 13) అవనిగడ్డ, 14) గొల్వేపల్లి, 15) వెంట్రప్రగడ, 16) గుడివాడ, 17) ముదునేపల్లి, 18) కైకలూరు.

---

1. ఆ వారము కృష్ణాపత్రిక.

అనుబంధము - 6

# గాంధీజీ భజన కీర్తనలు

## (కోలాటము పాటలు)

(౧) గాంధి మతమును బూనవలె నన్నా అందరును దాస్య
బంధనంబులు మానవలెనన్నా -
మూడు లోకంబులను గాంధికి యీడు సద్గురు డిపుడు లేడని
కూడి క్రైస్తవ గురువులే కొనియాడి రలన్యాయార్యు నందున గాంధి॥

.... .... .... .... .... ....

జైలు భీతి యుంపదగదన్నా మతతత్వ విదునకు
జైలు కృష్ణుని జన్మశాలన్నా
చాల వేలూర్ జైలులోపల సరిగ తొంబది రోజులుంటిమి
జాల భక్తుల మగుచు గాంధీ భక్తిభావము చెక్కుచెదరక గాంధి॥

ఇట్లు దీర్ఘముగా సాగిపోవును (గాంధీతత్వముల మోహన ఆట)

(౨) కలియుగ నడతలు ఝూటా - మన గాంధీమార్గమె బాటా....

.... .... .... .... ....

ఇంగ్లీషు చదువులు ఝూటా - మన హిందీ నేర్చుట బాటా
ఇంగ్లీషు కోర్టులు ఝూటా - మన యింగిత మెరుగుట బాటా ॥కలి॥

విదేశ వస్త్రము ఝూటా - మన స్వదేశ వస్త్రమె బాటా
చదువులు సాములు ఝూటా - వానిసార మెరుంగుట బాటా ॥కలి॥

ఇట్లు సాగిపోవును ('ఝూటా-బాటా' బ్యాగ్ ఆపి.)

---

సాయం వరదదాసు వ్రాసిన 'గాంధీ మతప్రబోధము' నుండి 1929 ముద్రణ.

అనుబంధము - 7

# బాల్య వివాహముల వివరములు

1911 వ సంవత్సరములో బ్రిటీషు ప్రభుత్వము వారు సేకరించిన వివరముల ననుసరించి నాటి బాల్య వివాహములు - వితంతువుల సంఖ్య ఈ క్రింది రీతిగా నున్నట్లు తెలివది.

| వయస్సు | 1901 సం॥ | 1911 సం. నాటికి |
|---|---|---|
| 0- 5 | 20010 | 22849 |
| 5-10 | 140824 | 149712 |
| 10-15 | 596243 | 677405 |

5 సంవత్సరముల లోపు వయస్సు గల శిశువులకు 1000 కి గంజాము నందు 22, విశాఖలో 18 న జరిగినవి.

జిల్లాలవారీ బాల్య వివాహ వివరములు (1000 కి)

| జిల్లా | 1901 సం॥ | 1911 సం॥ |
|---|---|---|
| కోయంబత్తూరు | 24 | 26 |
| గంజాం | 147 | 180 |
| విశాఖ | 160 | 180 |
| గోదావరి | 75 | 85 |
| కృష్ణా | 75 | 60 |
| అనంతపురం | 63 | 34 |
| దక్షిణ ఆర్కాటు | 31 | 31 |
| మద్రాసు | 30 | 71 |
| కర్నూలు | 70 | ? |

వర్ణముల వారీగా వితంతువుల సంఖ్య

| వర్ణము | 0-5 | 5-10 | 10-15 | మొత్తము |
|---|---|---|---|---|
| ఒరియా బ్రాహ్మణులు | 12 | 86 | 175 | 64142 |
| తెలుగు బ్రాహ్మణులు | 5 | 61 | 126 | 170625 |
| కాపులు | 20 | 592 | 696 | 397941 |
| వెల్లలు | 12 | 55 | 80 | 489894 |
| పరిమిస్లు | 10 | 92 | 92 | 473591 |

---

1911 లో ప్రభుత్వము వారు చేసిన పత్రికా ప్రకటన

అనుబంధము - 8

# ఆందోళనము

## (౨౧వ గుంటూరు కృష్ణా మండల సంఘసంస్కరణ సభా తీర్మానములు)

మన చక్రవర్తిగారగు ఐదవ జార్జిగారి యొక్క దర్బారు మహోత్సవ కాలమందు మనకు వారు ప్రసాదించిన వరములకు మన కృతజ్ఞతాపూర్వక వందనము లాచరించుచు వారికాయురారోగ్యైశ్వర్యములు గలుగజేయవలయునని యీ సభవారు కోరుచున్నారు (అగ్రాసనాధిపతిగారిచే)

2) కీర్తిశేషులైన దివాన్‌బహదూర్ ఆర్. రఘునాథరావుగారి యొక్కయు కృష్ణస్వామయ్యరుగారి యొక్కయు భాస్కర లక్ష్మీనరసప్పగారి యొక్కయు మరణము వలన దేశమునకు కలిగిన నష్టమునకు సభవారు చింతించుచున్నారు (అగ్రాసనాధిపతిగారిచే)

3) వితంతువుల యొక్క నిర్బంధ వైధవ్యమును కేశఖండనమును తొలగించుట యీ సభవారి యభిప్రాయమై యున్నది.

ప్రవే : చిలకమర్తి లక్ష్మీనరసింహమూర్తిగారు
సె : వేమూరి విశ్వనాథశర్మగారు
సమ : బి.జె ఎస్. ప్రకాశరావుగారు, దామర్ల సీతమ్మగారు

దీనిని డి. ఎస్. అవధానిగారు ఒప్పుకొనలేదు.

4) స్త్రీల ఉన్నత విద్యను సర్వవిధముల ప్రోత్సాహపరుప వలయునని యును అందులకై ఉన్నత విద్యాశాలలు స్థాపించుట కార్యాచరణములను సలుప వలయుననియును ఈ సభవారి అభిప్రాయము.

ప్ర : శ్రీమతి కొటికలపూడి సీతమ్మగారు
సె : శ్రీమతి ఆచంట రుక్మిణమ్మగారు
స : పాలావజ్ఝల లక్ష్మీనారాయణగారు

5) పంచమాది నిమ్నజాతులను ఉద్ధరణము నిమిత్తము వారికి విద్య నేర్పుటయు నీతి మతములను బోధించి వారి నున్నతస్థితికి తెచ్చుటయు మన కవశ్యక ధర మనియు ఈ సభవారి అభిప్రాయము.

ప్ర : కె వి. రెడ్డిగారు
సె : తల్లాప్రగడ సూర్యనారాయణగారు
స : గూడపాటి సత్యనారాయణమూర్తిగారు
మాలజాతివారగు చింతా పుల్లయ్యగారు

6) నలుబది సంవత్సరములు వయసు దాటిన పురుషులు, ఇరువది సంవత్సరముల లోపు గల స్త్రీ వివాహము చేసుకొనగూడదని యీ సభవారు నిర్ధారణ చేసియున్నారు.

7) అనాధలగు హిందూ స్త్రీలకు స్వతంత్ర జీవనములను గల్పించుటకును, జీవితమును పరమార్థమును బోధించు ఉన్నతాదర్శములను ప్రదర్శించుటకును దేశమునందు అనాధ స్త్రీ శరణాలయమును, అబలా విద్యాలయమును స్థాపించి సాధారణ విద్యయును వృత్తి సంబంధమైన విద్యయును వారికి గరపుట ముఖ్య కర్తవ్యమగుటచేత యీ విషయమునకు తగిన కృషి చేయుటకు దేశీయులను ఈ సభవారు కోరుచున్నారు.

ప్ర : చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు
సె : దామెర్ల సీతమ్మగారు
సె : జూలూరి తులసిమాంబగారు
ఉప్పులూరి నాగరత్నాంబగారు

8) అతి బాల్య వివాహములు, అశాస్త్రీయములును అనర్థదాయములగుటచే తమ బాలికాబాలకులకు యుక్తవయస్సు వచ్చిన తరువాతనే వివాహము చేయుట శాస్త్రసమ్మతమును సంఘాభివృద్ధికి ముఖ్య కారణము అని యీ సభవారు అభిప్రాయపడుచున్నారు.

ప్ర : మహామహోపాధ్యాయుడుగారగు తాతా సుబ్బారాయుడుశాస్త్రిగారు.
2 : రామాప్రగడ వెంకటరామయ్యగారు
3 : ఆచంట కృష్ణమూర్తిగారు

4 : శ్రీమతి గూడపాటి లక్ష్మీనరసమ్మగారు

5 : కల్లెపల్లి వెంకటరమణమ్మగారు

9) వివాహ సమయములందు అమితమగు వ్యయములును కన్యాశుల్క, వరశుల్కములను గొనుటయు నింద్యములని దూష్యములని అనర్థదాయకములని యీ సభవారి ఉద్దేశము.

ప్ర : వల్లూరి సూర్యనారాయణరావు

సె : కాళ్లకూరి నరసింహంగారు

స : ఎ. పురుషోత్తమాచారి

10) విద్యాభివృద్ధి కొరకును, వాణిజ్యము కొరకును, దేహారోగ్యము కొరకును సముద్రయానముచేసి పరదేశ సంచారమునకు వెళ్లివచ్చిన వారిని మరల సంఘములో చేర్చుకొనవలయునని యీ సభవారి యభిప్రాయము.

ప్ర : తాతా సుబ్బారాయుడుశాస్త్రిగారు

సె : ఎన్. రామస్వామిగుప్తగారు

11) చతుర్వర్ణములలోని ఉపశాఖలు ఒకరితోనొకరు వివాహ సంబంధములను భోజన ప్రతి భోజనములను చేయుచుండవలెనని యీ సభవారి అభిప్రాయము.

ప్ర : దాసు మాధవరావు పంతులుగారు

సె : కె. వి. రెడ్డిగారు

12) హిందువుల సాంఘికాభివృద్ధి నిమిత్తమై వివిధ వర్ణములవారును తమ తమ భోజన సమయములందు దృష్టిదోషమును పాటింపకూడదు.

ప్ర : దాసు గోవిందరావుగారు

సె : భూపతిరాజు తిరుపతిరాజుగారు

13) (ఎ) వివాహాది శుభ కార్యములయందును, దేవతోత్సవములందును, భోగము మేళమును పెట్టకూడదనియును; (బి) వేశ్యాంగనలు ఆడపిల్లలను

దత్తత చేసుకొనకూడదనియును; (సి) వేశ్య బాలికల వివాహములు ప్రోత్సాహ పరచవలెననియు; (డి) మధుపానాది దుర్వ్యసనములను రూపుమాపవలెననిన్ని (ఇ) కావ్యాదులలో శృంగారాతిరేకము కూడదనియు యీ సభవారి అభిప్రాయము.

ప్ర : జి సుబ్బయ్యగారు
సె : ముట్నూరి కృష్ణారావుగారు

14) శాసుగారి వివాహచట్టము శాసన నిర్మాణ సభవారు త్రోసివేసినందుకు మిక్కిలి చింతించుచు యీ చట్టమును మరల సమయము వచ్చినపుడెల్లను శాసుగారు నిర్మాణ సభలో ప్రవేశపెట్టి చట్టముగా చేయించుటకే ఈ సభవారు కోరుచున్నారు.

ప్ర : బుర్రా శేషగిరిరావుగారు
సె : దాసు మాధవరావుగారు

అనుబంధము - 9

# నూరేండ్ల క్రితము

1864వ సంవత్సరము కృష్ణా జిల్లా బందరులో ఒక వివాహ సందర్భములో ఇంటికై కొనిన వస్తువుల జాబితా లభించినది. ధాతకరువు వలన అప్పటికే ధరలు పెరిగినట్లు తోచుచున్నది. అయినను నాటి ధర లిట్లున్నవి :

| | వస్తువు | కొలత | క్రీ.శ. 1864 రూ.అ.పై. | క్రీ.శ. 1964 రూ.న.పై. |
|---|---|---|---|---|
| 1) | బియ్యము | 32 శేర్లు | 1-0-0 | 48-0-0 |
| 2) | కందులు | 31 శేర్లు | 1-0-9 | 32-0-0 |
| 3) | పెసలు | 32 శేర్లు | 1-0-0 | 30-0-0 |
| 4) | మినుములు | 19 శేర్లు | 1-0-0 | 28-50 |
| 5) | మిరపకాయలు | మణుగు | 1-6-0 | 60-00 |
| 6) | నెయ్యి | మణుగు | 4-2-0 | 100-00 |
| 7) | ఆముదము | 4 వీశెలు | 1-0-0 | 21-50 |
| 8) | నూనె | 4 వీశెలు | 1-0-1 | 25-00 |
| 9) | చింతపండు | మణుగు | 0-13-6 | 24-00 |
| 10) | బెల్లము | మణుగు | 0-11-6 | 12-00 |
| 11) | పసుపు | 5 వీశెలు | 1-0-0 | 20-00 |
| 12) | మెంతులు | 40 శేర్లు | 1-0-0 | 75-00 |
| 13) | జీలకర్ర | 6 శేర్లు | 1-0-0 | 27-00 |
| 14) | కొబ్బరికాయలు | 10 | 0-3-0 | 7-50 |
| 15) | సొరకాయలు | 8 | 0-2-0 | 1-50 |
| 16) | కట్టెలు | 150 మడకర్రలు | 0-8-0 | 75-00 |
| 17) | విస్తళ్లు | 100 | 0-1-4 | 2-00 |
| 18) | తమలపాకులు | 1000 | 0-1-9 | 9-00 |
| 19) | దోసకాయలు | మణుగు | 0-2-0 | 3-75 |
| 20) | వంకాయలు | మణుగు | 0-2-0 | 16-00 |
| 21) | ఇంగువ | తులము | 0-0-10 | 0-50 |
| 22) | అటుకులు | 16 శేర్లు | 1-00 | 25-00 |
| 23) | చేటలు | 4 | 0-1-6 | 4-00 |
| 24) | తాటాకుబుట్టలు | 6 | 0-0-3 | 3-00 |

# ఉపకరించిన గ్రంథములు

(అకారాద్యనుక్రమణిక)


1) ఆడపిల్లల పెళ్లిళ్లు-తల్లిదండ్రుల అగచాట్లు - కె.వి.ఎస్. రాజు
2) ఆణిముత్యాలు - వేమూరి రాధాకృష్ణమూర్తి
3) ఆధునికాంధ్ర కవిత్వము-సంప్రదాయములు, ప్రయోగములు - డా. సి. నారాయణరెడ్డి
4) ఆంధ్ర మహాభారతము-ఛందఃశిల్పము - డా. పాటిబండ మాధవవర్మ
5) ఆంధ్ర రచయితలు - మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి
6) ఆంధ్ర వాఙ్మయ చరిత్ర-సంగ్రహము - కవిత్వవేది
7) ఆంధ్ర వాఙ్మయ చరిత్రము - ఆచార్య దివాకర్ల వేంకటావధాని
8) ఆంధ్ర విజ్ఞాన సర్వస్వ సంపుటములు
9) ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర - ఏటుకూరి బలరామమూర్తి
10) ఆంధ్రుల సాంఘిక చరిత్ర - సురవరం ప్రతాపరెడ్డి
11) ఆర్యసమాజ మకగానేమి ? - మహాత్మా నారాయణస్వామి (హిందీ) (అను : పం. ధూ. రాజరత్నాచార్యులు)
12) ఉపనిషత్తులు
13) ఏకాత్మ మానవతావాదము (అందు సుందర్‌సింగ్ భాండారీ వ్యాసము) అను : జి వి. ఎల్. నరసింహారావు
14) కమ్యూనిజ స్వరూపం - పి. ఎస్. ఆచార్య
15) కవిత్వ తత్వవిచారము - కట్టమంచి రామలింగారెడ్డి
16) కవ్యాలంకార సూత్రవృత్తి : వామనుడు (అను : వేదాల తిరువేంగళాచార్యులు)
17) కావ్యాలంకార సంగ్రహము - భట్టుమూర్తి (సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారి వ్యాఖ్యానము)
18) కవికోకిల గ్రంథావళి - దువ్వూరి రామిరెడ్డి

19) గీతాప్రవచనములు - వినోబా భావే (అను : వెంపటి సూర్యనారాయణ)
20) గురజాడ-వెలుగజాడ - కె. వి రమణారెడ్డి
21) గురజాడ శతజయంతి సంచిక
22) చింకమర్తి స్వీయచరిత్ర
23) తత్వశాస్త్ర ప్రాథమిక పాఠాలు - జార్జిపోలిట్జర్
(అను : పా. సదాశివరావు)
24) తెలుగు దుక్కి - ఖండవల్లి లక్ష్మీరంజనం
25) తెలంగాణా-ఆంధ్రోద్యమము - మాడపాటి హనుమంతరావు
26) తెలుగు వ్యాసములు - దక్షిణ భారత హిందీ ప్రచారసభ
27) తెలుగుపై ఆంగ్ల సాహిత్య ప్రభావము - కొత్తపల్లి వీరభద్రరావు
28) తెలుగు ఛందోవికాసము - సంపత్కుమారాచార్య
29) తెలుగుసీమలో సాంస్కృతిక పునరుజ్జీవనం - దేవులపల్లి రామానుజరావు
30) దేశభక్త కొండా వేంకటప్పయ్య పంతులు జీవితచరిత్ర -
మాదల వీరభద్రరావు
31) నలభైయేండ్ల నా అనుభవాలు - సాదత్అలీఖాన్
(అను : సి హెచ్. ఆచార్య)
32) నవ్యాంధ్ర సాహిత్య వీధులు - కురుగంటి సీతారామయ్య
33) నాగరికత అంటే ఏమిటి? - ఖండవల్లి బాలేందుశేఖరం
34) పింగళి లక్ష్మీకాంతముగారి సాహిత్య చరిత్ర, సాహిత్య విమర్శనము -
(ఆంధ్ర విశ్వవిద్యాలయములోని వ్రాతప్రతులు)
35) పురాణములు
36) బాలవ్యాకరణము - పరవస్తు చిన్నయసూరి
37) బుద్ధజీవిత ఘటనములు (త్రిపిటకము) - చర్ల గణపతిశాస్త్రి
38) బైబిలు
39) భగవద్గీత
40) భారతీయ నాగరికతా విస్తరణము - మారేమండ రామారావు
41) మన సంస్కృతి-చరిత్ర
42) మనస్సాక్ష్యము - వెలుగోటి సర్వజ్ఞకుమార యాచేంద్రభూపాలురు
43) మహాత్మాగాంధీ - గాంధీ సందేశ ప్రచారపీఠమ్

44) వాల్డెన్ - థోరో (అను : ము. ర. యా)
45) వివేకానంద సంపూర్ణ గ్రంథావళి (శంఖారావం)
46) వివేకానంద జీవిత చరిత్ర - చిరంతనానందస్వామి
47) వేదములు
వేమన - రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ
48) వ్యాసవాహిని - డా. సి. నారాయణరెడ్డి
49) వ్యాసావళి - గిడుగు రామమూర్తి పంతులు
50) శతపథ బ్రాహ్మణము
51) సత్యార్థ ప్రకాశిక - దయానంద సరస్వతి
(అను : ఆదిపూడి సోమనాథరావు మొ॥)
సన్యాసుల స్వాతంత్ర్య సమరములు - దిగవల్లి వేంకటశివరావు
52) సమగ్ర ఆంధ్ర సాహిత్యము - ఆరుద్ర
53) సరస్వతీ సామ్రాజ్యమ్ - అయ్యంకి వెంకటరమణయ్యగారి సన్మాన సంచిక
54) సాహిత్య రత్నాలు - పి. వి. రత్నం
55) సాహిత్యకౌముది - గుంటూరు శేషేంద్రశర్మ
56) సాహిత్యోపన్యాసములు - సాహిత్య ఎకాడమీ ప్రచురణ
57) సౌందర్య సమీక్ష - వేమూరి రామనాథము
58) స్వర్ణపత్రములు - సావర్కార్ (అను : పుట్టపర్తి నారాయణాచార్యులు)
59) స్మృతులు (మనువు ఇత్యాదులు)
60) స్ఫూర్తిశ్రీ వ్యాసావళి (రెండవ భాగము)
61) హరిజన సమస్య - నండూరి వేంకట కృష్ణమాచార్యులు
62) హైదరాబాదుపై పోలీసు చర్య - వి. వీరభద్రరావు, రామచంద్రరావు
(అను : బి. ఎన్. శర్మ)
63) హ్యూమనిష్టు రాజకీయాలు - ఎమ్. ఎన్ రాయ్
(అను : రావిపూడి వెంకటాద్రి)

64) వివిధ సంస్కృత, ఆంగ్ల, హిందీ కవుల కావ్యములు, ఖండికలు, మహోదయము, రాత్రి, వైతాళికులు మొ॥ వివిధ ఆధునికాంధ్ర కవితా సంకలనమును.

**ఆంగ్లము :-**

65) A key to modern english poetry - Martin Gilkes.
66) An enquiry into the nature and causes of wealth of nations - Adam Smith
67) A. B. C. of relativity - B, Russell
68) Bunch of Thoughts - M. S. Golwalkar
69) Communist manifesto - Marx and Engels
70) Criticism and Addrasses - Sir Josiah stamp
71) Discovery of India - Jawaharlal Nehru
72) Gospel of works - Swami Rama Tirtha
73) Indian writings today - 1967 July- sep. Issue
74) My experiments with truth - M. K. Gandhi
75) Objections to humanism - Ed. J. Blackham (Pelican)
76) Riddle of the universe - Earnest Hackel
77) Rousing call to the Hindu Nation- Swami Vivekananda (compiled by Ekanath Ranade)
78) The message and mission of India - Sri Aurobindo
79) The illusion and reality Christopher cowdwell
80) Time - machine (Novel) - H. G. wells
81) Waste land T. S. Eliot
82) Integralhumanism - Deendayal Upadhyaya

**నిఘంటువులు :-**

నన్నిచోడ పదప్రయోగ సూచిక
రత్నకోశము (హిం) దామోదర్ స్వరూప్ గుప్త
వాచస్పత్యము : కొట్రశ్యామల కామశాస్త్రి

శబ్ద రత్నాకరము : బహు జనపల్లి సీతారామాచార్యులు
శబ్దార్థ చంద్రిక : మహాకాళి సుబ్బరాయ కృతము
సూర్యరాయాంధ్ర నిఘంటువు
**Dictionary of Philosophy : Edited by Dagobert D. Runes.**
**Webster's third new international Dictionary.**

ఇంకను,

నిజాం కాలమునాటి ఫర్మానాలు,

ఈస్టిండియా కంపెనీ నాటి అధికార (రహస్య) పత్రములు, శాసనములు

భారత ప్రభుత్వము, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము ప్రచురించిన వివిధ ప్రజాశికా ప్రచార గ్రంథములు, పట్టికలు, పత్రములు కృష్ణాపత్రిక, ఆంధ్ర పత్రిక, ఆంధ్రప్రభ, భారతి, దివ్యవాణి, విహారి, వైశాఖి, ప్రతిభ, ప్రగతి, జయభేరి, సఖి, సృజన, యుగధర్మ (హిందీ) స్మృతిమందిర విశేషాంకము, ఏకాక్ (బెంగాలీ) మొదలైన పత్రికలు. "The Fundamental Unity of India" అను గ్రంథము వ్రాసిన శ్రీ ఆర్. కె. ముఖర్జీకి ప్రత్యేక ధన్యవాదములు.

